## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి, జ్ఞాన, ధర్మ ప్రచారార్థం మహానుభావులైన శ్రీ రామకృష్ణ మఠ్ వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన మాసపత్రికలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. ఈ మాసపత్రికలు క్రొత్తవా లేక పాతవా? అని చూడకుండ, అందులోగల రత్నాలలాంటి విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నం చేయగలరు అని మనవిచేసుకొంటున్నాము..

ఈ మాసపత్రికలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) రామకృష్ణ మఠ్ వెబ్ సైట్: http://www.rkmath.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# విజ్ఞానం - వినోదం

సేకరణ: ఎస్. శివప్రసాద్



## లోక సహజం!

చన్దనతరుషు భుజంగా
జలేషు కమలాని తత్ర చ గ్రాహాః ।
గుణఘాతినశ్చ భోగే
ఖలా న చ సుఖాన్యవిఘ్నాని ॥

పరిమళం వెదజల్లే గంధపుచెట్లలో పాములూ; కమలాలు ఉండే నీళ్ళలో మొసళ్ళూ; భోగాల్లో గుణహీనులైన నీచులూ ఉండడం లోక సహజం. విఘ్నాలు లేకుండా సుఖాలు కలుగవు.

ఆశావాది మరిచిపోయేందుకు నవ్వుతాడు.
నిరాశావాది నవ్వడమే మరచిపోతాడు.





## ధర్మ స్థాపన

రావణ సంహారం చేసి శ్రీరాముడు అయోధ్య చేరాడు. ప్రజాహిత కార్యాలకు కోశాగారంలో ధనం లేకపోవడం గమనించాడు. "రాజ్యంలోని ప్రతి ఒక్కరూ గుమ్మడి కాయంత బంగారాన్ని పన్నుగా చెల్లిస్తే సరి" అని లక్ష్మణుడు సలహా ఇచ్చాడు. ఆ మేరకు చాటింపు కూడా వేసారు! అందుకోసం ఏర్పాటయిన త్రాసులో ఒక పక్క గుమ్మడి కాయను ఉంచారు. కొందరు ఎంత బంగారాన్ని వేసినా, గుమ్మడి కాయ బరువుతో సమానం కాలేదు. మరికొందరు కొన్ని నాణేలు ఉంచగానే గుమ్మడి కాయ సరి తూగింది. శ్రీరాముడు లక్ష్మణుడిని పిలిచి ఆ రహస్యమేమిటని ఆరా తీసాడు! "ఎవరికీ ఈ పన్ను చెల్లింపులతో అన్యాయం జరగకూడదు. అందుకే ఆంజనేయుడూ, నేనూ ధర్మదేవతను ప్రార్థించాం. ఆమె ఆజ్ఞ ప్రకారం హనుమంతుడు త్రాసుముల్లును నియంత్రించాడు. చివరికి ధర్మం నిలబడింది!" అని లక్ష్మణుడు వివరించాడు. శ్రీరాముడు పరమానంద భరితుడయ్యాడు.

Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 65 సంచిక: 1 జనవరి 2008

"ప్రతి జీవిలోనూ దివ్యత్వం గర్భితంగా ఉంది. అంతర్గతంగా ఉన్న ఆ దివ్యత్వాన్ని వ్యక్తం చేయడమే జీవిత పరమావధి." - స్వామి వివేకానంద

## ప్రార్థన

నక్షత్ర గ్రహ తారాణామధిపో విశ్వభావనః ।
తేజసా మపి తేజస్వి ద్వాదశా - త్మన్నమో - స్తుతే ॥

నీవే నక్షత్ర గ్రహ తారలకు అధిపుడవు, విశ్వభావనుడవు, తేజస్సులకు తేజస్సు, ద్వాదశాత్ముడవైన నీకు వందనం.





## లోపలి పేజీల్లో...







# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు**...... రూ. 10,000/–, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**రాజ పోషకులు**............ రూ. 5,000/–, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**పోషకులు**................. రూ. 1,000/–, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| పేరు | చిరునామా | రూ. |
|---|---|---|
| | ఇప్పటి వరకు వసూలైన మొత్తం ... | 10,13,987 |
| మహారాజ పోషకులు : | డాక్టర్ ఎ. జయశ్రీ, చప్పల్ బజార్, హైదరాబాద్ - 500 027 | 1,00,000 |
| పోషకులు : | శ్రీ దండు వెంకట రామరాజు, భీమవరం | 1,116 |
| : | శ్రీ నాగ స్వామి, నవాబ్‌పేట, నెల్లూరు - 2 | 1,116 |
| : | శ్రీ కొలిశెట్టి కోటేశ్వరరావు, ఎడార గ్రామం, ప్రకాశం జిల్లా - 523 265 | 1,000 |
| : | శ్రీ ఎ. షణ్ముఖం, కె.ఆర్. రోడ్, బెంగుళూరు - 560 070 | 1,000 |
| | మొత్తం ... | 11,18,219 |

# శ్రీరామకృష్ణ ప్రభ గ్రంథాలయ నిధి పథకం

'శ్రీరామకృష్ణ ప్రభ గ్రంథాలయ నిధి పథకం'లో చేరి, మీ పేరు మీద పది మందీ మంచి విషయాలు చదివే వీలు కల్పించండి. ఈ పథకం కింద రూ॥600/- చందా కట్టినట్లయితే, 10 ఏళ్ళ పాటు ఒక గ్రంథాలయానికి (ఉన్నత పాఠశాలలకు/ కళాశాలలకు/ సంస్థలకు/ దేవాలయాలకు)ప్రతి నెలా మీ పేరిట 'శ్రీరామకృష్ణ ప్రభ' పంపిస్తాం. దాతల పేర్లనూ, వారి పేరిట పత్రికను పంపే గ్రంథాలయాల వివరాలనూ 'శ్రీరామకృష్ణ ప్రభ'లో ప్రచురిస్తాం.

| సంఖ్య | దాత పేరు | గ్రహీత సంస్థ |
|---|---|---|
| 1295 | శ్రీ దాసరి నారాయణ శాస్త్రి, కార్ల్‌మార్క్ రోడ్, విజయవాడ. | రాఘవేంద్ర గ్రంథాలయం, పెదమద్దలి – 520 004 |
| 1296 | శ్రీ ఎస్.ఎస్.ఆర్. ఆంజనేయులు, నెల్లూరు–524 001 | లైబ్రేరియన్, చిమ్మకుర్తి, ప్రకాశం జిల్లా–523 226 |
| 1297 | శ్రీమతి. కె. వీణారావు, జూబ్లీహిల్స్, హైదరాబాద్–500 033 | లైబ్రేరియన్, జి.మాడుగుల, విశాఖపట్నం జిల్లా |
| 1298 | " " " | లైబ్రేరియన్ దంబ్రీగూడ, విశాఖపట్నం జిల్లా, 531 151 |
| 1299 | ఈపూరి మాధవి, లక్ష్మీపురం, గుంటూరు. | పురపాలక బాలికోన్నత పాఠశాల, నర్సారావ్‌పేట్, గుంటూరు జిల్లా |
| 1300 | పి.వి. హనుమాన్లు, సరూర్‌నగర్, హైదరాబాద్–500 035 | శ్రీరామ ఉన్నతపాఠశాల, మోతాదక, తాడికొండ, గుంటూరు జిల్లా |

ఈ పథకం ద్వారా శ్రీరామకృష్ణ ప్రభను మరింతమందికి చేరువ చేస్తున్న దాతలకు కృతజ్ఞతలు.

**ADVERTISEMENT TARIFF**

| | MULTI COLOUR | B & W |
|---|---|---|
| Fourth Cover | Rs.13,000 | - |
| Second Cover | Rs.11,000 | 7,000 |
| Third Cover | Rs.11,000 | 7,000 |
| Inside Full Page | Rs. 7,000 | 5,000 |
| Inside Half Page | Rs. 5,000 | 3,000 |

| చందా వివరాలు | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|
| విడి ప్రతి : | రూ. 8 | - |
| ఒక సంవత్సర చందా : | రూ. 85 | $15 |
| మూడు సంవత్సరాలకు : | రూ. 240 | $ 45 |
| ఐదు సంవత్సరాలకు : | రూ. 380 | $ 75 |
| ఇరవై సంవత్సరాలకు : | రూ. 1200 | $ 350 |



గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి. పంపవలసిన చిరునామా : Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.

## శ్రీరామకృష్ణ ప్రభ వార్షిక చందాదారులకు విన్నపం

***ప్రియ పాఠకులారా! దిగువ పేర్కొన్న నెంబర్ల నడుమ ఉన్న సంవత్సర చందాదారుల చందా గడువు తీరిపోనుంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకొని, 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.***

20003 - 22181 మధ్యనున్న వారిలో **సంవత్సర** చందాదారుల చందా గడువు **2008 జనవరితో** తీరిపోనుంది!

30003 - 37116 మధ్యనున్న వారిలో **సంవత్సర** చందాదారుల చందా గడువు **2008 ఫిబ్రవరితో** తీరిపోనుంది!

**శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ.... - సర్క్యులేషన్ మేనేజర్**

_ మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు. ❖ మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి. ✸ మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.

ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకుడు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు.

- సంపాదకులు



**SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH**
Domalguda, Hyderabad - 500 029. Andhra Pradesh
Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com



# విశ్వమానవ శాంతి దాత వివేకానంద

స్వామి వివేకానందుని దివ్యరూపం చూసి మంత్ర ముగ్ధులు కాని వారు, స్ఫూర్తిని నింపే ఆయన బోధనల్ని విని ఉత్తేజితులు అవనివారు, ఆయన ఆదర్శాలకు ఆకర్షితులు కానివారు ఎవరూ ఉండరనేది జగమెరిగిన సత్యం.

"స్వామి వివేకానంద పుట్టుకతోనే సార్వభౌముడు. భారత దేశంలో గానీ, అమెరికా ఖండంలో గానీ ఆయనను సమీపించిన వారెవరైనా ఆయన రాజఠీవికి తలవంచకుండా వెనుదిరగ లేదు" అని ప్రఖ్యాత ఫ్రెంచ్ సాహిత్యవేత్త రోమా రోలా, స్వామి వివేకానందను కీర్తించారు. సప్తఋషి మండలం నుండి భువికి దిగివచ్చిన ఈశ్వర ప్రేరిత మహావక్త, హైందవ ఝంఝామారుతం, వేదాంత కేసరి విశ్వవిఖ్యాత వివేకానంద.

ఒకరోజు స్వామి వివేకానంద బేలూరు మఠ ప్రాంగణంలో పచార్లు చేస్తూ 'ఈ వివేకానంద ప్రపంచానికి చేసినదేమిటో అర్థం చేసుకోవాలంటే మరో వివేకానంద ఆవిర్భవించాలి' అని తనలో తాను మాట్లాడుకోవడం ఒక శిష్యుడు విన్నాడు.

స్వామి వివేకానందుని మహోన్నత వ్యక్తిత్వం, అచంచల దేశ భక్తి, విశాల హృదయం, విశ్వజనీన ప్రేమలను సంపూర్ణంగా అర్థం చేసుకొని ఆచరణాత్మకం చేయడానికి నిజంగానే మరో వివేకానంద అవతరించాలేమో!

స్వామీజీ పలికిన మాటలు అక్షర సత్యమనిపిస్తుంది. ఎందుకంటే ఆయన బోధనల్ని మనం జీర్ణించుకోగలిగి ఉంటే నేటి సమాజంలో ఇంకా అవినీతి, అసూయ, స్వార్థం, దారిద్ర్యం, అన్యాయాలు, అక్రమాలు తాండవించేవా? వివేకానందుని సింహనాదం విని యువతరం మేల్కొని ఉంటే, పోగొట్టుకున్న పూర్వ వైభవాన్ని పునఃప్రతిష్ఠించుకొని ప్రపంచదేశాల్లో అత్యున్నత దేశంగా మన మాతృదేశం రూపుదిద్దుకొని ఉండేది. మన సందేహాలకు స్వామీజీయే స్వయంగా "నా సందేశం సంపూర్ణంగా ఆమోదం పొంది, కార్యరూపం దాల్చ డానికి 1500 సంవత్సరాలు పడుతుంది" అని అన్నారు.

సుమారు 115 సంవత్సరాలకు క్రితం ప్రారంభమైన ఆ వివేక తరంగాలు ప్రసరిస్తూ ఎంతోమందిని ఉత్తేజితుల్ని చేస్తున్నాయి. స్వామీజీ ఆశయాలను ఆదర్శంగా తీసుకొని నేడు ప్రపంచదేశాలన్నీ ప్రగతిపథంలో పయనిస్తున్నాయి.

**మరువరానిది మరపులేనిది :** స్వామీజీ దివ్య స్వరూపాన్ని చూసి, యావత్ ప్రపంచం పరవశించిపోయింది. మొట్టమొదటిసారిగా స్వామీజీని చూసిన సోదరి క్రిస్టిన్ 'దేవతా లోకం నుంచి దిగివచ్చిన తేజోమూర్తి' అని తన్మయురాలైంది. స్వామీజీ ప్రథమ సందర్శనంలో 'ఈయన మహారాజే కానీ ఓ చిన్న సామ్రాజ్యానికి మాత్రం కాదు. అఖండ ఆధ్యాత్మిక సామ్రాజ్యానికే సార్వభౌముడు' అని సుందర రామయ్య సాష్టాంగ ప్రణామాలు అర్పించాడు.

స్వామీజీ ప్రసంగాలు విని ఆకర్షితులైన ఎంతోమంది స్త్రీలు ఎన్నో విధాలుగా స్వామీజీని ప్రలోభ పరచడానికి ప్రయత్నించారు. ఒకసారి అమెరికాలో స్వామీజీ ప్రసంగం విని కొంత మంది స్త్రీలు ఆయనతో కరచాలనం చేయడానికి చుట్టుముట్టారు. అప్పుడు స్వామీజీకి ఆతిథ్యం ఇచ్చిన లియాన్ సతీమణి ఎమిలీ 'ఇప్పుడు స్వామీజీ ఈ ఆకర్షణలకు లోను కాకుండా ఉండగలిగితే ఈయన నిజంగా మహాయోగి అని నేను నమ్ముతాను' అని మనసులో అనుకుంది. శ్రీరామకృష్ణ పరమహంస అష్టసిద్ధుల్ని ప్రసాదిస్తానంటేనే తిరస్కరించిన ఆ యోగీశ్వరుడు విషయ సుఖాలకు లోబడతాడా! ఆకర్షణల మధ్య వికారం లేని నిశ్చల మనస్సుతో దేదీప్యమానంగా ప్రకాశిస్తున్న ఆ జ్ఞాన భాస్కరుణ్ణి చూసి ఆమె నిర్భాంత పోయింది. వచ్చిన కీర్తి ప్రతిష్ఠల్ని జీర్ణించుకొని, ఆకర్షణ లన్నింటినీ అధిగమించే ఆయన వ్యక్తిత్వం మరపురానిది, మరువరానిది.

**అనంత అనురాగం:** కన్నతల్లి కటిక దారిద్ర్యం అనుభవిస్తుంటే కన్నీళ్ళు తుడిచి ఆదరించకుండా ఆమె దారిద్ర్యాన్ని చూసి నిరాదరిస్తామా? పవిత్రమూర్తిని అవహేళన చేస్తామా? మాతృదేశాన్ని కన్నతల్లి కన్నా అధికంగా ప్రేమించారు స్వామీజీ.

పాశ్చాత్య దేశాల పర్యటన ముగించుకొని ఆయన భారతదేశానికి తిరిగి వస్తున్నప్పుడు స్వామీజీతో ఒక ఆంగ్ల మిత్రుడు, 'స్వామీజీ! సంపన్న దేశాలైన మా పాశ్చాత్య దేశాలను పర్యటించిన మీరు మీ భారతదేశానికి తిరిగి వెళుతున్నారు కదా! మరి ఇప్పుడు మాతృదేశంపై మీ అభిప్రాయం ఏమిటి?' అని ప్రశ్నించాడు.

దానికి స్వామీజీ 'నేను ఇక్కడకు వచ్చే ముందు నా మాతృదేశాన్ని ప్రేమించాను. ఇప్పుడు నా దేశంలో దుమ్ము, ధూళి, గాలి - సర్వస్వం నాకు పరమ పవిత్రమైనవి. భారతదేశం నాకు ఒక దివ్యక్షేత్రం' అని బదులిచ్చారు.

మన విద్యార్థులు ఏ దేశంలో ఉన్నా మాతృభూమిపై భక్తి భావం పెంపొందించుకోవాలంటే స్వామీజీకి ఉన్న దేశ భక్తిని కొంతైనా అలవర్చు కోవాలి.

**సంక్షిప్త భారతమే నేను:** మన దేశంలో ఎంతోమంది దేశ భక్తులు ఉద్భవించారు. వారి ఆదర్శాలు వారితో పాటే కనుమరుగైపోవడం మనం చూస్తున్నాం. కానీ స్వామి వివేకానంద సందేశం ఆ నాటికీ, ఈ నాటికీ, ఏ నాటికీ స్ఫూర్తినిచ్చే శక్తి కేంద్రం. స్వామీజీది అనుష్ఠాన వేదాంతమే కానీ వాచా వేదాంతం కాదు. అందుకే ఆయన బోధనలు దేశ కాల నిమిత్తాలకు అతీతమై, అందరికీ స్ఫూర్తినిస్తున్నాయి.

స్వామీజీ ఒకసారి డార్జిలింగ్‌లో ఉండగా ఒక గిరిజన స్త్రీ తలపై బరువుతో భారంగా అడుగులు వేస్తూ వెళుతూ ఉంది. బరువును మోయలేక కాలు జారి కిందపడిన ఆమెకు ఛాతీ భాగంలో గాయాలయ్యాయి. ఆ దృశ్యాన్ని చూసిన స్వామీజీ కూడా ఛాతీలో బాధను అనుభవించారు.



ఎవరికి ఏ కష్టం వచ్చినా తనదిగా భావించే సహజత్వం స్వామీజీది. ఆయన హృదయమంతా భారతదేశంతోనే నిండిపోయింది. "నేను 'సంక్షిప్త భారత్'ను" అని ఆయన అనేవారు. అందుకే విశ్వకవి రవీంద్రనాథ్ ఠాగూర్ "భారతదేశం గురించి తెలుసుకోవాలంటే స్వామి వివేకానందను అధ్యయనం చేయండి" అని హితవు పలికారు. విశ్వకవి రవీంద్రుని హితబోధను ఎంతమంది భారతీయులు ఆచరిస్తున్నారన్నది ప్రశ్నార్థకమే!

**విశ్వప్రేమి వివేకానంద :** స్వామీజీ తన దేశ ప్రజల దుఃఖాలను చూసి ఎంత తపన చెందేవారో విదేశీయుల కోసమూ అంతే తపన పడేవారు. ప్రాపంచిక సంపదలతో తులతూగుతున్నప్పటికీ ఆధ్యాత్మిక సంపద లేమితో బాధపడుతున్న పాశ్చాత్యులకు స్వామీజీ చేస్తున్న సేవలను విమర్శిస్తూ కొందరు భారతీయులు "స్వామీజీ! మీరు విదేశీయులకు సేవలందించడం శోచనీయం" అని లేఖ వ్రాశారు. అందుకు స్వామీజీ 'నేను జన్మించింది కేవలం భారతదేశ శ్రేయస్సు కోసం మాత్రమే కాదు. మొత్తం ప్రపంచ హితం కోసం' అని బదులిచ్చారు.

ఒకసారి అమెరికాలోని ఒక రైల్వేస్టేషనులో స్వామీజీకి అక్కడి ప్రజలు ఘనస్వాగతం ఇచ్చారు. అక్కడే ఉన్న నీగ్రో రైల్వే కూలీ ఒకడు స్వామీజీతో కరచాలనం చేసి 'మీకు నా అభినందనలు. మా జాతికి చెందిన ఒక వ్యక్తి ఇంత ఖ్యాతిని సంపాదించడం మా నీగ్రో జాతికే గర్వకారణం' అని ప్రశంసించాడు. స్వామీజీ, అతని దగ్గరకు వెళ్ళి 'సోదరా! నీకు నా కృతజ్ఞతలు' అని ఆ నీగ్రో కూలీని అభినందించారే గానీ నేను నీగ్రో జాతికి చెందినవాణ్ణి కాదు అని చెప్పలేదు.

*మృత్పిండ ఏకో బహుభాండ రూపం*
*సువర్ణ మేకం బహు భూషణాని ।*
*గోక్షీర మేకం బహు ధేను జాతం*
*ఏకః పరాత్మా బహు దేహవర్తీ॥*

'కుండలు ఎన్ని ఆకారాలలో ఉన్నా మట్టి ఒక్కటే. నగలు ఎన్ని ఆకారాలలో ఉన్నా బంగారం ఒక్కటే. ఆవులు ఎన్ని రంగులలో ఉన్నా పాల రంగు ఒక్కటే. జీవుల రూపాలు వేరైనా వారిలో ఉన్న పరమాత్మ ఒక్కడే'.

సమదర్శిత్వం, సమస్త మానవాళి శాంతిని కాంక్షించే విశాల హృదయం స్వామీజీది. అందువల్లనే నేడు ప్రపంచమంతా స్వామి వివేకానందను **'విశ్వ మానవ శాంతి దాత'**గా కొనియాడుతోంది.

## గోరుముద్ద

- స్వామి సుప్రియానంద



# మహోన్నత హృదయం

ఒక రామకృష్ణ మిషన్ పాఠశాలలో సాయంత్రం పిల్లలంతా ఆడుకుంటున్నారు. నలుగురు మాత్రం ఆడకుండా ఒక మూలకూర్చొని తీవ్రంగా ఏదో చర్చిస్తున్నారు. అక్కడ పర్యవేక్షణ చేస్తున్న స్వామీజీ విషయం ఏమిటో తెలుసుకుందామని వారివైపు వెళ్ళారు. అంతలో నలుగురిలో ఒక పిల్లవాడు పరిగెత్తుకుంటూ స్వామీజీ దగ్గరకు వచ్చాడు. వెంటనే "స్వామీజీ! మీకు శ్రీరామకృష్ణ – శారదాదేవి– స్వామి వివేకానందులలో ఎవరు ఆదర్శం?" అని అడిగాడు 'నా ఆదర్శం స్వామి వివేకానంద' అని బదులిచ్చారు ఆ స్వామీజీ. ఆ పిల్లవాడు మౌనంగా ముఖం వేలాడేసుకొని తన మిత్రుల దగ్గరకు వెళ్ళి ఏదో చెప్పాడు. అందరి ముఖాలు ముడుచుకు పోయాయి. మరునాడు ఉదయం స్వామీజీ ఆ పిల్లవాడిని పిలిచి ఆరాతీసారు. ఆ పిల్లవాడు "స్వామీజీ మీ ఆదర్శం శ్రీరామకృష్ణ అని చెపుతారనుకున్నాం! అలా చెపితే శ్రీరామకృష్ణులలాగ మీరు పెళ్ళి ఎందుకు చేసుకోలేదు అని అడుగుదామనుకున్నాం. ఎప్పుడైతే మీ ఆదర్శం స్వామి వివేకానంద అన్నారో మా పన్నాగం పారలేదు. మమ్మల్ని క్షమించండి" అంటూ నవ్వుతున్న ఆ స్వామీజీకి నమస్కరించి అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

ఈనాడు దేశ విదేశాల్లో అశేష ప్రజానికానికి స్వామి వివేకానంద స్ఫూర్తిదాతగా నిలిచారు. ఆయనలో ఉన్న ఆకర్షణ ఏమిటి? కృత్రిమ యాంత్రిక జీవితాలని సైతం ప్రభావితం చేయగల ఎల్లలులేని సమగ్ర మహోన్నత వ్యక్తిత్వమే. మోడువారిన హృదయకుహరాలలో ప్రవేశించి, స్పృశించి చిగురింపజేసే 'మహోన్నత హృదయమే' ఆయన లోవున్న ఆకర్షణాశక్తి.

ప్రపంచ విఖ్యాతి నొందిన స్వామి వివేకానంద స్వదేశానికి తిరిగి వచ్చినప్పుడు ఆయన మహోన్నత హృదయాన్ని ప్రస్ఫుటపరిచే ఒక సన్నివేశాన్ని ఇప్పుడు తిలకిద్దాం!

ఆలంబజారు మఠంలో ఒక రోజు స్వామి వివేకానంద ప్రశాంతంగా కూర్చొని ఉన్నారు. శ్రీరామకృష్ణుల గృహస్థ శిష్యులైన గిరీష్‌చంద్రఘోష్ హఠాత్తుగా స్వామిజీని ఉద్దేశించి "నరేన్! నీవు వేద వేదాంతాలను అధ్యయనం చేసావు. అష్టకష్టాలు పడేవారి విలాపాలకూ, పస్తులతో మాడి పోయేవారి ఆవేదనాభరిత ఆక్రందనలకూ, అవినీతికరమైన పాపాలకూ ఎదైనా పరిహారం ఆ వేదాలలో పేర్కొనబడి ఉందా? నిన్నటిదాకా యాభైమందికి అన్నం పెట్టిన ఆమె, నేడు తిండిలేక తన పిల్లలతో సహా ఆకలితో అలమటిస్తుంది. అదిగో ఆ ఇంటి స్త్రీపై కొందరు దుష్టులు అత్యాచారం చేసి చంపివేశారు... నరేన్! ఈ అరిష్టాలకు నీ వేదాలు ఏదైనా సానుకూల సమాధానం ఇస్తాయా?'' అంటూ ఉద్వేగభరితంగా అడిగాడు.

గిరీష్ మాట్లాడే కొద్దీ స్వామిజీ మనసులోని ఉద్వేగం అధికమవసాగింది. ఆయన కళ్ళ నుండి నీరు ధారకట్టింది. తాను విలపిస్తున్నది ఎవరూ చూడరాదనే ఉద్దేశంతో లేచి గబగబా స్వామీజీ గదిలోకి వెళ్ళిపోయారు. వెంటనే గిరీష్, స్వామీజీ శిష్యుడైన శరశ్చంద్రుణ్ణి ఉద్దేశించి "చూశావా శరత్! ఇతరుల కష్టాలు చూసి తల్లడిల్లిపోయే స్వామీజీ హృదయాన్ని చూడు ప్రేమతో ఎలా ద్రవించి పోయిందో! వేదవేదాంగ పారంగతుడని నేను మీ స్వామీజీని గౌరవించడం లేదు. తన గదిలోకి విలపిస్తూ వెళ్ళిపోయారే, ఆ మహోన్నత హృదయాన్ని చూసే స్వామీజీని నేను అంతగా గౌరవిస్తున్నాను" అన్నాడు. *(స్వామి వివేకానంద సంపుటం–2, 68వ పేజీ)*

"ఈ ప్రపంచంలో మనిషి పడుతున్న కష్టాల్ని తొలగించ డానికి వేయి జన్మలు ఎత్తడానికైనా సిద్ధం" అన్న ఆ మహోన్నత హృదయానికి అందిద్దాం మన వందనాలు!

# సద్గురు సంస్పర్శతో సమాధి స్థితి

**– డాక్టర్ జి. మంగమ్మ**

**స్వా**మి శివానంద పూర్వాశ్రమ నామం తారక్‌నాథ్. శ్రీరామకృష్ణులు అతని శరీరంలో ఒక భాగాన్ని స్పృశించి "సచ్చిదానంద సాగరంలో లోతుగా ఓలలాడు" అన్నారు. ఈ చర్య అతనిలోని విషయ వాంఛలను పూర్తిగా అంతరింపజేసింది. తారక్ హృదయం ఆనందంతో నిండిపోయింది. తర్వాత సందర్భనంలో వారి సేవ చేస్తుండగా, భావ పారవశ్యస్థితిలో హఠాత్తుగా తారక్ హృదయాన్ని తాకారు. ఆ స్పర్శ బాహ్య స్మృతిని కోల్పోయేలా చేసి, తీవ్ర ధ్యానస్థితికి తీసుకువెళ్ళింది. ఎంతసేపు ఆ స్థితిలో ఉన్నారో తారక్‌కే తెలియదు. దాని ఫలితంగా సత్య, శాశ్వత, అనంత ఆత్మయే తాను అని గ్రహించారు.



ఇంకొక సారి గురుదేవులు తారక్‌ను పంచవటి వద్దకు తీసుకొని వెళ్ళి, అతని నాలుకపై ఒక మంత్రం వ్రాశారు. దానితో తారక్ బాహ్య స్మృతిని కోల్పోయి, తీవ్ర ధ్యానమగ్నుడయ్యాడు. ఆ తరువాత తారక్ ఛాతీని తన వేళ్ళతో రుద్ది, గురుదేవులు అతణ్ణి బాహ్యస్మృతికి తెచ్చారు. a

**(జనవరి 4న స్వామి శివానంద జయంతి)**

---

**స్వా**మి శారదానంద పూర్వాశ్రమ నామం శరత్. ఒకసారి శరత్ తన మనస్సును ధ్యానంలో సరిగ్గా ఏకాగ్రం చేయలేకపోయాడు. ఈ విషయాన్ని అతడు శ్రీరామకృష్ణులకు విన్నవించుకున్నాడు. వెంటనే గురుదేవులు తన చూపుడు వేలును శరత్ కనుబొమల మధ్యన నొక్కి పెట్టి ఉంచారు. దానితో అతడి మనస్సు గాలి లేని చోట పెట్టిన దీపంలా నిశ్చలమైంది.



గురుదేవులు ధ్యాన సమయంలో ఎలా కూర్చోవాలో శరత్‌కు శిక్షణనివ్వడం మొదలు పెట్టారు. ఆయన పద్మాసనం వేసుకొని కూర్చున్నారు. కుడి అరచేతి క్రింది భాగాన్ని ఎడమ అరచేతిలో ఉంచారు. తర్వాత రెండు చేతులూ కలిపి, హృదయం వరకు పైకి తెచ్చారు. అప్పుడు కళ్ళు మూసుకొని భగవంతుణ్ణి సాకారంగా ధ్యానం చెయ్యడానికి ఈ భంగిమ అత్యుత్తమమైంది. ఆ తరువాత ఆయన అదే భంగిమలో కూర్చొని, ఈ సారి కుడి చేతిని కుడి మోకాలు మీద, ఎడమ చేతిని ఎడమ మోకాలి మీద వేసి, ప్రతి చేతి బొటనవేలి చివరను చూపుడు వేలి చివరతో కలిపి, మిగిలిన మూడు వేళ్ళను నిటారుగా చాచి ఉంచారు. ఈ భంగిమ నిరాకార ధ్యానానికి అనువైనది అంటూ గురుదేవులు సమాధి స్థితిలోకి వెళ్ళిపోయారు. a

**(జనవరి 14న స్వామి శారదానంద జయంతి)**

---

**స్వా**మి తురీయానంద పూర్వాశ్రమ నామం హరినాథ్. "మహాశయా! కామం నుంచి సంపూర్ణంగా విడివడడం ఎలా?" అని ఒకరోజు హరినాథ్ అడిగాడు. అందుకు శ్రీరామకృష్ణులు "దాన్ని వదిలించుకోవడం ఎందుకు? పక్కకు మరల్చు. కామమంటే ఏదో పొందాలనే కోరికే కదా! కనుక సాక్షాత్తు భగవంతుణ్ణే పొందాలని కోరుకో. ఈ కోరికను మరింత బలవత్తరం చేయి" అని చెప్పారు. శ్రీరామకృష్ణులు చెప్పిన తీరు సులభంగానూ, సహజంగానూ ఉండి చక్కని ప్రభావం చూపింది. ఒకసారి ఆయన హరినాథ్‌తో, "నువ్వు భగవంతునికి ప్రియమైనవాడవు. కనుకనే నిన్ను తరచూ చూడాలనుకుంటున్నాను. నువ్విక్కడకు రోజూ వస్తే చాలు, ప్రయత్నరహితంగానే దైవసాక్షాత్కారాన్ని పొందగలవని అమ్మ చెప్పింది. అందుకే నన్ను చూడడానికి రమ్మని పదే పదే పిలిచేది" అని చెప్పారు. మనసు ప్రేమోద్వేగంతో నిండిపోయి ఆయన కన్నీరు కార్చేవారు. "ఎప్పుడైతే అన్ని జీవులలోనూ ఒకే పరమాత్మను దర్శించగలమో అప్పుడే సమాధిస్థితి సాధ్యమవుతుంది" అని గురుదేవులు వేదాంత సూక్ష్మాలను నేర్పారు. a



**(జనవరి 21న స్వామి తురీయానంద జయంతి)**

# ఆనంద సిరులు అందించే సంక్రాంతి

- ఏ.ఎస్. మూర్తి

వచ్చింది వచ్చింది సంక్రాంతి
వచ్చింది వచ్చింది సంక్రాంతి
తేనెవాకలు పారు తెలుగు వాడలకు,
అందాలు పొంగేటి ఆంధ్రభూములకు,
పంటరాశులపైన పవళించి లేచి,
తేట తటాకాల తీర్థమ్ములాడి
వచ్చింది వచ్చింది సంక్రాంతి,
వచ్చింది వచ్చింది సంక్రాంతి

- రాయప్రోలు సుబ్బారావు

సృష్టిలోని చైతన్యాన్నీ, ప్రకృతిలోని సోయగాన్నీ కలబోసి ఆనందాల సిరులు అందరికీ అందించే అందమైన పండుగ సంక్రాంతి. విశ్వంలోని గ్రహరాశుల పరిభ్రమణం వల్ల ఏర్పడే ఋతువులు మన భూమిని సస్యశ్యామలం చేసి ప్రగతిని ప్రసాదిస్తున్నాయి. ఆ ఋతువులను నడిపించే ప్రభువు సూర్యుడు. ఆయన విశ్వగతిలో దక్షిణం వైపు నుంచి ఉత్తరం వైపునకు కదలి, ధనూరాశిని వదలి మకర రాశిలో ప్రవేశించే శుభ సమయం సంక్రాంతి పండుగ దినం. ఇదే అతి పవిత్రమైన ఉత్తరాయణ పుణ్యకాల ప్రారంభం.

విష్ణుమూర్తి వామనావతారం ఎత్తి, సత్రజిత్ యాగం చేస్తున్న బలిచక్రవర్తిని పాతాళలోకానికి అణచివేయడానికి ప్రతీక భోగి, సంక్రాంతి, కనుమ పండుగదినాలు. వర్షాధి దేవతల ఉపాసనలో భాగంగా శ్రీకృష్ణుడు యాదవులతో గోపూజ చేయిస్తాడు. అది చూసి కోపించిన ఇంద్రుడు రాళ్ళ వాన కురిపించగా, గోవర్ధన గిరిని ఎత్తి శ్రీకృష్ణుడు తన అవతార వైశిష్ట్యాన్ని చూపిన పుణ్యదినం. భీష్ముడు స్వచ్ఛంద మరణాన్ని వరంగా పొంది, తనువు చాలించిన సంక్రాంతితో ఉత్తరాయణ పుణ్యకాలం ప్రారంభమవుతుంది. భక్తవత్సలుడైన శ్రీరంగనాథుడు అయోనిజ అయిన గోదాదేవిని స్వీకరించి, ఆమెకు దివ్య భోగాలను అందించిన దినం భోగి. ఆనందానుభూతిని పంచి ఇచ్చిన పుణ్యదినం సంక్రాంతి.

కదిలే క్రాంతి సంక్రాంతి. దానికి చైతన్య ప్రదాత, అధి దేవుడు సూర్య భగవానుడు. ఆ సూర్యదేవుడు జ్ఞానానికీ, విజ్ఞానానికీ, ఆధ్యాత్మిక తేజస్సుకూ ప్రతిరూపం. ఇహపరాలను సంయమింపజేసే గాయత్రీ మంత్రానికి శక్తి ప్రదాత సూర్య భగవానుడు. ఆ సూర్యుని అర్చనా రూపమే సంక్రాంతి పండుగ.

సంక్రాంతికి ఒక నెల ముందు వచ్చే ధనుర్మాస ఆరంభం నుంచే సంక్రాంతి శోభ మొగ్గవిచ్చుకుని ప్రకృతిని పరవశింప జేస్తుంది. హేమంత ఋతువులోని చలికి ముడుచుకున్న సమాజంలో భోగి మంటల వెచ్చదనంతో నూతన తేజాన్ని నింపుతుంది. సూర్యుని ఆరాధనతో జ్ఞాన యోగ భావాన్ని పొందిన రైతు, కర్మయోగ సాధనతో సాధించిన ధాన్యాలను గాదుల కెక్కించి తన కృషీ ఫలాన్ని సిరి సంపదల రూపంలో చూచి పరవశించి పోయే పండుగ సంక్రాంతి. భోగి మానవునిలోని తేజస్సుకు ఉద్దీపనారూపమైతే, కనుమ మానవునిలోని దయాగుణ ప్రదర్శనకు సంకేతం. పండుగలన్నింటిలోకి పెద్ద పండుగగా పేరుగాంచిన సంక్రాంతి తెలుగు వారికీ, భారతీ యులకే కాక ఇతర రూపాలతో ప్రపంచంలో చాలా చోట్ల కనబడు తుంది. a







# ఆ వీరేశ్వరుడే ఈ వివేకానందుడు

-స్వామి వినిశ్చలానంద

స్వామి వివేకానంద సాక్షాత్తూ శివాంశ సంభూతుడు. కాశీ వీరేశ్వరుని వరప్రసాదంగా భువనేశ్వరీ దేవి, విశ్వనాథ దత్తా పుణ్య దంపతులకు స్వామి వివేకానంద జన్మించారు. చిన్న వయసులో ఆయన పేరు నరేంద్రనాథ్ దత్తా. స్వామి వివేకానంద సాక్షాత్తూ శివావతారమే అని చెప్పడానికి ఎన్నో సంఘటనలున్నాయి. అందులో కొన్ని చూద్దాం.

నరేంద్రుడు చిన్నతనంలో ఎంతో అల్లరి చేసేవాడు. తన అక్కలను కొట్టి బురద గుంటలో నిలబడేవాడు. 'రండి. వచ్చి నన్ను పట్టుకోండి' అని వాళ్ళను పిలిచేవాడు. నరేంద్రుని అల్లరిని మాన్పించడానికి భువనేశ్వరీదేవి ఒక చక్కని ఉపాయం కనిపెట్టింది. శివుడు అభిషేక ప్రియుడు కనుక, భువనేశ్వరీ దేవి 'శివ శివా' అంటూ నరేంద్రుని నెత్తిన బిందెతో నీళ్ళు పోసేది. దాంతో నరేంద్రుడు శాంత చిత్తుడయ్యేవాడు.

శ్రీరామకృష్ణులు "నరేంద్రుణ్ణి నిందించడం శివ నిందతో సమానం. హాలాహలాన్ని మింగిన శివునిలా నరేంద్రుడు దేన్ని భుజించినా జీర్ణించుకోగలడు"అనేవారు.

స్వామి వివేకానంద సాక్షాత్తు శివావతారమే అని స్వామి బ్రహ్మానంద మరియు ఇతర సోదర శిష్యుల నిశ్చితాభిప్రాయం.

ఒకసారి స్వామి బ్రహ్మానంద కొన్ని నెలలు కాశీలో ఉన్నారు. ఆ సమయంలో స్వామి వివేకానంద బేలూరు మఠంలో ఉన్నారు. ఒకసారి స్వామీజీకి స్వామి బ్రహ్మానందను చూడాలనే కోరిక కలిగిది. వెంటనే స్వామీజీ, ప్రేమానందను పిలిచారు. ''బాబూరామ్! నాకు రాజాను (స్వామి బ్రహ్మానందను) చూడాలని ఉంది. వెళ్ళి, రాజాను బేలూరు మఠానికి తీసుకురా" అని చెప్పారు. స్వామీజీ ఆజ్ఞ అయిన వెంటనే స్వామి ప్రేమానంద కాశీకి ప్రయాణమయ్యారు.

"మహారాజ్! స్వామీజీ మిమ్మల్ని బేలూరు మఠానికి తీసుకు రమ్మని నన్ను పంపారు. దయచేసి మీరు నాతో బేలూరు మఠానికి రండి" అని స్వామి ప్రేమానంద, రాజా మహారాజ్‌ను (స్వామి బ్రహ్మానందను) వేడుకున్నారు.

అందుకు రాజా మహారాజ్, "బాబూరామ్! నాకు ఇక్కడ చాలా బాగుంది. ఇది శివక్షేత్రం. గంగానది ఒడ్డున ఇక్కడే నేను ఉంటాను. నేను బేలూరు మఠానికి రాను" అని చెప్పారు.

"మహారాజ్! మన శివుడు స్వామీజీ. ఆయన బేలూరు మఠంలో ఉన్నారు. బేలూరు మఠం గంగ ఒడ్డున ఉంది. బేలూరు మఠానికి రావడానికి మీకేమిటి అభ్యంతరం?'' అన్నారు స్వామి ప్రేమానంద.

స్వామి వివేకానంద సాక్షాత్తు శివావతారమే అన్న నిశ్చితాభిప్రాయం బ్రహ్మానందుల వారిది. కనుక మారు మాట్లాడ కుండా, వెంటనే ప్రేమానందుల వారితో బేలూరు మఠానికి ప్రయాణమయ్యారు. ధ్యానానికి ప్రతిరూపం శివుడు. శివునికి ప్రతిరూపం స్వామి వివేకానంద.

మరొక సంఘటన - ఒకసారి స్వామి వివేకానంద, స్వామి శారదానందను పిలిచి తన కాళ్ళు ఒత్తమన్నారు. "శరత్ ! (స్వామి శారదానంద) నీకు సరిగా కాళ్ళు ఒత్తడం చేత కావడం లేదు. రాజా (స్వామి బ్రహ్మానంద)ను పిలువు. రాజా మహారాజ్‌ను చూడు. అతను ఎలా కాళ్ళు ఒత్తుతాడో" అన్నారు స్వామీజీ.

శరత్ మహారాజ్, రాజా మహారాజ్‌కు విషయం చెప్పారు. వెంటనే రాజా మహారాజ్ వచ్చి స్వామీజీ కాళ్ళు ఒత్తసాగారు. అది చూసిన శరత్ మహారాజ్‌కు ఒక సందేహం కలిగింది. రాజామహారాజ్ రామకృష్ణమఠం - రామకృష్ణ మిషన్ అధ్యక్షులు, శ్రీరామకృష్ణ పరమహంసకు మానసపుత్రులు. ఆయన చేత స్వామి వివేకానంద కాళ్ళు ఒత్తించుకుంటున్నారే అని అనుకున్నారు. ఇదే విషయాన్ని శరత్ మహారాజ్, రాజా మహారాజ్‌తో అన్నారు.

అందుకు రాజా మహారాజ్, "శరత్! నీవు స్వామీజీలో కేవలం స్వామీజీనే చూస్తున్నావు. కానీ నేను స్వామీజీలో సాక్షాత్తూ ఆ పరమశివుణ్ణి దర్శిస్తున్నాను" అన్నారు.

స్వామి వివేకానంద సాక్షాత్తు శివాంశ సంభూతులే అని చెప్పడానికి ఇంత కన్నా వేరే నిదర్శనాలు అవసరమా! ❑

# దేవీ వైభవం

ప్రవచనం: **శ్రీ సామవేదం షణ్ముఖశర్మ** విలేఖనం: **శ్రీమతి ఎన్. శేషు**

**(గత సంచిక తరువాయి)**

**"ఓ** తల్లీ! సంపదలిచ్చేటప్పుడు హిరణ్య వర్ణాం అని చెప్పినట్లు, ఆ లేత ఎర్రని పసిమి మిసిమి కలసిన కాంతులతో కలబోసి, మహాలక్ష్మీ స్వరూపిణివై మమ్మల్ని అనుగ్రహిస్తున్నావు. పద్మాలు ధరించి, వికసిత పద్మంలో ఆసీనురాలివైన నీ స్వరూపాన్ని చూస్తేనే ఐశ్వర్యమయమైన జగదంబిక స్ఫురిస్తోంది. విద్వేష వర్గ దళనేచ తమాల నీలాం – మహాకాళీ స్వరూపంలో నీల కాంతులతో వచ్చి శత్రు సంహారం చేస్తుందట. మన శత్రువులు ఎవరూ అంటే – అమ్మకూ, మనకూ మధ్య అడ్డు వచ్చేవాళ్ళే శత్రువులు. అమ్మ తత్త్వాన్ని అవగతం చేసుకునే ఆధ్యాత్మిక సాధనలో ఏవి విఘ్నాలో అవే శత్రువులు. వాటిని తొలగించేది అమ్మే. అవి తొలగించేటప్పుడు మనకున్న భయాలను భయ పెట్టాలంటే భయంకరంగా కనపడాలి. అందుకే అమ్మ ఉగ్రా కృతులన్నీ కూడా భయాలను భయపెట్టడానికి ధరించిన అభయ స్వరూపాలు. మనకు వివిధ అవస్థల్లో ఎదురయ్యే లోపాలనూ, దుష్ట స్వభావాలనూ, బయటి దుష్ట ప్రకృతుల్నీ కూడా అణచడానికి అమ్మ మహాకాళీ మొదలైన ఉగ్రరూపాలతో భాసిస్తోంది.





ముచ్చటగా మూడనుకున్నా అన్నపూర్ణ, శాకంబరి, శతాక్షి – ఇలా ఇంకెన్ని ఉన్నాయో అమ్మ రూపాలు. ఆ తల్లే దేవతలతో "మీకు ఎప్పుడు పని పడితే అప్పుడు నేను వస్తాను" అంటుంది. "అంత వరకూ రావా" అని అడిగితే, "నేను ఎక్కడికో వెళ్ళిన దాన్నైతే కదా మళ్ళీ రావడానికి! నేనెప్పుడూ ఉన్నదాన్నే. నన్ను మీరొక్కసారి ధ్యానిస్తే మీ కోసం నేను వెంటనే వస్తాను" అంది.

'ఎక్కడి నుండి వస్తావమ్మా' అంటే "చిదగ్ని కుండ సంభూతా" – చిదగ్ని కుండంలో నేను ఎప్పుడూ ఉన్నాను, మీకు ఎప్పుడు పని పడితే అప్పుడు వస్తాను. "దేవకార్య సముద్యతా". "చిదగ్ని కుండంలో ఎప్పటి నుంచో ఉన్నావు కదా, అప్పుడే నువ్వొచ్చావా" అంటే– అంతకు ముందే "శ్రీమాతా శ్రీమహారాజ్ఞీ శ్రీమత్సింహాస నేశ్వరీ" అయి ఉన్నదాన్ని ఈ రూపంలో మీకు ప్రకటింపబడుతున్నాను. కనుక మీకెన్ని అవసరాలుంటే అన్ని రూపాలతో నేను వస్తుంటాను''అంది. అందుకు కుండంలో చిదగ్ని రగుల్చుకోవాలి. అదేమిటంటే "అంతర్నిరంతర నిరిం ధనమేధ మానే...." అన్నారు. మన హృదయంలో నిరంతరం చింతన అనే మథన సాగుతూ ఉంటే, జ్ఞానాగ్ని కుండం రగులుతుంది. ఆ రగిలిన చిదగ్నిలో నుంచి అమ్మ స్వరూపం సాక్షాత్కరిస్తుంది. అలా వచ్చిన తల్లి దైవీయమైన శక్తుల్ని రక్షించి, ఆసురీశక్తుల్ని సంహరిస్తుంది. అమ్మవారి లక్ష్యం ఆసురీ శక్తుల్ని సంహరించడం కనుక ఇక్కడ అమ్మవారనగానే 'జయ జయహే మహిషాసుర మర్దిని' అనే రూపాన్ని స్ఫురింపజేస్తుంది.

ఆసురీశక్తులు బయటా, లోపలా కూడా ఉన్నాయి. మనలో ఉన్న రజోగుణ, తమోగుణ వికారాలే ఆసురీ శక్తులు. మనలో ఉన్న సత్త్వ గుణమే దైవీశక్తి. దానిని పరిరక్షించుకుంటేనే మనం శుద్ధ సత్త్వభూమికి చేరి త్రిగుణాతీత స్థితికి వెళ్ళగలం. దానికి రజోగుణ, తమోగుణాలు అడ్డు వస్తున్నాయి. వాటిని కొట్టాలి. కృష్ణ పరమాత్మ కూడా భగవద్గీతలో "నీ సమస్తానికీ ఆ రెండే అవరోధాలు" అంటాడు–

కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః
మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్
శక్నోతీహైవ యః సోఢుం ప్రాక్ శరీర విమోక్షణాత్
కామ క్రోధోద్భవం వేగం స యుక్తః స సుఖీ నరః

ఈ రజోగుణ, తమో గుణాలు రెండింటినీ జయించాలి. అందుకే అమ్మవారు కొట్టిన రాక్షసులందరూ జంటలే. మహిష

– అసురులు. మహిషం అంటే దున్నపోతు – తమోగుణం. ఇక, అసురుడు రజోగుణానికి సంకేతం. అలాగే, శుంభ– నిశుంభులు, చండ – ముండులు.

దేవకార్య సముద్యత అయిన జగదంబిక అవసరం అప్పుడు దేవతలకే కాదు, ఇప్పుడు మనకీ ఉంది. ప్రస్తుతం అమ్మవారి ఉపాసన ఆవశ్యకత ప్రతి వ్యక్తికీ ఉంది, సమాజానికీ ఉంది. మళ్ళీ అమ్మవారు ఆవిర్భవించాల్సిన అవసరం ఇంకా ఉంది. ఎందుకంటే ఆసురీ శక్తులు అనేక రకాలుగా ఈ ప్రపంచాన్ని ముట్టడించి ఉన్నాయి. వాటిని సంహరింప జేయమని మనం అమ్మవారిని ప్రార్థించాలి. ప్రతీ సంవత్సరం 'చండీ సప్తశతీ' పారాయణాలు, చండీయాగాలు ఎందుకు చేస్తున్నామంటే ఈ ఆసురీ శక్తులను నిర్మూలించుకొని, దైవత్వాన్ని పెంపొందింప జేసుకునేందుకు. ఆ శక్తులతో అమ్మవారిని కొలుచుకోవడమే మన జన్మకు చరితార్థత. ఇలా ఉన్న ఆ తల్లి తత్త్వాన్ని ఉపాసించుకోవడానికి సర్వ చైతన్య రూపిణి అని పేరు. అనేక కోటి బ్రహ్మాండ జనని అని కూడా నామం ఉంది.



సర్వ చైతన్యం అంటే ఒక చిన్న అణువులో కూడా 'అహం' అనే స్ఫురణ నిచ్చిందంటే అమ్మకున్న శక్తి అలాంటిది. "అహం" చీమలో ఎంత ఉందో, మనలోనూ అంతే ఉంది. ఎక్కువ తక్కువలు లేవు. అందరూ సమానం. "సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరం" – సమంగా వ్యాపించి ఉన్నారు ఆయన. శ్రీరమణ మహర్షి "అహాన్ని తెలుసుకో" అనేవారు. అంటే అమ్మను తెలుసుకో అని! "నేను" అంటేనే అమ్మ. అహం రూపంతో అంతటా వ్యాపించి ఉంది; అన్ని బ్రహ్మాండాల్లోనూ వ్యాపించి ఉంది. కనుక ఒక్క అమ్మను మీరు తెలుసుకున్నారంటే బ్రహ్మాండాన్ని తెలుసుకున్నట్లే. అసలు బ్రహ్మ విష్ణు రుద్రులకు కూడా అమ్మ అర్థం కాదు.

ఒకసారి నారదమహర్షి, బ్రహ్మదేవుడి దగ్గరకు వెళ్ళి, "ఏ తత్త్వాన్ని ఉపాసించాలో నాకు అర్థం కావడం లేదు. ఏ పర తత్త్వాన్ని ఉపాసించాలి?" అని అడిగారట. అప్పుడు బ్రహ్మదేవుడు "నువ్వు అన్నీ భిన్న భిన్నాలుగా చూస్తున్నావు కనుక నీకు అర్థం కావడం లేదు. ఒక విషయం చెబుతాను విను. సృష్టికి ముందు నేను వచ్చినప్పటికి ఉన్న స్థితి చెబుతాను. అప్పుడు మొత్తం జలమయమై ఉన్నది భువనమంతా! భూమి ఎక్కడా కనిపించడం లేదు. ఇంత జలం ఉన్నప్పుడు నేనెలా వచ్చానా అని నన్ను నేనొకసారి చూసుకుంటే తామర పువ్వులో నేనున్నాను. తామర పూవులో ఉన్న నేను ఎక్కడ నుంచి వచ్చాను, ఏమి చెయ్యాలో అర్థం కాక చుట్టూ చూస్తూ ఉన్నాను"అన్నాడు.

చుట్టూ జలం. పైగా ఎలాంటి అంధకారమంటే– అప్పుడది వెలుగూ కాదు, చీకటీ కాదు. ఆ అంధకారాన్ని వర్ణించలేం. భయంకరమైన అంధకారం అది. "యదా తమస్తం న దివా న రాత్రి" అని మనకు సూక్తం చెబుతోంది. అప్పుడు తమస్సు లేదు, జ్యోతి లేదు. అలాంటి స్థితిలో నేను ఈ పద్మంలో ఉంటూ వెతికితే ఏమీ కనపడలేదు. ఆ పద్మంలో కూర్చొని అలా ఆలోచిస్తూ ఉంటే ఆయనకు "తప తప" అని వినపడింది. అంటే 'తపించు, తపించు'.

సత్యం తెలుసుకోవాలంటే తపించు తపించు. సృష్టిలో ఏ చిన్న వస్తువు కావాలన్నా తపించాల్సిందే. ధ్యానమగ్నుడై "నాకు ఆధారమేది, సర్వ జగత్తుకీ ఆధారమేది" అనుకొని, చుట్టూ చూస్తే తాను ఉన్న పద్మానికి ఆధారం కనపడింది. ఆ ఆధారం ఏమిటి అని కిందికి చూస్తే ఆ నాళం మీదికి ఆయన దృష్టి వెళ్ళింది. ఆ నాళం ఎక్కడ మొదలైందో చూశాడు. అది ఒక సర్పంపై పడుకున్న మహావిష్ణువు నాభి నుండి వచ్చింది. తపస్సు చేయనంత కాలం "నాకు నేనే మూలం అనుకున్నప్పటికీ, తపస్సు చేశాక, నాకు మూలమేమిటో తెలిసింది." అని చెప్పాడు.

ఆయనను చూసి బ్రహ్మదేవుడు నమస్కరించాడట. చాలా కాలంగా నిద్రపోవడం వల్ల ఆయన కర్ణ మలం నుంచి ఇద్దరు రాక్షసులు పుట్టారట. వారిద్దరూ మధు కైటభులు. వారు శాంతంగా ఉండరు, మరొకరిని ఉండనివ్వరు. రజోగుణ, తమోగుణ లక్షణాలివి. అహంకారానికి అవిద్య తోడైతే ఈ రజోగుణ, తమోగుణాలు వస్తాయి. రజో గుణ, తమో గుణాల నుంచి అహంకార, మమకారాలు పుడతాయి. అహంకారం మధు, మమకారం కైటభుడు. అది ఎలా అంటే – 'మధు' అర్థం తేనె. అంటే తీపి. సృష్టి అంతటికీ తియ్యనైన వస్తువు "నేను". నేను అంటే ఎవరికి వారికి తీపి. నాకు నేనే తీపి కదా! ^ (సశేషం)

## పరిప్రశ్న

**- స్వామి సుకృతానంద**

– డి. తులసీదాస్, కొత్తూరు

**? : ఒక గురువు వద్ద మంత్రోపదేశం తీసుకొని, వేరొక భగవంతుణ్ణి జపించవచ్చా?**

✍: ఒక దేవుడి మంత్ర జపం చేస్తూ, మళ్ళీ ఇంకో దేవుని మంత్రం జపించడం అనావశ్యకం. ఒకే చోట తవ్వుతూ పోతే నీటి ఊట లభిస్తుంది. కొద్ది కొద్దిగా అనేక



చోట్ల తవ్వితే నీరు లభించదు. భగవంతుని నామాలు, స్వరూపాలు వేరైనా, ఆయన నిజతత్త్వం ఒక్కటే. కాబట్టి, మనం ఏ పేరుతో పిలిచినా, ఏ రూపంలో స్మరించినా ఆయన తప్పక లభిస్తాడు. "భావాద్వైతం సదా కుర్యాత్, క్రియా ద్వైతం న కర్హిచిత్" అన్నారు పెద్దలు. కాబట్టి, ఏ స్వరూపాన్నైనా, ఏ నామాన్నైనా నిందించడం మంచిది కాదు. ఒక మనస్సుతో ఒకే చోట నిలకడ చెందడం మంచిది. ఆంజనేయస్వామి తన ఇష్టదైవమగు శ్రీరాముని యందు నిష్ఠ వదలలేదు. ద్వాపరంలో ద్వారకకు పోయి కూడా హనుమంతుడు, శ్రీరాముణ్ణే దర్శించగలిగాడు. అక్కడ ఉన్న రుక్మిణి, శ్రీకృష్ణులు హనుమంతుని కోసం సీతారాములుగా దర్శనమిచ్చారు.

– ఎస్. వీర రాఘవులు, హైదరాబాద్

**? : జీవాత్మ మరో జన్మను ఎట్లా పొందుతుంది?**

✍: ఛాందోగ్యోపనిషత్తు (5–10–5.6.7) పంచమాధ్యాయం, దశమఖండంలోని 5, 6, 7 మంత్రాల ద్వార పునర్జన్మ గురించి తెలుసుకోవచ్చు.

కర్మ క్షయం అయ్యే వరకు చంద్రలోకంలో ఇంద్రియ భోగాలను అనుభవించి, ఈ కింద తెలిపిన మార్గంలో పునర్జన్మ ఎత్తుతారు. ఆకాశం, వాయువు, ధూమం, మేఘం, పిమ్మట వర్షం గుండా జీవులు పయనిస్తారు. (సూక్ష్మ శరీరం ఆ యా భూతాలకు అంటుకొని ఉంటుంది. గోధుమలు మున్నగు వాటిని పిండి చేసినా, ఆ సూక్ష్మ శరీరం నష్టం కాదు). తరువాత జీవులు వడ్లు, గోధుమలు, ఓషధులు, వనస్పతులు మొదలగు వాటిలో ఉద్భవిస్తారు. ఆ యా పదార్థ రూపాల నుంచి మళ్ళీ జీవులు బయట పడడం చాలా కష్టం, మానవులు తినే ఆహారంలో జీవులు పురుషుని శరీరంలో ప్రవేశించి అన్నగత ప్రాణులుగా జన్మిస్తారు.

– ఎమ్. హనుమంతు, శ్రీకాకుళం

**? : ఎవరు నిజమైన పేదవారు?**

✍: ఆది శంకరాచార్యులు తమ ప్రశ్నోత్తరిలో...

***'కోవా దరిద్రో హి విశాల తృష్ణః***
***శ్రీమాంశ్చ కో యస్య సమస్త తోషః'***

'ఎక్కువ ఆశ ఉన్నవారే దరిద్రులు. బీదవాడు అయినా సంతృప్తి కలిగి ఉండేవాడే శ్రీమంతుడు' అన్నారు.

దానం పుచ్చుకొనేవాణ్ణి దేవునితో సమానంగా పూజించండి అన్నారు స్వామి వివేకానంద. ఎందుకంటే, దానం పుచ్చుకొనేవాడు నీకు దానం చేసే అవకాశ మిస్తున్నాడు. గురువుగారి మాటలను త్రోసిపుచ్చి, బలి చక్రవర్తి ఆ పరమాత్మ స్వరూపుడైన వామనునికే దానం చేశాడు. అంత మాత్రాన వామన భగవానుడు బీదవాడు కాలేదు. దేవతలకు సహాయం చేయడం కోసం విష్ణువు అలా చేశాడు. కర్ణుడు తన శత్రువు తండ్రియైన ఇంద్రునికే తన సహజ కవచ కుండలాలు కోసి ఇచ్చాడు.

కాబట్టి, హృదయాన్ని విశాలం చేసుకోవాలి. ఈ దృశ్య ప్రపంచం అంతా ఆ పరమాత్ముని విరాట్ స్వరూపమే!



ధీరవాణి



# సజీవుల సేవతో సార్థకత!

పాశ్చాత్యుల విజయానికి రహస్యం వారిలోని సంఘీభావ శక్తే. అన్యోన్య విశ్వాసం, అన్యోన్య గుణగ్రహణం అనేవే దానికి మూలం. దేశం ఎంత బలహీనంగా, ఎంత పిరికిగా ఉంటుందో అంత ప్రస్ఫుటంగా, ఈ అసూయా పిశాచం కనిపిస్తుంది.

మన జాతికి సంఘనిర్మాణం, కార్యనిర్వహణాల్లో నైపుణ్యం లేదు. ఈ లోపం వల్లే అనేక కష్టాలు వాటిల్లుతున్నాయి. కలసికట్టుగా ఒకే లక్ష్యసాధన నిమిత్తం ముందంజ వేయడం మనకు చేతకాదు. దీనికి మొట్టమొదట కావలసింది విధేయత. మనస్సుకు నచ్చినప్పుడు ఒక పని ప్రారంభించి కొంత సేవయ్యాక దాన్ని వదలివేస్తే ఆ చేసిన పని పూర్తిగా వ్యర్థమవుతుంది. కష్టపడి పనిచేయడం, పట్టుదల మనకు ఆవశ్యకం.

నేడు (పూజా మందిరంలో) ఒక గంట, రేపు దాని మీద ఒక జేగంట, మర్నాడు చామరం; లేదా నేడొక శయ్య, మర్నాడు దాని కోళ్ళకు వెండిమలామా – ఇక భక్తులకు పరమాన్నమూ, పిండివంటలు; ఇక తలాతోకా లేని వేయి గాథలు – వేయి మాటలెందుకు, బాహ్య కర్మకలాపం– ఇదే కదా మీ కార్యక్రమం! మీ వైఖరి! దీన్ని మనోదౌర్బల్యం అని అంటారు. గంట కుడివైపున వాయించాలా? హారతి మూడుసార్లు తీయాలా, నాలుగుసార్లా? ఈ రకమైన సంశయాలతో అహర్నిశలూ ఎవరు కలవరపడుతూ ఉంటారో వారే నిర్భాగ్యులు.

అభ్యుదయం పొందగోరితే, ప్రతి వ్యక్తిలోనూ నెలకొని ఉన్న భగవంతుణ్ణి ఆరాధించండి. భగవంతుని విశ్వరూపమే ఈ ప్రపంచం. దానిని అర్చించడమే లేక సేవనమే కర్మాచరణం. అంతేకానీ, నైవేద్య పళ్ళేరాన్ని దేవుని ముందు పది నిమిషాలు ఉంచాలా, అరగంటసేపా అని ఆందోళన పడడం కాదు! కాశీలోను, బృందావనంలోను గుడి తలుపులు తెరిచేటప్పుడుగాని, మూసేటప్పుడుగాని తదాదిగా అవి దినమంతా గణగణ మ్రోగడానికై లక్షలాది రూపాయలు ఖర్చు చేశారు. ఇప్పుడు దేవునికి అలంకార సమయం, ఇప్పుడు ఆరగింపు వేళ–ఇదంతా సజీవ ప్రత్యక్ష దైవాలైన తోటి మానవులు తిండి లేక మలమలమాడుతున్నప్పుడు, చదువు సంధ్యలు లేక 'అలో' లక్ష్మణా అని విలపిస్తున్నప్పుడు! తోటి మానవులకు ప్రాణం మీదకు వచ్చినా వారేమీ చేయరు గాని బొంబాయిలోని బనియాలు (వైశ్యులు) నల్లుల యోగక్షేమార్థం అసుపత్రులు కట్టిస్తున్నారు. ఈ అల్ప విషయం గ్రహించడానికి మీకు బుద్ధిబలం చాలడం లేదు. ఇదే మన దేశానికి ముప్పు.

...నాయనా! నువ్వు ముక్తి పొందకపోతే ఏం? కొన్ని సార్లు నరకాన్నే అనుభవిస్తే ఏం? భర్తృహరి మాట అసత్యమా?

*హృదయవచశ్శరీరముల నెంతయు బుణ్యసుధాప్రపూర్ణులై*
*ముదము బహూపకారముల మూడు జగంబులకున్ ఘటించుచున్*
*వదల సాధు సద్గుణలవంబులు గొండలుసేసి మెచ్చున్*
*మదిని వికాసయుక్తులగు మాన్యులు గొందరు వొల్తురిద్ధరన్.*

– భర్తృహరి సుభాషితం

దృఢంగా నిరాకరించగలిగితే కాలకూట విషమైనా శక్తి హీనమై పోతుందని చెబుతారే! 'నా కేమీ తెలియదు!' 'నేను అథముణ్ణి!' అనడం ఏం వినయమోయ్! అది మిథ్యా వైరాగ్యం.

అకుంఠిత దీక్షతో, మహోత్సాహంతో మీలో కొందరు నలుదిక్కులకూ వెళ్ళి మన దేశంలో ఇంత దాకా ఎవరూ నిర్వహించని ఈ విశ్వరూపారాధన ప్రచారం సాగించండి. ^

('వివేకానంద లేఖావళి' నుంచి)



# పరమేశ్వరుని పరిరక్షణలో ...

## స్వామి జపానంద స్వీయ అనుభవాలు -7

(గత సంచిక తరువాయి...)

## నదీ ప్రవాహంలో నారాయణ రక్ష

స్వామి జపానంద పరివ్రాజక సన్న్యాసిగా ఉత్తర భారతదేశంలో యాత్రలు చేస్తూ ఉత్తరాంచల్‌లో గంగోత్రి నుండి ఉత్తర కాశీ వెళుతున్నారు. వర్షాకాలం మొదలైంది. బాగా వర్షాలు పడ్డాయి. దాంతో, కొండ వాగులు ఉద్ధృతంగా ప్రవహిస్తున్నాయి. తోవలో ఒక చిన్న నదిని దాటాల్సి వచ్చింది. దాటుదామంటే వంతెన లేదు. అక్కడ నీళ్ళలోకి దిగడం చాలా అపాయ కరం. తోవ పొడవునా ఉన్న రాళ్ళను దాటుతూ దిగడం కష్టంగానే ఉంది. ఒక చోట నిలబడి చూస్తున్నారు. నదికి అవతలి తీరంలో ఓ గ్రామం ఉంది. అది ఇటు నుంచి కనిపిస్తోంది. సరిగ్గా అప్పుడే పెద్ద వాన పడినందువల్ల నదిలో నీళ్ళు వేగంగా ప్రవహిస్తున్నాయి. ఆరడుగుల కన్నా పొడవున్న ఓ వ్యక్తి అంతకు ముందే అవతల తీరంలో నిల్చొని చూస్తున్నారు. సన్నగా ఉన్న సన్న్యాసి ఆ ప్రవాహంలో దిగాలని ఆలోచించడం మృత్యువును కోరి కొని తెచ్చుకోవడంతో సమానం. కానీ వేరే దారి లేదు. అక్కడ రాత్రి గడపడగ్గ ఆశ్రయమేదీ లేదు.



కాస్త దూరంలో ఒక వ్యక్తి ధాన్యపు సంచీలు పెట్టుకొని, ఊలు దుప్పటి కప్పుకొని, చిన్న ఆశ్రయంలా చేసుకొని కూర్చొని ఉన్నాడు. ఆ సంచీలు కూడా ఊలుతో అల్లినవే. వాటిని ఎంత దగ్గరగా, దిట్టంగా అల్లుతారంటే – ఒక చుక్క నీరు కూడా లోపలకు దూరదు. సన్న్యాసి అతని దగ్గరకు వెళ్ళి ఎక్కడ లోతు తక్కువుందని అడిగారు. ఆ పొడుగు సన్న్యాసి ఎదురుగా ఉన్న ప్రాంతాన్ని చూపించాడు.

అంతే! సన్న్యాసి తన ఇష్టదైవాన్ని స్మరిస్తూ అటు వెళ్ళారు. చేతిలో అయిదడుగుల కర్ర ఉంది. ఒక చిన్న సంచీలో భగవద్గీత, చాకు, అగ్గిపెట్టె, కొవ్వొత్తి లాంటి చిన్న చిన్న వస్తువులు, చేతిలో ఒక కమండలం ఉన్నాయి. ఒక కంబళి, భుజం మీద రెండు బట్టలు – సన్న్యాసి దగ్గర ఉన్న వస్తువులు అంతే! సన్న్యాసి జాగ్రత్తగా నీటిలోకి దిగి నడవడం మొదలుపెట్టారు. ఎందుకంటే రాళ్ళ మీదయితే జారి పడే ప్రమాదం ఉంది. కర్ర సహాయంతో సన్న్యాసి సగం దూరం దాటి ఉంటారు. ఇంతలో ప్రవాహం ఇంకా ఉద్ధృతమైపోయింది. ప్రవాహానికి ఎదురుగా కర్ర ఆన్చి నడుస్తున్నారు కానీ మధ్యలో గొయ్యి ఉంది. కర్ర ఆన్చలేక పోయారు. ఫలితంగా, ప్రవాహంలో పడిపోయారు. ఒక్కసారి నీటిలోకి వెళ్ళిపోయారు. ఇంతలో ఒక పెద్ద బండరాయి కర్రకు తగిలింది. కర్ర ఆన్చడం కోసమే ఎవరో అడ్డంగా పెట్టినట్లుగా ఉందా రాయి. లేచి నిల్చొని, కర్ర పట్టుకొని నడిచి నది దాటారు.

సన్న్యాసి నోటిలోకి ఒక్క నీటి చుక్క కూడా వెళ్ళలేదు. దెబ్బలు తగలలేదు. ఆయన తిన్నగా నది దాటి, రెండో ఒడ్డుకు చేరిపోయారు. అన్ని వస్తువులూ తడిసిపోయాయి కానీ ఏదీ పాడవ లేదు. నష్టమేమీ జరగలేదు. చేతిలో ఉన్న కమండలం కూడా సురక్షితంగా ఉంది. ఆ పొడుగు వ్యక్తి, మరొక గ్రామస్థుడు – సన్న్యాసికి సహాయం చెయ్యడానికి దగ్గరకు వచ్చారు. అక్కడ నుంచి గంగానది సంగమంలో నదీ ప్రవాహం చాలా ఎక్కువగా ఉంది. నీటిలోకి దిగడం అపాయంతో కూడుకున్న పని. క్షణంలో అంతా జరిగింది. పరమేశ్వరుడే వచ్చి రక్షించాడు.

## బ్రహ్మపుత్రా తీరంలో భగవానుడి సాయం



తూర్పు బెంగాల్‌లో పేరున్న ఊరు - మైమన్ సింహ. ఢాకా కన్నా చిన్నదైన ఈ ఊళ్ళో చాలామంది ధనవంతులు, జమీందార్లు ఉన్నారు. అప్పటికి స్వామి జపానంద సన్న్యాసాశ్రమం స్వీకరించలేదు. మైమన్ సింహలో వారి బంధువు ఒకరు పెద్ద ఉద్యోగం చేసేవారు. వేసవి సెలవుల్లో ఆయన ఆ ఊరు వెళ్ళారు.

బ్రహ్మపుత్రా తీరంలో ఉన్న ఆ ఊరు ఆకర్షణీయంగా ఉండేది. దూరంగా గారో పర్వతాలు అందంగా కనిపించేవి. కొన్నాళ్ళు అక్కడ గడిపాక రోజూ సాయంత్రం వారి ఇంటికి ఒక మైలు దూరంలో ప్రవహిస్తున్న బ్రహ్మపుత్రా నదీ తీరానికి వెళ్ళేవారు. తిరగడానికి అక్కడ ఉన్న శ్మశానానికి కూడా వెళ్ళేవారు. అక్కడంతా నిర్మానుష్యంగా ఉండేది. అక్కడ ఏకాంతంగా శాంతచిత్తులై ధ్యానం చేసుకునేవారు. అందుకని తరచూ ఒక్కరే వెళ్ళిపోయేవారు.

ఒకనాడు సాయంకాలం బ్రహ్మపుత్రా నదిలో స్నానం చేద్దామని శ్మశానం దగ్గరలోనే నీటిలోకి దిగారు. అంతా బురదగా ఉంది. నీటిలో పడిపోయారు. పర్వతాలలో వర్షం పడడం వల్ల బ్రహ్మపుత్రా నది పొంగి ప్రవహిస్తోంది. ఆ ప్రదేశం నిర్మానుష్యంగా ఉంది. ఎంత అరచినా సహాయం చేసేవారు లేరు. ఆపద నుంచి బయటపడడానికి సహాయం దానంతట అదే చెంతకి వచ్చింది. ఒక పెద్ద చెట్టు వేళ్ళతో సహా నీటిలో కొట్టుకొని వచ్చింది. దానిలో సగభాగం నీటిలో మునిగి ఉంది. దాని సహాయంతో గట్టు మీదకు చేరుకున్నారు. మరికొద్ది నిమిషాలలో ఆ చెట్టు ప్రవాహంలో కొట్టుకుపోయింది. అంతా భగవంతుడి దయ అని అనుకున్నారు సన్న్యాసి.

## అబూ పర్వతం మీది అమ్మవారి రక్ష

రాజస్థాన్‌లో అబూ పర్వతం మీద అర్వుదా దేవి మందిరం ఉంది. స్థానికులు ఆమెను 'అద్ధర్ దేవి' అని కూడా అంటారు. దేవీ మందిరం కింద ఓ పక్కగా ఉన్న గుహలో స్వామి జపానంద మూడు నెలలు ఉన్నారు. అక్కడ దేవి కృప వల్ల తేలు కాటు నుంచి తప్పించుకున్నారు. ప్రతి రాత్రీ ఆయన ఒకటి రెండు తేళ్ళను పట్టుకారు లాంటి సాధనంతో పట్టుకుని పారేసేవారు. అక్కడ నేల మీద చాప వేసుకొని పడుకొనేవారు. రాత్రిపూట తల దగ్గర ఒక కిరసనాయిలు దీపం, అగ్గిపెట్టె పెట్టుకునేవారు. అవసరమైనప్పుడు దీపం వెలిగించుకొనేవారు.

చాలా సందర్భాల్లో రాత్రివేళల్లో ఆయనకు ఉన్నట్లుండి, "తేలు ఉంది, తేలు ఉంది" అనే మాట స్పష్టంగా వినిపించేది. దాంతో, సన్న్యాసి చటుక్కున లేచి కూర్చొని, దీపం వెలిగించి చూసేవారు. చూస్తే, నిజంగానే అక్కడ కుట్టడానికి తయారుగా తేలు కనిపించేది. అలా మూడు నెలలు అబూ పర్వతం మీది ఆ దేవి సన్న్యాసిని రక్షించింది. a **(సశేషం)**

## పండుగలు - పర్వదినాలు

### జనవరి - 2008

| | | | |
|---|---|---|---|
| 01 | మంగళవారం | : | కల్పతరు దినోత్సవము |
| 04 | శుక్రవారం | : | ఏకాదశి, స్వామి శివానంద జయంతి |
| 12 | శనివారం | : | జాతీయ యువజన దినోత్సవం |
| 14 | సోమవారం | : | స్వామి శారదానంద జయంతి |
| 15 | మంగళవారం | : | సంక్రాంతి |
| 18 | శుక్రవారం | : | ఏకాదశి |
| 21 | సోమవారం | : | స్వామి తురీయానంద జయంతి |
| 29 | మంగళవారం | : | స్వామి వివేకానంద జయంతి |



# భక్తుని బాధ్యత భగవంతునిదే!

కథ: అళగరాజా చిత్రాలు: శ్యామ్ తెలుగు సేత: స్వామి జ్ఞానదానంద

1

ఒకసారి స్వామి వివేకానంద పరివ్రాజకునిగా ఉత్తరప్రదేశ్‌లో రైలులో ప్రయాణం చేస్తున్నారు. అది ఎండాకాలం. బాగా ఆకలి, దాహాలతో అలమటించిపోతున్నారు. స్వామీజీకి ఎదురుగా కూర్చొన్న ఒక వ్యాపారి భోజనం చేస్తూ స్వామీజీని అవహేళన చేయసాగాడు.




2

ఒకచోట రైలు ఆగింది. స్వామీజీ రైలు దిగి ప్లాట్‌ఫామ్ మీదున్న బల్లపై కూర్చున్నారు. ఆ వ్యాపారి అక్కడకు కూడా వచ్చి స్వామీజీని అవహేళన చేయసాగాడు. అప్పుడు ఒక కూలివాడు వచ్చి....




3




4
ఓ సన్న్యాసీ! చూశావా! డబ్బు ఉంటేనే ఆకలి తీరుతుంది. నీ సన్న్యాసం నీ ఆకలి తీర్చిందా? భగవంతుడు మాత్రమే చాలు అనుకున్న నీ దురవస్థ ఎలా ఉందో చూడు! ఇకనైనా బుద్ధి తెచ్చుకొని కష్టపడి సంపాదించి తిను!


5
స్వామీజీ చాలా ప్రశాంతంగా కూర్చున్నారు. అప్పుడు ఒక అద్భుతం జరిగింది! స్వామీజీ వద్దకు ఒక వ్యక్తి బుట్ట పట్టుకొని పరుగెత్తుకుంటూ వచ్చాడు.
స్వామీజీ! ఎండలో కూర్చున్నారేమిటి? నీడలోకి రండి! రెండు రోజులుగా మీరు ఏమీ భుజించలేదు. మొదట ఈ ఆహారం తీసుకోండి!
నువ్వు ఎవరు నాయనా? నేనెవరినో తెలియకుండానే ఇలా ఉపచారాలు చేస్తున్నావే!


6
స్వామీజీ! శ్రీరాముడు నాకు కలలో కనపడి మీకు ఆహారం ఇవ్వమని ఆజ్ఞాపించాడు. మీరు దయచేసి ఈ ఆహారం స్వీకరించండి
మీరు పొరపడు తున్నారేమో?
లేదు స్వామీజీ! ఈ రోజు మధ్యాహ్నం భోజనం తర్వాత విశ్రమిస్తున్నప్పుడు శ్రీరాముడు నాకు కలలో కనబడి...

మిగతా 36వ పేజీలో...

# మనస్సుకు ఓ నమస్సు!

మనసు కామ క్రోధాలతో నిండి, అతి శిథిలమై ప్రవర్తిస్తోంది. అన్ని వేళల్లో, దోష దుర్గంధాలతో కూడుకొన్న విషయానుభవాల కోసమే పరుగులు తీస్తోంది. పెద్దలు చెప్పే మార్గాన్నీ, సత్కార్యాల్నీ స్వీకరించమన్నప్పుడల్లా మొరాయిస్తోంది. దీని కదలికలు నెమలి పింఛపు తుదికొనలా అతి చంచలం.

మీరు వీధికుక్కను చూశారు కదా! అది ఏ పనీ లేకపోయినప్పటికీ వీధులలో అటూ ఇటూ తిరుగుతూ, ఆయాసపడుతుంటుంది. అలాగే, ఈ మనస్సు కూడా నిరర్థకంగా, నిష్కారణంగా, నిష్ప్రయోజనకరంగా అన్ని వేళల్లో 'అటూ ఇటూ' తిరుగుతుంది. దురాశల వలలో చిక్కుకొన్న మనసుకు 'తృప్తి' అన్న మాట ఎక్కడిది? జల్లెడలో నీరు పోస్తుంటే నిండేదెప్పటికి చెప్పండి!



ఒక పదార్థాన్ని మనం ప్రీతిపూర్వకంగా ఆశ్రయించినప్పుడు మన మనోచిత్తాలు ప్రవర్తిస్తున్నాయి.

ప్రీతి కలిగియుండే స్వభావం = చిత్తం; మననము చేసే స్వభావం = మనస్సు.

ఈ మనస్సులో 'చిత్తవృత్తులు' అనే సుడిగుండాలున్నాయి. క్రూరత్వం, పరవంచన, దురభ్యాసం మొదలైనవి ఇందులో యథేచ్ఛగా సంచరిస్తున్నాయి.

మహాత్మా! నూతిలోకి దింపబడిన ఏతామును దానికి కట్టిన త్రాడు క్రిందకి పైకి తిప్పుతూనే ఉంటుంది చూశారా? మేము కూడా భోగవాంఛలతో, కామక్రోధాలతో కూడుకొన్నవాళ్ళమై మూడులోకాల్లో మనస్సుతో తిప్పబడుతున్నాం. ఈ మనస్సును పట్టుకొని నియంత్రిద్దామా అంటే... దీనికి ఒక రూపమే లేదు! తమ లాంటి జ్ఞానులు "మనస్సు అనబడు ఒకానొక వస్తువు లేదు. దానికి అస్తిత్వమే లేదు" అని చెబుతూ ఉంటారు.

ఈ చిత్తం క్రోధాగ్నిజ్వాలలతో నన్ను కాల్చి వేస్తోంది. ఇది అగ్ని కన్నా వేడి. కొండ కన్నా కఠినం. దీన్ని మేము అసలు జయించగలమంటారా? స్వల్ప వస్తువుల కోసం పరుగెత్తుతూ, స్వల్పత్వాన్నే పొందుతూ, నరకాదుల రుచి ఏమిటో మళ్ళీ మళ్ళీ చూపించే ఈ చిత్తం యొక్క గమనాన్ని నిరోధించటమెలాగో చెప్పండి?

ఒక సింహాన్ని ఉత్తచేతులతో బంధించవచ్చునేమో, సముద్ర జలాన్నైనా పానం చెయ్యవచ్చునేమో, హిమాలయ పర్వతాన్ని కూడా పెకలించవచ్చునేమో, అగ్నినైనా భక్షించవచ్చునేమో! కానీ ఈ చిత్తాన్ని నిరోధించడం మాత్రం అంత తేలికైన విషయం కాదు. ఇది అవివేకాన్ని ఆశ్రయించి ఉండడం వల్ల అన్ని ఉపాధుల్లోనూ ఏకస్థమై ఉన్న 'ఆత్మ' దీనికి ఏ మాత్రం కనిపించడం లేదు. ఏం తెలుసుకొన్నా, ఎంత బోధించినా ఎల్లప్పుడూ భేదభావాన్నే పొందుతోంది. సామ్య సమతా భావాల్ని హరించివేసి, దుఃఖాలను కలిగించడంలో ప్రావీణ్యం చూపుతోంది. అనేక విషయాలలో అంతులేని ఆసక్తిని కల్పించుకొని, అందులో జడత్వం వహించి నిదురపోతోంది. ఎంతలేపినా నిదుర లేవదు. సామరస్య పూర్వకమైన ఆత్మజ్ఞానం కోసం ఏ మాత్రం ప్రయత్నం చేయదు. ఇప్పుడు నేనేం చేయాలో నాకు అర్థమవడం లేదు.

ఈ మనస్సే అంతటికీ కారణం. ఇది క్షీణిస్తే లోకాలు క్షీణిస్తాయి. విజృంభిస్తే లోకాలు కూడా విజృంభిస్తాయి. కొండపై అడవులు పెరుగుతున్నట్లు, సర్వ సుఖదుఃఖాలు ఈ మనస్సు నుండే బయలుదేరుతున్నాయి. ఆచార్యులు ఎంత బోధించినా, ఇది తన జాడ్యాన్ని త్యజించడం లేదు. క్రూరుడైన పోకిరివాడు పసిబాలుణ్ణి బెత్తము చూపించి బెదిరిస్తున్నట్లు ఇది నన్ను బెదిరిస్తోంది. ఈ 'మనస్సు' అనే వ్యాధికి ఉత్తమమైన ఔషధం వివేకమే కదా! అలాంటి ఔషధంతో ఇది క్షీణిస్తే సుఖ దుఃఖ వికారాలు కూడా క్షీణిస్తాయి. a

('శ్రీవసిష్ఠ రామ సంవాదం' – వైరాగ్య ప్రకరణం నుంచి)

**అనువాదం: వై. హెచ్. రామకృష్ణ**

# ఆధ్యాత్మిక అన్వేషణ




- స్వామి తపస్యానంద

**ప్రశ్న:** భగవత్సాక్షాత్కారం పొందడానికి ప్రపంచాన్ని త్యజించాలా? ప్రపంచాన్ని పూర్తిగా పరిత్యజించిన తరువాత తప్పక భగవత్సాక్షాత్కారం లభిస్తుందా?

**జవాబు:** భగవత్సాక్షాత్కారం అనేది భగవంతుడి అవ్యాజ కృప వల్ల లభిస్తుందే తప్ప, దాన్ని మూల్యమిచ్చి పొందలేం. ఆధ్యాత్మిక అన్వేషణలో ప్రతిగా ఏదో పొందాలనే స్వభావాన్ని వదిలిపెట్టాలి. ప్రాపంచిక విషయాలను పరిత్యజించడం అన్నది ఆధ్యాత్మిక జీవితంలో ముఖ్యమైన దశ అని నిస్సందేహంగా చెప్పవచ్చు. అయితే అతడు ప్రాపంచిక విషయాలకు పూర్తిగా దూరమయ్యాడని ఎవరూ చెప్పలేరు. గ్రహించడానికి వీలు కాని అతి సూక్ష్మ అంశం అది. ఉదాహరణకు ఒక వ్యక్తి బాహ్యంగా సంపదలన్నీ విడిచిపెట్టి ఏకాంతంలో ఉండవచ్చు, అయినా అతని మనస్సు మారుమూలల్లో అతనికి తెలియని కోరికలెన్నో ఉండవచ్చు. అంతేకాకుండా తానొక గొప్ప పరిత్యాగిని అన్న భావనే స్వల్ప లౌకికత. ఒక వ్యక్తికి తనకు సంపదలున్నాయనే గర్వం ఎలా ప్రతిబంధకమవుతుందో, అలాగే తాను గొప్ప విరక్తుణ్ణి, లేక సమస్తం పరిత్యజించాను అన్న భావనతో అభిమానం ప్రారంభమై అతడిలో అహాన్ని పెంచుతుంది. ప్రాథమికంగా మనం విడిచిపెట్టాల్సింది "నేను, నాది" అన్న భావనను (మనలోని అహాన్ని)! ప్రాపంచిక జీవితాన్ని పరిత్యజించడం అనేది దానికి మొదటి మెట్టు. అది సంపదలనూ, కోరికలనూ పరిత్యజించడానికి పరాకాష్ఠ. మనలోని అల్పమైన అహాన్ని పరమాత్మకు అప్పగించి, భగవంతుడు తప్ప మరో ఆధారం లేనివారమవ్వాలి.



సాధనలో లౌకికతను పూర్తిగా పరిత్యజించి, అపారమైన శాంతిని అలవరచుకోవాల్సిన ఆవశ్యకతను తెలియజేసే చిన్న కథనొకదాన్ని శ్రీరామకృష్ణులు చెప్పేవారు: "ఒకమారు నారదమహర్షి శ్రీమహావిష్ణువు దర్శనార్థం వైకుంఠానికి వెళుతున్నాడు. తోవలో తీవ్రమైన జపధ్యానాదులు చేసే ఒక సాధువు కనపడ్డాడు. నారదుడు వైకుంఠానికి వెళుతున్నట్లు తెలిసి, తనకు ముక్తి లభించడానికి ఇంకా ఎంత కాలం పడుతుందో అడగమన్నాడు. నారదుడు ముందుకు సాగుతుంటే సాధారణ జీవితం గడుపుతున్న ఇంకో మనిషి కనపడ్డాడు. అతను కూడా తనకు ముక్తి ఎప్పుడు లభిస్తుందో శ్రీమహావిష్ణువును అడగమన్నాడు.

వైకుంఠం వెళ్ళి తిరిగి వస్తూ, నారదుడు తన సమాధానం కోసం ఎదురుచూస్తున్న సాధువును కలిశాడు. నారదుడు ఆ సాధువుతో, అతడికి మరో ఏడు జన్మల తరువాత ముక్తి లభిస్తుందని మహావిష్ణువు చెప్పినట్లు తెలియచేశాడు. ముక్తి కోసం అంత కాలం వేచి ఉండాలని తెలిసిన సాధువు దుఃఖించాడు.



ఇక నారదుడు రెండో వ్యక్తిని కలిసి, అతనికి ముక్తి లభించడానికి పక్కనే ఉన్న చింత చెట్టుకు ఎన్ని ఆకులు ఉన్నాయో అన్ని జన్మలు అతడు ఎత్తాల్సి ఉంటుందని తెలియజేశాడు. భగవంతుడి అభీష్టం అదే అయితే అంతవరకూ నిరీక్షించడం తన అదృష్టం అంటూ అతను ఏ మాత్రం విచారించకుండా ఆనందంతో గంతులు వెయ్యసాగాడు. వెంటనే "నీలో పరిత్యాగం, తితీక్ష అన్న గుణాలున్నాయి. నీకు ఇప్పుడే ముక్తి లభిస్తుంది" అని అశరీరవాణి పలికింది."

కాబట్టి, సాధనలో లౌకికతను పూర్తిగా పరిత్యజించి, భగవంతునిపై అపారమైన విశ్వాసాన్ని అలవరచుకోవాలి. ఈ కథ ఆ సంగతే స్పష్టం చేస్తోంది.

పురాణాలు వర్ణించిన ముప్పైమూడు కోట్ల దేవతల్లో మీకు విశ్వాసం ఉన్నా,
మీపై మీకు విశ్వాసం లేకపోతే విముక్తి లేదు. - స్వామి వివేకానంద

# 2008



**JANUARY**

| SUN | MON | TUE | WED | THU | FRI | SAT |
|---|---|---|---|---|---|---|
| | | 1 | 2 | 3 | 4 | 5 |
| 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
| 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 |
| 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 |
| 27 | 28 | 29 | 30 | 31 | | |

**FEBRUARY**

| SUN | MON | TUE | WED | THU | FRI | SAT |
|---|---|---|---|---|---|---|
| | | | | | 1 | 2 |
| 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
| 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 |
| 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 |
| 24 | 25 | 26 | 27 | 28 | 29 | |

**MARCH**

| SUN | MON | TUE | WED | THU | FRI | SAT |
|---|---|---|---|---|---|---|
| 30 | 31 | | | | | 1 |
| 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 |
| 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 |
| 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 |

**APRIL**

| SUN | MON | TUE | WED | THU | FRI | SAT |
|---|---|---|---|---|---|---|
| | | 1 | 2 | 3 | 4 | 5 |
| 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
| 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 |
| 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 |
| 27 | 28 | 29 | 30 | | | |

**MAY**

| SUN | MON | TUE | WED | THU | FRI | SAT |
|---|---|---|---|---|---|---|
| | | | | 1 | 2 | 3 |
| 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
| 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 |
| 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 |
| 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 |

**JUNE**

| SUN | MON | TUE | WED | THU | FRI | SAT |
|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
| 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 |
| 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 |
| 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 |
| 29 | 30 | | | | | |

**JULY**

| SUN | MON | TUE | WED | THU | FRI | SAT |
|---|---|---|---|---|---|---|
| | | 1 | 2 | 3 | 4 | 5 |
| 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
| 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 |
| 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 |
| 27 | 28 | 29 | 30 | 31 | | |

**AUGUST**

| SUN | MON | TUE | WED | THU | FRI | SAT |
|---|---|---|---|---|---|---|
| 31 | | | | | 1 | 2 |
| 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
| 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 |
| 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 |
| 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 |

**SEPTEMBER**

| SUN | MON | TUE | WED | THU | FRI | SAT |
|---|---|---|---|---|---|---|
| | 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 |
| 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 |
| 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 |
| 28 | 29 | 30 | | | | |

**OCTOBER**

| SUN | MON | TUE | WED | THU | FRI | SAT |
|---|---|---|---|---|---|---|
| | | | 1 | 2 | 3 | 4 |
| 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 |
| 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 |
| 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 |
| 26 | 27 | 28 | 29 | 30 | 31 | |

**NOVEMBER**

| SUN | MON | TUE | WED | THU | FRI | SAT |
|---|---|---|---|---|---|---|
| 30 | | | | | | 1 |
| 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 |
| 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 |
| 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 |

**DECEMBER**

| SUN | MON | TUE | WED | THU | FRI | SAT |
|---|---|---|---|---|---|---|
| | 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 |
| 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 |
| 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 |
| 28 | 29 | 30 | 31 | | | |

SRI RAMAKRISHNA PRABHA, Ramakrishna Math, Domalguda, Hyderabad-500 029, Ph : 040-2766 7799



# వివేకానంద విద్యార్థి భవన్

రామకృష్ణమఠం, ధన్‌తోలీ, నాగపూర్ - 440 012,
ఫోన్: 2423422, 2432690, ఫాక్స్:2437042
email: rkmath_ngp@sancharnet.in



## విన్నపం

ప్రియ భక్తులకు, మిత్రులకు,

నమస్కారం, శుభాభివందనలు!

నాగపూర్, ధన్‌తోలీలోని రామకృష్ణమఠం ఆశ్రమం ప్రారంభించినప్పటి నుంచీ అనేక సేవా సహాయ కార్యక్రమాలు నిర్వహిస్తోంది. వాటితో పాటు కళాశాల యువకుల కోసం 'వివేకానంద విద్యార్థి భవన్' అనే వసతి గృహాన్ని నిర్వహిస్తోంది. మా మఠం ప్రారంభించిన సేవా కార్యక్రమాల్లో ఇది మొదటిది.

విద్యార్థి భవన్‌లో ఉండే విద్యార్థుల సంపూర్ణ వ్యక్తిత్వ వికాసానికై తోడ్పడడం ఈ సంస్థ లక్ష్యం. ఈ లక్ష్యసాధనలో క్రీడలలో శిక్షణ నివ్వడం; సామూహిక చర్చలు నిర్వహించడం; వక్తృత్వం, నీతి సూత్రాలు, ఆధ్యాత్మిక అంశాలలో విషయ పరిజ్ఞానాన్ని అధికం చేయడం లాంటి వివిధ అంశాలలో విద్యార్థులను సుశిక్షితుల్ని చేస్తున్నాం.



వివేకానంద విద్యార్థి భవన్ నమూనా

గత కొద్ది సంవత్సరాలుగా స్థలాభావం వల్ల అనేక మంది పేద విద్యార్థులకు వివేకానంద విద్యార్థి భవన్‌లో ప్రవేశం లభించక, వారు నిరాశకు గురి అవుతున్నారు.

అందువల్ల గ్రామీణ పేద కుటుంబాలకు చెందిన 50 మంది విద్యార్థుల కోసం కొత్త విద్యార్థి భవన నిర్మాణాన్ని చేపట్టాం.

2007 జనవరి 22వ తేదీ సోమవారం ఉదయం 9.30గం॥లకు రామకృష్ణమఠం, రామకృష్ణమిషన్‌ల అప్పటి ఉపాధ్యక్షులు శ్రీమత్ స్వామి ఆత్మస్థానందజీ మహరాజ్ ఈ కొత్త విద్యార్థి భవన్‌కు శంకుస్థాపన చేశారు.

### సూచించిన ప్రణాళికలోని వివరాలు:

| | | |
|---|---|---|
| పొడవు, వెడల్పు | - | 121'×62' |
| అండర్‌గ్రౌండ్ ఫ్లోర్ | - | 30'×36' |
| ఆడిటోరియమ్ | - | 29'×47' |
| లైబ్రరీ | - | 29'×60' |
| వ్యాయామశాల | - | 29'×11' |
| వంట,భోజనాల గది | - | 29' × 60' |

మొత్తం ప్రణాళిక కయ్యే ఖర్చు సుమారు కోటి అరవై ఎనిమిది లక్షల రూపాయలు. దీని కోసం మేము ఉదారులైన భక్తులు ఇచ్చే విరాళాలపైనే ఆధార పడుతున్నాం. భక్తులూ, శ్రేయోభిలాషులూ ఉదారంగా విరాళాలిచ్చి ఈ ప్రణాళికకై తోడ్పడి పేద విద్యార్థులకు సహాయ పడగలరని ఆశిస్తున్నాం. భగవాన్ శ్రీరామకృష్ణులు మీ అందరినీ అనుగ్రహించు గాక!

విరాళాలను 'Ramakrishna Math, Nagpur పేరున డిడి/చెక్కుల రూపంలో Ramakrishna Math Dhantoli, Nagpur - 440 012 కు పంపవలసిందిగా మనవి. విరాళాలకు సెక్షన్ 80-జి కింద ఆదాయపు పన్ను మినహాయింపు కలదు. విదేశీ కరెన్సీ రూపంలో కూడా విరాళాలు ఇవ్వవచ్చు.

శ్రీరామకృష్ణుల సేవలో

**స్వామి బ్రహ్మస్థానంద**
అధ్యక్షులు



# ప్రగతికి సోపానం స్వప్రయత్నం

– షేక్. గౌస్ సాహెబ్

ఆకులు రాలడానికి ఒక ఋతువు ఉంటుంది. పూలు వాడిపోవడానికి ఒక సమయముంది. సూర్యుడు ఉదయించి, అస్తమించడానికి ఒక సమయముంది. కానీ మృత్యువు రాకకి సమయమేదో తెలియదు. కనుక మానవుడు సత్కార్యాలు చేయడంలో ఆలస్యం చేయరాదు.

స్వప్రయత్నం వలన మార్కండేయుడు మృత్యువును జయించాడు. స్వప్రయత్నం వలన ఉద్దాలకుడు నిర్వికల్ప సమాధినొందాడు. స్వప్రయత్నం వలననే సావిత్రి తన భర్త ప్రాణాలను తిరిగి తెచ్చింది. స్వప్రయత్నం వలననే అబ్రహాంలింకన్ అమెరికా అధ్యక్షుడు కాగలిగాడు. స్వప్రయత్నం వలననే డాక్టర్ అంబేద్కర్ మహామనిషి కాగలిగాడు. కనుక మానవ ప్రయత్నం వలన సాధించలేనిది ఏదీలేదు. దీనిని ఆర్యులు "కృషితో నాస్తి దుర్భిక్షం జపతోనాస్తి పాతకః" అన్నారు.

లక్ష్యసాధనకు ఉన్నత ఆశయం, అవిరళ కృషి, దృఢ సంకల్పం, సరి అయిన ప్రణాళిక, సహనం, స్థైర్యం, త్యాగం, దీక్షాదక్షతలు, అకుంఠిత పరిశ్రమ అవసరం. యోగి వేమన ఇలా తెల్పుతున్నారు.

వ్రాతవెంటగాని వరమీడు దైవంబు
సేత కొలదిగాని వ్రాతకాదు
వ్రాత కజుడు కర్త, సేతకు తాకర్త
విశ్వదాభిరామ వినురవేమ!

మొదట విధేయతను అలవరచుకోవాలి. మనలో విధేయత ఉంటే ఆజ్ఞాపించే అర్హత దానంతటదే వస్తుంది. నువ్వు హాయిగా బ్రతుకు. ఇతరులు కూడా అలా బ్రతకడానికి వీలు కల్పించు. ఆంగ్లంలో "Live and let live" అని అంటారు.

ఓర్పు అనే ఆయుధం ఎవరి చేతిలో ఉంటుందో అలాంటి వారిని దుర్జనులేమీ చేయలేరు.

గ్రుడ్లగూబ పగలు చూడలేదు. కాకి రాత్రి చూడలేదు. అయితే కామాంధుడు పగలు రాత్రి రెండు వేళలా చూడలేదు.

నేడు నీతిమంతులైన విద్యావంతులు కావాలి. శీలాన్ని పెంచే విద్యనేర్పాలి. సత్‌పౌరులై సమసమాజం కోసం పాటుపడాలి. శీలంతో కూడిన విద్యను గడించినవారు ఎల్లప్పుడూ పరుల ధన మాన ప్రాణాలను కాపాడడానికి ప్రయత్నిస్తుంటారు.

జాతి, కుల భేదాల్లో సంస్కృతి పరిణామం చెందినట్లు కనిపించినా లోతుగా పరిశీలిస్తే అది పైపై పరిణామం మాత్రమేనని తెలుస్తోంది. విభిన్నమతాలు జాతులు ఉన్నట్లే విభిన్న సంస్కృతులు ఉండవచ్చు. కానీ సజాతీయమైన సంస్కృతి తన ఆధిక్యతను నిరూపించుకుంది. ఏ సంస్కృతికీ విఘాతం కలుగకుండా విభిన్న సంస్కృతులలో ఏకత్వం కలిగి ఉండటమే భారతీయ సంస్కృతి విశిష్టత. వైవిధ్యాల్లో ఏకత్వం చాటిస్తుంది. ఒక జాతి నిర్వీర్యం కాకుండా ఆత్మ బలాన్ని సమకూర్చుకోవడానికి సంస్కృతి తోడ్పడుతుంది. ప్రజాజీవితం ప్రశాంతంగా సాగాలంటే సంస్కృతీ, సంస్కారాలే మూలాధారమని వివేకానందుడు, విశ్వకవి ఠాకూరు భారతీయ సంస్కృతి వైభవాన్నీ, ఔన్నత్యాన్నీ ప్రపంచానికి చాటి చెప్పారు. విశ్వజనీనమైన ఆశయాలనూ, సంస్కృతినీ ఎన్ని ఆటుపోటులు వచ్చినా తట్టుకొని నిలబడగల అమృతతుల్యమైన, అజరామరమైన ఆ సత్యాలని త్యాగధనులు, సంఘసేవా పరాయణులు విశ్వసించి, ఆచరించి ప్రచారం చేయాలి.

# ఆనందమే పరమావధి !

- శ్రీరామ్

భగవంతుడంటే ఎవరు? ఆయన అసలున్నాడా! ఉంటే ఎక్కడ! అనే అంతులేని ఆస్తిక, నాస్తిక వాదాలతో తలలు బాదుకునే అమాయక ప్రాణులను కాసేపు పక్కన పెడదాం! తర్కానికీ, మానవ మేధా వికాసానికీ విలువనిచ్చే వేదాంతం ఈ ప్రశ్నకు సరళమైన సమాధానాన్ని ఇస్తుంది.

"భగవంతుడు" అనే తత్త్వాన్ని 'సచ్చిదానందం'గా అది అభివర్ణిస్తుంది. "నిజమైన ఆనంద అనుభవం" అని దాన్ని వివరించవచ్చు! బాధలూ, దుఃఖాల బారిన పడాలని ఎవరూ అనుకోరు. సంతోషంగా ఉండాలనే ప్రతివారూ ప్రయత్నిస్తారు. బుద్ధి పూర్వకంగానో, అప్రయత్నంగానో అందరూ ఆ అఖండ సచ్చిదానందం వైపే సాగిపోతున్నారు.

శ్రీ రామకృష్ణులు ఈ ఆనందాన్ని మూడు విధాలు అని చెబుతారు అవి విషయానందం, భజనానందం, బ్రహ్మానందం. సాధారణ ప్రాపంచిక వస్తువుల్లో లభించేది విషయానందం. దాన్ని అనుభవించే కొద్దీ ఆ అనుభూతిని పొందాలనే తాపత్రయం మరింత పెరుగుతుంది. క్రమంగా మనం వాటికి బానిసల్లా మారుతాం! ఇలా క్షణిక సుఖాలుగా మొదలై చివరికి దారుణమైన దుఃఖాలుగా పరిణమించడం వీటి లక్షణం. ఇక భజనలో లభించేది భజనానందం. 'భజన' అంటే ఆనందాన్ని గురించిన చింతన! ఉన్నత, కళాత్మక భావాల్లో మునిగి తేలడం! విద్యావేత్తలు ఆయా రంగాల్లో నిష్ణాతులు వారి పనిలో, కళల్లో, శాస్త్రాల్లో ఇలాంటి అనుభూతిని పొందుతూ ఉంటారు. వాటినే (Intellectual enjoyment) బౌద్ధిక సుఖాలు అనవచ్చు! వీటి కోసం ఆరాటం అధికమయ్యేకొద్దీ వ్యక్తులకు సమాజంలో ఉన్నతి లభిస్తుంది.

ఆధ్యాత్మిక పరులకు ఆరంభంలో కొన్ని పవిత్ర భావనల ఆలంబన అవసరం. అలా ధ్యానంలో పురోగమించే కొద్దీ విషయ వస్తువుల పట్ల వ్యామోహం నెమ్మదిగా నశిస్తుంది. మనసు పూర్తిగా ఏకాగ్రమైన మరుక్షణం అఖండ అద్వితీయ బ్రహ్మానందం అనుభవంలోకి వస్తుంది. అదే మనందరి ఏకైక లక్ష్యం! తెలిసినా, తెలియక పోయినా జీవులందరి గమ్యస్థానం!

ప్రతి ఒక్కరి జీవితం ఈ మూడు ఆనందాల మిశ్రమమై ఉంటుంది. కానీ అవి ఏ యే పాళ్ళలో కలిసి ఉన్నాయనే విషయం మన జీవన నాణ్యతను నిర్ణయిస్తుంది. స్వామి వివేకానంద మాటల్లో "ఆధ్యాత్మికత అంటే ఆనందంగా ఉండడం. ఉన్నత ఆనందాలవైపు ప్రయాణించడమే జీవిత పరమార్థం. జంతువులు మాత్రమే విషయానందాలను ఆస్వాదిస్తుంటాయి".

విషయానందాల పట్ల ఎక్కువ మక్కువ కలిగిన వారినే అన్ని భౌతిక, మానసిక సమస్యలూ పట్టి పీడిస్తాయన్నది గమనార్హం! విషయానందాల తపన తగ్గి, బౌద్ధిక ఆనందాలపై ఆసక్తి పెరిగితే తప్ప జీవితంలో దేన్నీ సాధించలేం. వ్యక్తిత్వ వికాసం గురించి ఎవరెంత మాట్లాడినా విజయ రహస్యం మాత్రం ఇదే. విషయానందాలను వదలడ మంటే అంతకు మించిన ఆనందాలను పొందడమే! దీన్ని అర్థం చేసుకుంటే, ఆ పని కొంత సులభమవుతుంది! వికసించే బుద్ధికి ఆధ్యాత్మికతను మేళవిస్తే నేటి సమాజంలోని ఒత్తిడి, అశాంతులు దూరమవుతాయి.




- స్వామి పరిజ్ఞేయానంద

**అనూష, శ్రీకాకుళం.**

**ప్రశ్న:** మా ఇంట్లో రోజూ రాత్రి టీ.వీ. చూస్తూవుంటారు. నాకు కూడా వాళ్ళతో పాటూ టీ.వీ. చూడాలనిపిస్తుంది. అందువల్ల నేను చదువు మీద శ్రద్ధ చూపలేక పోతున్నాను. ఏకాగ్రత కుదరాలంటే ఏమి చేయాలో ఓ మంచి సలహా ఇవ్వండి.

**జవాబు:** చదువు ముఖ్యమో, టీ.వీ. చూడడం ముఖ్యమో నిర్ణయించుకోవాల్సింది మీరే. చదువే ముఖ్యం అనుకుంటే టీ.వీ. కంటే చదువుకు ప్రాధాన్యతనివ్వండి. మనం అనుకున్నది సాధించాలంటే పరిస్థితులకు బానిసలం కాకూడదు.

Resolve that you will be master
and not the slave of circumstances *- Orison*

**పి. వినయ్‌రాజ్, భీమిలి.**

**ప్రశ్న:** నా మిత్రునికీ, నాకూ ఈ మధ్య మనఃస్పర్థలు వచ్చాయి. అందువల్ల అశాంతితో మనసు ఏ పనిలోనూ నిమగ్నం కావడం లేదు. నా సమస్యకు పరిష్కారం ఏమిటి?

**జవాబు:** Yesterday is a cancelled cheque.
Tomorrow is a promissory note.
Today is ready cash. Use it అని ఓ అనుభవజ్ఞుడి మాట. కాబట్టి మీ మిత్రునితో వచ్చిన కలహాలను కలవరిస్తూ మీ బంగారు భవిష్యత్తును పాడు చేసుకోకండి. వర్తమానమనే నగదును ఉపయోగించుకోవడం నేర్చుకోండి.

**మేఘశ్యామ్, హైదరాబాద్.**

**ప్రశ్న:** మాది చాలా పేద కుటుంబం. కాలేజీలో ధనవంతులైన నా తోటి మిత్రులను చూసినప్పుడు నాలో ఆత్మన్యూనతా భావం కలుగుతుంది. దీని నుండి బయటపడేదెలా?

**జవాబు:** మన చరిత్ర పుటల్ని ఒక్క సారి త్రిప్పి చూస్తే ఏ మహాత్ముడూ కష్టాల కడలిని ఎదురీదకుండా, ఉన్నత స్థితికి చేరలేదనే విషయం మనకు అర్థమవుతుంది. నేటి యువతకు ఈ విషయం క్షుణ్ణంగా తెలియాలనే 'శ్రీరామకృష్ణ ప్రభ'లో "మహనీయుల జీవితాల్లో మధుర ఘట్టాలు" అనే శీర్షికను ప్రారంభించాం. మన అభివృద్ధికి ఆర్థిక పరిస్థితి ఓ పెద్ద ఆటంకం కాదు. ఇతరులతో పోల్చుకునే తత్త్వం వలనే మనలో అసంతృప్తి అనే అగాధం ఏర్పడుతుంది. మన దురదృష్టాన్ని తలుచుకుంటూ దిగులు చెందకుండా, ఉన్న అవకాశాల్నే మనకు అనుగుణంగా మలచుకుంటే ఉన్నత స్థితికి చేరుకోవచ్చు.

Misfortune comes to do us good in the long run,
although at the time we feel that
we are submerged forever. *- Swami Vivekananda*

చార్లెస్ డికెన్స్ ఓ గొప్ప రచయిత. ఆయనదీ ఓ పేద కుటుంబమే! ఒకసారి బ్రిటన్‌లో జరిగిన 'పతంగోత్సవం' (Kites Festival)లో పాల్గొన్నాడు. అక్కడ తన తోటి స్నేహితులంతా రంగు రంగుల గాలిపటాల్ని ఎగురవేస్తున్నారు. డికెన్స్ దగ్గర పాతది, చిరిగిపోయిన ఓ గాలిపటం మాత్రమే ఉంది. డికెన్స్‌ను చూసి హేళనగా ఓ మిత్రుడు "నా దగ్గర ఎన్ని గాలిపటాలు



ఉన్నాయో చూడు!" అని అన్నాడు. డికెన్స్ "నాదగ్గర ఉన్నది ఒకే గాలిపటం. కానీ ఎగరవేయడానికి అనంతమైన ఆకాశం ఉంది" అని నవ్వుతూ సమాధానమిచ్చాడు. తన మిత్రుని దగ్గర ఉన్న రంగురంగుల గాలిపటాల్ని చూసి డికెన్స్ బాధ పడలేదు. అతడే తరువాతి కాలంలో 'A Christmas Carol' అనే నవలను వ్రాసి, దానిపై వచ్చిన ఆదాయాన్ని పేదల సంక్షేమం కోసం వినియోగించాడు.

కాబట్టి మనం అలాంటి మహాత్ముల బాటలో పయనిస్తే బీదరికాన్ని శాపంగా కాకుండా, ఓ వరంగా భావించగల శక్తి మనలో కూడా వస్తుంది.

మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా:
**యువవాణి**
శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,
దోమల్ గూడ, హైదరాబాద్ - 500 029
E- mail : rkprabhayuvavani@gmail.com

# కాకిలా కలకాలం...!?

- అమిరపు నటరాజన్

మహాభారతంలో సంజయుడు అనే ఒక యువరాజు కథ ఉంది. ఇతడు భగవద్గీతలో కనిపించే సంజయుడు కాదు. ఉత్తరసింధూ ప్రాంతానికి చెందినవాడు. ఇతడు ఒకసారి యుద్ధంలో ఓడిపోయి, చాలా నిరుత్సాహపడి, ఏ పనీ చెయ్యకుండా కూర్చున్నాడు. అతడే గనుక యుద్ధంలో గెలిచి ఉంటే చాలా ఆనందపడి ఉండేవాడే! కానీ ఓడిపోయేసరికి నిస్తేజంగా తయారయ్యాడు. అతడి తల్లి పేరు విదుల. ఆమె ఒక ధీర వనిత. ఆ తల్లి తన కొడుకుతో, "ఇలా క్రుంగిపోయిన మనస్సుతో ఉండకూడదు,



పౌరుషంతో, బలవంతుడివై ఉండు! అపజయాలు కలిగినా, జయాలు కలిగినా నీవు వాటి వలన ప్రభావితం కాకూడదు. అవి సముద్రంలో అలల లాంటివి. నువ్వు వాటిని అధిగమించగలగాలి" అని బోధించింది. తరువాత ఆ రాజమాత విదుల కొద్దిమాటలలో బ్రహ్మాండమైన అర్థాన్ని ఇమిడ్చి ఇలా చెప్పింది.

***"ముహూర్తం జ్వలితో శ్రేయో నతు ధూమాయితం చిరం!"***

'యుగాల తరబడి పొగలు చిమ్ముతూ ఉండేకంటే ఒక్క క్షణంపాటు మహోజ్జ్వలంగా వెలుగులు వెదజల్లడమే గొప్ప' అని ఆమె బోధించింది. ఇది ఎంత గొప్ప సందేశమో చూశారా! ప్రతి మానవుడూ దీనిని నేర్చుకోవాలి. యుగాల తరబడి పొగలు గ్రక్కుతూ ఉండడంలో గొప్ప తనం ఏముంది? ఒక్క క్షణం పాటు బ్రహ్మాండంగా, మహోన్నతంగా జ్వలించండి! జీవించేది కొద్దికాలమే అయినా ఘనకార్యాలు సాధించండి!

"కాకై కలకాలం బ్రతికే కన్నా, హంసై ఆర్నెల్లు బ్రతకడం మేలు!" అన్న సామెత మనందరికీ తెలిసినదే! ఏది పడితే అది తినే కాకిలాగ కాక, పాలనుండి నీటిని వేరుచేసే శక్తి గలిగిన హంసలాగ, కొద్దికాలమే అయినా విచక్షణతో జీవించాలన్నదే ఈ సామెత ఇచ్చే సందేశం.

ఉడుముండదె నూరేండ్లును,<br>
పండియుండదె పేర్మి పాము పదినూరేండ్లున్<br>
మడుగున కొక్కెర యుండదె,<br>
కడునిల పురుషార్థపరుడు కావలె సుమతీ!

అన్న సుమతీ శతకపద్యం మనందరికీ శిరోధార్యం. ఉడుము నూరేళ్ళు బ్రతుకుతుంది. నోటి దగ్గరకు వచ్చిన జంతువును పట్టి తిని అక్కడే పడివుండే కొండచిలువ వెయ్యేళ్ళు బ్రతికినా ఆశ్చర్యపోనక్కరలేదు. సరీసృపాలయిన పాములు, తాబేళ్ళు సుదీర్ఘకాలం బ్రతుకుతాయన్నది అందరికీ తెలిసిన సత్యమే. కొక్కెర (అంటే కొక్కిరాయి, కొంగ) కూడా మడుగులో చేపలు పట్టి తింటూ చాలాకాలం బ్రతుకుతుందట. ఇలా కేవలం నిరర్థకంగా బ్రతుకీడ్చడం వల్ల ఎటువంటి ప్రయోజనం లేదనీ, బ్రతికిన కొద్దికాలమైనా సార్థకమైన జీవితాన్ని గడపాలనీ, పురుషార్థాన్ని (మోక్షాన్ని) సాధించాలనీ ఆ పద్యం ఉద్బోధిస్తుంది.

శంకరాచార్యుల వారు 32 సంవత్సరాలు మాత్రమే జీవించారు. అయితే ఆయన తన జీవితకార్యాన్ని ఎంత తీవ్రతతో నేరవేర్చారంటే అది యావత్ భారతదేశం యొక్క ఆలోచనాధోరణినే పూర్తిగా మార్చివేసింది. ఈ ఆధునిక యుగంలో స్వామి వివేకానంద కూడా 39 సంవత్సరాలు మాత్రమే జీవించారని మనకు తెలుసు. వారు ఎంత తీవ్రమైన, మహత్తరమైన జీవితాన్ని గడిపారో వారి జీవిత కథలలో మనం చదువవచ్చు. వారి జీవిత కాలం స్వల్పమే అయినా, వారి సందేశం ఆధునిక ప్రపంచపు గమనాన్నే మార్చివేసిందన్న విషయంలో వివాదానికి ఏ మాత్రం తావు లేదు.

కాబట్టి మన జీవితానికి ఒక గమ్యాన్ని ఎంచుకుని దాని కోసం విడువకుండా కష్టించి పనిచేద్దాం! a

- ఆర్. కృష్ణ



# అపర ధన్వంతరి

ఎదురైన దురదృష్టకర సంఘటనలకు బాధపడుతూ నిరాశ నిస్పృహలతో కాలం వెళ్ళబుచ్చేవారు కొందరైతే, ఆ నిరాశ నుంచే నిబ్బరాన్ని పెంచుకొని స్వయంకృషితో ఆణిముత్యాలుగా వెలుగొందుతారు మరికొందరు. తమకు ఎదురైన చేదు అనుభవం మరొకరి తలుపుతట్టకూడదనే సహృదయంతో, సంకల్పంతో శ్రమిస్తారు. సమాజానికి గొప్ప మేలు చేసి చూపుతారు. ఈ కోవకే చెందుతారు డాక్టర్ యల్లాప్రగడ సుబ్బారావు. ఆయన తన కృషి ఫలితంగా ప్రపంచ వైద్యరంగ చరిత్రలో అనితర సాధ్యమైన, అత్యంత అరుదైన స్థానాన్ని సొంతం చేసుకున్నారు. ఎన్నో అపూర్వ ఔషధాలను వెలికితీశారు. మానవాళి మనుగడకు ఔషధుల రూపంలో ఆయన అందించిన సేవలు అనితర సాధ్యాలు.



డాక్టర్ యల్లాప్రగడ సుబ్బారావు పశ్చిమ గోదావరి జిల్లా భీమవరంలోని ఒక నిరుపేద కుటుంబంలో జన్మించారు. ఖర్చుల కోసం చిన్న చిన్న పనులు చేసుకుంటూ చదువు పూర్తి చేశారు. 1913లో మద్రాస్ ప్రెసిడెన్సీ కాలేజీలో విద్యనభ్యసిస్తున్నప్పుడు ఆయనలో ఆధ్యాత్మిక చింతన అలవడింది. రోజూ మద్రాసులోని రామకృష్ణ మఠానికి వెళ్ళేవారు. ఒకసారి రామకృష్ణ మఠానికి వెళ్ళి అక్కడ స్వామీజీతో "స్వామీజీ ! నేను మఠంలో చేరాలనుకుంటున్నాను" అని తన కోరికను వ్యక్తపరిచారు. అందుకు ఆ స్వామీజీ "నీవు సమాజంలో ఉంటూ మానవాళికి ఎంతో సేవ చేయాల్సివుంది" అని ఆయన భవిష్యత్తును వెల్లడించారు. ఆనాటి నుండి సాటి మనిషికి సేవ చేయడమే నిజమైన దైవారాధన అని సుబ్బారావు భావించారు.

సుబ్బారావు చిన్నతనంలో ఆయన సోదరుడు ఫ్లూ జ్వరం బారిన పడి తనువు చాలించాడు. అప్పట్లో ఫ్లూ జ్వరానికి మందు లేదు. ప్రాణాతిప్రాణంగా ప్రేమించే తన సోదరుని మరణం సుబ్బారావును కలిచివేసింది. 'ఈ సమస్యకు పరిష్కారం కనుగొనాలి. నా లాంటి బాధ మరొకరికి రాకూడదు' అనే దృఢ సంకల్పాన్ని ఏర్పరచుకున్నారు. పట్టుదలతో ఎం.బి.బి.ఎస్., ఎం.ఎస్‌లు పూర్తి చేసి పరిశోధనలు కొనసాగించారు.

వ్యాధినిరోధక శక్తిగా పనిచేసే ఫోలిక్ ఆమ్లాన్ని కృత్రిమంగా తయారు చేయగలిగారు. వైద్యచరిత్రలోనే అదొక అద్భుత ఆవిష్కరణ. అదేవిధంగా ఫ్లూ జ్వరం నుంచి జనావళిని రక్షించాలనుకున్న తన చిరకాల స్వప్నాన్ని కూడా సాకారం చేసుకున్నారు.

**అవరోధాల్నే ఆధారంగా చేసుకొని అభివృద్ధి పథంలో పయనించేవాడే మహనీయుడు. అలా తన జీవితంలో పలకరించిన చేదు అనుభవాల క్షేత్రాన్ని సుమధుర సుక్షేత్రంగా మలచారు మన యల్లాప్రగడ సుబ్బారావు. భగవంతుడు మనకు పెట్టే పరీక్షల వెనక మహత్తరమైన పరమార్థం దాగి ఉందని, మనలో అచేతన శక్తులను అవి తట్టిలేపుతాయని నిరూపించారాయన. తన శోకాన్ని గుండెల్లో దాచుకొని మానవాళికి సుఖశాంతుల ఔషధాలిచ్చిన అపర ధన్వంతరి సుబ్బారావు.**

అరోమైసిన్ అనే మందునూ, మరెన్నో ప్రాణాంతక వ్యాధులకు ఔషధాలనూ ఆవిష్కరించారు డాక్టర్ యల్లాప్రగడ సుబ్బారావు. ఆయన నిరంతర కృషి ఫలితంగా మానవాళికి ఎంతో ప్రయోజనం చేకూరింది. తిరుగులేని సామర్థ్యంతో పనిచేస్తున్న 'టెట్రా సైక్లిన్' లాంటి యాంటీ బయాటిక్స్, పుట్టుకతో వచ్చే లోపాలను నివారించే 'ఫోలిక్ యాసిడ్', బోదకాలును తగ్గించే 'హెట్రాజాన్', క్యాన్సర్ చికిత్సకు ఉపయోగించే 'మెథో ట్రెక్సేట్' మొదలైన అద్భుత ఔషధాలను సృష్టించారు.

డాక్టర్ సుబ్బారావు కృషికి లెడర్లీ లేబొరేటరీ వారు సుబ్బారావు గౌరవార్థం ఆయన విగ్రహాన్ని గుజరాత్ రాష్ట్రంలోని బల్సర్‌లో ఉన్న వారి లేబొరేటరీలో ప్రతిష్ఠించారు. దాని క్రింద శిలాఫలకంపై ఆయనను శాస్త్రవేత్తగా, అధ్యాపకునిగా, తత్త్వవేత్తగా , మానవాళి శ్రేయోభిలాషిగా కీర్తించారు. **"విజ్ఞాన శాస్త్రం కేవలం ఆయుష్షును పొడిగిస్తుంది మతధర్మం ఆ జీవితానికి గాంభీర్యాన్ని ప్రసాదిస్తుంది"** అని వ్రాశారు. శాస్త్రవేత్తగా ప్రజలకు నిస్వార్థ సేవలందించిన డాక్టర్ సుబ్బారావు నిజమైన కర్మయోగి. a

**(జనవరి 12న డాక్టర్ యల్లాప్రగడ సుబ్బారావు జన్మదినం)**

యువవాహిని - బి.సైదులు

# విజయపథంలో పయనిద్దాం...

కోటి కలలతో... కొత్త ఆశలతో మన ముంగిట వాలిన నూతన సంవత్సరం కొత్త పుట నిత్యవసంతాలు పూయించాలని ఆశిద్దాం. కాలమనే కావ్యంలో ఓ కొత్త పుట కరదీపికగా వెలిగింది. ఆ పవిత్రపుటలో మన పేరూ లిఖించుకోమని ఆశీస్సులందిస్తోంది. కాని స్వామి వివేకానంద అన్నట్లు ఆత్మవిశ్వాసం ఉన్న కొందరి చరిత్రే ప్రపంచచరిత్ర... ఆ కొందరిలో మనమూ ఒకరం కావాలని మనసారా ఆకాంక్షిద్దాం.

అవే ఉదయాలు... అవే సాయంత్రాలు అనుకుంటూ నిత్యం నిరామయంగా, నిరాశావాదంగా సాగిపోకూడదు. 'Just we are adding years to the Life, but not adding life to the years' మనం కాలానికి అందాన్ని అద్దడంలో, అర్థాన్ని చెప్పడంలో తరచూ విఫలమవుతున్నాం. ఇలా మోడుల్లా మొండిగోడల్లా ఎన్నాళ్ళని బ్రతుకుతాం!

కృష్ణుడు చెప్పినా క్రీస్తు చెప్పినా ఒక్కటే 'ఉద్ధరేదాత్మనాత్మానం'... నిన్ను నీవే ఉద్ధరించుకోమని! ప్రేమించి పెద్దచేసిన తల్లితండ్రులు ఇంటి గడప దాటించే వరకే, పాఠం చెప్పి మార్కులిచ్చే మాస్టార్లు బ్రతుకు దారిచూపేంత వరకే... ఆనక పోరాటమంతా మనదే. ఈ విశాలవిశ్వంలో మనకు మనమే దిశా నిర్దేశకులం. విజయాల అలల సాగరంలో మనకు మనమే మార్గదర్శకులం... సుఖ్ కే సబ్ సాథీ.... దుఖ్ మే నకోయ్... అంటారు సంత్ కబీర్. నిజమే! విజయంలో నీ వెంట నడవని వారంటూ ఉండరు, ఓడితే నిన్ను విడవని వారంటూ ఉండరు. అయినా కన్నీటి జడివానలోనూ మన గుండే మనకు గొడుగు పట్టాలి. 'ప్రతి శిశువు జననమూ, భగవంతుడు ఎంత ఆశాజీవో నిరూపిస్తుంది' అంటారు రవీంద్ర కవీంద్రులు. అంటే ప్రతి ఒక్కరి జన్మకూ ఓ అర్థం... పరమార్థమూ ఉంటాయి. మనం అమృతపుత్రులం. ఏ కారణమూ, కర్తవ్యమూ లేకుండానే ఈ ప్రపంచానికి మనం పరిచయం కాలేదు. ఏ శక్తినీ ప్రసాదించకుండానే ఆ విధాత మనను సృజించనూ లేదు. మనదంటూ, మనకంటూ ఓ నిర్వచనం లేకుండానే ఈ లోకం నుంచి నిష్క్రమిస్తే అంతకు మించిన అవమానం ఇంకొకటి లేదు.

'All power is within you' అని మన అంతరాత్మ పదే పదే చెబుతున్నా పట్టించుకోం. పొరుగువారితో పోల్చుకుంటాం. ఒకరి వేలిముద్రే వేరొకరి వేలిముద్రతో సరిపోలనప్పుడు, మనమెలా నమూనాగా మారగలం? మన కంటూ ఓ శరీరాన్ని, ఓ స్వరాన్ని సృష్టి ప్రసాదించింది. ఆ శరీరాన్ని శ్రీరామ సేతువులా ఘనమైన లక్ష్యానికి సంధానం చేయాలి. ఆ స్వరాన్ని శాశ్వత గంభీర నినాదంగా వినిపించాలి. ఇక తప్పటడుగులు, తడబాట్లు అంటారా! పోరాడుతూ పడి లేచేవాడే, ఈ ప్రపంచంలో గెలిచేవాడు. రిస్క్ లేనిదే ఏ రంగానా రాణించలేము. ఈ లోకం నుంచి నిశ్శబ్దంగా నిష్క్రమించటాన్ని మించిన పెద్ద రిస్క్ మరేదీ లేదు. అలాంటప్పుడు వాడక చిలుముపట్టిన యంత్రంలా నశించటం కన్నా, దివ్య కాంతులతో జ్వలించే కర్పూరంలా కరిగిపోదాం. పరమగమ్యం వైపు ప్రస్థానం సాగిద్దాం.

మహాత్ముడి మాటల్లో చెప్పాలంటే 'గమ్యం ఎంత పవిత్రమో, గమనమూ అంతే పవిత్రంగా ఉండాలి'. అరమరికలు, అడ్డదారులు వీరుల లక్షణం కాదు. '...న హి సుప్తస్య సింహస్య ప్రవిశంతి ముఖే మృగాః'... నిద్రించే సింహం నోటిలోకి లేడి వచ్చి పడనట్లు, గెలుపు తనంతట తానుగా మన తలుపు తట్టదు. అందుకై ఎదురుచూస్తూ కూర్చోవటం అవివేకం. ఎవరెస్టును ఎక్కాలంటే ఆక్సిజన్ ఉండగానే సరిపోదు... ముందు ఆత్మవిశ్వాసం కావాలి. పరుగులు తీసే వయసులో ప్రపంచమంతా పచ్చగానే కనిపిస్తుంది. ప్రతి సుఖాన్ని స్వీకరించాలనే అనిపిస్తుంది. కాని ఆ మిణుగురుల వెలుగులు మన కళ్ళను ఎంత మసకబారుస్తాయో తెలుసుకోం. శాశ్వత కాంతి పుంజం నుంచి మనను దారి తప్పిస్తున్నాయని విస్మరిస్తాం. కాలం మన కళ్ళ ముందు నుంచి లేడిపిల్లలా జారుకోక ముందే జాగ్రత్త పడదాం.

'ఉత్తిష్ఠత జాగ్రత... ప్రాప్యవరాన్నిబోధతా... లే మేలుకో లక్ష్యం చేరుకునే వరకు విశ్రమించకు. 'As you have come into this world, leave some mark behind' అని అంటారు స్వామి వివేకానంద. ఎంత కాలం జీవించామన్నది కాదు, ఎలా జీవించామన్నదే ముఖ్యం. ఈ నూతన సంవత్సరం వేయిరేకుల కమలంలా విరబూసి, మన జీవితంలో సాఫల్యాలు పరిమళించాలని, పదుగురి సౌఖ్యం కోసం పాటుపడే సౌభాగ్య వీచికల్ని ప్రసాదించాలని కాంక్షిద్దాం.

**మనసు మైదానం లాంటిది.**
**నిరాశల ఇసుక చల్లితే, ఎడారి అవుతుంది.**
**చిరు ఆశల చినుకు కురిస్తే ,**
**గెలుపు గులాబీలా పూస్తుంది.**



యువవాహిని

# కార్యనిర్వహణలో కౌశలం

– అర్జున్‌రావు

శ్రీరామకృష్ణులు "ఆధునిక యుగంలో సత్యవాక్పరిపాలనే తపస్సు" అన్నారు. ఇది సార్వజనీన సత్యం, ప్రతి ఒక్కరూ ఆచరించతగ్గది. అయితే మనం బయటి ప్రపంచంలోకి వెళ్ళినప్పుడు దీనిని ఎంత వరకూ ఆచరించగలం? ఈ పోటీ ప్రపంచంలో మనం చేపట్టే వృత్తిలోని సవాళ్ళను ఎదుర్కోడానికీ, నైపుణ్యతను పెంపొందించుకోడానికీ నైతిక, ఆధ్యాత్మిక విలువల ప్రాధాన్యత నేడు చర్చనీయాంశంగా మారింది.

మన జీవితాల్లో నైతిక ఆధ్యాత్మిక విలువల్ని ఆచరించి కార్యనిర్వహణలో కౌశల్యాన్ని పెంచుకోవడానికి మనలో ఉండాల్సిన కొన్ని లక్షణాల్ని తెలుసుకుందాం.

**నిర్భయం:** స్వామి వివేకానంద "నిర్భయంగా ఉన్నప్పుడే మీరు అద్భుతాలు సాధించగలరు. భయపడడం మొదలు పెట్టిన క్షణం మీరుండరు" అంటారు. మన వ్యక్తిగత జీవితంలోనూ, వృత్తిపరమైన జీవితంలోనూ ఓ నాయకుడిగానో లేక ఓ నిర్వహణాధికారిగానో ఉన్నప్పుడు నిర్భయత్వం చాలా ముఖ్యం. నిర్భయంగా ఉండండి అని చెప్పడం చాలా సులభం. అయితే ఆ నిర్భయత్వం ఎలా అలవరచుకోవాలి, దాని ప్రభావం ఏమిటి?

సాధారణంగా మనం ఏ పని చేపట్టినా మన మనస్సు మాత్రం ఫలితం మీదే ఉంటుంది. ఫలితం గురించి ఆలోచించకుండా పని చేస్తే ఆందోళన, భయాల వల్ల మనం ప్రభావితులంకాము. అప్పుడే మనం చేసే పనిలో ఆనందాన్ని పొందగలం. మనం చేసే పని ఏకాగ్రతతో చేస్తే నైపుణ్యత పెంపొందుతుంది. కౌశలంతో చేసే పనినే 'యోగం' అంటారు.

**నిజాయతీ:** మూడు సంవత్సరాల క్రితం అమెరికాలోని ఒక ఐ.టి. సంస్థ తమ సంస్థకు భారత్‌లో భాగస్వాముల్ని ఎంపిక చేసుకునేందుకు ఓ బృందాన్ని పంపింది. అప్పటికి మాది చాలా చిన్న సంస్థ. వారు అప్పటికి 6 నెలలుగా భారత్, చైనాలలో సుమారు 25 సంస్థలని సందర్శించి, ఆఖరుగా మా సంస్థకి వచ్చారు. వారు ప్రముఖ సంస్థ అయిన ఇన్‌ఫోసిస్ వైపు మొగ్గుచూపుతున్నారనీ, అయితే ఆ సంస్థ తమ భాగస్వామ్యసంస్థగా ఉండతగినదా అని సందేహిస్తున్నారనీ గ్రహించాను. వారి సందేహాలేమిటో అడగగా వారు మూడు సందేహాలను వెలిబుచ్చి, ఆ మూడూ తప్పితే మిగిలిన విషయాలన్నీ ఆ సంస్థలో తమకు సంతృప్తికరంగా ఉన్నాయన్నారు. అదే వ్యాపారంలో పోటీదార్లం మేము. ఈ అమెరికన్ సంస్థతో భాగస్వాములమవగలిగితే మరొక ఏడు సంవత్సరాల తరువాత మాది దేశంలోనే అతిపెద్ద వ్యాపార ఒడంబడిక అవగలదు. నేను నిష్కామ బుద్ధితో, ఫలితాలను గురించి యోచించకుండా నిజాయతీగా "ఇవే మీ సందేహాలైతే, మీరేమీ ఆలోచించకుండా ఇన్‌ఫోసిస్ సంస్థనే మీ భాగస్వాములుగా చేసుకోండి. గత 25 సంవత్సరాలుగా వ్యాపార రంగంలో ఉన్న సంస్థ అది, మీరు చెప్పిన మూడు అంశాలలో సమర్థంగా లేనట్లైతే వారు ఉన్నత స్థితికి చేరగలిగేవారు కాదు. మీకు ఆ సంస్థ ఆదర్శవంతమైన భాగస్వామ్యాన్ని ఇవ్వగలదు". అన్నాను. (సమావేశం ముగిసాక మా బృందంలోని వారు నేను చేసిన పని బాగులేదు అని అసంతృప్తి చెందారు) నా మనస్సుకి యుక్తంగా ఉంది అనిపించినది నేను వారికి చెప్పాను. ఇక్కడ రెండు విషయాలున్నాయి... ఒకటి నిష్కామ కర్మ, రెండవది నిజాయతీ. మనం నమ్మినదాన్నే మనం చెప్పాలి. వారం రోజుల తరువాత ఆ అమెరికన్ సంస్థ మా సంస్థనే తమ భాగస్వాములుగా స్వీకరిస్తున్నట్లు తెలిపింది. అయితే ఒక్కోమారు నిష్కామకర్మని ఆచరణలో పెట్టేటప్పుడు కథ సుఖాంతం అవదు. అయినా మనం నిరుత్సాహ పడకూడదు.

**నిశ్చల మనస్సు :** ఆధ్యాత్మిక విలువల గురించి చెప్పేటప్పుడు సమదర్శనం, సమచిత్తం ఎలా కొనసాగించడమో చెప్తారు. బయటి పరిస్థితులెలా ఉన్నా

మానసికంగా ఎలా ప్రశాంతంగా ఉండాలి? స్వామి రంగనాథానందజీ ఉపన్యాసాలలో వారు మానసిక స్థిరత్వాన్ని కొనసాగించడం గురించి వివరిస్తారు. భూమి మీద ఉన్న ప్రాణులన్నిటి కన్నా మనిషి ఎంతో అభివృద్ధిచెందాడు. వెలుపలి ఉష్ణోగ్రత, వాతావరణం ఎలా ఉన్నా మనశరీరం లోపలి ఉష్ణోగ్రత నిలకడగా ఉండేటట్లు అంతర్గతమైన శరీర నిర్మాణం ఉంది మనకు. దీనివలన మన శరీరంలోని అవయవాలు నైపుణ్యంగా పనిచేస్తాయి. స్వామి రంగనాథానందజీ దీనికి సమానాంతరమైన మానసిక స్థిరత్వాన్ని కూడా అలవరచుకోవాలంటారు. శరీర నిర్మాణం ప్రకృతి ఇచ్చిన వరమైతే, మానసికమైన నిశ్చలతని మనం ప్రయత్నించి అలవరచుకోవాలంటారు వారు. మనల్ని మనముందే ఎవరైనా దూషిస్తున్నా, పొగుడుతున్నా మనం నిశ్చలంగా ఉండగలమా? కామం, క్రోధం, లోభం, ఈర్ష్య, అసూయ వంటి ఉద్వేగాలకి లోనయ్యే మనం ఈ మానసిక స్థిరత్వ స్థితని కొనసాగించగలమా? మన వలన అది సాధ్యమేనా? నిర్వహణాధి కారిగానో, నాయకునిగానో అవ్వాలి అనుకోగానే ముందుగా మనని మనం అదుపులో ఉంచుకోవడం నేర్చుకోవాలి. విజయవంతంగా లక్ష్యాన్ని సాధించిన వారిలో ఎక్కువమంది నిశ్చల మనస్కులే.

**నిస్వార్థం :** నిజమైన నాయకులం కాదలిస్తే నిస్వార్థ బుద్ధిని అలవరచుకోవాలి. మనలోని అహం దీనికి మార్గనిరోధకంగా తయారవు తుంది. మనం కేవలం మన గురించే ఆలోచిస్తుంటాం. మనం లేకుంటే ప్రపంచమే ఉండదనుకుంటాం. ఎక్కడ మంచి జరిగినా అది మన ఘనకార్యాలవల్లనే అనుకుంటాం. ఇక్కడ మనం గమనించాల్సిన ముఖ్యవిషయం ఏమిటంటే జట్టుగా అందరూ కలసి పని చెయ్యడం వల్లనే ఏమైనా సాధించగలం.

వృత్తి పరమైన సవాళ్ళ విషయానికొస్తే 1500 మంది ఉద్యోగస్థులు గల సంస్థలో నేను ఒకడిని. ప్రారంభంలో చాలా శ్రమించాము, అయితే నిజాయతీ, పవిత్రత, నిస్వార్థత అనే విలువలని ఎప్పుడూ అంటిపెట్టుకునే ఉన్నాము. స్వామి వివేకానంద "ఒక వ్యక్తికి నిజాయతీ, పవిత్రత, నిస్వార్థత ఉంటే, ప్రపంచమంతా ఎదురుతిరిగినా ఆ వ్యక్తికే విజయం లభిస్తుంది" అనేవారు. ఇది అందరూ గ్రహించాలి. ప్రతి ఒక్కరికీ నిజాయతీ, పవిత్రత, నిస్వార్థత అనేవి సహజలక్షణాలు అవ్వాలి. వాటినే అందరూ అనుసరించాలి. అయితే ఇది చెప్పినంత సులభం కాదు. నిత్యం వీటిని ఆచరించిన కొద్దీ అంతర్గతమైన శక్తి లభిస్తుంది. స్వామీజీ వంటి అద్భుతమైన ఆధ్యాత్మిక శక్తి సంపన్నులు చెప్పినప్పుడు, మనం వాటిని కనీసం సూచనలుగా నైనా భావించి ఆచరించాలి. దీని వలన శక్తిసంపన్నులవుతారు. ఆచరిస్తే అనుభవంతో తెలుస్తుందే తప్ప ఇవి మాటలలో చెప్పలేనివి. మీరు చేసే ప్రతి పనిలోనూ ఆధ్యాత్మిక విలువలను ఆచరిస్తూ ముందుకు సాగడం యుక్తమైనది అని మాత్రం చెప్పగలను.

శ్రీరామకృష్ణులు ఒక ఉదాహరణ చెప్పేవారు: "ఒక పాత్రలో కాయగూరలు ఉడుకుతున్నప్పుడు, అవి పైకి ఎగురుతుంటాయి. అలా ఆ కాయగూరలు పైకి ఎగరడానికి కారణం కింద ఉన్న మంటే అని గ్రహించాలి. అలాగే మనందరి చేత ఇవన్నీ చేయించే ఒక శక్తి మనలో ఉంది. మనం కేవలం పరికరాలం మాత్రమే! భగవంతుడి శరణాగతి కోరడం ద్వారా ఆ శక్తి మనలో వ్యక్తమవుతుంది. ఎన్నో దుర్లక్షణాలతో తాగుబోతు అయిన గిరీష్ చంద్రఘోష్‌లో మార్పు వచ్చి, శ్రీరామకృష్ణులని భగవదవతారంగా అందరికన్నా ముందు అతడే గుర్తించాడు అంటే... అతను శ్రీరామకృష్ణులని శరణాగతి కోరడం వలననే అది సాధ్యమైంది. అయితే, ఎవర్ని శరణువేడాలి, నా ఎదురుగా ఉన్నది కేవలం ఒక ఫొటోయే, నేను భగవంతుణ్ణి చూడడం లేదే అని అనుకునేవారు తమ అంతరాత్మ ఎలా చెప్తే అలా వినాలి. మన అంతరాత్మ మనని ఎప్పుడూ మోసగించదు. నిజాయతీగా ఉంటే చాలు మనం ఉన్నతులమవుతాం. శ్రీరామకృష్ణ, శ్రీశారదాదేవి, స్వామి వివేకానందులను ఆదర్శంగా తీసుకుని వారి ఆశయాలను ఏ కొంతైనా ఆచరించగలిగితే మన వ్యక్తిత్వం పరిపూర్ణంగా వికసిస్తుంది. సత్యసంధతను అభ్యసిస్తే మనలో నిర్భయత్వం, నిష్కామబుద్ధి, మానసిక నిశ్చలత, నిస్వార్థత అనే సుగుణాలు అప్రయత్నంగానే అలవడుతాయి. అప్పుడు మనం శక్తిమంతులవుతాం.

**(హైదరాబాద్ రామకృష్ణ మఠంలో మేనేజ్‌మెంట్ విద్యార్థులను ఉద్దేశించి వేల్యూ లాబ్స్ అధినేత శ్రీ అర్జున్‌రావుగారి ప్రసంగం.)**



# దయే దైవం

- స్వామి ఆత్మానంద

చిన్నతనంలో దయ గురించి చదివే కథలన్నీ మనసు మీద చెరగని ముద్ర వేస్తాయి. శిబి చక్రవర్తి కథ అయితే ఉగ్గుపాలతో పట్టినట్లు ఇప్పటికీ గుర్తే. ఒక చిన్న పావురాన్ని రక్షించడం కోసం శిబి తన శరీరంలోని మాంసాన్ని ఒక గద్దకు ఇవ్వడానికి ఎలా సిద్ధమయ్యాడో ఆ కథ చెబుతోంది. దేవతలకు తన ఎముకలు ఇచ్చి తన జీవితాన్నే ఆహుతి చేశాడు దధీచి.

ఈ కథలు చిన్నతనంలో మనోరంజకమైనవే కాకుండా లేత మనసులో ఆదర్శ భావాలను నింపుతాయి. కానీ వయసు పెరుగుతున్న కొద్దీ ఇలాంటి కథలపైన అపనమ్మకం ఏర్పడుతుంది. ఎన్నో ప్రశ్నలు ఉదయిస్తాయి. నిజంగా ఒక మనిషిలో అంత దయ ఉంటుందా? ఇతరుల ప్రాణాల్ని కాపాడడం కోసం తన ప్రాణాన్నే త్యజించగలరా? నేడు కూడా దేశవాసుల రక్షణ కోసం సైనికులు తమ ప్రాణాలు కోల్పోవడం లేదా అనే ప్రశ్న వస్తుంది. ఒక సైనికుడు తన కర్తవ్యానికి కట్టుబడి మాత్రమే పనిచేస్తాడు.

దధీచికి కానీ, శిబి చక్రవర్తికి కానీ అలా ప్రాణ త్యాగం చెయ్యాలనే నిర్బంధం లేదు. వాళ్ళకు దేవతల ప్రార్థనల్ని కానీ, పావురం విన్నపాన్ని కానీ కాదనే స్వతంత్రం ఉంది. అయినా వాళ్ళు అలా చెయ్యకుండా ప్రాణాలు అర్పించడానికి సిద్ధపడ్డారు. అదే అపార కరుణ అంటే!

ఇవన్నీ కేవలం పురాణాల్లో కథలేనా లేక నిజంగా వాళ్ళు అలా చేశారా అనే సంశయం మళ్ళీ మనసులో కలుగుతుంది. ఇలాంటి ఆలోచనల్లో ఉండగానే నేను దయకు సంబంధించిన ఓ కథ చదివాను. అది చదివాక నా దృక్పథమే పూర్తిగా మారిపోయింది.

మహారాష్ట్రలో ప్రసిద్ధి చెందిన సంత్ ఏకనాథ్ కథ. ఒక సారి ఏకనాథ్ తన స్నేహితులతో కలిసి హరిద్వార్ వెళ్ళారు. అక్కడ నుంచి కావిళ్ళలో గంగ నీరు నింపుకొని, రామేశ్వరంలో శివుని అభిషేకం చెయ్యడానికి తీసుకెళుతున్నారు. అనావృష్టి కారణంగా త్రాగడానికి నీరు కూడా లేక ప్రజలు చాలా బాధపడుతున్నారు. ఇంక పశుపక్ష్యాదుల సంగతి చెప్పనక్కర లేదు. అక్కడ జలాభావంతో పశువులు ప్రాణాలు పోయే పరిస్థితిలో ఉన్నాయి.

ఒక గాడిద దాహంతో ప్రాణాపాయ స్థితిలో ఉండడం ఏకనాథ్ దృష్టిలో పడింది. అది చూసిన ఏకనాథ్ తన దగ్గర ఉన్న గంగ నీటి కుండను ఆ గాడిద దగ్గర పెట్టారు. నెమ్మదిగా ఆ గాడిద ఆ కుండలోని నీరంతా త్రాగేసింది. అప్పుడు అది లేచి నిలబడి నెమ్మదిగా నడుచుకుంటూ వెళ్ళిపోయింది. ఏకనాథ్‌కి చాలా సంతోషం కలిగింది. అతని స్నేహితులు "ఏకనాథ్! నువ్వు నీ కుండలో నీరంతా ఆ గాడిదకు ఇచ్చేశావు. ఇంక నువ్వు రామేశ్వరం వెళ్ళి శివుని అభిషేకం ఎలా చేస్తావు?" అని అడిగారు. ఏకనాథ్ చాలా అమాయకంగా, "ఏం మీరంతా మీ దగ్గర ఉన్న గంగ ఇవ్వరా?" అని అడిగారు.

"మేము ఇస్తాం, కానీ హరిద్వార్ నుంచి స్వయంగా తెచ్చిన నీటితో అభిషేకం చెయ్యడమే విశేషం" అని మిత్రులు అన్నారు.

ఏకనాథ్ నిస్సహాయంగా "ఏం చెయ్యను! నేను కూడా మీతోనే నడుస్తున్నాను. దాహంతో బాధ పడుతున్న గాడిదను చూసినప్పుడు నాకు ఆ రామేశ్వరంలో ఉన్న శివుడే కనిపించి, 'నేను ఇక్కడ దాహంతో ప్రాణం పోయే స్థితిలో ఉంటే మీరు నా అభిషేకానికి నీరు తీసుకొని రామేశ్వరం వెళుతున్నారా' అని అడిగినట్టనిపించింది. అందుకని నేను గాడిదకు నీళ్ళు త్రాగించాను" అన్నాడు.

స్వామి వివేకానంద "ఎవరైతే పేదవాడిలో, బలహీనుడిలో, రోగిలో శివుణ్ణి చూడగలుగుతారో వారే నిజంగా శివుణ్ణి ఆరాధించినట్లు. విగ్రహంలో మాత్రమే శివుణ్ణి దర్శించేవారి ఆరాధన ఇంకా ప్రాథమికావస్థలో ఉన్నట్లే" అని దైవారాధనకు వినూత్న నిర్వచనాన్నిచ్చారు.

# వివేకానందుని స్ఫూర్తి నేతాజీ విజయదీప్తి

- లెఫ్టినెంట్ కల్నల్ ఎన్.సి. గుహా

నేతాజీ సుభాష్ చంద్రబోస్‌పై స్వామి వివేకానంద ప్రభావం ఎంతో ఉంది. ఇది అందరికీ తెలిసిన విషయమే!

నేతాజీ (1897-1945) నేటి ఒరిస్సాలోని కటక్‌లో సంపన్న బెంగాలీ కుటుంబంలో జన్మించారు. ఆయన ప్రాథమిక విద్యాభ్యాసం కటక్‌లోనే సాగింది. ప్రాపంచిక జీవితమా? లేక సన్యాస జీవితమా? ఏ మార్గాన్ని ఎంచుకోవాలి అనే ప్రశ్న సుభాష్‌ని కౌమార దశలోనూ, యౌవనపు తొలినాళ్ళలోనూ తీవ్రంగానే వేధించింది. ఈ సమయంలోనే అతడి ఆలోచనలకు స్పష్టతనిచ్చి, అతడిని ప్రోత్సహించిన స్వామీజీ భావాలతో పరిచయం కలిగింది. తదనంతర కాలంలో నేతాజీ ఇలా వ్రాశారు:

"1912లో ఒక రోజు నాకు ఎదురైన పరిస్థితి ఆ తరువాత నాకు చాలా చాలా సహాయకారి అయింది. అప్పుడే నగరానికి వచ్చిన మా బంధువు 'సుహృత్ చంద్రమిత్ర' మాకు దగ్గరలోనే నివసిస్తున్నారు. ఒకసారి ఏదో పని మీద అతని ఇంటికి వెళ్ళి, అతని పుస్తకాల మధ్య స్వామీజీ బోధనల పుస్తకం ఒకటి చూశాను. అప్పుడే ఆ పుస్తకంలో కొన్ని పేజీలు తిప్పాను. ఆయన దగ్గర ఆ పుస్తకాన్ని అడిగి ఇంటికి తెచ్చి చదవడం ప్రారంభించాను. స్వామీజీ సందేశం నా అంతరాంతరాళాల్లోకి ప్రవేశించింది.....రోజులు, వారాలు, నెలలు... ఇలా ఆ పుస్తకాలు చదువుతూనే ఉన్నాను. ఆయన భారతదేశంలో చేసిన ఉపన్యాసాలు, 'కొలంబో నుండి అల్మోరా' రచనలోను, తన లేఖలలోను తన దేశ ప్రజలకు ఇచ్చిన ఆచరణాత్మక సందేశం చదివి ప్రభావితుణ్ణయ్యాను. అప్పుడే 'ఆత్మనో మోక్షార్థమ్ జగత్ హితాయ చ' అనే స్వామీజీ నవీన సందేశంలోని అంతరార్థన్ని అర్థం చేసుకున్నాను".

1913 మార్చిలో సుభాష్ కలకత్తా వచ్చి ప్రెసిడెన్సీ కళాశాలలో చేరారు. సుభాష్ తన స్వీయ చరిత్రలో ఇలా వ్రాశారు: "నా ఆధ్యాత్మిక శ్రేయస్సుకూ, మానవజాతి సముద్ధరణకూ దోహదం చేసే జీవితాన్ని గడుపుతాను. దైనందిన జీవితంలో రామకృష్ణ-వివేకానందుల మార్గాన్నే అనుసరిస్తాను".

"1914 వేసవి సెలవులలో స్నేహితులతో కలసి బెనారస్ వెళ్ళాం. బెనారస్‌లో రామకృష్ణ సంఘ ప్రథమ అధ్యక్షులు స్వామి బ్రహ్మానంద మమ్మల్ని స్వాగతించారు. వారికి మా కుటుంబం బాగా తెలుసు. 'దేశసేవ చేసి నా జీవితాన్ని సార్థకం చేసుకోవాలనుకుంటున్నాను' అని రాఖాల్ మహరాజ్ (స్వామి బ్రహ్మానంద)కు నా జీవిత ఆశయాన్ని తెలిపాను. 'నువ్వు దేశానికి చేయవలసింది చాలా ఉంది' అని స్వామి బ్రహ్మానంద నన్ను ఆశీర్వదించారు.

తత్త్వశాస్త్రంలో బి.ఏ ఆనర్స్ మొదటి శ్రేణిలో ఉత్తీర్ణుడైన సుభాష్ తన తండ్రి కోరికపై 'ఇండియన్ సివిల్ సర్వీసెస్' పరీక్షకు చదవడానికి కేంబ్రిడ్జి వెళ్ళాడు. అక్కడకు చేరుకునేటప్పటికి ఐ.సి.యస్ పరీక్షకు ఇంకా 8 నెలల సమయమే మిగిలింది. వయః పరిమితి నిబంధనల వల్ల ఆ పరీక్షకు ఒక్క అవకాశం మాత్రమే ఉంది. సుభాష్ ఈ సవాలును ధైర్యంగా స్వీకరించి, పరీక్షలో నాలుగో స్థానం పొందాడు. కానీ బ్రిటిష్ యజమానులకూ, తన దేశానికీ ఏకకాలంలో సేవ చేయడం సాధ్యం కాదని ఆ ఉద్యోగాన్ని నిరాకరించాడు.

1921లో కేంబ్రిడ్జి నుంచి తిరిగి వచ్చిన తరువాత సుభాష్ అనేక రాజకీయ కార్య కలాపాలలో పాల్గొన్నాడు. సుభాష్ రాజకీయ జీవితం19 సంవత్సరాలే (1921 - 1940). అందులో ఆరేళ్ళు జైలులోనే గడిచి పోయాయి, అయినా ఆయన ఆలోచనలన్నీ నిరంతరం స్వేచ్ఛ, వికాసం అనే శక్తిమంతమైన భావాలను ఆచరణలోకి తేవడం గురించే!

### స్వామీజీ చరణాలే పెన్నిధి :

నేతాజీ 1930 జనవరిలో కలకత్తా మునిసిపాలిటీ మేయర్‌గా ఎన్నికయ్యారు. ఆ సమయంలో స్వామి వివేకానంద 69వ



జయంతి సందర్భంగా బేలూరు మఠంలో జరిగిన బహిరంగసభలో ఉపన్యసించాల్సిందిగా ఆహ్వానం అందింది. ఆ ఉపన్యాసంలో నేతాజీ ఇలా అన్నారు:

"స్వామి వివేకానందుల బహుముఖీయ వ్యక్తిత్వాన్ని వర్ణించడం చాలా కష్టం. నా కాలం నాటి విద్యార్థి లోకాన్ని స్వామి వివేకానంద రచనలు, ఉపన్యాసాలు ప్రభావితం చేసినంతగా మరేదీ చేయలేదు".

"నేనిలా గంటల తరబడి ప్రసంగించినా ఆ మహనీయుని ఔన్నత్యాన్ని గురించి పూర్తిగా వివరించలేను. ఆయన అంత గొప్పవాడు. అంత గంభీరమైనవాడు. అంత సంశ్లిష్టమైన వ్యక్తి. పారమార్థిక సత్యంతో సన్నిహిత సంబంధంగల అత్యున్నత ఆధ్యాత్మిక స్థాయికి చెందిన యోగి; సమస్త మానవాళి యొక్క నైతిక ఆధ్యాత్మిక సమున్నతి కోసం తన యావజ్జీవితాన్ని అర్పణ చేసిన మహనీయుడు. స్వామి వివేకానంద జీవించి ఉంటే నేను ఆయన శ్రీచరణాల చెంతనే ఉండేవాడిని".

**భయాన్ని త్రుంచే బోధలు:** 'మరాఠా' అనే పత్రిక ఉద్యోగి అయిన ఎ.ఆర్. భట్‌కు వ్రాసిన లేఖలో సుభాష్‌చంద్ర బోస్, "స్వామీజీ చాలా పౌరుషం గల గొప్పయోధుడు. తన దేశ జనుల సముద్ధరణ కోసం వేదాంతానికి ఆచరణాత్మక వ్యాఖ్యానాన్ని ఇచ్చారు. బలం - బలం అని ఉపనిషత్తులు బోధించిన దాన్నే ఆయన తరచుగా ఘోషించేవారు. శీల నిర్మాణానికి అధిక ప్రాధాన్యాన్నిచ్చేవారు" అని వ్రాశారు.

1936లో శ్రీరామకృష్ణుల శతజయంతి వేడుకల సందర్భంగా పత్రికకు ఒక వ్యాసం పంపాల్సిందిగా 'ఉద్బోధన్' సంపాదకులు స్వామి సుందరానంద, సుభాష్‌చంద్ర బోస్‌ను కోరారు. వ్యాసాన్ని పంపలేని తన అశక్తతను వెల్లడిస్తూ సుభాష్ ఇలా వ్రాశారు:

'పరమపూజ్య స్వామీజీ!

డిసెంబర్ 2నాటి మీ లేఖ అందింది. కానీ అనేక కారణాల వల్ల వెంటనే బదులు ఇవ్వలేకపోయాను. శ్రీరామకృష్ణుల గురించి వ్రాసే ధైర్యం నాకు లేదు. శ్రీరామకృష్ణులకూ, వివేకానందులకూ ఎంత ఋణపడి ఉన్నానో మాటల్లో ఎలా చెప్పగలను! వారి దివ్య ప్రభావం వల్లే నా జీవితం తొలిసారి జాగృతమైంది. రామకృష్ణులు, వివేకానందులు ఇద్దరూ ఒకే వ్యక్తిత్వపు రెండు రూపాలని నివేదితలాగ నేనూ విశ్వసిస్తాను'.

'శీలనిర్మాణ దృష్టితో చూస్తే శ్రీరామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా మంచి సాహిత్యం మరేదీ లేదని నా అభిప్రాయం' అని నేతాజీ పేర్కొన్నారు.

**రామకృష్ణ సంఘంతో నేతాజీ అనుబంధం:**

బేల్ ఘరియాలోని కలకత్తా స్టూడెంట్స్ హోం, శిశుమంగళ్ ప్రతిష్ఠాన్ (ఇప్పుడది రామకృష్ణ మిషన్ సేవా ప్రతిష్ఠాన్‌గా వ్యవహరించబడుతోంది) లాంటి రామకృష్ణ మిషన్ సేవా కార్యకలాపాలను చూసి సుభాష్‌చంద్ర బోస్ ఎంతో ముగ్ధులయ్యారు. దేవఘర్ (ప్రస్తుత జార్ఖండ్)లోని మిషన్ ప్రధాన విద్యా సంస్థను కూడా 1940లో దర్శించారు.

'ఆజాద్ హింద్ ఫౌజ్'ను స్థాపించిన తరువాత 1943లో సుభాష్ సింగపూర్ వచ్చారు. అప్పటి సింగపూర్ రామకృష్ణ మిషన్ అధ్యక్షులు స్వామి భాస్వరానందజీతో నేతాజీ తన భవిష్యత్ కార్యప్రణాళికలను రాత్రి 12 గంటల వరకు చర్చించేవారు.



దేవఘర్ రామకృష్ణ మిషన్ సభలో పాల్గొన్న నేతాజీ

ఒకసారి నేతాజీ సింగపూర్ ఆశ్రమంలో దివ్యజనని శారదాదేవి జయంతి ఉత్సవాలకు హాజరయ్యారు. చండి (దుర్గా సప్తశతి) పుస్తకం కావాలని కోరారు. స్వామి భాస్వరానంద తన సొంత ప్రతిని నేతాజీకి బహూకరించారు. సింగపూర్ రామకృష్ణ కేంద్రంతో ఎన్నో రకాలుగా తన అనుబంధాన్ని నేతాజీ కొనసాగించారు.

సుభాష్‌చంద్ర బోస్ భారతదేశపు అగ్రశేణి నాయకుడు. చింతనాశీలి, దేశభక్తుడు. ఇందులో సందేహానికి తావే లేదు. భారత స్వాతంత్ర్య సమరంలో ఆయన ప్రదర్శించిన అసమాన ధైర్యం, మొక్కవోని శక్తి సాటిలేనివి. ఆయన దార్శనిక భావాలు, ఆకర్షణీయ వ్యక్తిత్వం ఆయనను ఆరాధ్యుడిగా చేశాయి. స్వామి వివేకానందకు తాను ఎంత ఋణపడి ఉన్నారో ఆయనే అనేక సందర్భాలలో బహిరంగంగా ప్రకటించారు.

**తెలుగుసేత : కె. సత్యప్రసాద్ రాయ్**

(గత సంచిక తరువాయి)

ఆచార వ్యవహారాలు - అంతరార్థాలు- 23
సంధ్యా సమయం
- రెంటాల జయదేవ

# సంధ్యావందన అంతరార్థం



సూర్య భగవానుడు జగత్తులో ప్రత్యక్ష దైవం. సంధ్యావందనమంటే, ఆయన గతిని అనుసరించి, ఆరాధించడమే! సూర్యుడిలో మూడు రకాల శక్తులు, ఏడు రంగుల కిరణాలు ఉన్నాయని పెద్దలు తెలియజేశారు. అందులోని మూడు రకాల శక్తులను 'సావిత్రి, గాయత్రి, సరస్వతి' అంటారు. ఈ మూడు శక్తులను ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం సూర్యుని నుంచి ఆకర్షించి, మంత్రంతో శరీరంలోకి తీసుకొనే రహస్య యోగసాధన మార్గమే - 'సంధ్య'. "గాయత్రీం ఆవాహయామి, సావిత్రీం ఆవాహయామి, సరస్వతీం ఆవాహయామి" అని మూడుసార్లు అభిమంత్రించడం జరుగుతుంటుంది. ఇలా ఈ మూడు శక్తులు ఏకమైన మూర్తినే 'గాయత్రి'గా ఆరాధిస్తున్నాం. అందుకే, సంధ్యావందనమనేది కేవలం ధార్మికపరమైన వ్యవహారం కాదు, అది ఆరోగ్య సంబంధమైన తాత్త్విక దర్శనం.

సంధ్యావందనానికి ఆచమనం, ప్రాణాయామం, అఘ మర్షణం, అర్ఘ్యప్రదానం, గాయత్రీ మంత్ర జపం, ఉపస్థానం - అనేవి అంగాలు. ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం - ఇలా ప్రతి రోజూ మూడు వేళల్లో సంధి కాలాలు వస్తాయి. ఈ మూడు కాలాల్లో వాతావరణం వేర్వేరుగా ఉంటుంది. ఈ సంధి కాలాల్లో సూర్యుని వల్ల మానవ దేహానికి సంభవించే ఇబ్బందుల్ని పోగొట్టి, మంచిని కలిగించే ఉద్దేశంతో ఓ కర్మ చేయడానికి మహర్షులు నియమం పెట్టారు. ఈ కర్మనే 'సంధ్యా వందనం' అంటారు. ఈ సంధ్యాకాలాల్లో ఎదురయ్యే దుష్పరిణామాలను పోగొట్టి, సత్పరిణామాల్ని కలిగించే దేవదేవునికి వందనాలు సమర్పించడమే సంధ్యావందనం ఉద్దేశం.

### ఎటు తిరిగి చేయాలి?

సంధ్యా సమయాల్లో ప్రార్థన చేస్తున్నప్పుడు తూర్పు దిక్కును కానీ, ఉత్తర దిశను కానీ చూస్తూ ఉండేలా నిలబడాలని విశ్వామిత్ర మహర్షి పేర్కొన్నాడు. సాయం సమయంలో పశ్చిమం వైపు తిరిగి నిలబడి, ప్రార్థించాలని తెలిపాడు.

### ఏకాగ్ర చిత్తానికి సంధ్యా సమయం

ప్రకృతి సిద్ధాంతం ప్రకారం మనకు శ్వాస ఆ యా తిథులను అనుసరించి, మారుతూ ఉంటుంది. అయితే, స్థూలంగా మూడు సంధ్యా సమయాల్లోనూ రెండు ఘడియలసేపు మాత్రం ముక్కు రెండు రంధ్రాల్లోనూ సమంగా నడుస్తూ ఉంటుంది. మిగిలిన సమయాల్లో రెండు ఘడియల కాలం కుడి ముక్కు ద్వారం నుంచి, మరో రెండు ఘడియల కాలం ఎడమ ముక్కు ద్వారం నుంచి నడుస్తుంటుంది. కాబట్టి, మనస్సు ఏకాగ్ర స్థితి పొందడానికి సంధ్యా సమయాలు సహజంగా అనుకూలమైన కాలం. ఆ సమయంలో చదువు చక్కగా అబ్బుతుంది. ఉపాసించిన విద్య ఫలిస్తుంది.

రోజూ మూడు పూటలా సంధ్యావందనం చేయడమనేది శారీరక, మానసిక, ఆధ్యాత్మిక జీవితంపై గాఢమైన ప్రభావం చూపుతుంది. 'త్రిసంధ్యోపాసన' సర్వ మోక్ష ప్రదాయకం. మంత్రాలలో కెల్లా ఉత్కృష్టమైనదైన 'గాయత్రీ మంత్ర' జపానికీ, మంత్ర సిద్ధికీ త్రిసంధ్యలు ఉత్తమమైనవి. ఆధునిక విజ్ఞానవేత్తలు, వైద్యశాస్త్రజ్ఞులు సైతం ఎన్నో ప్రయోగాలు చేసి, సంధ్యా సమయానికి ఎంతో ప్రాముఖ్యమున్న సంగతిని తేల్చిచెప్పారు.

మూడు కాలాల్లోనూ సంధ్యావందనం చేయడం, దైవాన్ని ధ్యానించడం ఆరోగ్యపరంగానూ, ఆధ్యాత్మికంగానూ శ్రేయస్కరమని గ్రహించాలి.

ఆచార విధులను పాటించాలి. కానీ ఆధ్యాత్మికంగా ఉన్నతి చెందే కొద్దీ వాటి అవసరం తీరిపోతుంది. మనస్సు భగవంతుని యందు లగ్నమవటంతో సాక్షాత్కారం ప్రాప్తిస్తుంది. - **శ్రీరామకృష్ణ పరమహంస**















హృదయంలో భగవంతుణ్ణి దర్శించనివాడు బయట కూడా భగవంతుణ్ణి చూడలేడు. దేవాలయంలో భగవంతుణ్ణి చూసేవాడు, అఖిలాండంలో కూడా భగవంతుణ్ణి చూస్తాడు.

– భగవాన్ శ్రీరామకృష్ణ

ఆంగ్లమూలం : డాక్టర్ ఎస్. రమణి

అనువక్త : రెంటాల జయదేవ



గౌతమ మహర్షి సతీమణి అహల్య. ఆమె చాలా సౌందర్యవతి. కఠోరమైన ఋషి జీవన నియమాలను పాటిస్తూ, ఆ దంపతులు నిరాడంబర జీవితాన్ని గడుపుతూ వచ్చారు.

# పశ్చాత్తాపంతో ప్రాయశ్చిత్తం

అహల్య అందచందాలను చూసి, దేవతలకు ప్రభువైన ఇంద్రుడు మంత్రముగ్ధుడయ్యాడు. అంతటి అందాల రాశికి భర్తగా తానే తగినవాణ్ణని భావించాడు. అయితే, ఆమెకు గౌతమ మహర్షితో పెళ్ళి కావడం ఇంద్రుడిలో ఈర్ష్య, అసూయల్ని ప్రేరేపించింది. ఒక రోజున గౌతముడు లేని సమయం చూసి, ఇంద్రుడు మాయోపాయంతో గౌతమ మహర్షి వేషంలో వచ్చాడు. వచ్చింది తన భర్తే అనుకుంది అహల్య.

పవిత్రస్నానం చేసి తిరిగి వస్తున్న గౌతముణ్ణి చూసి, ఇంద్రుడు భయకంపితుడై పారిపోయాడు. పరిస్థితిని గ్రహించిన గౌతముడు ఆగ్రహావేశంతో ఇంద్రుణ్ణీ, అహల్యనూ శపించాడు. దీర్ఘకాలం ఆహారం లేకుండా కఠోర తపం సాగిస్తూ, పశ్చాత్తాప భావంతో మెలగాల్సిందిగా అహల్యను శపించాడు. అలాగే, ఇతరులెవరికీ ఆమె కనపడదని పేర్కొన్నాడు. అయితే, అహల్య పశ్చాత్తాపంతో ప్రాథేయపడడంతో, గౌతముడు ఆమెకు ఆశ్రమవాటికలో శ్రీరాముడు కాలు మోపినప్పుడు, ఆయన పాద స్పర్శతో శాపవిమోచనం కలుగుతుందని తెలిపాడు. పోగొట్టుకున్న శీలం, అందం అప్పుడు ఆమెకు తిరిగి వస్తాయని చెప్పాడు. ఇలా శాపవిమోచనం కూడా చెప్పి, తపశ్చర్యల నిమిత్తం గౌతమ మహర్షి హిమాలయాలకు వెళ్ళిపోయాడు.

రాముని దర్శన, పాదస్పర్శనాదులతో అహల్యకు శాప విమోచనం కలిగింది. ఆమె పరమ పవిత్రురాలిగా మారింది. హిమాలయాల నుంచి తిరిగి వచ్చి, గౌతముడు మళ్ళీ అహల్యను తన భార్యగా స్వీకరించాడు. ఎంత ఘోర తప్పిదం చేసినా, చేసిన తప్పు తెలుసుకొని, పశ్చాత్తాపపడతూ, కఠోర తపశ్చర్యలు సాగిస్తే, పాప విమోచనం కలుగుతుందని అహల్యా వృత్తాంతం తెలియజేస్తోంది. ప్రాతఃకాలంలో ప్రతి ఒక్కరూ స్మరించాల్సిన ఏడుగురు పుణ్యవతులలో అహల్య ఒకరు. a



## సంక్రాంతి శుభాకాంక్షలు

'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు, రచయితలకు, రచయిత్రులకు, ఏజెంట్లకు, ప్రకటనకర్తలకు మా హృదయపూర్వక శుభాభినందనలు.

- సంపాదకుడు

# గ్రంథ పరిచయం

## శ్రీమద్ వాల్మీకి రామాయణ సారసంగ్రహస్తవము

**మూలం : అప్పయ్య దీక్షితులు, అనువాదకుడు: పులవర్తి నూకాలరావు, పేజీలు: 149, వెల : 30/- ప్రతులకు: పులవర్తి నూకాలరావు 4 /23-2-10, శ్రీపూర్ణసత్యాంబికా విహార్, తి.తి.దే కల్యాణ మండపం వెనుక, కాకినాడ -1**

"ఆంధ్రత్వ మాంధ్ర భాషాచ, నాల్పస్య తపసా ఫలమ్" తెలుగు వాడిగా పుట్టడం, తెలుగు మాట్లాడటం పూర్వ జన్మ తపఃఫలము వలన మాత్రమే లభిస్తాయని ఘంటాపథంగా చెప్పిన మహాపండితుడు శ్రీఅప్పయ్య దీక్షితులువారు. రామాయణ, భారత శ్లోకానుసారంగా రామాయణ సారసంగ్రహాన్ని, భారత సారసంగ్రహాన్ని వారు రచించారు.



కాలగర్భంలో కలిసిపోయి, నామ మాత్రావశిష్టంగా మిగిలిన ఈ గ్రంథాలను సేకరించి చక్కని అనువాదాన్ని సంతరించారు నూకాలరావు గారు, అదేక్రమంలో శ్రీ అప్పయ్యదీక్షితుల వారి పాండిత్య ప్రకర్షను, జీవిత విశేషాలను సూక్ష్మంగా పాఠకులకు అందించటం అభినందనీయ రామాయణ, భారతాలను పారాయణం చేయాలనుకునే వారికి ఇది ఉపయుక్త గ్రంథం.

– నాగ ప్రసాద్

## మరణానంతర జీవితం

**ఆంగ్లమూలం: స్వామి అభేదానంద, అనువాదం: బ్రహ్మచారి రామకృష్ణ చైతన్య, పేజీలు : 194, వెల: 60/-, ప్రతులకు: వజ్రాల నాగవల్లి, డోర్.నెం. 5/236, ముత్యాలమ్మ గుడి వీధి, శ్రీకాళహస్తి(పోస్టు), చిత్తూరు జిల్లా - 517 644.**

శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష శిష్యులైన స్వామి అభేదానంద రచించిన "లైఫ్ బియాండ్ డెత్" అనే ఆంగ్లగ్రంథానికి అనువాదం ఇది. శరీరానికి భిన్నంగా శరీరంలో ఉండే సూక్ష్మశరీరం, శరీరాన్ని వదిలాక అది దాని ఉనికిని కొనసాగించడం, దాని మానసిక స్థితి వంటి అనేక అంశాలను చర్చించారు దీనిలో. ఈ గ్రంథంలో విజ్ఞాన శాస్త్ర పరమైన నిరూపణలతో హేతుబద్ధమైన ఆలోచనలతో వివరించారు. మూఢ విశ్వాసాలకు అతీతంగా, నిష్పక్షపాతంగా విమర్శ నాత్మకంగా సాగింది గ్రంథరచన. జీవాత్మ శాశ్వతమైనది మరణానంతరం అది నాశనమవదు అంటుంది కర్మ సిద్ధాంతం; కానీ భౌతిక జీవితం, మరణానంతర జీవితం రెండూ కూడా కార్యకారణ సిద్ధాంతానికీ, మార్పులకూ లోబడి కొనసాగుతాయి అంటారు స్వామి అభేదానందజీ.




పదహారు అధ్యాయాలున్న ఈ గ్రంధాన్ని "మరణానంతర జీవితం" పేరుతో సరళమైన తెలుగులోకి అనువదించారు బ్రహ్మచారి రామకృష్ణ చైతన్య.

– **శ్రీమతి ఎన్. శేషు**

## వాసరమ్మ వాణి

**రచన : మేడిచర్ల ప్రభాకరరావు,**
**వెల : 30/- పేజీలు : 86,**
**ప్రతులకు : అఖిల భారతీయ భగవద్గీతా ప్రచార మండలి, గీతా భవనము, స్టేషన్‌రోడ్, నిజామాబాద్.**

## శ్రీకురవి వీరభద్ర మాహాత్మ్యము
## శ్రీభవానీ సంస్తుతి

**రచన : ముళ్లపూడి సచ్చిదానందమూర్తి, వెల : 50/- పేజీలు : 70, ప్రతులకు : సాహిత్య నికేతన్, 3-4-852, బర్కత్‌పుర, హైదరాబాద్ - 500 020**

## తిరుప్పావు

**పరిష్కర్త : శ్రీనివాస తాతాచార్య స్వాముల వారు,**
**పేజీలు : 148, వెల: తెలుపలేదు,**
**ప్రతులకు : సర్వారాయ ధార్మిక విద్యా ట్రస్టు, కపిలేశ్వరపురం, తూర్పు గోదావరిజిల్లా - 533 309**

## దివ్యస్తోత్రరత్నమాల

**సంపాదకుడు : పురాణపండ రాధాకృష్ణమూర్తి, వెల : 25/- పేజీలు : 92, ప్రతులకు : పురాణపండ రాధాకృష్ణమూర్తి, 29-6-13, గోకవరం బస్టాండ్, గోదావరీ రైల్వే స్టేషన్ దగ్గర, రాజమండ్రి-4**

# వార్తావాహిని

## తుఫాను బాధితులకు రామకృష్ణమిషన్ ఆపన్న హస్తం

**బం**గ్లాదేశ్‌లో అనూహ్యంగా సంభవించిన తుఫాను జనజీవనాన్ని అతలాకుతలం చేసింది. రామకృష్ణ మిషన్ ఢాకా శాఖ బంగ్లాదేశ్‌లోని బహేర్హాట్, ఫిరోజ్‌పూర్, బర్గుణా ప్రాంతాలలో వేలాది మంది తుఫాను బాధితులకు వెంటనే ప్రాథమిక సహాయక చర్యలను చేపట్టింది. ఈ ప్రాంతాలలో ఆహారపొట్లాలనూ, నిత్యావసర సామగ్రినీ, దుప్పట్లనూ, మందులనూ సరఫరా చేసింది. తాత్కాలిక నివాస కేంద్రాలను ఏర్పాటు చేసింది.

బాధితుల సహాయ, సేవా కార్యక్రమాల నిమిత్తం విరాళాలను కోరుతున్నాం. దాతలు **'రామకృష్ణ మిషన్'** పేరున చెక్కు, డి.డి. లేక నగదు రూపంలో విరాళాలను ఈ క్రింది చిరునామాకు పంపగలరు.

**The General Secretary**
**Ramakrishna Mission**
**P.O. Belur Math, Howrah**
**West Bengal - 711 202**
**Ph: 033- 2654 9581, 2654 9681**

విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలో 80(జి) సెక్షన్ క్రింద మినహాయింపు కలదు.

## రామకృష్ణసంఘ ఉపాధ్యక్షుల ఆగమనం

**రా**మకృష్ణ మఠం-రామకృష్ణ మిషన్‌ల ఉపాధ్యక్షులు పూజ్య స్వామి స్మరణానందజీ మహరాజ్ 2008 ఫిబ్రవరి నెలలో విజయవాడ రామకృష్ణ మిషన్, రాజమండ్రి రామకృష్ణ మఠాలకు విచ్చేయనున్నారు. ఈ రెండు కేంద్రాలలో పూజ్య స్వామీజీ ఆసక్తిగల భక్తులకు మంత్ర దీక్ష ప్రసాదించెదరు.

**కార్యక్రమ వివరాలు:**

**విజయవాడ రామకృష్ణ మిషన్(సీతానగరం)లో** పూజ్య స్వామి స్మరణానందజీ మహరాజ్ 2008 ఫిబ్రవరి 11 నుండి 16 వరకు బస చేసెదరు.

13-2-2008 మంత్రదీక్ష (స్థానిక భక్తులకు)
14-2-2008 నూతన పాఠశాల భవన ప్రారంభోత్సవం
15-2-2008 మంత్ర దీక్ష (ఇతర ప్రాంత భక్తులకు)

పూర్తి వివరాల కోసం 'కార్యదర్శి, రామకృష్ణ మిషన్, సీతానగరం, తాడేపల్లి మండలం, గుంటూరు జిల్లా-522501, (ఫోన్: 08645-272248)ను' సంప్రతించవలెను.

**రాజమండ్రి రామకృష్ణ మఠంలో** పూజ్య స్వామి స్మరణానందజీ మహరాజ్ 2008 ఫిబ్రవరి 17 నుండి 22 వరకు బస చేసెదరు.

2008 ఫిబ్రవరి 19, 21 తేదీలలో భక్తులకు మంత్ర దీక్ష ప్రసాదించెదరు. భక్త, యువజన సమ్మేళనాలు నిర్వహించబడును. పూర్తి వివరాల కోసం 'అధ్యక్షులు, రామకృష్ణ మఠం, స్వామి వివేకానంద రోడ్, రాజమండ్రి- 533105, (ఫోన్:0883-2473112)ను' సంప్రతించవలెను.

## రాజమండ్రిలో వ్యక్తిత్వ వికాస సదస్సు

**రా**జమండ్రి రామకృష్ణ మఠం 2007 నవంబరు 17, 18వ తేదీలలో యువజన సదస్సు, ఉపాధ్యాయుల సదస్సు నిర్వహించింది. ఈ కార్యక్రమంలో సుమారు రెండు వందల మంది విద్యార్థినీ విద్యార్థులు, వంద మంది అధ్యాపకులు పాల్గొన్నారు. హైదరాబాద్ రామకృష్ణ మఠం, వివేకానంద వాణీ సంస్థ డైరెక్టర్ స్వామి అనుపమానందజీ "స్వామీజీ దృష్టిలో యువత; బోధించలేం కానీ అవరోధాలను తొలగించగలం" అనే అంశాలపై ఉత్తేజకరంగా ప్రసంగించారు. శ్రీరామకృష్ణ ప్రభ సంపాదకులు స్వామి పరిజ్ఞేయానంద 'యువశక్తిని సద్వినియోగం చేయడమెలా?, రామకృష్ణుని బోధనా పద్ధతి' అనే విషయాలపై ఉపన్యసించారు. విద్యార్థినీ విద్యార్థులూ, ఉపాధ్యాయులూ



సామూహిక చర్చలో ఉత్సాహంగా పాల్గొని నేటి విద్యా విధానంలోని లోపాలను, వాటిని నివారించేందుకు సూచనలను ఇచ్చారు. ఈ సదస్సుల్లో పాల్గొన్న ప్రతినిధులు స్పందిస్తూ ఈ కార్యక్రమాల ద్వారా ఎంతో స్ఫూర్తిని పొందామని నిర్వాహకులకు కృతజ్ఞతలు తెలిపారు.

**- నివేదిక: స్వామి అక్షరాత్మానంద**

# రామకృష్ణ సంఘ నూతన సర్వాధ్యక్షులు



పరమ పూజ్య స్వామి ఆత్మస్థానందజీ మహరాజ్

**శ్రీమత్ స్వామి ఆత్మస్థానందజీ మహరాజ్ రామకృష్ణ మఠం-రామకృష్ణ మిషన్‌ల నూతన సర్వాధ్యక్షులుగా ఎన్నికయ్యారు. 2007 డిసెంబర్ 3వ తేదీన రామకృష్ణ సంఘ ధర్మకర్తలు, పాలకవర్గ సభ్యులు సమావేశమై పూజ్య స్వామీజీని సంఘ సర్వాధ్యక్షులుగా ఎన్నుకున్నారు.**

**స్వామి ఆత్మస్థానందజీ మహరాజ్ 1973లో రామకృష్ణ మఠ ధర్మకర్తృత్వ మండలి సభ్యులుగా, రామకృష్ణ మిషన్ పాలకవర్గ సభ్యులుగా ఎన్నికయ్యారు. 1992లో రామకృష్ణ సంఘ ప్రధాన కార్యదర్శిగా బాధ్యతలు స్వీకరించిన స్వామీజీ 1997 మే 22వ తేదీ నుంచి రామకృష్ణ సంఘ ఉపాధ్యక్షులుగా బాధ్యతలు వహిస్తూ వచ్చారు. రామకృష్ణ సంఘ 14వ సర్వాధ్యక్షులు స్వామి గహనానందజీ మహరాజ్ 2007 నవంబర్ 4వ తేదీన మహాసమాధి పొందడంతో స్వామి ఆత్మస్థానందజీ మహరాజ్ 2007 డిసెంబరు 3వ తేదీ నుంచి రామకృష్ణ సంఘ 15వ సర్వాధ్యక్షులుగా బాధ్యతలు స్వీకరించారు.**

స్వామి ఆత్మస్థానందజీ 1919లో ఢాకా (బంగ్లాదేశ్) లోని సబజ్‌పూర్ గ్రామంలో జన్మించారు. స్వామీజీ విద్యాభ్యాసం దినాజ్‌పూర్ ఉన్నత పాఠశాలలో కొనసాగింది. దినాజ్‌పూర్ రామకృష్ణ ఆశ్రమ అధ్యక్షులైన స్వామి గదాధరానందజీ మహరాజ్ (స్వామి శివానందజీ మహరాజ్ ప్రత్యక్ష శిష్యులు)తో స్వామీజీకి సన్నిహితంగా మెలగే అవకాశం లభించింది.

ఐ.ఏ. పూర్తయ్యాక ఆయన స్కాటిష్ చర్చ్ కళాశాలలో బి.ఏ.లో చేరి తరువాత కలకత్తా ప్రెసిడెన్సీ కళాశాలకు మారారు. ఆ సమయంలో ప్రస్తుతం బెల్‌ఘరియాలో నెలకొన్న రామకృష్ణ మిషన్ విద్యార్థి గృహమే ఆయన బస. తత్త్వశాస్త్రంలో పట్ట భద్రులయ్యాక ఆయన కలకత్తా విశ్వవిద్యాలయంలో ఎం.ఏ. (తత్త్వశాస్త్రం) లో ప్రవేశించారు.

విద్యార్థి దశలో రామకృష్ణ సంఘ సాధువుల త్యాగమయ జీవితాలు వారిని ఎంతగానో ప్రభావితం చేశాయి. వారిలో ముఖ్యులు - స్వామి నిర్వేదానందజీ మహరాజ్ (స్వామి బ్రహ్మానందజీ శిష్యులు, కలకత్తా విద్యార్థి గృహ వ్యవస్థాపకులు), స్వామి అచలానందజీ మహరాజ్ (వివేకానంద స్వామి శిష్యులు, అప్పటి సంఘ ఉపాధ్యక్షులు). శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష శిష్యులైన స్వామి అఖండానందజీ మహరాజ్, స్వామి అభేదానందజీ మహరాజ్‌ల దర్శన భాగ్యం ఆయనకి కలిగింది.

ఎం.ఏ. అంతిమ పరీక్షలు పూర్తి చేయకుండానే సంఘంలో చేరమని ఆయనను ప్రోత్సహించింది స్వామి అచలానందజీ మహరాజ్‌గారే. కానీ అప్పటి రామకృష్ణ సంఘ ప్రధాన కార్యదర్శి స్వామి మాధవానందజీ (నిర్మల్ మహరాజ్)మాత్రం ఎం.ఏ. పూర్తిచేసిన తరువాతే రామకృష్ణ సంఘంలో చేరమని ఆంక్ష విధించారు.

స్వామి ఆత్మస్థానందజీ తాము రామకృష్ణ సంఘంలో చేరే ముందు జరిగిన ఓ సంఘటనను ఇలా తెలిపారు:

"అప్పుడు నేను ఎం.ఏ. ఆఖరు సంవత్సరంలో ఉన్నాను. ప్రొఫెసర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ మా అధ్యాపకుడు.

(మిగతా 3వ కవర్ పేజీలో...)

శ్రీరామకృష్ణ ప్రభ
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్ - 500 029
ఫోన్: 040-2766 7799, 2763 3936
E-mail : sriramakrishnaprabha@gmail.com



నిర్వాహక సంపాదకులు: **స్వామి జ్ఞానదానంద**
సంపాదకులు: **స్వామి పరిజ్ఞేయానంద**

(...2వ కవర్ పేజీ తరువాయి)

ఒక రోజు రాత్రి నా కొక కల వచ్చింది. ఆ కలలో స్వామి అచలానందజీ మహారాజ్ (కేదార్ బాబా) దర్శనమిచ్చి నన్ను 'తక్షణమే మఠానికి వెళ్ళి సాధువుకా' అన్నారు. స్వామీజీ మాటను దైవాజ్ఞగా తలచి వెంటనే నేను బేలూరు మఠానికి బస్సులో బయలుదేరాను. ముందు నిర్మల్ మహారాజ్ వద్దకు వెళితే నా చదువు పూర్తిచేసి రమ్మని నన్ను వెనక్కు పంపివేస్తారని నాకు తెలుసు. మొదట దేవాలయానికి వెళ్ళి గురుమహారాజ్‌కు ప్రణామంచేసి స్వామి మాధవానందజీ వద్దకు వెళ్ళాను. 'ఇవాళ ఇంత ప్రొద్దుటే వచ్చావు, విషయం ఏమిటి?' అని అడిగారు. 'నేను మఠంలో చేరడానికి వచ్చాను. దయచేసి నన్ను వెనక్కు వెళ్ళిపోమనకండి. ఈ రోజు నన్ను వెనక్కు వెళ్ళిపొమ్మని చెబితే, నేను ఎన్నటికీ సాధువును కాలేను" అని ఠక్కున చెప్పాను. నా మాటలు సావధానంగా ఆలకించిన ఆయన మరేమీ మాట్లాడ లేదు. ఆ విధంగా నేను మఠంలో చేరాను". ఆ విధంగా స్వామి ఆత్మస్థానందజీ తమ 22వ ఏట, 1941 జనవరి 3వ తేదీన బేలూరు మఠంలోని రామకృష్ణ సంఘంలో చేరారు.

1938లో శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష శిష్యులలో ఒకరైన స్వామి విజ్ఞానానందజీ మహారాజ్ నుండి మంత్రదీక్ష స్వీకరించారు. 1945లో సంఘ 6వ సర్వాధ్యక్షులైన స్వామి విరజానందజీ మహారాజ్ ఆయనకు బ్రహ్మచర్య దీక్షనిచ్చి 'శాంతిచైతన్య' అనే పేరును ప్రసాదించారు. 1949లో సన్న్యాసాశ్రమం స్వీకరించి 'స్వామి ఆత్మస్థానంద' అనే పవిత్ర నామాన్ని పొందారు.

హిమాలయాల్లోని శామల్‌తాల్ ఆశ్రమంలో అప్పటి సంఘ సర్వాధ్యక్షులైన స్వామి విరజానందజీ మహారాజ్‌ను సుదీర్ఘ కాలం సేవించుకొనే మహద్భాగ్యం స్వామీజీకి లభించింది. కిషన్‌పూర్ ఆశ్రమంలో శ్రీశారదాదేవి శిష్యులు స్వామి జగదానందజీ మహారాజ్ వద్ద శాస్త్రాధ్యయనం చేశారు. 1951లో స్వామీజీ రాంచీ క్షయ ఆరోగ్య నిలయానికీ, 1958లో రంగూన్ సేవాశ్రమానికీ కార్యదర్శిగా సేవలందించారు. 1966లో రాజ్‌కోట్ ఆశ్రమ అధ్యక్షులుగా ఆయన నియుక్తులయ్యారు. ఆయన గుజరాతీ భాషను నేర్చుకొని మూర్తిత్రయ సందేశాన్ని యావత్తు గుజరాత్‌లో వ్యాప్తిచేసి, మేధావులను, జనసామాన్యాన్ని ప్రభావితులను చేశారు.



పరమ పూజ్య స్వామి గహనానందజీ మహారాజ్ తో పూజ్య స్వామి ఆత్మస్థానందజీ మహారాజ్

మఠ, మిషన్ల ప్రధాన కార్యదర్శిగా విస్తృత పునరావాస కార్యక్రమాలనూ, గిరిజన సంక్షేమ కార్యక్రమాలనూ చేపట్టారు.

రామకృష్ణ మఠం మరియు మిషన్‌ల ఉపాధ్యక్షులుగా స్వామి ఆత్మస్థానందజీ భారత దేశంలో విస్తృతంగా పర్యటించారు. అమెరికా, కెనడా, జపాన్, సింగపూర్, మలేషియా, ఫిజీ, బంగ్లాదేశ్, శ్రీలంక, బర్మా మొదలైన దేశాలను సందర్శించారు.

భగవాన్ శ్రీరామకృష్ణ, శ్రీ శారదాదేవి, స్వామి వివేకానందుల సందేశాన్ని వ్యాప్తి చేయడంతో పాటు, అనేక వేలమంది ముముక్షువులకు మంత్రదీక్ష ప్రసాదించారు. తన దగ్గరికి వచ్చిన ప్రతి ఒక్కరినీ అలవోకగా ప్రభావితం చేయగలగడం స్వామీజీలోని విశిష్ట లక్షణం.

Vol.65-1, Sri Ramakrishna Prabha (Telugu Monthly) January 2008, Regd. with the Registrar of Newspaper for India Under No. 1120/57. Postal Registration No. H-HD-1071/2007-09. Licensed to Post Under WPP : CPMG/AP/HC-13/WPP/2007-09.

# శ్రీ పరమాచార్య చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ వేదాధ్యయనానుసన్ధాన ప్రతిష్ఠానమ్

## ప్రవేశ / ఉద్యోగ ప్రకటన

**1. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది కోర్సులకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) 'వేదచూడామణి' : యజుర్వేదము/ఋగ్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క అధ్యయనము
యోగ్యతలు : మాతృభాషలో చదువగలిగి, వ్రాయగలిగి ఉండాలి.
వయస్సు : 8 నుంచి 10 సంవత్సరాల మధ్య
స్టైఫండ్ : నెలకు రూ. 1,000/-

(ఆ) 'వేదార్థచూడామణి' : ఋగ్వేదము/ యజుర్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క భాష్యాధ్యయనము
యోగ్యతలు : సంస్కృత పరిజ్ఞానముతో బాటు ఏదో ఒక వేదాన్ని పూర్తిగా అధ్యయనం చేసి ఉండాలి.
వయస్సు : 15 సం॥, ఆ పైన
స్టైఫండ్ : నెలకు రూ. 3,000/-

**2. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది ఉద్యోగాలకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) వేదాధ్యాపకుడు : (యజుర్వేదము/సామవేదము/ అథర్వవేదము-వేదానికి ఒక్కొక్కరు చొప్పున రెండు ఖాళీలు)
కావలిసిన అర్హతలు : క్రమాంతము లేక పదాంతము
అదనపు అర్హతలు : ఏదైన మఱియొక వేదము/ వేదభాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవము : 2 సంవత్సరములు
సంభావన : నెలకు రూ॥ 8,000/- మొత్తము, సౌకర్యములతో

(ఆ) వేదభాష్యాచార్యుడు : (ఒక్కొక్క వేదానికి ఒక్కొక్కరు చొప్పున 4 ఖాళీలు)
విద్యార్హత : ఏదైనా వేద భాష్యంలో ఉత్తీర్ణత
అదనపు అర్హత : మరొక వేద భాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవార్హత : 5 సం॥
సంభావన : నెలకు రూ. 10,000/- మొత్తము, సౌకర్యములతో

ముద్రించిన దరఖాస్తు ఫారములను **శ్రీ పి. వేంకటేశ్వర్లు గారు, మేనేజింగ్ డైరెక్టర్, కాకతీయ సిమెంట్, సుగర్ & ఇండస్ట్రీస్ లిమిటెడ్, 'గురుకృప' (ఆంధ్రా బ్యాంకు ఎదురుగా), 1 - 10 - 140/1, అశోక్‌నగర్, హైదరాబాద్ - 500 020** (ఫోను: 040 - 27637717) నుంచి ప్రత్యక్షముగా గాని, పోస్టు ద్వారా గాని పొందవచ్చు. పూర్తి చేయబడిన ఆ ముద్రిత దరఖాస్తులను ఈ పై అడ్రసుకు పంపవలెను. అవసరాన్ని బట్టి ఖాళీలను పూరించుట లోనూ, అర్హతల సవరణ లోనూ మేనేజ్‌మెంటుకు అధికారము కలదు.

సం/-
హైదరాబాద్ — కులప్రశాసకుడు

# ధనం సాధించలేనిది...

డబ్బుతో...

హంసతూలికా తల్పాలను కొనవచ్చు కానీ... నిద్రను కాదు.

పంచభక్ష్య పరమాన్నాలను కొనవచ్చు కానీ... ఆకలిని కాదు...

ఔషధాలను కొనవచ్చు కానీ... ఆరోగ్యాన్ని కాదు.

పై పై మెరుగులను పొందవచ్చు కానీ... మెరుగైన మానసిక సౌందర్యాన్ని కాదు.

ఆడంబరాలను పొందవచ్చు కానీ... ఆహ్లాదాన్ని కాదు.

పరిచయాలను పెంచుకోవచ్చు కానీ... నిజమైన స్నేహితుల్ని కాదు.

సేవకుల్ని పొందవచ్చు కానీ... వారి విశ్వాసాన్ని కాదు.

విద్యను కొనవచ్చు  కానీ... వివేకాన్ని కాదు.

శరీరానికి సుఖాన్ని కొనవచ్చు కానీ...

మనసుకు శాంతినీ, సంతోషాన్నీ కాదు.

ఒక్కమాటలో చెప్పాలంటే...

డబ్బు జీవితంలో ఓ భాగం మాత్రమే

కానీ అదే జీవితం కాదు!





Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 65 సంచిక: 2 ఫిబ్రవరి 2008

"ప్రతి జీవిలోనూ దివ్యత్వం గర్భితంగా ఉంది. అంతర్గతంగా ఉన్న ఆ దివ్యత్వాన్ని వ్యక్తం చేయడమే జీవిత పరమావధి." - స్వామి వివేకానంద

తస్మి న్నస్తమితే భీష్మే కౌరవాణాం ధురంధరే ।
జ్ఞానా న్యంతం గమిష్యంతి తస్మాత్త్వాం చోదయా మ్యహమ్ ॥

(అంపశయ్యపై ఉన్న భీష్ముని మహాత్మ్యాన్ని ప్రశంసిస్తూ శ్రీకృష్ణుడు ధర్మరాజుతో ఇట్లు పలికెను)

విజ్ఞానఖని అయిన గంగానందనుడు అస్తమించిన తరువాత భూలోకమున జ్ఞానం అంతమొందును. కావున ధర్మరాజా! నీవు భీష్ముని వద్దకు వెళ్ళి సమస్త రాజ ధర్మములను, ఆపద్ధర్మములను, మోక్షధర్మములను తెలుసుకొనుము.






## లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు**...... రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**రాజ పోషకులు**............ రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**పోషకులు**................. రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| పేరు | చిరునామా | రూ. |
|---|---|---|
| | ఇప్పటి వరకు వసూలైన మొత్తం ... | 11,18,219 |
| మహారాజ పోషకులు | : శ్రీ ఎన్. వెంకటేశ్వర్లు, రాజమండ్రి | 54,000 |
| పోషకులు | : శ్రీమతి పద్మలత, వెంగలరావునగర్ కాలనీ, హైదరాబాద్ - 500 038 | 2,000 |
| | : శ్రీ ఎమ్.ఎస్. అప్పారావు, పెద్దాపురం, తూర్పు గోదావరి జిల్లా - 533 437 | 1,116 |
| | : శ్రీ ఉప్పలూరి రత్న బాబు శర్మ, ప్రహ్లాదపురం, విశాఖపట్నం - 530 007 | 1,001 |
| | : శ్రీ ఐ. వెంకటేశ్వర్లు, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్ - 500 060 | 1,000 |
| | మొత్తం . . . | 11,77,336 |

# శ్రీరామకృష్ణ ప్రభ గ్రంథాలయ నిధి పథకం

'శ్రీరామకృష్ణ ప్రభ గ్రంథాలయ నిధి పథకం'లో చేరి, మీ పేరు మీద పది మందీ మంచి విషయాలు చదివే వీలు కల్పించండి. ఈ పథకం కింద రూ॥600/- చందా కట్టినట్లయితే, 10 ఏళ్ళ పాటు ఒక గ్రంథాలయానికి (ఉన్నత పాఠశాలలకు/ కళాశాలలకు/ సంస్థలకు/ దేవాలయాలకు)ప్రతి నెలా మీ పేరిట 'శ్రీరామకృష్ణ ప్రభ' పంపిస్తాం. దాతల పేర్లనూ, వారి పేరిట పత్రికను పంపే గ్రంథాలయాల వివరాలనూ 'శ్రీరామకృష్ణ ప్రభ'లో ప్రచురిస్తాం.

| సంఖ్య | దాత పేరు | గ్రహీత సంస్థ |
|---|---|---|
| 1301 | శ్రీ వి.వి. గోపాలరాజు, చిన్న అమీరం, భీమవరం | సుబ్బ రాజేంద్ర గ్రంథాలయం, ఉండి, ప.గో. జిల్లా - 534 198 |
| 1302 | శ్రీ పూసపాటి పార్వతీశం, ఎస్.బి.హెచ్ కాలనీ, హైదరాబాద్ | జిల్లాపరిషత్ ఉన్నతపాఠశాల, కందవరం, విశాఖపట్నం జిల్లా. |
| 1303 | శ్రీ ఉప్పులూరి రత్నబాబుశర్మ, ప్రహ్లాదపురం, విశాఖపట్నం | జిల్లాపరిషత్ ఉన్నతపాఠశాల,కరంజి,ఆదిలాబాద్ జిల్లా. |
| 1304 | శ్రీఎన్. జగన్, బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్ | జిల్లాపరిషత్ ఉన్నతపాఠశాల, పోచార(గ్రా) ఆదిలాబాద్ జిల్లా. |
| 1305 | " " | జిల్లాపరిషత్ ఉన్నతపాఠశాల, చందా(గ్రా) ఆదిలాబాద్ జిల్లా. |
| 1306 | శ్రీ వై.వి.ఎస్. చలపతిరావు, మలక్‌పేట్, హైదరాబాద్ | కోనసీమ భానూజీ కళాశాల, అమలాపురం, తూర్పు గోదావరి జిల్లా. |

ఈ పథకం ద్వారా శ్రీరామకృష్ణ ప్రభను మరింతమందికి చేరువ చేస్తున్న దాతలకు కృతజ్ఞతలు.

**ADVERTISEMENT TARIFF**

| | MULTI COLOUR | B & W |
|---|---|---|
| Fourth Cover | Rs.13,000 | - |
| Second Cover | Rs.11,000 | 7,000 |
| Third Cover | Rs.11,000 | 7,000 |
| Inside Full Page | Rs. 7,000 | 5,000 |
| Inside Half Page | Rs. 5,000 | 3,000 |

| చందా వివరాలు | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|
| విడి ప్రతి | : రూ. 8 | - |
| ఒక సంవత్సర చందా | : రూ. 85 | $15 |
| మూడు సంవత్సరాలకు | : రూ. 240 | $ 45 |
| ఐదు సంవత్సరాలకు | : రూ. 380 | $ 75 |
| ఇరవై సంవత్సరాలకు | : రూ. 1200 | $ 350 |



గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి. పంపవలసిన చిరునామా : Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.

## లోపలి పేజీల్లో...



## శ్రీరామకృష్ణ ప్రభ వార్షిక చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా! దిగువ పేర్కొన్న నెంబర్ల నడుమ ఉన్న సంవత్సర చందాదారుల చందా గడువు తీరిపోనుంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకొని, 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.*

30003 - 37116 మధ్యనున్న వారిలో **సంవత్సర** చందాదారుల చందా గడువు **2008 ఫిబ్రవరితో** తీరిపోనుంది!

40007 - 41865 మధ్యనున్న వారిలో **సంవత్సర** చందాదారుల చందా గడువు **2008 మార్చితో** తీరిపోనుంది!

**శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ.... - సర్క్యులేషన్ మేనేజర్**

_ మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు. ❖ మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి. ✸ మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.





**SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH**

Domalguda, Hyderabad - 500 029. Andhra Pradesh

Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com

# అనర్థాలకు పునాది!

మనకు కలిగే అన్ని అనర్థాలకూ పునాది అహంకారమే! "నేను" అనే అహంకార మేఘాన్ని తొలగించగలిగితే మనలో ఉన్న "జ్ఞానం" అనే సూర్యుడు ప్రకాశిస్తాడు.

అహంకారం వల్ల వచ్చే అనర్థాల్ని ఎన్ని శాస్త్రాలు విశదీకరించినా, ఎంతమంది మహాత్ములు బోధించినా అవన్నీ ఇతరులకు అన్వయిస్తామే గానీ, మనకు వర్తిస్తాయని ఎన్నడూ ఊహించం. మనం ఇలాంటి భ్రమల వలయంలో బంధితులం కావడం వల్లనే మనకు జీవితంలో ఎన్ని ఎదురుదెబ్బలు తగిలినా, "నేను" అనే అహాన్ని వదలలేకపోతున్నాం, అనర్థాలను కొనితెచ్చుకొంటున్నాం. మనలో 'నేను' అనే అహంకారం ఎంత దృఢంగా, ఎంత లోతుగా పాతుకు పోయిందో తెలియజేయడానికి శ్రీరామకృష్ణులు ఒక ఉదాహరణ చెప్పేవారు:

"లేగదూడ 'హం హై, హంహై – నేనున్నాను, నేనున్నాను' అని అరుస్తూ పుడుతుంది. ఆ దూడ పెద్దదైన తరువాత దాన్ని బళ్ళకు కట్టి బరువులు మోయిస్తారు. కాడికి కట్టి పొలాన్ని దున్నిస్తారు – ఇలా ఎన్నో కష్టాలు అనుభవిస్తుంది. చివరికి చనిపోయిన తరువాత కూడా దాని చర్మంతో డోలు చేస్తే 'హం హం – నేను, నేను' అంటూ శబ్దం చేస్తుంది"

ఓ ఉప్పు కణికకు ఆధారం అనంత సాగరం. ఆ అనంత సాగరం నుంచి వచ్చిన ఉప్పు కణిక సాగరం లోతునే కను గొనాలని ప్రయత్నించడం ఎంత హాస్యాస్పదమో కదా! అలాగే నీటి బుడగ లాంటి మన బ్రతుకుకు ఆధారం ఆ సచ్చిదానంద సాగరం. ఆ విషయాన్ని మరచిపోతే సృష్టికి ఆధారభూతుడైన ఆ పరమాత్మ మన అజ్ఞానానికి అబ్బురపడక మానదు.

**అహంకారం అంటే!** ఒక మహారాజు తనకు ముక్తి మార్గం బోధించమని ఓ సాధువును ప్రార్థించాడు. ఆ సాధువు రాజుతో "మహారాజా! ఈ లోకంలో అన్ని అనర్థాలకూ మూలం 'నేను' అనే అహంకారమే. దాన్ని మనసులో నుంచి సమూలంగా త్రుంచి వేస్తే గానీ ముక్తి సాధ్యం కాదు" అన్నాడు. మహారాజు "అసలు, ఈ అహంకారమంటే ఏమిటో వివరించండి" అని సాధువును ప్రశ్నించాడు. రాజు అడిగిన ప్రశ్న వినగానే సాధువు కోపోద్రిక్తుడై "ఓ రాజ్యానికి రాజైన మీరు ఇలాంటి అర్థం లేని ప్రశ్నలు వేస్తారా!" అని గర్జించాడు.

సాధువు కోపాన్ని చూసి సహనం కోల్పోయిన రాజు, "ఈ రాజ్యాధిపతినైన నన్నే అవమానిస్తారా! మీకు శిరచ్ఛేదమే సరైన శిక్ష" అని ప్రక్కనే ఉన్న సైనికుణ్ణి పిలిచాడు.

మహారాజు ఉగ్రరూపం చూసి సాధువు చిరునవ్వుల జల్లులు కురిపిస్తూ "రాజా! అహంకారం అంటే ఇదే!" అని సమాధానపరిచాడు.

There is only one thing that can keep growing without nourishment - the human Ego! *- W. Emerson*

పరిశ్రమించకుండా లభించేది ఏదైనా చివరకు ప్రమాదకరంగా పరిణమిస్తుంది. కాబట్టి శ్రమించకుండా మనలో పెరిగే ఈ అహంకారమనే మొక్కను మొదట్లోనే త్రుంచివేయాలి. శ్రమిస్తే గానీ దొరకని సహనం, అణకువ లాంటి సుగుణాల్ని అలవరచుకోవడానికి ప్రయత్నించాలి.

**మనిషికి అతి ప్రియమైనది ఏది?** మనిషికి "నేను" అనే పదమే అత్యంత ప్రియమైనది. మన ప్రతిభను ఇతరులతో చెప్పుకోవడంలో ఆనందం పొందుతాం. మనల్ని ఎవరైనా ప్రశంసిస్తే పరవశించిపోతాం.

ఒక దేశంలో ఓ ప్రసిద్ధ శిల్పి ఉండేవాడు. ఆయన చెక్కిన ప్రతీ కళాఖండంలో జీవం ఉట్టిపడేది. ఆ శిల్పి



జ్యోతిశ్శాస్త్రంలో కూడా సుప్రసిద్ధుడు. అందువల్ల తన మరణం ఎప్పుడు సంభవిస్తుందో అతనికి ముందే తెలుసు. తాను ఎలాగైనా మృత్యువును తప్పించుకోవాలని నిర్ణయించుకొని సరిగ్గా తన రూపాన్ని పోలే విగ్రహాలు కొన్ని తయారు చేశాడు. ఇంతలో యమధర్మరాజు అక్కడకు వచ్చి జీవకళ ఉట్టిపడుతున్న అద్భుత విగ్రహాల్ని చూసి ఆశ్చర్యంతో "ఈ శిలల్ని మానవ

ప్రతిరూపాలుగా అద్భుతంగా మలచిన ఆ అపర బ్రహ్మ ఎవరో?" అన్నాడు.

వెంటనే శిల్పాల మధ్య ఉన్న శిల్పి "నేనే" అని ఆనందంతో అరిచాడు. అప్పుడు యమధర్మరాజు పని సుగమం అయింది. ఈ కథ నుండి మనకు అర్థమైందేమిటి? "ఎంతవారైనా ప్రశంసలకు దాసులే!" అని. కాబట్టి ప్రశంసల తుపానులో కొట్టుకుపోకుండా తగు జాగ్రత్తలు తీసుకోవడం ఎంతైనా అవసరం. ప్రశంస ఓ మత్తుమందు లాంటిది. ఆ మత్తు మన మూర్ఖత్వమనే బాధను బయటపడనివ్వదు. ఈ ప్రశంసల మత్తు నుండి బయటపడే వారే ధన్యజీవులు, మనకు మార్గ దర్శకులు.

**పరదూషణమే మనకు భూషణమా?:** సాధారణంగా మనం చేసిన పనిని గానీ, నిర్ణయాన్ని గానీ అందరూ అభినందించాలని ఆరాటపడతాం. అదే పనిని వేరొకడు మరింత నైపుణ్యంతో చేసినా అతణ్ణి మనం అభినందించం. పైగా ఆ పనిలో లోపాలను వెతికి విమర్శించడానికి సిద్ధమవుతాం. దీనికి కారణం పరదూషణం; మనకు భూషణంగా భావించే తత్త్వం అది! "తాటిని తన్నేవాడొకడుంటే వాడి తలని తన్నేవాడు వేరొకడున్నాడు" అనే సామెతను గుర్తుంచుకుంటే "నేను తెలివైన వాడిని, నాకే అన్నీ తెలుసు" అనే అహంకారాన్ని అధిగమించవచ్చు.

ఒక విదేశీ ఇంజనీరు భారతదేశ పర్యటనకు వచ్చాడు. కలకత్తాలోని ముఖ్య పర్యాటక స్థలాలను సందర్శించడానికి ట్యాక్సీలో బయలుదేరాడు. ట్యాక్సీలో వెళుతుండగా, పర్యాటకునితో

డ్రైవరు : సర్! అదిగో అదే విక్టోరియా హాల్!

పర్యాటకుడు : అలాంటి భవనాన్ని నేనైతే రెండు నెలల్లో నిర్మిస్తాను. మరి కొంతదూరం వెళ్ళాక

డ్రైవరు : సర్! అదే సైన్స్ సిటీ....

పర్యాటకుడు : ఓ! అలాంటి సిటీలు నేను ఒకే నెలలో వంద కట్టించగలను.

దేన్ని చూపించినా 'నేనైతే' అని గొప్పలు చెప్పుకుంటున్న పర్యాటకుని మాటలు విని డ్రైవర్‌కు విసుగు పుట్టింది. డ్రైవర్ ఏమీ మాట్లాడకుండా కారు నడుపుతున్నాడు. అలా కొంత దూరం వెళ్ళాక పర్యాటకుడు దూరం నుంచి కనిపిస్తున్న హౌరా బ్రిడ్జిని చూసి,

పర్యాటకుడు: డ్రైవర్! ఆకాశంలో ఇంద్రధనుస్సులా వేలాడుతూందే అదేమిటి? అని అడిగాడు.

డ్రైవరు : ఏమో సార్! నేను ఈ రోజు ఉదయం చూసినప్పుడు అది లేదు అని బదులిచ్చాడు.

డ్రైవర్ మాటల్లోని అంతరార్థం అర్థమైంది కదూ! ఎప్పుడూ మన గొప్పలు మనం చెప్పుకోవడంలోనే ఆనందం పొందడం కాకుండా ఇతరులు చేసిన పనుల్లోనూ మంచిని చూసి హర్షించడం నేర్చుకోవాలి. పర దూషణమే మనకు భూషణం కాకుండా జాగ్రత్త వహించాలి.

**'నీవు' నాలో ఉన్ననాడు 'నేను' లేను:** ఈ సకల చరాచర సృష్టికి ఆధారభూతుడూ, అనంత శక్తిమంతుడూ అయిన 'భగవంతుడు' ఒకడున్నాడు. ***'తేన వినా తృణమపి న చలతి'*** – భగవంతుని ఆజ్ఞ లేనిదే గడ్డిపోచ కూడా చలించదని విశ్వసించిన నాడు మనలోని 'నేను' అనే భావం నశించి అంతా 'నీవు' అనే భగవత్ చింతన అలవడుతుంది.

మనసంతా భగవంతునితో నిండి ఉంటే ఎలాంటి అనర్థాలూ దరి చేరవని రామాయణంలో లక్ష్మణుని ధర్మపత్ని ఊర్మిళ, హనుమంతునితో చెబుతుంది.

రామరావణ యుద్ధంలో లక్ష్మణుడు మూర్ఛిల్లినప్పుడు, హనుమంతుడు లక్ష్మణుణ్ణి బ్రతికించేందుకు సంజీవిని తీసుకురావడానికి వెళ్ళాడు. ఆంజనేయుడు సంజీవినీ పర్వతాన్ని ఆకాశమార్గంలో తీసుకువస్తున్నప్పుడు భరతుడు ఆంజనేయుణ్ణి రాక్షసుడని అనుమానించి, బాణ ప్రయోగం చేసి ఆంజనేయుడు భూమి పైకి దిగేలా చేశాడు. హనుమంతుడు ప్రాణాపాయ స్థితిలో ఉన్న లక్ష్మణుడి విషయం భరతుడికి వివరించాడు. అక్కడే ఉన్న ఊర్మిళ, 'హనుమా! నా ప్రియనాథుని శరీరంలో రోమరోమమూ రామనామాన్నే ఉచ్చరిస్తుంది. దేహమంతా రామనామ మయమే అయిన నా స్వామికి ఎన్నటికీ ఆపద సంభవించదు' అని ఆంజనేయునితో చెప్పింది.

మనసంతా భగవన్మయం అయినప్పుడు భయానికి చోటు లేదు, అహంకారానికి ఆస్కారం లేదు. ఇదే మహాత్ములంతా తమ జీవితాల ద్వారా మనకు అనుభవపూర్వకంగా బోధించింది. శ్రీరామకృష్ణులు తనను తాను ఉద్దేశించి 'నేను' అని సంబోధించుకోలేకపోయేవారు. కాళీ నామంతో నిండిన ఆ మహాత్ముని మనసులో 'నేను'కు చోటెక్కడిది? అన్ని అనర్థాలకూ మూలమైన 'నేను'ను తొలగించి, భగవంతునితో మన మనసుల్ని నింపితే మన జీవితాలు కూడా ఆనంద నిలయాలుగా మారుతాయి. a

# గోరుముద్ద

- స్వామి సుప్రియానంద

## స్వేచ్ఛ

"తనకు ఇష్టమైన పనిని ఏ మూర్ఖుడైనా చేయగలడు. కానీ తెలివి గలవాడు ఏ పనినైనా తనకు ఇష్టంగా మలచుకుంటాడు" అని స్వామి వివేకానంద అంటారు. ఏ పనినైనా (చదువుకోవటం) ఇష్టంగా చేయగలవా? అని అడిగిన ప్రశ్నకు ఒక విద్యార్థి ఇలా జవాబిచ్చాడు: "చెయ్యవచ్చు! కాని దానికి ఎన్నో అడ్డంకులు ఉంటాయి. అవి తొలగించాలి". ఏ కృత్రిమత లేని ఈ సమాధానం ప్రస్తుత విద్యా విధానానికే ఒక చురక. విద్యావేత్తలు, అధ్యాపకులు, తల్లితండ్రులు వీరంతా



'బోధన ప్రక్రియ' ల గురించి ఆలోచించడమే తప్పా విద్యార్థులకు నేర్చుకోవటంలో కలిగే అడ్డంకులను తొలగించడానికి ప్రయత్నించడం లేదు.

విద్యాభ్యాసం వలన మనోవికాసం కలగాలి. మనోవికాసం పెరుగుదలను సూచిస్తుంది. "వికాసానికి స్వేచ్ఛ మొదటి నియమం" (Freedom is the first condition of growth) అని స్వామి వివేకానంద వక్కాణించారు. స్వేచ్ఛ మనిషిలో ఆసక్తినీ, ఉత్సాహాన్నీ పెంచుతుంది. అది లేకపోతే వికాసం కుంటుపడుతుంది. వికాసవిహీన విద్యాభ్యాసానికి విలువ లేదు. ఈ సందర్భంలో రవీంద్రనాథ్ టాగూర్ చెప్పిన ఓ చిలుక కథ మనందరికి కనువిప్పు కావాలి.

ఓ తోటలో ఒక చిలుక ఉండేది. అది రోజూ ఆడుతూ పాడుతూ హాయిగా ఎగురుతూ తోటలోని పండ్లను తింటూ, కొన్ని ముక్కుతో కొరికి సగం తిని వదిలేస్తూ ఉత్సాహంగా కాలం గడుపుతుండేది. ఒక రోజు ఆ చిలుక ఓ మహారాజు కంటపడింది. ఆ రాజు మంత్రితో "ఈ చిలుక తన జీవితాన్ని వృథా చేసుకొంటుంది. దీన్ని మనం ఎలాగైనా ఉద్ధరించాలి" అంటాడు. దానికి మంత్రి "అవును మహారాజా! ఈ చిలుకకు విద్యను నేర్పిస్తే దాని జీవితం ప్రయోజనకరంగా మారుతుంది. కాబట్టి దీనికి చదువు చెప్పిద్దాం" అంటాడు. దానికి రాజు వెంటనే అంగీకరించి తన మేనల్లుడిని నియమిస్తాడు. ఆ పనికి కావలసిన నిధులు కేటాయిస్తాడు. మేనల్లుడు హుటాహుటిన ఎగిరిపోయే చిలుకను పట్టుకొని దాన్నొక పంజరంలో నిర్బంధిస్తాడు. విద్యావేత్తలను రప్పించి చిలుక చదువుకు కావలసిన సిలబస్ (పాఠ్యప్రణాళిక)ను తయారు చేయిస్తాడు. ఎంతో శ్రమించి దేశంలోని అత్యున్నత అధ్యాపకులను రప్పిస్తాడు. అధ్యాపకులు చిలుకను చూసి 'అది కుదురుగా ఒక దగ్గర కూర్చోవడంలేదు. దానికి క్రమశిక్షణ లేనిదే చదువురాదు. కాబట్టి దాన్ని ఎగరకుండా చేయండి' అని చెప్తారు. వెంటనే ఆ చిలుక రెక్కలను కత్తిరిస్తారు. అప్పుడు అధ్యాపకులు పాఠ్యపుస్తకాల సారాన్ని చిలుక నోటిలో నూరిపోస్తారు. చిలుక చదువు పూర్తయింది. ఒకసారి మహారాజు చదువు పూర్తిచేసుకున్న చిలుకను చూడటానికి వస్తాడు. అది ఇప్పుడు ఎగరటం లేదు, పాడటం లేదు. ఎంతో క్రమశిక్షణతో ఉలక్కుండా పలక్కుండా మౌనంగా ఉన్న ఆ చిలకను చూచి, తన ప్రణాళికను సమర్థంగా అమలు పరచిన సిబ్బందిని రాజు ప్రశంసిస్తాడు.

పిల్లలకు విద్యాబుద్ధులను నేర్పించాలని పంజరంలోని చిలుకలాగ పిల్లల్ని ఇంట్లో బంధించి, క్రమశిక్షణ పేరుతో వారికి స్వేచ్ఛ లేకుండా చేస్తే వారిలో మనోవికాసం, సృజనాత్మకతలు కుంటుపడతాయి. కాబట్టి పిల్లల స్వేచ్ఛ (స్వ+ఇచ్ఛ)కు కలిగే అవరోధాలను తొలగించి వారి అభివృద్ధికి తోడ్పడడమే పెద్దల కర్తవ్యం.

# రంగస్థల నటునిలో రమ్యకృష్ణుని దర్శనం !

– స్వామి సర్వజ్ఞానంద

రామకృష్ణ మిషన్ స్టూడెంట్స్ హోమ్ (మద్రాసు)లో 1921లో నేను విద్యార్థిగా చేరినప్పుడు స్వామి అనంతానందను కలిశాను. వారు నాకు శ్రీరామకృష్ణుల గురించీ, స్వామి వివేకానందుల గురించీ ఎన్నో విషయాలు కథలుగా చెప్పారు. అప్పటికి గురుదేవుల గురించి నాకు చాలా స్వల్పంగా తెలుసు. 1912లో నేను మా పల్లెటూరి బడిలో చదువుతున్నప్పుడు ఒకరోజు ప్రధానోపాధ్యాయుని గది శుభ్రం చేస్తుండగా ఒక చిన్న పెట్టెలో కొన్ని ఫోటోలు చూశాను. వాటి గురించి నేను ప్రధానోపాధ్యాయుణ్ణి అడిగాను. అప్పుడు వారు "ఇది శ్రీరామకృష్ణుల పటం, ఇది స్వామి వివేకానందులది. స్వామి వివేకానందులు శ్రీరామకృష్ణుల శిష్యుడు, హిందూమత సందేశాన్ని అమెరికాలో చాటి చెప్పింది ఆయనే" అన్నారు. మొదటిసారిగా నేను శ్రీరామకృష్ణుల గురించి, స్వామి వివేకానందుల గురించి విన్నది అప్పుడే!


స్వామి బ్రహ్మానంద

ఒకరోజు స్టూడెంట్స్‌హోమ్ కార్యదర్శి అయిన రామస్వామి అయ్యంగార్ మద్రాసు మఠంలో ఉంటున్న స్వామి బ్రహ్మానందకు కొన్ని కాయగూరలు ఇచ్చి రావాల్సిందిగా చెప్పారు నాతో. నేను అనుభవం లేని ఓ పల్లెటూరి అబ్బాయిని. కొన్ని పొడవాటి పొట్లకాయలను చాపిన నా చేతులలో పెట్టారు ఆయన. నేను వాటిని నా ఛాతీకి ఆనించుకొని పట్టుకున్నాను. ఆయన వాటిని స్వామి బ్రహ్మానందకు ఇచ్చి, వారి పాదాలకు నమస్కరించమన్నారు. రాజా మహారాజ్ (స్వామి బ్రహ్మానంద) దగ్గరకు వారి పట్ల గౌరవంతో కాకుండా, కార్యదర్శి అంటే ఉన్న భయం కొద్దీ కూరగాయలు పట్టుకుని బయల్దేరాను.

మఠానికి వెళుతుండగా, దారిలో ఒక వీధి చివర స్వామి బ్రహ్మానంద, స్వామి శివానంద స్టూడెంట్స్ హోమ్‌కి వెళుతూ కనిపించారు. ఆ రోజుల్లో రోడ్డు మీద అన్ని కార్లు లేవు కానీ, సైకిళ్ళు, ఎద్దు బళ్ళు, వచ్చే పోయే మనుషులతో రోడ్డు సందడిగానే ఉంది. నాకేం చెయ్యాలో తోచలేదు. రామస్వామి అయ్యంగార్ ఇచ్చిన ఆదేశాన్ని పాటించకపోతే ఎలా అనుకుని చేతిలో పొట్లకాయలు పట్టుకొని, రోడ్డు మీదే రాజా మహారాజ్ పాదాల వద్ద నా తల ఉంచాను. అయితే ఇప్పుడెలా లేవడం! మహారాజ్ నన్ను లేవనెత్తారు. నేనెంత భాగ్యశాలిని! శ్రీరామకృష్ణుల ఆధ్యాత్మిక పుత్రుని అనుగ్రహం నా భక్తి వల్ల కాక వారి ఔన్నత్యం వల్ల లభించింది. అప్పుడు నా చేతిలో ఉన్న కూరగాయలను మఠంలో ఇచ్చి, స్టూడెంట్స్ హోమ్‌కి రమ్మన్నారు. నా జీవితంలో ఎన్నో అనుభవాలు ఎదురయ్యాయి. అయితే ఈ సంఘటన నిన్ననో మొన్ననో జరిగినంత స్పష్టంగా నాకు అనిపిస్తుంది.

ఆ సంవత్సరం రాజా మహారాజ్ మద్రాసులో దుర్గాపూజ ఉత్సవాలు నిర్వహించడానికి ఏర్పాట్లు చేశారు. ఆ ఉత్సవంలో స్వామి శివానందజీ, శ్రీరామకృష్ణుల అన్న కుమారుడైన రామ్‌లాల్ కూడా పాల్గొన్నారు. విజయదశమి నాడు స్టూడెంట్స్ హోమ్‌లో నాటక ప్రదర్శన జరిగింది. ఆ నాటకంలో కృష్ణ పాత్రధారి అద్భుతంగా ఉన్నాడు. చేతిలో వేణువు, కిరీటంతో పచ్చ దుస్తులు, నెమలి పింఛం ధరించాడు.

రామస్వామి అయ్యంగార్ బంధువు అయిన ఒక భక్తుడు ప్రదర్శన పూర్తయ్యాక రాజా మహారాజ్‌ని కలవడానికి కృష్ణ వేషధారిని మఠానికి తీసుకొని వచ్చారు. అతణ్ణి చూడగానే మహారాజ్ అతని పాదాలకి సాష్టాంగ ప్రణామం చేశారు. అంతటి దివ్యదృశ్యం చూసింది నేను ఒక్కణ్ణే! శ్రీకృష్ణుడు నిజంగా నా కళ్ళెదుట ప్రత్యక్షమైనా నేను అంత భక్తి ప్రపత్తులను చూపనేమో అనిపించింది. అయితే స్వామి బ్రహ్మానంద మహారాజ్ అతనిలో కృష్ణుణ్ణే దర్శించారు. నటునిలోకూడా నారాయణుని దర్శించిన రాజా మహారాజ్ ఉన్నత మానసిక స్థితి అత్యద్భుతం. ఈ సంఘటన నా మనస్సుపై చెరగని ముద్ర వేసింది. `

**(ఈ నెల 9న స్వామి బ్రహ్మానంద జయంతి)**



# ఆధ్యాత్మిక తేజోరాశి భీష్మ ఏకాదశి

– ఏ.ఎస్. మూర్తి

పంచమవేదంగా పేరు పొందిన మహా భారతం సర్వ ధర్మ సమన్వయరూపం. అది ధర్మార్థ కామమోక్ష చతుర్విధ పురుషార్థాలకు విజ్ఞాన సర్వస్వం. భారతంలోని భగవద్గీత, విష్ణు సహస్రనామ స్తోత్రం ఆ మహా కావ్యానికి రెండు కన్నులలాగ ప్రకాశించి మానవాళికి ఆధ్యాత్మిక జ్ఞానాన్ని ప్రసాదిస్తాయి. ఆ రెండిటిలో భగవద్గీత కర్మ యోగానికి ప్రతీక అయితే విష్ణు సహస్రనామం భక్తి యోగానికి.

విష్ణుసహస్రనామస్తోత్రం పరమాత్ముడు, పురుషోత్తముడు అయిన శ్రీహరి విశ్వమయతనను, సహస్ర శీర్ష మూర్తి తత్త్వాన్ని వివరించి మనలో ఆధ్యాత్మిక తేజస్సును ప్రకాశింపజేస్తుంది. ఆ విష్ణుసహస్రనామాన్ని భగవంతునికి అంకితం చేస్తూ స్తోత్ర రూపంలో పాండవులకు భీష్ముడు ఉపదేశించిన తరువాత అది అత్యంత శక్తివంతమైన భక్తి మార్గంగా అందరిచేతా అనుష్ఠించబడింది. స్తోత్రాలన్నింటిలో తలమానికమై, భక్తి సాధనలో పవిత్ర పునశ్చరణ మంత్రంగా ఉపాసించబడుతోంది. ఆ విష్ణు సహస్రనామం జగద్విదితమైన మాఘశుద్ధ ఏకాదశి పవిత్రమైన భీష్మ ఏకాదశిగా ప్రతి సంవత్సరం ఆచరించబడుతున్నది.

మహా భారతంలో భీష్ముని పాత్ర అత్యంత ప్రశస్తమైనది. కురు పాండు రాకుమారులకు విద్యా బుద్ధులు చెప్పించి, వారి వృద్ధికి తోడ్పడిన ఆచార్యుడు భీష్ముడు. దేవ గురువు బృహస్పతి వద్ద రాజనీతినీ, ఇక్ష్వాకుల కులగురువు వశిష్ఠుని వద్ద వేద వేదాంగాలనూ, పరశురాముని వద్ద విలువిద్యనూ అభ్యసించిన బహుముఖ ప్రజ్ఞాశాలి భీష్మాచార్యుడు. తన తండ్రి కోసం రాజ్యాధికారాన్ని త్యాగం చేసి ఆజన్మాంతం బ్రహ్మచర్య వ్రత దీక్షను పూనిన దీక్షాపరుడు ఆ మహనీయుడు. అన్నిటికీ మించి శ్రీకృష్ణుని అవతార తత్త్వాన్ని గ్రహించి ఆయన్ని మనసారా సేవించి, ఆ భగవానుని అనుగ్రహం పొందిన భాగవతోత్తముడు భీష్ముడు.

కౌరవ పాండవుల మధ్య రాజీకి ధర్మ బద్ధంగా కృషిచేసి అది విఫలమైతే కౌరవుల పక్షాన కురుక్షేత్ర సంగ్రామంలో యుద్ధం చేసిన భీష్ముడు అర్జునుడి బాణాలతో నిహతుడైనప్పుడు దేవతలు అతని వద్దకు హంస రూపంలో వచ్చి ఇప్పుడు దక్షిణాయనం కనుక ఉత్తరాయణం వచ్చే వరకూ ప్రాణ త్యాగం చేయవద్దని సూచించారు. అప్పుడు భీష్ముడు తన తండ్రి ప్రసాదించిన వరం వలన మాఘ మాసంలో స్వచ్ఛంద మరణం పొందాడు.

అంతవరకూ భీష్మునికి అర్జునుడు అంపశయ్యను అమర్చి అతని ఆకలి దప్పులు తీరటానికి గంగా జలాన్ని భూమి నుండి పైకి తెప్పించాడు. శరతల్పగతుడైన భీష్ముణ్ణి కౌరవ పాండవులు ప్రేమతో సేవించారు. భీష్ముడు శరతల్పం పైనున్న కాలం భారతంలో అత్యంత ప్రశస్తమైంది. ఈ కాలంలోనే ధర్మరాజు పట్టాభిషిక్తుడయ్యాడు. ఆ ఒకటిన్నర నెలల కాలం భీష్ముడు శ్రీకృష్ణుని ధ్యానంలోనే గడిపాడు. ధర్మరాజు సింహాసనం అధిష్ఠించినా, అర్జునుడు గీతోపదేశం పొందినా పాండవులు భీష్ముని వద్ద సమస్త ధర్మాలూ, పరిపాలనా పరిజ్ఞానం పొందాలని శ్రీకృష్ణుడు పాండవులను భీష్మునివద్దకు తీసుకువెళ్ళాడు. అప్పటికే బృహస్పతి, వాల్మీకి, పరశరాముడు, వసిష్ఠుడు, వ్యాసుడు, గౌతముడు మొదలైన మహర్షులు భీష్ముణ్ణి కీర్తిస్తున్నారు. శ్రీకృష్ణుడు భీష్ముని సత్య, ధర్మ, తపో, దాన, దయాగుణాలను మిక్కిలి ప్రశంసించి ధర్మజాదులకు ధర్మ సంచయాన్ని బోధించమని కోరాడు.

శ్రీకృష్ణ పరమాత్మను భీష్ముడు భక్తి పూర్వకంగా స్తుతించి పాండవులకు సర్వ ధర్మ పరిజ్ఞానం ఉపదేశించాడు. అప్పుడే పాండవులకు విష్ణు సహస్రనామం ఉపదేశించబడింది. శ్రీ విష్ణు సహస్రనామం వేద భగవద్గీతల భక్తిసారం. భీష్ముడు మాఘశుద్ధ అష్టమినాడు జీవితత్యాగం గావించాడు. శ్రీకృష్ణుని అనుగ్రహం వలన మూడవ రోజు అయిన మాఘశుద్ధ ఏకాదశి (విష్ణు సహస్రనామం ఉదయించిన పుణ్యదినం)నాటి నుండి భీష్మ ఏకాదశిగా ఆచరించబడుతోంది.

**(ఈ నెల 17న భీష్మ ఏకాదశి)**





# స్వార్థం మానుకొని సమతను పంచు !

– స్వామి ఆత్మానంద

మనం మనకోసమే జీవించడం కన్నా ఇతరుల కోసం కూడా జీవించడం నేర్చుకోవాలి. అదే మానవ జీవితానికి పరమార్థం. పశువులు కూడా తమ కోసం తాము జీవిస్తాయి. ఇతరుల కోసం జీవించగలిగే శక్తి, తెలివి మనుష్యులకే ఉంటాయి. "ఇతరులకు సహాయం చేసిన వారిలో మానవత్వం ప్రకటితమవుతుంది'' అని స్వామి వివేకానంద అనేవారు. స్వార్థాన్ని జయించి పరోపకారం చెయ్యడమే మానవత్వం.

ఒకవైపు పూజలు, పునస్కారాలు చేస్తూ దేవాలయాలకు వెళ్ళి దైవదర్శనాలు చేసుకుంటూ, మరోవైపు సంకుచిత మనస్తత్వాన్ని విడిచిపెట్టకపోతే, చేసిన పూజలన్నీ వ్యర్థం. అలాంటి పూజలు వ్యాపారంతో సమానం.

పరమేశ్వరుణ్ణి మనం గుడిలో ప్రతిమగా కాకుండా, ప్రపంచంలోని దుఃఖితుల్లో, పీడితుల్లో చూసి వారి కష్టాలనూ, బాధలనూ దూరం చేసే ప్రయత్నం చేసిననాడు ఈశ్వరుని కృపకు పాత్రులమవుతాం. కేవలం తనను స్తుతించడం ఒక్కటే పరమేశ్వరుడికి ఇష్టం ఉండదు.

ఒక ధనికుడి తోటలో ఇద్దరు పనివాళ్ళు ఉండేవారు. ఒకడు బద్ధకస్తుడు, దుర్బలుడు. కానీ, యజమాని ఎప్పుడు ఎదురుపడినా లేచి నిల్చొని నమస్కారం చేసి ఆయన అందచందాలను పొగిడేవాడు. రెండో పనివాడు తన పని తాను చూసుకునే వాడు. బాగా కష్టపడి పని చేసి, తోటలో రకరకాల పళ్ళు, కూరగాయలు పండించి అన్నీ తనే మోసుకుంటూ దూరంగా ఉన్న యజమాని ఇంటికి తీసుకుని వచ్చేవాడు. ఇద్దరిలో ఎవరిని యజమాని ఇష్టపడతాడు? తోటలో కష్టపడి పనిచేసిన ఆ రెండోవాడినే!

అదే విధంగా ఈ ప్రపంచమే ఒక తోట. దాని యజమాని ఆ భగవంతుడు. ఇక్కడ కూడా రెండు రకాల తోట పనివారున్నారు. మొదటి రకం మనుష్యులు బద్ధకస్తులు! పనీ పాట చెయ్యని వారు; పై పై కబుర్లు చెబుతూ భగవంతుణ్ణి ప్రశంసలతో ముంచెత్తుతూ ఉండే రకం వీరు. రెండో రకం మనుష్యులు భగవంతుని సంతానమైన మానవులందరికీ సాయం చేసి తరించేవారు. ఈ రెండు రకాల మనుష్యుల్లో భగవంతుడికి ఏ రకం వారు నచ్చుతారు? నిశ్చయంగా ఇతరులకు సేవ, సహాయం చేసే వారే! అందుకే 'మానవ సేవే మాధవ సేవ'అని స్వామి వివేకానంద ప్రబోధించారు.

సాధ్యమైనంత వరకూ పవిత్రంగా ఉండి, వీలైనంత వరకూ ఆపదలో ఉన్న వారికి సహాయం చెయ్యడమే మన జీవితాన్ని తగిన విధంగా ఉపయోగించుకోవడమంటే! దాని వల్ల మనస్సులో ఉన్న మాలిన్యమంతా తొలగిపోతుంది. మన హృదయంలో నివసించే భగవంతుడు ప్రకటితమవుతాడు. అద్దం మీద ధూళి, దుమ్ము పేరుకొని ఉంటే దానిలో మన ప్రతిబింబం స్పష్టంగా చూసుకోలేం. దుమ్ము దులిపితే అద్దంలో ప్రతిబింబం బాగా కనిపిస్తుంది. అలాగే అజ్ఞానం, దానితో ఉత్పన్నమయ్యే స్వార్థం మన హృదయమనే అద్దం మీద దుమ్ములా పేరుకు పోతాయి. నిస్వార్థపరుడెప్పుడూ దేనినీ ఆశించడు. "నా గురించి నాకు బెంగ లేదు. స్వర్గానికి వెళ్ళాలనే కోరిక నాకు లేదు. ఎవరికైనా మంచి జరుగుతుందంటే నేను నరకానికి వెళ్ళడానికైనా సిద్ధమే". అంటాడు స్వార్థం లేనివాడు. ఇదే మానవత్వమంటే. ఆధ్యాత్మిక మార్గంలో ప్రగతిని సాధిస్తున్నారనడానికి ఇదే ఓ నిదర్శనం. వారే భగవంతుడికి ఇష్టులవుతారు – అతడు నాస్తికుడైనా సరే. స్వార్థపరుడు ఎన్ని గుళ్ళు తిరిగినా, ఎన్ని తీర్థ స్థలాల చుట్టూ తిరిగినా దేవునికి ఎన్నటికీ ప్రియుడు కాలేడు. కాబట్టి ప్రతి మనిషీ తన సుఖాన్ని కోరుకోవడంతో పాటు ఇతరులకు సంతోషాన్ని ఇవ్వగలిగిననాడే ఈ అరుదైన మానవజన్మ సార్థకమైనట్లు! a




ప్రవచనం: శ్రీ సామవేదం షణ్ముఖశర్మ    విలేఖనం: శ్రీమతి ఎన్. శేషు

**(గత సంచిక తరువాయి)**

"ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి" నాకు అది ఇష్టం, ఇది ఇష్టం అని ఎందుకు చెప్పుకుంటామంటే– నీకు నువ్వు ఇష్టం కనుక అలా చెబుతావు, అది తిని నువ్వు తృప్తి పడదామని! ఇది ప్రతి వారికీ అనుభవంలో ఉన్న విషయం. అదే బ్రతుకు తీపి. "నేను అనే తీపి వస్తువు పెడితే చాలు చీమలు వస్తాయి. మధువు పెడితే కైటభం వస్తుంది. తీపి ఉంటే పురుగులు చేరినట్లు "అహం" అనే ఒకటి ఉంటే "మమ" అనేవి అనేకం చేరుతాయి. ఈ అనేకాలే కీటకాలు. 'నేను' అనే భావం రాగానే 'నాది' అనేది కాపాడుకోవాలనే తాపత్రయం, కనిపించేది నాదిగా చేసుకోవాలనే తాపత్రయం, నాది కాదేమోననే భయం, ఏది కాకుండా చేస్తుందో దాని మీద ద్వేషం, ఏది నాదయ్యేలా చేస్తుందో దాని మీద అనురాగం. అలా రాగ ద్వేషాలు వచ్చాయి. 'నేను' అనే మధువును ఆశ్రయించుకొని,



మనకు లెక్క తెలియని కీటకాలు ఎన్ని చేరుతున్నాయో! కనుక ఈ మధుకైటభ భావాలు చాలా బాధాకరమైనవి. అవి యోగనిద్రా ముద్రితులైన వారిని ఏమీ చెయ్యలేవు. రజోగుణంతో ఈ సృష్టి మీద మమకారపడే వారి మీద పడతాయి. అక్కడ చతుర్భుజాలతో యోగ నిద్రాముద్రితుడైన ఆ పరమేశ్వరుడైన నారాయణుడి వద్దకు వెళ్ళాయట అవి యుద్ధం చెయ్యడానికి. ఈ రెండు గుణాలూ ఊరకోవు, అవతలవాణ్ణి అశాంతపరుస్తాయి.

నిద్రలో ఉన్న నారాయణుడితో ఎలా యుద్ధం చేస్తారు? అందుకే పైకి చూశారు. అక్కడ పద్మంలో నాలుగు ముఖాలతో ఎవరో కనిపించారు. అతని మీద దాడి చేశాయి. ఆయన రక్షించాల్సిందిగా అరుస్తున్నా, కింద నారాయణుడు నిద్ర లేవలేదు. అప్పుడు "నాలో మెలకువ ఎవరు, ఆయనలో నిద్ర ఎవరు" అని ఆలోచించాడు. 'జాగ్రత్ స్వప్న సుషుప్తీనాం సాక్షి భూత్యై నమో నమః' – నువ్వు మేలుకుని ఉన్నా, కలలో ఉన్నా, గాఢ నిద్రపోతున్నా నీలో చైతన్యంగా ఉండి నిన్ను కాపాడుతున్న, నిన్ను పోషిస్తున్న... నువ్వు తిన్న అన్నాన్ని అరిగిస్తూ, నిన్ను నిద్రపుచ్చుతూ, నిద్రలేపుతూ... నిరంతరం నిన్ను గమనిస్తున్న కన్నతల్లి, కన్నతల్లుల కంటే తల్లి నిన్ను ఎప్పుడూ కనిపెట్టుకుని ఉంది. ఆ తల్లే నిన్ను నిద్ర పుచ్చుతుంది, నిద్ర లేపు తుంది – నిన్నైనా, బ్రహ్మనైనా, విష్ణువునైనా, రుద్రుడినైనా! ఇప్పుడు యోగ నిద్రాముద్రితుడైన నారాయణుణ్ణి నిద్రారూపంలో ఆక్రమించింది ఆ తల్లే. అందుకు ఆ తల్లే అనుగ్రహించాలనుకున్నాడు ఆ బ్రహ్మదేవుడు. నిద్రా స్వరూపిణి అయిన జగదంబికను ప్రార్థించాడు. నిద్ర అంటే సర్వబుద్ధులూ లయమయ్యే స్థితి. అది ఒక్కొక్కరికి ఒక్కొక్కలా ఉంటుంది. శ్రీమన్నారాయణుని యందు 'యోగనిద్ర'గా ఉంటుంది. ఇంద్ర శక్తి యందు 'మోదనిద్ర' అనే పేరుతో ఉంటుంది ఆ తల్లి. జగత్తు యందు 'మోహ నిద్ర' అనే పేరుతో ఉంటుంది. 'మోద నిద్ర' అంటే ఈ జగత్తులో సంచరిస్తూ ఉన్న జగన్మాతృ భావాన్ని ఆశ్రయించి ఉంది. జగద్భావాన్నే విసర్జించి పూర్ణసమాధి స్థితిలో ఉండడమే యోగ నిద్రావస్థ. అంతర్ముఖావస్థ యోగ నిద్రావస్థ. మన నిద్ర మోహనిద్రావస్థ. అంటే మన బ్రతుకంతా కప్పుకున్న నిద్ర మోహనిద్ర. మోహమనే నిద్రే మనలోని వెలుగును కనబడనీయకుండా కప్పిన చీకటి దుప్పటి. ఆ మూడు నిద్రలనూ ఆ తల్లే తొలగించగలదు.

యోగనిద్రను తొలగించి నారాయణ చైతన్యాన్ని బహిర్ముఖం చేసింది. ఈ జగతిని రక్షించాలి కనుక ఆయన అమ్మవారినే ప్రార్థించారు. మహాకాళిని, లయ స్వరూపమైన ఆ జగదంబికను ప్రార్థించగానే అమ్మ దశభుజాలతో సాక్షాత్కరించి, ఆయన శరీరం నుంచి బయటకు వచ్చిందట. అంటే నిద్రా స్వరూపిణి వెలుపలకు వచ్చింది; ఆయన నిద్ర లేచారు. అది చూసి వెంటనే మధు కైటభులు కిందకు దిగి, నారాయణునితో యుద్ధం మొదలుపెట్టారు. నారాయణునితో యుద్ధం చాలా కాలం జరిగింది. యుద్ధం ఆగాలంటే మళ్ళీ అమ్మవారు రావాలి. "బుద్ధిః జ్ఞానం ప్రచోదయాత్" అని మళ్ళీ అమ్మను ప్రార్థించాడు. అందరి బుద్ధుల్నీ ప్రేరేపింపజేసే జగదంబికను ప్రార్థన చేశాడు. బ్రహ్మ దేవుడి ప్రార్థన విన్న వెంటనే ఆ తల్లి వాళ్ళిద్దరి బుద్ధుల్లో కూర్చుందట. వెంటనే వారిద్దరికీ విష్ణుమూర్తి మీద జాలి కలిగి, "ఏదైనా వరం ఇస్తాం కోరుకో" అన్నారట. అప్పుడు విష్ణుమూర్తి "మీరిద్దరూ నా చేతిలో చావాలి" అన్నాడట. వరమిచ్చారు కనుక వెనక్కి తీసుకోలేరు. వరమిచ్చినట్లు ఉండాలి, చావు తప్పించుకోవాలి కనుక "ఎక్కడ నీళ్ళు లేవో అక్కడ మమ్మల్ని చంపు" అన్నారట.

ఇది మన దృష్టే! మనం ఎంత చూడగలమో అంత చూసి ప్రమాదం లేదనుకుంటాం. చూసినంత మేరను దాటి మన దృష్టికందని జగత్తులో ఏముందో మనకి తెలియదు కదా! మనకు కనిపించేదే సత్యమనుకొని, దాని మీద అంచనాలు వేస్తాం, ఊహిస్తాం. అంతా పరిమితమైన విధంగానే ఆలోచిస్తాం. చూసినంత మేర నీరు తప్ప మరేం లేదు అందుకని "నీరు లేని చోటు దొరకదు, మనల్ని చంపలేడు" అనుకున్నారు. వెంటనే ఆయన తన శరీరాన్ని పెంచి, వాళ్ళిద్దరినీ తొడ మీద పెట్టుకొని చంపేశాడట.

ఇక్కడ ఒక అంతరార్థం ఉంది. ఆయనను అంటుకొని, ఒడిలో చేరితే రజోగుణ, తమోగుణాలు నశిస్తాయట. ఆ విధంగా వాళ్ళిద్దరి పనీ అంతమయ్యాక బ్రహ్మదేవుడు నారాయణుడికి నమస్కరించాడట. ఎప్పుడూ సమాధిలో ఉండే సర్వవ్యాప్తుడైన రుద్రుడు కూడా అక్కడకు వచ్చాడట. ముగ్గురూ కూర్చొని, "జరిగింది అంతా మన ప్రతాపం వల్లే అని అనుకుంటున్నాం. కానీ ఎవరి వల్ల మనం ఇంత పని చేయగలిగాం"? అని అనుకోగానే ఆ తల్లి జ్యోతి స్వరూపంగా దర్శనమిచ్చిందట. "అమ్మా! మమ్మల్ని ఏం చెయ్యమంటావు" అని అడిగారట. "మీరింక సృష్టి, స్థితి, లయలు చేయండి. నేనే మీ యందు వ్యాపించిన చైతన్య స్వరూపిణి శక్తిని. నేను మీకు ప్రేరణను" అన్నదా తల్లి.



"నేనే మిమ్మల్ని ప్రేరేపిస్తున్నాను, సృష్టి స్థితి లయలు చేయండి" అని అమ్మ అంటే, "అమ్మా! ఎలా చేయగలం" అన్నారట వాళ్ళు. "చేసే శక్తి నేనిస్తాను" అంది ఆ తల్లి. "నీ అనంత శక్తినీ, నీ స్వరూపాన్నీ మాకు అవగతం చేయి" అన్నారట వాళ్ళు. అలా అనగానే అమ్మవారు "ఇప్పుడు ఒక విమానం వస్తుంది. దానిలో మీరు కూర్చోండి" అన్నారట. అమ్మ సంకల్పం వల్ల వెంటనే ఒక దివ్య విమానం అక్కడకు వచ్చింది. అమ్మ ఆజ్ఞ వల్ల వీరు ముగ్గురూ అందులో కూర్చున్నారట.

ఆ విమానం బయల్దేరి వాళ్ళకు తెలియని అపూర్వ లోకాలకు తీసుకొని వెళుతోందట. ఈ బ్రహ్మాండంలో ప్రళయావస్థ, సృష్టికి ప్రారంభావస్థ చూశారట. మరొక బ్రహ్మాండంలోకి వెళ్ళాక అక్కడ ఒక లోకం కనపడిందట. అక్కడ ఇంద్రుడు, దేవతలు గోచరించారట. తరువాత మరొక లోకానికి వెళ్ళగానే పెద్ద కమలం, దానిలో నాలుగు ముఖాలున్నాయన కూర్చొని కనబడ్డారట. అక్కడి నుంచి మరొక లోకానికి వెళితే, అక్కడ విష్ణులోకం గోచరించిందట. ఇంకా వెళుతూ ఉంటే శివలోకం గోచరించిందట. అలా అనేక కోటి బ్రహ్మాండాలు చూశారట.

*"వెనకటి బ్రహ్మలు వేవేల సంఖ్యలు వెలసి బ్రహ్మాండాలు ఏలిరట; తెలముని వారల పేరును మరచిరి మనుజ కీటముల మరెవ్వరెరుగు!"* ఎన్ని బ్రహ్మలయ్యారో ఎవరికీ తెలియదు. వాళ్ళు వెలసి బ్రహ్మాండాలు ఏలారట. మరి కీటముల లాంటి మనుష్యులు పదవుల కోసం ఎందుకు కొట్టుకుంటారు అన్నారు తాళ్ళపాక అన్నమాచార్య. a **(సశేషం)**

# పరిప్రశ్న

- స్వామి సుకృతానంద

– ఎ. హేమ్‌చంద్, నెల్లూరు

**? : దైవస్మరణతో మన జాతకాన్ని మార్చుకోవచ్చా ?**

✍: భగవన్నామ స్మరణతో తలరాత మార్చుకోవచ్చు. సాధారణంగా ప్రారబ్ధం అనుభవించవలసిందే అంటారు. అయితే ఒక వ్యక్తి ఫలానా సమయంలో మరణించాలని ఉంటే దైవస్మరణతో ఆ వ్యక్తికి గండం తప్పుతుంది కూడా! "హరిర్హరతి పాపాని దుష్ట చిత్తై రపి స్మృతః అనిచ్ఛయా సంస్పృష్టో దహ్యత్యే వహి పావకః" 'దుష్టబుద్ధియైనా తెలిసో తెలియకో హరి నామస్మరణ చెయ్యడంతో పాపాలన్నీ తొలగుతాయి. ఏ విధంగా అంటే తెలిసో తెలియకో నిప్పులో చెయ్యి పెడితే కాలినట్లు' అన్నారు. మనకు ఏది హితవో దాన్ని ఈశ్వరుడు ప్రసాదిస్తాడు.

– ధీకొండ గణేశ్, గద్వాల

**? : మనం తినే ఆహార పదార్థాలపై త్రిగుణాల ప్రభావం ఉంటుందా? ఉంటే సాత్విక, రాజస, తామస గుణాల ప్రభావం గల ఆహార పదార్థాలు ఏవి?**

✍: త్రిగుణాలు – సాత్వికం, రాజసం, తమోగుణాలు ఉన్నవారు ఏ ఆహార పదార్థాలు తింటారో శ్రీ కృష్ణ పరమాత్మ భగవద్గీతలో వివరించాడు. (17వ అధ్యాయం, శ్లోకాలు 8,9,10). ముఖ్యంగా ఆధ్యాత్మిక సాధనలు చేసేవారు బ్రహ్మచారులు, గృహస్థులు ఎవరైనా సాత్విక ఆహారమే తీసుకోవాలి. ఉదాహరణకు జంతు ప్రదర్శనశాలలో మనం చూస్తాం. ఏనుగులు ప్రశాంతంగా ఉంటాయి. సింహాలు, పులులు, తోడేళ్ళు నిరంతరం స్థిమితం లేకుండా బోనుల్లో అటూ ఇటూ తిరుగుతుంటాయి. మనం తీసుకునే ఆహారం మనపై ప్రభావం చూపుతుంది. రోగం, శోకం, దుఃఖాన్నిచ్చే ఎక్కువ ఉప్పు, కారం, చేదు, పులుపు, వేడి కలిగించేవీ, అధికంగా ఎండి, మంట పుట్టించేవీ (రాజసం), ఒక జాము నిలువ ఉండి, చల్లబడిపోయి, రసం–రుచి లేక, పిప్పి లాగ ఉండేవీ, పాసిపోయి, దుర్గంధమయమైనవీ, ఒకరోజు నిల్వ ఉండి, ఎంగిలి, అపవిత్రమైన తామస ఆహార పదార్థాల్ని వదిలేయాలి. సాత్వికులు తీసుకొనేవీ, ఆయుస్సునూ, ఉత్సాహాన్నీ, శక్తినీ, ఆరోగ్యాన్నీ, మనస్సుకు ప్రశాంతతనూ, సంతోషాన్నీ అందించే రసవంతంగా నేతితో కూడినవీ చెడిపోనివీ మధురంగా ఉండే భక్ష్యాల్ని ఆహారంగా తీసుకోవాలి. అయితే, సాధనలో పురోభివృద్ధి చెందినవారు ఏమి స్వీకరించినా, వారు తినే ఆహారాన్ని జఠరాగ్నిలో ఆహుతిగా వేస్తారు. వారికి ఏ హానీ ఉండదు, అది స్వామి వివేకానంద లాంటి వారికి!

– జి. దుర్గ, వెంకటాపురం

**? : రామకృష్ణ మఠం చిహ్నంలో వుండే కమలం, హంస, సముద్రం, సూర్యుడు, పాము విశేషం తెల్పండి. స్వామి వివేకానంద తర్వాత శిష్యుల నుంచి ఆ చిహ్నం వచ్చిందా?**

✍: స్వామి వివేకానందులు అమెరికాలో ఉండగా ఒక ఆర్టిస్టు చేత తన సూచనలతో ఈ గుర్తును గీయించారు. కమలం భక్తికీ, సముద్రం నిష్కామ కర్మ యోగానికీ, సూర్యుడు జ్ఞానానికీ, సర్పం యోగానికీ గుర్తులు. వీటి ద్వారా పరమాత్మకు ప్రతిరూపమైన హంసను చేరుకోవచ్చు. అంటే కర్మ, భక్తి, జ్ఞాన, యోగసాధనలతో ఆత్మసాక్షాత్కారం కలుగుతుంది; శాశ్వత సచ్చిదానందాన్ని పొందవచ్చు.

– టి. శైలజ, దువ్వూరు

**? : మనస్సు ప్రశాంతంగా ఉండడానికి ఎన్నో మార్గాలు చెబుతుంటారు. వాటిలో ఏది మంచిదో ఎలా తెలుసుకోగలం?**

✍: మొదట నైతిక విలువలను పాటిస్తూ, ఎల్లప్పుడూ నిజం చెబుతూ, ఇతరుల వస్తువులను ఆశించక, ఇంద్రియ నిగ్రహం కలిగి ఉండాలి. నిత్యం ఉదయం సాయం సంధ్యలలో కనీసం అరగంట ధ్యానం చేస్తే మనస్సు ప్రశాంతంగా ఉంటుంది. అంతేకాక పూల నుంచి తేనెటీగ తేనెను గ్రహించినట్లు ఇతరులలోని మంచి గుణాలను చూడాలి. ఇతరులలో తప్పులు ఎంచకూడదు, ఈగలు పుండ్లపై వాలినట్లు! మీరు ఏ మార్గాన్ని అనుసరించినా పై వాటిని గుర్తు పెట్టుకొని ఆచరిస్తే చాలు. 'నీకు మనశ్శాంతి కావాలంటే ఇతరులలోని దోషాలను చూడవద్దు'అన్నారు శ్రీశారదామాత. a





# పుణ్యభూమి మన భారత భూమి

ఈ భూగోళం మీద 'పుణ్యభూమి' అని ప్రశంస లందుకొనే ప్రదేశం ఏదైనా ఉందీ అంటే అది భారతదేశం మాత్రమే. ఏ భూమిలో సౌకుమార్యం, ఉదారత, పవిత్రత అత్యున్నత స్థాయిని చేరతాయో, ఏ ప్రాంతంలో ఆత్మ విచారం, తాత్త్విక ప్రవృత్తి అధిక పాళ్ళలో ప్రవర్తిల్లుతాయో అదే పుణ్యభూమి. మనం రాజకీయ ఆధిక్యతను కానీ, సైనిక శక్తి సామర్థ్యాల్ని కానీ మన జాతి గమ్యంగా ఎంచుకోలేదు. పూర్వం ఇది జరగలేదు; ఇక ముందు జరగబోదు.

సంపదకు మన జాతి ప్రాధాన్యమివ్వలేదు. ఇతర దేశాలన్నింటి కన్నా భారతజాతి సంపన్న దేశమైనా అది ప్రధానమని భావించలేదు. శతాబ్దాలుగా మన జాతి శక్తిమంతమైన జాతి. అయినా అధికారానికి ప్రాధాన్య మీయలేదు. ఇతర రాజ్యాలపై దాడి చేసి జయించే ప్రయత్నాలు చేయలేదు. మరొకరిపై దాడి జరపకుండా తన సరిహద్దుల్లో తానుండి సంతృప్తి చెందింది. సామ్రాజ్యం కోసం భారతజాతి ఎన్నడూ వెంపర్లాడలేదు. కనుక సంపద, అధికారం ఈ జాతికి ఎన్నడూ ఆదర్శాలు కాలేదు.

వేద కాలం నాటికే భారతజాతి తన గమ్యం ఏమిటో ప్రపంచ ప్రజల ముందు ఉంచింది.

'అధికారం వల్ల కాదు, సంపద వల్ల అంత కన్నా కాదు; కేవలం ప్రాపంచిక విషయాలను త్యజించడం వల్లే అమృతత్వాన్ని (కైవల్యాన్ని) చేరుకోగలం' అనే పిలుపు మనం ప్రపంచానికి ఇచ్చాం. జాతి తర్వాత జాతి – ప్రపంచ జాతులన్నీ కోరికల్ని నియంత్రించడమనే చిక్కు సమస్యను స్వీకరించి పరిష్కరించడానికి వారి శక్తి సామర్థ్యాలన్నీ వినియోగించి ప్రయత్నించాయి. కానీ వారందరూ వారి ప్రయత్నాల్లో విఫలమయ్యారు. అధికార వ్యామోహం, ధనాపేక్ష తెచ్చిపెట్టే దుష్టత్వం, దైన్యం లాంటి వాటి వల్ల వారు నామరూపాలు లేకుండా పోయారు. నేడు కూడా వారు అదే పథంలో నడుస్తూ పతనానికి చేరువలో ఉన్నారు. కానీ మనం మాత్రం సమస్యను పరిష్కరించుకున్నాం; మన గమ్యాన్ని నిర్దేశించుకున్నాం. అదృష్ట, దురదృష్టాల మధ్య కూడా దానికే కట్టుబడి ఉన్నాం; చివరి వరకు దానినే నమ్ముకొని నడుస్తాం. ప్రాపంచిక విషయాల పట్ల నిరాసక్తత, వైరాగ్యం– ఇవే మనం ఎన్నుకొన్న పరిష్కారాలు.

ఇదే భారతదేశ పరమార్థం. మనం నిత్యం ఆలపించే జాతీయ గీతాల అంతరార్థం; దేశ మనుగడకు వెన్నెముక ఇదే; దేశం ఉనికికి కూడా ఇదే పునాది; దేశ అస్తిత్వానికి సహేతుకతను ప్రసాదించేది ఇదే – దీన్నే మనం 'మానవజాతిని తాత్త్వికులుగా, ఆధ్యాత్మిక జ్ఞానులుగా రూపొందించే కార్యక్రమంగా భావించాం. ఈ జీవిత విధానం నుంచి జాతి తన దృష్టిని మరల్చలేదు; తార్తార్‌లు, టర్కీవారు, మొఘలాయీలు, ఆంగ్లేయులు... ఎవరి పాలన క్రింద ఉన్నా మనం మన మార్గాన్ని విడనాడలేదు. a

(స్వామి వివేకానంద 'నా భారతం అమర భారతం' నుంచి)



# పరమేశ్వరుని పరిరక్షణలో ...

## స్వామి జపానంద స్వీయ అనుభవాలు -8

(గత సంచిక తరువాయి...)

### వెన్నెల రాత్రిలో వీధి కుక్కల హంగామా

పరివ్రాజక సన్న్యాసిగా స్వామి జపానందజీ తరచూ గుజరాత్‌లో ఉన్న డీసా పట్టణానికి వెళుతూ ఉండేవారు. అక్కడి ప్రజలు ధార్మికులూ, సాధు సన్న్యాసులంటే ప్రేమ భావం ఉన్నవారూ కావడంతో అక్కడకు సన్న్యాసి ఎక్కువ వెళ్ళేవారు.

ఒకసారి సన్న్యాసి ఒక ఆశ్రమంలో ఉన్నారు. నిత్యకృత్యాలకు బయట మైదానంలోకి వెళ్ళాలి. అందుకని ఆయన ప్రతి రోజూ ఉదయం నాలుగు – నాలుగున్నర కల్లా లేచి, బయటకు వెళ్ళిపోయేవారు. ఒకరోజు రాత్రి



గడియారం ఆగిపోయింది. వెన్నెల రాత్రి కావడంతో వెలుగు బాగా ఉంది. తెల్లవారిందనుకొని రాత్రి ఒంటి గంటకే సన్న్యాసి ఆశ్రమం నుంచి బయటకు వచ్చి, కొంత దూరం వెళ్ళారు. ఎదురుగా ఇసుకలో పది, పన్నెండు కుక్కలు రెండు గుంపులుగా విడిపోయి దెబ్బలాడుకుంటున్నాయి. సన్న్యాసిని చూడగానే అవి తమ దెబ్బలాట సంగతి మర్చిపోయి, సన్న్యాసి దగ్గరకు వచ్చి ఆయనను చుట్టుముట్టాయి. కరవడానికి మీద పడబోతున్న సమయంలో ఎర్రగా ఉన్న ఒక పెద్ద ఆడ కుక్క తోక ఆడిస్తూ దగ్గరకు వచ్చి, సన్న్యాసి గుండెల మీద తన ముందు కాళ్ళు పెట్టి నిల్చుంది. దాని ముఖం సన్న్యాసి మెడను తాకుతోంది. అయితే, అది సన్న్యాసి పట్ల మైత్రీభావం చూపిస్తూ తోక ఆడిస్తూనే ఉంది. అది చూసి మిగిలిన కుక్కలన్నీ ఆయన తమకు పరిచితుడే అనుకొని దూరంగా వెళ్ళిపోయాయి. అప్పుడు సన్న్యాసి, “ఇంక వదిలిపెట్టు, ఇంక వదిలిపెట్టు” అంటూ నెమ్మదిగా తన మీద నుంచి కుక్క కాళ్ళను పక్కకు తీశారు. సన్న్యాసి ఇంతకు ముందెప్పుడూ ఆ కుక్కను చూడలేదు. సన్న్యాసిని ఆ కుక్క చూసిందేమో! ఆ కుక్క వచ్చి, ఆ సమయంలో స్నేహం, ప్రేమ చూపించకపోయినట్లైతే మిగిలిన కుక్కలు సన్న్యాసిని చిత్రహింస పెట్టి ఉండేవి. ఇంతకీ ఆ కుక్కకు తన మీద అలా ప్రేమను వ్యక్తం చేయా ల్సిందిగా ఎవరు ప్రేరేపించారు? ఇంకెవరు భగవంతుడే!

### ఒక త్యాగశీలి కథ

శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష శిష్యులైన స్వామి అభేదానందజీ 1906లో అమెరికా నుండి భారతదేశానికి తిరిగి వచ్చారు. వారు అమెరికాలో సుమారు ఇరవై సంవత్సరాలు వేదాంత ప్రచారం చేసి వచ్చారు. కాశ్మీర్ యాత్ర ముగించి కన్‌ఖల్ వచ్చారు. పరివ్రాజక సన్న్యాస జీవితం గడుపుతున్న స్వామి జపానంద ఆ సమయంలో కన్‌ఖల్‌లోనే ఉన్నారు.

ఒకరోజు మాటల సందర్భంలో స్వామి తోతాపురి ప్రసంగం వచ్చింది. శ్రీరామకృష్ణ పరమహంస దేవుని సన్న్యాస గురువు తోతాపురి. ఆయన పంజాబులో ఎక్కడో పుట్టారు. ఎంత ప్రయత్నించినా నాగా పరమహంస తోతాపురి ఏ ఆశ్రమానికి చెందిన వారో ఇప్పటివరకూ ఎవరికీ తెలియలేదు. జపానందజీతో స్వామి అభేదానందజీ “నువ్వు ఇక్కడ ఉంటున్నావు. తోతాపురి గురించి ఏమైనా వివరాలు తెలుస్తాయేమో ప్రయత్నించి చూడు. లూథియానా జిల్లాలో నాగా సంప్రదాయానికి చెందిన సంస్థలు ఎన్నో ఉన్నాయి, ప్రయత్నించు” అని చెప్పారు.

స్వామి జపానంద అంతా విని, అవకాశం దొరకగానే ఆ పని చెయ్యాలి అని నిశ్చయించుకున్నారు. స్వామి అభేదానంజీ కలకత్తా వెళ్ళిపోయిన తరవాత జపానందజీకి అవకాశం దొరికింది. అమరనాథ్ యాత్రకు చాలామంది సాధువులు వెళుతున్నారు. స్వామి జపానంద కూడా

వెళ్ళాలి. కానీ వాళ్ళతో పాటు వెళ్ళడానికి కుదరలేదు. అమరనాథ్ తరువాత వెళ్ళొచ్చు అని నిశ్చయించుకుని తోతాపురి ఆశ్రమం గురించి చూడడానికి బయల్దేరారు.

లూధియానా దగ్గర కిలారాయపూర్ అనే గ్రామం ఉంది. ఆ రోజుల్లో అక్కడ స్వామి దేవపురి అనే మహనీయుడు నివసించేవారు. ఆయన వృద్ధుడు. వారికి తోతాపురి గురించి, ఆయన ఆశ్రమం గురించి తెలియవచ్చని ఎవరో అన్నారు. స్వామి జపానంద లూధియానా వెళ్ళి అక్కడ నుంచి కిలారాయపూర్‌లోని దేవపురి ఆశ్రమానికి వెళ్ళారు. అక్కడ ఆశ్రమంలో నివసిస్తున్న సాధువులు ఆయనకు స్వాగతం పలికారు. అస్వస్థత కారణంగా దేవపురి ఎవరికీ దర్శనం ఇవ్వడం లేదని చెప్పి మూడు నాలుగు రోజులు ఆశ్రమంలో ఉండమన్నారు. జపానందజీ ఉండిపోయారు.

అలా ఉండడం లాభదాయకమే అయింది. దేవపురిగారి దగ్గర నేపాలీ శిష్యుడొకరు ఉన్నారు. అయన ఇంతకు ముందు హృషీకేశ్‌లో శ్రీ నేపాలీ బాబా దగ్గర ఉండేవారు. అక్కడ ఆయన చాలాసార్లు జపానందజీని చూశాడు. నేపాలీ బాబా చలికాలంలో రోజూ సాయంకాలం సాధువులకు రొట్టెలు, కూర భిక్ష పెట్టేవారు. స్వామి వివేకానంద హృషీకేశ్‌లో తపస్సు చేసుకునే రోజుల్లో వారు అక్కడే ఉండేవారు. అందుకని స్వామీజీ అనుయాయులంటే ప్రత్యేక స్నేహభావం చూపేవారు. జపానందజీ ఎప్పుడు సాయంకాలం అక్కడకు భిక్షకు వెళ్ళినా ఆయనకు ప్రత్యేకంగా ఆసనం వేసి కడుపు నిండా భోజనం పెట్టేవారు. అక్కడ నేపాలీ సాధువు జపానందని చాలా సార్లు చూశారు. అవన్నీ జ్ఞాపకం చేసుకుని ఇప్పుడు కూడా జపానందతో చాలా అభిమానంగా మెసిలేవారు. ప్రతిరోజూ ఉదయం గ్లాసు నిండా బాదం పాలు, సాయంకాలం పాలు ఇచ్చేవారు. భోజన సమయంలో పాత కబుర్లు చెబుతూ ఆనందించేవారు.

నాలుగో రోజు ఎవరూ పాలు ఇవ్వలేదు, నేపాలీ సాధువు కనిపించలేదు. మధ్యాహ్నం రెండయినా భోజనం లేదు. ఏమిటయిందో? అక్కడ ఉండే ఇతర సాధువులు కూడా ఎక్కడ మాయమైపోయారో? ఎవరూ కనిపించలేదు అని జపానంద కొంచెం కలత చెందారు. సుమారు మూడు గంటలవుతూ ఉంటే నేపాలీ సాధువు త్వరత్వరగా వచ్చి



"స్వామీజీ మీరు ఏమయినా తీసుకున్నారా, లేదా? నేను గ్రామం నుంచి సరుకులు తీసుకుని రావడానికి సూర్యోదయానికి ముందే వెళ్ళిపోయాను. ఎవరూ పాలు కూడా ఇచ్చి ఉండరు. ప్రతి దినం గ్రామంలోకి వెళ్ళి భిక్ష తీసుకువచ్చే వ్యక్తికి ఒంట్లో బాగాలేదు. భిక్షకు వెళ్ళి రొట్టెలు తీసుకొచ్చేవారు ఎవరూ లేరు. మీకు ఈ విషయాలు చెప్పడానికి ఎవరూ లేరు. మిగిలిన ఇద్దరు సాధువులూ దూరంగా ఉన్న వేరే గ్రామానికి పప్పు ధాన్యాలు తీసుకు రావడానికి వెళ్ళారు. ప్రతి సంవత్సరం గ్రామస్థులు దానంగా ఇచ్చే ధాన్యాలను మేము వెళ్ళి తెచ్చుకోవాలి. ఈ విషయం మీకెవరూ చెప్పి ఉండరు. ఇక్కడ సామాన్ల గది ఎప్పుడూ తెరిచే ఉంటుంది. తెలిసిన వాళ్ళు గోధుమ పిండి, బియ్యం, పప్పులు, నెయ్యి, నూనె లాంటి వస్తువులు తీసుకుని తామే వంట చేసుకుంటారు. నేను ముందుగా ఈ విషయం మీకు తెలియబరచడం మరచిపోయాను. మీకు ఇబ్బంది అయి ఉంటుంది. గురువుగారు ఇక్కడ దేనికీ లోటు చెయ్యలేదు. సాధువులు వచ్చి ఇక్కడ వారికి కావలసినట్లు ఉండవచ్చు. దినుసులు ఉన్నంత వరకూ ఇక్కడ తినవచ్చు. అయిపోయినప్పుడు ఎవరి భోజనం ఏర్పాట్లు వారే చేసుకోవాలి. మేము నలుగురం ఉన్నాం. మేము మాకు తోచినట్లు పనులు చేస్తాం. గురువుగారు ఎప్పుడూ మీరు ఇది చెయ్యండి, ఇది చెయ్యవద్దు అని చెప్పరు. పవిత్రంగా జీవించాల్సిందిగా మాత్రం చెబుతారు. మీకు ఇక్కడే ఉండిపోవాలని ఉంటే మీరూ ఇక్కడ ఒక చిన్న గది కట్టుకోవచ్చు. నేను మీకు సహాయం చేస్తాను" అన్నారు. a

**(మిగతా వచ్చే సంచికలో...)**

**అనువాదం : శ్రీమతి జి.ఎస్. లక్ష్మి**



# కన్నయ్య కరుణ ఉంటే కన్నులెందుకు!

కథ :హరిహరన్, చిత్రాలు : మ.శె. తెలుగుసేత: స్వామి జ్ఞానదానంద

ఢిల్లీ సమీపంలో ఉన్న సిహి అనే గ్రామంలో 500 ఏళ్ళ క్రితం సారస్వత బ్రాహ్మణ కుటుంబంలో సూరదాసు జన్మించారు. అతను పుట్టుకతోనే అంధుడు.

1 సూరదాసు తండ్రికి ఒక సంపన్నుడు, రెండు బంగారు నాణాలు ఇచ్చాడు. ఒక రాత్రి ఓ ఎలుక వాటిని ఎక్కడో పడేసింది. ఉదయం...



2





3 కుమారుడు పనికిరాని వాడని తండ్రి, సూరదాసును ఇంటి నుండి తరిమేశాడు.



4 సూరదాసు ఇంటి నుండి బయలు దేరి ఎక్కడెక్కడో తిరగసాగాడు. ఒక అడవిలో ఒక పశువుల కాపరి....







5 సూరదాసులో గల దివ్య శక్తిని గుర్తించిన ప్రజలు పెద్ద సంఖ్యలో అతడిని దర్శించడానికి రావడం మొదలు పెట్టారు.

అందువల్ల సూరదాసు ఏకాంతం కోసం కృష్ణుని జన్మస్థలమైన మథుర సమీపంలో వున్న గౌగాట్ అనే చోటికి వెళ్లిపోయాడు.

అక్కడ అతను వల్లభాచార్యుడనే మహనీయుణ్ణి కలుసుకున్నాడు.

6





భగవంతునికి తన లోటుపాట్లను విన్నవిస్తూ, విలపించే రీతిలో సూరదాసు ఒక పాట పాడాడు.


7
నాయనా! మరీ ఇంత దుఃఖమెందుకు? ఆనందంగా పాడు! కృష్ణుని లీలలను పాడు! తప్పకుండా ఆనందం కలుగుతుంది!
గురుదేవా! అంధుణ్ణయిన నేను కృష్ణుని లీలలు ఎలా పాడగలను?


8
వల్లభాచార్యునితో సూరుడు తీర్థ యాత్రలు చేశాడు. కాలప్రవాహంలో సూరుడు గానం చేసిన కృష్ణగానం చాలా ఖ్యాతి గాంచింది. భక్తిరసం చిందే పాటలను పాడిన ఆయనను 'సూరదాసు' అని పిలవసాగారు.
సూరా! గోవర్ధనాలయం ఇది. ఇక్కడి భక్తులతో పాటు నీవు కూడా ఉండి కృష్ణలీలలు గానం చేయి!


9
సూరదాసు గానాన్ని వినడానికి అక్బరు చక్రవర్తి కూడా వచ్చాడు.
సూరదాసా! మా చక్రవర్తిని కీర్తిస్తూ పాడండి! వారు మిమ్మల్ని సన్మానిస్తారు.


10
గిరిధరునికి మాత్రమే నా హృదయంలో చోటుంది. నేను వేరేవారిని ఎలా కీర్తించగలను?
సూరదాసుని అచంచల భక్తి విశ్వాసాలకు అక్బరు చక్రవర్తి ముగ్ధుడయ్యాడు.

మిగతా 36వ పేజీలో...

# ఆశ - తృష్ణ

ఎప్పటి నుంచో తెలియదు కానీ, ఈ హృదయంలో 'ఆశ' అనే అజ్ఞానాంధకారం వ్యాపించింది. కామ, క్రోధ, లోభాది గుడ్లగూబలు ఆ చీకట్లో గూళ్ళు కట్టుకొని కాపురం చేస్తున్నాయి. నేను సద్గుణాలను ఆశ్రయించాలని అనుకొంటూ ఉండగానే, ఇంతలో ఎక్కడి నుంచో తృష్ణ వచ్చి పడుతోంది. ఇంట్లోకి ఎలుక ప్రవేశించి నూతన వస్త్రాలను కొరికి పాడుచేసినట్లు, ఇది మంచి ప్రయత్నాలను, సత్ప్రవర్తనలను పాడు చేస్తోంది. ఇక మేము వివేకం పొందేది ఎప్పుడు? ఆత్మ దర్శనం చేసేదెప్పటికి? వలలో చిక్కుకొన్న పిట్టల్లా మేము ఆశాపాశ క్లేశ దుర్వాసనలలో చిక్కుకొన్నాం. అనేక తృష్ణల వల్ల దగ్ధమవుతున్న మేము అమృతంలో స్నానం చేస్తే మాత్రం సేద తీరుతుందా? ఊరట కలుగుతుందా?

బురదలోని తడిని సూర్యకిరణాలు పీల్చివేసినట్లు మా అంతఃకరణలోని కొద్దిపాటి దయాదాక్షిణ్యాలను తృష్ణ వచ్చి పీల్చివేస్తుంటే మేము నిస్సహాయులమై చూస్తున్నాం. చూస్తూ ఉండగానే అది వచ్చి మా కళ్ళు కప్పివేస్తోంది. కన్నులుండి కూడా అంధులమవుతున్నాం. మామూలుగా అతి శాంత చిత్తుడైనవాడు కూడా తృష్ణ వల్ల కలవరపడతాడు. ఎక్కడన్నా ధన, కనకాలను చూస్తే చాలు, ఈ తృష్ణ పిలిచినట్లు వస్తోంది.

ఆశతో నిండి ఉన్న మనస్సు "నేను ఆశ్రయించబోయే వారు నాకు అనుకూలురా కాదా? ఆ యా వస్తువులు వాస్తవానికి శ్రేయోదాయకమా, ప్రమాదకరమా?" అని కూడా పరిశీలించదు. దీనంగా వారినీ, వీరినీ తుచ్ఛ పదార్థాల కోసం అర్థిస్తోంది. "తాను తలచింది సాధ్యమా? అసాధ్యమా?" అని కూడా పరీక్షించుకోకుండా ఆత్రపడుతోంది. దున్నపోతు ముక్కుకు త్రాడుకట్టి లాగబడునట్లు అది మమ్ములను దిక్కులన్నీ త్రిప్పుతోంది. పుత్ర మిత్ర కళత్రాదులు అనే వలలను మాపై విసిరి మభ్యపెడుతోంది. అంతఃపురంలో శయ్యపై శయనించిన వారిని కూడా క్షోభింపజేసి, అడవుల పాలు చేస్తోంది. ఉన్న కాస్త వివేకం అడుగంటుతోంది. లేని జాడ్యాలన్నీ తెచ్చి పెడుతోంది. నిర్దయుడైన ఆ భగవంతుడు ప్రపంచంలోని జీవులందరినీ 'తృష్ణ' అనే త్రాటితో 'సంసారం' అనే స్తంభానికి బంధిస్తున్నాడు. అచేతనుణ్ణి కీటకాలు బాధిస్తున్నట్లు మేము ఆశ వల్ల బాధితులమవుతున్నాం.

**శ్లో॥ అపి మేరు సమం ప్రాజ్ఞమపి శూరమపి స్థిరమ్ ।**
**తృణీ కరోతి తృష్ణైకా నిమేషేణ నరోత్తమమ్ ॥**

మేరువుతో సమానమైన ధీరుడైనా, మహాప్రాజ్ఞుడైనా, సర్వోత్తముడైనా తృష్ణ చేత క్షణంలో జయింపబడుతున్నాడు.

ఈ లోకంలో జీవుని దుఃఖమంతా నశించాలంటే ఒక్కటే ఉపాయముంది. అది 'విషయచింతన లేకపోవడమే'. ఆశ రూపాంతరమే విషయచింతన. ఆశను త్యజిస్తే జీవుడు ఒడ్డుకు చేరినట్లే. ఈ తృష్ణంత నీచంగా, ఘోరంగా పదునైన కత్తి వేటు, వజ్రాయుధ ఘాతం, అగ్నిహోత్రం బాధింపజాలవనే నా అభిప్రాయం. ఎందుకంటే ఇది హృదయంలోనే ఉండి జీవుణ్ణి దహిస్తుంది. అయినా సరే, కొందరు మహామహులు దానిని "వివేకం" అనే కత్తితో నరికి వేస్తున్నారు. అవిద్యాపూర్వకమైన కామ్యకర్మల నుండి బైటపడి పరమశాంతిని పొందగలుగుతున్నారు. ఈ ప్రపంచమంతా ఎందులో నిబిడీకృతమై ప్రవర్తిస్తోందో, ఆ ఆశను విజ్ఞాన వివేకాలచే జయించాలని నేను నిశ్చయించుకొన్నాను. ఈ సామ్రాజ్యాదులు ఆశను అధికమే చేస్తాయి. ఇవి నాకు అవసరం లేదు. వాంఛలు నశిస్తే మనస్సుకు ఉత్తమ చికిత్స ప్రాప్తించినట్లే కదా! a

*('శ్రీవసిష్ఠ రామ సంవాదం' వైరాగ్య ప్రకరణం నుంచి)*

**అనువాదం: వై. హెచ్. రామకృష్ణ**

# ఆధ్యాత్మిక అన్వేషణ



- స్వామి తపస్యానంద

**ప్రశ్న:** నిర్లిప్తత ఎలా అలవడుతుంది?

**జవాబు:** వివేచన, పునరాలోచనల ద్వారా నిర్లిప్తతని కొంతవరకూ అలవరచు కోవచ్చు. "అంతా భగవంతుడిదే, నేను ఆయన ప్రతినిధిని" అన్న నమ్మకంతో సదా మనస్సులో పునరాలోచన చేసే వ్యక్తి సంసారంలో ఉంటూనే నిర్లిప్తంగా ఉండగలడు. అయితే భగవంతునియందు భక్తి విశ్వాసాలు లేనివారిలో ప్రాపంచిక విషయాలపై ఆకర్షణ, మమకారం అధికంగా ఉంటాయి. కాబట్టి ఎవరైతే భగవంతుని యందు శరణాగతి భావంతో బాధ్యతల్ని నిర్వర్తిస్తారో వారిలో నిర్లిప్తత అలవడుతుంది.

**ప్రశ్న:** భక్తి శాస్త్రాలు భగవంతుడు, భక్తుడు వేరు అని చెబుతాయి. ఉపనిషత్తులు భక్తుడు, భగవంతుడు అభేదమని బోధిస్తున్నాయి. ఈ రెండింటిలో ఏ మార్గాన్ని అనుసరించాలి?

**జవాబు:** ఇటువంటి సందేహం కలిగినప్పుడు అద్వైత దృష్టితో చేసిన ఉపనిషత్‌ల వ్యాఖ్యానాలను విడిచిపెట్టి భక్తి శాస్త్రాలను అనుసరించడమే మంచిది. శ్రీ రామానుజులు ఉపనిషత్తులను కేవలం భక్తి దృక్పథంలోనే వ్యాఖ్యానించారు. వారు చెప్పిన దాని ప్రకారం ఆత్మ చైతన్యం మొత్తంగానూ, అంశాలుగానూ విశ్వమంతటా వ్యాపించి ఉంది. పరమాత్మ జీవాత్మల మధ్యనున్న వ్యత్యాసం వలన సేవ, ఆరాధన భక్తి, ప్రేమపూర్వక అనుబంధం వంటి వాటికి అవకాశం ఉంటుంది. అందువలన పరమాత్మని అద్వైతుడిగా భావించలేని భక్తి వైఖరిగలవారు విశ్వంలోని ప్రతి అంశంలోనూ ఆ పరమాత్మే నెలకొనివున్నాడని గ్రహించాలి. జీవాత్మలు వాటి ఉనికి కోసం పూర్తిగా ఆ పరమాత్మపైనే ఆధారపడతాయి; ఉపనిషత్తులు ప్రతిపాదించిన ఈ సిద్ధాంతాన్ని భక్తుడు అనుసరిస్తే భక్తి మార్గం సుగమమవుతుంది. ఉపనిషత్ ప్రతిపాద్యమైన పరమాత్మ గురించి వివరంగా పరిశీలిస్తూ పురాణాలు చెప్పినదిదే. అద్వితీయుడైన పరమాత్మ సాక్షాత్కారానికి ఇది ప్రతిబంధకం కాదు. భక్తిని అభ్యాసం చేసే భక్తునికి భగవంతుడి కృప వలన ఆయన నిజతత్త్వం వ్యక్తమవుతుంది. అందువలన భక్తులు అద్వైతం గురించి సందేహాలు కలిగితే వ్యాకుల పడనవసరం లేదు.

**ప్రశ్న:** గురువునీ, ఇష్టదైవాన్నీ ఒకటిగా తలచి ధ్యానించవచ్చా?

**జవాబు:** అందరికీ భగవంతుడొక్కడే గురువు. ఆయనే సాధకుడికి ఆధ్యాత్మిక ఉన్నతినిస్తాడు. శిష్యులు చెప్పే ఇతర మానవ గురువులందరూ మాధ్యమాల్లాంటివారు. వీరి ద్వారా అందరికీ గురువైన ఆ పరమాత్మ పలుకుతాడు. దీన్ని అర్థం చేసు కోకుండా "నీ గురువు, నా గురువు" అంటూ వేర్వేరుగా భావిస్తే, గురు తత్త్వాన్ని సరిగా అర్థం చేసు కోలేనట్లే. గురువు, ఇష్టదైవం ఈ భావాల మధ్య నున్న సన్నిహిత సంబంధాన్ని గుర్తిస్తూ ముందుగా గురువుని ధ్యానించి, తరువాత ఆ గురువుని మానసికంగా ఇష్టదైవంలో లయం చేయాలి. అప్పుడు గురువు, ఇష్టదైవం ఒకరే అని గ్రహించగలం.



**ప్రశ్న:** ఆత్మసాక్షాత్కారానికి అంగవైకల్యం అవరోధమా?

**జవాబు:** కర్మ సిద్ధాంతానుసారం జన్మతః కొందరిలో అంగవైకల్యం కలగవచ్చు. నిరంతరం శ్రమించేతత్వం ఉంటే మనిషి ఏ రంగంలోనైనా ఉన్నతిని సాధించగలడు. ఆత్మసాక్షాత్కారానికి ముఖ్యంగా కావలసింది సాధకునిలోని ఆర్తి, తపన. భగవంతుణ్ణి పొందడానికి అంగవైకల్యం అవరోధం కాదని సూరదాసు లాంటి ఎంతో మంది భక్తులు నిరూపించారు. కాబట్టి ఆధ్యాత్మిక సాధనకు శారీరక, మానసిక వైకల్యాలేవీ అవరోధం కాదు.

# ఆకాశాన్నంటిన ఆనంద కెరటాలు
## హుజూర్‌నగర్ భక్త సమ్మేళనం



నల్గొండ జిల్లాలోని హుజూర్ నగర్‌లో 2007 డిసెంబర్ 7,8,9 తేదీల్లో శ్రీరామకృష్ణ - వివేకానంద భావ ప్రచార పరిషత్ 17వ వార్షిక భక్త సమ్మేళనం జరిగింది. హుజూర్ నగర్ శ్రీరామకృష్ణ సేవాసమితి ఈ బృహత్తర కార్యక్రమాన్ని అత్యంత వైభవంగా నిర్వహించింది. ఈ సమ్మేళనంలో ఇరవై మంది రామకృష్ణ మఠం స్వామీజీలు, ఆరుగురు శారదా మఠం మాతాజీలు పాల్గొన్నారు. రాష్ట్రంలోని వివిధ ప్రాంతాల నుంచి సుమారు 1500 మంది భక్తులు ఈ సభకు విచ్చేశారు.





పూజ్యస్వామి గౌతమానందజీ కరకమలములచే ప్రార్థనామందిర శంకుస్థాపన, భక్త సమ్మేళన ప్రారంభోత్సవం

**ప్రార్థనామందిర శంకుస్థాపన :** హుజూర్‌నగర్ శ్రీరామకృష్ణ సేవాసమితి నూతన ప్రాంగణంలో డిసెంబర్ 7వ తేదీ ఉదయం 11.30 గంటలకు చెన్నై శ్రీ రామకృష్ణ మఠం అధ్యక్షులు పూజ్యస్వామి గౌతమానందజీ మహరాజ్ శ్రీరామకృష్ణ ప్రార్థనామందిరానికి శంకుస్థాపన చేశారు. ఈ సేవాసమితి ప్రారంభమైన రెండు సంవత్సరాలలోనే ప్రార్థనామందిర నిర్మాణం చేపట్టడం హర్షణీయమని సమితి సభ్యులకు స్వామీజీ ప్రత్యేక అభినందనలు తెలిపారు.

**ప్రారంభ సమావేశం :** మూడు రోజులపాటు జరిగిన భక్తసమ్మేళనానికి డిసెంబర్ 7వ తేదీ 3 గంటలకు స్వామీజీల వేద పఠనం మధ్య స్వామి గౌతమానందజీ జ్యోతి ప్రజ్వలన చేసి ఈ సమ్మేళనాన్ని ప్రారంభించారు. సభికులంతా రామకృష్ణ సంఘ 14వ సర్వాధ్యక్షులు బ్రహ్మలీన పరమ పూజ్య స్వామి గహనానందజీ మహరాజ్‌కు మౌన శ్రద్ధాంజలి ఘటించారు. కన్వీనర్ డాక్టర్ పన్నాల శ్యామసుందర మూర్తి, జాయింట్ కన్వీనర్లు కె.వి. నాగేశ్వరరావు - హైదరాబాద్, ఆర్. చంద్రశేఖర గుప్త - కదిరి, వై. రామకృష్ణారావు- విజయవాడ, భావప్రచార పరిషత్ సంక్షిప్త నివేదికలు సమర్పించారు.

ప్రారంభ సమావేశంలో **స్వామి గౌతమానందజీ** మాట్లాడుతూ మారుమూల ప్రాంతమైన హుజూర్‌నగర్‌లో ఈ బృహత్తర కార్యక్రమాన్ని చేపట్టడం ఎంతో సాహసోపేతమైనదని యువ బృందాన్ని కొనియాడారు. కడప రామకృష్ణ మఠం అధ్యక్షులు **స్వామి ఆత్మవిదానందజీ**



గౌతమానందజీ, రఘునాథానందజీ, త్రిదివేశానందజీ, ఆత్మవిదానందజీ, దేశికాత్మానందజీ, శశికాంతానందజీ, అక్షరాత్మానందజీ, సుకృతానందజీ,



భవానీప్రాణ మాతాజీ, సర్వదేవప్రాణ మాతాజీ, అలోకప్రాణ మాతాజీ, బోధమయప్రాణ మాతాజీ,



మల్లాది పున్నయ్య శాస్త్రి, అమిరపు నటరా

'మానవ జీవిత లక్ష్యం భగవత్ సాక్షాత్కారం, మానవసేవే మాధవసేవ, మతాలన్నీ భగవంతుణ్ణి చేర్చే వివిధ మార్గాలు–ఈ మూడు అంశాల్నీ భక్తులందరూ గుర్తుంచుకోవాలి'అని భక్తుల కర్తవ్యాన్ని తెలియజేశారు. విజయవాడ రామకృష్ణ మిషన్ కార్యదర్శి **స్వామి శశికాంతానందజీ** మాట్లాడుతూ 'భావదారిద్ర్యంతో బాధ పడుతున్న ప్రస్తుత సమాజానికి శ్రీరామకృష్ణుల భావ సముదాయమే ఓ కాంతి రేఖ'అని శ్రీరామకృష్ణుల సందేశావశ్యకతను తెలియజేశారు. రాజమండ్రి రామకృష్ణ మఠం అధ్యక్షులు **స్వామి అక్షరాత్మానందజీ** 'నల్లమందుకు అలవాటుపడిన నెమలిలాగ రామకృష్ణ భక్తులంతా క్రమం తప్పకుండా ప్రతీ సంవత్సరం ఈ వార్షిక భక్త సమ్మేళనంలో పాల్గొనడం ఆధ్యాత్మి ప్రగతికి ఓ శుభ సంకేతం' అని ఉపమానించారు. ముజాఫర్‌పూర్ రామకృష్ణ మఠం **స్వామి రఘునాథానందజీ** మాట్లాడుతూ 'హుజూర్‌నగర్‌లో శ్రీరామకృష్ణుల భావాలతో స్ఫూర్తి పొంది యువకులంతా కలసికట్టుగా పనిచేస్తున్న విధానం చాలా ఆనందదాయక మనీ, శ్రీరామకృష్ణుల కృపతో ఈ సేవా సమితి భవిష్యత్తులో మరెన్నో కార్యక్రమాలను చేపట్టగలదు'అనీ ఆశాభావాన్ని వ్యక్తం చేశారు.

ఈ సమ్మేళనంలో స్వామీజీలు, మాతాజీలు మూర్తిత్రయ సందేశాన్ని భక్తులకు అందించారు. భక్తుల భజనలు, శ్రీమతి జి. సంధ్యామూర్తి బృందంవారి సాంస్కృతిక కార్యక్రమాలు, శ్రీ గరికపాటి నరసింహారావు గారి అష్టావధానం ఆహూతులను విశేషంగా అలరించాయి. భక్తసమ్మేళన కార్య నిర్వాహక సంఘ కార్యదర్శి డి. సుబ్రహ్మణ్యశర్మ వందన సమర్పణ చేయగా **రామకృష్ణ శరణం** బృంద గానంతో భక్త సమ్మేళనం ముగిసింది.

**– నివేదిక : డా॥ పన్నాల శ్యామ సుందరమూర్తి**


శ్రీరామకృష్ణులకు సాయం సంధ్యారతి, ఆరాత్రిక గానం.


ఉషోదయ కీర్తనలను ఆలపిస్తున్న అక్షరాత్మానందజీ బృందం


అనంతపురం శ్రీ నృత్య కళానిలయం, శ్రీమతి జి. సంధ్యామూర్తి బృందం.



శ్రీ రామకృష్ణ లీలాగీతి, దేవీ స్తుతి నృత్య నాటక ప్రదర్శన


'రామకృష్ణ శరణం' చరమ గీతం పాడుతూ, భావ పారవశ్యంతో నృత్యం చేస్తున్న భక్తులు


బోధమయానందజీ, సుప్రియానందజీ, వినిశ్చలానందజీ, అచింత్యానందజీ, గుణేశానందజీ, శితికంఠానందజీ, పరిజ్ఞేయానందజీ


...జన్, జి. గంగాధర్, వి. వీరభద్రరావు, శ్రీమతి పి. రమణి, డా॥టి.కె. చూడామణి


గరికపాటి నరసింహారావు



# RAMAKRISHNA MISSION

P.O. BELUR MATH, DIST. HOWRAH
WEST BENGAL - 711 202

# రామకృష్ణ మిషన్ పాలక వర్గ సంగ్రహ నివేదిక 2006- 2007



రామకృష్ణ మిషన్ 98వ వార్షిక సర్వ సభ్య సమావేశం 2007 డిసెంబర్ 16, ఆదివారం మధ్యాహ్నం 3.30 గంటలకు బేలూరు మఠంలో జరిగింది.

రామకృష్ణ సంఘం 14వ అధ్యక్షులు పూజ్యస్వామి గహనానందజీ మహరాజ్ 2007 నవంబర్ 4న మహాసమాధి చెందారు. సభ్యులు పూజ్య స్వామీజీకి శ్రద్ధాంజలి ఘటించారు. స్వామీజీ వయస్సు 91 సంవత్సరాలు. వారు అవిశ్రాంతంగా 27 సంవత్సరాల పాటు కోల్‌కతాలోని సేవాప్రతిష్ఠాన్ వైద్యశాలలో సేవలందించారు. భగవాన్ శ్రీరామకృష్ణ, శ్రీశారదాదేవి, స్వామి వివేకానందుల సందేశాన్నీ, వేదాంత సందేశాన్నీ దేశ విదేశాల్లో వ్యాప్తి చేశారు. రామకృష్ణ సంఘ 15వ అధ్యక్షులుగా పూజ్య స్వామి ఆత్మస్థానందజీ మహరాజ్ నియమితులయ్యారు.

ఈ సంవత్సరంలో భోపాల్‌లో ఒక నూతన కేంద్రన్నీ, కర్ణాటక లోని బెల్గాంలో ఉపశాఖా కేంద్రాన్నీ మిషన్ ప్రారంభించింది.

**వైద్యరంగంలో సేవలు :** ఈ సంవత్సరం ఇటానగర్‌లో సంచార కంటి రక్షణ కేంద్రం, జమ్మూ రామకృష్ణ ఆశ్రమంలో నూతన వైద్య కేంద్రం, కామార్పుకూర్‌లో జర్మన్ లెప్రసీ రిలీఫ్ అసోసియేషన్‌తో కలసి ఒక జాతీయ ఎయిడ్స్/హెచ్.ఐ.వి నివారణ సంస్థ మొదలైన నూతన పథకాలు ప్రారంభమయ్యాయి.

**విద్యారంగంలో సేవలు:** వివేకానంద విశ్వవిద్యాలయం నరేంద్రపూర్, స్వామి వివేకానందుల పూర్వీకుల గృహం, రాంచీ (మోరాబాది)లలో పోస్ట్ గ్ర్యాడ్యుయేట్ కోర్సులు; బేలూర్‌లోని శారదాపీఠ్ కేంద్రంలోని విద్యామందిర్ కళాశాలలో గణిత శాస్త్రంలోనూ, సంస్కృత భాషలోనూ పి.జి కోర్సులు; కోయంబత్తూరు కేంద్రంలో ఐటి విద్యా కేంద్రం, ఆన్‌లైన్ విద్యా కార్యక్రమం; నరేంద్రపూర్ కేంద్రంలో ప్రి-ప్రైమరీ విద్యా కేంద్రాలు ప్రారంభమయ్యాయి.

**గ్రామీణ అభివృద్ధి రంగంలో సేవలు :** ఇటానగర్ కేంద్రంలో గ్రామీణ పారిశుద్ధ్యాభివృద్ధి పథకం; జమ్మూ కేంద్రం LOC ప్రాంతంలో జమ్మూ కాశ్మీర్ భూకంప ఆర్థిక పునరావాస పథకంలో భాగంగా కుట్టుపని శిక్షణా కేంద్రాలు; రాంచీ (మోరాబాది)లో పండ్ల చెట్ల క్షేత్రం, మసాలా దినుసులను పండించడం, విత్తనాల ఉత్పత్తి, భూగర్భ జలాలను నీటిపారుదలకోసం వినియోగించడం, గ్రామీణ బాలికల కోసం ప్రత్యేక ఆవాస శిక్షణా తరగతులు వంటి అనేక పథకాలు; కోల్‌కతాలోని నరేంద్రపూర్ ఆశ్రమంలో లోకశిక్షా పరిషత్‌లో హస్తకళల వృత్తి విద్యలలో శిక్షణ, లక్క ఉత్పత్తి, జంతువుల ఆరోగ్య పరిరక్షణ వంటి అనేక సామాజిక ఆర్థిక పునరావాస పథకాలు ప్రారంభమయ్యాయి.

**రామకృష్ణమఠం కేంద్రాల అభివృద్ధి కార్యక్రమాలు :** గుజరాత్‌లోని వడోదరాలో ఒక కొత్త కేంద్రం ప్రారంభమైంది. కచ్ జిల్లాలోని ధనేటిలో రాజ్‌కోట్ ఆశ్రమం ఒక విద్యార్థి వసతి గృహం, ఒకహాలు; పశ్చిమ బెంగాల్‌లోని ఆంత్‌పూర్ ఆశ్రమంలో ఒక వైద్యశాల భవనం; మదురై ఆశ్రమంలో నర్సరీ, ప్రైమరీ పాఠశాల భవన నిర్మాణాలు జరిగాయి; పశ్చిమ బెంగాల్‌లోని కూచ్‌బిహార్ ఆశ్రమం స్వయం ఉపాధి పథకం ప్రారంభించింది.

విదేశాలలో రెండు కేంద్రాలు - ఫ్లోరిడా (యు.ఎస్.ఎ) లోని సెయింట్ పీటర్స్‌బర్గ్‌లో ఒక మఠ కేంద్రం, దక్షిణ ఆఫ్రికాలోని దర్బన్‌లో ఒక మిషన్ కేంద్రం - ప్రారంభమయ్యాయి.

**పునరావాస కార్యక్రమాలు:** ఈ సంవత్సరంలో 3.87 కోట్ల రూపాయల వ్యయంతో రామకృష్ణ మఠం, మిషన్‌ల ఆధ్వర్యంలో దేశంలోని అనేక ప్రాంతాలలో చేపట్టిన విస్తృత సహాయ పునరావాస కార్యక్రమాల వలన 2027 గ్రామాలలో 1.30 లక్షల కుటుంబాలకి చెందిన 5.67 లక్షల మంది లబ్ధిపొందారు.

**సంక్షేమ పథకాలు :** పేద విద్యార్థులకు ఉపకార వేతనాలు మంజూరు చేయడం, వృద్ధులకీ, వ్యాధిగ్రస్తులకీ, నిరాధారులకీ ఆర్థిక సహాయం చేయడం వంటి సంక్షేమ కార్యక్రమాలకై అయిన ఖర్చు మొత్తం 6.25 కోట్ల రూపాయలు.

**వైద్య రంగం :** వైద్య రంగంలో 61.55 కోట్ల రూపాయల వ్యయంతో 15 ఆస్పత్రులు, 173 డిస్పెన్సరీలు, సంచార వైద్యశాలల ద్వారా 85.32 లక్షల మందికి పైగా ప్రజలకు సేవలందించడం జరిగింది.

**విద్యారంగం :** మా విద్యాసంస్థలలో కిండర్‌గార్టెన్ నుండి పోస్ట్ గ్రాడ్యుయేషన్ వరకూ సుమారు 3.39 లక్షల మంది బాలబాలికలు విద్యనభ్యసిస్తున్నారు. వీరి విద్యాభ్యాసానికై 111.60 కోట్ల రూపాయల వ్యయం అయింది.

**గ్రామీణ గిరిజన అభివృద్ధి పథకాలు:** గ్రామీణ గిరిజన అభివృద్ధికై చేపట్టిన వివిధ పథకాల కింద 18.62 కోట్ల రూపాయలు వినియోగించడం జరిగింది.

నిరంతరం అంకితభావంతో మాకు సహాయ సహకారాలు అందించిన సభ్యులకూ, మిత్రులకూ, శ్రేయోభిలాషులకూ మా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు.

ధన్యవాదములతో...

భగవత్సేవలో

**స్వామి ప్రభానంద**

ప్రధాన కార్యదర్శి





# వినయ విధేయతలను వికసింపజేసేదే 'విద్య'

\- స్వామి రంగనాథానంద

మన విద్య లక్ష్యం పరీక్షలు, ఉద్యోగాలు అనే సంకుచిత భావాల మధ్య కుంచించుకుపోకూడదు. విద్య లక్ష్యం జ్ఞాన సముపార్జన. విద్య వల్ల అలవడే తొలి సుగుణం నిర్భీతి. జ్ఞానం భయాన్ని నశింపజేస్తుంది. పిల్లవాడి జ్ఞాన సమపార్జన ఎప్పుడూ తల్లి ప్రేమను పొందేవిధంగా జరగాలి. ఫలితాలే ప్రధానమై పోయిన నేటి విద్యాబోధనా పద్ధతి వల్ల పిల్లల్లో భారం పెరుగుతుంది. మదిలో భీతి బలహీనతలు చోటుచేసుకుంటాయి. విద్య మీద మక్కువ పెరిగితే చాలు ఫలితం అదే వస్తుంది. విద్యను ప్రేమించాలి. ఆరాధనాభావంతో విద్యా బోధన జరగాలి. విద్యార్థి పొందే జ్ఞానం సమాజానికి ఉపయోగపడాలి. మా అబ్బాయి కలెక్టర్ కావాలని చదివించడం కన్నా దేశానికి ఉపయోగపడే వ్యక్తిగా తీర్చిదిద్దాలి అనే తపనతో ఇచ్చే విద్య పరిమళిస్తుంది. రెండింటి లక్ష్యం ఒకటే అయినప్పటికీ మొదటి దానిలో సంకుచితత్వం ఉంది. రెండో భావనలో విశాల దృక్పథం ఉంది. సమాజం బాగుండాలనే తపన ఉన్నచోట విద్య పరిమళిస్తుంది.

భావిభారత పౌరులను అందిస్తున్నామనే సంకల్పంతో ఉపాధ్యాయులు విద్యాబోధన చేయడం వల్ల విద్యార్థుల్లో సామాజిక చైతన్యం వృద్ధి చెందుతుంది. అందుకు ముందు ఉపాధ్యాయులకు నిష్కళంక వ్యక్తిత్వం, నిజాయతీ, క్రమశిక్షణ, దేశభక్తి అలవడాలి. మహోన్నతమైన సామాజిక బాధ్యతను నిర్వర్తిస్తున్న గురు స్థానం ఉపాధ్యాయులది. ఇప్పటికీ మన పెద్దలు విద్యాబుద్ధులు నేర్పించేవి పాఠశాలలని అంటారు. అంటే పాఠశాలల్లో నేర్పించేది విద్య ఒక్కటే కాదు బుద్ధి ప్రచోదనం చెందాలి. బాల్యం నుంచీ బుద్ధి వికసించే దిశలో బోధన జరగాలి. బుద్ధితో పనిచేసేలా యువతను తీర్చిదిద్దేది పరిపూర్ణ విద్య. పిల్లలు తప్పు చేస్తే బుద్ధిలేదురా అని కోప్పడతాం. అంటే బుద్ధి పని చేస్తే తప్పులు చెయ్యబోమనే కదా! విద్యకు వినయ విధేయతలు తోడవ్వాలంటే విద్యాబోధనలో బుద్ధి వికసించే దిశగా విద్యార్థులను తయారు చెయ్యాలి. మంచి మానవ వనరులు ఉపాధ్యాయుల ద్వారానే దేశానికి అందుతాయి. ఇంతటి మహోన్నత లక్ష్యం ఉంది కాబట్టే ఉపాధ్యాయులను 'ఆచార్య దేవోభవ' అని మన శాస్త్రాలు కీర్తిస్తున్నాయి. ప్రథమ గురుస్థానం మాతృమూర్తిది. తల్లి దినచర్యలో పూజ, ప్రార్థనలు ఓ భాగమైతే పిల్లల్లో కూడా ఆ భక్తిభావం అలవడుతుంది. పిల్లలు పెద్దల్ని అనుకరిస్తారు. భారతీయ సంస్కృతీ సంప్రదాయాలు, ఆచారవ్యవహారాలు తల్లితండ్రుల నుంచే పిల్లలకు అలవడతాయి.

జాతిని మూఢనమ్మకాలు, భయం, క్రూరత్వం, సంకుచితత్వాల నుంచి విముక్తం చేసి వారి అంతరంగిక దివ్య ప్రవృత్తిని సాక్షాత్కరింపజేయడానికి స్వామి వివేకానంద శాస్త్ర జ్ఞానానికి తోడు మన ధర్మం గురించి కూడా బోధించేలా విద్య ఉండాలన్నారు. మన విద్యాదర్శనంలో శ్రీరామకృష్ణుల దృఢ అభిప్రాయాన్ని సమ్మిళితం చేసుకోవాలి. జీవించినంత కాలం నేర్చుకుంటూనే ఉంటానన్నారాయన. ఇలాంటి భావంతో కూడిన విద్య నిరంతర వ్యక్తిత్వ వికాసానికి తోడ్పడుతుంది. ఉత్తమ గుణసంపన్నులై సామాజిక చైతన్యం కలిగిన పౌరుల్ని అందిస్తుంది. a **సేకరణ : ఆర్. కృష్ణ**




**చల్లా ఉపేందర్, హైదరాబాద్**

**ప్రశ్న:** నేటి యువతరం ఇంటర్ నెట్, అసభ్యకర సినిమాల ప్రభావానికి లోను కాకుండా ఉండాలంటే ఏం చేయాలి?

**జవాబు:** ఒక వైద్యుని చేతిలోని కత్తి రోగి ప్రాణాల్ని కాపాడితే, అదే కత్తి కసాయివాని చేతిలో ఉంటే మనిషి ప్రాణాల్ని తీస్తుంది. కాబట్టి ఏ పరికరమైనా దాని ప్రయోజనం మనం వినియోగించే విధానంపై ఆధారపడి ఉంటుంది.



యువతరంలో అధిక శాతం ప్రసార మాధ్యమాలను దుర్వినియోగమే చేస్తోంది. నేటి సమాజంలో పెరుగుతున్న అత్యాచారాలు, హత్యలూ, అవినీతీ దాని ప్రభావమే!

'స్వామి వివేకానంద'పై ఓ చిత్రాన్ని నిర్మించాలని ఈ మధ్య ఓ ప్రముఖ నిర్మాత, దర్శకుడు మా మఠానికి వచ్చారు. వారితో వచ్చిన రచయిత స్క్రిప్ట్ అంతా స్వామీజీలకు చదివి వినిపించారు. అందులో అసభ్యకరమైన సంభాషణలు, ప్రేమ గీతాలు, స్వయంకల్పితాలైన సంఘటనలు చోటు చేసుకున్నాయి. స్క్రిప్ట్ విన్న తరువాత స్వామీజీలు ఆ నిర్మాతతో 'స్వామి వివేకానంద' సినిమాలో కూడా ఇలాంటి అసభ్యకర సన్నివేశాలు ఉండడం చాలా శోచనీయం" అని అసంతృప్తిని వ్యక్తం చేశారు. అందుకు ఆ నిర్మాత 'ఇలాంటి సన్నివేశాలు లేకపోతే నేటి యువతరం ఆదరించదు' అని అన్నారు.

కేవలం సందేశాత్మకమైన సినిమాలను నిర్మిస్తే నేటి యువతరం ఆదరించడం లేదని నిర్మాతల అభిప్రాయం. అసభ్యకరమైన సినిమాల వల్ల యువతరం పెడదార్లు పడుతుందని మీ లాంటి వారి అభిప్రాయం. ఇందులో తప్పెవరిది? ఒక వస్తువు యొక్క ఉత్పత్తి, దాని కొనుగోలుపై ఆధారపడి ఉంటుంది. కాబట్టి అసభ్యకర చిత్రాల్ని యువతరం ఆదరించకపోతే అలాంటి చిత్రాలు రాకుండా ఆపవచ్చు. ఆ బాధ్యత యువతరానిదే! 'ఎవరో వచ్చి ఏదో చేస్తారని ఎదురు చూడడం కన్నా మన వ్యక్తిత్వాన్ని మనమే నిర్మించుకుందాం' అన్న స్వామి వివేకానందుని పిలుపు మన జీవితాలకు ఓ మలుపు కావాలి.

Come, be men! Let us struggle for higher and better things... Do not wait for anybody or any thing.

*- Swami Vivekananda*

**కె. సరస్వతి, వినుకొండ**

**ప్రశ్న:** నేను సీనియర్ ఇంటర్ చదువుతున్నాను. చదివేటప్పుడు చెడు ఆలోచనలు వస్తున్నాయి. వాటిని నియంత్రించడం ఎలా?

**జవాబు:** మన మనసు ఒక ఘోరారణ్యం లాంటిది. అందులో చెడు ఆలోచనలు (కామ, క్రోధాదులు) క్రూర మృగాల లాంటివి. ఆ క్రూరమృగాల బారి నుంచి రక్షించుకోవాలంటే మంచి ఆలోచనలు అనే 'నిప్పు'ను వెలిగించాలి. ఆ సెగడు వేడికి అవి పారిపోతాయి. కాబట్టి చెడు ఆలోచనల్ని అరికట్టాలంటే మంచి ఆలోచనలతో మనసును నింపాలి.

Give your mind a good thought to chew on,
your thoughts will lead you to success *- Dora Albert*

మంచి ఆలోచనలు మనసును పవిత్రం చేస్తాయి. అలా పవిత్రమైన మనసును నిగ్రహించడం సులభం.

The purer the mind, the easier it is to control.

*- Swami Vivekananda*

మీలో మంచి ఆలోచనలు పెరగాలంటే స్ఫూర్తినిచ్చే మహాత్ముల జీవితాల్లోని సందేశాలను చదివి ఆచరించండి. అదే మిమ్మల్ని ఉత్తమమైన మార్గంలో ముందుకు నడిపిస్తుంది. a


మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా:
**యువవాణి**
శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,
దోమల్ గూడ, హైదరాబాద్ - 500 029
E- mail : rkprabhayuvavani@gmail.com

- శ్రీరామ్



# అశాంతికి ఆరు కారణాలు

జీవితం ఒక నిరంతర ప్రయాణం. దానిలో ఎదురయ్యే సమస్యల్ని నివారించేందుకు ఎవరైనా సరైన సూచనలు ఇస్తే బాగుండును అనుకుంటున్నారా...! అయితే ఇదిగో... రోమ్ దేశానికి చెందిన గొప్ప తాత్త్వికుడూ, రాజనీతిజ్ఞుడూ అయిన సిసిరో మనశ్శాంతిని మరుగుపరిచే విషయాలను వివరించారు. ఆయన చెప్పిన అశాంతికి గల ఆరు కారణాలు మీ కోసం...

1. ఇతరులను అణగద్రొక్కడం వల్లే వ్యక్తిగత లాభాన్ని పొందవచ్చుననే భ్రమలో బ్రతకడం...
2. మార్పు చేయలేని లేదా సరిదిద్దలేని విషయాలను గురించి దిగులు చెందడం...
3. తమ శక్తియుక్తుల్ని, బలాబలాలను గురించిన సరైన అవగాహన లోపించడం,
4. అంతగా ప్రాధాన్యం లేని విషయాలను పట్టించుకోకుండా ఉండలేకపోవడం...
5. మానసికంగా పరిణతి చెందడానికి అనలే ప్రయత్నించకపోవడం...
6. మన నమ్మకాలే నిజమైనవనీ, వాటిని ఇతరులు కూడా విశ్వసించాలనీ అనుకోవడం, మనం జీవిస్తున్నట్లే ఇతరులు కూడా జీవించాలనీ కోరుకోవడం...

సుమారు 2000 ఏళ్ళ క్రితమే ఆయన చేసిన విశ్లేషణ ఎంతో మంది మానసిక సమస్యల మూలాలకు అద్దం పడుతుంది. వీటిని సరిగా అర్థం చేసుకొని నిత్య జీవితానికి అన్వయించుకుందాం. నిజాయతీగా మనలోని లోపాలను సరిదిద్దుకొనే ప్రయత్నం చేద్దాం. మరెందుకిక ఆలస్యం!





# యువతరానికి ఏం కావాలి ?

**– స్వామి గౌతమానంద**

మీరు భగవద్గీతను చదవడం ద్వారా కన్నా ఫుట్‌బాల్ ఆడి భగవంతుణ్ణి సులభంగా చేరుకోగలరని స్వామి వివేకానంద యువతరానికి ఉద్బోధించారు.

యువకులు శరీరదార్ఢ్యాన్ని పెంపొందించుకోవడం ఎంతో అవసరమన్నది స్వామీజీ పై సందేశంలోని అంతరార్థం. 'కఠోపనిషత్తు' కూడా బలహీనుడైనవాడు ఆత్మ సాక్షాత్కారం పొందలేడు *(నాయమాత్మ బలహీనే న లభ్యః)* అని చెబుతోంది.

మన విద్యావిధానంలో వ్యాయామాన్ని పాఠ్యాంశంగా తప్పక చేర్చాలి. స్వాతంత్ర్యానికి పూర్వం దాదాపు రెండు వందల ఏళ్ళ పాటు భారతదేశం ఆంగ్లేయుల పాలనలో ఉంది. అప్పుడు భారతీయులు వ్యాయామం పట్ల అంతగా శ్రద్ధ చూపలేదు. ఆంగ్ల భాషను అభ్యసించడం లోనూ, ఆ సాహిత్యాన్ని అధ్యయనం చేయడంలోనూ, వారి ఆచారాలను అనుసరించడంలోను నిమగ్నులై ఉండిపోయారు.

జాన్ ఎఫ్. కెనడీ అమెరికా అధ్యక్షుడైన వెంటనే పాఠాలు ప్రారంభించే ముందు ప్రాథమిక పాఠశాలల బాలబాలికలు ఒక కిలోమీటరు దూరం పరుగెత్తాలనీ, ఉపాధ్యాయులు దాన్ని పర్యవేక్షించాలనీ ఉత్తర్వులు జారీ చేశాడు.

బాలగంగాధర్ తిలక్ కళాశాలలో చేరినప్పుడు చాలా సన్నగా ఉండేవారట. అప్పుడాయన దేహపుష్టి కోసం ఒక ఏడాది పాటు వ్యాయామశాలలో చేరి శిక్షణ తీసుకొన్నారట. అలా చేసినందువల్లే తరువాతి కాలంలో చెరసాలలో బందీగా ఉన్నప్పుడు ఎదురైన క్లేశాలకూ, సవాళ్ళకూ చలించలేదు. వాటిని ఎదుర్కొనే సామర్థ్యం పొందారు.

'ఆర్య సమాజ' వ్యవస్థాపకులైన స్వామి దయానంద సరస్వతి తమ విద్యార్థులకు వేదవిద్యతో పాటు వ్యాయామ శిక్షణను కూడా ఇచ్చేవారు. ఇనుప కండరాలు, ఉక్కు నరాలు కలిగి ఉంటే మనస్సులో ఏర్పడే ఎలాంటి మృగతుల్యమైన ఆలోచనలనైనా అదుపు చేయడం సులభమవుతుందని స్వామి వివేకానంద అంటారు. కోపం, అసూయ, కామం మొదలైన వాటిని దగ్గరకు రానివ్వకుండా విద్యార్థులు జాగ్రత్త వహించాలి. శారీరక బలాన్ని పెంపొందించుకుంటే అది సుసాధ్యం.

శారీరక బలానికి స్వామి వివేకానంద అధిక ప్రాధాన్యమిచ్చేవారు. ఒకప్పుడాయన హిమాలయాల్లో మాయావతి ఆశ్రమం ముందు గుర్రపుస్వారీ చేస్తున్నారు. వారి శిష్యులైన బ్రహ్మచారి జ్ఞాన్, బ్రహ్మచారి కాళీకృష్ణ ఆయన కోసం వేచి ఉన్నారు. కొంత దూరం నుంచి ఇది గమనించిన స్వామి వివేకానంద, వారిని దాటి వెళ్ళాలనుకొని గుర్రం వేగాన్ని పెంచారు. స్వామీజీ మనోగతాన్ని తెలుసుకున్న జ్ఞాన్ వేగంగా పరుగెత్తుతున్న గుర్రానికి అడ్డంగా నిలబడి, ధైర్యం చేసి గట్టిగా కళ్ళాన్ని పట్టి నిలిపివేశాడు. ఇలా చేయాలంటే ఎంతో శారీరకబలమూ, మనోధైర్యమూ ఉండాలి. స్వామీజీ గుర్రం మీద నుంచి కిందకు దిగి, శిష్యుని వెన్ను తట్టి, "నీ దేహబలం, నీ సాహసం అమోఘం" అని పొగిడారు.

వ్యాయామానికి సాహసంతో పాటు శారీరక బలం కూడా అవసరం. శరీరాన్ని పూర్తిగా తన అధీనంలో ఉంచుకోగలిగిన వీరుడే అన్ని రకాలైన క్రీడల్లో విజయం పొందగలడు.

ఒకసారి చెన్నైలోని మెరీనా సముద్రతీరంలో ఒక మల్లుడు తన విద్యా పాటవాలను ప్రదర్శిస్తున్నాడు. స్వామి వివేకానంద అది చూశారు. స్వామీజీ అతడి వద్దకు వెళ్ళి, అతణ్ణి తనతో పోటీకి పిలిచారు. అలా ఇద్దరూ తలపడగా, కొన్ని నిమిషాల లోనే స్వామీజీ, ఆ మల్లుణ్ణి చిత్తుగా ఓడించారు. అతడు తన ఓటమిని అంగీకరించాడు.

ప్రియమైన యువకులారా! మన దైనందిన జీవితంలో శారీరక బలం కూడా ఎంతో ప్రధానమైందని తెలుసుకోండి. వ్యాయామం చేయండి. క్రీడలలో పాల్గొని, మీ వంతు కృషి చేయండి. ఆరోగ్యం, బలిష్ఠమైన శరీర సౌష్ఠవం కలిగి ఉంటే, అదే మనకు గొప్ప ఐశ్వర్యం. మేల్కొనండి! విజయం సాధించండి!! a

**అనువాదం : బి.జి. సుందరమూర్తి**

- జిల్లా ప్రభ



# తారక మంత్రంతో తరించిన యువకిశోరం

**బా**నిసత్వాన్ని మించిన భయంకర రోగమేముంది? అని తలచి, భారతదేశాన్ని క్రూరంగా అణచివేస్తున్న ఆంగ్లేయులపై ఎదురు తిరిగి తన 19వ ఏటనే, చేతిలో భగవద్గీతనుంచుకొని "వందేమాతరం" అని గర్జిస్తూ, భారతమాత చరణాల వద్ద జీవితాన్ని అర్పించిన యువ కిశోరం ఖుదీరాం బోస్.

1889 డిసెంబరు 3న మేదినీపూర్ జిల్లాలోని 'బహువైయని' గ్రామంలో త్రైలోక్యనాథ్ బసు, లక్ష్మీ ప్రియదేవి పుణ్యదంపతులకు ఖుదీరాం జన్మించాడు. బాల్యం నుండీ దేశభక్తుడైన ఖుదీరాం తన ఎనిమిదవ ఏట నుండే దేశం గురించి ఆలోచించేవాడు. "భారత దేశం చాలా గొప్ప దేశం, ఈ దేశం వేల సంవత్సరాల క్రితం నుండీ జ్ఞానానికి నిలయమనీ, ప్రపంచానికి జ్ఞానాన్ని పంచిపెట్టిందనీ పెద్దలు చెబుతారు కదా! మరి ఈ ఆంగ్లేయులు ఎవరు? వాళ్ళ చేతి క్రింద మన ప్రజలు ఎందుకు బ్రతకాలి? నేను పెద్దవాడినైన తర్వాత ఎలాగైనా ఆంగ్లేయులను ఇక్కడి నుండి తరిమి కొడతాను" అని రోజంతా ఆలోచిస్తూ గడిపేవాడు.

**బానిసత్వమే భయంకర రోగం:** ఒకసారి ఖుదీరాం గుడికి వెళ్ళాడు. అక్కడ కొంతమంది గుడి ముందు భాగంలో కటిక నేలపై పడుకొని ఉండడం గమనించాడు. వాళ్ళెందుకలా పడుకొని ఉన్నారని ప్రక్కనున్న వారిని అడిగాడు. "వారంతా రోగాలతో, ఇతర చింతలతో బాధ పడుతున్నారు. భగవంతుడు సాక్షాత్కరించి, వారి బాధలను రూపుమాపే వరకూ అన్నం, నీరు ముట్టమని ప్రతిజ్ఞ చేశారు" అని వారు సమాధానం ఇచ్చారు. అది విని ఖుదీరాం "ఏదో ఒక రోజు నేను కూడా వీరిలాగే నిరాహారదీక్ష చేయవలసి రావచ్చు" అన్నాడు. అది విని ప్రక్కవారు, "నిన్ను బాధిస్తున్న రోగం ఏమిటి" అని అడిగారు. ఖుదీరాం నవ్వి "బానిసత్వాన్ని మించిన రోగమేముంది? నేను దాన్ని రూపుమాపుతాను" అని దృఢంగా సమాధానం ఇచ్చాడు.

**దేశభక్తుల తారకమంత్రం :** భారతమాత దాస్య శృంఖలాలను త్రుంచడానికి త్యాగం, నిస్వార్థం అనే గుణాలు జాతీయుల హృదయాలలో వికసించాలి. స్వార్థాన్ని విడనాడాలంటే మన ముందు ఒక స్పష్టమైన ఆదర్శం ఉండాలి కనుక భారతీయులందరినీ ఉత్తేజపరిచే భావం ఏది? అని బంకిమ్ చంద్రుడు ఆలోచించగా అతని కనుల ముందు రత్నాలు పొదిగిన సింహాసనంపై కూర్చొని ఉన్న భారతమాత చిత్రం ప్రత్యక్షమైంది. "మనమంతా ఈ తల్లి బిడ్డలం. శిరస్సు వంచి ఈ తల్లికి నమస్కరించాలి" అనుకొంటున్న సమయంలో అప్రయత్నంగా అతని నోటి నుంచి 'వందేమాతరం' అనే పవిత్ర పదం వెలువడి, దేశభక్తుల పాలిట తారక మంత్రమైంది.

1905లో బెంగాల్ విభజనకు వ్యతిరేకంగా జరిగిన ఉద్యమాన్ని ఎంతో సన్నిహితంగా గమనించిన ఖుదీరాం దాని పూర్వాపరాలను తెలుసుకోవాలనే తలంపుతో 'ఆనందమఠం' అనే పుస్తకాన్ని చదివాడు. తన జీవిత ధ్యేయాన్ని ఆ పుస్తకం ద్వారా తెలుసుకొని, మాతృదేశ సేవకే తన జీవితాన్ని అర్పించాలని నిశ్చయించుకొన్నాడు. విదేశీ పాలనలో మగ్గుతున్న భారత ప్రజల్ని బానిసత్వం నుంచి తొలగించే బాధ్యతను ఆనందంగా స్వీకరించాడు.

**జీవిత సమర్పణ:** అతి క్రూరుడిగా పేరుపడిన కింగ్స్‌ఫోర్ట్ అనే మేజిస్ట్రేటుపై ఖుదీరామ్ జరిపిన హత్యా ప్రయత్నం విఫలమైంది. హత్యా ప్రయత్నానికి గాను ఖుదీరాంకు మరణశిక్ష విధించారు. 1908 ఆగస్టు 19వ తేదీన 19 ఏళ్ళ వీర కిశోరం నిర్భయంగా మృత్యువును ఆహ్వానించింది. చిరునవ్వుతో చేతిలో భగవద్గీతను పట్టుకొని, ఉరిత్రాడు దగ్గరకు వచ్చి, ఆఖరిసారి బిగ్గరగా 'వందేమాతరం' అని నినదిస్తూ ఖుదీరాం తుది శ్వాస విడిచాడు. భారతమాత చరణాల వద్ద తన జీవిత కుసుమాన్ని అర్పించి, చరిత్రలో అమరునిగా నిలిచిపోయాడు ఖుదీరాం బోస్. a

యువవాహిని

# ఆ 'ఉక్కు' సంకల్పం స్వామీజీదే!

- బి. సైదులు



**1893...** పసిఫిక్ సముద్రంపై ఓడ సాగిపోతోంది. జపాను నుంచి అమెరికాకు ప్రయాణం. వందలాది ప్రయాణికులను ఆవలికి చేర్చే పయనం. అందరికీ అది ఓ సాధారణ యానం. కాని ఓ ఇద్దరు దార్శనికులకు... ముఖ్యంగా భారతీయ పారిశ్రామిక ప్రగతికి మాత్రం అది ఓ చారిత్రక ప్రస్థానం. ఒకరు భారత ఆధ్యాత్మిక సంపదకు ప్రతినిధి... మరొకరు ఆర్థికప్రగతికి వారధి... వారి ప్రయాణసాహచర్యం యాదృచ్ఛికమే అయినా, అది భారతదేశ పారిశ్రామిక రంగాన్ని ఓ మలుపు తిప్పింది. జాతి స్వావలంబనకు శ్రీకారం చుట్టింది. 'ఉక్కు'సంకల్పానికి ఊపిరి పోసింది. వారిలో ఒకరు మనదేశ పారిశ్రామిక రంగానికే పునాది వేసిన 'టాటా ఇండస్ట్రీస్' మూలపురుషుడు **జమ్‌షెడ్‌జీ నుసేర్‌వాన్‌జీ టాటా,** మరొకరు ఆ పారిశ్రామికవేత్తకే స్ఫూర్తినిచ్చిన **స్వామి వివేకానంద...**

"ఆకలికడుపులకు ఆధ్యాత్మికత ఆమడదూరంలో ఉంటుంది. అందుకే ముందుగా ఆర్థికంగా జాతి నిలదొక్కుకోవాలి. అప్పుడే ఆధ్యాత్మిక సాధనకు అర్హత సంప్రాప్తిస్తుంది" అనేవారు స్వామీజీ. నైతికవిలువలే పారిశ్రామిక రంగాన్నీ అజేయంగా నిలబెడతాయని నిరూపించిన టాటా పరిశ్రమల విధానాలను స్వామి వివేకానంద అభినందిస్తూ "జమ్‌షడ్‌జీటాటా వంటివారు మరికొంత మంది ముందుకు వస్తే, భారతదేశం వందరెట్లు వేగంగా ప్రగతిని సాధిస్తుంది" అంటూ ఆశీర్వదించారు.



## దేశం దశ మార్చిన దిశ....

ఆ దిశలోనే జమ్‌షెడ్‌జీ టాటాకు స్వామీజీ పారిశ్రామిక ప్రగతికి సంబంధించిన సూచనలిచ్చారు. పరాయిదేశాలపై ఆధారపడినంత కాలం దేశం ఆర్థికంగా నిలదొక్కుకోవడం అసాధ్యమంటూ తరచూ విస్పష్టం చేసేవారు స్వామి వివేకానంద. సంపదను సృష్టించే పారిశ్రామికరంగంలో యువతరం అడుగిడి నిజమైన కర్మయోగులుగా ఎదగాలని ఆకాంక్షించారు. ఆ నేపథ్యంలోనే స్వామీజీకి, జమ్‌షెడ్‌జీ టాటా 1893లో యాదృచ్ఛికంగా తటస్థించారు. జపాను నుంచి అమెరికాకు ప్రయాణిస్తున్న ఆ ఇరువురూ పరిచయస్థులయ్యారు. కానీ సాధారణ వ్యక్తుల మాదిరి వారి పరిచయం పలకరింపులకే పరిమితం కాలేదు. ఒకదేశ దశనే మార్చే దిశానిర్దేశానికి ఓనమాలు దిద్దింది.

## 'స్వదేశీ' భావనకు శ్రీకారం...

ఉక్కు పరిశ్రమను భారతదేశానికి దిగుమతి చేసుకోవాలన్న తన ఆకాంక్షను స్వామీజీ ముందుంచారు టాటా. స్పష్టమైన లక్ష్యం ఉన్నా విధివిధానాలు మాత్రం ఆయనలో ఇంకా స్పష్టంగా లేవని గుర్తించారు స్వామీజీ. అందుకే ప్రధానమైన రెండు సూచనలిచ్చారు. మొదటిదీ, ముఖ్యమైనదీ ఉక్కు పరిశ్రమకు సంబంధించిన శాస్త్రవిజ్ఞానానికి మన దేశంలో పరిశోధనలు జరగాలి; రెండవది ఉక్కును మన దేశంలో తయారుచేసుకోవాలి. పూర్తిగా స్వదేశీభావనతో ముందడుగు వేస్తే తన లక్ష్యసాధన సాధ్యమవుతుందని జమ్‌షెడ్‌జీ టాటాకు స్పష్టం చేశారు స్వామీజీ. *'స్వామీజీ సందేశం నా సంశయాలన్నింటికీ పరిష్కారాన్ని చూపింది. ముఖ్యంగా పారిశ్రామిక ఎదుగుదలకు దేశభక్తి, నైతికవిలువలు పునాదులయితే ఆదర్శంగా నిలుస్తామని వారి అమృతవాక్కుల నుంచి తెలుసుకున్నాను. మా పరిశ్రమలకు అన్వయించాము. అక్షరాలా ఆచరించాము. అజేయంగా నిలవగలిగాము."* అని స్వామీజీని స్మరించుకునేవారు టాటా.

## పరదేశీయుల పరిహాసం...

స్వామీజీ సూచన మేరకు టాటా లండన్ వెళ్ళి ఉక్కుతయారీకి సంబంధించిన సాంకేతిక పరిజ్ఞానం కోసం బ్రిటిష్ పారిశ్రామిక వేత్తలతో సంప్రతించారు. కానీ ఉక్కును తయారుచేసే సామర్థ్యం భారతదేశానికి లేదని వారు అవమానిస్తూ పరిహాసం చేశారు.

## ప్రియమైన స్వామి వివేకానంద...

సహప్రయాణికుడిగా నా పరిచయం మీ
స్మృతిపథంలో చెరిగిపోకుండా ఉందనే విశ్వసిస్తాను.
జపాను నుంచి చికాగోకు సాగిన మన ప్రయాణంలో
మీరు చేసిన స్ఫూర్తిదాయక సూచనలు మరపురానివి.
శాస్త్రసాంకేతిక పరిశోధనలకు సంబంధించి ఒక
సంస్థను ప్రారంభించాలన్న నా ఆలోచన మీ సంకల్పమే.
నిస్వార్థ, నిస్సంగత్వ భావనలు నిండిన మీ వంటి
ఆదర్శపురుషులు సన్యాసాశ్రమాలను వీడి, మా మధ్యే
నివసిస్తూ దేశంలో శాస్త్రసాంకేతిక పురోభివృద్ధికీ,
మానవ విలువల పునరుద్ధరణకూ అంకురార్పణ
చేయాలని ఆకాంక్షిస్తున్నాను. మీ వంటి నాయకుల
ఆధ్వర్యంలో దేశంలోని సకల రంగాలు
సుసంపన్నమవుతాయని నమ్ముతున్నాను. ఈ
శాస్త్రపరిశోధనా సంస్థకు స్వామి వివేకానందను
మించిన సారథి వేరొకరు లేరన్నది నా ప్రగాఢ విశ్వాసం.
ఈ నా విన్నపాన్ని పెద్దమనసుతో
అంగీకరిస్తారని ఆశిస్తున్నాను.

**జమ్‌షెడ్‌జీ టాటా.**

*23 నవంబరు 1898*

(స్వామి వివేకానందకు జమ్‌షెడ్‌జీ టాటా వ్రాసిన లేఖ సారాంశం)

అయినా టాటా పట్టువదలకుండా అమెరికా వెళ్ళి అక్కడి నిపుణులతో సంప్రతించారు. స్వామీజీ కోరుకున్నట్లు ముందు ఉక్కుపరిశ్రమకు సంబంధించిన పరిజ్ఞానాన్ని భారతదేశానికి తరలించారు జమ్‌షెడ్‌జీ. జమ్‌షెడ్‌పూర్‌లో పూర్తి స్వదేశీ పరిజ్ఞానంతో 'టాటా ఉక్కు పరిశ్రమ' ప్రారంభానికి నోచుకుంది. అపహాస్యం చేసిన బ్రిటిషర్లనే ఆశ్చర్యపరచింది.

### పరిశోధనలకు ప్రాణం...

"మనం స్వార్థపూరితమైన ఆలోచనలను అధిగమించి ఆశయాలను రూపొందిస్తే మన ద్వారా సర్వోత్తమమైన కార్యనిర్వహణ సాధ్యవడుతుంది. మన నుంచి మహత్వపూర్వకమైన శక్తి జనిస్తుంది" అనేవారు స్వామి వివేకానంద. ఆ అభిభాషణను అక్షరాలా ఆచరించి చూపారు జమ్‌షెడ్‌జీ. కేవలం పారిశ్రామిక వేత్తగానే కాకుండా ఒక దార్శనికుడిగా కూడా ఆదర్శంగా నిలిచారు. దేశంలోని వివిధ శాస్త్రవిజ్ఞానాలకు సంబంధించి పరిశోధనలు జరగాలని కాంక్షించారు. తన సంపదలో చాలా భాగాన్ని శాస్త్రవిజ్ఞాన పరిశోధనలకు వెచ్చించాలని తలంచారు. ఆ నేపథ్యంలోనే 'ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్సెస్' స్థాపించాలని 1898లోనే ఒక ప్రణాళికను సిద్ధం చేశారు. అంతటి బృహత్తర చారిత్రాత్మక సంస్థకు సారథ్యం వహించేందుకు స్వామి వివేకానంద ఒక్కరే సమర్థులని భావించారు. వినయపూర్వకంగా లేఖ వ్రాసి ఆహ్వానించారు. కాని స్వామీజీ తన ఆశయసాధనలో, జాతిజాగృత ప్రస్థానంలో అలుపెరుగకుండా సోగిపోతూండటంతో టాటా కోరుకున్నట్లు వారి సారథ్యం సాధ్యపడలేదు. కాని స్వామీజీ ఆశీస్సులతో 'ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్సెస్' దేశంలోని ప్రతిష్ఠాత్మకంగా ప్రారంభానికి నోచుకుంది. ఎన్నో విజ్ఞానవిభాగాలకు సంబంధించి ఎందరో మేధావులను ఈ దేశానికి అందించింది... అందిస్తూంది.

### విలువలు... విశాలహృదయాలు...

నైతికవిలువలు, నిబద్ధతా నియమాలే టాటా సంస్థల పునాదిరాళ్ళు. ఇటీవల ప్రపంచవ్యాప్తంగా జరిగిన సర్వేలో విలువల ఆధారంగా ఎదుగుతూ, పారదర్శకతతో సాగిపోతున్న మూడు ప్రతిష్ఠాత్మక సంస్థలలో 'టాటా గ్రూప్' ఒకటని వెల్లడయింది. జమ్‌షెడ్‌జీ వేసిన బాటే నేటికీ ఆ సంస్థకు పూలబాటై నిలిచింది. "భారతదేశానికి ఏదైతే మేలు కలిగిస్తుందో, అదే టాటా సంస్థకు మేలుకలిగిస్తుంది. సంస్థ ప్రయోజనాలన్నీ పరోక్షంగా దేశసంక్షేమానికి వినియోగపడాలి. ఆ విధంగా ఏ సంస్థ అయినా సమాజం రుణం తీర్చుకోవాలి" అని సంస్థ నినాదంగా నిర్ధారించారు జమ్‌షెడ్‌జీ టాటా. ఆ నేపథ్యంలోనే దేశంలో ఎన్నో ధార్మిక సంస్థలకు శ్రీకారం చుట్టారు. సేవాభావంలోనూ ఆదర్శంగా నిలిచారు. టాటా సంస్థలో ఉద్యోగస్థులుగా ప్రవేశించి అనంతరం దేశంలో సాఫ్ట్‌వేర్ రంగానికే మూలస్తంభాలై 'ఇన్‌ఫోసిస్'ను స్థాపించిన నారాయణమూర్తి, సుధామూర్తి దంపతులు ఈనాటికీ తమ మాతృసంస్థను ఆరాధనాపూర్వకంగా స్మరించుకుంటారు. "నా ఆఫీసుగది గోడకు రెండు ఫోటోలు వ్రేలాడుతుంటాయి. ప్రతిరోజూ ఆఫీసులో అడుగుపెట్టగానే వాటివంక చూసి పని ప్రారంభిస్తాను. రెండు వృద్ధుల ఫోటోలవి. సూఫీ వేదాంత గురువులా నిర్మలంగా నిలిచే నలుపు తెలుపు ఫోటో ఒకరిది... ఆయనే జమ్‌షెడ్‌జీ టాటా, రెండవ ఫోటో వారి నిజమైన వారసులు జె.ఆర్.డి. టాటాది. ప్రతి ఉద్యోగస్థుణ్ణీ సంస్థ సారథిగానే గౌరవించే సంస్కారం ఆ సంస్థ సొంతం. అందుకే ఇప్పటికీ ఆ సంస్థను 'మా సంస్థ' అని ఆత్మీయంగా పిలుచుకుంటాం" అని ఉద్విగ్నంగా గుర్తుచేసుకుంటారు శ్రీమతి సుధానారాయణ మూర్తి.

ప్రతి ఉద్యోగి 'మన' అని ఆత్మీయంగా పిలుచుకునే సంస్థ 'టాటా'.
విలువలతో ఎదిగిన నాయకత్వం ఎంత అద్భుతంగా, ఆదర్శంగా ఉంటుందో నేను తెలుసుకున్నది అక్కడే.
–శ్రీమతి సుధానారాయణ మూర్తి, ఇన్ఫోసిస్



యువవాహిని

# సమస్యలా? మరెలా?

- రామ్ జలదుర్గం

**జీ**వితంలో అనుకున్నవి అనుకున్నట్లు జరగడం లేదంటే చాలు, మెల్లిగా మెదడులోని సమస్యల కర్మాగారం పనిచేయడం ప్రారంభించి, సమస్య పైన సమస్యను ఉత్పత్తి చేస్తుంది. అసలు సమస్యను గుర్తించకుండా చేస్తుంది. అసలు ఆ సమస్యలకు మూలం మరెవరో అయ్యుంటారని, ఆ మరెవరో ఎవరా అని వెతకడం మొదలు పెడితే కనిపించే ప్రతి వ్యక్తీ, చుట్టూ ఉన్న పరిసరాలూ అన్నీ సమస్యలకు కారణాలుగా అనిపిస్తాయి. వాటి మీద నిందను తోసేసే సహజ గుణం మనిషిది. ముఖ్యంగా జీవితంలో అసంతృప్తితో ఉన్నవారి స్వభావం ఇది.

"నా సమస్యకు ఎక్కడో, ఎవరో బలమైన కారకులు... వారి కారణంగానే నా అపజయాలు, కష్టాలు, కన్నీళ్ళు అసంతృప్తి... వాళ్ళే లేకపోతే నేను మరో రకంగా ఉండేవాణ్ణి" అనుకోవడంలో కలిగే ఒకరకమైన మానసిక తృప్తి మనిషిని మారకుండా చేస్తుంది. తన తప్పేమీలేదని తప్పించుకునేలా చేస్తుంది. మీరు సరిగ్గా ఇంగ్లీషు మాట్లాడలేకపోతే అది సరైన బడిలో చేర్పించని తల్లితండ్రుల తప్పు... తను అమ్మాయై పుట్టినందుకు దేవుణ్ణి, రంగు నలుపైనందుకు పూర్వీకుల్ని, పేదరికంలో పుట్టినందుకు తన జాతకాన్నీ, ప్రమోషన్ రానందుకు తన కులమతాలనీ, ఆస్తిపాస్తులు రానందుకు తండ్రి తాతలనీ, వ్యాపారంలో నష్టపోయినందుకు భాగస్తుల్నీ, పరీక్షలో తప్పినందుకు కాలేజీని, ఇంకా రాజకీయాలనూ, రాష్ట్రాన్నీ, దేశాన్నీ, వీలైతే సృష్టిలోని తప్పులను వెతికి దేవుణ్ణి కూడా నిందిస్తూ జీవితాన్ని నెట్టుకుంటూ వెళ్ళే వారిని నిత్యం చూస్తూనే ఉంటాం.

ఈ కోవకు చెందినవారు తమ శక్తినంతా ఇతరులను నిందించడానికే వృథా చేస్తుంటారు. అది వృథా ప్రయాస అని వారికి తెలియదు. ఇలా నిందించడం వల్ల వీరికొచ్చే ప్రయోజనమేమీ లేదు, కేవలం సోమరితనంతో, ఏ ప్రయత్నం చేయకుండా, వారి నష్టాలకు కారకులన్నవారే జీవితాన్ని సరిచేస్తారని ఖాళీగా ఎదురుచూడడం తప్పు! ఇంకా అంతటితో ఊరుకోక ఇలాగే అసంతృప్తితో రగిలిపోయే వారు ఇంకా ఎక్కడున్నారో వెతికి పట్టుకుని ఒక జట్టుగా తయారై ఒకరినొకరు చూసుకుని తమ నమ్మకాలే నిజమనే భ్రమలో ఉంటారు. ఇలాగే ఆలోచించినంతకాలం వీరి జీవితాలలో ఎలాంటి మార్పు రాదు. అసలు తమ అభిప్రాయాలను మార్చుకునేందుకు అంగీకరించరు. దాంతో చివరికి అధోగతి పాలవుతారు.




**మరి బయటపడేదెలా?**

ఈ అలవాటు నుండి బయటపడాలనుకున్న వాళ్ళు ముందు తమ అసంతృప్తికి గల కారణాలను స్పష్టంగా ఒక తెల్లకాగితం మీద రాసుకోవాలి. ఈ సమస్యకు తన అభివృద్ధిని అడ్డుకునే శక్తి ఉందా? ఆ సమస్య నుంచి బయటపడడానికి తమ వంతు కృషి ఏం చేయగలం..? మీరు ఆలోచిస్తున్న విషయం గడిచిపోయినదా? మీ చేతుల్లో లేకుండా పోయిందా? అయితే దాని గురించి ఆలోచించడం ఎందుకు? ఇతరులు అర్థం చేసుకోకుంటే మాత్రం మీ జీవితంలో అభివృద్ధి అంతటితో ఆగిపోవాలా? బహుశా ఈ ప్రశ్నలు కొంతైనా వీరి ఆలోచనాశైలిని మారుస్తాయి.

సమస్యల గురించి అదే పనిగా ఆలోచించడం, దిగులును కొనితెచ్చుకోవడం అంటే మరోరకంగా సమస్యలను ఎదుర్కోలేక సమయాన్ని ఖర్చు పెట్టడమేనన్నమాట. దిగులుపడడం సమస్యలకు ఏ మాత్రం పరిష్కారం కాదు. పై పెచ్చు మరో సమస్యను కొనితెచ్చుకోవడమే.







**పరిష్కారం :**

తమ సమస్యలను తామే పరిష్కరించుకోవాలనుకున్నవాళ్ళు ముందుగా సమస్యలన్నీ వరుసగా ఒక కాగితం మీద రాసుకోవాలి. మరోసారి దాన్ని చదువుకొని 5 నిమిషాలపాటు ఆ సమస్యలను తలచుకొని మరీ బాధపడాలి. 5 నిమిషాల తర్వాత సమస్యల పరిష్కారంలో ఏమైనా ప్రగతి సాధించామా? అని ప్రశ్నించుకోవాలి. అసలేమీ లేదనిపిస్తుంది. కాబట్టి కేవలం సమస్యల గురించి ఆలోచించడం కాకుండా... భవిష్యత్ ప్రణాళిక గురించి ఆలోచించాలి. చాలామంది ఆలోచించడం, బాధపడడం ఒకటే అనుకుంటారు. బాధపడుతున్నారు అంటే సమస్య గురించి ఆలోచిస్తున్నట్లు! బాధపడకూడదనుకుంటే భవిష్యత్ ప్రణాళికపై సమయం కేటాయించడమే!



**సమస్యనెలా నిర్వచిస్తారు?**

ప్రతిరోజూ చేస్తున్న పనిలో సాధారణంగా ఊహించిన అడ్డంకులే వచ్చినప్పుడు వాటికి కూడా 'సమస్య' అని పేరు పెడితే మీరు సమస్యల ఊబిలో ఉన్నట్టే! సమస్య తెలిసి పరిష్కారం కూడా తెలిస్తే అది సమస్య కాకూడదు. అది మీ బాధ్యతల్లో ఒక భాగంగా గుర్తించి, ఏ ఉద్వేగాలకూ లోను కాకుండా ఒక పనిని చేస్తున్నట్టు చేసుకుపోవాలి. ఉదాహరణకు:- ఎప్పుడో ఒకసారి కుటుంబంతో కారులో షికారు కెళ్ళిన వ్యక్తి తన కారు పంక్చరైతే అతని అసంతృప్తి, బాధ, అసహనం అన్నీ బయటపడతాయి. అదే ఒక లారీ డ్రైవరు తన వాహనం టైరు పంక్చరైతే ఇంతగా స్పందించడు. ఎందుకంటే అది తన జీవితంలో ఒక భాగం కాబట్టి, అది తన బాధ్యత కాబట్టి. అలాగే ఏ వ్యవహారమైనా సమస్యగా మీరు పరిగణించే ముందు నిర్వచించడం మర్చిపోవద్దు.

అసలు సమస్యకు అర్థం ఏమిటంటే, మీరు ఏ పనైనా సాధించాలని అనుకున్నప్పుడు మీరు మీ గమ్యాన్ని చేరకుండా ఏదైనా 'అడ్డు' ఉంటే దాన్ని సమస్య అంటారు. అంతేకాని పని కానీ, గమ్యం కానీ సమస్యలు కావు. ఒక విద్యార్థి తన క్లాసులో ఫస్టు ర్యాంకు తెచ్చుకోవాలనుకున్నాడనుకోండి. దానికి తగిన ప్రణాళిక వేసుకోవడం, తన ప్రణాళికను అమలు చేయడానికి తగిన పరిస్థితులను కల్పించుకోవడం, వృథా సమయాన్ని గుర్తించడం, తన దృష్టినంతా చదువుపైనే కేంద్రీకరించడం చేస్తే చాలు తాననుకున్నది సాధించవచ్చు. అంతేగానీ నేననుకున్నది సాధించగలనా అన్న అనుమానం, ఒకవేళ సాధించలేకపోతే అన్న భయం, చాలామంది పోటీ పడతారేమో అన్న అభద్రతాభావం, నా భవిష్యత్తేంటి అన్న అనవసరమైన దిగులు లాంటివన్నీ ముసురుకొని ఆ విద్యార్థి ప్రణాళికను వదిలేసి ఒత్తిడికి గురై ఉన్న జ్ఞానం కాస్తా కోల్పోయే ప్రమాదం వుంది.

ఆవేదన చెందడం ఆలోచించడం అనిపించుకోదు. ప్రణాళికను అమలుచేయడమే తెలివైన పరిష్కారమార్గం! a

**జీ**వితమంటే "అణగద్రొక్కివేసే పరిస్థితుల మధ్యలో వికసించి, పెంపొందడమే!" అని స్వామి వివేకానంద అంటారు.

మనం పరిష్కరించడానికి సిద్ధంగాలేని ఒక పరిస్థితినే సమస్య అని చెప్పుకోవచ్చు. దాన్ని పరిష్కరించడానికి మనం సిద్ధపడ్డ మరుక్షణం అది సమస్యగా మిగలదు.

"సుత్తి అద్దాన్ని బ్రద్దలు కొడుతుంది కానీ ఉక్కుని గట్టిపరుస్తుంది"! కాబట్టి మన మనసు దృఢంగా ఉంటే సమస్యలు మనల్ని మరింత దృఢతరం చేస్తాయి. 'Difficulties come to make us not to break us' అనే ఆశావహ దృక్పథాన్ని అలవరచుకోవాలి ! `

యువవాహిని



# ధైర్యంతోనే విజయం

- విష్ణు ప్రియ

జీవితకళా శిక్షణా కేంద్రంలో సర్వమానవాళికీ భారతీయ సనాతన ధర్మం బోధించే మొట్టమొదటి పాఠం ధైర్యం.

"అభయం సత్వ సంశుద్ధిః"

ధైర్యవంతుని మనస్సు ఎప్పుడూ స్వచ్ఛంగా ఉంటుంది. అతడు ఎప్పుడూ నిజాయతీపరుడై ఉంటాడు. అలాంటి నిష్కళంకమైన మనస్సు, వ్యక్తికి ఆత్మబంధువు.

"క్షుద్రం హృదయ దౌర్బల్యం" – అని గీతాచార్యుని వాణి. అంటే, భయం అల్పమానస లక్షణం. భయం వల్ల అంతర్గత సామరస్యం ఉండదు. భయం వల్ల సంశయం, సంశయం వల్ల ద్వేషం, క్రమంగా పతనం సంభవిస్తాయి.

సామాన్య మానవ సంఘరచనలో కానీ, చరిత్ర పుటల్లో కానీ, వైజ్ఞానిక వేదికపై కానీ, ఆధ్యాత్మిక క్షేత్రంలో కానీ ధైర్యం గీసిన విజయ భావచిత్రాలు వేలకు వేలు ఉన్నాయి. "ధీరుల్ విఘ్ను నిహన్య మానులగుచున్ ధృత్యున్న తోత్సాహులై ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమీ ప్రజ్ఞా నిధుల్ భార్గవా"

ధైర్యం వల్ల మనో నిశ్చయం. తద్వారా కార్యశీలత సాధ్యం. మానసిక అంతస్తులో వ్యక్తిగత నైపుణ్యాన్ని సార్థకం చేసుకోగల వాతావరణం సృష్టించుకోవడానికి ధైర్యం ఉండాలి. సమాజ పునర్వ్యవస్థీకరణలో చెడును తుడిచి వేయాలన్నా, వ్యతిరేక శక్తులను అంతం చేయాలన్నా ధైర్యం ఉండాలి. ఇక, బుద్ధి పరంగా ఆలోచిస్తే ఈనాడు మనం అనుభవించే సుఖసంతోషాలన్నీ ధైర్యవంతుల త్యాగఫలితాలే. ఆధ్యాత్మిక పరంగా ఆలోచిస్తే సత్యాన్వేషణకు అర్హత ధీరత్వమే.

రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్య అధినేతల గుండెల్లో రైళ్ళు పరుగెత్తించి, వాళ్ళను గడగడలాడించిన 'నేతాజీ' సుభాష్ చంద్రబోస్ ధైర్యం ప్రపంచ చరిత్రకే తలమానికం. నాడు మంచుకొండల్లో గజగజ ఒణికించే చలిలో దేశ సరిహద్దులు కాపలా కాస్తూ మన ప్రాణాలు కాపాడే సైనిక వీరులకూ, అవిశ్రాంత కర్తవ్య పాలనలోని వారి ధైర్యానికీ వందనం చేయవలసిందే!

జీవితం, మృత్యువు – రెండూ కలిసే ఉంటాయి. అది పరమేశ్వరుని అస్తిత్వం. ఇది తెలిస్తేనే జీవితానికి అర్థం, పరమార్థం.

నారదోపదేశంతో, భీకరారణ్యమధ్యంలో శ్రీమన్నారాయణుణ్ణి ధ్యానించి, సాక్షాత్కరింపజేసుకొని తరించిన సాహసి ధ్రువుడు. సంతుష్టాంతరంగుడైన సర్వేశ్వరుడే 'ధీర వ్రత రాజన్య కుమారక' అన్నాడు. ఉగ్రనరసింహుణ్ణి ప్రసన్నుణ్ణి చేసిన పసిబాలుడైన ప్రహ్లాదుని భయ రహిత మనఃస్థితిని మనోహరంగా చిత్రించిన మహాగ్రంథం భాగవతం.

జీవన దర్శనాలైన ఈ అపురూప ఘట్టాలన్నీ మహోన్నతమైన మన సంస్కృతీ స్రవంతిలోని వైభవ లీలలు. దైవానుగ్రహం కావాలంటే 'నేను భక్తుణ్ణి' అని చెప్పుకుంటే సరిపోదు, 'నేను ధైర్యవంతుణ్ణి' అని చెప్పుకోగలగాలి.

పిరికివారు, బలహీనులు మాత్రమే పాపాలు చేస్తారు, అసత్యాలు వల్లిస్తారు. ధీరులన్నివేళలా నీతిని పాటిస్తారు. కనుక నైతిక ధర్మాన్ని విడనాడవద్దు. ధీరులుగా వుండటానికి ప్రయత్నించండి. కారుణ్యాన్ని ప్రదర్శించండి.

ధైర్యంతో ముందుకు సాగాలి. విజయం ఒక రోజులోనో, ఒక సంవత్సరంలోనో వస్తుందని ఆశించ కూడదు. ఉన్నత ప్రమాణాలని ఏదశలో వదలకూడదు. స్థిరత్వాన్ని సమకూర్చుకోవాలి. స్వార్థాన్ని, అసూయను విడనాడాలి.

**– స్వామి వివేకానంద**



ఆంగ్లమూలం : డాక్టర్ ఎస్. రమణి

అనువక్త : రెంటాల జయదేవ

# భక్తితో భగవత్ సాన్నిధ్యానికి...

గురువుల పట్ల అచంచలమైన భక్తి శ్రద్ధలు చూపడంలో నిర్దుష్టతకు భక్త శబరి ఉదాహరణ. అంతటి భక్తి ఉంటే ఎవరైనా ఏ స్థాయికి చేరుకోగలరో ఆమె జీవితం మనకు చెబుతుంది.

నిజానికి, ఆమె ఓ గిరిజన తెగకు చెందిన మహిళ. దండకారణ్యంలో పంపానదీ తీరంలో వయోవృద్ధుడూ, సుప్రసిద్ధుడూ అయిన మాతంగ ముని, ఆయన శిష్యులు ఉండేవారు. వారికి అత్యంత విశ్వాసపాత్రంగా ఉంటూ, సేవలందించేది శబరి. ఆమె సేవానిరతికీ, భక్తికీ వారు ఎంతో సంతోషించారు. 'ఒకానొక సమయంలో శ్రీరామచంద్రుడు ఇక్కడకు వస్తాడు. ఆయన సందర్శన భాగ్యంతో నువ్వు మళ్ళీ జన్మంటూ లేకుండా శాశ్వత భగవత్ సాన్నిధ్యాన్ని చేరుకుంటావు' అని వారు శబరికి చెప్పారు.

ఆ రోజు నుంచి శబరి మరింత కఠోర నియమాలతో, ఇంకా పవిత్రంగా జీవితం గడపసాగింది. శ్రీరామచంద్రుడి రాక కోసం ఆతురతగా నిరీక్షించసాగింది. అలా ఏళ్ళూ పూళ్ళూ గడిచిపోయాయి. చిట్టచివరకు ఆ మునులు చెప్పిన రోజు రానే వచ్చింది. సీతమ్మను అన్వేషిస్తూ, శ్రీరాముడు, లక్ష్మణుడు శబరి ఆశ్రమాన్ని సందర్శించారు. అప్పుడు ఆమె ఆనందానికి అవధులు లేవు. చేతులు జోడించి, ఆమె వారిని గౌరవంగా ఆహ్వానించింది. వారిని సౌకర్యవంతంగా కూర్చుండబెట్టి, అత్యంత వినయంతో వారి పాదాల చెంత వాలింది. శ్రీరాముడు అడిగిన కుశల ప్రశ్నలకు శబరి సమాధానం చెబుతూ, "శ్రీరామా! నీ దర్శన భాగ్యంతో ఇన్నాళ్ళ నా వ్రతం పరిసమాప్తమైంది. నా జన్మ సార్థకమైంది" అని వ్యాఖ్యానించింది.

ఆ తరువాత రామలక్ష్మణులకు శబరి అడవి పళ్ళను ఆరగింపుగా పెట్టింది. ఆమె తన భావ తన్మయత్వంలో మొదట ఆ పళ్ళను తాను రుచి చూసి, బాగున్నవాటినే శ్రీరాముడికి నివేదించినట్లు చెబుతారు. శబరి భక్తికి సంతుష్టుడైన శ్రీరాముడు ఆమెను ఆశీర్వదించాడు. రామచంద్రుడికి సేవ చేయాలనే కోరిక నెరవేరడంతో ఆ వృద్ధ మాత శ్రీరాముని చల్లని చూపులతో శాశ్వత బ్రహ్మలోకాన్ని చేరుకుంది.

శబరి తన గురువులకు శ్రద్ధాభక్తులతో సేవ చేయడం ద్వారా పవిత్ర జీవనాన్ని గడిపింది. నిజాయతీగా ఆధ్యాత్మిక అన్వేషణ సాగించే వారెవరికైనా కుటుంబ నేపథ్యం, స్త్రీ పురుష లింగ భేదం, పాండిత్యం, కర్మకాండలతో సంబంధం లేకుండా జ్ఞానప్రాప్తి కలుగుతుందని శబరి జీవితం సూచిస్తోంది.

## పండుగలు - పర్వదినాలు

### ఫిబ్రవరి - 2008

| | | | |
|---|---|---|---|
| 03 | ఆదివారం | : | ఏకాదశి |
| 09 | శనివారం | : | స్వామి బ్రహ్మానంద జయంతి |
| 10 | ఆదివారం | : | స్వామి త్రిగుణాతీతానంద జయంతి |
| 17 | ఆదివారం | : | భీష్మ ఏకాదశి |
| 21 | గురువారం | : | స్వామి అద్భుతానంద జయంతి |

### మార్చి - 2008

| | | | |
|---|---|---|---|
| 03 | సోమవారం | : | ఏకాదశి |
| 06 | గురువారం | : | మహా శివరాత్రి |
| 09 | ఆదివారం | : | భగవాన్ శ్రీరామకృష్ణుల జయంతి |
| 17 | సోమవారం | : | ఏకాదశి |
| 21 | శుక్రవారం | : | శ్రీ చైతన్య మహాప్రభు జయంతి |
| 25 | మంగళవారం | : | స్వామి యోగానంద జయంతి |




# రామకృష్ణ మిషన్ ఆశ్రమం

(క్రీ॥శ॥ 1897లో స్థాపితమైన మొదటి రామకృష్ణ మిషన్ శాఖా కేంద్రం)
పి.ఒ. సార్‌గాఛి ఆశ్రమం, ముర్షీదాబాద్ జిల్లా - 742 134, పశ్చిమ బెంగాల్
Ph:03482- 232222 email:rkmasargachi@gmail.com; www.rkmsargachi.org



## విన్నపం

శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష శిష్యులు స్వామి అఖండానందజీ మహరాజ్ 1897లో ప్రారంభించిన మొదటి రామకృష్ణ మిషన్ శాఖా కేంద్రం - రామకృష్ణ మిషన్ ఆశ్రమ, సార్‌గాఛి.



స్వామి వివేకానంద ప్రతిపాదించిన "మానవ సేవయే మాధవ సేవ" అన్న ఆదర్శాన్ని జీర్ణించుకుని అమిత దయగల ఈ మహాత్ముడు (స్వామి అఖండానందజీ) ముర్షీదాబాద్‌లో కరవు సంభవించినప్పుడు సార్‌గాఛికి సుమారు 3 కి॥మీ॥ దూరంలో ఉన్న మహులా అనే గ్రామ ప్రజలకి 1897 మే 15న బియ్యం పంచి సహాయపడ్డారు. ఆ మహులాలోనే మొదటి ఆశ్రమం స్థాపించడం జరిగింది. మహులాలో 2 సం॥లు, శిబ్‌నగర్‌లో 14 సం॥లు కొనసాగిన ఈ ఆశ్రమం 1913లో సార్‌గాఛికి మారింది. ఈ ఆశ్రమం ప్రారంభం నుండీ ప్రకృతి వైపరీత్యాలు సంభవించినప్పుడు సేవా సహాయాలు అందించడం, విద్యా వైద్య రంగాలలో సహాయ పడడం లాంటి కార్యక్రమాలను చేపట్టింది.

40 సంవత్సరాల తీవ్ర తపశ్చర్యలు, సేవాసహాయ కార్యక్రమాలతో స్వామి అఖండానందజీ మారుమూల కుగ్రామమైన సార్‌గాఛిని రామకృష్ణ సామ్రాజ్యంలో ఒక తీర్థస్థలంగా తీర్చిదిద్దారు. ఈ ఆశ్రమం సుమారు వంద సంవత్సరాలకు పైగా పైన చెప్పిన రంగాలలో మానవజాతికి నిరంతరాయమైన సేవలందిస్తూ ఈ గ్రామీణ ప్రాంతాలలోని వేలకొలదీ పీడితులకి ఉపశమనం కలిగించి, శాంతిని చేకూరుస్తోంది. అయితే విపరీతంగా ధరలు పెరగడం వలనా, ప్రజలు - ప్రభుత్వం ఇచ్చే విరాళాలు సక్రమంగా అందకపోవడం వలనా సేవాకార్యక్రమాలను నిరంతరాయంగా కొనసాగించడం చాలా కష్టమవుతోంది.

ఈ నిధుల కొరతను అధిగమించడానికి మా మిత్రులు, శ్రేయోభిలాషులు, భక్తులు, ఉదారహృదయులైన సామాన్యప్రజలు, సంస్థలను ఉదారంగా ముందుకు వచ్చి మేము మున్ముందు ఈ సేవా కార్యక్రమాలను నిరంతరాయంగా కొనసాగించడానికి వీలుగా రూ. 50 లక్షలతో ఒక శాశ్వత నిధిని ఏర్పాటు చెయ్యవలసిందిగా విన్నపం చేస్తున్నాము. రామకృష్ణ మిషన్‌కి ఇచ్చే విరాళాలన్నిటికీ సెక్షన్ 80G క్రింద ఆదాయపు పన్ను మినహాయింపు ఉంటుంది. "Ramakrishna Mission Ashrama,Sargachi" పేరున చెక్కులు /డి.డి.లను Ramakrishna Mission Ashrama, P.O. Sargachi Ashrama, Dist. Murshidabad-742 134, West Bengal చిరునామాకు పంపగలరు. మీరు UTI బ్యాంకు



బెర్హాంపూర్ శాఖకి మా SB A/C No. 163010100098865 కి విరాళాలను ట్రాన్స్‌ఫర్ చేయవచ్చును. మేము చేసే సేవలు ప్రపంచంలోని లక్షలమంది పీడితులకు కాస్త ఉపశమనం కలిగించి శాంతిని చేకూర్చాలనీ మనందరికీ భగవాన్ శ్రీరామకృష్ణులు, శ్రీమాత శారదాదేవి, స్వామి వివేకానంద నిరంతరం అనుగ్రహాన్ని వర్షింపచేయాలనీ కోరుతూ..

భగవత్సేవలో
**స్వామి శివనాథానంద**
కార్యదర్శి

# పరమ పుణ్యఫలదం ప్రదక్షిణం

– రెంటాల జయదేవ

మనిషికి చదువు, సంస్కారం, సభ్యత నేర్పే బడి ఎంత కీలకమో, ఆధ్యాత్మిక వాసనను ప్రేరేపించి, పారమార్థికత వైపు మళ్ళించే గుడీ అంతే కీలకం. గుడికి వెళ్ళడం ప్రతి భక్తుడూ చేసే పనే! గుళ్ళోకి వెళ్ళినప్పుడు ధ్వజస్తంభానికి నమస్కరించడం, గర్భగుడికి ప్రదక్షిణం చేయడం లాంటి పనులెన్నో చేస్తుంటాం, చూస్తుంటాం. ఇవన్నీ గుడ్డిగా అనుకరించే చేష్టలు కావు. వీటిలో కూడా బోలెడంత అంతరార్థం ఉంది. ముఖ్యంగా, గుళ్ళోకి వెళ్ళగానే, దైవ ప్రార్థనల తరువాత గర్భగుడి చుట్టూ సవ్యదిశలో తిరిగి రావడం అందరికీ అలవాటు. దీన్నే 'ప్రదక్షిణం' అంటారు. ఈ ప్రదక్షిణంలోనూ కొన్ని విశేషాలున్నాయి.



### ప్రదక్షిణం అంటే?

'ప్రదక్షిణం' అనే శబ్దంలోనే విశేషమైన అర్థం ఉంది. 'ప్ర' అంటే సర్వ భయాలనూ పోగొట్టేది. 'ద' అంటే మోక్షాన్ని ఇచ్చేది. 'క్షి' అంటే సర్వరోగ నివారణి. 'ణ' అంటే సకలైశ్వర్య ప్రాప్తిదాయని.

కాబట్టి, ప్రదక్షిణమనేది అన్ని భయాలనూ పోగొట్టేది, మోక్షాన్నిచ్చేది, సర్వరోగ నివారణి, సకలైశ్వర్య ప్రాప్తిదాయని అని గ్రహించాలి.

ప్రదక్షిణంలో ప్రధానంగా నాలుగు అంశాలుంటాయి. ఆ 'ప్రదక్షిణా చతురంగాలు' ఏమిటంటే, 1. మెల్లగా నడవడం, 2. చేతులు జోడించడం, 3. పరమాత్మను ధ్యానించడం, 4. ధ్యానాన్ని మనస్సులో నిలుపుకోవడం!



ప్రదక్షిణలోని ప్రత్యేక అంశాలను సూత మహాముని, శౌనకాది ఋషులకు వివరించాడని అంటారు.

### ప్రదక్షిణం ఎన్ని రకాలు?

ప్రదక్షిణం ప్రధానంగా నాలుగు రకాలు. 1. పాద ప్రదక్షిణం, 2. దండ ప్రదక్షిణం, 3. అంగ ప్రదక్షిణం, 4. మిశ్రమ ప్రదక్షిణం.

పాదాలతో నడుస్తూ చేసేది 'పాద ప్రదక్షిణం'. వేగిరపాటు లేని మనస్సుతో దండ ప్రమాణం చేసి, మళ్ళీ మళ్ళీ దండ ప్రమాణం చేస్తూ ప్రదక్షిణం చేస్తే దాన్ని 'దండ ప్రదక్షిణం' అంటారు.

శరీరంలోని ఎనిమిది ప్రధాన అవయవాలనూ భూమికి తగిలిస్తూ చేసేది 'సాష్టాంగ నమస్కారం'. దీన్నే శ్లోక రూపంలో ఇలా చెప్పారు:

***ఉరసా శిరసా దృష్ట్వా మనసా వచసా తథా,***
***పదాభ్యాం కరాభ్యాం కర్ణాభ్యాం ప్రణామో - ష్టాంగ ఉచ్యతే ।***

ఇక, శరీరంలోని సాత్త్విక అవయవాలు నేలకు తగిలేలా దొర్లుకుంటూ వెళుతూ ప్రదక్షిణం ఆచరిస్తే, దాన్ని 'అంగ ప్రదక్షిణం' అంటారు. తిరుపతి లాంటి చోట్ల దేవాలయం చుట్టూ భక్తులు అంగ ప్రదక్షిణాలు చేయడం మనం చూస్తూ ఉంటాం.

ఇలా ఏ ఒక్క రకమైన ప్రదక్షిణమో కాకుండా, కొన్ని అడుగులు నడిచి, దండాకార ప్రమాణం చేసి, మళ్ళీ దొర్లుకుంటూ వెళ్ళడం – 'మిశ్రమ ప్రదక్షిణం'.

### ప్రదక్షిణం చేయడమెందుకు?

ఈ సమస్త జగత్తుకూ భగవంతుడే కేంద్ర బిందువు, మూలాధారం. ఆ విషయాన్ని గ్రహించి, ఆ కేంద్ర బిందువు చుట్టూ తిరగడమే 'ప్రదక్షిణం'. అంటే, కేంద్రబిందువును ఆధారంగా చేసుకొని, గీసే వృత్తం అనుకోవచ్చు. వృత్తం చుట్టుకొలత మీద ఉండే ప్రతి బిందువూ, కేంద్రం నుంచి సమానదూరంలో ఉంటుంది కదా! అలాగే, ఎవరు, ఏమిటి, ఎక్కడున్నారనే భేదం లేకుండా ప్రతి ఒక్కరూ భగవంతుని నుంచి సమాన దూరంలో ఉంటారు. దేవుని కరుణాకటాక్ష వీక్షణాలు అందరి వైపు సమదృష్టితో ప్రసరిస్తాయి. ఆ రకంగా, దేవుని కరుణా కటాక్షాల కోసం చేసేదిగా 'ప్రదక్షిణా'న్ని భావించవచ్చు.

*('ప్రదక్షిణ అంతరార్థం' వచ్చే సంచికలో...)*

...17వ పేజీ తరువాయి


11
ఒకసారి సూరదాసు తన ఆశ్రమంలో భోజనం చేస్తున్నాడు. శిష్యుడైన కిషన్ హఠాత్తుగా ఎటో వెళ్ళాడు.
కిషన్! మంచి నీళ్ళు కావాలి.


12
కిషన్ రాలేదు. అప్పుడు సాక్షాత్తూ శ్రీకృష్ణుడే ఒక బంగారు గ్లాసుతో మంచి నీళ్ళు తీసుకొచ్చాడు.


13
స్వామీ! తమ వద్ద కొత్తగా ఒక బంగారు గ్లాను ఉంది! అది ఎలా వచ్చింది?
ఎక్కిళ్ళు వస్తే నువ్వే కదా నాకు నీళ్ళు ఇచ్చావు!
క్షమించండి స్వామీ! నేను అత్యవసరంగా తోట పనికి వెళ్ళాను. నీళ్ళు నేను ఇవ్వలేదు.


14
అలా అయితే ఈ బంగారు గ్లాసుతో నీళ్ళు ఎవరు ఇచ్చారు? ఓహో! అంతా ఆ మాయా మోహన కృష్ణుని లీలా వినోదమే! కృష్ణా! ఈ అంధునిపై నీకు ఎంత దయ!


15
సూరదాసు అత్యంత ఉన్నతమయిన దివ్యభావ స్థితిలో నెలకొని ఉండేవాడు. శ్రీకృష్ణునితో అనుసంధానం, రాధాదేవితో మాట్లాడడం ఆయనకు సహజమైపోయింది. శ్రీకృష్ణుని బాల్యలీలలు, రాధపట్ల ప్రేమ, శ్రీకృష్ణుని పట్ల విరహంతో గోపికల బాధ వీటిని గురించి ఒక లక్ష పాటలను సూరదాసు తన జీవిత కాలంలో గానం చేశాడు.















దీపం వెలుగును చూసిన మిణుగురుపురుగు మళ్ళీ చీకటిలోకి వెళ్ళడానికి ఇష్టపడదు. చక్కెర పాకంలో ఉన్న చీమ దానిలోనే ఉండాలనుకుంటుంది. అలాగే భగవంతుని ప్రేమామృతాన్ని గ్రోలిన భక్తుడు ప్రాపంచిక సుఖాలను ఆస్వాదించలేడు. a – శ్రీరామకృష్ణ పరమహంస

# గ్రంథ పరిచయం

## శ్రీ కామకోటి దర్శన మహిమలు

**సంకలనం : విశాఖ, పేజీలు:273, వెల: 100/-, ప్రాప్తిస్థానము: సాధన గ్రంథమండలి, తెనాలి - 522 201.**

అలనాటి శంకరుడే కంచి పరమాచార్యులు శ్రీచంద్రశేఖరేంద్ర సరస్వతిగా అవతరించారని భక్తుల విశ్వాసం. భక్తుల విశ్వాసాలను నిజం చేస్తూ శ్రీస్వామి వారు ప్రదర్శించిన మహిమలు అత్యద్భుతాలు... వినటానికి సాధారణంగా కనిపించినా, వారి ప్రతి చర్యా అసాధారణంగా, అనుభవైక వేద్యంగా ఉంటుంది. అన్ని విషయాలనూ దూరదృష్టి, దివ్యదృష్టి అనుభవం, ఆత్మీయతలతో గ్రహించి పరిష్కరించి, ఆనందింప చేయటం, మహిమల ప్రదర్శనతో పాటు జ్ఞాన బోధ, ఆత్మ తత్త్వవివేచన కలిగించటం కూడా శ్రీస్వామి వారి అనుగ్రహ విశేషమే. ఈ గ్రంథాన్ని సంకలనం చేసిన శ్రీ విశాఖ ధన్యులు. మళ్ళీ మళ్ళీ చదవాలనిపించే ఈ గ్రంథం ప్రతీ ఇంటా ఉండదగినది. a

**- స్వామి సుకృతానంద**

**1. శాబర తంత్రము: వెల: 36/-, పేజీలు: 101**
**2. డామర తంత్రము: వెల: 54/-, పేజీలు: 180**
**3. రుద్రయామళ తంత్రము: వెల: 30/- పేజీలు: 92**

**ప్రతులకు: టాగూరు పబ్లిషింగ్ హౌస్,**
**షాప్‌నెం. 20, వైశ్యాహాస్టల్ బిల్డింగ్, కాచిగూడ చౌరస్తా,**
**హైదరాబాదు - 500 027**



## శాబర తంత్రము

పరమశివుని మానస పుత్రుడైన మత్స్యేంద్రుడు (ఆదినాథుడు) పూర్వం వివిధ భాషలలో రచించిన వివిధ దేవతామంత్రాలు, ఆయా మంత్ర సిద్ధివిధానము, కామ్య ప్రయోగాలతో సహా శాంతి, వశీకరణ, రోగనివారణ, కార్య, విజయ సిద్ధి మొదలైన వాటికొరకై ఉన్న మంత్రాలను రచయిత చక్కగా పొందుపరచి మనకందించారు. ఇష్టకామ్యసిద్ధికొరకు, గురువుద్వారా దీక్షను పొంది ఈ సాధనలు చేయాలని చెప్పబడినది. a

## డామర తంత్రము

ఔషధ క్రియలతో పాటు మంత్రాన్ని జత చేస్తే ఆ ఔషధం మంత్ర దేవత వలన ఉత్తేజితమై సఫలమవుతుందంటారు. ఈ డామర తంత్రము, ఆయుర్వేద, మంత్ర ప్రయోగాల సమ్మిళితం. దీనిలో వశీకరణ, స్తంభన మొదలైన షట్కర్మలతో పాటు దేహ సౌందర్య సాధనకూడా చెప్పబడింది. ఆరు పరిచ్ఛేద ములతో, అనేక ఔషధ ప్రయోగాలు ఈ డామర తంత్రములో ఉన్నందున ఈ గ్రంథం ఔషధీ విషయాలలో ఆయుర్వేదం వలనే విశేష లాభకారిగా ఉండగలదు. a



## రుద్రయామళ తంత్రము

ఇది ప్రత్యేకించి మూలికా ప్రయోగాలతోకూడిన ఔషధీ గ్రంథం. నాలుగు ప్రకరణాలు ఉన్న ఈ పుస్తకంలో వశీకరణ, మారణ ప్రయోగములతో పాటు రోగ నివారణములు ఎన్నో చెప్పబడినవి. అందరూ ఆదరించి ఆచరించదగిన గ్రంథాలు ఇవి. చక్కని తెలుగు అనువాదంతో ఈ పుస్తకాలను అందించిన రచయిత అభినందనీయులు. a



**- పోపూరి విశ్వనాథ్**

**గమనిక**

**'గ్రంథపరిచయం' కోసం పుస్తకాలు పంపేవారు తప్పనిసరిగా ప్రతి పుస్తకం రెండేసి ప్రతులు పంపాలి.**

# వార్తావాహిని

## నూతన సభాంగణ ప్రారంభోత్సవం

**కడప రామకృష్ణ మిషన్** పుట్లంపల్లి ఆశ్రమ ప్రాంగణంలో నిర్మించిన స్వామి వివేకానంద మండపం, సభాంగణాలకు బెంగుళూరు రామకృష్ణ మఠం అధ్యక్షులు



స్వామి హర్షానందజీ 2007 డిసెంబర్ 2వ తేదీన ప్రారంభోత్సవం చేశారు. సుమారు 1000 మందికి పైగా విద్యార్థినీ విద్యార్థులు పాల్గొన్న ఈ కార్యక్రమంలో 'యువతకు స్వామి వివేకానందుని సందేశం' పై స్వామి హర్షానందజీ ఉత్తేజకరంగా ప్రసంగించారు. a

**– నివేదిక: స్వామి ఆత్మవిదానంద**

## 'స్వామి వివేకానంద యూత్ లీడర్‌షిప్' పురస్కారం

**చెన్నై, టి.నగర్‌లోని రామకృష్ణ మిషన్ ఆశ్రమ** 'స్వామి వివేకానంద యూత్ లీడర్‌షిప్' అనే పేరుతో పురస్కారం ఒకటి ప్రతిపాదించింది. ఈ పురస్కారాన్ని ఏ రంగంలోనైనా



ప్రత్యేక ప్రతిభను కనబరిచే యువతీయువకులకు ప్రతీ నెలా ఇస్తారు. ఈ పురస్కారం కింద ప్రశంసా పత్రాన్నీ, స్వామి వివేకానందుని చిత్రపటాన్నీ, స్వామి వివేకానంద సంపూర్ణ సాహిత్యం( 9 సంపుటాలు), స్వామి వివేకానంద సమగ్ర జీవిత చరిత్ర(2 సంపుటాలు) ఎంపికైన అభ్యర్థికి అందజేస్తారు.

'స్వామి వివేకానంద యూత్ లీడర్‌షిప్' ప్రథమ పురస్కారాన్ని 2007 నవంబర్ 25న చెన్నై రామకృష్ణ మిషన్ కార్యదర్శి స్వామి పద్మస్థానందజీ వైష్ణవ్ కళాశాల స్టూడెంట్స్ యూనియన్ అధ్యక్షురాలు కుమారి అర్చనా రమేష్‌కు అందజేశారు. a **– నివేదిక : స్వామి బోధమయానంద**

## స్వామి వివేకానంద సేవా భవన వార్షికోత్సవం

**తూ**ర్పు గోదావరి జిల్లాలోని **వేట్లపాలెం శ్రీరామకృష్ణ సేవా సమితి** 2007 డిసెంబర్ 15వ తేదీన ప్రథమ వార్షికోత్సవం జరుపుకుంది. ఈ కార్యక్రమంలో రాజమండ్రి రామకృష్ణ మఠం స్వామి అచింత్యానందజీ,



డాక్టర్ పి. శ్యామసుందరమూర్తి, తూర్పు గోదావరి జిల్లా రెవిన్యూ అధికారి ఏ. మోహన్ రాజు ఇంకా అనేకమంది పుర ప్రముఖులు పాల్గొన్నారు. సుమారు 500 మంది భక్తులు పాల్గొన్న ఈ ఉత్సవంలో స్వామి అచింత్యానందజీ 'పేదల కోసం స్వామి వివేకానంద ఎలా తపించారో' సోదాహరణంగా వివరించారు. సమితి నిర్వహిస్తున్న కుట్టు శిక్షణా కేంద్రంలో శిక్షణను పూర్తి చేసిన 70 మంది మహిళలకు యోగ్యతా పత్రాలను అందజేశారు. వక్తలు వేట్లపాలెంలో సమితి చేస్తున్న సేవా కార్యక్రమాలను కొనియాడారు. పి.జి రాజమోహన్ నిర్వహించిన సంగీత విభావరి అందరినీ అలరించింది. a

**–నివేదిక : వి. వీరభద్రరావు**

# సుబోధ

**భక్తుడు:** సమస్తమూ భగవంతుని ఇచ్ఛానుసారమే జరుగుతోందని విశ్వసించడం ఎలా?

**శ్రీరామకృష్ణులు:** ఇలాంటి ఎరుక ఉన్న వ్యక్తి జీవన్ముక్తుడే! కానీ అందరికీ ఈ విశ్వాసం ఉండదు. 'భగవంతుడు ఉన్నాడు. ఆయన ఇచ్ఛానుసారమే సమస్తమూ జరుగుతోంది' అని లౌకికులు అంటూ ఉంటారు. కానీ దానిలో విశ్వాసం ఉంచరు. అందరూ భగవంతుణ్ణి గ్రాహ్యం చేసుకోగలరా? భగవంతుడు మంచివాళ్ళనూ సృష్టించాడు, దుష్టులనూ సృష్టించాడు; భక్తులనూ సృజించాడు, భక్తి హీనులనూ సృజించాడు; విశ్వాసం ఉన్నవాళ్ళనూ సృష్టించాడు, విశ్వాస రహితులనూ సృష్టించాడు. ఆయన లీలలలో అన్ని వైచిత్ర్యాలూ ఉన్నాయి. ఆయన శక్తి కొన్ని చోట్ల అధికంగా వ్యక్తీకృతమవుతోంది. కొన్ని చోట్ల తక్కువగా వ్యక్తం అవుతోంది. సూర్యరశ్మి మట్టి మీద కన్నా నీళ్ళలో ఎక్కువగా ప్రకాశిస్తుంది; నీటి కన్నా అద్దంలో మరింతగా ప్రకాశిస్తుంది. ఉత్తమ భక్తుడు, మధ్యమ భక్తుడు, సాధారణ భక్తుడు అంటూ భక్తులలో పలు రకాలు ఉన్నారు.

'భగవంతుడు ఉన్నాడు, పైన ఆకాశంలో సుదూరంగా ఆయన ఉన్నాడు' అంటాడు సాధారణ భక్తుడు. ఇక, మధ్యమ భక్తుడు – 'భగవంతుడు సర్వభూతాలలోనూ చైతన్యరూపంలోనూ, ప్రాణ స్వరూపంలోనూ ఉన్నాడు' అంటాడు. కాగా, ఉత్తమ భక్తుడేమో 'భగవంతుడే సర్వమూ అయి ఉన్నాడు. కనిపించేవన్నీ ఆయన వేర్వేరు రూపాలే. ఆయనే మాయ, ఆయనే జీవజగత్తులు, ఆయనే సర్వమూ అయి ఉన్నాడు. ఆయన తప్ప వేరేదీ లేదు' అంటాడు.

**భక్తుడు:** జీవన్ముక్త స్థితి ఎవరికైనా కలుగుతుందా? ఆ స్థితిలో ఉన్నవారు ఎలా ప్రవర్తిస్తారు.

**శ్రీరామకృష్ణులు:** భగవద్దర్శనం కానట్లయితే, ఆ స్థితి కలుగదు. భగవద్దర్శనం పొందాడా లేదా అనడానికి కొన్ని లక్షణాలు న్నాయి. అతడు కొన్ని సమయాల్లో ఉన్మాదిలా నవ్వుతాడు, ఏడుస్తాడు, నాట్యం చేస్తాడు, పాడతాడు. కొన్ని సందర్భాలలో పిల్ల వాడిలా, అంటే ఐదేళ్ళ బాలుని స్థితిలో కల్లా కపటంలేని వాడిలా ఉంటాడు. అతడికి అహంకారం ఉండదు, అనాసక్తుడిగా ఉంటాడు. ఏ గుణాలకూ వశంకాడు. సదా ఆనంద మయుడై ఉంటాడతడు. మరికొన్ని సమయాల్లో పిశాచిలా వర్తిస్తాడు. శుచి, అశుచి అనే భేద బుద్ధి అతడిలో ఉండదు. విధి విహితాలన్నీ అతడికి ఒకటే అయిపోతాయి. కొన్ని సమయాల్లో ఏదో చూస్తున్నట్లు, జడునిలా అయిపోతాడు. అప్పుడు ఏ పనీ చేయలేడు. ఏ ప్రయత్నంలోనూ పాల్గొనలేడు.

('శ్రీరామకృష్ణ కథామృతం' నుంచి)


**శ్రీరామకృష్ణ ప్రభ**
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్ – 500 029
ఫోన్: 040–2766 7799, 2763 3936
E-mail : sriramakrishnaprabha@gmail.com



నిర్వాహక సంపాదకులు: **స్వామి జ్ఞానదానంద**
సంపాదకులు: **స్వామి పరిజ్ఞేయానంద**




దివ్యజనని శ్రీశారదామాత ఒకసారి నకులేశ్వర్ వెళుతున్నారు. హఠాత్తుగా చేతిలో త్రిశూలం పట్టుకొని, కాషాయవస్త్రాలు ధరించిన ఒక మహిళ, అమ్మను ఆపి, అమ్మ వైపే చూస్తూ పాట పాడ సాగింది. అమ్మ నిశ్చేష్టురాలై నిల్చున్నారు. భైరవి ఇలా పాడింది:

*"ఉమా! మరొకరి ఇంట్లో నువ్వెలా ఉన్నావు? ప్రజలు చెబుతున్నవి విని లజ్జతో నేను శిలనై పోయాను. నా అల్లుడు యాచకుడు అంటున్నారు వాళ్ళు. నేనది ఎలా భరించగలను? ఇప్పుడు గనక అతను వస్తే, ఉమ నీతో రాదని నేను చెబుతాను."*



ఆమె పాట పాడడం పూర్తయ్యాక అమ్మ తన వెంట వచ్చిన వారిని ఆమెకు కొంత పైకం ఇమ్మన్నారు. అయితే భైరవి నిరాకరించి, "మనం ఎవరి దగ్గర ఏం తీసుకోవాలో గ్రహించాలి. మీ దగ్గర నాకేం కావాలో నా అంతట నేనే తీసుకుంటాను. దయచేసి మీరు ముందుకు సాగి వెళ్ళండి" అంది.

అమ్మ ముందుకు కదిలారు. భైరవి ఒంగి, అమ్మ నిలబడిన చోట నుంచి అమ్మ పాదధూళిని తీసి తన శిరస్సు పైన ఉంచుకొని అక్కడి నుంచి వెళ్ళింది.

గిరీశ్ చంద్ర గొప్ప నటుడు. అతనికీ, దివ్యజననికీ నడుమ ఒక దివ్యలీల జరిగింది. తమ ఇంట జరగనున్న దుర్గాపూజకు దివ్యజనని రావాలని గిరీశ్, అతని అక్క దక్షిణ మనసారా కోరుకున్నారు. మలేరియా జ్వరంతో బాధపడుతున్న అమ్మకు సంగతి తెలియజేశారు. పదే పదే మలేరియా రావడం వల్ల అమ్మ చాలా నీరసపడ్డారు. అయితే ఏ సాకు చెప్పినా గిరీశ్ వినడని అమ్మకు తెలుసు. అమ్మ రాకుంటే అతను దుర్గాపూజ చెయ్యడు. అందువల్ల అమ్మ ఒప్పుకోక తప్పలేదు. ఆమె కలకత్తా వచ్చి, బలరామ్ బాబు ఇంట్లో బసచేసి, గిరీశ్ ఇంట్లో జరిగిన దుర్గాపూజకు సప్తమి నాడు, నవమి నాడు హాజరయ్యారు. అనారోగ్యం కారణంగా అమ్మ అర్ధరాత్రి జరగబోయే సంధిపూజకు రాకూడదని అనుకున్నారు. గిరీశ్ చాలా నిరాశ చెందాడు. ఇంటి చావడిలో కూర్చొని, "అమ్మ లేకుండా ఈ పూజ ఏమిటి" అని రోదించసాగాడు. అంతలో శారదాదేవి అక్కడ ప్రత్యక్షమైంది. సాక్షాత్తూ జగజ్జనని... జగద్ధాత్రియే కరుణించి తన ఇంటికి వచ్చినందుకు అమితానందంతో గిరీశ్ దివ్యజనని చరణాల వద్ద పుష్పాంజలి సమర్పించి, సాష్టాంగ ప్రణామాలు అర్పించాడు.

**(అశుతోష్ మిత్ర స్మృతుల నుంచి)**

Vol.65-2, Sri Ramakrishna Prabha (Telugu Monthly) February 2008, Regd. with the Registrar of Newspaper for India Under No. 1120/57. Postal Registration No. H-HD-1071/2007-09. Licensed to Post Under WPP : CPMG/AP/HC-13/WPP/2007-09.

# శ్రీ పరమాచార్య చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ వేదాధ్యయనానుసన్ధాన ప్రతిష్ఠానమ్

## ప్రవేశ / ఉద్యోగ ప్రకటన

**1. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది కోర్సులకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) 'వేదచూడామణి' : ఋగ్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క అధ్యయనము

యోగ్యతలు : మాతృభాషలో చదువగలిగి, వ్రాయగలిగి ఉండాలి.

వయస్సు : 8 నుంచి 10 సంవత్సరాల మధ్య

స్టైఫండ్ : నెలకు రూ. 1,000/-

(ఆ) 'వేదార్థచూడామణి' : ఋగ్వేదము/ యజుర్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క భాష్యాధ్యయనము

యోగ్యతలు : సంస్కృత పరిజ్ఞానముతో బాటు ఏదో ఒక వేదాన్ని పూర్తిగా అధ్యయనం చేసి ఉండాలి.

వయస్సు : 15 సం॥, ఆ పైన

స్టైఫండ్ : నెలకు రూ. 3,000/-

**2. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది ఉద్యోగాలకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) వేదాధ్యాపకుడు : (సామవేదము/ అథర్వవేదము - వేదానికి ఒక్కొక్కరు చొప్పున రెండు ఖాళీలు)

కావలిసిన అర్హతలు : క్రమాంతము లేక పదాంతము

అదనపు అర్హతలు : ఏదైన మఱియొక వేదము/ వేదభాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము

అనుభవము : 2 సంవత్సరములు

సంభావన : నెలకు రూ॥ 8,000/- మొత్తము, సౌకర్యములతో

(ఆ) వేదభాష్యాచార్యుడు : (ఒక్కొక్క వేదానికి ఒక్కొక్కరు చొప్పున 4 ఖాళీలు)

విద్యార్హత : ఏదైనా వేద భాష్యంలో ఉత్తీర్ణత

అదనపు అర్హత : మరొక వేద భాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము

అనుభవార్హత : 5 సం॥

సంభావన : నెలకు రూ. 10,000/- మొత్తము, సౌకర్యములతో

ముద్రించిన దరఖాస్తు ఫారములను **శ్రీ పి. వేంకటేశ్వర్లు గారు, మేనేజింగ్ డైరెక్టర్, కాకతీయ సిమెంట్, సుగర్ & ఇండస్ట్రీస్ లిమిటెడ్, 'గురుకృప' (ఆంధ్రా బ్యాంకు ఎదురుగా), 1 - 10 - 140/1, అశోక్‌నగర్, హైదరాబాద్ - 500 020** (ఫోను: 040 - 27637717) నుంచి ప్రత్యక్షముగా గాని, పోస్టు ద్వారా గాని పొందవచ్చు. పూర్తి చేయబడిన ఆ ముద్రిత దరఖాస్తులను ఈ పై అడ్రసుకు పంపవలెను. అవసరాన్ని బట్టి ఖాళీలను పూరించుట లోనూ, అర్హతల సవరణ లోనూ మేనేజ్‌మెంటుకు అధికారము కలదు.

సం/-

హైదరాబాద్ కులప్రశాసకుడు

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

మార్చి 2008

వెల : రూ. 8



సర్వధర్మస్థాపకస్త్వం సర్వధర్మస్వరూపకః । ఆచార్యాణాం మహాచార్యో

## రామకృష్ణాయ తే నమః



# శ్రీకాళీ స్మరణం

## [శ్రీరామకృష్ణ కథామృతంలోని పాటలు]

## సి.డి. ఆవిష్కరణ




**శ్రీరామకృష్ణులు భావ పారవశ్యంలో కాళీమాతను స్తుతిస్తూ, స్మరిస్తూ ఎన్నో పాటలు పాడారు. అవన్నీ ఎంతో భావ గర్భితంగా ఉంటూ జీవిత రహస్యాలను, భక్తితత్వాన్నీ విశదీకరించేవిగా ఉంటాయి. వాటిని అర్థవంతంగా తెలుగులోకి అనువదించి 'శ్రీరామకృష్ణ కథామృతం'లో క్రోడీకరించారు. ఆ పాటలను అన్నింటినీ హైదరాబాద్ రామకృష్ణమఠం వారు 'భజన మాల' పుస్తకం రెండవ ముద్రణలో పొందుపరిచారు.**

ఆ భక్తి రసామృతాన్ని భావసహితంగా, సరళమైన శైలిలో, సామాన్యులు సైతం పాడుకునేవిధంగా గానం చేశారు **స్వామి జ్ఞానదానంద.** ఆ గానసుధాలహరిని "శ్రీ కాళీ స్మరణం" అనే పేరుతో సి.డి.గా రూపొందించారు. దానిలో **1. నల్లనిదౌ నా మానస మధుపము... 2. సదానందమయీ కాళీ... 3. నేనెందుకు పోవలె కాశీ కంచీ... 4. శ్రీ కాళి నామము చేకొని లోతుకు... 5. నాకేదీ ఇక భయము... 6. నీవే ముక్తి దాయినివి.. 7. ఎరుగక తరమే ఏరికినైనా... 8. గతియే కాదా కాళీమాయి...** అంటూ వీనులవిందైన పల్లవులతో మొదలయ్యే ఎనిమిది పాటలు ఉంటాయి.

శ్రీ రామకృష్ణుల జన్మదినోత్సవ (తిథి ప్రకారం-మార్చి 9వ తేది ఆదివారం) శుభ సందర్భాన ఈ సి.డి.లను విడుదల చేయనున్నారు. కేవలం ఆరోజున మాత్రం భక్తులకు వాటిని **తగ్గింపు ధర : రూ.20 కే (అసలు ధర రూ. 40)** అందజేస్తారు. ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని **'శ్రీ కాళీ స్మరణం'** లో ఓలలాడుతూ తరించాలని కోరుతున్నాం.

### భక్తులకు గమనిక

శ్రీరామకృష్ణుల జన్మదినోత్సవం (మార్చి 9వ తేదీ, ఆదివారం) రోజున హైదరాబాద్ రామకృష్ణ మఠంలో జరిగే పూజ,హోమం,భజనలు, ఉపన్యాసాలు మొదలైన కార్యక్రమాలు- ఆరోజు మధ్యాహ్నం 12.30 నుండి 2.30 గంటల మధ్య భక్తి టీవీలో ప్రసారమవుతాయి. భక్తులు ఈ కార్యక్రమాలను 'భక్తి టీవీ'లో తిలకించి ఆనందించగలరని ఆశిస్తున్నాము.

## శ్రీ రామకృష్ణ ప్రభ

### చందాదారులకు విజ్ఞప్తి

ఆధ్యాత్మిక, వ్యక్తిత్వవికాస విశేషాలతో అశేష అభిమానుల్ని 65 సంవత్సరాలుగా అలరిస్తూ ఉన్న **'శ్రీరామకృష్ణ ప్రభ'** మాసపత్రిక 2007 జనవరి నుంచి హైదరాబాద్ రామకృష్ణ మఠం ఆధ్వర్యంలో వెలువడుతున్న విషయం పాఠకులకు విదితవే. అప్పటి నుంచి వ్యయానికి వెనుకాడకుండా పత్రికను సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దుతూ పాత ధరలకే మీకు అందిస్తున్నాం. పెరుగుతున్న కాగితం, ముద్రణ ధరలను దృష్టిలో ఉంచుకొని పత్రికా మూల్యాన్ని పెంచడం అనివార్యమైంది. కాబట్టి చందాదారులు, పాఠకులు ఈ మార్పును సహృదయంతో స్వీకరించి ఎప్పటిలాగే సహకరిస్తారని ఆశిస్తున్నాం. **- సంపాదకులు**

**2008 ఏప్రిల్ 1వ తేదీ నుంచి**

**చందా వివరాలు**

| | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా | : | రూ. 100 | $ 20 |
| మూడు సంవత్సరాలకు | : | రూ. 280 | $ 50 |
| ఐదు సంవత్సరాలకు | : | రూ. 450 | $ 80 |
| ఇరవై సంవత్సరాలకు | : | రూ. 1500 | $ 360 |

Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020 and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 65 సంచిక: 3 మార్చి 2008

**తుషారాద్రి సంకాశగౌరం గంభీరం మనోభూతి కోటి ప్రభాశ్రీ శరీరమ్ ।**
**స్ఫురన్మౌళి కల్లోలినీచారుగంగా లసద్భాలబాలేందు కంఠే భుజంగా ॥**

మంచుకొండవలే తెల్లని కాంతితో ప్రకాశించే గంభీరుని, కోటి మన్మధులను మించిన తేజస్సుతో, శిరసున గంగతో, బాలచంద్రునితో దీపించుతూ, కంఠమున నాగాభరణమును దాల్చిన శివుణ్ణి ఆశ్రయిస్తున్నాను.

– శ్రీ తులసీదాస విరచితమ్







## లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి




ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు......** రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**రాజ పోషకులు...........** రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**పోషకులు.................** రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| | పేరు | చిరునామా | రూ. |
|---|---|---|---|
| | ఇప్పటి వరకు వసూలైన మొత్తం ... | | 11,77,336 |
| మహారాజ పోషకులు | : శ్రీ ఎన్. వేంకటేశ్వర్లు, | రాజమండ్రి | 46,000 |
| పోషకులు | : శ్రీ మంచల మల్లేశం, | భువనగిరి, నల్లగొండ జిల్లా - 508 116 | 1,000 |
| | : శ్రీ ఎమ్. అప్పల స్వామి, | రాజాం, శ్రీకాకుళం జిల్లా - 532 127 | 1,000 |
| | : శ్రీ కె. లక్ష్మణ్‌రావ్, | విమాన్ నగర్, విశాఖపట్నం - 530 009 | 1,000 |
| | మొత్తం . . . | | 12,26,336 |

## శ్రీరామకృష్ణ ప్రభ గ్రంథాలయ నిధి పథకం

'శ్రీరామకృష్ణ ప్రభ గ్రంథాలయ నిధి పథకం'లో చేరి, మీ పేరు మీద పది మందికి మంచి విషయాలు చదివే వీలు కల్పించండి. ఈ పథకం కింద రూ॥600/- చందా కట్టినట్లయితే, 10 ఏళ్ళ పాటు ఒక గ్రంథాలయానికి (ఉన్నత పాఠశాలలకు/ కళాశాలలకు/ సంస్థలకు/ దేవాలయాలకు)ప్రతి నెలా మీ పేరిట 'శ్రీరామకృష్ణ ప్రభ' పంపిస్తాం. దాతల పేర్లనూ, వారి పేరిట పత్రికను పంపే గ్రంథాలయాల వివరాలనూ 'శ్రీరామకృష్ణ ప్రభ'లో ప్రచురిస్తాం.

| సంఖ్య | దాత పేరు | గ్రహీత సంస్థ |
|---|---|---|
| 1307 | శ్రీమతి. కె. వీణారావు, జూబ్లీహిల్స్, హైదరాబాద్ -33 | జిల్లాపరిషత్ ఉన్నతపాఠశాల, భీమ్‌సేరి, ఆదిలాబాద్ జిల్లా-504 001 |
| 1308 | శ్రీ ప్రతాప్ | లైబ్రేరియన్, వాజిద్‌నగర్, బిచ్‌కొండ మండలం, నిజామాబాద్ జిల్లా |
| 1309 | " " | శ్రీ డి.అంజయ్య, సూర్యవంశి కాలనీ, నల్లగొండ - 508 001 |
| 1310 | శ్రీ సంకురు చంద్రయ్య,షాద్‌నగర్, మహబూబ్‌నగర్-216 | జిల్లాపరిషత్ బాలుర ఉన్నతపాఠశాల,ఫరూక్‌నగర్,మహబూబ్‌నగర్ జిల్లా |
| 1311 | " " | జిల్లాపరిషత్ బాలుర ఉన్నతపాఠశాల, షాద్‌నగర్, మహబూబ్‌నగర్ జిల్లా |
| 1312 | " " | ప్రాథమికోన్నత పాఠశాల, క్రిస్టియన్‌కాలనీ, షాద్‌నగర్, మహబూబ్‌నగర్ జిల్లా |
| 1313 | " " | ప్రభుత్వ జూనియర్ కళాశాల, షాద్‌నగర్, మహబూబ్‌నగర్ జిల్లా |

ఈ పథకం ద్వారా శ్రీరామకృష్ణ ప్రభను మరింతమందికి చేరువ చేస్తున్న దాతలకు కృతజ్ఞతలు.



### ADVERTISEMENT TARIFF

| | MULTI COLOUR | B & W |
|---|---|---|
| Fourth Cover | Rs.25,000 | - |
| Second Cover | Rs.20,000 | - |
| Third Cover | Rs.20,000 | - |
| Inside Full Page | Rs.15,000 | 10,000 |
| Inside Half Page | Rs.10,000 | 5,000 |

### చందా వివరాలు

| | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|
| విడి ప్రతి | : రూ. 8 | - |
| ఒక సంవత్సర చందా | : రూ. 85 | $15 |
| మూడు సంవత్సరాలకు | : రూ. 240 | $ 45 |
| ఐదు సంవత్సరాలకు | : రూ. 380 | $ 75 |
| ఇరవై సంవత్సరాలకు | : రూ. 1200 | $ 350 |



గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి. పంపవలసిన చిరునామా : Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.

## లోపలి పేజీల్లో...





## శ్రీరామకృష్ణ ప్రభ వార్షిక చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా! దిగువ పేర్కొన్న నెంబర్ల నడుమ ఉన్న సంవత్సర చందాదారుల చందా గడువు తీరిపోనుంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకొని, 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.*

40007 - 41865 మధ్యనున్న వారిలో **సంవత్సర** చందాదారుల చందా గడువు **2008 మార్చితో** తీరిపోనుంది!

50000 - 52400 మధ్యనున్న వారిలో **సంవత్సర** చందాదారుల చందా గడువు **2008 ఏప్రిల్‌తో** తీరిపోనుంది!

**శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ.... - సర్క్యులేషన్ మేనేజర్**

_ మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు. ❖ మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి. ✸ మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.





**SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH**
Domalguda, Hyderabad - 500 029. Andhra Pradesh
Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com

సంపాదకీయం

# ఇల్లే ఇలలో స్వర్గం!

ఈ వైజ్ఞానిక యుగంలో మనిషి పక్షిలా ఎగరడం, చేపలా ఈదడం, కోకిలలా పాడడం, నెమలిలా నాట్యం చేయడం – ఇలా తనవి కానివన్నీ నేర్చుకుంటున్నాడు. కానీ తనకు సహజ సిద్ధమైన 'మానవత్వాన్ని' మనిషి మరిచిపోతున్నాడు. కాబట్టి ప్రతి ఒక్కరూ మానవతా విలువల్ని పెంపొందించుకోవడానికి ప్రయత్నించాలి.

మన జీవన నిలయాలు అనురాగాల ఆలయాలుగా మారాలంటే ప్రతి మనిషీ తోటివారితో అన్యోన్యంగా మెలగడం నేర్చుకోవాలి. మనలో నిద్రాణమై ఉన్న 'మానవత్వాన్ని' జాగృతం చేయడానికీ, అంతర్గతంగా ఉన్న 'దివ్యత్వాన్ని' వ్యక్తం చేయడానికీ మానవ రూపంలో మన మధ్యే నడయాడిన అవతారశ్రేష్ఠులు శ్రీరామకృష్ణ పరమహంస. దివి నుంచి భువికి దిగివచ్చిన ఆ త్యాగీశ్వరుడు, సాధనావరిష్ఠుడు, సర్వధర్మ సమన్వయ మూర్తి, సర్వదేవదేవీ స్వరూపుడు, అవతార వరిష్ఠుడు అయిన శ్రీరామకృష్ణుని దివ్య లీలలను అర్థం చేసుకోవడానికి ప్రయత్నించే ముందు ఓ మానవమాత్రునిగా కన్నతల్లి, భార్య, బంధుమిత్రులపై ఆయన ఎంత ప్రేమ ఆప్యాయతలను కురిపించారో, ఎంత అన్యోన్యంగా మెలిగారో తెలుసుకొని ఆచరించగలిగితే 'ఇల్లే ఇలలో స్వర్గం' అవుతుంది.

**ఎంత తీర్చినా తీరని ఋణం :** నవ మాసాలు మోసి, కని, పెంచిన తల్లియే ప్రథమ దైవం. అలాంటి తల్లి సంక్షేమం కోసం శ్రీరామకృష్ణులు పడిన ఆవేదన మనం కూడా అలవరుచుకుంటే కన్నతల్లి ఋణాన్ని కొంతైనా తీర్చుకోగలుగుతాం.

శ్రీరామకృష్ణుని తల్లి చంద్రమణీ దేవి శేషజీవితాన్ని దక్షిణేశ్వరాలయంలో శ్రీరామకృష్ణులతోనే గడిపారు. దక్షిణేశ్వరానికి దగ్గరలో ఒక జనపనార మిల్లు ఉండేది. ప్రతి రోజూ ఆ మిల్లు కూత విన్న తరువాతే చంద్రమణీ దేవి మధ్యాహ్న భోజనం చేసేవారు. ఆ మిల్లు కూతతో స్వర్గంలో ఉన్న లక్ష్మీనారాయణులకు నైవేద్యం అర్పించే సమయమైనట్లుగా భావించి ఆ తరువాతే ఆమె భోజనం చేసేవారు.

అయితే ఆదివారం సెలవు రోజు గనుక మిల్లు కూత వినపడకపోతే ఆమె భోజనం చేసేవారు కాదు. అందుకు శ్రీరామకృష్ణులు 'అయ్యో! మా అమ్మ ఈ రోజు భోజనం చేయలేదు' అని ఆందోళన చెందేవారు. శ్రీరామకృష్ణుల మేనల్లుడు హృదయ్ 'మామయ్యా! బాధపడకండి, ఆకలి వేస్తే ఆమే తింటుంది' అని శ్రీరామకృష్ణులకు సర్దిచెప్పేవాడు. కానీ శ్రీరామకృష్ణులు 'నాకు జన్మనిచ్చిన తల్లి ఆకలితో ఉంటే నేనెలా భరించగలను? వృద్ధురాలైన నా తల్లి శ్రేయస్సును ఆకాంక్షించడం నా కర్తవ్యం' అని బాధతో బదులిచ్చేవారు. ఆఖరికి ఏదోలా తల్లికి నచ్చజెప్పి, భోజనం తినిపించే వరకూ సంతృప్తి చెందేవారు కాదు శ్రీరామకృష్ణులు.

చంద్రమణీ దేవి మరణించినప్పుడు శ్రీరామకృష్ణులు ఆమె పాదాలపై పడి 'అమ్మా! నవమాసాలు మోసి జన్మనిచ్చిన నీ ఋణాన్ని ఎన్నటికీ తీర్చుకోలేను' అంటూ రోదించారు.

ఒక ఊరిలో ఓ సంపన్నుడు ఉండేవాడు. తనకున్న ఆస్తినంతటినీ తన కుమారులకు పంచిపెట్టాడు. కొన్నాళ్ళ తరువాత ఆయనకు జబ్బు చేసి మంచం పట్టాడు. ఆయన చావుబ్రతుకుల మధ్య ఉన్నాడు. ఆ ధనికుని ఇద్దరు కుమారులు మరణించబోయే తండ్రి శవాన్ని శ్మశానానికి ఎలా తీసుకువెళ్ళాలో చర్చించసాగారు. పెద్ద కుమారుడు తండ్రి శవాన్ని ఒక లారీలో తీసుకు వెళదామంటే, రెండో కుమారుడు లారీ అయితే ఎక్కువ డబ్బు ఖర్చు అవుతుంది కాబట్టి ఎడ్ల బండిలో తీసుకువెళదామని అన్నకు సలహా ఇచ్చాడు. ఈ ఇద్దరు అన్నదమ్ములు తర్జనభర్జన పడుతుంటే



(తిథి ప్రకారం ఈ నెల 9 ఆదివారం 'శ్రీరామకృష్ణ పరమహంస' జన్మదినం)

చావు బ్రతుకుల్లో ఉన్న ఆ ముసలి తండ్రి 'ఒరేయ్! మీ ఇద్దరూ నా కోసం ఎందుకు అలా గొడవలు పడతారు. అదిగో! ఆ మూలనున్న నా చేతి కర్రను నాకు ఇవ్వండి. నేనే మెల్లగా నడుచుకుంటూ శ్మశానానికి వెళ్ళిపోతాను' అని అన్నాడు విసుగ్గా.

ధనం కోసం కన్న తల్లితండ్రులనే నిర్లక్ష్యం చేసే సు(కు)పుత్రులు ఉన్నంత వరకూ కుటుంబంలో శాంతి, సహజీవనం ఎలా నెలకొంటాయి!

శ్రీరామకృష్ణులు తన తల్లి ఆకలితో ఉన్నప్పుడు ఆయన పడిన ఆందోళన, ఆమె మరణించినప్పుడు ఆయన పడిన ఆవేదన మన తల్లి పట్ల మనకు కలిగితే కొంతవరకైనా మన కన్నతల్లి ఋణాన్ని తీర్చుకోగలుగుతాం.

**అన్యోన్యతతో ఆదర్శ దాంపత్యం :** నేటి పరుగుల ప్రపంచంలో దంపతులు ఒకరి అభిరుచుల్ని మరొకరు తెలుసుకొనేందుకు సమయం ఉండడం లేదు. ఒకవేళ తెలుసుకొనే సమయమున్నా సహనంతో అర్థం చేసుకొనే మనసు లేదు. దాంపత్య జీవనం సమస్యల వలయంలో చిక్కుకోవడానికి ఇదే ప్రధాన కారణం.

**సంతుష్టో భార్యయా భర్తా భార్త్రా భార్యా తథైవ చ ।**
**యస్మిన్నేవ కులే నిత్యం కల్యాణం తత్ర వైధ్రువమ్॥** (మనుస్మృతి)

'భర్త భార్య అవసరాలను తీరుస్తూ, భార్య భర్త అభిరుచుల్ని అర్థం చేసుకుంటూ ఎవరైతే అన్యోన్యంగా దాంపత్య జీవనం గడుపుతారో వారికి ఎల్లప్పుడూ శుభం చేకూరుతుంది'. శ్రీరామకృష్ణులు తన సహధర్మిణితో సాగించిన అన్యోన్య జీవితం నేటి తరానికి మార్గదర్శకం.

ఒకసారి శారదాదేవికి జ్వరం వచ్చింది. శ్రీరామకృష్ణులు ఆమెకు పరిచర్యలు చేస్తూ ప్రేమతో పరామర్శించేవారు. భార్యాభర్తలు అన్యోన్యంగా జీవించాలంటే ఎప్పుడూ ఒకరిలో మరొకరు లోపాల్ని వెతకకుండా, చేసే చిన్న చిన్న పనుల్లో కూడా మంచిని గుర్తించి ప్రశంసించడం నేర్చుకోవాలని నేటి మానసిక నిపుణుల సలహా. శ్రీరామకృష్ణులు తన జీవితంలో ఈ సలహాను ఆనాడే పాటించి చూపించారు.

ఒకసారి శ్రీశారదాదేవి భావయుక్తంగా పాట పాడారు. ఆ పాట విన్న రామకృష్ణులు మర్నాడు ఆమె దగ్గరకు వెళ్ళి 'నిన్నటి రాత్రి తన్మయత్వంతో పాడిన పాట చాలా బాగుంది' అని శారదాదేవిని ప్రశంసించారు. మరో సందర్భంలో శారదాదేవి స్వయంగా కట్టిన పూలమాలను శ్రీరామకృష్ణులు ఆలయంలోని కాళీమాత మెడలో చూసి, పూలమాలను ఆకర్షణీయంగా కట్టినందుకు ఆమెను అభినందించారు.

అలాగే శ్రీశారదాదేవి కూడా శ్రీరామకృష్ణుల అభిరుచుల్ని గుర్తించి, ఆయనకు ఎంతో భక్తిశ్రద్ధలతో సేవలు చేశారు. శ్రీరామకృష్ణులకు సేవ చేస్తున్నప్పుడు 'నా హృదయంలో అమృతభాండం' ఉందని ఆమె అనుభవిస్తున్న ఆనందాన్ని వ్యక్తపరిచేవారు.

**తప్పించుకు తిరుగువాడు ధన్యుడా! :** ఆధ్యాత్మిక జీవనానికి సంసారం ఒక అవరోధమనుకొని, బాధ్యతల్ని విస్మరించి తనపై ఆధారపడిన వారినంతా అర్ధంతరంగా కష్టాల కడలిలో వదలివేయడం నిజమైన 'వైరాగ్యం' కాదు. ఆధ్యాత్మికత అనే ముసుగులో స్వధర్మాన్ని విస్మరించే వారికి శ్రీరామకృష్ణుల జీవితంలోని ఓ సన్నివేశం మంచి గుణపాఠం.

ధనాన్ని తాకినా, ధనార్జన ప్రసక్తి వచ్చినా భరించలేని త్యాగప్రపూర్ణులు శ్రీరామకృష్ణులు. అలాంటి శ్రీరామకృష్ణులు తన తదనంతరం శారదాదేవి ఎలాంటి ఇబ్బందులకూ గురి కాకూడదనే ముందుచూపుతో ఆమె నిత్యజీవితావసరాల కోసం ప్రతి నెలా అయిదు రూపాయల వడ్డీ వచ్చేలా ధనాన్ని ఏర్పాటుచేశారు.

శ్రీరామకృష్ణుల దగ్గరకు వచ్చి ఆధ్యాత్మిక జీవితాన్ని గడుపుతామన్న భక్తులకు 'ముందు సంసార విధుల్ని సక్రమంగా నిర్వర్తించాలి' అని బోధించేవారు.

*ఆలుబిడ్డలను వీడి అడవి కేగుట కాదు*
*మనసునందు తుచ్ఛవాంఛలు వీడుడు*
*తామరాకు మీద నీటిబొట్టు వలె మెలగు*
*త్యాగమగును అదియే యోగమగును*

ఆధ్యాత్మిక జీవనం గడపాలని శ్రీరామకృష్ణుల దగ్గరకు ఒక భక్తుడు వచ్చి ఆయనతో పాటు కొన్ని రోజులు ఉన్నాడు. ఆ భక్తునికి భార్యాబిడ్డలున్నారనీ, వారిని మామగారింటిలో వదలివచ్చాడనీ శ్రీరామకృష్ణులు తెలుసుకున్నారు. ఆ భక్తుని బాధ్యతారహిత ప్రవర్తన గురించి తెలిసి అతనిని 'మీ భార్యాబిడ్డల్ని అనాథల్లా వదిలేస్తే వారిని ఎవరు చూసుకుంటారు? వారికి ఇరుగు పొరుగు వాళ్ళు తిండి పెడతారా? వారిని వదిలేసి ఇక్కడ సోమరిలా కూర్చోవడానికి సిగ్గులేదా? బాధ్యతల నుంచి తప్పించుకు తిరిగే నీలాంటి వారికి కాదు ఆధ్యాత్మికత' అని శ్రీరామకృష్ణులు మందలించారు.

మనిషి ప్రేమ, ఆప్యాయత, అనురాగాలతో జీవనం సాగించగలిగితే **'ఇల్లే ఇలలో స్వర్గం'** అవుతుంది. అందుకు శ్రీరామకృష్ణుల జీవితమే అందరికీ ఆదర్శనీయం, అనుసరణీయం.

# గురుదేవుల బోధనతో గిరిజనుల సేవ



రాజమహేంద్రవరం నుంచి బయలుదేరి గోదావరి మీద లాంచీలో ప్రయాణం చేస్తూ భద్రాచలం వెళుతుంటే పట్టిసీమ, పోలవరం, మహానందీశ్వరం, పోచమ్మగండి, దేవీపట్నం, కొండమొదలు గ్రామాలు దాటి ముందుకు వెళ్ళేసరికి పాపికొండల శ్రేణి అడ్డం వస్తుంది.

దట్టమైన అరణ్యాలతో నిండిన ఎత్తైన పాపి కొండలకీ, లోతైన నల్లని గోదావరి నీటికీ నడుమ ఉన్న ఒక చిన్న గ్రామమే పేరంటపల్లి. పాపికొండల ప్రశాంత పరిసరాలలో స్వామి బాలానంద స్థాపించిన 'శ్రీరామకృష్ణ మునివాటం' నెలకొని ఉంది. ఈ ఆశ్రమంలో అధిష్ఠానమైన పరమేశ్వరుని ఆలయగోపుర శిఖరాన ఆధ్యాత్మికతను సూచించే 'ఓంకారం' శోభిల్లుతుంటే, ఒక ప్రక్కన క్రైస్తవుల 'శిలువ', ఒక వంక మహ్మదీయుల 'చంద్రవంక', మరొక వైపు పారశీకుల 'జ్వాలా కలశం' – సర్వమానవ కోటినీ ప్రేమపూర్వకంగా ఆహ్వానిస్తున్నాయి. మానవ కల్పితమైన, కలుషపూరిత కుల-మత వైషమ్యాలు అక్కడ తలంపునకైనా రావు. ఆలయంలో పూజారి ప్రతిబంధకం లేదు. కాబట్టి భక్తులు ప్రశాంతంగా దైవాన్ని తామే స్వయంగా పూజించుకొని హృదయపూర్వకంగా ధ్యానం చేసుకోవచ్చు. మౌనం పాటిస్తూ, దివ్యానుభూతినీ, అవ్యక్తానందాన్నీ పొందవచ్చు.

**ఆధ్యాత్మిక జిజ్ఞాస:** స్వామి బాలానంద బాల్యంలో ఒకరోజు వాహ్యాళికి బయలుదేరారు. ఆ సాయంకాలం వారు వెళ్ళిన మార్గంలో ఒక శ్మశానం ఉంది. అప్పుడు అక్కడ ఒక శవదహనం జరుగుతోంది. ఆ చనిపోయిన వ్యక్తి ఏమవుతాడు? అనే ప్రశ్నకు సమగ్ర పరిశీలన ఆనాటి నుంచి బయలు దేరింది ఆ బాల హృదయంలో.

**శ్రీరామకృష్ణుని దర్శనం:** స్వామి బాలానంద కూనవరంలో పోస్టాఫీసుకు సమీపంలో ఉన్న రామ మందిరంలో మకాం చేశారు. ఒకనాడు సాయంకాలం వారు ఆ మందిరంలో మెలకువగానే పరున్నారు.

వారి ఎదురుగా శ్రీరామకృష్ణులు నిల్చొని ఉన్నారు.

"అవునా? కాదా? ఏమిటిది? ఎవరీ మనిషి" అని కళ్ళు నులుముకొని మళ్ళీ మళ్ళీ చూశారు స్వామి.

సశరీరులై శ్రీరామకృష్ణులే నిలబడి ఉన్నారు. శ్రీరామకృష్ణులు చిరునవ్వు నవ్వుతూ స్వామి బాలానందతో "నీవు గిరిజనుల సేవలో నీ జీవితాన్ని సార్థకం చేసుకో" అని చెప్పి అంతర్థానమయ్యారు.

శ్రీరామకృష్ణ పరమహంస బోధనల స్ఫూర్తితో స్వామి బాలానంద పేరంటపల్లిలో ఆశ్రమం స్థాపించారు. అక్కడి గిరిజనుల సేవలకు తన జీవితాన్ని అంకితం చేశారు. a

# అపర శుకదేవుడు!

– స్వామి జ్ఞానదానంద


స్వామి యోగానంద

శ్రీరామకృష్ణులు ఒక రోజున శారదాదేవి ఎదుట కనిపించి, యోగీంద్రునికి మంత్రదీక్ష ఇవ్వవలసిందిగా ఆదేశించారు. అతడికి ఏ మంత్రం ఉపదేశించాలో ఆ మంత్రం కూడా ఆయన దివ్యజనని శారదాదేవికి తెలిపారు. మొదట్లో శారదాదేవి ఇదంతా ఒక మానసిక భ్రాంతి అనుకున్నారు. కానీ ఇదే దృశ్యం ఆ తరువాత వరుసగా రెండు రోజులు ఆమెకు గోచరించింది.

మూడోరోజున ఆమె, తన ఎదుట సాక్షాత్కరించిన శ్రీరామకృష్ణ పరమహంసతో తన సందేహాన్ని ఇలా విన్నవించుకున్నారు: "నేను యోగీంద్రుడితో మాట్లాడనే మాట్లాడను గదా! (సాధారణంగా శారదాదేవి మగవాళ్ళెవరితోనూ మాట్లాడేవారు కారు). అలాంటిది నేనతడికి మంత్రదీక్ష నివ్వడం ఎలా?" ఇందుకు పరిష్కారంగా శ్రీరామకృష్ణులు, శారదాదేవి యోగీంద్రుడికి మంత్రదీక్ష నిచ్చే సమయంలో 'యోగిన్‌మా'ను కూడా దగ్గర ఉంచుకోవలసిందిగా సూచించారు.

ఈ 'యోగిన్‌మా' శ్రీరామకృష్ణుల శిష్యురాలు. యోగీంద్రునికి కూడా ఒక దృశ్యంలో శ్రీరామకృష్ణులు గోచరించి, మంత్రదీక్ష విషయంలో ఇదే విధంగా ఆదేశాలిచ్చారు. ఆ తరువాత కొద్దికాలానికే శారదాదేవి యోగీంద్రుడికి మంత్రదీక్ష నిచ్చారు. ఈ విధంగా శారదాదేవి నుంచి మంత్రదీక్షను పొందిన ధన్యులలో ప్రథముడు యోగీంద్రుడే!

ఎవరైనా అతనికి కొంత పైకం ఇస్తే అతడు దాన్ని భద్రంగా దాచిపెట్టి 'శారదామాత తీర్థయాత్రలకు వెళ్ళినప్పుడు ఈ సొమ్ము వాడుకుంటారు' అనేవాడు.

శారదాదేవి పట్ల స్వామి యోగానంద ఎంతటి గౌరవ మర్యాదలను ప్రదర్శించేవారంటే, ఆయన ఏనాడూ మాతృదేవి పాదాలను స్పృశించి అభివందనం చెయ్యలేదు. శారదాదేవి ఆ ప్రదేశాన్ని వదలి వెళ్ళిపోయిన తరువాత, స్వామి యోగానంద తన తలను అక్కడ ఆనించి నమస్కరించేవారు. శ్రీశారదామాతకు ఎలాంటి శ్రమ కలగకుండా శ్రద్ధ వహించడమే ఆయన ప్రవర్తనలోని అంతరార్థం.

సర్వసంగపరిత్యాగి అయిన శుకదేవునిలా స్వామి యోగానంద కూడా పవిత్రత మూర్తీభవించిన మహాయోగి. అందువల్లనే శ్రీరామకృష్ణులు శారదాదేవికి అవసరమైన పనుల్లో సహాయం చేయడానికి స్వామి యోగానందను నియమించారు. ◙

**(ఈ నెల 25న స్వామి యోగానంద జయంతి)**

# భవరోగములకు మందు

చైతన్య మహాప్రభువు శిష్య పరంపరకు చెందిన మహాభక్తుడూ, ఆచార్యుడూ అయిన నరోత్తమదాస్ ఠాకూర్ ఒక సుమధుర గీతం రచించారు. దాని భావమిది: "శ్రీగౌరాంగుని నామశ్రవణ మాత్రాన్నే నా శరీరం పులకాంకితం కావడం ఎప్పుడు? ప్రభువు నామాన్ని ఉచ్చరించడంతోనే నా కనుల నుంచి అశ్రుధారలు కురిసేది ఎప్పుడు? విషయ భోగాలన్నీ తుచ్ఛమైనవని నాకు ఎప్పుడు తోస్తుంది?"

"జగత్తులో నామసంకీర్తన ఉద్యమాన్ని ప్రచారం చేసి దానిని జనరంజకం చేయడమే నా జీవితాశయం" అని భావించి చైతన్య మహాప్రభువు తన అప్రాకృత లీలగా ఈ సంకీర్తనోద్యమం ప్రారంభించారు. విషయ భోగాల పట్ల ఆసక్తి వల్ల జీవుడు భవరోగగ్రస్థుడవుతున్నాడు. ఈ భవరోగాల నుంచి ఉపశమనం కలగాలంటే కృష్ణ నామ ప్రవాహంలో మునగాలి. ◙



**(ఈ నెల 21న శ్రీ చైతన్య జయంతి)**




# శివతత్వం శివరాత్రి మాహాత్మ్యం

మాఘమాసంలోని కృష్ణచతుర్దశినాడు వచ్చే మహాశివరాత్రి వ్రతం మానవుణ్ణి శివునిగా మార్చడానికి ప్రేరణ కలుగజేస్తుంది. అది యావత్ విశ్వానికీ శివతత్త్వ సందేశాన్ని ప్రసాదిస్తుంది. శివరాత్రి నాడు ఓ వ్యాధుని (వేటగాని) హృదయ పరివర్తన సంబంధమైన పౌరాణిక గాథ మనకు తెలిసిందే. లేళ్ళ మాటలపై విశ్వాసం ఉంచి వాడు వాటిని తమ బిడ్డల దగ్గరకు వెళ్ళడానికి అనుమతిస్తాడు. ఆ లేళ్ళు మరలి రావడానికై నిరీక్షిస్తూ ఆ వేటగాడు రాత్రి అంతా ఓ మారేడు చెట్టుపై కూర్చుని ఉంటాడు. అతడు తనకు తెలియకుండానే పగలల్లా ఉపవాసం, రాత్రి అంతా జాగరణ చేసినట్లయింది. మారేడు పత్రాలను కోసి క్రిందకు పారవేయడం వల్ల ఆ చెట్టు కిందనే ఉన్న శివలింగంపై ఆ బిల్వదళాలు పడడంతో శివలింగార్చన జరిగింది. ఇవన్నీ ఓ విశిష్టమైన మనోభూమికను సృష్టిస్తాయి. ప్రాతఃకాలం అవగానే ఆ లేళ్ళ కుటుంబమంతా తన సమక్షంలో నిలిచి ఉండడంతో అతడి మనస్సు ద్రవించిపోతుంది. ద్విపాద మానవుడు చతుష్పాద హరిణ పరివారం ముందు వాటి సత్యసంధత్వానికి ద్రవించిపోతాడు. భావనా పూర్వకంగా ప్రణామం చేస్తాడు. ఆ సంఘటనతో ఆ వ్యాధుని హృదయం పరివర్తితం కాగా, అతనిలో కూడా శివత్వం సాక్షాత్కరిస్తుంది.

"శివో భూత్వా శివం యజేత్" - శివుడవై శివోపాసన చేయాలి. శివుడవు కావాలనుకుంటే శివదర్శన మాత్రం వల్లనే కుదురుతుంది. శివుడు జ్ఞానమూర్తి. అతని మస్తకం మీద నుంచి సదా జ్ఞానగంగ పొంగుతూ ఉంటుంది. జ్ఞానరాజైన శివుణ్ణి ఉపాసించదలచుకున్న వాడు కూడా జ్ఞానపిపాసువు కావాలి. శివుని జటల నుంచి గంగ బహిర్గతమైనట్లు జ్ఞాని అయినవాడు తన విశుద్ధబుద్ధి ద్వారా జీవితంలోని కఠిన సమస్యల నుంచి బహిర్గతుడు కావడానికి ధైర్యం కలిగి పురోగమించాలి. యథార్థ జ్ఞానం ముందు ఎలాంటి కఠిన సమస్యలైనా నిలువలేవు. యథార్థ జ్ఞానికి జటిల ప్రశ్నలకు సమాధానాలు సహజంగానే లభిస్తాయి. హిమాచ్ఛాదిత ధవళ గౌరీశృంగంపై శివభగవానుడు ఆసీనుడై ఉన్నాడు. జ్ఞాని ఆసనం కూడా అంత శుభ్రమై ఉండాలి. సచ్ఛీలం లేనిదే జ్ఞానం శోభిల్లదు.

మహోత్తుంగ కైలాస శిఖరాలపై ఆసీనుడై ఉన్న మహాదేవ భగవానుని శివత్వాన్ని అంటే కల్యాణ పరంపరలను పొందగోరేవారు జీవనంలోని నిశ్చిత మహోన్నత స్థానం వరకూ పురోగమించాలి. శివుడు దారిలో దొరికే వస్తువు కాదు. కల్యాణమార్గం - కఠినంగా ఉండే ముళ్ళబాట. శ్రేయో మార్గగామి అనేక క్లిష్ట సమస్యలను ఎదుర్కొంటూ పురోగమించాలి. కఠిన సాధనలు లేకుంటే శివత్వం లభించదు. నిత్యం కొనసాగించే సామాన్య విషయ సంబంధమైన కార్యకలాపాలను అధిగమిస్తే కానీ శివత్వశోభ లభించదు.

శివభగవానుడు త్రిలోచనుడు. తృతీయ నేత్రంతో అతడు మదనుణ్ణి- కామదేవుణ్ణి భస్మం చేశాడు. యథార్థ జ్ఞానిపై కొనసాగే కామప్రహారాలు వ్యర్థమవుతాయి. అంతేకాదు యథార్థ జ్ఞాని తన జ్ఞానాగ్నితో కామనలను దగ్ధం చేస్తాడు.

పుష్పదంత మహాకవి తన 'శివమహిమ్నః స్తోత్రం'లో "శ్రీమన్నారాయణుడు శివారాధనలో ఉండగా సహస్ర కమలార్చన వేళలో ఓ కమలం తక్కువ అవుతుంది. అప్పుడు శ్రీహరి తన నేత్రకమలాన్నే అర్పిస్తాడు" అంటాడు. ఇదొక రూపకం. హరునికి హరినేత్రం కావాలి అంటే జ్ఞాని ప్రేమదృష్టితో సృష్టిని తిలకించాలి. ప్రేమ లేని కేవల జ్ఞానం జగత్తును ఆనంద శూన్యం చేస్తుంది. జ్ఞానం, ప్రేమల సమన్వయం ద్వారానే వస్తువును ప్రస్తుతః గుర్తించ గలుగుతాం. అంతే కాదు వస్తు సౌందర్యానందాన్ని పొందగలుగుతాం.

శివుడు దిగంబరుడు. అంటే దిక్కులనే వస్త్రంగా ధరిస్తాడు. యావత్ సృష్టినీ ఆవృతం చేసిన తరువాత శేషించి

(ఈ నెల 6న మహా శివరాత్రి)

## గంగతో కలసి వెలసిన గౌరీశ్వరుడు

విశాఖ జిల్లాలోని చోడవరంలో ప్రసిద్ధి గాంచిన అతి పురాతన దేవాలయం స్వయంభూ శ్రీ గౌరీశ్వరస్వామి దేవస్థానం. సుమారు 600 సంవత్సరాల క్రితం గౌరీశ్వరుడు అనే రాజు నిత్యం శివారాధన చేసేవాడు. ఒకరోజు రాజుగారి కలలో ఈశ్వరుడు కనిపించి, "రాజా! నీ భక్తికి సంతోషించి నీ కోటకు తూర్పున గంగాదేవితో కలసి గౌరీశ్వరుడనై వెలసి ఉంటాను. నేను ఉన్న స్థలం ఎల్లప్పుడూ నీటితో ఉంటుంది" అని చెప్పాడు.



రాజు మరునాడు ఆ స్థలాన్ని గుర్తించి త్రవ్వించగా చుట్టూ గంగతో కూడిన 4 అడుగుల ఎత్తయిన శివలింగం కనిపించింది. అదే రోజున ఆలయానికి సుమారు మైలు దూరంలో ఒక రైతు పొలం దున్నుతుండగా నంది విగ్రహం, ద్వారపాలకుల విగ్రహాలు కనిపించాయి. రైతు వెంటనే రాజుగారికి తెలియజేశాడు. రాజు ఆశ్చర్యపడి ఈశ్వరకృప లభించిందని ఆలయం నిర్మించి, నందీశ్వరుణ్ణీ, ద్వారపాలకుల్నీ ప్రతిష్ఠించి నిత్యం స్వామి వారి చుట్టూ నీరు ఉండడం వల్ల గంగా గౌరీశ్వరుడు అనే పేరుతో నిత్యపూజలు, అభిషేకాలు నిర్వహించి భూవసతి కల్పించాడు.

అప్పటి నుంచి ఈ ప్రాంత వాసులకు కల్పతరువై, నమ్మిన వారికి కొంగు బంగారమైన స్వామి వారిపేరు వారి సంతతిలో ఒకరికి పెట్టసాగారు. చోళరాజుల పరిపాలనలో తురుష్కులు దండయాత్ర చేసి ఆలయాన్ని శిథిలం చేసి ఈశ్వర లింగాన్ని ఛిన్నాభిన్నం చేశారు. అప్పుడు నందీశ్వరుడు కోపంతో ఆ తురుష్కుణ్ణి కాలితో త్రొక్కి చంపాడట. తురుష్కులు ఇక ఆలయంలోకి ప్రవేశించలేక ఆలయ స్థలాన్ని కొంత ఆక్రమించుకున్నారు.

రాజుగారు ఆలయాన్ని తిరిగి నిర్మించి మరొక శివలింగాన్ని ప్రతిష్ఠించాలనుకుని శివలింగం తెప్పించారు. కానీ రాజుగారికి ఈశ్వరుడు కలలో కనిపించి, 'వేరే ప్రతిష్ఠ వద్దు. పూర్వం లాగే నాకు అభిషేకాలు, పూజలు చేయ'మని ఆదేశించాడు. ఆలయ పునః నిర్మాణంలో సింహాచల ఆలయ నిర్మాణంలో మిగిలిన శివావతారం, రామలీల, కృష్ణలీలలు ఉన్న నల్లరాతి స్తంభాలను, దేవ పురుషులు వచ్చి ఆలయంలో (మండపంలో) ప్రతిష్ఠించారు. శివకేశవులకు భేదం లేదని తెలియజేశారు.

ఆలయంలో శివలింగం చుట్టూ ప్రతి ఉదయం సర్పం పడగ విప్పి ఉండడం చూసి నాగేశ్వరస్వామి అని కూడా పిలిచేవారు.

600 ఏళ్ళ చరిత్ర కలిగిన ఈ ఆలయం భక్తులను ఆకర్షిస్తూ, దినదినాభివృద్ధి చెందుతోంది. a

ఉన్న పరమాత్మ తత్త్వాన్ని ఆవృతం చేయగలవారెవరు? ఆ మహాదేవుని ఆవృతం చేయడానికి వస్త్రాలన్నీ అపూర్ణాలైనట్లే యావద్విశ్వాన్నీ ఆవృతం చేసి ఉన్నట్టి తత్త్వానికి ఆచ్ఛాదనావశ్యకత ఏముంటుంది?

జ్ఞాని అయినవాడికి విభూతిని గురించి అంటే వైభవాన్ని గురించి అర్థం చేసుకునే ధైర్య స్థైర్యాలు ఉండాలి. ఈ విషయాన్ని వ్యక్తీకరించడం కోసమే శివభగవానుడు ఒడలంతా భస్మాన్ని పూసుకుంటాడు. ఈ భస్మం కూడా సామాన్య మానవులు ధరించే భస్మం లాంటిది కాదు. మహాపురుషుల మరణానంతరం – వారి చితాభస్మాన్ని శివుడు శిరస్సుపై పోసుకుంటాడు. అలాంటి ప్రభునిష్ఠాపరులైన వారి కపాలమాలలనే గళసీమలో అలంకరించుకుంటాడు. అందుకే ఆయనను 'కపాలి' నామంతో పిలుస్తారు. ఆ మహాపురుషుల భస్మాన్ని సేకరించడం కోసమే మహాదేవుడు నిరంతరం – శ్మశానాలలో పరిభ్రమిస్తూ ఉంటాడు. జగత్ కల్యాణార్థం అహర్నిశలూ పరిశ్రమించే మహాపురుషులతో కూడా భగవానుడు సదా సర్వదా పరుగులు తీస్తూ ఉంటాడు.

ఎవరి మస్తిష్కంలో సర్వకాలాల్లో శివభావాలే విహరిస్తూ ఉంటాయో వారి కపాలమాలను భగవానుడు హారంగా ధరించడమే కాదు అట్టి వారి చింతనలోనే ఆ దేవదేవుడు లగ్నుడై ఉంటాడు. జగజ్జనులకు ఈ విషయాలు తెలియరాదన్న భావంతో ఆ భగవానుడు శిరస్సుపై జటలను ధరించి ఉన్నాడు.

శిరోపరిభాగంలో జ్ఞానగంగ ప్రవహించగా, శీలమనే మహోత్తుంగ ధవళశిఖరంపై ఆసీనుడై, నిరాడంబరుడై, విభూతినే వైభవంగా భావిస్తూ – సజ్జన సంరక్షకుడై, దుర్జన శిక్షకుడై, ప్రేమారాధ్యదేవుడై, బాలచంద్రుని మస్తకంపై ధరించి జగత్ సంరక్షణార్థం హాలాహలాన్ని పానం చేసిన ఆ కర్మయోగికి, జ్ఞానకల్యాణాలకు మూర్తిమంత స్వరూపుడై భాసిల్లే పార్వతీపతికి అనంత ప్రణామాలు. `



# దేవీ వైభవం

ప్రవచనం: శ్రీ సామవేదం షణ్ముఖశర్మ

విలేఖనం: శ్రీమతి ఎన్. శేషు



**(గత సంచిక తరువాయి)**

అనేక బ్రహ్మల్ని చూశాక వాళ్ళకు సత్యం తెలిసింది – ఏమిటీ కాలం, ఏమిటీ ఉనికి అని. అంతుబట్టని కాలం, అంతుబట్టని దేశం. పురాణాల్ని ఆ విధంగా పరిశీలించాలి. మనం పరిశీలించగలగాలి కానీ అణువులోకి ప్రవేశించినా అంతుబట్టని జగత్తు అందులో కనిపిస్తుంది. మన చుట్టూ మనం చూస్తున్న పదార్థాలలోనే మనకు అంతుబట్టని మహా మహాలోకాలు దాగి ఉన్నాయి. ఇక అనంతాకాశంలో ఉన్న లోకాల గురించి ఎవరు చెప్పగలరు?

బ్రహ్మ విష్ణు మహేశ్వరులు విమానంలో అలా వెళుతున్నప్పుడు అమృత సముద్రం కనపడింది.

ఈ విషయం శంకరుల వారు చాలా బాగా చెప్పారు:

***సుధా సింధోర్మధ్యే సురవిటపివాటీ పరివృతే***
***మణిద్వీపే నీపోపవనవతి చింతామణిగృహే***
***శివాకారే మంచే పరమశివ పర్యంక నిలయాం***
***భజన్తి త్వాం ధన్యాః కతిచన చిదానందలహరీమ్***

అది అమృత సముద్రం, అందులో కల్ప వృక్షాల అరణ్యం (కల్పవృక్షాలు అనేకం. పురాణాల్లో వాటి పేర్లు– మందారం, పారిజాతం, కల్పకం మొదలైనవిగా చెబుతారు). ఆ తోట లోపల చింతామణి గృహం. అక్కడ అమ్మవారు కూర్చొని ఉన్నారు. ఆమె కూర్చున్న చోట మంగళమయమైన చోటు. *శివాకారే మంచే పరమశివ పర్యంక నిలయాం* – బ్రహ్మ విష్ణు రుద్రులకు కూడా ఆధారం శివం అనేటటువంటిది. లోకాలన్నీ ఉపశమించిన తరువాత ఎవరు మిగిలి ఉంటారో అతను శివుడు. అలాంటి పరమశివుడు – పరబ్రహ్మ – మంచమైపోయాడట. "*సృష్టి స్థితి సంహార తిరోధాన అనుగ్రహం*" అనే పంచ కృత్యాలు ఆ పరమాత్మ – పరమేశ్వరుడే నిర్వహిస్తున్నాడు కనుక ఆ శక్తులే మంచంగా ఉంటే దాని స్వరూపం తానే అని చెబుతూ, పైన కామేశ్వరుడై ఆయన కూర్చున్నాడు. ఆ కామేశ్వర అంకము నందు ఆ తల్లి ఉన్నది. ఆ ద్వీపం పేరు మణిద్వీపం. సముద్రం పేరు అమృత సముద్రం. ఆ దివ్య లోకమంతా ఆ తల్లిదే. అక్కడ ఆ తల్లిని చూశారు వాళ్ళు. అక్కడ నుండి పైకి వెళ్ళడానికి మరేమీ లేదు. ఈ లోకాలన్నిటికీ అతీతంగా ఉన్న ఒక మహా సౌందర్యం; బ్రహ్మ విష్ణు రుద్రులు అంతవరకూ అన్ని లోకాలూ చూశారు, ఏ లోకంలోనూ వాళ్ళకు అంత అందం కనబడలేదట. ఈ అందం సత్యం శివం సుందరం అయిన అందం. సచ్చిదానందమైన – శాశ్వతమైన అందం. అందుకే "*లోకాతీత లావణ్యాత్ – లలితా*" అని 'మత్స్య పురాణం' చెప్పింది.

లోకాతీతమైన లావణ్యం ఆ జగదంబికలో గోచరించగానే ఆ విమానంలో నుంచి ఆమెకు నమస్కరించారు వాళ్ళు; ఎందు కంటే దిగడానికి వాళ్ళకు హక్కు లేదు. వాళ్ళు ముగ్గురూ అలా నమస్కరిస్తూ ఉంటే ఆశ్చర్యంగా ఆ లోకంలోకి దింపబడ్డారట. దిగగానే ముగ్గురూ స్త్రీలై పోయారట. ఆ అమ్మవారి లోకంలో తొలి స్త్రీ జగదంబిక, అందుకే స్త్రీలకే ప్రవేశం. అంత లోకంలో ఒక్కడే పురుషుడు– ఆమెను ఒడిలో పెట్టుకున్న పరమేశ్వరుడు.

బ్రహ్మ విష్ణు రుద్రులు స్త్రీ రూపాలు ధరించి, అమ్మ దగ్గరకు వెళ్ళారు. "*పర్యంక ప్రవరే తస్మిన్ ఉపవిష్టా వరాంగనా*" అక్కడ ఆ జగదంబిక కనిపించిందట. ఏ

జగత్తులోనూ అలాంటి స్త్రీని వారు చూడలేదు. అందుకే ఆమె త్రిపుర సుందరి.

"రక్తమాల్యాంబరధరా రక్తగంధానులేపనా సురక్త నయనా కాంతా విద్యుత్‌కోటి సమప్రభా వరపాశాంకుశాభీష్టధరా శ్రీభువనేశ్వరీ" అన్నారు. హ్రీం బీజాధిష్ఠాన దేవత అయిన శ్రీభువనేశ్వరీదేవి; వర పాశ అంకుశ అభీష్ట ధరా – వరద, పాశ, అంకుశ, అభయ హస్తాలతో ప్రకాశిస్తూ గోచరించి; రక్తమాల్యాంబర ధరా – ఎర్రటి బట్టలు కట్టుకుందట. అందుకే నవ కౌసుంభ వస్త్రం ధరించిందా దేవి. అలాగే ఎర్రని ఆభరణాలన్నీ ధరించి "సర్వారుణా నవద్యాంగీ సర్వాభరణ భూషితా – అలా కౌసుంభ వస్త్రం ధరించి, మొత్తంగా ఎర్రటి కాంతులతో ప్రకాశిస్తున్న జగదంబికను ఇంతవరకూ వాళ్ళెప్పుడూ చూడలేదట. వెనకటి కల్పాలలో ఎప్పుడు చూశారు?



"సా దృష్ట్వా సుందరీం స్మిత భూషణీం – ఆ చిరునవ్వే అలంకారంగా ఉన్న ఆ తల్లి ఎలా ఉన్నారంటే అరుణాం కరుణామూర్తిం కుమారీం నవ యౌవనా – అరుణాం కరుణాతరంగ తాక్షీం – ఆవిడ కన్నులలో నుంచి, శరీరంలో నుంచి అంతా అరుణం కరుణం. అరుణా అంటే కరుణ అంటారు శంకర భగవత్పాదులు.

అమ్మ అంటే ఎవరంటే– అయ్యవారికి ప్రపంచం మీద దయ పుడితే "అమ్మ"గా వచ్చారట లోకంలోకి. అందుకే పరమే శ్వరుని కరుణే అరుణ. ఎర్రని రంగు దేనికి సంకేతమంటే ప్రపంచంపై అమ్మకు ఉన్న ప్రేమ, కరుణకు! అలాంటి కుమారీ నవ యౌవనా – పదహారేళ్ళ ప్రాయం ... మహాషోడశీ విద్య కదా! ఆ మంత్రాక్షరాలే వయసును తెలియజేస్తాయి. అందుకే బాల నవాక్షరీ మంత్రం – నవ వయస్సుతో గోచరిస్తుంది. మహా షోడశీ పదహారేళ్ళు నిండిన వయస్సుతో గోచరిస్తూ కుమారీ అన్నారు. కుత్సితాం మారయతీ ఇతి కుమారీ – కుత్సితాలనూ, కుత్సితులనూ నశింపజేసేది 'కుమారి'.

ఆ జగదంబిక యౌవనం పరిపూర్ణత్వానికి సంకేతం. అందులో ఎదగని లక్షణం లేదు, జీర్ణించిన లక్షణం లేదు. పరిపూర్ణమైన స్వరూపం. మహా షోడశీ పరిపూర్ణ స్వరూపంతో గోచరిస్తోంది జగదంబిక. 'ఏషా భగవతీ దేవీ సర్వేషాం కారణం హి నః'

సర్వ జగత్తుకూ ఈమే కారణం. ''మహావిద్యా మహామాయా పూర్ణ ప్రకృతి రవ్యయా"

బ్రహ్మ,విష్ణు, రుద్రులు "అమ్మా" అని నమస్కరించి, ''ఏమిటి ఈ ప్రపంచం, ఏమిటి ఇది తల్లీ? నువ్విక్కడ కనబడడం ఏమిటి? నువ్వీ లోకంలో ఉన్నావు గనక ఇతర లోకాలతో నీకు సంబంధం లేదా? ఇతర లోకాలకు విడిగా ఉన్నావా? నీ తత్త్వం ఏమిటో చెప్పమ్మా?" అంటే అమ్మ సైగ చేసారట, 'నా పాదాల వైపు చూడండి' అని. అప్పుడు వారు అమ్మ పాదాల వైపు చూశారు. "పదద్వయ ప్రభాజాల పరాకృత సరోరుహా... పద్మాల కాంతిని కూడా ఓడించేటటువంటి అపూర్వ లావణ్యంతో ప్రకాశిస్తున్న అమ్మ చరణాలు చూశారు. ఆ చరణాలు స్వయం ప్రకాశ స్వరూపాలై అరుణ అయిన ఆ తల్లి నుండి వెన్నెల లాంటి తెల్లని కాంతులిస్తున్నాయిట. ఏమిటి విశుద్ధ సత్వ తత్త్వ కాంతులు అంటే... నఖదీధితి సంఛన్న నమజ్జన తమోగుణా... నఖదీధితులు – ఆ తల్లి కాలివేళ్ళ గోళ్ళ కాంతులవి. అవి వెన్నెల కాంతులను వెదజల్లుతున్నాయట.

ఆ వెన్నెలను అందుకోవాలంటే తలవంచాలి. తలవంచితే ఆ వెన్నెలలు పడి మన తలలోని చీకట్లు పోతాయట. అందుకే "నఖ దీధితి సంఛన్నా నమజ్జన తమోగుణా... నమజ్జన అన్నప్పుడు నమత్ అంటే నమస్కరించు, జనుల తమోగుణాన్ని పోగొట్టే కాలి వేళ్ళ గోళ్ళ వెన్నెల కాంతులు గల తల్లీ అని వర్ణించారు వశిన్యాది వాగ్దేవతలు. ◻ **(సశేషం)**



- స్వామి సుకృతానంద

– ఎ.ఎల్. నారాయణ, హైదరాబాద్

**? : గయ వెళ్ళి పితృదేవతలకు పిండ ప్రదానం చేసినా ప్రతి సంవత్సరం తద్దినాలు పెట్టాలా?**

✍: గయలో పిండప్రదానం విశేషమని చెప్పారు. అలా చేయడం విశేషమే అయినా, కాళ్ళూ చేతులూ ఆడేవరకు నైమిత్తిక కర్మలైన వీటిని ఆచరించాలి. దీర్ఘకాలం శరీర అంగాలు కదలని పరిస్థితి అయిన పక్షవాతం లాంటి తీవ్ర అనారోగ్యం, వ్యాధులు వస్తే తప్ప పితృకర్మలు తప్పక చేయాలి. లేకపోతే "అకరణే ప్రత్యవాయః" – ప్రత్యవాయం (పాపం) వస్తుందని శాస్త్రం చెబుతున్నది.

– కె.వి. నరసింహారావు, చెన్నై

**? : అంత్యకాలంలో భగవన్నామాన్ని స్మరిస్తూ మరణించిన వారికి పునర్జన్మ లేదని శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతలో అంటాడు. దక్షిణాయనం కృష్ణపక్షం రాత్రి మరణించినవారు పితృలోకాలకు వెళ్ళి మరలా జన్మిస్తారని కూడా ఆ భగవానుడే చెప్పాడు. దీన్ని వివరించ ప్రార్థన.**



✍: శ్రీకృష్ణుడు బోధించిన గీతలు అక్షరసత్యాలు. ఎవరైతే అంత్య కాలంలో భగవంతుణ్ణి స్మరిస్తూ ప్రాణం వదులుతారో వారు ఆయన్నే చేరుకుంటారు అని హితవు పలికాడు. అందుచేత ఎల్లప్పుడూ నన్నే స్మరిస్తూ నీ కర్తవ్యాన్ని నిర్వహించమని అర్జునునితో అన్నాడు. అంటే మనందరం కూడా ఎల్లవేళలా దైవస్మరణ చేస్తూ మన విధ్యుక్త ధర్మాల్ని నిర్వహించాలి. అప్పుడు అవసానకాలంలో భగవంతుణ్ణి స్మరిస్తూ దేహం వదిలితే దైవదర్శనం – మోక్షం లభిస్తాయి. పునర్జన్మ ఉండదు. "పునరపి జననం పునరపి మరణం, పునరపి జననీ జఠరే శయనం". ఈశ్వరస్మరణ లేకుండా మరణించిన వారికే దేవయాన పితృయానాలు.

– పి.కేశవదాసు, తాలాడ

**? :యోగులు, సిద్ధ పురుషుల లాంటి మహనీయులు జంతు చర్మాన్ని ఆసనంగా ఉపయోగించారు. జింక, పులి చర్మాల వాడకంలోని ఆంతర్యం తెలియజేయ మనవి.**

✍: అనాది కాలంగా అరణ్యాలలో నివసించే యోగులు, మునులు, ఋషీశ్వరులు అజినాన్ని అంటే జింక లేక వ్యాఘ్ర



చర్మాన్ని ఆసనంగా వేసుకొని ధ్యానాదులు చేసుకొన్నట్లు శాస్త్రాల్లో చెప్పారు. భగవద్గీతలో కూడా భగవానుడు "చైలాజిన కుశోత్తరం" – కుశాసనం కానీ, వస్త్రం, జింక, పులి చర్మం కానీ వేసుకొని ధ్యానం చేయాలని బోధించాడు. అడవిలో నేల తేమగా ఉండడం వల్ల వీటిని వేసుకోమని బోధించారు. శ్రీశంకరాచార్యులు, మధుసూదన సరస్వతి మొదలైన జగద్గురువులు దీన్ని అంగీకరించారు. మామూలు చర్మానికీ వీటికీ వ్యత్యాసముంది. మృగం, పులి మరణించిన వెంటనే వాటి చర్మాన్ని తీసి, ఎండబెట్టి సానబెట్టి వాటిని ఉపయోగిస్తారు. గంగాజలానికీ, మురికి నీటికీ ఉన్న వ్యత్యాసమే జింక చర్మం, మిగతా జంతువుల చర్మాలకీ ఉన్న భేదం. దీనికి మహాత్ములనూ, శాస్త్రాలనూ ప్రమాణంగా స్వీకరించాలి. ❑

ధీరవాణి 

# పరిపూర్ణతకు ప్రతిరూపం

శ్రీరామకృష్ణ పరమహంస ప్రపంచ శ్రేయస్సుకై ఉద్భవించిన కారణజన్ములు. ఆయన్ని మనిషి అనండి, భగవంతుడనండి లేదా అవతారపురుషుడనండి. మీ దృష్టితో ఆయన్ని చూసి మీమీ ప్రవృత్తులను అనుసరించి ఆయన్ని స్వీకరించండి. ఎవరు ఆయన ముందు మోకరిల్లి ఆయన ఆశీస్సులను పొందుతారో వారు ఆక్షణం నుండి పవిత్రమూర్తులవుతారు. యువకులారా, మీరు ఈ సందేశాన్ని తీసుకొని ఇంటింటికీ వెళ్ళి ప్రచారం చేయండి. మీలో రగులుతున్న అశాంతి అలజడులు మాయమవుతాయి.

భగవద్గీత, పురాణాలు, వేదవేదాంతాలు – వీటి యొక్క మర్మాలను అవగాహన చేసుకోవాలంటే ముందు మనం రామకృష్ణ పరమహంసను, ఆయన బోధనలను అధ్యయనం చేయాలి. ఆయన జీవితమే ఒక అనంతశక్తిగల కాంతిదీపం. దాని ఉజ్జ్వల తేజోకిరణాలు భారతీయ ఆధ్యాత్మిక విజ్ఞాన భావసముదాయంపై ప్రసరిస్తూనే ఉంటాయి. వేదవిజ్ఞానానికీ, లక్ష్యానికీ ఆయన జీవితమే ఒక సజీవ వ్యాఖ్య. ఒకే జీవితంలో భారతదేశంలోని జాతీయ ఆధ్యాత్మిక జీవన పరంపరను మొత్తం ఆయన ప్రతిబింబింప చేశారు.

శ్రీరామకృష్ణ పరమహంస ప్రేమకు, జ్ఞానవైరాగ్యాలకు, సామరస్యతకు, మానవ సేవకు నిలయమై, పరిపూర్ణుడైన వ్యక్తిగా భాసించిన వారిలో అగ్రగణ్యులు. కనుక ఆయనతో పోల్చదగినవారు మనకు కానరారు.

ఆయన్ని అర్థం చేసుకోలేని వ్యక్తి జీవనం వ్యర్థం. నా జన్మ పరంపరలో నేను ఆయనకు సేవకునిగా జీవించటమే నా మహద్భాగ్యమని భావిస్తాను. నాకు వేద, వేదాంగాల్లోని సూక్తుల కంటే ఆయన ముఖతా వెలువడే వాక్కు ఎక్కువ బలీయమైంది. నేను ఆయన దాసానదాసులకు సేవకుణ్ణి. ఆయన కీర్తి ప్రతిష్ఠల కొరకు ఎన్నడూ ఉబలాటపడలేదు.

"ఒక వ్యక్తికి సహాయం చేయడంలో ఎన్ని జన్మలయినా అర్పిస్తాను. ఒక వ్యక్తికి సహాయపడడంలో ఉన్న ఔచిత్యం గణనీయమైంది" అని అనేవారు.

ఆధునిక భారతదేశ ప్రగతి, దాని స్వర్ణయుగం శ్రీరామకృష్ణుని జన్మతోనే ఆరంభమయ్యాయి. a



# పరమేశ్వరుని పరిరక్షణలో ...

## స్వామి జపానంద స్వీయ అనుభవాలు -9

(గత సంచిక తరువాయి...)

అయిదో రోజు గురువుగారిని కలిసే అవకాశం లభించింది. ఆశ్రమంలో చక్రాకారంలో గుండ్రంగా సభాగృహం ఉంది. అందులో తలుపు పక్క నుంచి గోడ వారగా ఒకదాని పక్క ఒకటిగా వరుసగా ఇరవై ఆరు



మంచాలు వేసి ఉన్నాయి. ఎక్కడ ఖాళీ దొరికితే అక్కడ సాధువులు ఆసనం వేసుకోవచ్చు. ఎవరినీ అడగక్కరలేదు. ప్రతి మంచానికీ రెండు పక్కలా తెరిచి ఉన్న ద్వారం ఉంది. మధ్యలో సుమారు రెండు వందల మంది కూర్చునే స్థలం ఉంది. ఆ రోజు వారు మూడు గంటలకు వారి గది నుంచి బయటకు సభాగృహంలోకి వచ్చి, 'యోగవాసిష్ఠం' గురించి ప్రసంగించారు. అక్కడ 'యోగవాసిష్ఠం, విచార సాగరం' లాంటి వేదాంత గ్రంథాలు చదివి చర్చించేవారు. ఎక్కువ కాలం దేవపురిగారే పఠించేవారు. అక్కడ ఉన్నవాళ్ళను పలకరించి వెళుతూ, జపానందజీని తన గదిలోకి పిలిచారు. తోతాపురి గురించి అడిగితే ఆయన విషయాలేమీ నాకు తెలియవు అన్నారు. కాసేపు మాట్లాడాక ఇంకొన్ని రోజులు అక్కడే ఉండమని కోరారు. ఎందుకంటే అమరనాథ్ యాత్ర ఇంకా ప్రారంభం కాలేదు.

రాత్రి పది గంటలకు నేపాలీ సాధువుతో కూడా మరొక కొత్త సాధువు వచ్చారు. ఆయన పురిగారి ప్రముఖ శిష్యుడని మాటల్లో తెలిసింది. ఆయన పూర్వాశ్రమంలో ఒక డాక్టరు. కాశ్మీర్‌లో ఉంటున్నారు. పురిగారి అస్వస్థత విషయం తెలిసి వచ్చారు.

సాధారణ విషయాలు మాట్లాడుకున్నాక కొత్త సాధువు ప్రత్యేకంగా మీతో మాట్లాడడానికి వచ్చారని నేపాలీ సాధువు చెప్పారు. సాధువు (జపానందజీ) దానికి అంగీకారం తెలిపారు. ఆయన చెప్పిన కథనం సంక్షిప్తంగా ఈ విధంగా ఉంది: "దేవపురిగారు వృద్ధులైపోయారు. ఆయన వయస్సు సుమారు 77-78 ఏళ్ళుంటుంది. నీరస పడిపోయారు. ఎప్పుడు ఎలా ఉంటారో తెలియదు. మేమందరం చాలా కష్టపడి ఈ ఆశ్రమం కట్టాం. కానీ, దీనికి సంబంధించిన దస్తావేజులు ఏవీ మా దగ్గర లేవు. మా గురువుగారు ఇక్కడకు వచ్చినప్పుడు ఈ తోటలో గడ్డితో ఒక గుడిసె వేసుకుని ఉండేవారు. తోట యజమాని అయిన సర్దార్‌జీ సాధువులనీ, సన్న్యాసులనీ చాలా అభిమానించే వ్యక్తి. ఆయన అభిమానంతో గురువుగారిని ఇక్కడ ఉండమన్నారు. అప్పటి నుండీ గురువుగారు ఇక్కడే స్థిర నివాసం ఏర్పరచుకుని ఉంటున్నారు. తరవాత మేమంతా ఒక్కొక్కరం చేరాము. క్రమంగా ఈ ఆశ్రమం కట్టడం జరిగింది. మా గురువుగారు, సర్దార్‌జీ ఇద్దరూ వృద్ధులైపోయారు. ఆరోగ్యంగా ఉండగానే ఇద్దరూ వ్రాతకోతలు చేసుకుని దస్తావేజు తయారు చేసుకుంటే బాగుంటుంది. సర్దార్‌జీ పుత్రులు మంచి వాళ్ళే ఇప్పటి వరకూ ఏమీ అనలేదు. కాని ఎప్పుడు ఎవరి బుద్ధి ఏ విధంగా మారుతుందో! మాకు వ్రాతపని పూర్తి చేసుకోవాలని ఉంది. దానికి గురువుగారు అసలు ఒప్పుకోవడం లేదు. 'సర్దార్‌జీ మాట మీద నేను ఇక్కడ ఉన్నాను అలాగే ఆయన వెళ్ళు అని ఒక్క మాట అంటే వెళిపోతాను' అంటారు. మీరు గురువుగారికి ఈ విషయం నచ్చ చెప్పగలిగితే మాకు చాలా ఉపకారం చేసిన వారవుతారు".

అంతా విన్నాక స్వామి జపానంద "నాకు మీ గురువుగారి గురించి బాగా తెలియదు. అయిదు నిమిషాల పరిచయంతో ఇలాంటి గంభీరమైన విషయాలు చర్చించే సాహసం నేను చెయ్యగలనా?" అన్నారు.

దానికి సమాధానంగా డాక్టర్ సన్న్యాసి "నేను ఇది వరకే చెప్పాను శ్రీరామకృష్ణ మిషన్ వంటి సంస్థ ఈ ఆశ్రమంలోనూ స్థాపించాలని మా ఆలోచన. ఈ జాగాకి సంబంధించిన దస్తావేజులు తయారైతే కాని ఏమి చెయ్యడానికీ ముందడుగు వెయ్యలేకపోతున్నాం.

అడగడానికి గురువుగారు ఒప్పుకోరు. మిమ్మల్ని కలిసినప్పుడు ఈ విషయాలు చర్చించడానికి సిద్ధ పడ్డారు. అందుకని రేపు నేను మిమ్మల్ని గురువుగారి దగ్గరకి తీసుకెళతాను. మీరు పని జరిగేలాగ గురువుగారిని ఒప్పించండి" అన్నారు.

"నా అంతట నేను ఈ ప్రసక్తి తీసుకురాలేను. మీరు మొదలుపెడితే వారి మాటలని బట్టి నేను ఏమైనా చెబుతాను. లేకపోతే నేను ఏమీ మాట్లాడకుండా నమస్కారం చేసి వెళ్ళిపోతాను. మీరేమీ అనుకోకండి" అన్నారు జపానంద.

మర్నాడు ఉదయం పది గంటలకు జపానందను దేవపురిగారి గదిలోకి తీసుకువెళ్ళారు డాక్టరు సాధువు. ఆశ్రమం అంతా అందంగా, పక్కాగా పంజాబీ పద్ధతిలో కట్టారు. వంట ఇంటి ఎదురుగా ఉన్న అరుగు మీదికి వెళితే ఆ పక్క పైకి వెళ్ళడానికి ఒక వెదురు నిచ్చెన ఉంది. అది ఎక్కి వెళితే చిన్న ద్వారం తరువాత నడవా ఉంది. గుహలోకి వెళుతున్నట్లుగా ఉందది. తల దించుకుని ముందుకు వెళితే అక్కడ శుభ్రమైన ఒక గది ఉంది. అందులో ప్రత్యేకంగా చెప్పడానికి ఏ వస్తువులూ లేవు. ఒక చాప పరచి ఉంది. దాని మీద పురిగారు శయనించేవారు. ఒక కంబళి ఉంది, రాత్రీ, పగలు, బయటకు వెళ్ళినప్పుడూ అదే కప్పుకునే వారు. తల కింద ఒక ఇటుక పెట్టుకుని పడుకునేవారు. అదే అక్కడ ఉన్న సామగ్రి. నేల శుభ్రంగా అలికి ఉంది.

మేమంతా నేల మీద కూర్చున్నాం. గురువుగారి శిష్యుడైన డాక్టరు సాధువు మాటలు మొదలుపెట్టారు. పురిగారు "కాగితాల విషయం నేను అడగలేను. సర్దార్‌జీ మాట మీద నేను ఇక్కడ ఉంటున్నాను. ఇవాళ వెళ్ళిపొమ్మంటే వెళ్ళిపోతాను" అన్నారు.

డాక్టరు సాధువు "మేము ఇదంతా కట్టాం. పైవాళ్ళు కడితే లక్షల్లో ఖర్చయ్యేది. మా శ్రమంతా వ్యర్థమై పోతుంది" అన్నారు.

"మీరెందుకిదంతా కట్టారు? వాళ్ళకు ఇవాళ ఈ భూమి అవసరం ఉందనుకోండి తిరిగి ఇవ్వాలి కదా? ఇదంతా మీరు ఇంకెక్కడికైనా తీసుకెళ్ళిపోండి" అని పురి అన్నారు.

"కట్టిన కట్టడం ఎలా తీసుకెళ్ళిపోతాం? మరి ఈ తోట అంతా ఎలా? ఏమిటి చెయ్యడం?" అని డాక్టర్ సాధువు అన్నారు.



పురిగారు "అవన్నీ నాకు తెలియవు. ఆయన వెళ్ళిపొమ్మంటే వెళ్ళిపోవడమే" అన్నారు.

ఇప్పుడు జపానందకి మాట్లాడే అవకాశం దొరికింది. "మీ సిద్ధాంతాలు ఉత్తమమైనవి. మీలో గొప్ప త్యాగశీలి మనస్తత్వం స్ఫురిస్తోంది. మీ మాటలు వింటూ ఉంటే నాకు ఆనందం కలుగుతోంది. కానీ వీళ్ళందరికీ అప్పుడే ఈ విషయాలన్నీ తెలియచెయ్యవలసింది. అధిక ప్రసంగం అనిపిస్తే క్షమించండి. అప్పుడే ఇవన్నీ మీరెందుకు చెప్పలేదు?" అన్నారు జపానంద.

గురువుగారు గంభీరంగా "ఆ కోణంలో నేను ఆలోచించలేదు. సరే నేను ఆలోచించి చెబుతాను" అన్నారు. మరుసటి రోజు గురువుగారు ఆయనను పిలిచి శిష్యులందరి సమక్షంలో, "నేను తప్పు చేశాను. అప్పుడే ఈ విషయం వీళ్ళకి నేను చెప్పేసి ఉంటే వీళ్ళందరూ ఎక్కడికో వెళ్ళిపోయి ఉండేవారు, కానీ ఇప్పుడేమిటి చెయ్యడం? నేను నా సిద్ధాంతాలను వదులుకోలేను" అన్నారు.

"వద్దు! మీరు మీ సిద్ధాంతాలను వదులుకోవద్దు. వీళ్ళకు సర్దార్‌జీతో మాట్లాడడానికి అనుమతి ఇవ్వండి" అన్నారు జపానంద. అందుకు గురువుగారు అనుమతించారు. సర్దార్‌జీతో డాక్టర్ సాధువు, "మీరిద్దరూ వృద్ధులై పోయారు. ఈ భూమికి సంబంధించిన దస్తావేజులు వ్రాసుకుంటే మంచిది. మీ దృష్టిలో అది అనవసరం అనిపించవచ్చు. కానీ భవిష్యత్తు గురించి ఆలోచిస్తే అది మంచి పని..." అన్నారు. వెంటనే సర్దార్‌జీ తన సహాయకుడిని పిలిచి, ఆ భూభాగం స్వామి దేవపురి సేవలో అర్పిస్తున్నామని దస్తావేజు వ్రాయించ వలసిందిగా ఆదేశమిచ్చారు.

**(మిగతా వచ్చే సంచికలో...)**

**అనువాదం : శ్రీమతి జి.ఎస్. లక్ష్మి**

# ప్రవహిస్తున్న పరమాత్మ ప్రకాశం

కథ : స్వామి జ్ఞానదానంద, చిత్రాలు: శివప్రసాద్

1 నారద మహర్షి వీనుల విందుగా నారాయణ స్మరణ చేస్తూ మహావిష్ణువు దర్శనార్థం వెళుతున్నాడు...
















7
కైలాసంలో...
నా గాన మాధుర్యాన్ని ఆస్వాదించడానికి ప్రతిభావంతులైన శ్రోతలుండాలి కదా! అలాంటి వారు లేకుండా ఎలా ఆలపించడం?
లోకంలో అంతటి శ్రేష్ఠమైన శ్రోతలెవరు?
ఇంకెవరు! బ్రహ్మ,విష్ణువులే!
ఇప్పుడే వెళ్ళి వారిద్దరినీ ఒప్పిస్తాను.


8
ఇలాంటి అవకాశం లభించినందుకు బ్రహ్మ, విష్ణువులు పరమానందం చెందారు.
లోక కల్యాణం కోసమే కదా! తప్పక వస్తాను.
9
కుమారా! నీవు తలపెట్టిన పనికి తప్పక సహాయం చేస్తాను.


10
కైలాసంలో అంతా (బ్రహ్మ విష్ణువు, నారద గంధర్వులు, దేవతలు, భూతగణాలు) హాజరయ్యారు.
గీతాలాపనకు ముందు శివుడు ధ్యానంలో మునిగిపోయాడు. కొద్దిసేపు అక్కడి వాతావరణం ప్రశాంత గాంభీర్యంతో నిండిపోయింది.

మిగతా 36వ పేజీలో...

# అలలోని బుడగ - ఇలలోని జీవితం!

**ఆ**యుష్షు చిగురాకు కొనలోని జలబిందువులా చంచలమైనది. చిల్లి కుండలోని నీటిలా తరిగిపోవడమే దీని స్వభావం. ఈ శరీరం ఉన్నట్లుండి ఏ క్షణంలోనో రోగాల పాలు అవుతుంది. ఒక నియమం అంటూ లేకుండా ఏ క్షణంలోనో నేలకూలుతుంది. విషయాలు అనే సర్పాలకు ఆలవాలమైన చిత్తం కలవారికి ఆయుష్షు శ్రమనే కలుగ జేస్తోంది. కాబట్టి ఆయుష్షును ఎలా నమ్మగలం? గాలినీ, అలలనూ నిరోధించ వచ్చునేమో కాని, నీటి బుడగ లాంటి ఆయుష్షును నిలపలేము. ఇది అతి చంచలమైనది. అందుకే జ్ఞానులు దీనిని తరంగంలానో, నూనె లేని దీపంలానో త్వరలో నశించి పోయేదిగా భావిస్తారు. కొందరు ''అయ్యో! మేము భగవంతుని గురించి ముసలితనంలో ఆలోచిస్తాం. ఇప్పుడు ఏం తొందర" అంటారు. వారికి ఆయుష్షుపై ఎంత నమ్మకం!

లోకులు 'మాకు ఎక్కువ ఆయుష్షు ఉండాలి' అని కోరుకుంటున్నారు. కానీ చిత్తశాంతిని కోల్పోయిన తరువాత దీర్ఘాయుష్షు ఉండి మాత్రం ప్రయోజనం ఏముంది?

**తరవోపి హి జీవన్తి, జీవన్తి మృగ పక్షిణః ।**
**సజీవతి మనో యస్య మననేన సజీవతి ॥**

వృక్షాలు, మృగాలు, పక్షులు కూడా జీవిస్తున్నాయి. కానీ ఏంలాభం? ఎవరికైతే, ఈ దృశ్య సంకల్పం యొక్క మననం క్షీణిస్తుందో, వారే వాస్తవమైన జీవితాన్ని అనుభవిస్తున్నారని నా అభిప్రాయం.

ఈ జీవితం పట్ల, ఆ కనబడే దృశ్య వ్యవహారం పట్ల సరైన అవగాహన కలిగి ఉండాలి. సత్యదృష్టిని అవలంబించి వాసనలను త్యజించివేయాలి. తత్త్వబోధ పొంది ధన్యులు కావాలి. అలాంటి వారి విషయంలోనే ఆయుష్షు సార్థకమవుతుంది.

చిత్తశాంతి లేనివారికి ఆ చిత్తమే భారం అవుతోంది. ఈ చిత్తం అనుక్షణం అనేక సంకల్పాలను ఆహ్వానించి కలత చెందుతోంది. అయితే, కొందరు మాత్రం "ఇది ఆత్మ, ఇది అనాత్మ" అని ఎరిగి శరీరాభిమానాన్ని త్యజిస్తున్నారు. ఈ శరీరాన్ని కూడా ఇతర దృశ్యపదార్థాలలాగ, బాహ్యమైన వస్తువులాగ చూస్తున్నారు. వారి బుద్ధి నిర్మలం కాగా మనస్సుకు స్వస్థత చేకూరుతోంది. మనో స్వస్థత లేనిచోట అందమైన రూపం, శరీరపుష్టి, లౌకిక తెలివితేటలు, దీర్ఘాయుష్షు, శాస్త్రజ్ఞానం, సంకల్ప సామర్థ్యం – ఇవన్నీ నిష్ప్రయోజనమే అవుతాయి; పెనుభారంగా అనేక దుఃఖాలను పోగుచేసి పెడుతున్నాయి.

**నూనం నిగరణాయాశు**
**ఘన గర్ధమనారతం ।**
**ఆఖుర్మార్జాలకేణేవ మరణే**
**నావలోక్యతే ॥**

పిల్లి ఎలుకను ప్రియంగా చూసినట్లు ఒకపక్క మృత్యువు ప్రాణిని మింగివేయడానికి మహాభిలాషతో నిరంతరం చూస్తోంది. ఈ విషయం జీవులు ఎలా విస్మరిస్తున్నారో నాకు అర్థం కావడం లేదు.

జరామరణాలు ప్రియమిత్రులలా కరచాలనం చేసుకోవడానికి ఉత్సాహపడుతున్నాయి. ఇదంతా ఇలా ఉండగా అనేకులు దీనిని గమనించకుండా తీరికగా కూర్చుని, వర్తమానం వ్యర్థం చేసుకొంటున్నారు. ▫

*('శ్రీవసిష్ఠ రామ సంవాదం' వైరాగ్య ప్రకరణం నుంచి)*

**అనువాదం: వై. హెచ్. రామకృష్ణ**

# ఆధ్యాత్మిక అన్వేషణ



- స్వామి తపస్యానంద

ప్రశ్న: జ్ఞాన, భక్తి మార్గాలు భిన్నమైనవా?

**జవాబు :** ప్రారంభ దశలో జ్ఞాన,భక్తి మార్గాలు వేరువేరుగా కనపడతాయి. భక్తుడు తనకీ, భగవంతునికీ మధ్య వ్యత్యాసం ఉన్నట్లు భావిస్తాడు. అలా అనుకోవడం ప్రాథమిక అవస్థలో సాధకునికి అవసరం.

శ్రీరామకృష్ణులు దీనికొక ఉదాహరణ చెప్పారు: "ఒక యజమాని దగ్గర విశ్వాసపాత్రుడైన పనివాడు ఒకడు చాలా కాలంగా పని చేస్తుంటాడు. అతని సేవల వల్ల సంతృప్తి చెందిన యజమాని ఆ పనివాణ్ణి తన స్థానంలో కూర్చోబెట్టి, తనంతటి వాడే అతను అంటాడు". అలాగే తనను ఆరాధించి, ప్రేమించి, సేవించిన భక్తుణ్ణి భగవంతుడు చివరకు తనలో చేర్చుకుంటాడు. భగవంతుడు సర్వవ్యాపి అని గుర్తించి, తాను భగవంతుడికి చెందినవాణ్ణని భక్తుడు తెలుసుకుంటాడు.

సాధకుడిలోని నిజమైన "నేను", "బ్రహ్మం" ఒకటే అనీ, పరమాత్మ, ఈ 'నేను' వేరు (ఒకటి కాదు) అనుకోవడం పొరపాటు అనీ తెలియచెప్పే బోధనతోనే జ్ఞానమార్గం ప్రారంభమవుతుంది.

ఇది జ్ఞానమార్గంలో ముఖ్యమైన అంశం. భక్తుడికి ఇదంతా అసంగతంగా తోస్తుంది. అయితే జ్ఞానమార్గాన్ని అవలంబించిన భక్తునికి చివరకు పరబ్రహ్మ దర్శనం అయ్యాక జగత్తుగానూ, జీవులుగానూ ఉన్నది ఆ పరబ్రహ్మమే అని తెలుస్తుంది. శ్రీరామకృష్ణుల గురువైన తోతాపురి జీవితం చదివితే ఈ విషయం తెలుస్తుంది.

పరిపూర్ణమైన జ్ఞానం లభించకపోవడం వల్ల తోతాపురికి మొదట్లో భక్తిమార్గం అంటే విశ్వాసం ఉండేది కాదు. అయితే శ్రీరామకృష్ణుల సాహచర్యంలో జగన్మాత ఉనికి వాస్తవమే అని తెలిసి పరబ్రహ్మను స్వకీయునిగానూ, తటస్థునిగానూ కూడా గుర్తించారు ఆయన. ముందుగా పరబ్రహ్మను తటస్థునిగా భావించే మార్గంలో ప్రత్యేక సాధనలు చేసి తన పరిపూర్ణమైన అనుభవ జ్ఞానంతో పరబ్రహ్మ స్వకీయుడు అని సత్యసాక్షాత్కారాన్ని పొందారు. భక్తుల విషయానికి వస్తే ముందు భగవంతుడు స్వకీయుడు అనే అనుభవం కలుగుతుంది. తరువాత వారి ప్రేమ పరిణతి చెందాక తటస్థమైన అద్వైతంగా గుర్తిస్తారు. ఆధ్యాత్మిక మార్గంలో పరిపూర్ణ పరిణతి చెందాక భక్తి జ్ఞానాలు సమ్మిళితమై, అభిన్నమైన పరబ్రహ్మ గోచరిస్తాడు. నిజానికి యథార్థమైన ప్రేమ వల్లనే వాస్తవమైన భావైక్యం కలుగుతుంది. నిజమైన భావైక్యం వల్ల వాస్తవమైన ప్రేమ జనిస్తుంది. ప్రారంభంలో అవి వేర్వేరుగా తోచినా సంపూర్ణంగా పరిణతి చెందాక రెండూ అవినాభావ సంబంధాన్ని కలిగి ఉంటాయి. a

## పండుగలు - పర్వదినాలు

### మార్చి - 2008

| | | | |
|---|---|---|---|
| 03 | సోమవారం | : | ఏకాదశి |
| 06 | గురువారం | : | మహా శివరాత్రి |
| 09 | ఆదివారం | : | భగవాన్ శ్రీరామకృష్ణుల జయంతి |
| 17 | సోమవారం | : | ఏకాదశి |
| 21 | శుక్రవారం | : | శ్రీ చైతన్య మహాప్రభు జయంతి |
| 25 | మంగళవారం | : | స్వామి యోగానంద జయంతి |

### ఏప్రిల్ - 2008

| | | | |
|---|---|---|---|
| 02 | బుధవారం | : | ఏకాదశి |
| 07 | సోమవారం | : | ఉగాది |
| 14 | సోమవారం | : | శ్రీరామ నవమి |
| 16 | బుధవారం | : | ఏకాదశి |

# ప్రత్యక్ష దైవం పరమహంస

– రామేంద్ర సుందర్ భట్టాచార్య

రామేంద్ర సుందర్ భట్టాచార్య (అక్టోబర్ 1876 - 14 ఆగస్టు 1976) చిన్నతనంలో సంస్కృత పండితుడైన తన తండ్రి యదునాథ్ సార్వభౌమతో కలసి దక్షిణేశ్వరం వెళ్ళాడు. శ్రీరామకృష్ణులను కలుసుకొని వారి ఆశీస్సులు పొందాడు. రామేంద్ర కూడా ప్రసిద్ధ సంస్కృత పండితుడు అయ్యాడు. 1916లో ఉత్తర కలకత్తాలో 'హాతీబాగన్ చతుష్పాఠి' అనే సంస్కృత పాఠశాల స్థాపించాడు. ఆయన భారతీయ తత్త్వశాస్త్రం, అనేక ధార్మిక గ్రంథాలు రచించారు. 5,000 పైచిలుకు శ్లోకాలతో 'శ్రీ శ్రీరామకృష్ణ భాగవతమ్' పేరుతో సంస్కృతంలో గురుదేవుల చరిత్రను రచించారు.

"శ్రీరామకృష్ణులను ప్రత్యక్షంగా చూశాను. వారి పాదాలు తాకాను. ఆయన నన్ను చూసి నా తలను స్పృశించారు. ఇది ఒక్క పర్యాయం మాత్రమే జరిగింది. అయినా వారి చూపు, స్పర్శ నన్ను శాశ్వతంగా ధన్యుణ్ణి చేశాయి"... పరమహంసను ప్రత్యక్షంగా దర్శించిన రామేంద్ర సుందర్ భట్టాచార్య దివ్య స్మృతులను పాఠకులకు అందజేస్తున్నాము.

నా ఎనిమిదవ ఏట మా నాన్నగారితో కలసి దక్షిణేశ్వరంలోని రాణీ రాస్మణిగారి కాళీ ఆలయానికి వెళ్ళాను. మా నాన్నగారు, గురుదేవులు సమకాలీనులు. బాల్యం నుంచి ఇద్దరూ స్నేహితులు. ఒకరోజు మా నాన్నగారు నాతో, 'నిన్ను దక్షిణేశ్వరం తీసుకువెళతాను. అక్కడ ఒక ప్రత్యక్ష దైవాన్ని చూద్దువు గాని!' అన్నారు.

మేము మొదట భవతారిణీ కాళీ దేవాలయానికి వెళ్ళి అమ్మకు నమస్కరించి, గురుదేవుల గదికి వెళ్ళాం. కానీ ఆయన అక్కడ లేరు. పంచవటి వైపుగా వెళ్ళారని ఒక యువకుడు చెప్పాడు. మేము అక్కడికి వేళ్ళే సరికి గురుదేవులు గంగానదిని తిలకిస్తున్నారు. ఇద్దరు యువ భక్తులు ఆయనతో ఉన్నారు. మా నాన్నగారిని చూడగానే గురుదేవులు సంతోషించి, కుశల ప్రశ్నలడిగారు. మా నాన్నగారు మట్టినేల మీదే వారి పాదాలు తాకుతూ సాష్టాంగ నమస్కారం చేశారు. వారి పవిత్ర చరణధూళి తీసుకొని, తన తల మీద ఉంచుకొని, నా తల మీద కూడా ఉంచి, "నీకొక ప్రత్యక్షదైవాన్ని చూపిస్తానని చెప్పాను కదా! వీరే ఆ దైవం. వారి పాదాల్ని తాకుతూ సాష్టాంగ ప్రణామం చేయి" అన్నారు. నేను అలాగే గురుదేవుల పాదాలకు నమస్కరించాను.

ఆయన నా తల మీద చేయి ఉంచి, "నాయనా లే" అన్నారు. "నీవు చిరకాలం జీవిస్తావు. పండితుడవు అవుతావు" అని దీవించారు. నేను నమస్కారం చేయగా, వారు నా తల స్పృశించినపుడు ఆనందంతో పొంగి పోయాను. నాకప్పుడు మామూలు స్పృహ లేదు. కానీ వారి దీవెనలు స్పష్టంగా విన్నాను.

నేను గురుదేవులను సందర్శించడం అదే మొదలు, అదే చివర. ఈ సంఘటన జరిగి చాలా కాలమైంది. అప్పుడు నేను చిన్న పిల్లవాడిని అయినా వారి రూపం నా మనో నేత్రంపై చాలా ప్రస్ఫుటంగా ఉంది. ఆకర్షణీయమైన ఆకారం. అనంతమైన ఆనందంతో నిండిన వదనం. "యౌవనంలో వారి దేహం బంగారు ఛాయలో ఉండేది. తీవ్రసాధనలు సలపడం వల్ల వారి శరీరం కృశించింది" అని మా నాన్న గారు చెప్పారు.

వందల జన్మల సత్కర్మల ప్రభావం వల్ల, పుణ్యఫలం వల్ల నా కళ్ళతో శ్రీరామకృష్ణులను చూడగలిగాను. నేను ధన్యుణ్ణి అనే భావిస్తున్నాను. గురుదేవులను సందర్శించిన రెండున్నర ఏళ్ళ తర్వాత ఒక రాత్రి నా స్వప్నంలో వారిని దర్శించాను. నేను వారిని చూసినప్పుడు ఎలా ఉన్నారో స్వప్నంలో కూడా అలాగే ఉన్నారు. "నాయనా బాగున్నావా? నేను వెళుతున్నాను" అన్నారు. ఈ మాటలు వినగానే ఉలిక్కిపడి లేచాను. ఆ రాత్రే గురుదేవులు మహాసమాధి చెందారన్న విషయం ఆ తరువాత తెలిసింది.

స్వామి వివేకానంద పాశ్చాత్యదేశాల నుంచి తిరిగి వచ్చిన తరువాత కొన్నిసార్లు చూశాను. స్వామీజీ ఉపాధ్యాయులలో ఒకరైన స్కాటిష్ చర్చ్ కళాశాల ఆచార్యునికి స్వామీజీ అంటే చాలా ఇష్టం. ఒకసారి స్వామీజీ ఆ ఆచార్యుని ఇంటికి వెళ్ళారు. అప్పటికి స్వామీజీ ఇంకా ప్రపంచ ప్రఖ్యాత వివేకానందగా గుర్తింపు పొందలేదు. ఆ ఆచార్యుడు స్వామీజీతో "నరేన్! ఏమిటి నువ్వు చేస్తున్న పని? ఒక వెర్రి పూజారికి దాసుడివయ్యావు. పైగా ఆ పూజారిని భగవంతుడిగా భావిస్తున్నావట. ఆయన రక్షకుడిగా భూమి మీదకు వచ్చాడని విశ్వసిస్తున్నావట. ఈ చోద్యపు కథలు ఎలా నమ్మావు?" అని ప్రశ్నించాడు.

అందుకు స్వామీజీ గంభీరంగా "అయ్యా! మీరు విన్నది నిజమే. ఆయన సాక్షాత్తూ భగవంతుడేననీ, సమస్త మానవాళినీ రక్షించడానికే మానవాకృతి ధరించారనీ విశ్వసిస్తున్నాను. ఆయన పట్ల మీకున్న అభిప్రాయమే గతంలో నాకూ ఉండేది. ఆ విషయం ఆయనకు చాలా సార్లు చెప్పాను. ఆయనది ఒక చిన్న పిల్లవాడి స్వభావం. నా మాటలు విని నవ్వుతూ, "నన్ను నమ్మమని నిన్నడిగానా?" అన్నారు. ఒకరోజు ఆయన తానే భగవంతుడిననీ, రామకృష్ణుని రూపంలో అవతరించాననీ తెలియజేశారు. ఎవరు రాముడో, ఎవరు కృష్ణుడో అతడే రామకృష్ణునిగా అవతరించాడు. ఆయన నాకు రాముణ్ణి, కృష్ణుణ్ణి విడివిడిగా చూపించారు. ఆ తరువాత వారిద్దరూ వారి శరీరంలో లీనమయ్యారు. అయ్యా! ఇది భ్రాంతి కాదు. నా కళ్ళతో స్వయంగా చూశాను. అదీగాక ఆయన సాక్షాత్తూ భగవంతుడేనన్న విషయం తెలుసుకున్నాను. అర్థం చేసుకున్నాను, తెలుసుకున్నాను" అని బదులిచ్చాడు.

ఇదంతా ప్రొఫెసర్‌గారు చెప్పగా నేను విన్నాను. ఆయన ఇంకా ఇలా అన్నారు – "నరేన్‌ను నేను బాగా ఎరుగుదును. అతడు మాయమాటలకు మోసపోయే వ్యక్తి కాడు. ఆ రోజు రామకృష్ణుల పట్ల నరేన్‌కు ఉన్నది అంధవిశ్వాసం కాదని నాకు అర్థమైంది. తదనంతర కాలంలో నరేన్ మహోన్నత జీవితం, రామకృష్ణుల అసాధారణ వ్యక్తిత్వాన్ని ఋజువు చేసింది."

చాలాసార్లు గురుదేవులు నాకు కలలో కనిపించి, వారి జీవితచరిత్రను సంస్కృత భాషలో శ్లోకాలుగా రచించవలసిందిగా కోరారు. మొదట్లో ఈ ఆజ్ఞలన్నీ కేవలం కలలే అనుకున్నాను. కానీ నా 80 సంవత్సరాల వయసులో గురుదేవులు మళ్ళీ స్వప్నంలో కనిపించి తమ పవిత్ర చరిత్రను సంస్కృతంలో రచించాలని గుర్తు చేశారు. నా వృద్ధాప్యాన్నీ, క్షీణిస్తున్న ఆరోగ్యాన్నీ ప్రస్తావించగా గురుదేవులు "బాధపడకు. నువ్వు వ్రాయడం ప్రారంభించు" అన్నారు.

చాలామంది నా కథను నమ్మకపోవచ్చునేమో కానీ గురుదేవులు చాలాసార్లు నన్ను ఆదేశించారు. 84 ఏళ్ళ వయసులో వారి జీవిత చరిత్ర రచన పూర్తి చేశాను. ఆయన



అనుగ్రహంతోనే 'శ్రీ శ్రీరామకృష్ణ భాగవతమ్' రచించి ప్రచురించగలిగాను. గురుదేవులే నాచేత గ్రంథరచన చేయించారు. ప్రచురణకు అవసరమైన ఆర్థిక సహాయాన్ని భారత ప్రభుత్వం అందించింది. భారత దేశ జాతీయ ఆచార్యుడు సునీల్ కుమార్ ఛటోపాధ్యాయ, ప్రధాన మంత్రి ఇందిరాగాంధీ, రామకృష్ణ మఠ అధ్యక్షులు స్వామి వీరేశ్వరానందజీ ప్రభృతులు చాలామంది ఆ గ్రంథాన్ని ప్రశంసించారు. శ్రీరామకృష్ణుల అనుగ్రహం ఉంటే మూగవాడు మహావక్త కాగలడు. అవిటివాడు పర్వతాలెక్కగలడు. 'నువ్వు చిరకాలం జీవిస్తావు, పండితుడవు అవుతావు' అన్న శ్రీరామకృష్ణుల అక్షయమైన దీవెన నా జీవితంలో ప్రత్యక్ష సత్యమై భాసించింది.

**– అనువాదం: కె. సత్యప్రసాద రాయ్**

# విల్ పవర్

– రామ్ జలదుర్గం

# మీ పై విజయం మీదే!



మీరు కొత్త సంవత్సరంలో తీసుకున్న దృఢ నిర్ణయాల సంగతి ఏమిటి? వాటి సంగతే మర్చిపోయారు కదూ! ఇప్పుడు మళ్ళీ గుర్తు తెచ్చుకుంటే తప్ప గుర్తుకురావడం లేదు కదూ! మీరే కాదు, ఇలాగే చాలా మంది 'కొత్త సంవత్సరంలో బరువు తగ్గాలనీ, వేకువజామున లేచి వ్యాయామం చేయాలనీ, లేదా నడకకు వెళ్ళాలనీ, ప్రతి రోజూ ఫలానా సమయంలో చదువుకోవాలనీ, మిఠాయిలు తినడం తగ్గించాలనీ' ఇలా తాము మారాలనుకున్న విషయాలను జనవరి 1వ తేదీన సంప్రదాయంగా తీసుకునే నిర్ణయాలుగా మార్చి, ఈపాటికి మర్చిపోయే ఉంటారు. ఇలాంటి సందర్భాల్లో నిర్ణయాలు తీసుకునేవారు ఇరవైనాలుగు గంటలు గడవకముందే తమ ప్రమాణాలను తీసి గట్టున పెడతారని ఒక సర్వేలో తేలింది.

మనం తీసుకునే ఇలాంటి కొన్ని నిర్ణయాలు భవిష్యత్తులో మనకు ప్రయోజనాలను చేకూరుస్తాయని తెలిసినా నిర్ణయాలకు కట్టుబడి ఉండడం లేదు. మొదటి రోజున్నంత దృఢ నిశ్చయం ఆ తరువాత లేకపోవడం, అవి కేవలం ఉద్వేగభరితమైన మాటలుగానే మిగిలిపోవడం చాలామందికి నిత్యం అనుభవమే. సంకల్పబలం, క్రమశిక్షణ మాత్రమే అంతర్గత శక్తిని మేల్కొలిపి, బలహీనతల్ని జయించేలా చేయగలవు. జీవితంలో ఏదైనా మార్పు తీసుకురావాలంటే పై రెండూ సహకరించకుండా ఏదీ సాధ్యం కాదు.

**సంకల్పబలం** (Will Power): సంకల్పబలం కలిగినవాళ్ళు మానసిక బలహీనతలకు దూరంగా ఉంటారు. సోమరితనాన్నీ, వాయిదా మనస్తత్వాన్నీ ఆమడదూరంలో ఉంచుతారు. జీవితంలో తమదంటూ ప్రత్యేకశైలితో ఉంటూ విజయం వైపు పయనిస్తారు. అనవసరమైన, పనికిరాని అలవాట్లకు బానిసలు కారు. వారిలోని అంతర్గత శక్తి వారిని ఉద్వేగాలకు గురి కాకుండా మార్పునకు వ్యతిరేకధోరణిని వ్యక్తం చేయనీయ కుండా వారిని మానసికంగా బలవంతులుగా తయారుచేస్తుంది.

**క్రమశిక్షణ** (Self Discipline): క్రమశిక్షణ అనేది సంకల్పబలంతో కలసి పనిచేసే మానసిక శక్తి. అనుకున్నవి సాధించే ప్రయత్నంలో భాగంగా సమస్యలను ధైర్యంగా ఎదుర్కొనే మానసిక,శారీరక, ఆధ్యాత్మిక శక్తినిచ్చేదే క్రమశిక్షణ. ముఖ్యంగా క్షణికసుఖాలను దూరంగా ఉంచి ఉత్తమ నిర్ణయాలను తీసుకునే శక్తిని కూడా ఇస్తుంది. ఉదాహరణకు క్రమశిక్షణ కలిగిన విద్యార్థి సంకల్పబలం తోడైతే గంటసేపు టీవీ చూసే కన్నా చదువు మీదే పెట్టే సమయం వల్ల ప్రయోజనం కలుగుతుందనీ, పొద్దున్న ఇంకా నిద్రపోవడం కన్నా వాకింగ్ చేయడం, యోగాభ్యాసం చేయడం ఉత్తమమనీ తెలుసుకుంటాడు.

**ప్రయోజనాలు**: సంకల్పబలం, క్రమశిక్షణ తోడైతే మనిషి తన ప్రవర్తనలను, చర్యలను, ఉద్వేగాలను అదుపులో ఉంచుకునే చైతన్యస్థితిలో ఉంటాడు. అవి లేనివారు వాటికి బానిసలవుతారు. మీ విషయంలోనే ఆలోచించండి. మీరు కచ్చితంగా ఈ సారి చేయాలని నిర్ణయించుకున్న పనులు ఎన్ని వాయిదా వేసుకున్నారు? ఒక పని మొదలు పెట్టి తరువాత వదిలేసిన అనుభవాలున్నాయా? పై బలహీనతల నుంచి బయట పడి, అనుకున్న పని అనుకున్న సమయంలోనే పూర్తిచేసినప్పుడు కలిగే విజయగర్వం, మానసిక తృప్తి, తత్సంబంధ ఫలితాలు అనుభవిస్తేనే తెలుస్తుంది.

ఇలా భావాల్ని అదుపులో ఉంచుకుని క్రమశిక్షణతో జీవించడమంటే జీవితాన్ని నిస్సారంగానో, నిస్తేజంగానో గడిపినట్లు అనుకుంటారు కొంతమంది. నిజానికి ఇలా జీవించడమే, అనవసర ఆలోచనలను దూరం చేసి ఉత్సాహంగా ఉండటమంటే... మరి సంకల్పబలం, క్రమశిక్షణలను ఎలా పెంచుకోవాలి, వాటిని తెలుసుకొని అభ్యాసం చేయడం ద్వారా సాధించవచ్చా.... అన్న ప్రశ్నలకు ఎవరైనా సరే అతి తక్కువ కాలంలోనే సాధించగలిగిన విజయాలకు సంబంధించిన చిట్కాలను వచ్చే సంచికలో తెలుసుకుందాం. ❑



# ఆదర్శమహిళగా జీవించడం ఎలా?

– స్వామి రంగనాథానంద

**శాం**తియుత వాతావరణమే ఒక ఇంటిని అసలైన గృహంగా చేస్తుంది. స్త్రీలు శాంతియుతమైన, సమర్థమైన, ఆనందమయమైన గృహ జీవితాన్ని ఏర్పరచుకునే జ్ఞానం కలిగి ఉండాలి. గృహ కార్యకలాపాల్లో అనురాగం, అంకితభావాలు సమర్థంగా పనిచేస్తాయి. పూర్వీకులు చెప్పినట్లు ఇల్లు అంటే ఒక రాతి కట్టడం కాదు. శాంత స్వభావురాలైన స్త్రీ ప్రేమానురాగాలతో తన ఇంటిని ఆనందనిలయంగా మలచుకుంటుంది. ఇంటిని ఆనందనిలయంగా ఉంచుకునే మహిళలు సమాజానికి చాలా అవసరం. సమాజంలో శాంతి సౌభ్రాతృత్వాలు వర్ధిల్లడానికి గృహశాంతి ఎంతగానో తోడ్పడుతుంది. వ్యక్తిగత శాంతి, సహనం నుంచి సామాజిక శాంతి సిద్ధిస్తుంది.

భారతీయ మహిళలకు ఈనాడు విజ్ఞానార్జనకూ, మేధావికాసానికీ ఎన్నో అవకాశాలు, సౌకర్యాలు ఉన్నాయి. దురదృష్టవశాత్తూ విద్యావంతులైన కొంతమంది మహిళలు సాటివారితో పోల్చుకుని అవసరాల్నీ, ఖర్చుల్నీ పెంచుకుంటున్నారు. ఈర్ష్య అసూయలకులోనై మనశ్శాంతిని కోల్పోతున్నారు. ఆధ్యాత్మిక అవగాహన పెంచుకోవడం ద్వారా వారు ఈ సమస్యను అధిగ మించగలరు. బాహ్యసౌందర్యానికి ప్రాధాన్యాన్ని తగ్గించి, అంతఃసౌందర్యం పెంపొందించు కోవాలి. ఇది మన చేతుల్లోనే ఉంది. నిర్మలమైన మనస్సు, మాతృప్రేమ, నిరంతర శ్రమ, భక్తిప్రపత్తులు ద్వారా అంతఃసౌందర్యం ప్రతిబింబించేలా చేసుకోవచ్చు. వనితా లోకం వాక్ సంయమనం, భావ సంయమనాల ద్వారా తమ సామర్థ్యాన్నీ వృద్ధి పరచుకోవచ్చు.

***యోగస్య ప్రథమం ద్వారం వాఙ్నిరోధః*** (వివేక చూడామణి) యోగానికి తొలిమెట్టు వాక్ సంయమనం అన్నారు ఆది శంకరాచార్యులు.

ఇంటా బయటా కలిగే సమస్యలకు ఒక ప్రధాన కారణం స్త్రీల అనియంత్రిత వాగ్ధోరణి. భారతీయుల దృష్టిలో వాగ్దేవతే బుద్ధి దేవత కూడా. మన వాక్కును నియంత్రించు కొని, స్వచ్ఛంగా ఉంచడం ద్వారా మనం వివేకాన్ని సాధించవచ్చు. శాంతి సంతోషాలను అనుభవించవచ్చు.

**సేకరణ: ఆర్. కృష్ణ**

Statement about ownership and other particulars about **Sri Ramakrishna Prabha** (according to Form IV Rule 8, circulated by Registrar of Newspapers for India).

| | | | |
|---|---|---|---|
| 1. | Place of Publication | : | Hyderabad - 500 029 |
| 2. | Periodicity of Publication | : | Monthly |
| 3. | Printer's Name<br>Nationality<br>Address | :<br>:<br>: | Swami Jnanadananda<br>Indian<br>Ramakrishna Math Domalguda Hyderabad-500 029 |
| 4. | Publisher's Name<br>Nationality<br>Address | :<br>:<br>: | Swami Jnanadananda<br>Indian<br>Ramakrishna Math Domalguda Hyderabad-500 029 |
| 5. | Editor's Name<br>Nationality<br>Address | :<br>:<br>: | Swami Parijneyananda<br>Indian<br>Ramakrishna Math Domalguda Hyderabad-500029 |
| 6. | Name & Address of the individuals who own the news or shareholder holding more than1% of the capital | : | Ramakrishna Math Domalguda Hyderabad-500029 |

I , Swami Jnanadananda, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Sd.
**Swami Jnanadananda**
Signature of the Publisher

Date: 01.03.2008




– స్వామి పరిజ్ఞేయానంద

**రవివర్మ, ఏలూరు**

**ప్రశ్న:** నేను బి.ఎస్‌సి.బి.ఇడి., చదువుకున్నాను. ఎంత ప్రయత్నించినా సరైన ఉద్యోగం రావడంలేదు. మా ఆర్థిక పరిస్థితులు అంతంత మాత్రమే. సమస్యలను ఎదుర్కోలేక ఆత్మహత్య చేసుకోవాలనిపిస్తుంది. నాలాంటి యువతకు మీ సందేశం ఏమిటి?

**జవాబు:** 'కాళ్ళు తడవకుండా మహాసముద్రాన్ని దాటవచ్చునేమో కానీ కళ్ళు తడవకుండా జీవితాన్ని దాటడం సాధ్యం కాదు' అని ఓ తత్త్వవేత్త అనుభవపూర్వక బోధ.

కష్టాలకు భయపడి ఆత్మహత్య చేసుకోవాలనుకోవడం మీ బలహీనతను సూచిస్తుంది. 'Strength is life weakness is death' అని అన్నారు స్వామి వివేకానంద.

కష్టపడే తత్వం ఉంటే ఆర్థిక పరిస్థితులను మెరుగుపరుచుకోవడం అసాధ్యమేమీ కాదు.

There is something worse than a difficulty. It is inertia. If you try to escape difficulties, you decay

**- *Herbert Casson***

ఈ కాలంలో సంపాదన కేవలం డిగ్రీల మీదే ఆధారపడిలేదని ఎంతోమంది ఋజువు చేస్తున్నారు.

ఢిల్లీలో ఒకతను రోజూ బండి మీద కాయగూరలను వీధుల్లో తిరిగి అమ్ముకొని, వచ్చిన ఆదాయంతో కుటుంబాన్ని పోషించుకుంటున్నాడు. అంతే కాకుండా తన వద్ద ఆ రోజు అమ్మగా మిగిలిన కాయగూరల్ని పేదవారికి ఉచితంగా పంచుతూ తనవంతు సహాయాన్ని అందిస్తున్నాడు. 'మిగిలిన కాయగూరల్ని అమ్మితే మరికొంత డబ్బు సంపాదించుకోవచ్చుకదా!' అని ఒకరు అడిగితే దానికి ఆ వ్యక్తి 'మనకున్నదాంట్లో కొంత పేదవారికి సహాయం చేస్తే ధనం వల్ల పొందలేని రెండు అమూల్యమైన ఆభరణాల్ని పొందవచ్చు. అవి మనసునిండా సంతృప్తి, కంటినిండా నిద్ర' అని బదులిచ్చాడు. పట్టాలు పుచ్చుకున్నా సమస్యలకు భయపడే మీలాంటి యువకులకు ఈ వ్యక్తి ఆదర్శనీయుడు.

స్వామి వివేకానంద కుటుంబం ఆర్థిక ఇబ్బందులను ఎదుర్కోవలసి వచ్చింది. అత్యంత ప్రతిభావంతుడైన నరేంద్ర (స్వామి వివేకానంద)లాంటి వారు కూడా కలకత్తాలో ఉద్యోగం కోసం తిరిగి తిరిగి వేసారి పోయారు. అయినా ఆయన ఏనాడూ నిరాశా నిస్పృహలకు లోనుకాలేదు.

What makes you weep, my friend? In you is all power. Summon up your all powerful nature. **- *Swami Vivekananda***

విలపించడం ఎందుకు? నీలోనే అనంత శక్తి ఉంది. అంటూ భుజం తట్టి ధైర్యాన్నిస్తున్న స్వామి వివేకానందుని స్ఫూర్తిని నింపే బోధలు నిరంతరం స్మరించండి. అప్పుడు 'మనకు వచ్చే కష్టాలు మనల్ని కడతేర్చడానికి కాదు, తీర్చిదిద్దడానికే'అనే ఆశావహ దృక్పథం ఏర్పడుతుంది.

**సుష్మిత, హైదరాబాద్**

**ప్రశ్న:** నేను స్పష్టంగా మాట్లాడలేను. ఉద్యోగం సంపాదించడంలో నా ఈ లోపం ఒక సమస్యగా పరిణమించింది. ఈ సమస్యను అధిగమించడం ఎలా?

**జవాబు:** డెమస్తనీస్‌కు మహానత్తి. ఆయన నాలుక కింద గులకరాళ్ళు ఉంచుకుని సాగరతీరంలో గట్టిగా అరిచేవాడు. చాలా కాలం అలా సాధన చేసిన తరువాత ఆయన నత్తి పోయింది. తరువాతి కాలంలో ఆయన మహావక్తగా ప్రసిద్ధి చెందాడు.

Put purpose in your life.
Take the tools at hand and carve your own best life

**- *Dr. Frank Caprio***

రెండు చేతులు లేనివారు కూడా కాలివేళ్ళతో సైకిల్ రిపేర్ పనులు చేస్తూ జీవిస్తున్నారు. మూగవాళ్ళు, అంధులు కూడా ఉద్యోగాలు చేస్తూ ఈ పోటీ ప్రపంచంలో రాణిస్తున్నారు. అంగవైకల్యం అవరోధంకాదని ఎందరో నిరూపిస్తున్నారు. అలాంటి వారిని స్ఫూర్తిదాతలుగా భావిస్తే మీలో ధైర్యం పెరుగుతుంది. ఉద్యోగసంపాదనకు మీ సమస్య చాలా చిన్నదే అనే ఆత్మస్థైర్యం మీలో కలుగుతుంది.

మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా:

**యువవాణి**

శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,
దోమల్ గూడ, హైదరాబాద్ – 500 029
E- mail : rkprabhayuvavani@gmail.com

# మనోనియంత్రణకు మార్గాలెన్నో!

- శ్రీరామ్

ఒక అడవిలో నక్క, పిల్లి 'ఆపద సమయంలో ఏంచేయాలి?' అని చర్చించుకోనారంభించాయి. "నేను వెంటనే ఎత్తైన చెట్టును ఎక్కేస్తాను. అదొక్కటే నాకు తెలిసిన మార్గం" అని పిల్లి ఎంతో అమాయకంగా అంది. "నాకైతే వంద మార్గాలు తెలుసు" అని గర్వంగా అంది నక్క. ఆ సమయంలోనే కొంత దూరంలో తోడేళ్ళ అరుపు వాటికి వినిపించింది. పిల్లి వెంటనే పక్కనే ఉన్న చెట్టెక్కి ప్రాణాలు రక్షించుకుంది. 'తెలిసిన మార్గాల్లో దేన్ని అమలుచేయాలి?' అని ఆలోచించసాగింది నక్క! ఆ అతి తెలివి చివరకు దాని ప్రాణాలు తీసిందని వేరే చెప్పనక్కరలేదు!

ఇటీవల కాలంలో ధ్యాన ప్రక్రియను ఆచరించేందుకు ఎన్నో పద్ధతులు ప్రాచుర్యం పొందుతున్నాయి. కొందరు 'శ్వాసమీద ధ్యాస' పెట్టమంటే, ఇంకొందరు లయబద్ధంగా శ్వాసించమంటారు. కొంతమంది భ్రూమధ్యంలో మనసును ఏకాగ్రం చేయమంటే, మరికొంతమంది నాసికాగ్రంపై దృష్టి నిలపమంటారు. ఇక వీటిలో ఏది సరైంది అనే సందేహం రాక మానుతుందా?

అసలు ఏ పద్ధతినైనా అనుసరించి, ధ్యానం ఎందుకు చేయాలి? వివిధ వ్యక్తులకు వేరు,వేరు లక్ష్యాలుండవచ్చు. కానీ ధ్యానానికి సరైన లక్ష్యం, మార్గం - మనో నియంత్రణే. మనపై మనం పూర్తి నియంత్రణను సాధించడమే ధ్యానసాధనకు పరమోన్నత గమ్యం. ఇతర కోరికలన్నీ ఆ మార్గంలో లభించే స్వల్పమైన లాభాలే!

ఆ లక్ష్యాన్ని చేరేందుకు మనం ఏ మార్గాన్నైనా అవలంబించవచ్చు. కావలసింది "శ్రద్ధ". ఒక ఆలోచనను గ్రహించి, దానిపై పదే పదే మనసును ఉంచడమే దాని అర్థం. శ్రద్ధావంతులకు ఏ మార్గమైనా మంచిదే. అది లేని వారికి అత్యుత్తమ మార్గం (ఉందని ప్రస్తుతానికి భావిద్దాం!) అయినా నిరుపయోగమే!

ఏ పద్ధతైనా మనకు అద్భుతమైందిగా తోస్తే అది - దాన్ని అనుసరించే వ్యక్తుల గొప్పతనమే అని గ్రహించాలి. ఈ విషయాన్ని మరిచి, చాలా మంది మార్గాలను మారుస్తూ ఉంటారు. వారి పరిస్థితి ఒకే చోట బావిని త్రవ్వేందుకు బదులుగా వేరువేరు ప్రదేశాల్లో చిన్న గుంటలను తీసినట్లుంటుంది.





1886లో శ్రీరామకృష్ణుల యువసన్న్యాస శిష్యులు నివసించిన బారానగర మఠం





మురికివాడ నివాసులకు పునరావాస పథకం



# రామకృష్ణ మఠం

125/1, ప్రమాణిక్ ఘాట్ రోడ్, బారానగర్, కోల్‌కతా - 700 036
ఫోన్: 033 - 2557 0827, ఫాక్స్: 033- 2546 5111, 09892242524
email: president@rkmbaranagar.org website: www. rkmbaranagar.org

## 100% ఆదాయపు పన్ను మినహాయింపు

### విజ్ఞప్తి

ప్రియ భక్తులారా!

1886 ఆగస్టు 16న శ్రీరామకృష్ణులు మహాసమాధి చెందారు. ఆయన నిర్యాణానంతరం నరేంద్రనాథుని నాయకత్వాన శ్రీరామకృష్ణుల యువ సన్న్యాస శిష్యులు కలకత్తా నగర శివార్లలోని బారానగర్ అనే ప్రాంతంలో శిథిలావస్థలో ఉన్న ఒక భవనంలో తపస్సాధనలు చేశారు.

ఆ సమయంలో శ్రీరామకృష్ణుల గృహస్థ శిష్యులలో ఒకరైన శ్రీసురేంద్రనాథ్ మిత్రా, వివేకానందునితో ఇలా అన్నారు - 'సోదరులారా! ఎక్కడికి వెళతారు? మనమొక ఇంటిని అద్దెకు తీసుకుందాం. మీరు అక్కడ ఉండి ఆ ఇంటిని గురుదేవుల మందిరంగా మలచండి. మాలాంటి గృహస్థ భక్తులం సాంత్వన కోసం అప్పుడప్పుడు అక్కడికి వస్తాం' (శ్రీ రామకృష్ణ కథామృతం). ఈ విధంగా శ్రీరామకృష్ణుల మహాభినిష్క్రమణ అనంతరం రామకృష్ణ మఠం మొట్టమొదట ఇక్కడ స్థాపితమైంది. ఆయన యువ శిష్యులు సన్న్యాస జీవితాన్ని ప్రారంభించారు.

అనంతరం మఠాన్ని ఆలంబజార్‌కు మార్చారు. కొద్దినెలల తరువాత ఇక్కడ నుంచి గంగానదికి అవతలి ఒడ్డున ఉన్న బేలూరులోని నీలాంబర్ ముఖర్జీ ఉద్యానగృహానికి మార్చారు. మరికొద్దినాళ్ళకు, అంటే 1898లో మఠాన్ని బేలూరులోని ప్రస్తుత స్థలానికి మార్చారు.

శ్రీరామకృష్ణుల సన్న్యాస శిష్యులలో అగ్రగణ్యుడైన స్వామి వివేకానంద స్థాపించిన మఠంగా, ఒక తీర్థస్థలంగా, ఒక చారిత్రాత్మక ప్రదేశంగా బారానగర్ మఠం ప్రాముఖ్యాన్ని సంతరించుకుంది. మొదటి నిర్మాణం ఇప్పుడు లేనప్పటికీ ఆ ప్రదేశంలోని కొంత భాగాన్ని సంపాదించి రామకృష్ణ మఠం వారు ఒక శాఖను ప్రారంభించారు. మొదటి మఠం నిర్మితమైన ప్రదేశంలో కాలక్రమేణా వేరే నిర్మాణాలు వచ్చాయి. వీటిని ఖాళీ చేయించి వివేకానందుడు తన సన్న్యాస సోదరులతో తీవ్ర తపం ఆచరించిన బారానగర్ మఠాన్ని పునర్నిర్మించి, ఒక ఆధ్యాత్మిక కేంద్రంగా, రామకృష్ణ - శారదా- వివేకానంద భక్తులకు పవిత్ర తీర్థస్థలంగా తీర్చిదిద్దడానికి నిర్ణయించాం. ఇది వ్యయప్రయాసలతో కూడుకున్న ప్రయత్నం.

భక్తులు, శ్రేయోభిలాషులు ఈ ప్రదేశపు ఆధ్యాత్మిక, చారిత్రక ప్రాముఖ్యాన్ని అర్థం చేసుకుని ఉదారంగా విరాళాలు ఇస్తే కానీ ఈ సంకల్పం నెరవేరదు.

కాబట్టి మీ శక్తి కొలది ఈ పవిత్ర కార్యానికి చేయూత నివ్వవలసిందిగా మనవి. రామకృష్ణ మఠానికి ఇచ్చే విరాళాలకు ఆదాయపు పన్ను చట్టం సెక్షన్ 35 ఏ.సి. క్రింద 100% ఆదాయపు పన్ను మినహాయింపు ఉంది. చెక్కులు, డిమాండ్ డ్రాఫ్టులు, "Ramakrishna Math, Baranagar" పేరున తీసి Ramakrishna Math, 125/1, Pramanick Ghat Road, Baranagar, Kolkata - 700 036 చిరునామాకు పంపగలరు.

విరాళాలిచ్చే దాతలు PAN నంబర్‌తో సహా పూర్తి చిరునామా తప్పక పొందుపరచవలెను. విరాళం ఎంత చిన్న మొత్తమైనా కృతజ్ఞతాపూర్వకంగా స్వీకరిస్తాం.

భగవత్సేవలో
**స్వామి వామనానంద**
అధ్యక్షులు

మహనీయుల జీవితాల్లో
**మధురఘట్టాలు**
- ఆర్. కృష్ణ

# పురోగతికి ప్రతిబంధకం కాని భార్యామణి

**శ్రీరాముడి నుంచి శ్రీరామకృష్ణుల వరకు ఏ మహనీయుని చరిత్ర పరికించినా, వారి కీర్తి చంద్రికలలో సహధర్మచారిణులదే సగభాగమని తేటతెల్లమవుతుంది. ప్రపంచంలో ఏ పురుషుని విజయంలోనైనా అమ్మగానో, అర్ధాంగిగానో అతివ మహోన్నతమైన ప్రభావం కనిపిస్తూనే ఉంటుంది. పరోక్షంగా వారి ప్రోత్సాహం ప్రస్ఫుటమవుతూనే ఉంటుంది. సీత జాడ లేని జానకిరాముని ఘనతను ఊహించనైనా లేము; శారదామాతను విస్మరించి శ్రీరామకృష్ణుల అవతారాన్ని అర్థం చేసుకోలేము. అదేవిధంగా మన ధార్మికజీవన ప్రస్థానంలో ఎందరో మహాత్ములు స్త్రీమూర్తుల సహాయ, సహకారాలతోనే తమ లక్ష్యాల్ని సమర్థంగా సాధ్యం చేసుకున్నారు. మనసా, వాచా, కర్మణా సహధర్మచారిణులుగా మసలుకొని చాలా సందర్భాల్లో తమ భాగస్వాముల్ని మించిన కీర్తిని సముపార్జించుకున్నారు. అలాంటి చిరస్మరణీయ స్త్రీమూర్తి భామతి...**

పన్నెండేళ్ళుగా వ్రాస్తున్న వ్యాఖ్యానం ఒకరోజు అర్ధరాత్రికి పూర్తి అయింది. పుస్తకం తీసుకుని హిమాలయాలకు వెళ్ళడానికి తన గది నుంచి బయటకు రాగా, గది గడప దగ్గర ఒక స్త్రీ నిలబడి ఉంది "నువ్వెవరు? ఇక్కడ ఏం చేస్తున్నావు?" అని అడిగాడు.

"స్వామీ! మీరు వ్యాఖ్యానం వ్రాయడంలో నిమగ్నులై నన్ను పెండ్లి చేసుకొన్న విషయం కూడా మరచి పోయారు. నేను మీ భార్యను" అని అంది. అప్పుడు వాచస్పతి, భామతిని తేరిపార చూశాడు. తన భార్య చాలా సౌందర్యవతి అని గ్రహించాడు.

"నీ ముఖం నేనెప్పుడూ చూడలేదు. నీ కుడి చేతిగాజులు నాకు గుర్తుకు వస్తున్నాయి. సాయంసమయంలో ప్రతి రోజూ ఈ చేతితోనే వెలుగుతున్న దీపం నా దగ్గర ఉంచడం జరిగేది. అయ్యో! పన్నెండేళ్ళు గడచిపోయాయే! ఇప్పుడు నేనేం చేయాలి? నాకు భార్య ఉందన్న సంగతే గుర్తు లేదే! నువ్వయినా నాకు జ్ఞాపకం చేయాల్సింది" అన్నాడు.

"మీరు ఒక మహత్కార్య సాధనలో ఉన్నారు. నా స్వార్థం కోసం మీ దీక్ష, ఏకాగ్రతలకు భంగం కలిగించదలచు కోలేదు. అందుకే మీ పని పూర్తయ్యేవరకూ ఓపికతో వేచిఉన్నాను. మీరు తపస్సు చేయదలచి హిమాలయాలకు వెళ్ళాలని నిశ్చయించుకుంటే, నిస్సంకోచంగా వెళ్ళండి. కనీసం ఇప్పుడైనా నా గురించి మీరు విచారిస్తున్నందుకు నాకు తృప్తిగా ఉంది. నాపై ప్రేమ ఉన్నందువల్లనే కదా మీరు ఇప్పుడు బాధ పడుతున్నారు. నాకు ఇంతకన్నా ఏం కావాలి?" అంది ఆమె.

"నిజంగా నువ్వు చాలా గొప్పదానివి. స్త్రీలలో నీలాంటి వారు చాలా అరుదు. నా భాష్యాల లాంటివి మన దేశంలో ఎన్నో ఉన్నాయి. నీ లాంటి త్యాగమూర్తి ఎక్కడా కనిపించదు. నీ జ్ఞాపకార్థం నా పుస్తకానికి 'భామతి' అని పేరు పెడుతున్నాను. నిన్ను ముందే చూసి ఉంటే బ్రహ్మ సూత్రాలకు భాష్యం వ్రాయడం వాయిదావేసి ఉండేవాణ్ణి, ఇప్పుడు ఏం చెయ్యాలో తెలియడం లేదు" అన్నాడు.



"మీ నిర్ణయాన్ని మార్చుకోకుండా మీరు నిశ్చింతగా వెళ్ళండి" అని అంది. ఈ మాటలు వినగానే వాచస్పతి ముందుకు సాగిపోయాడు.

ఇప్పటికీ 'భామతి' ప్రసిద్ధ గ్రంథంగా నిలచి ఉంది. భామతి లాంటి స్త్రీరత్నాలు నాడూ, నేడూ కూడా అరుదే.

# స్త్రీమూర్తీ... శిరసా నమామి!

- బి. సైదులు



**సీతాస్వయంవరం.... శ్రీరామచంద్రుడు శివధనుస్సు విరవగానే సభలో ఒక్కసారిగా ఆనందాతిశయాలు... హర్షధ్వానాలు... అభినందనల అక్షతలు. కానీ ఆ కోదండరాముడు 'ఇందులో నా ఘనత ఏమీ లేదు. శివధనుస్సును ఎక్కుపెట్టగనే ఒక్కసారి ఆ అంతః పురసౌధంలోకి చూపు సారించాను. ఓరకంట సీతాదేవిని చూశాను. నాలో తెలియని శక్తి ఆవహించింది. నా చేతుల్లోని శివధనుస్సు ఫెళఫెళమని విరిగింది. ఈ విజయమంతా ఆ జానకిదే!' అంటాడు. అవతారమూర్తి అయిన ఆ ఆజానుబాహుడే అర్ధాంగికి అంత ప్రాధాన్యమిచ్చాడు. సమస్తలోకాధారకుడైన ఆ శ్రీరాముని చరిత్ర శాశ్వతత్వానికి ఆ సాధ్వీమణి సీతాదేవియే కారణమంటే అతిశయోక్తికాదు. ఈ పరమ పవిత్ర ధరణిలో స్త్రీ అంటే జగజ్జనని... శక్తిస్వరూపిణి... కానీ నేడు అతివలు, పురుషునితో పోల్చుకుంటూ, కొత్తపోకడలకు పోతూ తమకు తెలియకుండానే ఆత్మన్యూనతాభావంతో కుంగిపోతున్నారు.** Men and women are equal but not identical ... **ఒకరితో మరొకరు పోల్చుకోవడమే పొరపాటు. ఈ సృష్టికి పురుషుడు సూర్యుడైతే.... స్త్రీ పండువెన్నెలకురిసే జాబిలి....**

### సీత సహనమే ఆదర్శం...

"ఈ లోకంలో రాముడులాంటి పురుషోత్తములు ఎందరో ఉండవచ్చు; కానీ సీత వంటి సాధ్వీమణి మరొకరు పుట్టరు" అంటారు స్వామి వివేకానంద. ఆ సహనశీలి యావత్ స్త్రీజాతికే ఆదర్శం. స్థితప్రజ్ఞుడు, నిస్సంగత్వ నిరామయుడు అయిన సాక్షాత్తూ ఆ భగవంతుడే, ఆమె దూరమైతే దుఃఖించాడంటే ఆ సాధ్వీమణి తన వ్యక్తిత్వంతో ఆయనను ఎంత ప్రభావితం చేసి ఉంటుంది! ఎంతటి వేదనలో కూడా ఆ సీతాదేవి వాదనలకు దిగలేదు. అంతమాత్రాన ఎందరో ఆధునిక స్త్రీవాదులు భావించినట్లు ఆమె శక్తిహీనురాలు కాదు. తన అస్తిత్వాన్ని ఎన్నడూ భంగపరచుకోలేదు. శివధనుస్సును చిన్నవయసులోనే చిటికెన వేలితో ఎత్తిన ఆ జగజ్జనని రావణుణ్ణి కనుచూపుతో భస్మం చేయగల పావనమూర్తి. కాని ఆ అవకాశాన్ని ఆ తారకరామునికే వదిలి తరింపచేయాలనుకుంది. ఆ రామావతారాన్ని సార్థకం చేసింది.

### ఆలోచనా వికాసమే ఆధునికత...

పురాణ, ఇతిహాసాలలోని సాధ్వీమణులందరూ నేటి అతివల కన్నా మహోన్నతమైన వ్యక్తిత్వంతో విరాజిల్లినవారే . అలంకరణలు, ఆడంబరాలే ఆధునికత అనుకునే నేటి మహిళలు వారిని సరైన రీతిలో అర్థం చేసుకోలేక, నానాటికీ సంకుచితత్వంలోకే తిరోగమిస్తున్నారు. ఆలోచనల్లో పరిణతి, విశాలదృక్పథం, సమస్యల్ని సహనంతో ఎదుర్కోవడం... ఇవే నిజమైన నాగరకతకు నిదర్శనాలు. అంతేకానీ మన సంస్కృతికి సరిపడని ఆహార, ఆహార్యాల వెంట పరుగెత్తడం కాదు. సీతా, సావిత్రీ వంటి నారీమణుల జీవితాలు కాలపరీక్షకు నిలిచి ఈనాటికీ చెరగని కీర్తితో భాసిల్లుతున్నాయంటే వారి దీక్షాదక్షతల్లో ఎంత మహత్యం దాగి ఉందో అర్థం చేసుకోవాలి. ఇంటిగడప దాటితే తప్ప ఇంతికి ప్రాధాన్యం లభించదనుకునే అపోహను విడనాడాలి. ఆధునిక యువతులు పుష్కలంగా సంపాదించడం, పురుషుల్లా విలాసంగా జీవించడమే నాగరకతగా భ్రమిస్తున్నారు. ఏదో పొందాలన్న తపనతో ఏం పోగొట్టుకుంటున్నారో తెలుసుకో లేకపోతున్నారు.

### గృహపాలనా గణనీయమే...

నాలుగు గోడల మధ్య బ్రతుకు బందీగా మారిందని వనితలు విలపించటం సరికాదు. భార్యగా, తల్లిగా నిర్వహించే బాధ్యతలు ఎంతో విలువైనవి... ఘనమైనవి. బాలచంద్రునికి వీరతిలకం దిద్దిన మగువ మాంచాలను, భరతజాతికి ఛత్రపతిని ప్రసాదించిన మహారాజ్ఞి జిజాబాయిని చరిత్ర ఎన్నటికీ

మరచిపోదు. కుటుంబానికి కేంద్రబిందువుగా భర్తపై, బిడ్డలపై స్త్రీ ప్రభావం గణనీయమైనది. "నా జీవితంలో ఇద్దరు దయామయుల రుణం ఎన్నటికీ తీర్చుకోలేనిది. అనురాగాన్ని, ఆదర్శాల్ని గోరుముద్దలుగా కలిపి తినిపించిన మా అమ్మ ఒకరు; చేతి బంగారు గాజుల్ని అమ్మి నా పై చదువులకు డబ్బు కట్టిన మా అక్క ఒకరు... నేను సాధించిన విజయాలన్నీ వారి పాదాల వద్ద వినమ్రంగా అర్పిస్తాను"అంటారు భారతరత్న అబ్దుల్‌కలామ్. అందుకే ఇంటిని నందనంగా తీర్చిదిద్దినా, నరకంలా మార్చినా కారణం ఇల్లాలే.

**మగవారూ మారాలి...**

ఇంటినీ, ఇంటిపేరునూ వదలి అర్ధాంగిగా తమ ఇంట అడుగుపెట్టిన మగువ పట్ల మగవారు కూడా ఎంతో బాధ్యతాయుతంగా వ్యవహరించాలి. సహధర్మచారిణిగా ఆదరించాలి. భార్య అంటే తమ అసహనాన్ని, ఆవేశాన్ని భరించే బానిసగా భావించటం తగదు. సంపాదన ఒక్కటే గొప్పతనానికి గీటురాయి కాదు. కుటుంబ నిర్వహణ, పిల్లల ఆలనాపాలనా... ఇవన్నీ నిజంగా స్త్రీమూర్తి కార్యపటిమకు ప్రతీకలే. అతివలు చేసే ఇంటి పనులను చులకనగా చూడటం పురుషులు మానుకోవాలి. తనభార్య సీతలా ఉండాలని, పరాయి స్త్రీ మాత్రం సినిమాతారలా పలకరించాలనుకునే వికృత స్వభావాల నుంచి పురుషులు సంస్కారవంతులుగా ఎదగాలి. సప్తపది నడిచిన భర్తే భార్యను గౌరవించకపోతే ఇక సంతానం ఏం గౌరవిస్తుంది! శ్రీరామకృష్ణులు సతీమణి శారదామాతను కాళికాదేవితో సమంగా ఆరాధించేవారు. అనుంగుశిష్యుడిగా స్వామి వివేకానంద ఆమె మాటను జవదాటలేదు.



**మేడిపండు మన సమాజం...**

ఇటీవల ప్రపంచవ్యాప్తంగా స్త్రీని గౌరవించే విధానంపై పరిశోధనలు చేస్తే ఆసక్తికరమైన విషయాలు వెల్లడయ్యాయి. ప్రపంచం మొత్తంలో మహిళలను గౌరవించడంలో స్కాండినేవియన్ దేశాలు భౌగోళికంగా చిన్నవైనా ముందువరుసలో ఉన్నాయి. అగ్రరాజ్యాలైన అమెరికా, రష్యా వెనుకవరుసలో నిలిచాయి. ఇక 'యత్రనార్యస్తు పూజ్యంతే తత్ర రమంతే దేవతాః' అంటూ ఉపదేశాలు వల్లించే భారతీయులు కూడా చివరిస్థానంలో ఉన్నారు. మేడిపండు మనస్తత్వం గల వ్యక్తులతో నిండివున్న మన సమాజం తలదించుకోవాల్సిన కఠోర వాస్తవమిది.

**భారతనారికి బ్రహ్మరథం...**

భారతనారీమణుల సాంప్రదాయిక జీవనశైలికి ప్రపంచదేశాలే నీరాజనాలు పలుకుతున్నాయి. అస్తిత్వానికి, అపరిమిత స్వాతంత్ర్యానికి భేదం తెలియని పాశ్చాత్య మహిళాలోకం స్త్రీవాదం పేరుతో నేలవిడిచి సాముచేసింది. ఏకంగా సామాజిక వ్యవస్థను ఛిన్నాభిన్నం చేసుకుంది. కాని దురదృష్టవశాత్తూ ఆ దుష్ఫలితాల అనుభవాల నుంచి కూడా పాఠాలు నేర్చుకోని మన మహిళలు కొందరు గుడ్డిగా వారిని అనుకరించాలని ప్రయత్నిస్తున్నారు. ఈ పవిత్ర దేశంలో పురుషుడికయినా, స్త్రీకయినా కుటుంబమే ప్రాతిపదిక. ముఖ్యంగా ఇల్లు అనగానే ఇల్లాలే స్మరణలోకి వచ్చే సమాజం మనది. అలాంటి కుటుంబాన్ని పణంగా పెట్టి సాధించే విజయాలకు విలువే లేదు. అద్దాల మేడలు, అసంఖ్యాక సుఖాలు ఆనందతీరాలుగా భ్రమించి ఎండమావుల వెంట పరుగులెత్తటం అతివలకు అభిలషణీయం కాదు.

**స్త్రీయశ్చా- పురుషా మార్గం సర్వాలంకార భూషితాః,**
**నిర్భయా ప్రతిపద్యన్తే యదారక్షతి భూమిపాః...**

**'ఏ దేశంలో అయితే మహిళలు సర్వాంగసుందరంగా ఆభరణాలతో అలంకరించుకొని పురుషులెవరూ తోడులేకుండా రహదారుల్లో, వీధుల్లో తిరుగగలరో ఆ దేశం సుపరిపాలన గలది.' అంటోంది మహాభారతం. కాని నేడు మహిళ సర్వాభరణాలతో కాదు, బంగారు మంగళసూత్రంతో రోడ్డున నడిచే పరిస్థితి లేదు. అతివ అర్ధరాత్రి గడప దాటలేకపోతోందంటే సిగ్గుపడాల్సింది మగువ కాదు, మగవాడు. మానవజాతి మనుగడకు మూలాధారమైన స్త్రీమూర్తిని సమాదరించుకోకపోతే ఆ సమాజానికి పతనం అనివార్యం.**

**కరణేషు మంత్రి... క్షమయా ధరిత్రి...**

అంతులేని ఓర్పుకు... అచంచల కార్యదీక్షకు ఆలవాలమైన స్త్రీమూర్తి రుణం పురుషుడు ఆజన్మాంతమూ తీర్చుకోలేడు. స్వామి వివేకానంద భాషించినట్లు '.... వారిని ఉద్ధరించాలని పురుషులు ఏమీ ప్రయత్నం చేయనవసరం లేదు. వారిని వారు ఉద్ధరించుకోగలరు. వారికి ఏం కావాలో వారికి తెలుసు. సమాజమనే పక్షికి స్త్రీపురుషులు రెండు రెక్కల వంటివారు. ఏ ఒక్కటి బలహీనమైనా సమాజం సజావుగా సాగదు". అలాంటి సగభాగమైన మహిళాలోకం సుసంపన్నమై మరింత సుందరమైన సమాజం రూపుదిద్దుకోవాలని మనసారా ఆకాంక్షిద్దాం... అమ్మగా... సోదరిగా... అర్ధాంగిగా ప్రతీ పాత్రనూ పరమపావనం చేస్తున్న ఆ స్త్రీమూర్తికి 'మహిళా దినోత్సవం' సందర్భంగా శుభాకాంక్షలు పలుకుదాం...

# అందరికీ అవసరమైనది !

– అమిరపు నటరాజన్

స్వామి వివేకానంద వైరాగ్యం అనేది ఏ ఒక్కరికో చెందినది కాక ప్రతి ఒక్కరికీ అవసరం అని స్పష్టంగా చెప్పారు. నిజానికి ఆయన ఎన్ని సందర్భాలలో, ఎలాంటి పరిస్థితులలో, ఎన్ని జీవితరంగాలలో, ఎన్ని స్థాయిలలో వైరాగ్యాన్ని ప్రస్తావించి, దాని అవసరాన్ని నొక్కి చెప్పారో గమనిస్తే ఆశ్చర్యం కలుగుతుంది. వైరాగ్యాన్ని గురించి ఆయన చెప్పిన విషయాలు చాలా ఆసక్తికరంగా ఉంటాయి. అన్ని వయస్సుల వారికీ సరిపోయే విధంగా రకరకాలుగా వైరాగ్యాన్ని బోధించారు ఆయన.

**విద్యార్థులకు:** మన చిన్నతనంలో అమ్మ 'పుస్తకం మీద దృష్టి పెట్టు– దిక్కులు చూడకు!' అని చెబుతుంది. పుస్తకం మీద దృష్టి పెట్టడం అభ్యాసమైతే, దిక్కులు చూడకుండా ఉండడమే వైరాగ్యం అని మనం చెప్పుకోవచ్చు! ఎలాగంటే – 'భారతజాతికి నా హితవు' (Call to the Nation) పుస్తకంలో 'ఒకే ఆలోచనను చేపట్టండి, దానిగురించే కలగనండి, దానినే మీ జీవిత ఆశయంగా మలచుకోండి' అని చెబుతూ, 'మిగిలిన అన్ని ఆలోచనలనూ విడిచి పెట్టండి!' అంటారు. అలా ఇతరాలైన అన్ని ఆలోచనలనూ విడిచిపెట్టడమే వైరాగ్యం.

ఒకే ఆలోచనను చేపట్టి, పని చేయ్యడం అభ్యాసమైతే, ఇతర ఆలోచనలను విడిచిపెట్టడమే వైరాగ్యం. ఒకే ఆలోచనను చేపట్టడం ఎంత ముఖ్యమో, ఇతర ఆలోచనలను వదలిపెట్టడం అంతే ముఖ్యం. నిజానికి స్వామి వివేకానంద ఇలా ఇతర ఆలోచనలను విడిచిపెట్టడమే ఎక్కువ కష్టమని కూడా చెప్పారు. కాబట్టి ఏ విద్య నేర్చుకోవాలన్నా వైరాగ్యమనేది తప్పనిసరి.

**యువతకు:** యువతీ యువకులు జీవితంలో ఏవేవో చేద్దామనీ, ఎన్నెన్నో సాధిద్దామనీ కలలు కంటారు. మనస్సు ఆ పని మంచిదంటే, ఈ పని మంచిదని అటూ ఇటూ పరుగెత్తుతూ ఉంటుంది. ఇలా యువతీ యువకులు అనేక విషయాలలో ఒకేసారి తలదూర్చి, ఏదీ సాధించలేక పోతారు. ఇలాంటి పరిస్థితి ఎదురుకోవడానికి స్వామి వివేకానంద 'జీవితంలో విజయం సాధించాలంటే ఏదో ఒక రంగాన్ని త్వరగా ఎన్నుకోవాలనీ, అలా చెయ్యడంలో ఆలస్యం పనికిరాదనీ' చెప్పారు. అనేక విషయాల మీదకు దృష్టి పోకుండా చెయ్యడమే వైరాగ్యం.

మనం విషయాలను అంటి పెట్టుకున్నప్పుడు మనకు సుఖం కలుగుతుంది. కానీ ఈ మమతానురాగాలే మనకు దుఃఖాన్ని కూడా తెచ్చిపెడతాయి. కాబట్టి ఒక విషయాన్ని ఎంత తీవ్రంగా మనం కోరుతామో అవసరమైతే దాన్ని అలాగే విడిచి పెట్టగలగాలి. అప్పుడే మనం సుఖంగా ఉండగలం.

**తల్లితండ్రులకు :** తల్లితండ్రులు తమ సుఖాన్ని కాదను కున్నప్పుడే పిల్లల్ని సరిగా పెంచగలుగుతారు. వయస్సు మీరినా వాళ్ళు తమ పిల్లల్ని వేధిస్తూ ఉండడం, ఆ పిల్లలు విసుక్కోవడం మనం తరచూ చూస్తూ ఉంటాం. పెద్దలు పిల్లల్నీ, మనుమల్నీ తమ చెప్పుచేతల్లో ఉంచుకోవాలని ప్రయత్నిస్తూ ఉంటారు. వాళ్ళు తమ జీవితాలలో ఏం చెయ్యాలో వీరే నిర్దేశించాలని ప్రయత్నిస్తూ ఉంటారు.

**ముదిసెను దంతావళియును ముదిసెను**
**కేశములు దనువు ముదిసెను తనకున్,**
**ముదియనివి రెండు చిక్కెను బ్రతికెడి**
**తీపియును విషయపక్ష స్పృహయున్** (పోతన భాగవతం)

పళ్ళు ఊడి, జుట్టు తెల్లబడి, శరీరం పట్టు తప్పి, ముసలితనం మీద పడినా బ్రతుకు మీద తీపి పోలేదనీ, అవీ ఇవీ కావాలన్న కోరిక ఇంకా చావలేదనీ యయాతి చక్రవర్తి అంటాడు. అగ్నిలో నెయ్యి వేస్తే అది మరింతగా మండుతుంది. కాబట్టి, కోరికలను విడిచిపెట్టడమే వాటిని వదిలించుకునేందుకు మార్గమనీ, వాటిని తీర్చుకోవడం వల్ల అవి వదలవనీ, అది ఎన్నటికీ సాధ్యం కాదనీ గ్రహిస్తాడు.

చివరికి వైరాగ్యమే శరణ్యమని తెలుసుకుంటాడు.

**గృహస్థులకు :** గృహస్థుల విషయంలో వైరాగ్యం అనేది తప్పనిసరి. కుటుంబ విషయాలలోనేకాక సామాజికంగా కూడా వారు తమ బాధ్యతను గుర్తించి ప్రవర్తించాలని స్వామి వివేకానంద చెప్పారు. కుటుంబ సభ్యులు తమ తమ స్వార్థాన్ని కొంత వదులుకున్నప్పుడే కుటుంబ జీవనం చక్కగా సాగుతుంది. గృహస్థులకు శివపార్వతులు ఆదర్శ దంపతులని చెప్పారు. ప్రజాసంక్షేమం కోసం వ్యక్తిగత ప్రయోజనాల్ని విడిచిపెట్టగలిగే వైరాగ్యభావం మన సమాజంలో సరిగా పెంపొందలేదని కూడా ఆయన వ్యాఖ్యానించారు.

**మ్రింగెడివాడు విభుండని, మ్రింగెడిది**
**గరళమనియు మేలని ప్రజకున్,**
**మ్రింగుమనె సర్వమంగళ మంగళ**
**సూత్రమ్మునెంత మది నమ్మినదో** (పోతన భాగవతం)

శివుడు లోకాన్ని రక్షించడం కోసం గరళాన్ని త్రాగడానికి వెనుకాడలేదని చెబుతూ, ఆయన యతులకే యతీశ్వరుడని కొనియాడారు. అదే శివుణ్ణి ఉమాపతి అనీ అన్నారు, ఎందుకంటే ఈ విషయంలో పార్వతి, శివుడికి ఎంత మాత్రం తీసిపోలేదు. ఆ గరళాన్ని త్రాగడం వల్ల తన భర్తకు ప్రమాదమని తెలిసినా కూడా ఆమె లోకసంక్షేమం కోసం ఆ పని చెయ్యమని ప్రోత్సహించింది.

ఆదిదంపతులు అత్యున్నతమైన వైరాగ్య భావాన్ని తమ జీవితంలో ఆచరించి చూపించి మనందరికీ ఆదర్శ ప్రాయులయ్యారు.

**సంఘం:** సంఘాలూ, సంస్థల నిర్వహణలో వైరాగ్యమనేది ముఖ్యం. 'సర్‌దార్‌తో శిర్‌దార్ హోనీ చాహియే' అని స్వామీజీ అంటారు. నాయకుడు 'సంఘంలోని సభ్యులందరి మేలులోనే తన మేలు ఉందని తెలుసుకోవాలి' అని స్వామీజీ చెప్పారు.

మన సమాజం అవినీతితో నిండి ఉందనీ, ప్రతివారూ వారి స్వార్థాన్నే చూసుకుంటున్నారనీ మనందరం తెగ బాధపడిపోతూ ఉంటాం. అయితే 'దానగుణం అనేది మన దగ్గరే మొదలవ్వాలి' సుమా! 'సొంతలాభం కొంత మానుకో...' అని చెప్పినట్లు మనం కొంత వైరాగ్యం అలవరచుకుంటే, సమాజం చక్కగా ఉంటుంది.

**ఆధ్యాత్మిక అన్వేషకులకు:** ఎవరైతే ప్రాపంచిక జీవితంలో సఫలత సాధిస్తారో వారు మాత్రమే నిజమైన వైరాగ్యాన్ని ప్రదర్శించగలరని స్వామి వివేకానంద చెప్పారు. ఒక బిచ్చగాడు తాను అన్నిటినీ త్యజిస్తాను అని చెప్పడంలో అర్థం లేదని ఆయన వివరించారు.

జనకమహారాజు తన బాధ్యతలన్నింటినీ నిర్వర్తిస్తూ, తన రాజ్యంలోని ప్రజలకు చిన్నబాధ కూడా కలుగకుండా పరిపాలిస్తూ ఉండి కూడా పూర్తి వైరాగ్యంతో జీవించాడు. గృహస్థులైన ఆధ్యాత్మిక అన్వేషకులకు జనకుడే ఆదర్శమని స్వామి వివేకానంద బోధించారు.



ఈ విధంగా స్వామీజీ విద్యార్థి మొదలుకొని వయోవృద్ధుల వరకూ అందరికీ వైరాగ్యం గురించి చెప్పారు. మనకు తెలిసినా, తెలియకపోయినా, చీమ నుండి బ్రహ్మ దాకా సమస్త జీవరాశులూ, అంతో ఇంతో వైరాగ్యాన్ని తమకు తెలియకుండానే పాటిస్తున్నాయి. కానీ దాన్ని తెలుసుకొని బుద్ధిపూర్వకంగా ఆచరణలో పెట్టినప్పుడు మనకూ, సమాజానికీ, ప్రపంచానికీ కూడా గొప్ప మేలు కలుగుతుంది.



# వివేకానంద విద్యార్థి భవన్



రామకృష్ణమఠం, ధన్‌తోలీ, నాగపూర్ - 440 012,
ఫోన్: 2423422, 2432690, ఫాక్స్:2437042
email: rkmath_ngp@sancharnet.in

## విన్నపం

ప్రియ భక్తులకు, మిత్రులకు,

నమస్కారం, శుభాభివందనలు!

నాగపూర్, ధన్‌తోలీలోని రామకృష్ణమఠం ఆశ్రమం ప్రారంభించినప్పటి నుంచీ అనేక సేవా సహాయ కార్యక్రమాలు నిర్వహిస్తోంది. వాటితో పాటు కళాశాల యువకుల కోసం 'వివేకానంద విద్యార్థి భవన్' అనే వసతి గృహాన్ని నిర్వహిస్తోంది. మా మఠం ప్రారంభించిన సేవా కార్యక్రమాల్లో ఇది మొదటిది.

విద్యార్థి భవన్‌లో ఉండే విద్యార్థుల సంపూర్ణ వ్యక్తిత్వ వికాసానికై తోడ్పడడం ఈ సంస్థ లక్ష్యం. ఈ లక్ష్యసాధనలో క్రీడలలో శిక్షణ నివ్వడం; సామూహిక చర్చలు నిర్వహించడం; వక్తృత్వం, నీతి సూత్రాలు, ఆధ్యాత్మిక అంశాలలో విషయ పరిజ్ఞానాన్ని అధికం చేయడం లాంటి వివిధ అంశాలలో విద్యార్థులను సుశిక్షితుల్ని చేస్తున్నాం.



వివేకానంద విద్యార్థి భవన్ నమూనా

గత కొద్ది సంవత్సరాలుగా స్థలాభావం వల్ల అనేక మంది పేద విద్యార్థులకు వివేకానంద విద్యార్థి భవన్‌లో ప్రవేశం లభించక, వారు నిరాశకు గురి అవుతున్నారు.

అందువల్ల గ్రామీణ పేద కుటుంబాలకు చెందిన 50 మంది విద్యార్థుల కోసం కొత్త విద్యార్థి భవన నిర్మాణాన్ని చేపట్టాం.

2007 జనవరి 22వ తేదీ సోమవారం ఉదయం 9.30గం॥లకు రామకృష్ణమఠం, రామకృష్ణమిషన్‌ల అప్పటి ఉపాధ్యక్షులు శ్రీమత్ స్వామి ఆత్మస్థానందజీ మహరాజ్ ఈ కొత్త విద్యార్థి భవన్‌కు శంకుస్థాపన చేశారు.

**సూచించిన ప్రణాళికలోని వివరాలు:**

| | | |
|---|---|---|
| పొడవు, వెడల్పు | - | 121'×62' |
| అండర్‌గ్రౌండ్ ఫ్లోర్ | - | 30'×36' |
| ఆడిటోరియమ్ | - | 29'×47' |
| లైబ్రరీ | - | 29'×60' |
| వ్యాయామశాల | - | 29'×11' |
| వంట,భోజనాల గది | - | 29'×60' |

మొత్తం ప్రణాళిక కయ్యే ఖర్చు సుమారు కోటి అరవై ఎనిమిది లక్షల రూపాయలు. దీని కోసం మేము ఉదారులైన భక్తులు ఇచ్చే విరాళాలపైనే ఆధార పడుతున్నాం. భక్తులూ, శ్రేయోభిలాషులూ ఉదారంగా విరాళాలిచ్చి ఈ ప్రణాళికకై తోడ్పడి పేద విద్యార్థులకు సహాయ పడగలరని ఆశిస్తున్నాం. భగవాన్ శ్రీరామకృష్ణులు మీ అందరినీ అనుగ్రహించు గాక!

విరాళాలను 'Ramakrishna Math, Nagpur పేరున డిడి/చెక్కుల రూపంలో Ramakrishna Math Dhantoli, Nagpur - 440 012 కు పంపవలసిందిగా మనవి. విరాళాలకు సెక్షన్ 80-జి కింద ఆదాయపు పన్ను మినహాయింపు కలదు. విదేశీ కరెన్సీ రూపంలో కూడా విరాళాలు ఇవ్వవచ్చు.

శ్రీరామకృష్ణుల సేవలో

**స్వామి బ్రహ్మస్థానంద**
అధ్యక్షులు

భారతీయ మహిళా మణిదీపాలు : తార

ఆంగ్లమూలం : డాక్టర్ ఎస్. రమణి

అనువక్త : రెంటాల జయదేవ

# రాజనీతి తెలిసిన రమణి - తార

మహిళా సాధికారికత గురించి ఇవాళ మనం తరచూ మాట్లాడుతూ ఉంటాం. అయితే, రామాయణంలోని తార వృత్తాంతాన్ని గమనిస్తే, ఆమె తన సహజసిద్ధమైన బుద్ధికుశలతతో తెలివైన రాజకీయ నిర్ణయాలు తీసుకున్న విధానం, చరిత్రకు మార్గదర్శనం చేసిన తీరు కనిపిస్తుంది.

సుషేణుడి కుమార్తె తార. వానర రాజ్యం కిష్కింధకు రాజైన వాలితో ఈమె వివాహం జరుగుతుంది. వాలి మహా బలశాలి. అతనిది వజ్రతుల్య శరీరం. వాలి, అతని తమ్ముడైన సుగ్రీవుడు ఎంతో స్నేహంగా ఉండేవారు.

కాగా, ఒకసారి మాయావి అనే రాక్షసుడి మీదకు వాలి యుద్ధానికి వెళ్ళాడు. వాలి ఎంతకూ తిరిగిరాకపోవడంతో, అందరూ వాలి మరణించాడని భావించారు. దాంతో, వాలి స్థానంలో సుగ్రీవుడికి పట్టాభిషేకం జరిపారు. అప్పుడు స్థానిక ఆచారం ప్రకారం తార, సుగ్రీవుడికి భార్య అయింది. ఇంతలో కొన్నాళ్ళకు యుద్ధం నుంచి వాలి తిరిగి వచ్చాడు. సుగ్రీవుణ్ణి తరిమివేసి, మళ్ళీ తానే రాజయ్యాడు. వాలి తిరిగి రావడంతో, తార కూడా మళ్ళీ తన విధేయతను అతనికే ప్రకటించింది. సుగ్రీవుని పట్ల తీవ్ర కోపావేశాలు ప్రకటించిన వాలి, అతణ్ణి తరిమివేయడమే కాక, అతని భార్య అయిన రుమను తాను బలవంతాన చేపట్టాడు. అటు రాజ్యాన్నీ, ఇటు కుటుంబాన్నీ పోగొట్టుకున్న సుగ్రీవుడు ఋష్యమూక పర్వతంపై తలదాచుకున్నాడు.

సీతాన్వేషణలో ఉన్న శ్రీరాముడు ఋష్యమూక పర్వతానికి వచ్చినప్పుడు సుగ్రీవుడితో స్నేహం కుదిరింది. సీతామాత జాడ తెలుసుకోవడంలో శ్రీరాముడికి సాయపడతామంటూ సుగ్రీవుడు వాగ్దానం చేశాడు. అందుకు ప్రత్యుపకారంగా, వాలి వల్ల తాను కోల్పోయిన రాజ్యాన్ని తనకు తిరిగి ఇప్పించడంలో శ్రీరాముడి సహాయం కోరాడు. రాముడు అందుకు అంగీకరించడంతో, సుగ్రీవుడు వెళ్ళి, వాలిని యుద్ధానికి పిలిచాడు.

ఆ సమయంలో సంయమనంతో వ్యవహరించాల్సిందిగా వాలికి తార సలహా ఇచ్చింది. కోపాన్ని విడనాడి, సుగ్రీవుడితో పోరు మానుకోవాల్సిందిగా హితం చెప్పింది. ఒక్కసారి ప్రశాంతంగా ఆలోచించాల్సిందిగా ఆమె తన భర్తను కోరింది. గతంలో ప్రాణరక్షణ నిమిత్తం పారిపోయిన సుగ్రీవుడు ఇప్పుడిలా వచ్చి, కయ్యానికి కాలు దువ్వుతున్నాడంటే, అందులో ఏదో మర్మం ఉందని తార పేర్కొంది.



బలవంతులైన మిత్రులెవరో అతణ్ణి కాపు కాస్తూ, సహాయపడడానికి వచ్చి ఉంటారనీ, కాబట్టి తొందరపడి యుద్ధానికి దిగవద్దనీ తార, తన భర్త వాలికి సూచించింది.

అయోధ్యకు రాకుమారులైన రామ లక్ష్మణులతో చేసిన స్నేహం వల్ల సుగ్రీవునిలో విశ్వాసం నెలకొందని తనకు అందిన గూఢచర్య నివేదికల ద్వారా ఆమె తెలుసుకుంది. నిజానికి, వాలికి తార చేసిన అభ్యర్థన ఎంతో తెలివైనది,

సబబైనది. ఎందుకంటే, అందులో నైతిక వైఖరే కాక, సైనికపరమైన వ్యూహ ప్రతివ్యూహాల అంచనా కూడా ఉంది. అయితే, ఇవేవీ వాలి పట్టించుకోలేదు. కోపావేశాలు అతని బుద్ధి కుశలతను కమ్మేశాయి. సుగ్రీవుడికి గుణపాఠం నేర్పుతానంటూ వాలి ప్రకటించాడు. దాంతో, తార ఇంకేమీ చేయలేకపోయింది. అయితే, ఆమెకు మంత్ర తంత్రాల జ్ఞానం ఉంది. ఫలితంగా, ఆమె కొన్ని రక్షణ కర్మలు చేసి, విజయం సిద్ధించాల్సిందిగా ప్రార్థనలు జరిపి, ఆ పైన వాలిని యుద్ధానికి పంపింది.

సుగ్రీవుడికీ, వాలికీ మధ్య భీకర పోరాటం జరిగింది. శక్తిమంతుడైన వాలి ముందు సుగ్రీవుడు నిరాశ, నిస్పృహలకు లోనయ్యాడు. వాలి, సుగ్రీవుల పోలికలు ఒకేలా ఉండడంతో, వాలిని రాముడు వధించలేకపోయాడు. పారిపోయి వచ్చిన సుగ్రీవుణ్ణి సేద తీర్చి, ఈ సారి అతణ్ణి విడిగా గుర్తించడానికి వీలుగా, మెడలో పుష్పహారం వేసి, మళ్ళీ వాలితో యుద్ధానికి దింపాడు. ఈ సారి వాలి, సుగ్రీవుల యుద్ధం సాగుతున్నప్పుడు పుష్పహారం కారణంగా సుగ్రీవుడెవరో, వాలి ఎవరో రాముడు గుర్తించగలిగాడు. చెట్టు చాటు నుంచి బాణం వేసి, వాలిని నేలకూల్చాడు. రక్తపు మడుగులో పడి, వాలి ప్రాణావసాన దశలో ఉన్నాడు.

వానర రాజైన వాలిని శ్రీరాముడు నేలకూల్చాడనే వార్త వినగానే, వానర మూకలు భయంతో పారిపోసాగాయి. సరిగ్గా అప్పుడు తార సందర్భోచితంగా ప్రవర్తించింది. వానరులందరినీ గద్దించి, వారందరినీ వెంట తీసుకొని, ముందుకు సాగింది. రాజు నేలకూలినప్పుడు ఏ రాణి అయినా చేయాల్సిన పద్ధతిలో వారందరినీ వెంట తీసుకొని, ఆఖరి క్షణాల్లో ఉన్న వాలి వద్దకు వెళ్ళింది. భార్య తెలివి తేటలు, సుగుణాలు బాగా తెలిసిన వాలి, తన అంతిమ ఘడియల్లో సుగ్రీవుణ్ణి పిలిచి, కీలక సందర్భాల్లో ఆమెను సంప్రతించి, ఆమె సలహాలు తీసుకోవాల్సిన అవసరాన్ని నొక్కిచెప్పాడు.

మొత్తం మీద నేర్పు, కుశాగ్రబుద్ధి పుష్కలంగా ఉన్న ధైర్యవంతురాలిగా తార మన ఇతిహాసాల్లో కనిపిస్తుంది. ఆమె దౌత్యవేత్త, రాజనీతిజ్ఞురాలు. భవిష్యత్ సంఘటనల్ని ముందుగానే ఊహించగల బుద్ధిశాలిని. కుమారుడైన అంగదుడి క్షేమం, ప్రయోజనాల రీత్యా ఆమె ఎంతో ఓర్పుతో అవతలివారికి తలొగ్గినట్లు కనపడింది. ఆ రకంగా అతని మీద అందరికీ జాలి, కరుణ కలిగేలా చేసింది.

ప్రాతఃకాలంలో ప్రతి వారూ స్మరించాల్సిన ఏడుగురు పుణ్యవతులలో తార ఒకరు.

ఆచార వ్యవహారాలు - అంతరార్థాలు- 25

# పరమ పుణ్యఫలదం ప్రదక్షిణం

- రెంటాల జయదేవ

(గత సంచిక తరువాయి...)

## ప్రదక్షిణ అంతరార్థం

ఏదైనా, ఆలయ ప్రతిష్ఠాపన చేసినప్పుడు, గర్భగుడిలో మూల విరాట్టులో సక్రమంగా 'ప్రాణ ప్రతిష్ఠ' చేస్తారు. ఫలితంగా, గుడిలో దేవుని విగ్రహంలో దివ్యత్వం ప్రవేశిస్తుంది. ఆ దివ్యత్వం కంటికి కనిపించని అయస్కాంత తరంగాల రూపంలో దేవుని విగ్రహం నుంచి ప్రసరిస్తూ ఉంటుంది. అలా, దివ్య కిరణాలు వృత్తాకార రూపంలో విస్తరించి ఉంటాయి. ఆ తరంగాల ప్రభావం మూల విరాట్టుకు సమీపంలో ప్రగాఢంగానూ, దూరం విస్తరించిన కొద్దీ కొంత బలహీనంగానూ ఉంటుంది. కాబట్టి, దేవుని విగ్రహం ఉన్న ఆలయం చుట్టూ ప్రదక్షిణం చేయడం వల్ల సానుకూల ప్రతిస్పందనలు కలుగుతాయి.

సాధారణంగా, ఈ దివ్య ప్రభావ పుంజం సవ్యదిశలో తిరుగుతూ ఉంటుంది. కాబట్టి, దేవుని చుట్టూ సవ్యదిశలో ప్రదక్షిణ చేయమంటారు. శివాలయంలో ఈ దివ్య ప్రభావ పుంజం సవ్య, అపసవ్య దిశలు రెంటిలోనూ ఉంటుంది. కాబట్టి, దేవుని దివ్య ప్రభావ క్షేత్రంలో ప్రదక్షిణం చేయడమనేది వ్యక్తుల మీద సానుకూల ప్రభావం చూపుతుంది. ఈ దివ్య తరంగాల వల్ల ప్రదక్షిణం చేస్తున్న వ్యక్తికి శక్తి సమకూరడమే కాక, అన్ని రకాల సమస్యలు, కష్టనష్టాల నుంచి రక్షణ లభిస్తుంది. కాబట్టి, ప్రార్థన, పూజాదికాలు ముగించిన తరువాత దేవుని చుట్టూ ప్రదక్షిణ చేయడమనేది మన ఆచారంగా మారింది.



### సవ్యదిశలోనే ప్రదక్షిణం చేస్తారేం?

గడియారం ముల్లు తిరిగినట్లుగా సవ్యదిశలో ప్రదక్షిణం చేయడం వల్ల దేవుని రూపం మనకెప్పుడూ కుడి వైపు ఉంటుంది. అంతేకాకుండా, మన భారతదేశంలో కుడివైపు అనేది ధర్మానికీ, శుభానికీ చిహ్నం. కాబట్టి, సవ్యదిశలో గర్భగుడికి ప్రదక్షిణం చేస్తూ పోవడం వల్ల ధర్మబద్ధమైన జీవితాన్ని గడపాలనే విషయాన్ని పదే పదే గుర్తు చేసుకున్నట్లు అవుతుంది. అలాగే, జీవితంలో ధర్మం వైపున దేవుడుండి, మనకు నిరంతరం సహాయకారిగా, మార్గదర్శకుడిగా నిలుస్తాడని మరో అర్థం చెప్పుకోవచ్చు. దీనివల్ల మనం చెడు ధోరణులవైపు పయనించకుండా,గతంలో చేసిన తప్పుల్ని మళ్ళీ చేయకుండా ముందుకు సాగేందుకు వీలు కలుగుతుంది. సవ్యదిశలో ప్రదక్షిణ చేయడానికి ఆరోగ్య రీత్యా కూడా ఓ కారణం చెబుతారు. ప్రదక్షిణ చేసి, నేల మీదకు వంగి నమస్కారం చేయాలంటే, శరీరంలో రక్త చలనం ఎక్కువగా ఉండాలి. మొదట ప్రదక్షిణ చేయడం వల్ల శరీరంలో రక్తచలనం ఎక్కువవుతుంది. అదీ సవ్యదిశలో ప్రదక్షిణ చేయడం వల్ల గుండె నుంచి శుద్ధ రక్తం కొంచెం ఎక్కువగా సరఫరా అవుతుంది. ఇలా శరీరంలోని అవయవాలన్నిటికీ శుద్ధ రక్తం అందుతుంది. ఈ శుద్ధ రక్తాన్ని పంపే రక్తనాళం గుండెకు కుడి వైపు ఉంటుందని శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. కాబట్టి, సవ్యదిశలో (కుడివైపుగా) ప్రదక్షిణం ఆచరిస్తే, ఈ శుద్ధ రక్తం సరఫరా సులభంగా జరుగుతుందని శాస్త్రీయ కారణం తేల్చారు.

తల్లితండ్రుల్ని సాక్షాత్తూ జగన్మాత, జగత్పితరులుగా సంభావించి వారి చుట్టూ ప్రదక్షిణం చేయడం కద్దు. విఘ్నాధిపత్యం చేపట్టే విషయంలో కుమారస్వామి, వినాయకుడు పోటీ పడినప్పుడు, వినాయకుడు తన తల్లితండ్రులైన పార్వతీ పరమేశ్వరులకు ప్రదక్షిణం చేసి, సమస్త భూమండలాన్నీ చుట్టి వచ్చిన ఫలితం పొందిన సంగతి పురాణాల్లో మనం చదువుకున్నదే!

నిత్యం దేవతార్చన అయిన తరువాత, మన చుట్టూ మనమే తిరుగుతూ (ఆత్మ ప్రదక్షిణ), దేవుడికి నమస్కారం చేస్తుంటాం. దీన్నే 'ఆత్మ ప్రదక్షిణ నమస్కారం' అంటారు. దీనిలో ఓ పరమార్థం దాగి ఉంది. ప్రతి జీవుడిలోనూ పరమాత్ముడున్నాడు. మనలోనే ఉన్న పరమాత్మను గుర్తించి, ఆ పరమాత్మ స్వరూపమే బాహ్యంగా విగ్రహ రూపంలో భగవంతుడిగా ఉందనే విషయాన్ని గుర్తిస్తూ, మనలో ఉన్న దేవుడికి మనకు మనమే ప్రదక్షిణం చేస్తూ, భగవంతుడికి నమస్కరించడమే 'ఆత్మప్రదక్షిణ నమస్కారం.' అలా ఆత్మప్రదక్షిణ నమస్కారం చేస్తున్నప్పుడు

*యాని కాని చ పాపాని జన్మాంతర కృతాని చ*
*తాని తాని ప్రణశ్యంతి ప్రదక్షిణ పదే పదే ॥*

అనే శ్లోకం పఠిస్తాం. 'అనేకానేక జన్మల పాపాలన్నీ ప్రదక్షిణం చేస్తున్నప్పుడు వేసే ప్రతి అడుగు ద్వారా నశిస్తూ పోతాయి' అన్నది ఈ శ్లోకభావం.

*('ప్రదక్షిణతో ఆరోగ్య ప్రయోజనాలు' వచ్చే సంచికలో...)*


11
శివుడు నెమ్మదిగా గీతాలాపన ప్రారంభించాడు.
"ఆత్మానందం! అనంత సుఖదం..."


12 గంధర్వుల శరీరాలపై గాయాలన్నీ మాయమయ్యాయి. వారు తన్మయులయ్యారు.


13 మహా విష్ణువు సంగీతాన్ని వింటూ సమాధి స్థితుడయ్యాడు.


14
విష్ణుమూర్తి దేహం నుంచి వెలువడుతున్న ప్రకాశం క్రమంగా కరిగి...
ఆయన కుడి కాలి బొటనవేలు నుంచి క్రిందికి జారసాగింది.

15 అది గమనించిన బ్రహ్మ లేచి తన కమండలంలో ప్రకాశ జలాన్ని పట్టుకున్నాడు. అదే పవిత్రమైన ఆకాశ గంగ.



16 ఎంతో కాలం తరువాత... భగీరథుడు కఠోర తపస్సు చేసి బ్రహ్మను ప్రత్యక్షం చేసుకున్నాడు.



17




18 భగీరథుడు బ్రహ్మ ఆజ్ఞానుసారం శివుణ్ణి ప్రార్థించి గంగను భూలోకానికి తీసుకువచ్చాడు.





19 కపిలముని శాపంతో మరణించిన సగర కుమారుల భస్మరాశులపై గంగ ప్రవహించడం వల్ల వారికి పుణ్యలోకాలు ప్రాప్తించాయి.



గంగానది సాక్షాత్తూ పరబ్రహ్మ స్వరూపమే. గంగ మీదుగా వీచే గాలి సోకినా మానవుల ప్రాపంచికత పటాపంచల వుతుంది.

– శ్రీ రామకృష్ణ పరమహంస




A TREASURE TROVE FOR ALL

# A CONCISE ENCYCLOPAEDIA OF HINDUISM

(in three volumes)

*by Swami Harshananda*

SPECIAL PRE-PUBLICATION OFFER

## NEW RELEASE

- Covers all aspects of Hindu Religion, Philosophy and Culture
- Printed on natural shade, superior quality maplitho paper
- Binding in full calico with multi-colour cover
- Size : 24 x 18 cm. Each volume contains approximately 700 pages
- Contains 200 line drawings and 60 photographs
- Subsidised Price on Release : Rs. 1500 (US $150)
- Special Pre-publication Offer : Rs. 1000 (US $100)
  (Courier charges : India Rs. 200; U.S.A. & Europe US $60)
- Last date for booking at Pre-publication price : 31 March 2008

ALL ARE REQUESTED TO MAKE USE OF THIS OPPORTUNITY

FOR BOOKINGS CONTACT :




RAMAKRISHNA MATH
Bull Temple Road, Bangalore - 560 019
Phone : 080-2661 6161, 2661 6060
e-mail: rkmblr_publi@vsnl.net
ramakrishnamathblr@dataone.in

ADVT.

# వార్తావాహిని

## వ్యక్తిత్వ వికాస సదస్సులు

**భీ**మవరం రామకృష్ణ సేవాసమితి 2008 జనవరి 22 నుంచి 24 వరకు భీమవరం పట్నంలోని వివిధ కళాశాలల్లో 'వ్యక్తిత్వవికాస సదస్సు'లను నిర్వహించింది. మూడు రోజులపాటు జరిగిన కార్యక్రమాల్లో హైదరాబాద్ రామకృష్ణ మఠం అధ్యక్షులు స్వామి జ్ఞానదానందజీ, వివేకానంద మానవ ప్రతిభా సంస్థ డైరక్టర్ స్వామి శ్రీకాంతానందజీ, వివేకానంద వాణీ సంస్థ డైరక్టర్ స్వామి అనుపమానందజీ, శ్రీరామకృష్ణ ప్రభ సంపాదకులు స్వామి పరిజ్ఞేయానందజీ పాల్గొని విద్యార్థినీ విద్యార్థులను ఉద్దేశించి - స్వామి వివేకానందుని దృష్టికోణంలో విద్యావిధానం, శీలనిర్మాణం, ఏకాగ్రతా రహస్యం మొదలైన అంశాలపై ప్రసంగించారు. పెదనింద్ర కొలను, గరగపర్రు గ్రామాలలో నిర్వహించిన



సత్సంగ కార్యక్రమాల్లో స్వామి జ్ఞానదానందజీ గానామృతంతో భక్తులను భావపరవశులను చేశారు. ఈ కార్యక్రమాల్లో సుమారు 4000 మంది విద్యార్థినీ విద్యార్థులు, 1000 మంది భక్తులు పాల్గొన్నారు.

**నివేదిక : డాక్టర్ ఐ.వి.కె. జగ్గరాజు**




## జాతీయ యువజన దినోత్సవం

**మ**హబూబ్‌నగర్ జిల్లా మద్దెలబీడు శ్రీరామకృష్ణ సేవాసమితి 2008 జనవరి 12న జాతీయ యువజన దినోత్సవం వైభవంగా నిర్వహించింది. మద్దెలబీడు గ్రామంలో స్వామి వివేకానంద విగ్రహాన్ని గ్రామీణ అభివృద్ధి శాఖ మంత్రివర్యులు డా॥ చిన్నారెడ్డి ఆవిష్కరించారు. శ్రీవిఠల్‌రావు ఎమ్.పి., నక్తల్ నియోజక వర్గం ఎమ్.ఎల్.ఎ శ్రీరామ్మోహన్ రెడ్డిగార్లు పాల్గొన్నారు. ఈ కార్యక్రమంలో విద్యార్థినీ విద్యార్థులు స్ఫూర్తినిచ్చే దేశభక్తి గేయాల్ని, స్వామి వివేకానంద సందేశాన్ని వినిపించారు. విద్యార్థులనుద్దేశించి స్వామి శితికంఠానందజీ, స్వామి పరిజ్ఞేయానందజీ, డా॥ పన్నాల శ్యామసుందర మూర్తి ప్రసంగించారు.

**నివేదిక: శంకర్ రెడ్డి**

**తూ**ర్పుగోదావరి జిల్లా వేట్లపాలెం శ్రీరామకృష్ణ సేవాసమితి 2008 జనవరి 12 జాతీయ యువజన దినోత్సవం ఘనంగా జరిపింది. ఉదయం జరిగిన ఊరేగింపు కార్యక్రమంలో 500 మంది భక్తులు పాల్గొన్నారు. రాజమండ్రి రామకృష్ణ మఠం స్వామి కపాలీశానందజీ వివిధ పోటీలలో విజేతలైన 100 మంది విద్యార్థినీ విద్యార్థులకు బహుమతులు, 15 మంది పేద విద్యార్థులకు యూనీఫామ్ అందజేశారు. ఈ కార్యక్రమంలో రాక్ సిరామిక్ పి.ఆర్.ఓ శ్రీరాజ్‌మోహన్ పాల్గొన్నారు. **నివేదిక : వి.వీరభద్రరావు**





# సుబోధ

**భక్తుడు:** భగవంతుని యందు ప్రేమ ఎలా కలుగుతుంది?

**శ్రీరామకృష్ణ :** సముద్రంలో ముత్యాలు నిక్షిప్తమై ఉంటాయి. నీటిపైనే వెదికితే ముత్యాలు దొరకవు. బాగా లోతుగా వెళ్ళి గాలిస్తే దొరుకుతాయి. ఆవగింజలో నూనె ఉంది. ఆ గింజలను గానుగ ఆడితే గాని నూనె బయటకు తీయలేము. భగవంతుని ప్రేమ పొందడానికి ఆధ్యాత్మిక శిక్షణ అవసరం.

**భక్తుడు:** ఎవరైనా భగవంతుణ్ణి పూర్తిగా తెలుసుకోగలరా?

**శ్రీరామకృష్ణ :** పూర్తిగా తెలుసుకోవటం అసాధ్యం. ఒక చీమ పంచదార కొండ వద్దకు వెళ్ళింది. దానికి రెండు కణాలు చాలు. నదిలో నీరు చాలా ఉంటుంది. మనం తీసుకొని వెళ్ళిన పాత్రలో పట్టినంత నీరే తెచ్చుకుంటాం. భగవంతుని పూర్తి తత్త్వంతో మనకు ఏం పని?

**భక్తుడు:** ఏకాంతంలో ధ్యానం ఎంతకాలం చెయ్యాలి?

**శ్రీరామకృష్ణ :** చిన్న మొక్కల్ని పశువుల బారి నుండి రక్షించేందుకు చుట్టూ కంచె వేస్తారు. చెట్టు పెరిగిన తర్వాత కంచె అవసరం ఉండదు. బాగా ఎదిగిన చెట్టుకు ఏనుగును కట్టేసినా ఏమీ అవదు. అదేవిధంగా భగవంతునిపై మనస్సు స్థిరంగా లగ్నం అయ్యేంతవరకూ ఏకాంతంలో ధ్యానం చేయడం అవసరం.

(శ్రీరామకృష్ణ కథామృతం నుంచి)

శ్రీరామకృష్ణ ప్రభ
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్ - 500 029
ఫోన్: 040-2766 7799, 2763 3936
E-mail : sriramakrishnaprabha@gmail.com



నిర్వాహక సంపాదకులు: స్వామి జ్ఞానదానంద
సంపాదకులు: స్వామి పరిజ్ఞేయానంద



# సురభి

అపరేశ్ చంద్ర ముఖోపాధ్యాయ రచించిన 'రమణీయ' అనే నాటకం చూడడానికి దివ్య జనని కలకత్తాలోని మినర్వా థియేటర్‌కు వెళ్ళారు.

ఆ నాటకంలో రామానుజాచార్యుల గురువు అతడికి ఇచ్చిన మంత్రాన్ని ఎవరికీ చెప్పవద్దనీ, అలా చెబితే దాని వల్ల అతడికి (రామానుజులకి) నరకం ప్రాప్తిస్తుందనీ, విన్న వారికి ముక్తి కలుగుతుందనీ అంటారు. తనకు మోక్షం లభించదని తెలిసినా రామానుజులు గోపురం పైకి ఎక్కి, అందరికీ వినబడేలా ఆ మంత్రాన్ని గొంతెత్తి గట్టిగా చెప్పాడు. ఆ సన్నివేశాన్ని చూసిన మాతృమూర్తికి భావసమాధి స్థితి కలిగింది. చాలా సేపటి వరకూ అమ్మ మామూలు స్థితికి రాలేకపోయారు. ఆఖరికి గోలాప్‌మా అమ్మ చెవిలో భగవన్ నామాన్ని ఉచ్చరించగా మాతృమూర్తికి బాహ్య స్మృతి కలిగింది. రామానుజుల పాత్ర ధరించిన నటి తారా సుందరిని అమ్మ తన ఒళ్ళో కూర్చోబెట్టుకుని ముద్దాడారు. ఆ విధంగా తారాసుందరి పునీతురాలైంది. ఆనాటి సమాజం నటీనటులను పతితుల్నిగా చూసేది. సమాజంలోని కట్టుబాట్లకు అతీతంగా శ్రీ శారదామాత పతితుల్ని సైతం తన అక్కున చేర్చుకుని ఆదరించారు.

(ఆశుతోష్ మిత్ర స్మృతుల నుంచి)

# శ్రీ పరమాచార్య చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ వేదాధ్యయనానుసన్ధాన ప్రతిష్ఠానమ్

## ప్రవేశ / ఉద్యోగ ప్రకటన

**1. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది కోర్సులకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

**(అ) 'వేదచూడామణి'** : ఋగ్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క అధ్యయనము

యోగ్యతలు : మాతృభాషలో చదువగలిగి, వ్రాయగలిగి ఉండాలి.

వయస్సు : 8 నుంచి 10 సంవత్సరాల మధ్య

స్టైఫండ్ : నెలకు రూ. 1,000/-

**(ఆ) 'వేదార్థచూడామణి'** : ఋగ్వేదము/ యజుర్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క భాష్యాధ్యయనము

యోగ్యతలు : సంస్కృత పరిజ్ఞానముతో బాటు ఏదో ఒక వేదాన్ని పూర్తిగా అధ్యయనం చేసి ఉండాలి.

వయస్సు : 15 సం॥, ఆ పైన

స్టైఫండ్ : నెలకు రూ. 3,000/-

**2. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది ఉద్యోగాలకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

**(అ) వేదాధ్యాపకుడు** : (సామవేదము/ అథర్వవేదము - వేదానికి ఒక్కొక్కరు చొప్పున రెండు ఖాళీలు)

కావలిసిన అర్హతలు : క్రమాంతము లేక పదాంతము

అదనపు అర్హతలు : ఏదైన మఱియొక వేదము/ వేదభాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము

అనుభవము : 2 సంవత్సరములు

సంభావన : నెలకు రూ॥ 8,000/- మొత్తము, సౌకర్యములతో

**(ఆ) వేదభాష్యాచార్యుడు** : (ఒక్కొక్క వేదానికి ఒక్కొక్కరు చొప్పున 4 ఖాళీలు)

విద్యార్హత : ఏదైనా వేద భాష్యంలో ఉత్తీర్ణత

అదనపు అర్హత : మరొక వేద భాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము

అనుభవార్హత : 5 సం॥

సంభావన : నెలకు రూ. 10,000/- మొత్తము, సౌకర్యములతో

ముద్రించిన దరఖాస్తు ఫారములను **శ్రీ పి. వేంకటేశ్వర్లు గారు, మేనేజింగ్ డైరెక్టర్, కాకతీయ సిమెంట్, సుగర్ & ఇండస్ట్రీస్ లిమిటెడ్, 'గురుకృప' (ఆంధ్రా బ్యాంకు ఎదురుగా), 1 - 10 - 140/1, అశోక్‌నగర్, హైదరాబాద్ - 500 020** (ఫోను: 040 - 27637717) నుంచి ప్రత్యక్షముగా గాని, పోస్టు ద్వారా గాని పొందవచ్చు. పూర్తి చేయబడిన ఆ ముద్రిత దరఖాస్తులను ఈ పై అడ్రసుకు పంపవలెను. అవసరాన్ని బట్టి ఖాళీలను పూరించుట లోనూ, అర్హతల సవరణ లోనూ మేనేజ్‌మెంటుకు అధికారము కలదు.

సం/-

హైదరాబాద్ కులప్రశాసకుడు



Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 65 సంచిక: 4 ఏప్రిల్ 2008

శ్రీరాముడు భద్రునికి ఇచ్చిన వరం

వసామి శిఖరే భద్ర తవయావద్ధరిష్యతి ।
భూమిర్భూతాని కల్పాన్తే మత్సాయుజ్యమవాప్స్యసి ॥

భద్రా! ఈ నేల, నీరు, నిప్పు,గాలి, నింగి ఉన్నంతకాలము నేను నీ శిరస్సుపై నివసించి ఉంటాను. కల్పాంతమున నీవు నా సాయుజ్యము పొందెదవు.

(బ్రహ్మ పురాణంలోని గౌతమీ మాహాత్మ్యము నుంచి)





## లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి




ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు......** రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**రాజ పోషకులు...........** రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**పోషకులు................** రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| పేరు | చిరునామా | రూ. |
|---|---|---|
| | ఇప్పటి వరకు వసూలైన మొత్తం ... | 12,26,336 |
| పోషకులు | : శ్రీమతి ఐ. సరోజిని, భీమవరం, పశ్చిమ గోదావరి జిల్లా - 534 202 | 4,000 |
| | : శ్రీ ఎన్. వేంకటేశ్వర్లు, మొవ్వ | 1,116 |
| | : శ్రీమతి ఎమ్. రామలక్ష్మి, కనకవల్లి అగ్రహారం, కృష్ణా జిల్లా - 521 165 | 1,116 |
| | మొత్తం ... | 12,32,568 |

## శ్రీరామకృష్ణ ప్రభ గ్రంథాలయ నిధి పథకం

'శ్రీరామకృష్ణ ప్రభ గ్రంథాలయ నిధి పథకం'లో చేరి, మీ పేరు మీద పది మందీ మంచి విషయాలు చదివే వీలు కల్పించండి. ఈ పథకం కింద రూ॥600/- చందా కట్టినట్లయితే, 10 ఏళ్ళ పాటు ఒక గ్రంథాలయానికి (ఉన్నత పాఠశాలలకు/ కళాశాలలకు/ సంస్థలకు/ దేవాలయాలకు)ప్రతి నెలా మీ పేరిట 'శ్రీరామకృష్ణ ప్రభ' పంపిస్తాం. దాతల పేర్లనూ, వారి పేరిట పత్రికను పంపే గ్రంథాలయాల వివరాలనూ 'శ్రీరామకృష్ణ ప్రభ'లో ప్రచురిస్తాం.

| సంఖ్య | దాత పేరు | గ్రహీత సంస్థ |
|---|---|---|
| 1314 | శ్రీ కోనల భాస్కర్ రెడ్డి, కైకలూరు, కృష్ణాజిల్లా,- 521 333 | ఎమ్.పి.యు.పి, పాఠశాల, వెలగలవారి పాలెం, ప.గో. జిల్లా |
| 1315 | శ్రీ రుక్మాంగద రెడ్డి, పచ్చికపాలెం, చిత్తూరుజిల్లా-517 569 | శ్రీ శిరిడీ సాయిబాబామందిరం, టి.కె.ఎమ్.పురం, చిత్తూరుజిల్లా-517 569 |
| 1316 | శ్రీమతి ఆర్. సుబ్రహ్మణ్యేశ్వరి, పుష్పలీలానగర్, ఏలూరు. | కె.ఎమ్. బసవరాజ్, కైవర, చిక్బల్లాపూర్, కర్నాటక-563 128 |
| 1317 | " " | ఎ.పి.ఎస్.డబ్ల్యు,ఆర్.ఎస్./జె.సి(బాలుర),ఆర్మూర్,నిజామాబాద్ - 503 224 |
| 1318 | శ్రీ మంచల మల్లేశం,భువనగిరి, నల్లగొండజిల్లా-508 116 | ప్రజ్ఞా ఉన్నత పాఠశాల, ఆర్మూర్, నిజామాబాద్-503 224 |
| 1319 | శ్రీ ఎస్. హనుమంత రావు, పంచవటి కాలనీ,గుడివాడ. | శ్రీ శిరిడీ సాయిబాబా మందిరం, నిడుమోలు, కృష్ణా జిల్లా |
| 1320 | " " | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల,మొగులూరు, కంచికచర్ల, కృష్ణా జిల్లా |
| 1321 | శ్రీ పి. ప్రతాప్, వి.టి.టవర్స్, వి.టి.కాలనీ, నల్లగొండ-508 001 | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, కొనబన్స్వాడ, నిజామాబాద్ జిల్లా |

ఈ పథకం ద్వారా శ్రీరామకృష్ణ ప్రభను మరింతమందికి చేరువ చేస్తున్న దాతలకు కృతజ్ఞతలు.



## ADVERTISEMENT TARIFF

| | MULTI COLOUR | B & W |
|---|---|---|
| Fourth Cover | Rs.25,000 | - |
| Second Cover | Rs.20,000 | - |
| Third Cover | Rs.20,000 | - |
| Inside Full Page | Rs.15,000 | 10,000 |
| Inside Half Page | Rs.10,000 | 5,000 |

| చందా వివరాలు | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|
| విడి ప్రతి | : రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా | : రూ. 100 | $ 20 |
| మూడు సంవత్సరాలకు | : రూ. 280 | $ 50 |
| ఐదు సంవత్సరాలకు | : రూ. 450 | $ 80 |
| ఇరవై సంవత్సరాలకు | : రూ. 1500 | $ 360 |



గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి. పంపవలసిన చిరునామా : Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.

## లోపలి పేజీల్లో...





### శ్రీరామకృష్ణ ప్రభ వార్షిక చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా! దిగువ పేర్కొన్న నెంబర్ల నడుమ ఉన్న సంవత్సర చందాదారుల చందా గడువు తీరిపోనుంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకొని, 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.*

50000 - 52400 మధ్యనున్న వారిలో **సంవత్సర** చందాదారుల చందా గడువు **2008** ఏప్రిల్‌తో తీరిపోనుంది!

60000 - 63286 మధ్యనున్న వారిలో **సంవత్సర** చందాదారుల చందా గడువు **2008** మే తో తీరిపోనుంది!

*శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ.... - సర్క్యులేషన్ మేనేజర్*

_ మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు. ❖ మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి. ✷ మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.

'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకి కుడి భాగంలో మీ చందా గడువు నెల పొందుపరచబడి ఉంది.

ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకుడు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు.

- సంపాదకులు




**SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH**
Domalguda, Hyderabad - 500 029. Andhra Pradesh
Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com

# పంచవటిలో పరమాత్ముడు!

ఆంధ్రావనిలో రామ మందిరంలేని ఊరు కానీ, రామ నామం రుచి ఎరుగని నోరు కానీ లేదంటే అతిశయోక్తి కాదు. అయితే ఆ అయోధ్య రాముడు ఆంధ్రుల ఆరాధ్య దైవం ఎలా అయ్యాడు? ఆంధ్రులకూ, ఆనంద రామునికీ గల అవినాభావ సంబంధం ఏమిటి? శ్రీరాముడు అరణ్యవాస సమయంలో గోదావరీ తీరాన పంచవటి



ఒడిలో సేద తీర్చుకున్నాడు. అందుకే భద్రాచల రాముడు ఆంధ్రుల హృదయాల్లో వెలుగుల్ని నింపే 'రామ భక్తి'ని మెండుగా ప్రసాదించి, ఆంధ్రుల ఆరాధ్య దైవంగా నిలిచాడు.

శ్రీరాముడు మనకు ప్రసాదించిన భక్తి భిక్షను సద్వినియోగం చేసుకొని ఆధ్యాత్మికంగా అభివృద్ధి చెందడానికీ, నిరంతరం ఆ పరమాత్ముని సన్నిధిలో ప్రశాంత చిత్తులమై పరమానందాన్ని పొందడానికీ మనం ఏం చేయాలి?

శ్రీరాముని అరణ్యవాసానికీ, ఆధ్యాత్మిక జీవితానికీ అత్యంత సన్నిహిత సంబంధం ఉంది. జీవిత ధ్యేయ సిద్ధిని సాధించాలంటే ఎదురయ్యే అవరోధాలను అధిగమించాలి. శ్రీరాముడు అరణ్యవాసంలో ఎంతోమంది అసురుల్ని వధించాల్సి వచ్చింది, మరెన్నో కష్టాల్ని ఎదుర్కోవలసి వచ్చింది. అయితే శ్రీరాముడు తనకు కలిగిన కష్టాలకు కలత చెందలేదు. తండ్రి ఆజ్ఞను మరువలేదు. కార్యసిద్ధిని పొందేవరకు ఆగలేదు. జీవన యాత్రలో కలిగే కష్టాలకు భయపడకూడదనీ, బాధ్యతలను గుర్తించి, బాధలను భరించాలనీ శ్రీరాముని అరణ్యవాస జీవితం బోధిస్తుంది. కష్టాల మధ్య కలతలన్నింటినీ మరిచి జీవిత గమ్యాన్ని చేరడంలోనే ఉంది నిజమైన నైపుణ్యం. అదే అరణ్య కాండలోని అంతరార్థం. మన ఆధ్యాత్మిక కాండానికి సోపానం.

**పరమాత్ముని సన్నిధికి వివేకం పెన్నిధి:**

పంచ (అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ) కోశాలతో నిండిన ఈ మానవ దేహమే ఒక 'పంచవటి'. అందులో 'మనస్సు' ఒక పర్ణశాల. ఆ మనస్సనే పర్ణశాలలో నివసించేవాడు 'పరమాత్మ'. పరమాత్మ సర్వదా మనసులో కొలువై ఉండాలంటే మనస్సు కామక్రోధాదుల (అసురుల)కు వశం కాకుండా జాగ్రత్త వహించాలి. అందుకోసం 'వివేకం' అనే ఖడ్గం ఎప్పుడూ మన చెంతనే ఉండాలి.

పంచవటి (దేహం), పర్ణశాల (మనస్సు), పరమాత్మ (శ్రీరాముడు), జీవాత్మ (సీత), వివేకం (లక్ష్మణుడు).

అరణ్యవాసంలో లక్ష్మణుడు తన వెంట ఉన్నంతవరకు సీతమ్మ శ్రీరాముని సన్నిధిలో ఆనందంగా జీవితాన్ని

సాగించింది. ఎప్పుడైతే ఆమె రావణాసురుడు (కామం) పన్నిన పన్నాగంలో లక్ష్మణుణ్ణి (వివేకం) దూరం చేసుకుందో శ్రీరాముని (పరమాత్ముని) వియోగం పొందింది. అసురుల మధ్య బంధీగా సీతమ్మ (జీవాత్మ) అశోకవనంలో అనంత శోకాన్ని అనుభ వించాల్సి వచ్చింది.

కాబట్టి ఆధ్యాత్మిక మార్గంలో పయనించే సాధకుడు కామ క్రోధ లోభాలకు వశం కాకుండా ఉండాలంటే వివేకంతో వ్యవహరించాలి. అప్పుడే ఆ పరమాత్మ సన్నిధిలో ఆనందాన్ని ఆస్వాదించగలుగుతాం.

**ఆధునిక యుగం ఆకర్షణలమయం :** మానవ జీవిత లక్ష్యం భగవత్ సాక్షాత్కారమని శ్రీరామకృష్ణులు బోధించారు. జీవిత సార్థకతా పథంలో సాధకునికి ముఖ్యంగా ఎదురయ్యే అవరోధాలు కామం, కాంచనం. ఈ రెండింటిలో అత్యంత ప్రమాదహేతువు 'కామం'. మనసు నుంచి కామ వాసనలను పారద్రోలడం ఎంత కష్టతరమో శ్రీరామకృష్ణులు తన స్వానుభవాన్ని ఇలా వివరించారు:

"ఆధ్యాత్మిక సాధనలు చేస్తున్న సమయంలో కామ వాసనలు నన్ను ఎంతగానో ఇబ్బంది పెట్టేవి. అప్పుడు నేను కాళీమాతతో 'అమ్మా! నాలోని ఈ కామ వాంఛను తొలగించు, లేకపోతే నేను శిరచ్ఛేదం చేసుకుంటాను'అని విలపించేవాణ్ణి".

యోగులైనా, రాజయోగులైనా అప్రమత్తంగా లేకపోతే కామాసురుని కబంధ హస్తాల నుంచి తప్పించుకోవడం దుర్లభం.

శ్రీరామకృష్ణుల దివ్య ఆధ్యాత్మిక స్థితిని పరీక్షించడానికి మథుర్‌బాబు ఒకసారి ఒక వేశ్యను శ్రీరామకృష్ణుల వద్దకు పంపించాడు. శ్రీరామకృష్ణులు ఆ వేశ్యను చూచి "అమ్మా... అమ్మా" అంటూ ఆమెలో జగన్మాతను దర్శించారు. కామ వాంఛ లేశమైనా లేని శ్రీరామకృష్ణుల దివ్యభావ స్థితిని చూసిన మథుర్‌బాబు విస్మయం చెందాడు.

శ్రీరామలక్ష్మణులు కూడా మోహితురాలైన శూర్పణఖను ఎదుర్కోవలసి వచ్చింది. రాముడు యుక్తితో, సున్నిత వచనాలతో శూర్పణఖ (కామం) దారిని మళ్ళించాడు. ఇక లక్ష్మణుడు తన దగ్గరకు వెళ్ళిన ఆ కామాసురి మాయలో పడకుండా, ధైర్యంతో శూర్పణఖను శిక్షించాడు.

కామానికి అవరోధం కలిగితే ఆ కామం వికృత రూపం దాల్చి విధ్వంసాన్ని సృష్టిస్తుంది. 'కామాత్ క్రోధోభి జాయతే'– కోరిక తీరక పరాభవం పొందిన శూర్పణఖ తన సోదరుడైన ఖరుడి దగ్గరకు వెళ్ళి తన వ్యథను వెళ్ళబుచ్చింది. శూర్పణఖకు జరిగిన పరాభవానికి ప్రతీకార భావమే ఖరునిలో క్రోధాగ్నిని జ్వలింపజేసింది. క్రోధం వల్ల మనిషి యుక్తాయుక్త విచక్షణా జ్ఞానం కోల్పోతాడు. క్రోధంతో బుద్ధిని కోల్పోయిన ఖరుడు, శ్రీరాముని చేతిలో వినాశనం చెందాడు.

**కామః క్రోధశ్చ లోభశ్చ దేహే తిష్ఠంతి తస్కరాః ।**
**జ్ఞాన రత్నాపహారాయ తస్మాత్ జాగ్రత జాగ్రత ॥**

"కామ క్రోధ లోభాలనే దొంగలు మనలో ఉన్న జ్ఞాన రత్నాలను అపహరించడానికి పొంచి ఉన్నారు. కాబట్టి సాధకులు సదా అప్రమత్తతతో మెలగాలి''అని శ్రీశంకరాచార్యులు హెచ్చరిస్తున్నారు.

**ప్రమాదతః ప్రచ్యుత కేలి కందుకః**
**సోపాన పంక్తౌ పతితో యథా తథా** (వివేకచూడామణి)

ఈ ఆధునిక యుగంలో సాధకుల్ని కామవికారాలకు గురిచేసే ఆకర్షణలు అనంతం. "సాధకుడు వాటి బారి నుండి రక్షించుకొని మనస్సును అధీనంలో ఉంచుకోకపోతే ప్రమాదవశాత్తూ చేయిజారి మెట్లపై పడిన బంతిలా అధోగతి పాలవుతాడు".

**మనస్సే పర్ణశాల:** పంచవటిలో సీతారాముల కోసం పర్ణశాలను నిర్మించాలనుకున్నప్పుడు లక్ష్మణుడు ముందుగా చెట్లూచేమలతో నిండిన ఆ ప్రదేశాన్ని శుభ్రం చేసి, నివాస యోగ్యమైన ఓ సుందర పర్ణశాలను నిర్మించాడు. లక్ష్మణుడు భక్తి శ్రద్ధలతో నిర్మించిన ఆ పర్ణశాలలో శ్రీరాముడు సీతా సమేతంగా నివసించాడు.

మన మనస్సే ఒక పర్ణశాల. భగవంతుడు మన హృదయ మందిరంలో నివసించాలంటే కామక్రోధాలను పారద్రోలి హృదయాన్ని పవిత్రంగా ఉంచాలి. పరిశుద్ధమైన అటువంటి మనసులో భగవంతుడు ప్రతిష్ఠితమై ఉంటాడు.

మన దేహం(పంచవటి)లో పరమాత్ముణ్ణి(రాముణ్ణి) ప్రతిష్ఠించాలంటే మనస్సు (పర్ణశాల)ను పవిత్రంగా ఉంచాలి. 'అరణ్యవాసం'లో అసురులను శ్రీరామలక్ష్మణులు వధించినట్లు మన 'ఆధ్యాత్మికవాసం'లో ఎదురయ్యే కామక్రోధాది అసురులను వివేక వైరాగ్యాలతో వధించాలి. అప్పుడే మనం **పంచవటిలో పరమాత్ముణ్ణి** నిత్యం దర్శించుకోగలం; ఆనందామృతాన్ని గ్రోలి తరించగలం.

# అవతార పురుషులు

- స్వామి జ్ఞానదానంద

ఆఫీసుల్లో ఒకరిద్దరు నీతిమంతులు ఉంటే ఇతర ఉద్యోగులు వారిని ఏ విధంగా పదవి నుంచి తొలగించాలా అని యోచిస్తూ వారి మీద నేరాలు మోపుతుంటారు. మంచివారికి చాలా క్లిష్టమైన పరిస్థితులను కల్పించి, వారికిక దారి లేక తప్పనిసరై చెడ్డవారితో చెయ్యి కలిపేలా చేస్తారు. దుష్టశక్తుల శాతం ఎక్కువయ్యే సరికి వారిని ఎదుర్కొనే శక్తి చాలక, మంచివారు కూడా చెడ్డవారితో కలుస్తారు, ఆ విధంగా పతనమవుతారు. గతంలో ఎంతో చక్కని వాతావరణం ఉండేది. ఆ తర్వాత క్రమంగా పతనమయ్యాం.

స్వామి వివేకానంద సాహిత్యం చదివినట్లయితే అందరూ కొత్త దృక్పథంలో ఉన్నతంగా ఎదుగుతారు. సేవాభావం కలిగినప్పుడు ఇతరులను తమ కోసం ఉపయోగించుకోరు. శాంతియుత సమాజం ఏర్పడడానికి శ్రీరామకృష్ణ, శ్రీశారదాదేవి, స్వామి వివేకానందుల సందేశం నేడు అత్యంత అవసరం. అయితే ఆ మార్పు కలగడానికి సమయం పడుతుంది. అది నిదానంగా జరుగుతుంది. బుద్ధుని తరువాత ఆయన బోధలు ప్రజలకు అందడానికి 400 ఏళ్ళు పట్టింది. పవిత్రత, దయ, సేవాభావాలతో ప్రజలు జంతువులకు కూడా సేవ చెయ్యడానికి వైద్యశాలలు నిర్మించారు. అప్పుడు ఎంతో గొప్పగా, ఉన్నతంగా ఉండేది సమాజం. తర్వాత ధర్మం క్షీణించింది. ఆ తరువాత ఆదిశంకరాచార్యులు వచ్చి మానసికంగా మనుష్యులను ఉత్తేజపరచి, వేదాంత విలువలను ప్రబోధించారు.

ఆధునికయుగానికి అవసరమైన సందేశాన్ని ఇవ్వడానికి అవతరించిన మహాపురుషులు శ్రీరామకృష్ణ పరమహంస. స్వామి వివేకానంద శ్రీరామకృష్ణులను అవతార వరిష్ఠునిగా స్తుతించారు.

**స్థాపకాయ చ ధర్మస్య సర్వధర్మ స్వరూపిణే ।**
**అవతార వరిష్ఠాయ రామకృష్ణాయ తే నమః ॥**

'ధర్మాన్ని పునరుద్ధరించిన సర్వధర్మ స్వరూపుడు, అవతార వరిష్ఠుడు అయిన శ్రీరామకృష్ణునికి వందనాలు.'

దైవప్రకటనను ఎంతగానో గౌరవించి, అర్థం చేసుకొనే సంస్కారం మన దేశానికి ఉంది. ప్రస్తుత కాలంలో జాతీయ అవతారంగానే కాక, అంతర్జాతీయ అవగాహనగా శ్రీరామకృష్ణుల అవతారం చోటు చేసుకుంటోంది. ఈ పరిణామం క్రమ క్రమంగా జరుగుతోంది. మనదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ కొందరు ధర్మాన్ని వ్యాప్తి చేస్తున్నారు. అందువల్ల భక్తిపూరిత వాతావరణం వస్తోంది.

అవతార పురుషుణ్ణి కేంద్రంగా పెట్టుకున్న భక్తి దివ్యమైన శక్తిని కలిగి ఉంటుంది. ఆ రకమైన భక్తి చాలా అద్భుతంగా ఉంటుంది. శివుడు, విష్ణుమూర్తి, దేవి– ఇలా అందరిపట్లా ఒకే భావం కలిగి ఉండి, అభివృద్ధి చెందుతున్నా కూడా అవతారపురుషుని యందు ఉన్న భక్తిచేత ఆయనతో ఒక బాంధవ్యం ఏర్పడుతుంది. ఆయన మనతో కలసి జీవించడం చేత ఆయనలోని అద్భుతశక్తిని చూడగలుగుతాం. ఆ దివ్యపురుషుడు మన సామాజిక జీవితంలోనూ, ఆధ్యాత్మిక జీవితంలోనూ గొప్ప మార్పును తీసుకురాగలుగుతాడు. a

# సర్వజన శుభకరి సర్వధారి

- ఏ.ఎస్. మూర్తి

జయానికి ప్రతిఫలం సుఖం. సుఖం శాంతిని ప్రసాదించాలి. శుభసూచకం కావాలి. అంటే ఆధ్యాత్మిక అనుభూతిని అందించే సుఖమే అందరూ ఆశించవలసిన సుఖం. ధర్మమార్గంలో పొందిన జయమే జయం. గడచిన సర్వజిత్ నామ సంవత్సరం ప్రజావళికి అనేకరంగాలలో జయాన్ని ప్రసాదించి సర్వధారికి స్వాగతం పలుకుతూ గతంలోకి నిష్క్రమించింది. సర్వజిత్ నామ సంవత్సరం జయానికి ప్రతీక అయితే, సర్వధారి నామ సంవత్సరం శుభానికి సంకేతం.

సృష్టి నిరంతరం సాగే చక్రభ్రమణం. అది విశాల విశ్వ విశ్వాంతరాళాల స్థితి, గతుల సమన్వయ రూపం. పరమాణువు నుంచి మహా మహత్ వరకు గల దివ్య సూత్రంలో ఇమిడి కాలంతో కదిలిపోతున్న ఒక గుళిక ఉగాది.

భారతీయ సంస్కృతిలో ప్రతి పండుగ వేదాంతపరమైనదే. అవి ఏవో సరదాల కోసం చేసుకునే సంబరాలు కావు. అలాగే ఉగాది కూడా. మనం ఖగోళ శాస్త్ర పరంగా గణించే యుగాలూ, శకాలూ, సంవత్సరాలూ, ఋతువులూ, మాసాలూ, పక్షాలూ, ఘడియలూ, విఘడియలూ అన్నీ కాలంతో నిత్యం పరిభ్రమించే సంవత్సర చక్రాలు. ఒక్కొక్క చక్రంలోనూ ఉండే పన్నెండు ఆకులు పన్నెండు నెలలు. అణువులో ఏవిధంగా 360 డిగ్రీలున్నాయో అలాగే బ్రహ్మాండంలో కూడా 360 డిగ్రీలే ఉండడం ఖగోళ విశేషం. కనుకనే కాలచక్రం ఆద్యంతాలు కనపడని మహా ప్రవాహం.



వైదిక కాల మానంలో సంవత్సరం ఒక అద్భుత ప్రమాణం. సంవత్సరాలు 60. మొదటి సంవత్సరం మళ్ళీ ప్రభవించిన 'ప్రభవ'. చివరి సంవత్సరం క్షయం లేని 'అక్షయ'. అంటే ఒక పరిభ్రమణం పూర్తి చేసుకుని చివరి అంకంలోకి వచ్చి, తిరిగి ప్రభవకు స్వాగతం పలికే ఆఖరి సంవత్సరం.

ఇందులో 'సర్వధారి' 22వ సంవత్సరం. ఈ నూతన సంవత్సరం 'సర్వధారి'కి రాజు చంద్రుడు. చంద్రుడు ప్రపంచాన్ని అమృతమయం చేయగల శక్తిమంతుడు. తేజోకాంతులతో ప్రపంచానికి జీవచైతన్యాన్ని ప్రసాదించేది సూర్యుడైనా, చంద్రుడు మానవాళికి ఆహారప్రదాత. చంద్రుని నుంచి రాత్రి వేళలలో కురిసే అమృతం పంటచేలకూ, వృక్షజాతికీ ప్రాణశక్తిని అందించి భూమిని సస్యశ్యామలం చేస్తుంది. చెట్లు కొత్త చిగుళ్ళు తొడిగి పూవులు, కాయలతో శోభాయమానం కావడానికి దోహదం చేస్తుంది. కనుకనే చంద్రుడు అమృతప్రదాత. అంతేకాదు మానవాళికి చంద్రుడు ఆప్తమిత్రుడు. అతడు మన మనస్సుకు అధిపతి. ఈ సర్వధారి నామ సంవత్సరానికి చంద్రుడు రాజు కనుక మనం కృషీవలులమై, కర్మయోగంగా, చంద్రాంకితంగా సాగుబడి చేస్తే దేశం సుభిక్షమై సస్యాభివృద్ధి జరిగి అందరూ సుసంపన్నులు కాగలరు. అంతేకాక ప్రతి వ్యక్తీ తన మనస్సుకు అధిదేవత అయిన చంద్రుణ్ణి ధ్యానించి, మనస్సును యోగదృష్టితో, ఆధ్యాత్మిక, ధార్మిక ఆలోచనలతో పునీతం చేసుకోవాలి. సత్కార్యాలు చేస్తూ సత్సాంగత్యాన్ని వృద్ధి చేసుకుంటే సుఖశాంతులు లభించి సమాజం నందనవనం కాగలదు. శ్రీరామకృష్ణులు, శ్రీశారదామాత, స్వామి వివేకానందులు బోధించిన సాధనా జీవితం ఇదే. ఆ దిశలోనే ఈ 'సర్వధారి' మనందరినీ నడిపించాలని ఆశిద్దాం.

(ఈ నెల 7న ఉగాది)



# సర్వజీవ సేవ - సకల దైవ పూజ !

- స్వామి స్వసంవేద్యానంద

దేవాలయంలోని విగ్రహాన్ని 'అర్చావతారం' (భగవానుడు విగ్రహరూపాన అవతరించాడు - అర్చా = విగ్రహాలు) అని శ్రీరామానుజాచార్యులు పేర్కొన్నారు. కనుక దేవాలయానికి వెళ్ళి దైవాన్ని పూజించడమనేది ఆధ్యాత్మిక జీవితంలో అత్యంత ప్రధానకార్యం. మనం ఆలయంలో దైవం ముందు నిలబడి ఏమని ప్రార్థిస్తాం? "ఓ దైవమా! మాకు ధనధాన్యాలను ప్రసాదించు, పుత్ర పౌత్రులను ప్రసాదించు, పేరు ప్రతిష్ఠలను ప్రసాదించు" అంటూ ఒక పెద్ద పట్టికను ఆయనకు నివేదిస్తాం. ఇలాంటి వాటికై ఇతరులను యాచించక దైవాన్ని ప్రార్థించడం మేలు అనడంలో సందేహం లేదు. కానీ, భగవంతుడు కల్పతరువు; ఏది కోరితే అది ప్రసాదిస్తాడు కనుక అనిత్యాలైనటువంటి ధనధాన్యాదులకై భగవంతుణ్ణి ప్రార్థించినప్పటికీ, అతి దుర్లభమైన ఆత్మోన్నతినీ, భగవద్భక్తినీ ప్రసాదించాల్సిందిగా కూడా ప్రార్థించాలి.

భగవంతుణ్ణి ప్రార్థించడం ఎలాగో మనకు శ్రీరామకృష్ణులిలా నేర్పుతున్నారు: "అమ్మా! శరణాగతో - హం, శరణాగతో - హం - నేను నీ పాద పద్మాల పట్ల శరణు వేడుకుంటున్నాను. నాకు ఎలాంటి దేహసుఖాలూ వద్దు, కీర్తి ప్రతిష్ఠలూ వద్దు. నేను అష్టసిద్ధులను కూడా కోరుకోను. నాకు కావలసిందల్లా నీ పాదపద్మాల పట్ల శుద్ధభక్తి. నాకు అలాంటి నిష్కామ, అహేతుక భక్తిని ప్రసాదించు. అమ్మా! నీ భువన మోహన మాయలో నన్ను మైమరచేలా చేయవద్దు. అమ్మా! ఈ మాయా సంసారంలోని కామినీ కాంచనాల పట్ల ఆసక్తుడినయ్యేలా చేయవద్దు. నేను భజనహీనుడను, సాధనహీనుడను, జ్ఞానహీనుడను, భక్తి హీనుడను, దయతో నాకు నీ పాదపద్మాల పట్ల భక్తినొసగు." (శ్రీరామకృష్ణ కథామృతం, భాగం - 3, పుట 39).

హృదయాంతరాళాల నుంచి వెలువడే ఈ వేడికోలును భగవంతుడు తప్పక వింటాడు. ఆయన అనుగ్రహంతో, సకల అనర్థాలకూ కారణమైన స్వార్థం, ఈర్ష్య, అసూయాదులు మన నుంచి దూరమై, మనకు ఆత్మవికాసం కలుగుతుంది. తత్ఫలంగా, భగవంతుడు కేవలం ఆలయంలోని విగ్రహంలోనే కాక సర్వ జీవులలోనూ అంతర్యామిగా ఉన్నాడు అని శ్రీకృష్ణుడు భగవద్గీతలో - "ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశే - ర్జున తిష్ఠతి" తెలిపిన సత్యాన్ని గ్రహిస్తాం.

అయితే, మానవరూపంలో ఉన్న దైవాన్ని ఎలా ఆరాధించాలి, తద్వారా దైవానుభూతిని ఎలా పొందగలం? శ్రీమద్భాగవతంలో కపిల భగవానుడు తన తల్లి దేవహూతితో అన్నమాటలు దీనికి సమాధానం: "నేను సర్వభూతాలలో సదా వసిస్తున్నాను. ప్రజలు నన్ను ఉపేక్షిస్తున్నారు, అవమానిస్తున్నారు. దంబానికి మాత్రమే నన్ను పూజిస్తున్నారు. అత్యంత వ్యయంతో కూడిన పూజలను నేను స్వీకరించను".

అలాగే, తనను ఏ విధంగా పూజించాలి అనే విషయం గురించి ఇలా అంటున్నారు:

అధమాం సర్వేషు భూతేషు భూతాత్మానం కృతాలయం।
అర్చయేత్ దానమానాభ్యాం మైత్ర్యా అభిన్నేన చక్షుషా ॥

"జీవుల హృదయాల్లో ఆలయం కట్టుకొని ఉన్న నన్ను దానాల ద్వారా, భక్తిపూర్వకంగా, స్నేహపూర్వకంగా అభిన్న దృష్టితో పూజించాలి" (శ్రీమద్భాగవతం, 3.29.27)

ఈ సందేశాన్నే నేడు అవతార వరిష్ఠులైన శ్రీరామకృష్ణులు "శివభావంతో జీవసేవ చేయాలి"అని మనకు బోధిస్తున్నారు. ఇక, స్వామి వివేకానంద ఇలా అంటున్నారు: "లోకోపకారం చెయ్యడం మన భాగ్యమనే జ్ఞానం సదా ఉంటే మనలోని పరోపకార ఇచ్ఛయే మహోన్నత ప్రేరణశక్తి అవుతుంది. ఏదో పై మెట్టెక్కి కూర్చుని నాలుగు పైసలు చేత్తో పట్టుకొని 'ఏమోయి, పేదవాడా, ఇదుగో' అనవద్దు. అతడికి దానమిచ్చి నువ్వు మేలు పొందడానికి అతడొకడున్నందుకు అతడి పట్ల కృతజ్ఞుడవై ఉండు. ధన్యత దాతకే కానీ దానం పుచ్చుకొన్న వాడికి కాదు". (వివేకానంద సాహిత్య సర్వస్వం, భాగం 2, పుట 45)

ఇలాంటి అపూర్వమైన బోధనలను మార్గదర్శకంగా ఉంచుకొని సర్వ జీవులను దైవభావంతో సేవించడానికి ప్రయత్నిస్తే అనునిత్యం దైవానుభూతిని పొందగలం.

# దేవీ వైభవం

ప్రవచనం: **శ్రీ సామవేదం షణ్ముఖశర్మ** విలేఖనం: **శ్రీమతి ఎస్. శేషు**

**(గత సంచిక తరువాయి)**



**ఆ** ఘట్టాన్ని తలచుకుని ఇదంతా బ్రహ్మదేవుడు నారదునికి చెబుతున్నాడు. "అక్కడ నాకు అద్భుతం కనిపించింది. "నఖ దర్పణ మధ్యే వై దేవ్యాః చరణ పంకజే – ఆ చరణ పంకజ నఖాల్లో; బ్రహ్మాండ మఖిలం సర్వ తత్ర స్థావర జంగమం – ఇన్నిన్ని లోకాలు తిరిగి తిరిగి చూసానే, అవన్నీ నాకక్కడ కనిపిస్తున్నాయి. అప్పుడు తెలిసింది సర్వ బ్రహ్మాండాలూ అమ్మ కాలిగోళ్ళలోనే, ఆ వెలుగుల్లోనే బ్రతుకుతున్నాయని!" ఆ చరణాల్లో మొత్తం కనపడగానే 'అమ్మా!' అని నమస్కరించి, ఆమెను స్తోత్రించి, "నీ అనుగ్రహం వల్లనే మేమేదైనా చేయగలమమ్మా! మమ్మల్ని స్పందింపజేసే శక్తివి నువ్వు" అన్నారట వాళ్ళు ముగ్గురూ.

ఆ తల్లి "నేను లేకపోతే స్పందన లేదు, శక్తి లేదు నాయనా! నేను ఎవరి ఒడిలో కూర్చున్నానో ఆయన కూడా నేను లేకపోతే ఏమీ చెయ్యలేడు" అన్నదట.

*"శివశ్శక్త్యా యుక్తో యది భవతి శక్త్య ప్రభవితుమ్*
*న చే దేవం దేవో నఖలు కుశలః స్పందితుమపి..."*

న ఖలు కుశలః స్పందితు మపి – నేను లేకపోతే స్పందన కూడా లేదాయనకు! స్పందనకు అర్థం "నేను" అనుకోవడమే" అన్నదట. నేను అనే స్పందన వచ్చిందా అప్పుడు నాది అనే ప్రపంచం తయారవుతుంది.

అలాగే "పరమాత్ముడిలో కూడా నేను అనే భావన రాగానే అనేకమైన బ్రహ్మాండాలన్నీ బయటకు వచ్చాయి" అని వేదం చెప్పింది. *ఏకోహం బహుస్యాం...* ఏకం – ఒక్కడే; అందులో అహం అనే స్పందన వచ్చింది. ఆ స్పందనే అమ్మవారు. అది రాగానే *బహుస్యాం* – అనేకమైన జగత్తు వచ్చింది. ఇక్కడ పరమాత్మ యొక్క శక్తే అమ్మ. అందుకు అయ్యవారి శక్తి అమ్మవారు. అయ్యవారి శక్తి అంటే ఇద్దరూ వచ్చారు. ఇప్పుడు ఏకం ఆయనా? ఏకా ఆమె? పంచదార, పంచదార తీపి – ఈ రెండూ వేరుగా ఉన్నాయా? జ్యోతి – దాని కాంతి రెండూ వేరుగా ఉన్నాయా? తీపి ఉంటేనే పంచదార అన్నాం. కాంతి ఉంటేనే జ్యోతి అన్నాం.

సృష్టిలో దేనికీ చేతకానివాణ్ణి శక్తిహీనుడు అంటారు. అంతే కానీ బ్రహ్మ హీనుడు, రుద్రహీనుడు అనరు కదా! శక్తిహీనుడు దేనికీ పనికిరానట్లే "నేను" లేనివాడు దేనికీ పనికిరాడు. అందుకే అమ్మ ఉంటేనే అందరూ ఉంటారు.

"నీలోని బ్రహ్మత్వం నేను, ఆయనలోని విష్ణుత్వం నేను. ఇప్పుడు మీరు ఆడవాళ్ళై వచ్చారు. మీ పేరు (ఇప్పుడు) బ్రాహ్మి, వైష్ణవి, మహేశ్వరి. మీలో ఉన్న శక్తులవి. అందుకే మీరు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు" అందట వారి ముగ్గురితో ఆ జగదంబిక.

*"పరాశ శక్తి వివిధైవ శ్రూయతే స్వాభావికే జ్ఞాన బలక్రియాత్"* ఇలా విశ్వాన్ని నిర్మించదలచుకున్న పరమేశ్వరుడు తన శక్తితో ఈ జగత్తును నిర్మిస్తున్నాడు. ఎవరా శక్తి అంటే "నేనే" అని చెబుతున్నదా అమ్మ. అందుకే *శివస్య సహజాత్ ధ్రువాత్* = ఆ పరమేశ్వరుని సహజమైన, శాశ్వతమైన శక్తి అమ్మ. ఆ తల్లి వివరంగా "సర్వమునందూ ఉన్న చైతన్యాన్ని నేను" అని బోధించింది. *"మయాత్త్యక్తం విధేనూనం స్పందితుం న క్షమం భవేత్* – నేను కానీ లేకపోతే నీలో స్పందన కూడా ఉండదు" అంది. మనలో స్పందన ఉండాలన్నా అమ్మ ఉండాలి. ఈ స్పందనకు మూలమైన అమ్మ చరణాలను ఆశ్రయిస్తే జీవిత పరమార్థాన్ని తెలుసుకుంటాం.

జగదంబ బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ముగ్గురినీ అనుగ్రహించి, తన నుంచి మూడు శక్తుల్ని ఇచ్చిందట. ఆ

మూడు శక్తులే లక్ష్మి, కాళి, సరస్వతి. లక్ష్మి నారాయణుని పత్ని అయి, సరస్వతి బ్రహ్మ పత్ని అయి, కాళి శివపత్ని అయి వారికి సహకరిస్తుండగా, వారి శక్తులతో సృష్టి స్థితి లయలు చెయ్యడానికి వీరు ఉద్యుక్తులవుతున్నారు. వాళ్ళు "మేము సృష్టి స్థితి లయలు ఎలా చేయగలము" అని అడిగితే "ఇదిగో మీకు శక్తుల్ని ఇస్తున్నాను" అని అమ్మవారు మూడు స్వరూపాలని ఇచ్చారని దేవీ భాగవతం మనకు చెబుతోంది.

ఈ కథ వింటే మనకు కలిగిన అర్థం, ఆనందం ఒకవైపు ఉంటే మరోకవైపు ప్రశ్నలు చాలా వస్తుంటాయి. పురాణకథలు ఒక చోట విష్ణువుని, మరొక చోట శివుణ్ణి అధికులుగా చెబుతాయి. మరొక చోట శక్తిని ఎక్కువ చేసి చెబుతాయి. ఏది ప్రమాణం అంటే ఎవరు ఏ మూర్తిని ఉపాసిస్తున్నారో వారికి అదే ప్రమాణం – ఇది ఒక అర్థం. మిగిలిన విషయాలు గ్రహించాలి అంటే ఇందులో చెప్పదల్చుకున్న అసలు తత్త్వం ఏమిటి – సర్వ వ్యాపకమైన పరమాత్మ యొక్క తత్త్వ ప్రతిపాదనే పురాణం యొక్క లక్ష్యం. అందుకు మనం ఏ దేవతను ఆరాధించినా అది సర్వవ్యాపకమైన చైతన్యమే అనే దృష్టి ఉపాసకుడికి కలగాలి. అది కలిగించడానికే పురాణవేత్త ఇక్కడ చూపిస్తున్నాడు.

సృష్టిలో ప్రతి అణువూ ఒక బ్రహ్మాండం. ఈ అణువులోనే సృష్టి స్థితి లయలు ప్రతీ క్షణం జరుగుతుంటాయి. అంటే ప్రతి క్షణం ప్రతి కణంలోనూ కూడా సృష్టి స్థితి లయలు జరుగుతూ ఉంటాయి. ఈ సృష్టి స్థితి లయలకు ఎవరు అధిష్ఠానమో వారిని బ్రహ్మ విష్ణు రుద్రులన్నారు. ఎన్ని అణువులున్నాయో అన్ని సృష్టి స్థితి లయలు ఉన్నప్పుడు ఎందరు బ్రహ్మ విష్ణు రుద్రులున్నారో, వీటన్నిటికీ కూడా ఏ మహాచైతన్యం మూలమవుతుందో – ఆ మహాచైతన్యం ఇక్కడ చెప్పబడుతోంది; కాలాన్నీ, దేశాన్నీ ఇది ఇంతే అని నిర్దేశించలేరు, అవి అనంతాలు. అది చెప్పడమే ఈ కథలో ముఖ్య ఉద్దేశం.

"దేవి" అనగానే "సర్వ చైతన్యరూపా" అని చెప్పారు. సర్వ చైతన్యమైనప్పుడు స్త్రీయా, పురుషుడా అన్నది పెద్ద ప్రశ్న. దానికి దేవీపురాణం చాలా చక్కగా ఒక్క శ్లోకంతో సమాధానం చెప్పింది. "పుం రూపం వా స్మరేత్ దేవీ స్త్రీరూపం వా విచింతయేత్ అథవా నిష్కళాం ధ్యాయేత్ సచ్చిదానంద విగ్రహాం" – అని ఒక్క మాటలో సమన్వయం. హిందూ మతావలంబులందరూ కూడా ఈ శ్లోకం ద్వారా సమాధానం పొందగలరు. అందుకు "దేవీ వైభవం" పేరుతో భారతీయ హైందవ మత స్వరూపాన్ని దర్శిస్తున్నాం మనం.

ఈ ఒక్క శ్లోకంలో అద్భుతమైన సమన్వయం చేసింది దేవీ పురాణం. ఆ అఖండ చైతన్య స్వరూపాన్ని 'పుంరూపం వా స్మరేత్' = పురుషరూపంలోనైనా స్మరించవచ్చు, 'స్త్రీ రూపం వా విచింతయేత్' = స్త్రీ రూపంలోనైనా చింతించవచ్చు. 'అథవా నిష్కళాం ధ్యాయేత్'– ఈ రెండూ కాని నిర్గుణతత్త్వాన్ని ఉపాసించగలిగితే అలా కూడా ఉపాసించవచ్చు – ఏ రూపంలో ఆరాధిస్తున్నా, ఆరాధిస్తున్నది ఒక్కటే అని తెలుసుకోవాలి. అదేమిటంటే "సచ్చిదానంద విగ్రహాం" – మనం ఆరాధించే తత్త్వం ఒక్కటే. అది సత్ చిత్ ఆనందం.

"సత్ చిత్ ఆనందంలో సత్ అంటే ఉనికి మాత్రమే అయినది, శాశ్వతమైన ఉనికి సత్. మనం చూసేవన్నీ కూడా వచ్చేపోయేవి. ఉండి పోయేది మాత్రం ఒక్కటే. – అది సర్వానికీ ఆధారమైనది. అది ఎలాంటిదంటే... మనం పరిశీలించి చూస్తే... అలలన్నీ వచ్చి పోతుంటాయి. కానీ అలలన్నిటికీ ఆధారమైన సముద్రం మాత్రం శాశ్వతం. మనం చూస్తున్న సర్వజగత్తులో సూర్యగ్రహ నక్షత్రాదులు జీవకోటి... ఇవన్నీ కూడా అలలలాగ వచ్చి వెళ్ళిపోతూ ఉంటాయి. కానీ ఈ అలలన్నిటికీ ఆధారమైన ఏ చైతన్యం ఉన్నదో ఆ చైతన్యం మాత్రం ఎప్పుడూ ఉండేదే. అందుకు అది ఎక్కడ ఉందో పరిశీలించాలి. ప్రతీ అలలో సముద్రం ఉంది, ప్రతీ అలా సముద్రంలో ఉంది. అలాగే ప్రతీ జీవునిలో చైతన్యం ఉంది, ప్రతీ జీవీ చైతన్యంలోనే ఉన్నాడు. ❑ **(సశేషం)**




- స్వామి సుకృతానంద

– జి.ఎస్.రాజు, సికింద్రాబాద్

**? : దేవుడున్నాడా? ప్రపంచంలోని సుఖ దుఃఖాలకు అతడే బాధ్యుడా?**

✍: వాయువుకు రూపం లేదు, కానీ వాయువు లేదని చెప్పలేం. ఆకాశం యొక్క గుణం శబ్దం. అది వినిపిస్తుంది కానీ, కనిపించదు. కాబట్టి కనబడని ఆకాశం ఉన్నదని గ్రహించాలి. సూర్యుని తాపం, చంద్రుని వెన్నెల, నక్షత్రాల కాంతి, గ్రహాల సంచారం ఆ పరమేశ్వరుని శక్తి వల్లనే కలుగుతున్నాయి. పంచభూతాలైన ఆకాశం, అగ్ని, వాయువు, నీరు, భూమి ఒకదానికొకటి శత్రువుల లాగ భిన్నాలై ఉన్నాయి. అయినప్పటికీ, ఆ పరమాత్ముని శక్తి వల్లనే ఈ భూతాలు తమ తమ కార్యాలను నెరవేరుస్తున్నాయి.

***'క్షితి అంకురాదికం, సకర్తృకం కార్యత్వాత్ ఘటవత్'***



కుండ చేయడానికి కుమ్మరి అవసరం. అలాగే ఈ విచిత్రమైన జగత్తు సృష్టికర్త వల్లనే ఉత్పన్నమైంది. ఇది తార్కిక సిద్ధాంతం. ఆస్తికతకూ, ఆధ్యాత్మికతకూ, ధార్మికతకూ నిలయమైన ఈ భారతమాత ఒడిలో పుట్టి పెరుగుతున్న భారతీయులు సైతం "దేవుడున్నాడా?" అని ప్రశ్నించడం విస్మయపరచే విషయం.

***'నా దత్తే కస్య చిత్పాపం న చైవ సుకృతం విభుః'***

ఆ పరమాత్మ ఎవరి పాపాన్ని కానీ, పుణ్యాన్ని కానీ గ్రహించడని దీని అర్థం. మనం చేసిన కర్మలన్నీ మనకు జ్ఞాపకం ఉండవు. కానీ సూత్రాత్మ స్వరూపుడిగా మనలోనే ఉండి, మన కర్మలకు తగిన ఫలితాలను ఆ పరమాత్మే మనకు ఇస్తాడు.

***'భ్రామయన్ సర్వ భూతాని యంత్రా రూఢాని మాయయా'*** అని భగవద్గీతోక్తి. "యంత్రాలను త్రిప్పినట్లు ఈ ప్రాణులను నా మాయాశక్తితో త్రిప్పుతున్నాను" అని దీని అర్థం. ***'యథా కర్మ యథా శ్రుతమ్'*** అంటారు. అంటే, మనం ఎలాంటి కర్మ చేస్తే, అలాంటి ఫలం కలుగుతుందని భావం.

–ఎ. భాస్కరరావు, మెదక్

**? : బ్రహ్మసాయుజ్యం అంటే ఏమిటి? బ్రహ్మసాక్షాత్కారం ఎంత కాలానికి సాధ్యం? గురువు ఆవశ్యకమా?**

✍: "సయుగ్ భావం సాయుజ్యం". సయుగ్ భావమంటే సమాన దేహేంద్రియాభిమానం. ఇష్ట స్వరూపం లాంటి స్వరూపాన్ని పొంది, ఆ దేవతతో పాటు ఉండడం. ప్రాణాన్నే సామమని ఉపాసించడం వల్ల సాయుజ్యం కలుగుతుంది. ఈగ, దోమ, ఏనుగు మొదలైన వాటన్నింటిలో ఆ ప్రాణం సమముగా ఉందని ఉపాసించడం వల్ల సాయుజ్య ప్రాప్తి కలుగుతుంది. ఇది సగుణం. కాగా, బ్రహ్మసాయుజ్యం అంటే: నిర్గుణ నిరాకార బ్రహ్మంతో ఏకీభవించడం. నిష్కామ కర్మ వల్ల పాపం నశిస్తుంది. నిరంతరం దేవతా ఉపాసన వల్ల విక్షేపం (మనశ్చంచలత) నశిస్తుంది. వేదాంత శ్రవణ, మనన, నిధి ధ్యాసనాల వల్ల ఆవరణం నశిస్తుంది. అజ్ఞానావరణం బ్రహ్మం నుంచి జీవుణ్ణి వేరు చేస్తుంది. ఈ విధంగా నిష్కామ కర్మ, ఉపాసన, వేదాంత శ్రవణాల వల్ల బ్రహ్మ సాయుజ్యం (మోక్షం) పొందగలుగుతాం.

దైవసాక్షాత్కారం మనం చేసే సాధనల తీవ్రత మీద ఆధారపడి ఉంటుంది. భగవద్గీతలో చెప్పిన స్థితప్రజ్ఞ లక్షణాలన్నీ మనలో ప్రవేశించినప్పుడు మనకు జ్ఞానం కలుగుతుంది. లేదంటే, సాధనను కొనసాగించాల్సి ఉంటుంది.

అవతారమూర్తి అయిన శ్రీరామచంద్రుడు విశ్వామిత్రుని వద్ద ధనుర్విద్యను అభ్యసించాడు. వశిష్ఠుల వారి నుంచి జ్ఞానోపదేశం పొందాడు. ఇక మన లాంటి వారికి గురువులు అవసరమని వేరుగా చెప్పాలా? a




# సమసమాజ నిర్మాణమే మన ధ్యేయం!

నేను భగవంతుని స్థానంలో ఉండి ప్రజలను 'మీరు ఈ మార్గంలో నడవండి, ఆ మార్గం వద్దు' అని శాసించలేను. కానీ నేను రామాయణంలో ఉడుతలాగ భక్తితో దేశాభివృద్ధికై నా వంతు శ్రమను దానం చేస్తాను. అద్భుతమైన మన జాతి యంత్రాంగం యుగయుగాలుగా పనిచేస్తూ వస్తోంది. మహత్తరమైన మన జాతీయ జీవన స్రవంతి మన కళ్ళ ముందు ప్రవహిస్తూ వస్తోంది. జాతి నడక మంచిది కాదని కానీ, అదిసరియైన మార్గంలో పోవడం లేదనీ ఎవరూ చెప్పడానికి సాహసించలేరు.

జాతి జీవనానికి ఆవశ్యకమైన సామాగ్రిని సమకూర్చడం వరకే మన వంతు; జాతి తన ప్రగతిని తానే సాధించుకుంటుంది. జాతి అభివృద్ధి మార్గాన్ని ఎవరూ శాసించలేరు. మన సమాజంలో లొసుగులు చాలానే ఉన్నాయి. అలాగే ఇతర సమాజాల్లోనూ దోషాలు ఉంటాయి. అందువల్ల దేన్నీ నిరసించలేము. దోషాలను ప్రతివాడూ వేలెత్తి చూపించగలడు. కానీ వాటి నివృత్తి మార్గాన్ని నిర్దేశించిన వాడే మానవ సమాజానికి నిజమైన శ్రేయోభిలాషి.

మీరు మన దేశ చరిత్రను చదివారా? భారతదేశంలో సంస్కర్తలకు లోటు లేదని గమనించారా? రామానుజుడు, శంకరాచార్యులు, గురునానక్, చైతన్య మహాప్రభువు, కబీరు, – వీరందరూ ఎవరు? వీరందరూ మహామహులైన ప్రబోధకులే. ఒకరి వెంట ఒకరు భారత దిఙ్మండలిలో తేజోమయంతో వెలుగొందిన ధ్రువతారలే. వారందరూ సమాజ వికాసానికై పాటుపడినవారే. వారి కృషి ఫలితాలు ఇప్పటికి కానవస్తున్నాయి.

అయితే ప్రస్తుత సంస్కర్తల విషయంలో ఉన్నట్లు వారికి ప్రచారార్భాటాలు శూన్యం. ఇప్పటి వారిలాగ వారు ఎన్నడూ సమాజాన్ని దూషించలేదు. నిరసనలకు బదులు వారు ఆశీస్సులనే సమాజంపై వర్షింపజేశారు. ఇంతకన్నా మంచితనాన్ని అలవరుచుకోవచ్చని నిర్దేశించారు.

నేను ఇతరజాతి వ్యవస్థలను నిరసించను. వారి పరిస్థితులను బట్టి అవి వారికి అనుకూలమే; కానీ మనకు కాదు. వారికి మంచి పోషకాహారమైనది, మనకు విషం కావచ్చు. ఇది మనం నేర్చుకోవాల్సిన ప్రథమ పాఠం. వారి శాస్త్రాలు, ఇతర సాంప్రదాయాల నేపథ్యంలో వారి ప్రస్తుత విధానం రూపొందించబడింది. మన సాంప్రదాయాలను విడనాడకుండా మన వ్యవస్థను మనం నిర్మించుకోవాలి.

('నా భారతం అమర భారతం' నుంచి)



# పరమేశ్వరుని పరిరక్షణలో ...

## స్వామి జపానంద స్వీయ అనుభవాలు -10

(గత సంచిక తరువాయి...)

## భ్రమ

హృషీకేశ్‌లో కొండల మధ్య గంగానది ఒక సరోవరంలా ఉంటుంది. విస్తరించి ఉన్న ఈ గంగా క్షేత్రాన్ని 'మాయా కుండ్' అంటారు. పరివ్రాజక సన్న్యాసి (స్వామి జపానంద) గంగాతీరంలో ఇసుకలో ఆసనం వేసుకుని కూర్చున్నారు. ఇంతలో ఒక పండా, కొంతమంది యాత్రికులను తీసుకుని అటువైపు వచ్చారు. వారిలో ఒక సర్దార్జీ దంపతులు కూడా ఉన్నారు. యాత్రికులందరూ స్నానం చేసి గంగాదేవికి పూజ చేశారు. పూజ అయ్యాక పండా సగం సంస్కృతంలో, సగం హిందీలో ఏవో మంత్రాలు చదువుతూ, సర్దార్జీ దంపతులను చేతిలో నీళ్ళు తీసుకుని గంగానదిలో వదలమన్నారు. తరువాత వారితో "కొడుకు కావాలా, కూతురు కావాలా, మాయాదేవిని అడగండి" అన్నారు. సర్దార్ర్జీ భార్య "కొడుకే కావాలి" అంది. పండా వారి చేతిలో ఒక దొన్నెతో మిఠాయి పెట్టి గట్టిగా చెప్పమన్నారు "కూతురు, కొడుకు" అని. అటు కొండలలో నుంచి కొడుకు అని ప్రతిధ్వని వినిపించింది. అలా మూడు సార్లు చెప్పించాక కొంచెం మిఠాయి గంగలో వేసి, కొంత వారికిచ్చి, మిగిలినది తన అంగవస్త్రంలో కట్టుకుని వెళ్ళిపోయారు. సన్న్యాసి ఇదంతా గమనిస్తున్నారు.

సర్దార్జీ దృష్టి కూడా సన్న్యాసి మీద పడింది. వాళ్ళు కూతురు, కొడుకు అని గట్టిగా అంటున్నప్పుడు జపానంద చిరునవ్వు నవ్వారు. అది కూడా సర్దార్జీ గమనించారు. అప్పటికి వాళ్ళంతా వెళ్ళిపోయారు. మరునాడు ఆ సర్దార్‌జీ మాయాకుండ్ వచ్చారు. ఆ సమయంలో సన్న్యాసి గంగలో స్నానం చేస్తున్నారు. ఆయన దగ్గరకు సర్దార్జీ వచ్చి "ఏమండీ, మీరు సన్న్యాసులు కదా! నిన్న మేము పూజ చేసి వరం కోరుకున్నప్పుడు మీరెందుకు నవ్వారు? ఆ పని ఏమైనా బాగుందా?" అని అడిగారు.

సర్దార్జీకి కోపం వచ్చిందని సన్న్యాసికి అర్థమైంది. అప్పుడు సన్న్యాసి ఇలా అన్నారు – "మీరెవరిని వరం ప్రసాదించమని అడిగారు?" దానికి, సర్దార్జీ "మాయాదేవిని" అని బదులు చెప్పారు. అప్పుడు సన్న్యాసి "సరే మీరు చెప్పండి, మీకేమిటి తినాలని ఉంది? లడ్డూనా లేక కోవానా? ఏది కావాలో చెప్పండి నేను మాయాదేవిని అడిగి తెప్పిస్తాను" అన్నారు. సన్న్యాసి గట్టిగా "లడ్డూ, కోవా" అని అన్నారు. కొండలలోంచి "కోవా" అని ప్రతిధ్వని వినిపించింది. మళ్ళీ "కోవా, లడ్డూ" అని గట్టిగా అన్నారు. ఈ సారి "లడ్డూ" అని ప్రతిధ్వని వినిపించింది.

సర్దార్జీ కొంచెం ఆశ్చర్యంగా అదెలాగ అని అడిగారు. అప్పుడు సన్న్యాసి విపులంగా అంతా చెప్పారు. "దానిని ప్రతిధ్వని అంటారు. అటు ఎత్తైన కొండలున్నాయి కదా! మనం గట్టిగా అరిచిన మాటలు ధ్వని తరంగాలుగా వెళ్ళి కొండలకు తగిలి తిరిగి మన వైపునకు వస్తాయి. మనం చివరగా పలికిన పదం మనకు వెంటనే స్పష్టంగా వినిపిస్తుంది. మొదట పలికిన పదాలు అస్పష్టమైపోతాయి. అన్ని పదాలకీ ప్రతిధ్వని వస్తుంది. కానీ మొదటివి అన్నీ కలిసిపోయి మనకి స్పష్టంగా వినిపించవు. చివరిది ఒక్కటే స్పష్టంగా వినిపిస్తుంది. అది ప్రకృతి నియమం. దానిలో ఏ దైవీ శక్తీ లేదు. అందుకని నిన్న నేను నవ్వాను" అన్నారు. సర్దార్‌జీ "దీని అర్థం పండా మమ్మల్ని మోసం చేశాడన్నమాట" అన్నారు. సన్న్యాసి సమాధానమిస్తూ "దాన్ని మీరేమనుకున్నా నిజం అదే!".

దేవుడు మన హృదయంలోనే నివసిస్తున్నాడు. ఆ దేవుణ్ణి మనం అన్నీ అడగవచ్చు.

(మిగతా వచ్చే సంచికలో...)

అనువాదం : శ్రీమతి జి.ఎస్. లక్ష్మి

# అవరోధాల్ని దాటే ఉపాయాలు

**- వల్లభజోస్యుల జలజ**

భక్తి మార్గంలో ప్రయాణిస్తున్నప్పుడు ఎదురయ్యే అడ్డంకులను తొలగించుకోవడం కష్టతరం. కానీ "ధీరుల్ విఘ్ను నిహన్య మానులగుచున్"... అంటూ సుభాషితాలలో హెచ్చరించిన విధంగా, అవరోధాల్ని దాటుతూ, యాత్ర ముగించాలి. అయితే ఇది ఎలా సాధ్యం? అందుకు కావాల్సిన ఉపాయాలు కొన్ని తెలుసుకుందాం:

1. ఇంద్రియాలు సహజంగానే విషయాల వైపు పరుగులు తీస్తాయి. ఇంద్రియాలను విషయాల వైపు పోనీయకుండా, మనలోనే ఉన్న పరమాత్మ వైపు తిప్పేందుకు ప్రయత్నం చెయ్యాలి.

2. 'ఇత్యుత్కటైః పుణ్యపాపైః ఇహైవ ఫలమశ్నుతే' అన్న హితోపదేశం ఆధారంగా పాపపుణ్యాల వల్ల కలిగే ఫలితం ఎప్పుడో ఒకప్పుడు ఇహలోకంలో అనుభవించాలి. ఈ విషయం స్ఫురణకు తెచ్చుకుంటూ ఉంటే మనస్సును మరలించుకోవడం సాధ్యమే అనిపిస్తుంది.

3. మృత్యుచింతన మనస్సును దుష్కర్మల వైపు పోనీయదు. ఇంక కొన్ని రోజులు మాత్రమే నీ ఆయువు అని ఎవరైనా మనల్ని హెచ్చరిస్తే, మనం చెయ్యాల్సిన మంచి పనులన్నిటినీ ముందే చేసెయ్యడానికి త్వరపడతాం.

4. మహాపురుషుల జీవిత చరిత్రలు చదవడం, పవిత్రమైన, ధార్మిక జీవనాన్ని గడిపే వారి సాంగత్యం చేయడం.

5. చేసిన తప్పులను పశ్చాత్తాప హృదయంతో క్షమించమని భగవంతుణ్ణి ప్రార్థిస్తే, పాప నివృత్తి కలుగుతుంది భగవంతుని సర్వ వ్యాపకత్వంపై విశ్వాసం ఉంచి, ఆయన దృష్టి నుంచి తప్పించుకునే మార్గం లేదని తెలుసుకుంటే, భక్తి మార్గం సులభ సాధ్యమవుతుంది.

6. మనస్సును ఎప్పుడూ సద్విషయాలతో నింపుకొంటూ ఉండడం వల్ల మనస్సు సన్మార్గంలోనే ఉంటుంది.

7. తన కన్నా తక్కువ స్థితిలో ఉన్నవారితో పోల్చుకుని, తన స్థితి బాగుందన్న తృప్తితో జీవించడం. 'I Had no shoes and cried, until I saw a man who had no legs' ఈ వాక్యాన్ని మననం చేసుకుంటే మనలో అసంతృప్తి పోతుంది.

భగవంతుని కృప ముందు మానవుని సాధన అత్యల్పమైనది. అయితే ఈ కాస్తకే భగవంతుడు వశుడు అవుతాడు. ఎలా అంటే అది కేవలం ఆయనకు భక్తుల మీద ఉండే వాత్సల్యం వల్లనే. యశోద, చిన్ని కృష్ణుణ్ణి తాడుతో రోటికి కట్టివేద్దామని ఇంట్లో ఉన్న తాళ్ళన్నీ తెచ్చి, ఎన్నిసార్లు ప్రయత్నించినా రెండు అంగుళాలు మాత్రమే తక్కువ అవుతుండడం వల్ల ఆమెకు అలసట, ఆయాసం, ఆవేశం,



ఆశ్చర్యం అన్నీ కలిగాయి. ఆ తల్లి పడుతున్న శ్రమను చూసి కృపాపరవశుడైన చిన్ని కృష్ణుడు చివరకు తనంతట తానే బంధింపబడిన కథ మనకందరికీ తెలిసినదే. శ్రీకృష్ణునికి లోకాలు, లోకాధిపతులు అందరూ అధీనులై ఉంటారు, కానీ ఆయన మాత్రం ఎప్పుడూ తన భక్తులకు వశుడై ఉంటాడు అని శ్రీమద్భాగవతం చెబుతోంది.

భగవంతుని యందు సంపూర్ణ భక్తి విశ్వాసాలు కలిగితే ఆయన కృపతో ఆధ్యాత్మిక మార్గంలో కలిగే అవరోధాల్ని అధిగమించవచ్చు.

# పరమేశ్వరుణ్ణి మెప్పించిన పేదరాలు

చిత్రాలు: గోవి    కథ: వీరరాఘవ    తెలుగు సేత : స్వామి జ్ఞానదానంద

మరుంగాపురి మహారాజు వీరవర్మకు ఒకమారు కడుపు నొప్పి వచ్చి, ఎన్ని చికిత్సలు చేసినా ఫలితం లేకపోయింది. ఆ నగరానికి ఒక మహాత్ముడు వచ్చాడు. తన బాధ తగ్గించి తనకు ఉపశమనం కలిగించాల్సిందిగా ఆ మహాత్ముణ్ణి ప్రార్థించాడు వీరవర్మ.

మహాత్మా! తీవ్రంగా ఉన్న నొప్పి వల్ల నానా బాధలూ పడుతున్నాను. ఇది తగ్గే ఉపాయం సూచించండి!

మహారాజా! ఈ నగరంలో నెలకొని ఉన్న పశుపతీశ్వరుణ్ణి ప్రార్థించండి. తప్పకుండా మీ వ్యాధి తగ్గుతుంది. భగవంతునికి కృతజ్ఞతా సూచకంగా ప్రజలకు ఉపయోగపడేలాగ ఒక నీటి కొలనును నిర్మించండి.



స్వామీ! నా వ్యాధి ఉపశమించిందంటే, కొలను నిర్మిస్తాను, నీళ్ళతో కాకుండా పాలతో దాన్ని నింపుతాను.

పరమేశ్వరా! నా వ్యాధి తొలగితే ఈ దేవాలయం సమీపంలో ఒక కొలను నిర్మించి దాన్ని పాలతోనే నింపుతాను!



పరమేశ్వరుని కృపా కటాక్షంతో మహారాజు వ్యాధి నయమైంది. అతడు ఒక పెద్ద కొలను నిర్మించసాగాడు. ఒక మండపం, మెట్లు కూడా నిర్మించాడు.

మహామంత్రీ! కొలను నిర్మాణం చక్కగా ఉంది. ఇక దీన్ని పాలతో నింపడానికి ఏర్పాట్లు చేయండి!




అధికారులు కొన్ని వేలకొద్దీ కుండలతో పాలు తెచ్చి కొలనులో పోశారు. కానీ కొలను నిండలేదు. వెంటనే వారు మహారాజును సంప్రతించారు.



మహారాజా! కొలనులో ఎన్ని పాలు పోసినా ఎంతకీ కొలను నిండడం లేదు. ఆ కొలనులో పోసిన పాలన్నీ ఇంకి పోతున్నాయి.



అదంతా నాకు తెలియదు. ఎలాగైనా సరే ఈ కొలనును పాలతో నింపాలి. ప్రజలందరినీ తమ ఇళ్ళ నుండి పాలు తీసుకురమ్మని చెప్పి, కొలనులో పోయించండి. అలా చేయని వారిని దండించండి!

దండోరా వేయించి, మహారాజు ఆజ్ఞను ప్రజలకు తెలిపారు. పాలన్నీ కొలనులో పోయడం వల్ల చంటి పిల్లలూ, రోగులూ పాలు లేక ఎన్నో అవస్థలు పడ్డారు.



ఒక పేదరాలు పాలను కొలనులో పోయడానికి బయలు దేరగానే చంటి పిల్లవాడి ఏడుపు వినపడింది. ఆ పసివాడికి కొద్దిగా పాలు త్రాగించి, మిగతా పాలు తీసుకుని ఆమె బయలు దేరింది.

దారిలో ఆకలితో అలమటిస్తున్న ఒక కుక్క కనబడింది.

ఓ! నీకు కూడా ఆకలా! ఈ కొద్ది పాలు తీసుకో!



ఆమె కుక్కకు పాలు పొయ్యడం రక్షకభటులు దూరం నుండి చూసేశారు. వారు ఆమెను సమీపించే లోపల... ఒక బిచ్చగాడు ఆమె దగ్గరకి వచ్చాడు.

అమ్మా ! ఆకలితో చచ్చి పోతున్నాను. ఏమైనా ఇవ్వమ్మా!




అయ్యా! రాజాజ్ఞ ప్రకారం దేవాలయం కొలనులో పాలు పోయాలి. కాబట్టి ఈ కాసిన్ని పాలే నీకు ఇవ్వగలను.

మిగతా 33వ పేజీలో...

# సుగుణాభిరాముడు శ్రీరాముడు

- డా॥ సంధ్యావందనం లక్ష్మీదేవి



శ్రీరామచంద్రుడు సద్గుణసాగరుడు. సత్య సౌహార్ద దయక్షమా హృదయుడు. మృదుత్వ ధీర వీర స్వభావం కలవాడు. శస్త్రాస్త్ర జ్ఞాన సంపన్నుడు, పరాక్రమవంతుడు. నిర్భయత్వం, వినయం కలిగినవాడు. శ్రీరాముని ఏకపత్నీ వ్రతం, పితృవాక్య పరిపాలన, సోదరప్రేమ, సత్య సంధత అన్ని కాలాలలో వారికీ అనుసరణీయమైనవే. ఈ సుగుణాలతోనే శ్రీరాముడు లోకపూజ్యుడయ్యాడు.

శ్రీరాముని మాతృభక్తి ఆదర్శప్రాయమైంది. కౌసల్య, సుమిత్ర, కైకేయిలను సమానంగా గౌరవించేవాడు. కైకేయి తనను వనవాసానికి వెళ్ళమన్నప్పుడు కూడా శ్రీరామునికి కోపం రాలేదు.

భరతునితో శ్రీరామచంద్రుడు "సోదరా భరతా! నా ఈ వనవాసం విధాత కారణంగానే జరిగింది. ఇందుకు మాత కైకేయిని దూషించాల్సిన పని లేదు. ఆమె మన మాతృదేవత. ఆమెను ఎట్టి పరిస్థితులలోనూ ఏకాకిని చేయడం గాని, నిందించడం గాని చేయకూడదు. మీలో ఎవరు మాత కైకేయిని అవమానించినా నన్ను అవమానించినట్లే" అన్నాడు.

శ్రీరామచంద్రుడు వనవాస సందర్భంగా తండ్రిపై తనకున్న పితృభక్తిని వ్యక్తం చేస్తూ కైకేయితో, "తల్లీ! ప్రభువులు ఆదేశిస్తే నేను అగ్నిలోనైనా దూకుతాను. కఠోరమైన విషాన్నైనా పానం చేస్తాను. సముద్రంలో దూకుతాను. పితృసేవను మించిన ధర్మం లేదు. నేను వంశ ధర్మాలను ఎన్నటికీ అతిక్రమించను.

**నాస్తి శక్తిః పితుర్వాక్యం సమితిక్రమితుం మమ ।**
**ప్రసాదయే త్వాం శిరసా గన్తుమిచ్ఛామ్యహం వనమ్ ॥**

(వాల్మీకి రామాయణం)

"తల్లీ! నీ చరణాలపై శిరసు వంచి నమస్కరిస్తున్నాను. నీవు ప్రసన్నంగా ఉండాలని ప్రార్థిస్తున్నాను. తండ్రి ఆజ్ఞను తిరస్కరించే శక్తి నాకు లేదు. నేను నిశ్చయంగా వనాలకు వెళతానని ప్రతిజ్ఞ చేస్తున్నాను" అని శ్రీరాముడు, కైకేయితో అన్నాడు.

శ్రీరామచంద్రుని ఏకపత్నీవ్రతం అత్యంత ఆదర్శవంతమైంది. సీతాదేవిని అడవులకు పంపిన తరువాత ప్రజల కోసం అశ్వమేధయాగం చేయాల్సి వచ్చింది. భార్యతో కలిసే ఆ యాగం చేయాలి. ఆ సమయంలో శ్రీరాముడు ద్వితీయ వివాహం చేసుకోవచ్చు. కానీ రామచంద్రుడు మర్యాదా పురుషోత్తముడు కనుక స్త్రీకి పాతివ్రత్య ధర్మమున్నట్లే పురుషునికి ఏకపత్నీ వ్రతపాలన అవసరమని భావించి సీతాదేవి సువర్ణ ప్రతిమతో ఆ క్రతువును పూర్తి చేశాడు. స్త్రీ పురుష సంబంధం ధర్మాచరణ కోసమని శ్రీరాముడు నిరూపించాడు.

శ్రీరామచంద్రుని సోదర ప్రేమ చాలా గొప్పది. తనకు పట్టాభిషేకమని తెలిసిన తరువాత శ్రీరాముడు లక్ష్మణునితో "నాతో కలసి ఈ పృథివిని పాలించు. నీవు నా ద్వితీయ అంతరాత్మవు. ఈ రాజ్యలక్ష్మి నీకే లభించింది. నీవు మనోభీష్ట భోగాలను రాజ్యఫలాలను అనుభవించు" అని అంటాడు.

శ్రీరాముని ఆదర్శభావాలను మహర్షి వాల్మీకి మహత్వపూర్ణంగా వర్ణించాడు. ఆదికవి వాల్మీకి మొదలుకొని నేటి వరకూ కవులందరూ శ్రీరామ చరిత్రను వర్ణించి తమ వాణిని సఫలం చేసుకున్నారు. వారు శ్రీరామచంద్రుని అనంత గుణాలను శ్లాఘించి తరించారు.

# ఆధ్యాత్మిక అన్వేషణ



- స్వామి తపస్యానంద

**ప్రశ్న:** మనం త్రిగుణాలకు అధీనంలో ఉన్నప్పుడు మన సంకల్పశక్తిని ఎలా ఉపయోగించగలం?

**జవాబు:** శ్రీరామకృష్ణులు "తాడుతో గుంజకి కట్టబడిన ఆవు వంటిది మనిషి పరిస్థితి" అంటారు. ఆ ఆవుకి స్వేచ్ఛ కొంత వరకూ ఉంటుంది. తాను బంధింపబడి ఉన్న తాడు ఎంత పొడవు ఉందో అంత విస్తీర్ణం వరకు మాత్రమే అది తిరుగుతూ పచ్చిక మేయగలదు. యజమాని వచ్చి ఆ గుంజ నుండి విడిపించే వరకూ ఆ ఆవు ఎక్కడికీ వెళ్ళలేదు. అలాగే మనిషి త్రిగుణాలకు బంధీ అయి ఉన్నంత వరకూ స్వేచ్ఛ పరిమితమై ఉంటుంది. భగవదనుగ్రహంతో మనిషి తన అనంత ఆత్మ తత్త్వాన్ని తెలుసుకొన్నప్పుడు పూర్తి స్వేచ్ఛను అనుభవించగలడు.

భగవత్సంకల్పమే ప్రబలమైనది, నిజానికి అది మాత్రమే అసలైన శక్తి. మనం ప్రవహించే నదిలోని సుడిగుండాల వంటివాళ్ళం. సుడి గుండం తనదైన మార్గంలో కదులుతుంది కానీ అది ప్రవాహవేగంలో ఒక భాగమే. మనం భగవంతుడి శక్తితో తాదాత్మ్యం చెంది నప్పుడు మన సంకల్పాన్ని ఆయన సంకల్పంగా భావించగలం. ఆ భగవత్ శక్తి నుంచి విడిపోతే మనకు పరిమితమైన స్వేచ్ఛ మాత్రమే లభిస్తుంది.

**ప్రశ్న:** ఆధ్యాత్మిక అన్వేషకుడికి మనశ్శాంతి కొరవడుతుంది. ఎందువల్ల? మనశ్శాంతికి మార్గమేమిటి?

**జవాబు:** భగవద్గీత "ఒక వ్యక్తికి ఆత్మనిగ్రహం లేకుంటే, ధ్యానం చెయ్యలేడు. ధ్యానం చెయ్యలేనప్పుడు శాంతి లభించదు. శాంతి లేనప్పుడు ఆనందం ఎక్కడి నుండి వస్తుంది?" అంటుంది. అంటే మన ఇంద్రియాలను నియంత్రించగలిగి భగవంతుడి పట్ల తీవ్ర అభిలాష ఉన్నప్పుడే మన ఆధ్యాత్మిక సాధనలు సార్థకమవుతాయి. దైవం పట్ల తీవ్ర అభిలాష ఉంటే ఇంద్రియాలు నిస్సారంగా తోచి ఇంద్రియాల మీద ఆధిపత్యం వస్తుంది. అప్పుడు ఆధ్యాత్మిక సాధనలు చేసినట్లైతే శాంతికి మూలమైన పరమాత్మ యందు మనస్సు స్థిరంగా నిలచి ఉంటుంది. ఆధ్యాత్మిక సాధనలు యాంత్రికంగా మారినప్పుడు సాధకునికి మనశ్శాంతి లభించదు.

భగవద్గీత "త్యాగం వల్లనే శాంతి లభిస్తుంది" అని చెప్తుంది. ఇక్కడ పరిత్యజించమన్నది మనలోని అహాన్ని. ఈ అహాన్ని తొలగిస్తే మనలోనే నిక్షిప్తంగా ఉన్న ఆత్మానందాన్ని నిరంతరం పొందవచ్చు.



## పండుగలు - పర్వదినాలు

### ఏప్రిల్ - 2008

| | | | |
|---|---|---|---|
| 02 | బుధవారం | : | ఏకాదశి |
| 07 | సోమవారం | : | ఉగాది |
| 14 | సోమవారం | : | శ్రీరామ నవమి |
| 16 | బుధవారం | : | ఏకాదశి |

### మే- 2008

| | | | |
|---|---|---|---|
| 01 | గురువారం | : | ఏకాదశి |
| 08 | గురువారం | : | అక్షయ తృతీయ |
| 09 | శుక్రవారం | : | ఆది శంకరాచార్య జయంతి |
| 15 | గురువారం | : | ఏకాదశి |
| 20 | మంగళవారం | : | బుద్ధపూర్ణిమ |
| 30 | శుక్రవారం | : | శ్రీహనుమజ్జయంతి |
| 31 | శనివారం | : | ఏకాదశి |

# రామాయణ దర్శనం

- స్వామి గుణేశానంద

మానవుని జీవిత లక్ష్యం శాంతి సౌభాగ్యాలను పొందడమే! వాటిని సాధించే విధం చాలా సరళమైనది. శ్రీమద్రామాయణంలో శ్రీరాముడు చూపిన మార్గాన్ని అనుసరించాలి. రాముడు ప్రవచించింది ధర్మం. ఆయన జీవనసరళి ధర్మం. మూర్తీభవించిన ధర్మమే రాముడు. ధర్మం మాత్రమే భవబంధాల నుంచి విముక్తి కలిగిస్తుంది అని తెలియజేశారు. అజ్ఞానం నుంచి జ్ఞాన మార్గం వైపు మళ్ళించేది ధర్మం మాత్రమే. అన్నిటికీ మించి తండ్రీ – కొడుకులు, తల్లీ – బిడ్డలు, గురు–శిష్యులు, భార్యా–భర్తలు, అన్న–దమ్ములు, స్నేహితుల మధ్య ఉండే సంబంధాలకు తిరుగులేని ఉదాహరణ రామచరితం. ఉన్నత స్థితికి చేరుకోవాలంటే రామాయణమే కొలబద్ద లాంటిది.

రామాయణంలో ఏడు కాండలున్నాయి. ఒక్కొక్క కాండ రాముని భౌతిక చిహ్నాలకు ప్రతినిధులు. అవి

| | | |
|---|---|---|
| బాలకాండ | – | శ్రీరాముని పవిత్ర పాదాలు |
| అయోధ్యకాండ | – | శ్రీరాముని బాహువులు |
| అరణ్యకాండ | – | శ్రీరాముని ఉదరం |
| కిష్కింధకాండ | – | శ్రీరాముని హృదయం |
| సుందరకాండ | – | శ్రీరాముని మెడ |
| యుద్ధకాండ | – | శ్రీరాముని వదనం |
| ఉత్తరకాండ | – | శ్రీరాముని శిరస్సు |

**బాలకాండ:** పసిపిల్లల లాంటి నిర్మలమైన బుద్ధి ఎందుకుండాలో ఇది చెబుతుంది. పిల్లల బుద్ధి స్వచ్ఛమైనది, ప్రాపంచిక విషయ వాసనలు లేనిది; రాగద్వేషాలు లేనిది, లోభం, అసూయ, ద్వేషాలు అంటనివారు పసివారు. అలాంటి చోటే భగవంతుడు ఉంటాడు. మన హృదయం కూడా భగవంతుని ఆలయం కావాలంటే మనం స్వచ్ఛంగా ఉండాలి. పసివారిలో "అహం" అన్నదే ఉండదు. అహం ఉన్న చోట భగవంతుడు ఉండలేడు. మొట్టమొదటగా మనం చేయవలసింది దేహమే ఆత్మ అనే భ్రాంతి నుంచి బయటపడడం! భగవంతుడు పవిత్రమైన, అహంకారరహిత బుద్ధినే కోరుకుంటాడు. మనం కళ్ళ ద్వారానే అన్ని రకాల పాపకార్యాలూ చేస్తాం. కానీ పసివారి దృష్టి పవిత్రమైనది, అమాయకమైనది. సర్వేశ్వరుణ్ణి ప్రతి జీవిలోనూ దర్శించాలంటే మన నయనాలు బిడ్డల కళ్ళలా పవిత్రంగా అమాయకంగా ఉండాలి.



**అయోధ్యకాండ:** అయోధ్య అంటే ఘర్షణ లేని ప్రదేశం. అయోధ్య సరయూనది ఒడ్డున ఉంది. మన అంతఃకరణ రణరంగం కాకుండా చూసుకుంటూ, భక్తి అనే సరయూనది



ఒడ్డున నివసిస్తే మన జీవితాల నుంచి శత్రుత్వం అనే భావాన్ని నిర్మూలించవచ్చు. రామాయణంలో అయోధ్యకాండ తప్ప మిగతా అన్ని కాండలలో యుద్ధ ప్రస్తావన ఉంది. హృదయాలయంలో భగవంతుడు వసించాలంటే ఎవరితోనూ శత్రుత్వం వహించక, మన మనస్సు నుంచి వైరుధ్య భావాలను తొలగించాలి అని అయోధ్యకాండ చెబుతోంది.

అయోధ్యకాండలో ప్రజలందరూ సంతోషంతో ఉండేవారు; కారణం ఇతరుల సంతోషం కోసం వారు తమ సుఖాలను త్యజించేవారు. తమ్ముని బాగుకై రాముడు తన సామ్రాజ్యాన్ని వదిలి వనమార్గాన్ని పట్టాడు. భరతుడు కూడా అన్నీ త్యజించి ఆ సామ్రాజ్యం రామునిదే అని ప్రకటించి తాను ఆ సింహాసనం మీద కూర్చోనని చెప్పాడు. ఇతరుల కోసం మనం త్యాగం చేసిననాడే మనకు ఆనందం కలుగుతుంది అని ఈ

కాండ బోధిస్తుంది. మూర్తీభవించిన ధర్మమే రాముడు – లక్ష్మణుడు. వివేకానికి భరతుడు, వైరాగ్యానికి శత్రుఘ్నుడు – ఇలా సద్గుణాలకు ప్రతినిధులు. వివేక వైరాగ్యాలు (భరత, శత్రుఘ్నులు) మన దేహాన్ని(అయోధ్య)విడిచినప్పుడు, మన శరీరంలోని జీవుడు(దశరథుడు)కామ వశుడవుతాడు (కైకేయి).

**అరణ్యకాండ:** శ్రీరాముడు ధర్మాన్ని అనుసరించి తన యౌవనంలో అరణ్యానికి వెళ్ళాడు. పరిపూర్ణ వ్యక్తిత్వానికి మనో నియంత్రణ ఆవశ్యకత ఇక్కడ తెలుస్తుంది. ప్రాపంచిక



సుఖాలను అనుభవించడానికి పద్నాలుగు ఆవరణలు మనలో ఉంటాయి. అజ్ఞానం వల్ల మన బుద్ధిలో కోరికలు మొలకెత్తుతాయి. ఇంద్రియ సుఖమే నిజమైన ఆనందమని పొరబడతాం. మోహం వల్లే పాపాలు చేస్తాం. పాపానికి మూలం అజ్ఞానం. జ్ఞానంతో అజ్ఞానాన్నీ, కోరికలనూ జయించగలం. పద్నాలుగు సంవత్సరాలు శ్రీరాముడు అడవిలో నివసించి ఇంద్రియాల మీద నియంత్రణ సాధించగోరే సాధకునిలా బ్రతికాడు. గృహస్థుగా జీవిస్తూ శ్రీరాముడు ఆత్మనిగ్రహం అనేది ఎలా సాధించాలో చూపాడు. తపస్సు చేశాకే రాముడు రాజయ్యాడు.

శ్రీరామునిలాగే చిన్నతనం నుంచీ ఆధ్యాత్మిక జీవనం గడపాలి. ఏకాంత వాసం చేస్తూ బుద్ధి ద్వారా మన ఆలోచనల్ని గమనించాలి. యౌవనంలోనే స్వచ్ఛమైన, శక్తిమంతమైన మనస్సు ద్వారా కోరికలను అదుపు చేయవచ్చు. ఈ విధంగా ఈ కాండ చిన్నప్పటి నుంచీ ఆత్మనిగ్రహం ఎలా అలవరచుకోవాలో తెలియజేస్తుంది.

**కిష్కింధకాండ:** ఈ కాండలో శ్రీరాముడు సుగ్రీవునితో చెలిమి చేస్తాడు. సుగ్రీవుడు అంటే అందమైన మెడ కలవాడు అని అర్థం. ఆభరణాలను ధరించినంత మాత్రాన కంఠానికి అందం రాదు. భగవంతుని పవిత్రమైన నామాన్ని జపిస్తేనే కంఠం శోభాయమానంగా ఉంటుంది. శ్రీరామ నామాన్ని



కంఠంలో ధరించడం వల్లనే నీలకంఠుని మెడ ప్రకాశించింది. ఆ నామ బలం వల్లనే గరళకంఠుడు విషాన్ని సైతం జీర్ణించుకోగలుగుతాడు. సంసార దుఃఖాలను అధిగమించడానికి భగవన్నామాన్ని జపిస్తూ ఉండాలి. జీవుడు (సుగ్రీవుడు) భగవంతుణ్ణి స్మరిస్తే, అప్పుడు భగవంతుడు వచ్చి స్వయంగా మైత్రి చేస్తాడు. భగవదనుగ్రహం పొందిన వ్యక్తి ఆ తరువాత కోరికలనే లోకంలోకి మరి ప్రవేశించడు.

శ్రీరాముడు శబరిని సీతాదేవి జాడ అడిగినప్పుడు ఆమె చూపిన మార్గంలోనే ఋష్యమూక పర్వతాన్ని చేరి సుగ్రీవుణ్ణి కలుస్తాడు. సుగ్రీవుని కన్నా వాలి బలవంతుడనీ, పరాక్రమవంతుడనీ శ్రీరామునికి ముందే తెలుసు. సుగ్రీవుడు ఒంటరి అయినప్పటికీ సాధుశీలి, భగవంతుని పట్ల విశ్వాసం కలవాడు.

శరణాగతి కోరిన వారినీ, సజ్జన సాంగత్యం చేసే వారినీ భగవంతుడు తప్పక అనుగ్రహిస్తాడు. సుగ్రీవుడు మంచితనానికీ, ఋష్యమూక పర్వతం సత్సంగానికీ నిదర్శనం. శాపగ్రస్థుడైన వాలి ఋష్యమూకంపై అడుగుపెట్టలేడు. సజ్జన సాంగత్యంలో అహంకారి నిలువలేడు. అందువల్లనే శ్రీరాముడు సుగ్రీవునితో స్నేహం చేసి వాలిని వధించాడు.

**సుందరకాండ:** మిగతా కాండల కన్నా సుందరకాండ విలక్షణమైనది. ఈ పేరు ఈ కాండకు ఎలా నప్పుతుందన్నది నిగూఢమైనది. ఈ కాండకు ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ అనేక అర్థాలున్నాయి. ఇది వాల్మీకి సాహిత్య ప్రతిభకూ, కవితా చమత్కృతికీ పరాకాష్ఠ. అందువల్ల ఈ కాండ సుందరమైనది. సీత శోకాన్ని పోగొట్టినది కాబట్టి సుందరమైనది. సుందర అంటే దూత. ఈ కాండలోనే రాముడు సీతకి సందేశం పంపుతాడు. సుందర అంటే వానరం అనే అర్థం తీసుకుంటే ఇందులో ఆంజనేయుడు సాధించిన విజయ



పరంపరల వివరాలున్నాయి. పోయిన వస్తువును తిరిగి పొందడమే సుందర మనుకుంటే, అపహరించబడిన సీత జాడ తెలియడం సుందరం.

''పరుల కోసం జీవిస్తున్నవారే అమృత తుల్యులు'' అని అన్నారు స్వామి వివేకానంద. నిద్రపోయే ముందు "భగవంతుణ్ణి సంతోష పెట్టడానికి నేనివాళ ఏమైనా మంచి పని చేశానా" అని ప్రశ్నించుకోవాలి. "లేదు" అనే జవాబు వస్తే ఆ రోజు మృతుని కిందే లెక్క. తన కోసం, తన కుటుంబం కోసం జీవించేవాడు జీవిస్తున్నా నిజానికి జీవిస్తున్నట్లు కాదు. జంతువులు, పక్షులు కూడా ఈ రీతినే అనుసరిస్తాయి. ఇతరులకు సేవ చేయడమనే ఉన్నత ఆదర్శమే మానవ జీవిత గమ్యం.

హనుమంతుడు సముద్రాన్ని లంఘించి సీతామాతను దర్శించాడు. సీతాదేవి పరాభక్తికి ప్రతినిధి. పరాభక్తి ఉన్నచోట విచారానికి తావుండదు. అందువల్ల సీతాదేవి నివసించిన చోట శోకముండదు. కాబట్టి, అది అశోకవనం అంటారు. సీతా సాధ్విని ఎప్పుడు చూడగలం? సంసార సాగరాన్ని తరించినప్పుడే సీతామహాదేవిని దర్శించ గలం. సముద్రాన్ని దాటేటప్పుడు, ఆంజనేయుడు ఏ విధంగా కష్టాలను అధిగమించాడో అలాగే ప్రతి సాధకుడూ తన జీవితంలో ఎదురయ్యే కష్టాలను అధిగమించి, పరాభక్తిని సాధించాలి.

**యుద్ధకాండ:** ఇందులో శ్రీరామచంద్రునికీ రావణాసురునికీ యుద్ధం జరుగుతుంది. రాముడు పరమాత్మకు ప్రతీక. రావణుడు విషయ వాసనలకు ప్రతినిధి. శ్రీరాముని లాగ సద్గుణాలను అలవరచుకొన్న వారు కామం, దురాశ, ద్వేషం, మాత్సర్యం లాంటి దుర్గుణాలను సులువుగా జయించ గలుగుతారు. సీతామాత దర్శనభాగ్యం కలిగిన తర్వాత రావణుడు వధింపబడతాడు. అంటే పరాభక్తిని పొందిన తర్వాత క్షణిక సుఖాల వైపు మనసు వెళ్ళదు.

'వాసన' అంటే కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలనే ఆరు దుర్గుణాలు. రాముడు అంటే ఐశ్వర్యం.

**ఉత్తరకాండ:** యౌవనారంభం నుంచే ఆధ్యాత్మిక జీవనం సాగించేవారు మాత్రమే శాంతి– సౌభాగ్యాలతో విలసిల్లుతారు.



శ్రీరాముని జీవితంలో ద్వితీయార్థం ప్రశాంతంగా సాగింది. కారణం ఆయన ఆధ్యాత్మిక యాత్ర యౌవనం నుంచే ఆరంభించడం. ఎవరైతే చిన్ననాటి నుంచి ధర్మాన్ని అనుసరిస్తారో, వారికి వార్ధక్యం ప్రశాంతంగా, ఆనందంగా సాగుతుందని చెప్పబడింది.

**ఉపసంహారం:** మోక్షసాధనకు ఏడు సోపానాలున్నాయి. రామాయణంలో ఏడుకాండలున్నాయి. ముక్తిని ప్రసాదించడానికి ఒక్కొక్క కాండ ఒక్కొక్క ప్రత్యేకతను



సంతరించుకొంది. రామునిలోని విశిష్టత ఏమిటంటే, కార్యమంతా తానే నిర్వహించినప్పటికీ ఆ గౌరవాన్ని ఇతరులకే ఆపాదించి, తాను కర్తను అనే విషయాన్ని పట్టించుకునేవాడు కాదు. అలాగే మనం కూడా కర్తృత్వ భావన వీడి, మనం ఆ భగవంతుని చేతిలో ఉపకరణాలమన్న భావనతో దైనందిన కృత్యాలు నిర్వహించాలి. రామాయణం మనకు నైతిక విలువలనూ, విచక్షణజ్ఞానాన్నీ బోధిస్తుంది. మొత్తం మీద రామాయణం జీవిత నిర్వచనాన్ని అందిస్తూ, జీవితంలో ప్రతీ దశలో ఎలా మెలగాలో ప్రబోధిస్తుంది.

అందరూ అనుసరించ తగిన మార్గమే రామాయణం.

**అనువాదం : శ్రీమతి కమల కుమారి**



# మానసిక ఏకాగ్రతకు మార్గం

– స్వామి రంగనాథానంద

మనస్సు చంచలమైనది. స్వభావ సిద్ధంగా చంచలమైన మనస్సుకు బాహ్య పరిసరాలు కూడా తోడైతే అది ఆడించినట్లు ఆడడంతో జీవితం నిరర్థకమవుతుంది. నిద్ర లేచింది మొదలు పడుకొనే వరకూ ఆలోచనల పరంపర కొనసాగుతూనే ఉంటుంది. మానసిక ఏకాగ్రత లేనిదే ఏ పనీ చేయలేం.

చంచల స్వభావంగల మనస్సుతో ఏకాగ్రత సాధించడం సాధ్యమా? ఈ విషయమై వెనకటికి చంచల మనస్కులు కొందరు ఒక గురువును ఆశ్రయించారట. మానసిక ఏకాగ్రత చేకూరేందుకు మీకో మంత్రం ఉపదేశిస్తానని ఆ గురువర్యులు చెప్పారు. 'సాధ్యమా గురువుగారూ?' అంటే, 'అసాధ్యం ఏదీ లేదు' అన్నారట. అంతేకాదు ఆ మంత్రశక్తితో భగవంతుడి దర్శనం అవుతుందని కూడా చెప్పారు. మంత్రం తీసుకునేందుకు అందరూ సంసిద్ధులైన తరువాత నియమాలు చెప్పారు. మంత్రం తీసుకునేందుకు వచ్చే రోజు ఉదయం నిద్ర లేవగానే కోతి రూపం గుర్తుకు రాకూడదన్నది నియమం. అలా కోతి మనస్సులో కనిపిస్తే ఆ మంత్రం పనిచేయదని చెప్పారు.

ఏ రోజైతే అలా కోతి రూపం మనస్సుకు గోచరించదో ఆ రోజు మంత్రం తీసుకునేందుకు రమ్మని సెలవిచ్చారా గురువు. ఇంకేముంది ఆ రోజు నుంచి నిద్ర లేవగానే వారికి కోతి రూపమే దర్శనమిచ్చేది. ఒకవేళ ఉదయం నిద్ర లేవగానే గుర్తుకురాకపోయినా గురువుగారు గుర్తొస్తే చాలు, కోతి రూపం మదిలోకి వచ్చేదట. మనస్సు తత్వం ఇలా ఉంటుంది. ఏదైతే వద్దనుకుంటామో అదే తరచూ గుర్తుకు వచ్చే కోతి లక్షణం మనస్సుదని మనస్సు లోతులు తెలిసిన గురువుగారంటారు. ఏదైతే వద్దనుకుంటామో మనకు తెలియకుండానే అదే విషయాన్ని స్మరిస్తూ ఉంటాం. నిగ్రహించుకుందామంటే కుదిరేది కాదు.

చంచల స్వభావంగల మనస్సు సామాన్యులనే కాదు, మహాత్ములను కూడా ఇబ్బందులకు గురిచేస్తుంది. ఈ విషయమై అర్జునుడు, శ్రీకృష్ణుణ్ణి "మనస్సు చంచల స్వభావం కలది, బలమైనది కూడా. దానిని నిగ్రహించడం గాలిని పట్టుకోవడం లాంటిది. ఈ పరిస్థితుల్లో దానిని అదుపుచేయడం ఎలా" అని అడిగాడు. అందుకు పరమాత్ముడు "నీవు చెప్పినదంతా నిజమే అర్జునా! మనస్సు స్వభావం అవిశ్రాంతమనేది యథార్థం. మనస్సును అదుపు చెయ్యడం అంత సులభం కాదు. అలా అని అసాధ్యం కూడా కాదు. అభ్యాస, వైరాగ్యాల్ని పెంపొందించుకుంటే మనస్సును నియంత్రించవచ్చు" అని వివరించాడు.

మనోనిశ్చలత అనే సమస్య కొత్త విషయమేమీ కాదు. భూమిపైనున్న ప్రతి ప్రాణీ, వస్తువూ ఒక ప్రత్యేకమైన స్వభావం కలిగి ఉంటుంది. వీచడం గాలి స్వభావం. దహించడం అగ్ని స్వభావం. ప్రవహించడం నీటి స్వభావం. అదే విధంగా ప్రతి దానిలోనూ తలదూర్చడం, చెడు లక్షణాల్ని ఆకర్షించడం మనసు స్వభావం. ఇక్కడే పంచేంద్రియాల పాత్ర ముందుకు వస్తుంది. కళ్ళు, ముక్కు, చెవులు, నాలుక, చర్మం అనేవి మన మనోశకటానికి చక్రాల లాంటివి. అందమైన వస్తువు మన కంట పడగానే మనకు కావాలనే కోరిక పుడుతుంది. కోరికలు గుణ్ఠాలైతే



మనస్సులో సంచలనం ప్రారంభమవుతుంది. మనస్సు సంచలనానికి అసలు కారణం కోరికలు. ఆధ్యాత్మిక చింతనతోనే మనసును నియంత్రించడం సాధ్యం.

మన మనస్సుకు గొప్ప శక్తి ఉంది. దానిని ఏకీకృతం చేయడం ద్వారా అద్భుతాలను ఆవిష్కరించగలం. సూర్యకిరణాలను ఒక కుంభాకార కటకం గుండా ఒక కాగితంపై పడేలా చేస్తే నిప్పు పుడుతుంది. ఆ కిరణాలకు అంత శక్తి ఎలా వచ్చిందంటే కిరణాలను ఏకీకృతం చేయడం వల్ల! ఈ రహస్యాన్ని మనం గుర్తించాలి. మన మనశ్శక్తినంతా ఒకే విషయంపై కేంద్రీకరించగలిగితే మనం ఆశించిన రంగంలో అత్యున్నత ఫలితాల్ని సాధించవచ్చు. కాబట్టి మన మనశ్శక్తిని ఉన్నత స్థాయిలో సద్వినియోగ పరచడానికి ప్రయత్నించాలి.

**సేకరణ: ఆర్. కృష్ణ**




– స్వామి పరిజ్ఞేయానంద

**కె. హాజీగౌసు, తాడిపత్రి; ఎన్. రాజేష్, హైదరాబాద్**

**ప్రశ్న:** నేను శారీరకంగా, మానసికంగా బలహీనుడననే భావన మనసులో దృఢంగా నాటుకుపోయింది. ఏ పని చేయాలన్నా ఆసక్తి కలగడం లేదు. నేను నా జీవిత లక్ష్యాన్ని సాధించాలంటే ఏం చేయాలి?

**జవాబు:** “అనంతశక్తి మీలోనే ఉంది. మీరు గొఱ్ఱెలు కాదు సింహాలు” అంటూ స్వామి వివేకానంద మనల్ని మేల్కొల్పారు. జీవితంలో ఏం సాధించాలన్నా ఒక నిర్దిష్ట లక్ష్యాన్ని ఏర్పరచుకోవాలి. ఆ లక్ష్యసాధనా సిద్ధికి కృషితో పాటు దృఢ సంకల్పాన్ని జోడించి ప్రయత్నించాలి. ‘కృషి ఉంటే మనుషులు ఋషులవుతారు, మహాపురుషులవుతారు’ అన్నారు ఓ కవి.

Great men are not born great. God gives troubles to make them great.

ఒక యువకుడు భగవంతుణ్ణి ‘ఓ భగవంతుడా! నాకు ఓ మంచి ఉద్యోగం, పెద్ద భవనం, ఏ.సి. కారు ప్రసాదిస్తే నేను జీవితాన్ని ఆనందంగా అనుభవిస్తాను’ అని ప్రార్థించాడు. అందుకు భగవంతుడు ‘నాయనా! కావల్సినవన్నీ సంపాదించి అనుభవించడానికే నేను నీకు ఈ జీవితాన్ని ప్రసాదించాను’ అని బదులిచ్చాడు. కాబట్టి, భగవంతుడు మనకిచ్చిన ఈ మానవ జన్మను సద్వినియోగ పరచుకొని జీవిత గమ్యాన్ని చేరడానికి ప్రయత్నించాలి. అంతేగాని నేను బలహీనుణ్ణి అని కూర్చుంటే మనల్ని ఆ దేవుడైనా మార్చలేడు.

Whatever you think, that you will be. If you think yourselves weak, weak you will be; if you think yourselves strong, strong you will be. - *Swami Vivekananda*

**కె. పృథ్వీరాజు, కర్నూలు**

**ప్రశ్న:** ఏకసంథాగ్రాహులం కావాలంటే ఏం చేయాలి?

**జవాబు:** స్వామి వివేకానంద ఒక్కసారి చదివిందేదైనా యథాతథంగా చెప్పగలిగేవారు. ఆయన ఒకేసారి చదివిన డికెన్స్ 'Pickwick Papers' నుండి చదివిన విషయాన్ని అనర్గళంగా వల్లించారు. స్వామీజీ యొక్క ఈ అద్భుత జ్ఞాపకశక్తిని గమనించిన అతని శిష్యుడు హరిపాదమిత్ర ‘స్వామీజీ మీరు ఒకేసారి చదివిన దాన్ని యథాతథంగా ఎలా చెప్పగలిగారు? మీ ఈ జ్ఞాపకశక్తి రహస్యమేమిటి?’ అని ప్రశ్నించాడు. అందుకు స్వామీజీ ‘మనోనిగ్రహం (బ్రహ్మచర్యం). మనోనిగ్రహాన్ని అలవరుచుకుంటే మనం అనుకున్నది ఏదైనా సాధించవచ్చు’అని బదులిచ్చారు.

ఆధునిక యుగం ఆకర్షణలమయంగా మారింది కాబట్టి ‘మనోనిగ్రహం’ అనే మాట వింటేనే హేళన చేసే స్థితికి దిగజారింది నేటి తరం. జాతీయ యువజన దినోత్సవం సందర్భంగా ఒక టీ.వీ. ఛానల్ వారు ‘యువతరానికి స్వామి వివేకానంద సందేశం’పై ఒక కార్యక్రమాన్ని నిర్వహించారు. ఆ కార్యక్రమంలో ‘మనోనిగ్రహం లేకపోవడం వల్లనే నేటి యువతరం పెడదారులు పడుతోంది కాబట్టి మనోనిగ్రహం అలవరుచుకోవడం ముఖ్యం’ అని ఒక స్వామీజీ సందేశమిచ్చారు. ఆ కార్యక్రమంలో పాల్గొన్న యువతరం ‘ఈ జీవితం అనుభవించడానికి కానీ, మనోనిగ్రహం అంటూ వృథా చేయడానికి కాదు’ అని పరిహాసం చేశారు. నేటి యువతరంలో ‘మనోనిగ్రహం’ అంటే సరైన అవగాహన లేదని దీన్నిబట్టి అర్థమవుతోంది.

You are the creator of your own destiny

మన దేశ పతనావస్థకు మూల కారణం పాశ్చాత్య పోకడలను అనుసరిస్తూ మనో నిగ్రహాన్ని కోల్పోవడమే అని స్వామి వివేకానంద ఉద్ఘాటించారు.

... by the observance of strict *Brahmacharya* (continence) all learning can be mastered in a very short time... It is owing to this want of continence that everything is on the brink of ruin in our country. - *Swami Vivekananda*

**‘కళ్ళు వెళ్ళిన ప్రతిచోటికీ మనసు వెళ్ళకూడదు. మనసు వెళ్ళిన ప్రతిచోటికీ మనిషి వెళ్ళకూడదు’** అని ఒక మహాత్ముని సందేశం. ఈ సందేశాన్ని ఆచరణాత్మకం చేయగలిగితే ‘మనోనిగ్రహం’ సాధ్యం. a

మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా:

**యువవాణి**

శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,
దోమల్ గూడ, హైదరాబాద్ – 500 029
E- mail : rkprabhayuvavani@gmail.com

యువవాహిని

## మనసు - మర్మం

- శ్రీరామ్

# ధ్యానానికి మరోరూపం దానం

ఆధ్యాత్మిక జీవితం అంటే కోల్పోవడం. ఇక పోగొట్టుకోవడానికంటూ ఏమీ లేనంతవరకు అన్నింటినీ వదిలివేయడం. "కోల్పోవడం అలవరచుకోండి. లేకపోతే ప్రకృతే మీ మెడలు వంచి, సర్వస్వాన్ని సంగ్రహిస్తుంది. కాబట్టి ముందునుండే మనస్ఫూర్తిగా ఇవ్వడం నేర్చుకోండి" అని స్వామి వివేకానంద హెచ్చరిస్తారు.

మనలో గూడుకట్టుకొనే అశాంతికి మూలకారణం మన ఆశే! అంతులేని ఈ ఆశ మనల్ని అల్లకల్లోలపరిచి, అష్టకష్టాలు పెడుతుంది. కానీ దీనికి పూర్తి విరుద్ధమైంది- ధ్యానసిద్ధులైన వారి స్థితి. వారందరికీ నిరాశ సహజ స్వభావమైపోతుంది. వారి మనసునుండి 'నాది' అనే భావన తుడిచిపెట్టుకు పోతుంది. వారు లేనిదాన్ని ఆశించరు, ఉన్న వాటిపై 'మమ'కారానికి చోటివ్వరు. రేపటి చింతే వారి దరిచేరదు. నిన్నటి బెంగ వారి స్మృతి పథంలో నిలవదు. వారికి ఉన్నదంతా ఈ క్షణమే! ఆశ అంతుచూసిన వారు అందుకునే అత్యున్నత మనఃస్థితి అది.

అష్టైశ్వర్యాలున్నా, ఆర్తుల్ని ఆదుకొనే లక్షణం లేని వారి జీవితం వేదానాభరితంగానే ఉంటుంది. మనస్తత్వ వేత్తలు ఈ విషయాన్ని నొక్కి వాక్కాణిస్తారు.

ధ్యానంలో మనసును అన్ని వస్తువుల నుండి ఉపసంహరించాలి. కానీ ఎంతో మందికి ఇలాంటి మానసిక వైరాగ్యం అలవడేముందుగా ఆ వస్తువుల ఎడబాటును అనుభవించాలి. దీన్నే బాహ్య వైరాగ్యం అంటారు. ఈ సాధనను చిరకాలం అనుష్ఠించిన వారికే మనో నిశ్చలత్వం లభిస్తుంది.

అందుకే దానం, ఆధ్యాత్మిక అభివృద్ధికి దోహదం చేస్తూ మనతో పాటు మన చుట్టూ ఉండేవారికి కూడా ఆనందాన్ని ప్రసాదిస్తుందని అర్థమవుతుంది.

వ్యక్తులు నాలుగు విధాలుగా ఉంటారు. హింసించి ఆనందించేవారు, లాభసాటిగా ఉన్నప్పుడే సహాయం చేసేవారు. కొద్దిగా కష్టాన్ని భరించి అయినా ఇతరులకు మేలు చేసేవారు, సర్వస్వాన్ని పరహితానికే ధారపోసేవారు. వరుసగా రాక్షసులు, మానవులు, మంచివారు, మహాత్ములు అని వారిని వర్గీకరించవచ్చు. మన వ్యక్తిత్వం ఏ స్థాయిలో ఉందో నిష్పక్షపాతంగా అంచనావేసుకోవాలి. అప్పుడే మనో వికాసానికి మన ముందున్న మార్గమేమిటో తెలుస్తుంది.

స్వామి వివేకానంద ఈ సందర్భంలో కొన్ని ఆసక్తికరమైన విషయాలను వివరిస్తారు. మనసును బలాత్కరించైనా, నీకు ఏమాత్రం ఇష్టం లేకపోయినా, ఇతరులకు ఎంతో కొంత మంచిచేయి. ఆ ప్రయత్నాన్ని కొనసాగిస్తే, నీ మనసుకు శాంతి లభిస్తుంది.





# మనసు-జీవితం

– షేక్ గౌస్ సాహెబ్

మనిషి మనస్సు అద్దం లాంటిది. మానవ జీవితాన్ని మలుపు తిప్పేది మనసు. కోపతాపాలు, రాగద్వేషాలు విడనాడి మంచి మనసుతో మృదుభాషణం, సద్భావన, సత్ప్రవర్తనతో అందర్నీ ఆకట్టుకోవాలి.

ఓర్పు, నేర్పు, దీక్ష, దక్షతలతో, సహనశీలి అయి జీవించాలి. "ధర్మో రక్షతి రక్షితః" సర్వ కాలసర్వావస్థలలో ధర్మాన్ని రక్షిస్తే అది మనల్ని కాపాడుతుంది అనే భావన మనసులో నిరంతరం మెదలాలి.

మానవుడు తన మేధకు పదునుపెట్టి, ధన,బల,కాలాల్ని సద్వినియోగపరచుకొంటే శాంతి, ప్రగతి, ఊర్ధ్వగతి పొందుతాడు. దుర్వినియోగం ద్వారా అధోగతి పాలవుతాడు.

మానవుని విచక్షణా రహిత చర్యల వల్ల అతని మనసు కాలుష్యమై లక్ష్యాన్నీ, గమ్యాన్నీ చేరలేక పోతుంది. క్షణ క్షణం వేగంగా మారుతున్న నేటి ప్రపంచంలో మంచి మనసున్న మానవుడు వినోదం కన్నా విజ్ఞానానికి ఎక్కువ ప్రాముఖ్యమిచ్చి ఆత్మ శక్తినీ, ఆత్మ గౌరవాన్నీ వృద్ధి చేసుకొని జీవితధ్యేయాన్ని సాధించాలి. సమాజంలో తిరుగులేని స్థానం పొంది కీలక పాత్ర వహించాలి. మంచి మనసున్న మానవుడు నిర్వీర్యమవడు. మన సంస్కృతిని మరువడు.

మంచి మనసున్న మానవుడు క్రమశిక్షణతో జీవనం సాగిస్తాడు. చిత్తశుద్ధి, స్థిరబుద్ధి, సచ్ఛీలాలతో జీవనం గడుపుతాడు. నీతికి సమాధి కట్టక, అధికార దాహాలకు దాసుడు కాక, అక్రమ సంపాదనకు గురి కాక, అవినీతిని దరిదాపులకు రానీయక సత్కార్యాలలో అండదండగా ఉంటాడు.

మన అధీనంలో ఉన్న మనసు మనకు మిత్రునిలా ఎల్లప్పుడూ శ్రేయస్సునే కలుగజేస్తుంది. అలా కాకుండా మనం మనసు ఆధీనంలో ఉంటే మన జీవితం అధోగతి పాలవుతుంది. కాబట్టి జీవితోన్నతికి 'మనసు' పోషించే పాత్ర అత్యంత ముఖ్యమైంది.

# యువత నడత

– స్వామి వినిశ్చలానంద

ఉత్సాహంతో ఉరకలేస్తున్న యువశక్తి ముందు ఏ శక్తి అయినా బలాదూరే. అయితే ఆనకట్ట కట్టని నది నీరు నిరుపయోగంగా సముద్రంలో కలిసి పోతున్నట్లే, అడ్డూ అదుపూ లేని యువశక్తి కూడా నిర్వీర్యమై నిరుపయోగమవుతోంది.

క్షణిక సుఖాలకై అర్రులు చాస్తూ ఆశా మోహాలలో అలమటిస్తూ నిగ్రహశక్తిని కోల్పోతున్న నేటి యువతరం వల్ల దేశానికి కలగబోయే అనర్థాలను తలచుకుంటే భయం వేయకమానదు. బంగారు భవిష్యత్తును బండబారుస్తున్న చౌకబారు సాహిత్యాలు, టీవీ, ఇంటర్‌నెట్ లాంటి మాధ్యమాలు యువతరాన్ని ఎన్నిరకాలుగా పెడదారులు పట్టిస్తున్నాయో తలచుకుంటే ఒళ్ళు గగుర్పొడుస్తుంది.

సరైన అవగాహన, వివేక సంపద కలిగితే గానీ మనల్ని మనం కాపాడుకోలేం. ఓ యువతా! ఇప్పటికైనా నిజాన్ని గ్రహించండి. యథార్థంపై దృష్టి నిల్పి మీలోని దైవీ సంపదను అర్థం చేసుకోండి!

ఆదర్శరహితమైన జీవితం చుక్కాని లేని నావ లాంటిది. పునాదులు బలంగా ఉంటేనే భవనం పదికాలాలపాటు నిలుస్తుంది. ఏ మహాత్ముని బాల్యాన్ని పరిశీలించినా వారి పసితనం పసిడి ఆలోచనలతో నిండి నిబిడీకృతమయ్యుండేది. ఆ నాటి ఆ భావాలే వారిని మిగతావారికి ఆదర్శంగా నిలబెట్టాయి. అలాంటి మహాత్ముల జీవితాలను చదవడం ద్వారా మన ప్రవర్తనలో తప్పక పరివర్తన కలుగుతుంది. మనసుకు ఆరోగ్యదాయకమైన ఆలోచనలు చాలా అవసరం. సమయపాలన, జీవితలక్ష్యం, నిదానం లాంటి విషయాలలో శ్రద్ధాసక్తులు పెంచుకోవాలి. దుష్ట సహవాసం మానడమే గాక దుష్ప్రభావం చూపే ఇతర మాధ్యమాలకు ఎంత దూరంగా ఉంటే అంత ప్రయోజనం చేకూరుతుంది.

మహనీయుల జీవితాల్లో
## మధురఘట్టాలు
– జి. సతీష్

## అమ్మ మాటే ఆయన వేదం



బాలగంగాధర తిలక్‌కు సుమారు ఆరు సంవత్సరాల వయస్సు ఉంటుంది. తిలక్ తల్లి ఆ చిన్నపిల్లవాడికి ఎప్పుడూ నీతికథలు, రామాయణ భారత భాగవతాల నుండి చిన్న చిన్న కథలూ చెప్పేవారు. అలాంటి సందర్భంలో ఒకసారి 'నాయనా! మనం ఇతరులకు ఇచ్చిన ఏ వస్తువునూ తిరిగి తీసుకోకూడదు' అని చెప్పారు. ఆ రోజుల్లో స్త్రీలు చిన్న చిన్న నగలను బియ్యం డబ్బాల్లో, పోపు డబ్బాల్లో దాచేవారు.

ఒక రోజు ఒక సాధువు వారి ఇంటి ముందుకు వచ్చి "భవతీ భిక్షాం దేహి" అని పిలిచారు. ఆ తల్లి అలవాటు ప్రకారం ఒక పంచపాత్రలో బియ్యం తీసుకువచ్చి ఆ సాధువు జోలెలో పోస్తోంది. ఆ సమయంలో బాలగంగాధరుడు తల్లితో అక్కడే ఉన్నాడు. సాధువు జోలెలో ఆమె బియ్యం పోస్తున్నపుడు బియ్యంతో పాటు ఒక బంగారు ఉంగరం కూడా ఆ సాధువు జోలెలో పడడం ఆమె గమనించింది. అప్రయత్నంగానే ఆమె చెయ్యి ఆ ఉంగరం తీసుకోవాలని సాధువు జోలెలోకి వెళ్ళింది.

చిన్న బాలుడైన తిలక్ వెంటనే తన తల్లి రెండు కాళ్ళనూ గట్టిగా చుట్టుకొని, "అమ్మా!.. వద్దమ్మా ... నీవే కదా ఒకరికి ఇచ్చిన వస్తువును తిరిగి తీసుకోకూడదని చెప్పావు..." అనడంతో ఆ మాటకు ఆమె చలించిపోయింది. ఎంతో సిగ్గుతో చేతిని వెంటనే బయటకు తీసి లజ్జాక్రాంతయై ప్రేమానందాతిశయంతో కళ్ళు చెమ్మగిల్లగా గద్గద స్వరంతో ఆ బాలుణ్ణి హృదయానికి హత్తుకొని నిండు మనస్సుతో "నాయనా! నీవు భవిష్యత్తులో చాలా గొప్పవాడివవుతావు" అని దీవించింది. ఆ తల్లి దీవెనయే బాలగంగాధరుని లోకమాన్యునిగా మార్చింది అనడంలో ఏ మాత్రమూ సందేహం లేదు.

## సత్యనిష్ఠ



ఉపాధ్యాయుడు పిల్లలకు హోంవర్క్‌గా కొన్ని లెక్కలు ఇచ్చి చేసుకొని రమ్మని చెప్పాడు. మరునాడు ఉపాధ్యాయుడు ఆ లెక్కలు చూశాడు. గోపాల్ చేసిన లెక్కలన్నీ సరిగానే ఉన్నాయి. ఉపాధ్యాయుడు గోపాల్‌ను మెచ్చుకున్నాడు. అతని వీపు మీద చేయి వేసి నిమిరాడు. గోపాల్‌కు కళ్ళలో నీళ్ళు తిరిగాయి. అతడు ఏడవసాగాడు. గోపాల్‌ని కారణం అడిగితే 'ఒక లెక్క మాత్రం నా స్నేహితుని సహాయంతో చేశాను'అని చెప్పాడు. ఉపాధ్యాయుడు బాల గోపాల్ సత్యనిష్ఠకు ఎంతో సంతోషించాడు.

తరువాత కాలంలో అతడే గొప్ప దేశభక్తుడైనాడు. గోపాలకృష్ణ గోఖలేగా గణతికెక్కాడు. మహాత్మాగాంధీకి రాజకీయ గురువు ఆయనే.

## పట్టుదల



జర్మనీలోని ఒక విద్యాలయంలో చదువుతున్న ఓ బాలునికి ఉపాధ్యాయుడు గణితం వివరించలేక విసిగిపోయేవాడు. గణితంలోని చిన్న చిన్న ప్రశ్నలు కూడా ఆ బాలుడికి అర్థం కావడం లేదు. ఒక్కోసారి బాలుడికి దెబ్బలు కూడా పడేవి. అందరూ అతణ్ణి మొద్దబ్బాయి అనేవారు. ఒకనాడు గణితశాస్త్రంలోని ఒక ప్రశ్న ఎన్నిసార్లు బోధించినా ఆ బాలునికి రాలేదు. ఉపాధ్యాయుడు ఆ బాలుణ్ణి దండించి ఇలా అన్నాడు–'భగవంతుడు నీకు మెదడు లేకుండా చేశాడు'. దాంతో ఆ పసిమనసు చాలా బాధపడింది. అతడు బడి వదలి వెళ్ళిపోయాడు. అప్పటి నుండీ పట్టుదలతో అతడు స్వయంగా చదువు కోవడం మొదలుపెట్టాడు. కొంతకాలానికి అతను ఎన్నో పుస్తకాలు అధ్యయనం చేశాడు. భౌతికశాస్త్రంలో నూతన సిద్ధాంతాలను కనిపెట్టాడు. ఆ బాలుడే ఐన్‌స్టీన్. ప్రపంచ ప్రసిద్ధ శాస్త్రవేత్త.



# మాటే మంత్రము

- బి. సైదులు

**మానవ సంబంధాలలో 'మాటల' ప్రభావం మహత్తరమైనది. దౌత్యం నుంచి దాంపత్యం వరకు ఎక్కడైనా నాలుగు మంచిమాటలే మధుర ఫలితాలనిస్తాయి. అందుకే సంత్ కబీర్ అంటారు 'అయిసీ వాణీ బోలియే మన్ కా ఆపా ఖోయ్... ఔరోంకో శీతల్ కరే, అప్ నో హీ శీతల్ హోయ్... మనసులోని అహాన్నంతా విడిచి మాట్లాడాలి... పలికే ప్రతి పలుకూ పరులకు ఆనందాన్ని పంచాలి.... మన మనసునూ ఆహ్లాదపరచాలి.**

మాట విలువ తెలుసుకొని మసలు కోవడమే విజ్ఞత. ఆలోచించక దశరథుడు ఇచ్చిన 'మాట' రాముడిని అడవులకు పంపింది. అహంతో పాండవులకు అయిదూళ్లయినా ఇవ్వనన్న దుర్యోధనుడి 'మాట' మహాభారత యుద్ధానికి దారితీసింది. అందుకే పలుకును సద్వినియోగం చేసుకోవాలి. ప్రకృతిలో ఏ ప్రాణికీ లేని 'పలుకుల' వరాన్ని పరమాత్మ మనిషికే ప్రసాదించాడు. కాని మనం చాలా సార్లు మాటల్ని తూటాలుగా ప్రయోగిస్తున్నాం, పరుషవాక్కులతో ఎదుటివారి గుండెల్ని గాయపరుస్తున్నాం. శారీరకమైన గాయాల కన్నా సున్నితమైన మనసుకయ్యే గాయం కలకాలం బాధిస్తుంది. శ్రీరాముడి నుంచి శ్రీకృష్ణుడి వరకు మృదుభాషిత్వంతోను మహనీయులుగా మన మనసుల్లో మిగిలిపోయారు. వారు మితభాషులు, హితభాషులు, స్మితభాషులు. సుమధురంగా మాట్లాడటం వ్యాపారవ్యవహారాలకే కాదు వ్యక్తిగత అనుబంధాలకూ అత్యంత ఆవశ్యకమే. అందుకే మనం మాట్లాడితే ఎదుటివారి మనసులో మల్లెలు పూయాలి....

### పలుకే 'బంగారం'....

అనుద్వేగకరం వాక్యం... సత్యం ప్రియహితం... అంటాడు భగవద్గీతలో దేవదేవుడు. ఎంతటి ఉద్వేగపరిస్థితుల్లో కూడా కఠినంగా, కర్కశంగా మాట్లాడకూడదన్న ఆదర్శాన్ని ఆచరించి చూపాడు ఆ భగవానుడు. ఎన్నో సందర్భాల్లో కౌరవులు పరుష వాక్కులతో నిందలపాలు చేశారు, ఆయన సంయమనాన్ని, సహనాన్ని పరీక్షించారు. కానీ ఎక్కడా అచ్యుతుడు ఆవేశానికి లోనుకాలేదు. పరుష పదజాలానికి కూడా పలుకుల బంగారంతో సమాధానమిచ్చాడు. జగదోద్ధారకుడిగా నిలిచాడు. ఆధునిక సమాజానికి కూడా అనుసరణీయ ధర్మమది. మనం ఎంత మృదువుగా సంభాషిస్తే, అంత మధురంగా ఎదుటివారి మనసులో శాశ్వతంగా చోటు సంపాదించగలం. కోపతాపాలు, కఠోర భాషణలు మనను అందరి నుంచీ దూరం చేస్తాయి.

### అతిభాషా మతిహాని....

అతిభాషా మతిహాని... మితభాషా అతిహాయి.'అతిగా మాట్లాడేవారు జ్ఞానశూన్యులు. అలాంటి వారు గొప్పవారైన దాఖలాలు ఈ ప్రపంచంలో లేవు' అంటారు మహాత్మాగాంధీ. ఎంత మితంగా మాట్లాడితే అంత గౌరవం దక్కుతుంది. మనను మనం తెరచిన పుస్తకంలా పరచిచూపటం మూర్ఖత్వం. ఆలోచనలు పరిణతిని సాధిస్తున్న కొద్దీ పలుకుల ఒరవడి తగ్గిపోతుంది. వాక్కు విలువ తెలుస్తుంది. అందుకే మేధావులు, జ్ఞానులు వాక్శుద్ధి తెలిసి, మితంగా మాట్లాడతారు. ఎప్పుడయితే మనపై మనకు విశ్వాసం సన్నగిల్లుతుందో అప్పుడు నోటికి పని చెప్పడం ప్రారంభిస్తాం. మన మాటలు వినేవారి కోసం వెతుకులాడడం మొదలుపెడతాం. economy of thoughts, and economy of words అవసరం అంటారు ఓ ప్రముఖ రచయిత.

### మనసులోంచే మాట...

మనసు ఎంత నిర్మలంగా ఉంటే మాటల్లో అంత పవిత్రత తొణికిసలాడుతుంది. పురాణ, ఇతిహాసాలలోని మహనీయుల ఆశీర్వచనాలు అందుకే అంత మహిమాన్వితం. నిరంతరం అంతరంగాన్ని సదాలోచనలతో, సామరస్య భావనలతో పునీతం చేసుకుంటే మన మాటలు కూడా అంత అద్భుతంగా, ఆత్మీయంగా అలరిస్తాయి. రమణమహర్షిలాంటి మహాత్ముల మౌనం కూడా మహిమాన్వితమైన సంభాషణలాగే ఉంటుంది. కానీ కపటత్వం నిండిన మనసు ఎంత తీయగా పలకరించినా

అది పయోముఖ విషకుంభంలాగే కనిపిస్తుంది. అందుకే తప్పనిసరి పరిస్థితుల్లో కోపం గొంతులోంచి రావాలి... ప్రేమ మాత్రం మనసులోంచి పొంగాలి.

**వినదగునెవ్వరు చెప్పిన....**

ఈ ప్రపంచంలో వక్తలకు కొదువ లేదు; శ్రోతలకే కొదువ. అందుకే 'వినదగునెవ్వరు చెప్పిన' అంటోంది సుమతీ శతకం. ముందు మంచిశ్రోతగా ఉంటూ, వినటం అలవాటు చేసుకోవాలి. ఎదుటివారి మాటల్ని ఆలకిస్తున్నంత వరకూ మనం న్యాయమూర్తుల స్థానంలో ఉన్నట్లు, ఎప్పుడయితే మనం మాట్లాడటం ప్రారంభిస్తామో, అప్పుడు ఎదుటివారికి మనను అంచనా వేసే అవకాశాన్ని ఇస్తున్నట్లే! ఏది ఎవరి దగ్గర, ఎలా ప్రస్తావించాలో తెలుసుకోవటమే వివేకం. రామాయణంలో ఆ అద్భుతకళతోనే ఆంజనేయుడు శ్రీరామచంద్రుడిని కూడా ఆకట్టుకోగలిగాడు. సీతమ్మ జాడ కనుగొనే మహత్తర బాధ్యతను సఫలీకృతం చేశాడు. ఆ మారుతి మాటతీరును తరచూ మెచ్చుకునేవాడు దశరథనందనుడు.

**అహం లేనిదే అద్భుతభాషణ...**

**"స్వీయం యశః పౌరుషం చ గుప్తయే కథితం చ యత్,**
**కృతం యదుపకారాయ ధర్మజ్ఞో న ప్రకాశయేత్"**

... తన ప్రఖ్యాతిని గురించి నలుగురి ముందూ సంభాషించకూడదు. తన పేరును తానే మోగించుకోవటం కాని, తన శక్తులను తానే కొనియాడుకోవటం కాని తగదు. ముఖ్యంగా రహస్యంగా తనకు తెలిసిన విషయాలను మరొకరికి చేరవేయటం సుగుణం కాదు... అన్న ఈ మహానిర్వాణ తంత్రంలోని శ్లోకాన్ని స్వామి వివేకానంద తరచూ ఉటంకించేవారు. ప్రస్తుత సమాజంలో కూడా ఇలాంటి వ్యవహార జ్ఞానం లోపించటం వల్లే మానవసంబంధాలు దెబ్బతింటున్నాయి. అధమమైన వ్యక్తులు తమ సంభాషణలో మూడో వ్యక్తి గురించి మాట్లాడుకుంటారు, సాధారణ వ్యక్తులు తమ ఘనత గురించి తామే గొప్పలు చెప్పుకుంటారు, సద్గుణసంపన్నులు మహోన్నత ఆశయాలను, విషయాలను చర్చించుకుంటారు. మన మాటల్లో 'నేను' అన్న మాట ఎంత తక్కువ వినియోగిస్తే మన సంభాషణ పరులకు అంత ఆసక్తికరంగా ఉంటుంది.

**ఆత్మసంభాషణా ఆవశ్యకం....**

అన్ని సంభాషణల్లో ఆత్మసంభాషణ అత్యంత అవసరం. అంటే మనతో మనం మాట్లాడుకోవడం చాలా ముఖ్యం. "మాటలతో మీ శక్తిని వృథా చేసుకోకండి. మౌనంగా ధ్యానం చేస్తూ మిమ్మల్ని మీరు ఒక శక్తిజనక యంత్రంగా మార్చుకోండి" అంటారు స్వామి వివేకానంద. సంగీతం, సాహిత్యం వంటి అభిరుచులు మనల్ని మనతో సంభాషించుకునేట్లు చేస్తాయి. ఫలితంగా అంతరంగం అతిపవిత్రమై మన నుంచి మంచిమాటలే వెలువడతాయి. నిలబడి నీళ్ళు తాగే కన్నా పరుగెత్తయినా పాలే తాగుదామనుకుంటున్న ఆధునిక ప్రపంచంలో ఇలా మనతో మనం సంభాషించుకోవటం ఎంతో ప్రశాంతతనిస్తుంది.

**విలువైనదీ... వెలలేనిదీ**

ఎంతటి నిరుపేద అయినా ఎదుటివారికి ఇవ్వగలిగిన ఒకే ఒక బహుమతి 'మంచిమాట'. మన సాహచర్యం, సామీప్యం ఇతరులకు మంచి జ్ఞాపకంగా మిగిలిపోవడానికి సౌమ్యమైన, శ్రేయోదాయకమైన సంభాషణను మించిన మార్గం లేదు. కానీ మనలో చాలా మంది అవసరాన్ని బట్టే ఆత్మీయంగా మాట్లాడడం బాధాకరం. ఈ రోజుల్లో అలంకరించే పువ్వుల నుంచి, ఆహ్లాదపరిచే నవ్వుల వరకు అన్నీ కృత్రిమమే కావడం దురదృష్టకరం. ముందు అలాంటి కపటత్వం నుంచి బయటపడదాం. వెలకట్టలేని విలువైన సరళ సంభాషణను ఆభరణంగా అలంకరించుకుందాం. a

## 'మాట' విలువ చెప్పిన మహాభారతం....



మధురమైన వాక్కు విలువను మహాభారతం ఎంతో హృద్యంగా తెలిపింది. యయాతి తన కుమారుడికి నీతిబోధ చేస్తూ ఇలా అంటాడు...

**న హీదృశం సంవననం త్రిషు లోకేషు విద్యతే**
**దయా మైత్రీ చ భూతేషు దానం చ మధురా చ వాక్!**

దయ, స్నేహం, దానం, మధురవాక్కులు అత్యంత ఆవశ్యకం. మూడు లోకాలలో వీటికి మించిన ఆరాధ్యనీయ సద్గుణాలు మరేవీ లేవు.

ఇలా మహాభారతంలోని ఆదిపర్వంలో నిష్కపటమైన సంభాషణ పవిత్రతను, శక్తిని విపులంగా వివరిస్తాడు వ్యాసమహర్షి. a

# వివేకానందుని దృష్టిలో విద్యావిధానం

- జె. గంగాధర

సమాజంలోని రుగ్మతలను పారద్రోలి, సమాజాన్ని అన్ని రంగాలలోనూ అభివృద్ధి పథం వైపు నడిపించేది విద్య. అందువల్లనే స్వామి వివేకానంద విద్య యొక్క ఆవశ్యకతను తెలియజేశారు. నేడు ఒక పరిపూర్ణమైన వ్యక్తి తయారవడానికి స్వామీజీ ఆశించిన విద్యావిధానం ఎంతో అవసరం.

**విద్య అంటే?**

విద్యావిధానంలో ఒక విషయాన్ని గురించి తెలుసుకోవడం లేదా నేర్చుకోవడం జరుగుతుంది. "మన ఆత్మ అపారమైన జ్ఞాన సంపదను తనలో ఇముడ్చుకున్న గని. విశ్వసంబంధమైన మహా గ్రంథాలయం ఒకటి మన మనస్సులో ఇమిడి ఉంది" అని స్వామీజీ అంటారు. కాబట్టి మనం ఆత్మ గురించి తెలుసుకోవాలి. ఎందుకంటే జ్ఞానమంతా మనలోనే ఉంది. అయితే ఈ ఆత్మను (మస్తిష్కం) ఒక విధమైన పొర ఆవరించి ఉంటుంది. ఆ పొరను నిదానంగా తొలగించాలి. అలా తొలగించే ప్రక్రియనే అధ్యయనం అంటారు. ఏ వ్యక్తిలో అజ్ఞానమనే పొర తొలగించబడుతుందో అతడే జ్ఞాని. ఎవరికి పొర మందంగా ఉంటుందో అతడు అజ్ఞాని. ఎవరికి ఆ పొర పూర్తిగా తొలగించబడుతుందో అతడే మహాజ్ఞాని. మానవునిలో సహజసిద్ధంగా కొన్ని పరిపూర్ణతలుంటాయి. వాటికి ప్రదర్శనాయోగ్యతను ఇవ్వడమే విద్య అంటారు స్వామీజీ. విద్య అంటే ఒక సామర్థ్యాన్ని అభివృద్ధి చేయడమే.

**ఉపాధ్యాయుల పాత్ర:** సమస్త జ్ఞాన సంపదలకు నిలయమైన ఆత్మను ఆవరించి ఉండే పొరను తొలగించుకునే క్రమంలో విద్యార్థికి ఎదురయ్యే అవరోధాల్ని తొలగించే వ్యక్తిగా ఉపాధ్యాయుడు ఉండాలన్నారు స్వామీజీ. బోధనాభ్యసన ప్రక్రియలో రకరకాల స్థాయులలోని విద్యార్థులు తారసపడుతుంటారు. ఉపాధ్యాయుడు వారి వారి స్థాయులను బట్టి బోధించాల్సి ఉంటుంది. "అత్యంత స్వల్పవ్యవధిలో ఎవరైతే విద్యార్థి స్థాయికి దిగి తన ఆత్మను, విద్యార్థి ఆత్మతో శ్రుతి చేసి, అతని దృష్టిలో తన దృష్టిని, అతని వినికిడిలో తన వినికిడిని, అతని మనస్సులో తన మనస్సునీ చొప్పించగలడో అతడే నిజమైన ఉపాధ్యాయుడు" అని స్వామీజీ అంటారు.

**ఉపాధ్యాయునికీ విద్యార్థికీ గల సంబంధం:** విద్యార్థికి గురువుతో సన్నిహిత సంబంధం ఏర్పడాలి. గురువు వ్యక్తిగత జీవితాన్ని కూడా శిష్యుడు అధ్యయనం చేయగలగాలి. దీనికి ఆదర్శం స్వామి వివేకానంద, స్వామి సదానందుల వారి మధ్యనున్న గురుశిష్య బంధం. ఒకసారి స్వామి సదానంద తన గురువైన వివేకానందుల వారిని "గురుదేవా! ఒక వేళ నేను పతనం చెందితే నా పరిస్థితి ఏమిటి" అని అడిగారు. దానికి వివేకానందుల వారు "నేను నిన్ను శిష్యునిగా ఎంపిక చేసుకొన్నాను. నీవు వెయ్యిసార్లు పతనం చెందినా నిన్ను ఉద్ధరించే బాధ్యత నాది" అన్నారు. ఈ సన్నివేశం గురువు యొక్క బాధ్యతను (శిష్యుని పట్ల) తెలియజేస్తుంది. ఇంతటి పవిత్రమైన గురుశిష్య బంధం ఈ రోజు పెడదోవ పడుతోందంటే దీని గురించి ఆలోచించాలి. కొంతమంది ఉపాధ్యాయులు విద్యార్థులను ఎన్నో రకాలుగా వేధిస్తున్నారంటే ఇది ఎంతటి అమానుషమో గుర్తించాలి.



**ఎలాంటి విద్య మనకు కావాలి? విద్యలో ఏ యే విషయాలకు ప్రాధాన్యమివ్వాలి?**

ముందుగా విద్యార్థికి తాత్త్విక జ్ఞానబోధన (ఆత్మజ్ఞాన ప్రబోధం) చేయాలి, ఇతర శాస్త్రాల అధ్యయనం జరగాలని స్వామీజీ అన్నారు. కానీ నేడు తాత్త్విక జ్ఞానాన్నీ, నైతిక విలువలనూ పెంచే వేదాలు,



భగవద్గీత లాంటి విషయాలకు ప్రాధాన్యమివ్వకుండా కేవలం శాస్త్రజ్ఞానానికి సంబంధించిన విషయాలలో శిక్షణనిచ్చి మనిషిని ఒక యంత్రంలా తయారు చేస్తున్నారు. ఇలా అయితే విద్య లక్ష్యం నెరవేరదు, మనిషి మనసున్న మనిషిగా ఎదగడు. సమాజంలో విలువలు మరింత పతనం చెందుతాయనడంలో సందేహం లేదు. నేడు రకరకాల పరీక్షలు నిర్వహించి అధిక విద్యార్హతలున్న వ్యక్తులను ఉద్యోగులుగా ఎంపిక చేస్తున్నప్పటికీ వారిలో నైతికత కొరవడడం వల్ల వారు స్వార్థపరులుగా, అవినీతివరులుగా తయారవుతున్నారు. కనుక విద్యావిధానంలో తాత్త్విక జ్ఞాన బోధన ప్రధానాంశం కావాలి. విశాల భావాలను కలుగచేసి అభాగ్యులను ఆదుకొనే గుణాన్ని కలుగచేయని విద్య అసలు విద్యే కాదు.

**విద్య ఉత్సాహాన్ని పెంచాలి:**

చాలా మంది తల్లితండ్రులు, పిల్లల్ని "నీకు చదువు రాదు, నీవు బాగుపడవు" అని దూషిస్తూ ఉంటారు. అందువల్ల ఆ పిల్లల్లో ఉత్సాహం కొరవడుతుంది. చివరకు వారు పనికిరానివారిగానే తయారవుతారు. సమాజంలోని బడుగు, బలహీన వర్గాల పిల్లలను నిరుత్సాహపరచకుండా వారిలోని మానవుణ్ణి నిద్ర లేపి, "మేలుకో... పురోగమించు" అని ఉత్సాహపరచాలి.

'లే లే లే లేచి ముందుకురుకు
వెనక్కు మరల తిరగకుండా
గమ్యాన్నే చేరు నీవు సోదరా!' అన్న స్వామీజీ పిలుపును స్ఫూర్తిగా తీసుకొని ముందడుగు వెయ్యాలి.

**సామాన్య ప్రజల జీవనోపాధికి ఉపయోగపడే విద్య:**

"సామాన్య ప్రజల జీవనోపాధికి ఆవశ్యకమైన వస్తుసంపదను సమకూర్చలేని విద్య అసలు విద్యగా పరిగణించబడదు. ఒక పేద పిల్లవాడు కూడా తనలోని ఆధ్యాత్మికశక్తిని ఉపయోగించి తనలోని బ్రహ్మకమలాన్ని వికసింపజేసి తన పేదరికాన్ని పటాపంచలు చేసుకునే సామర్థ్యాన్ని కలుగజేసేదిగా విద్య ఉండాలి. అందుకోసం గనులలో, కర్మాగారాల్లో ఉన్న పిల్లల వద్దకు కూడా విద్య వెళ్ళాలి. ఒక సంపన్న విద్యార్థికి ఒక ఉపాధ్యాయుడు అవసరమైతే, ఒక పేద విద్యార్థికి నలుగురు ఉపాధ్యాయులను మనం అందచేయగలగాలి. జనసామాన్యాన్ని విద్యావంతుల్ని చేసి వారు కోల్పోయిన వ్యక్తిత్వాన్ని తిరిగి పొందేలా చేయాలి" అన్నారు స్వామీజీ.

పాశ్చాత్య విజ్ఞానాన్ని భారతదేశ ఆదర్శంతో కలగలిపిన నూతన విద్యావిధానాన్ని స్వామి వివేకానంద ఆశించారు. స్త్రీలకు మతం, కళలు, శాస్త్రవిజ్ఞానం, గృహయాజమాన్యం, వంట, కుట్టుపనులు, పరిశుభ్రత లాంటి విషయాలను బోధించాలన్నారు. వ్యక్తిలో మానసిక బలాన్ని పెంపొందించి, ఆత్మగౌరవాన్ని పెంపొందించి, సత్ప్రవర్తననూ, దాతృత్వాన్నీ పెంచే విద్యావిధానాన్ని స్వామీజీ ఆశించారు.

ధైర్యసాహసాలనూ, ఆత్మ విశ్వాసాన్నీ, శ్రద్ధనూ కలుగజేసి, బలహీనతలను పారద్రోలే విద్యావిధానాన్ని స్వామీజీ ఆశించారు.

నిజం చెప్పాలంటే ఈనాటి పిల్లలకు ప్రతిదానికీ భయం. సమాజానికి హాని కలిగించే వాటిని ఎదిరించాలంటే భయం. పరీక్షలంటే భయం. చిన్న సమస్యలను సైతం ఎదుర్కొనడానికి భయపడి, ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. ఇదేనా విద్యకు ఫలితం!

భయాన్ని పారద్రోలి, గుండెల్లో ఆత్మశక్తిని నింపి కొండల్నే పిండి చేయగలిగే ఆత్మస్థైర్యాన్ని కలిగి ఉండాలని స్వామీజీ అన్నారు.

కురుక్షేత్ర యుద్ధంలో భయంతో అస్త్రాలను క్రింద పడవేసి, యుద్ధవిముఖుడైన అర్జునునికి శ్రీకృష్ణుడు గురువై అందించిన విద్య భగవద్గీత. ఈనాడు నవ అర్జునులైన పిల్లలకు వివేకానందుడే శ్రీకృష్ణుడు. ఆయన ప్రవచించిన విద్యావిధానమే మనకు మార్గదర్శకం కావాలి.

> **సమాచార సేకరణ మాత్రమే విద్య అయితే మన గ్రంథాలయాలు తాపసులౌతాయి; విజ్ఞాన సర్వస్వాలు మహర్షులుగా ప్రజ్వలిస్తాయి. కాని మనకు అవసరమైంది అలాంటి విద్య కాదు. విద్య వల్ల సత్ప్రవర్తన అలవడాలి; మనోబలం పెంపొందాలి; వివేకం విస్తరించాలి.**
>
> **- స్వామి వివేకానంద**

## విల్ పవర్



# మీ పై విజయం మీదే! - 2

– రామ్ జలదుర్గం

గత సంచికలో క్రమశిక్షణ, సంకల్పబలాలతో జీవితాన్ని సుఖమయం చేసుకోవచ్చనీ, బలహీనతల నుంచి సులభంగా బయటపడొచ్చనీ, ఉద్వేగాలనూ, క్షణికానందాలనూ అదుపులో ఉంచుకోవడం ద్వారా మరింత ఆత్మవిశ్వాసాన్ని పొందవచ్చనీ తెలుసుకున్నాం.

చాలామంది సంకల్పబలం, క్రమశిక్షణల గురించి ఓ అరగంట ప్రసంగించమంటే తడుముకోకుండా మాట్లాడతారు. కానీ వాటిని పాటించే విషయంలోనే వస్తాయి చిక్కులన్నీ. తమ దాకా వచ్చేసరికి అవి అందరికీ సాధ్యం కాదని తేల్చేస్తారు. అది పుట్టుకతోనే రావాలని చల్లగా జారుకుంటారు. అలాంటి వారి కోసమే ఈ కింద ఉన్న చిట్కాలన్నీ! నిర్ణయాలకు కట్టుబడి ఉండాలనుకున్న వారు పాటించదగిన జీవితాభ్యాసాలు ఇవి.

**దృఢనిర్ణయాలు తీసుకోవాలంటే? ...**

మీ మానసిక బలాన్ని పరీక్షించుకొని, పెంపొందించుకొనే మార్గాల్లో ముఖ్యంగా ప్రతి నిత్యం జీవితంలో కొన్ని ఇష్టం లేని, కష్టంగా కనిపించే పనుల్ని చేయడం ఒకటి. అలా తరచూ సాధన చేయాలి. వీటి వల్ల ప్రయోజనాలు కలుగుతాయని తెలిసినా మీ మనసు ఆ పనుల్ని ఏదో ఒక వంకతో వ్యతిరేకిస్తూనే ఉంటుంది. అయినా సరే ఆ పనులు చేయాలి. అలా చేయడం ద్వారా మీ మెదడులో నిక్షిప్తమైన వ్యతిరేక భావాలను అధిగమించగలుగుతారు. అంతర్గతంగా ఉన్న వ్యతిరేక శక్తులను అధిగమించడం ద్వారానే మనకు అవసరమైన అంతర్గత శక్తిని మేల్కొల్పగలం.

**అభ్యాసం 1:** ఉదాహరణకు మీరు బస్సులో ప్రయణిస్తున్నారనుకోండి. సీటు దొరికితే హాయిగా కూర్చుంటారు, లేకపోతే తప్పదు కాబట్టి నిలబడి ప్రయాణిస్తారు. ఒకవేళ మీకు సీటు దొరికినా సరే ఆ సీటును ఇంకొకరికి ఇవ్వండి. ఓ పదిహేను లేదా ఇరవై నిమిషాలు నిలబడి ప్రయాణించండి. ఈ చిన్న విషయంలో మిమ్మల్ని మీరు పరీక్షించుకొని, మీలోని మానసిక నిరోధ భావాలను గమనించండి. అయినా మనస్సు మాట వినకుండా ఇంకొకరికి ఆ సీటు ఇచ్చి, ప్రయాణం చేయండి. ఆ తరువాత చూడండి. మీరు ఈ నిరోధ భావాల నుంచి బయటపడడానికి చేసిన సంఘర్షణ, చివరికి సాధించడం చూస్తే మీలో మీకే తెలియని ఆత్మవిశ్వాసం, ధైర్యం కలుగుతాయి.

భగవద్గీతలో శ్రీకృష్ణుడు, అర్జునుడితో మానసిక దౌర్బల్యాన్ని జయించాలని చెబుతూ ఎవరికైనా మనస్సును అదుపులో ఉంచుకోవడం దుస్సాధ్యమే; కానీ అభ్యాస, వైరాగ్యాల ద్వారా దాన్ని సాధించవచ్చని బోధిస్తాడు.

**అభ్యాసం 2:** మీ ఇంట్లోని వారికి వారి పనుల్లో ఎప్పుడైనా సహాయం చేశారా? ఈసారి ఈ విధంగా ప్రయత్నించండి! నేరుగా వంటింట్లోకి వెళ్ళి అమ్మతో "అమ్మా! నేను ఏదైనా సహాయం చేయనా?" అని అడగండి, ఎప్పుడూ ఆ మాట అడగని మీరు ఈ ప్రశ్న వేసేసరికి ఆవతలివారు కాస్త కంగారు పడి, మిమ్మల్ని కొత్తగా చూడడం సహజమే. అయినా సరే, వంటిల్లు సర్దడంలోనో, కూరలు తరగడంలోనో, గిన్నెలు కడగడంలోనో సహాయం చేయండి. అది చిన్న పనే అయినా, మీకిష్టం లేని పని చేసిన తరువాత ఒక్కసారి వారి కళ్ళలోని ఆ వెలుగును చూడండి. రెండూ మిమ్మల్ని సంకల్ప బలం వైపు నడిపిస్తాయి.

**అభ్యాసం 3:** ఒక్కోసారి మీరు అలసిపోయి ఇంటికొస్తారు. రాగానే మీ శరీరాన్ని సోఫాలో పడేసి అందుబాటులో ఉన్న టీవీ రిమోట్ తీసుకొని, అలా ఎంతసేపు ఛానల్స్ మారుస్తూ కూర్చుంటారో మీకే తెలియదు. అప్పుడు స్నానం చేస్తే బాగుంటుందని అనిపిస్తుంది. కానీ బద్ధకం మీ కన్నా బలమైంది కాబట్టి, అది అక్కడ నుంచి లేవనీయదు.

మిగతా 38వ పేజీలో...

...17వ పేజీ తరువాయి

ఆమె కుక్కకూ, భిక్షగాడికీ పాలు పొయ్యడం చూసి, రక్షకభటులు ఆమెను సమీపించి...

ఎంత సాహసం నీకు! రాజాజ్ఞను ధిక్కరించి కుక్కకూ, భిక్షగాడికీ పాలు పంచుతావా? నిన్ను ఖైదు చేస్తున్నాం!

అయ్యా! కొద్దిగా ఆగండి! మిగిలిన పాలను ఈ కొలనులో పోసి వస్తాను.

ఈ కాసిన్ని పాలు పోస్తే కొలను నిండుతుందా?

ఆమె ఆ కాసిన్ని పాలనూ కొలనులో కుమ్మరించగానే... కొలనంతా పూర్తిగా పాలతో నిండిపోయింది!

ఏమి ఆశ్చర్యం! ఈమె కాసిన్ని పాలు గుమ్మరించిన వెంటనే కొలనంతా పాలతో నిండిపోయిందే!

ఈమెను మహారాజు దగ్గరకి తీసుకెళ్ళి ఈ అద్భుతాన్ని వారికి విన్నవించాలి. అమ్మా! మాతో పాటు రండి!

మన దేశంలోని మొత్తం పాలన్నీ కుమ్మరించినా నిండని కొలను ఈమె పోసిన కాసిన్ని పాలతో ఎలా నిండిపోయింది? ఇది ఎలా సాధ్యమైంది?

మహారాజా! నాకేమీ తెలియదు. ఒక సామాన్యురాలినైన నేను తోటి ప్రాణులకు చెయ్యగలిగినది చేశాను.

నేను కూడా భగవంతుని కోసమే కదా కొలనును నిర్మించాను!

అప్పుడు రాజగురువు వచ్చి ఇలా వివరించాడు:

మహారాజా ! ఈమె మీ కన్నా గొప్ప భక్తురాలు. ఆకలితో ఉన్న ప్రాణుల ఆకలి తీర్చింది. కానీ మీరు మాత్రం అహంకారంతో ప్రజలను హింసించి, మీ భక్తిని చాటుకోవాలని చూశారు. మీ అధికారం నింపలేని కొలనును ఆమె తాను తెచ్చిన కొద్దిపాటి పాలు పోసి నింపగలిగింది.

రాజ గురువు ద్వారా అసలు విషయం మహారాజుకు అవగతమయింది.

అత్యంత దీక్షతో ప్రజాసేవ చేసేవారే నిజమైన పరిపాలకులు. బీదలు, నిరక్షరాస్యులు, అమాయకులు, బాధాపీడితులు– వీరిలో మనం భగవంతుణ్ణి చూడాలి. వీరి సేవే భగవంతునికి అమిత ప్రియమైనదని మనం గ్రహించాలి. ఎవరు పెద్దా, చిన్నా తారతమ్యం లేకుండా అనంతమైన ప్రేమను ప్రజలపై కురిపిస్తారో వారిని ప్రపంచం ఆరాధిస్తుంది.

–స్వామి వివేకానంద

**ఆచార వ్యవహారాలు - అంతరార్థాలు- 26**

# పరమ పుణ్యఫలదం ప్రదక్షిణం

- రెంటాల జయదేవ



(గత సంచిక తరువాయి...)

**ప్రదక్షిణతో ఆరోగ్య ప్రయోజనాలు:**

ప్రదక్షిణ, ఆ తరువాత సాష్టాంగ నమస్కారం చేయడం వల్ల ఆరోగ్య ఉపయోగాలు కూడా ఉన్నాయి. సాష్టాంగ నమస్కారం చేయడంలో మనకు తెలియకుండానే, మూడు యోగాసనాలు దాగి ఉన్నాయి. అవి - శవాసనం, భుజంగాసనం, అధో ముఖ శ్వాసాసనం.

ఇందులో శవాసనం వల్ల శరీరంలోని అన్ని అవయవాలకూ విశ్రాంతి లభిస్తుంది. భుజంగాసనం వల్ల వీపు నొప్పి పోతుంది. మలబద్ధకం నివారణ అవుతుంది. థైరాయిడ్ లోపాలు పోతాయి. అధోముఖ శ్వాసాసనం వల్ల పొత్తి కడుపులోని అవయవాలన్నిటికీ వ్యాయామం లభిస్తుంది. కాళ్ళు చేతులు బలం పుంజుకొంటాయి.

ఇలా చూస్తే, ప్రదక్షిణ నమస్కారమనేది శరీరానికి ఓ మంచి వ్యాయామంగా కూడా ఉపయోగపడుతుంది.

**ఎవరికెన్ని ప్రదక్షిణలు?**

దేవతా ప్రదక్షిణ విధుల గురించి మన ప్రాచీన గ్రంథాల్లో ఇలా పేర్కొన్నారు:

***ఏకం గణాధి పే దద్యా । ద్వే సూర్యే త్రీణి శంకరే ॥***
***చత్వారి కేశవే దత్యాత్ । సప్తాశ్వత్థే ప్రదక్షిణమ్ ॥***

*(పారిజాతే)*

'వినాయకుడికి ఒక ప్రదక్షిణం చేయాలి. సూర్యుడికి రెండు ప్రదక్షిణలు ఆచరించాలి. శివుడికి మూడు ప్రదక్షిణలు, విష్ణుమూర్తికి నాలుగు ప్రదక్షిణలు చేయాలి. రావి చెట్టుకు ఏడు ప్రదక్షిణలు చేయాలి' అని పెద్దలు చెబుతారు. మరో గ్రంథంలో ఇలా చెప్పారు:

***ఏకం వినాయకే కుర్యాత్ । ద్వే సూర్యే త్రీణి శంకరే ॥***
***చత్వారి కేశవే కుర్యా । త్సప్త శక్తేః ప్రదక్షిణమ్ ॥***

*(ధర్మ ప్రవృత్తౌ)*

'గణపతికి ఒక ప్రదక్షిణం చేయాలి. సూర్యుడికి రెండు, శివుడికి మూడు, విష్ణువుకు నాలుగు, దుర్గాదేవికి ఏడు ప్రదక్షిణలు చేయాలి'.

తదేక దీక్షతో అధిక సంఖ్యలో ప్రదక్షిణలు చేయడం వల్ల అధిక ఫలం లభిస్తుంది. సర్వసాధారణంగా దేవుని చుట్టూ 5 నుంచి 11 సార్లు ప్రదక్షిణం చేయడం చాలా ప్రాంతాల్లో అలవాటు.

**ఎవరెలా చేయాలి?**

***అపసవ్యం యతీనామ్ తు । సవ్యం తు బ్రహ్మచారిణామ్ ॥***
***సవ్యాసవ్యం గృహస్థస్య । శంభోర్నిత్య ప్రదక్షిణమ్ ॥***

*(ధర్మ నిర్ణయ చంద్రికా)*

'శివాలయంలో ప్రదక్షిణలు చేసేటప్పుడు యతులు అపసవ్య దిశలో చేయాలి. బ్రహ్మచారులు సవ్యంగా చేయాలి. గృహస్థులు సవ్యాపసవ్యాలుగా ప్రదక్షిణ ఆచరించాలి' అని శాస్త్రం చెబుతోంది.

**శివాలయంలో ప్రదక్షిణ చేయాల్సిన విధానం**

శివాలయంలో ఉత్తమోత్తమమైన ప్రదక్షిణం 'చండ ప్రదక్షిణం'. శివునికి ప్రదక్షిణం చేసేటప్పుడు సోమసూత్రం దాటకూడదు. అలా చేసే ఏ ప్రదక్షిణమైనా, ఒకటే లెక్క కిందకు వస్తుంది. అలా కాకుండా, 'చండ ప్రదక్షిణం' ఒక్కసారి చేసినా సరే, 30 వేల సార్లు ప్రదక్షిణ చేసిన ఫలం లభిస్తుంది. ఆ 'చండ ప్రదక్షిణం' ఎలా చేయాలో శైవాగమ గ్రంథాల్లో ఇలా చెప్పారు:

***చండ స్థానే తు సంకల్ప్య । వృషభా దౌ ప్రదక్షిణమ్ ॥***
***వృషం చండం వృషం చైవ । సోమసూత్రం పునర్వృషం ॥***
***చండం చ సోమసూత్రం చ । పునశ్చండం పునర్వృషం ॥***
***నవ ప్రదక్షిణోపేతం । యః కుర్యాచ్చ ప్రదక్షిణమ్ ॥***
***త్రింశత్ సహస్ర సంఖ్యాక । ప్రదక్షిణ ఫలం లభేత్ ॥***

*(శైవాగమే)*

***('చండ ప్రదక్షిణ' అంటే? వచ్చే సంచికలో...)***

ఆంగ్లమూలం : డాక్టర్ ఎస్. రమణి

అనువక్త : రెంటాల జయదేవ



# సుగుణాల కల్పవల్లి సీతమ్మ తల్లి

"సీతాదేవి ఓ విలక్షణ మహిళ అలాంటి పాత్ర మరొకటి లేదు, రాదు. చరిత్రలో ఎంతోమంది రాముళ్ళు ఉండవచ్చు. కానీ, సీత మాత్రం ఒక్కతే! మరొక సీత లేరు, ఉండరు" – అని స్వామి వివేకానంద ప్రకటించారు.

నిష్కళంకమైన స్వచ్ఛతకూ, సౌశీల్యానికీ, సహనానికీ సీత ఓ ప్రతీక. అయితే, అంతరంగంలో జరిగే సంఘర్షణలకు బాహ్య ప్రకటన లేకుండా కూర్చోవడానికి ఆమె గోడా కాదు, బండరాయీ కాదు. ఎన్నో కష్టనష్టాలు, సాధకబాధకాలు, దుఃఖాలు, ఫిర్యాదుల మధ్య కూడా ఆమె తన పవిత్రతను కాపాడుకుంది. తల్లితండ్రుల, భర్త, బంధుజనుల గౌరవానికి తగ్గట్లు ఆమె నడుచుకుంది. భారతీయ స్త్రీత్వానికి సీత ఆదర్శమూర్తి అని స్వామి వివేకానంద పేర్కొన్నారు. అంతేకాకుండా, భారతీయ మహిళల్ని సీతాదేవి మార్గం నుంచి పక్కకు తప్పించడానికి ఏ రకమైన ప్రయత్నం చేసినా, అది వినాశనానికి దారి తీస్తుందని హెచ్చరించారు.

రామునితో అరణ్యవాసం చేసినప్పుడు ఎదురైన కష్టనష్టాలన్నిటినీ సీతాదేవి ఎంతో సహనంతో భరించింది. అడవిలో నదీ తీరంలో వారు చిన్న కుటీరాలు నిర్మించుకున్నారు. రాముడు, లక్ష్మణుడు వెళ్ళి పండ్లు సేకరించి తీసుకువచ్చేవారు. ఇలా సీతాదేవి అరణ్యవాసం కొంతకాలం సాఫీగా జరిగిపోయింది.

ఒకరోజున ఆమె ఓ అందమైన బంగారు లేడిని చూసి, ముగ్ధురాలైంది. దాన్ని పట్టి, తీసుకురావాల్సిందిగా రాముణ్ణి కోరింది. భార్య కోరికను మన్నించేందుకు రాముడు బయలుదేరాడు. ఇంతలో రామ లక్ష్మణులు లేని సమయం చూసి, లంకాధిపతి అయిన రాక్షసరాజు రావణాసురుడు వచ్చి, సీతను అపహరించుకొని వెళ్ళాడు. ఆ రకంగా సీతామాతకు రెండో పరీక్ష మొదలైంది.

రావణుడు ఆమెను లంకకు తీసుకువెళ్ళి, నిర్బంధంలో ఉంచాడు. తనకు రాణి కావాల్సిందిగా అభ్యర్థించాడు. తన కోరికను అంగీకరించేలా చేయడం కోసం ఆమెను అనేక రకాలుగా ప్రలోభపెట్టాలని చూశాడు. అయితే, పవిత్రతకూ, సద్గుణాలకూ ప్రతిరూపమైన సీతాదేవి మాత్రం అతనితో నేరుగా మాట్లాడడానికి కూడా ఇష్టపడలేదు. గడ్డిపోచను పీకి, దానిని ఎదురుగా పెట్టుకొని, దాన్ని ఉద్దేశిస్తూ ఆమె మాట్లాడింది. ప్రలోభపెట్టేందుకు చేసిన ప్రయత్నాలేవీ ఫలించని రావణాసురుడు చివరకు సీతాదేవిని అశోకవనంలో ఓ చెట్టు కింద రేయింబవళ్ళు ఉంచాడు. ఆమెకు రాక్షస స్త్రీలను కాపలా పెట్టాడు. తన ప్రతిపాదనకు ఆమెను ఒప్పించాల్సిందిగా వారిని ఆజ్ఞాపించాడు.

అలా సీతాదేవి కొన్ని నెలల పాటు అశోకవనంలో ద్వీపాంతర వాసంలో ఉండిపోయింది. చిట్టచివరకు రామదూతగా హనుమంతుడు వచ్చాడు. శ్రీరామచంద్రుని అంగుళీయకాన్ని ఆనవాలుగా తీసుకొని వచ్చిన హనుమ, సీతాదేవి చేస్తున్న కఠోర తపస్సు ముగిసే తరుణం ఆసన్నమైందని ప్రకటించాడు. హనుమంతుని నుంచి రాముని అంగుళీయకాన్ని గ్రహించి, ఆనంద పరవశురాలైన సీతాదేవి, తలలో ధరించే చూడామణిని తన గుర్తుగా అతనికి ఇచ్చింది.



కాగా, ఒక్క క్షణంలో ఆమె కష్టాలన్నీ తీరేందుకు హనుమంతుడు ఓ ప్రతిపాదన చేశాడు. సీతామాతను తన భుజస్కంధాలపైన ఎక్కించుకొని, ఒక్క ఉదుటున సముద్రాన్ని లంఘిస్తానని అన్నాడు. అయితే, సీతాదేవి అందుకు అంగీకరించక, "నా పాతివ్రత్య మహిమతో రావణుణ్ణి నేనే భస్మీపటలం చేయగలను. కానీ, అలా చేసినందు వల్ల రామబాణానికి న్యాయబద్ధమైన సంతోషం లేకుండా చేసినదాన్ని అవుతాను" అని అన్నది. అందువల్ల తాను ఉన్నచోటనే ఉండి, నిర్బంధంలో ఉన్న కష్టాల్ని అనుభవించాలని నిర్ణయించుకున్నాననీ, ఆ రకంగా రాముని కీర్తి ప్రతిష్ఠలు తగ్గకుండా ఉంటాయని భావించాననీ సీతాదేవి చెప్పింది.



ఆ తరువాత సీతాదేవికి మరో కఠిన పరీక్ష ఎదురైంది. వానరసేనతో కలసి సముద్రాన్ని దాటి వచ్చిన శ్రీరాముడు యుద్ధంలో రావణాసురుణ్ణి వధించాడు. అయితే, రాముణ్ణి కలిసేందుకు సీత తహతహలాడుతుండగా, అందరినీ దిగ్భ్రాంతికి గురిచేస్తూ, రాముడు ఓ నిర్ణయం తీసుకున్నాడు. శీలవతినని నిరూపించుకొంటేనే, ఆమెను తిరిగి చేపడతానని పేర్కొన్నాడు. తాను పవిత్రురాలనని నిరూపించడం కోసం లక్ష్మణుణ్ణి పిలిచి, "చితిని పేర్పించు. నేనిక జీవించడం వృథా. అగ్నిలో దూకడమొకటే దీనికి పరిష్కారం" అని సీతాదేవి అన్నది. రామునికి ప్రదక్షిణ చేసిన తరువాత, ఆమె చితిలోకి దూకింది. అయితే, ఆమె పాతివ్రత్యం ముందు అగ్ని వెలవెల పోయింది. దహించే స్వభావాన్ని పోగొట్టుకుంది. అగ్ని వల్ల కించిత్ అపకారమైనా కలగకుండా, స్వచ్ఛతకూ, పవిత్రతకూ ప్రతిరూపమైన దేవతగా సీతామాత భాసిల్లింది. అలా అగ్ని పరీక్షలో కూడా ఆమె విజయవంతురాలైంది. దేవలోకవాసులు సైతం ఆమె స్వచ్ఛతనే కాక, ఆమె దివ్యత్వాన్ని కూడా ప్రకటించారు. కాగా, "కిరణాలు సూర్యునికి చెందినట్లుగా, సీత నాది. సీత పవిత్రురాలని నేను ప్రపంచానికి ఋజువు చేశాను. అదే నా ఉద్దేశం" అంటూ రాముడు, సీతను చేపట్టాడు.

అయితే, దీర్ఘకాలం రాముడితో సంతోషంగా గడపక ముందే సీతకు మరో పరీక్ష ఎదురైంది. గర్భవతిగా ఉన్న సమయంలో అత్యంత క్లిష్టమైన, ఆఖరి పరీక్షను ఆమె ఎదుర్కోవాల్సి వచ్చింది. ఈ సారి అయోధ్యలోని కొందరు అపవాదు వేశారు. మరొక వ్యక్తి చెరలో చాలాకాలం ఉన్న సీతను రాముడు మళ్ళీ చేపట్టాడంటూ వారు అపనింద వేశారు. రాజ్యాన్ని పాలిస్తున్న రాజుగా ప్రజల అభిప్రాయాల్ని గౌరవించాల్సి ఉందని రాముడు భావించాడు. ప్రజలు గనక సీత తప్పు చేసిందని భావిస్తే, ఆమెను శిక్షించాల్సిన బాధ్యత తన మీద ఉందని రాముడు అనుకున్నాడు. అందువల్ల ఆమెను అడవుల్లో వదిలిపెట్టి రావాల్సిందిగా ఆదేశించాడు. ఆ బాధ్యత తనపై పడడంతో లక్ష్మణుడు తన వదిన సీతమ్మను తీసుకువెళ్ళి, గంగానదీ తీరంలో వాల్మీకి మహర్షి ఆశ్రమం సమీపంలో వదిలిపెట్టి వచ్చాడు.

అడవిలోనే సీతాదేవి లవకుశులనే కవల పిల్లలకు జన్మనిచ్చింది. కొన్నేళ్ళ తరువాత లవకుశుల కథాగానం వల్ల సీత జీవించే ఉందన్న విషయం రాముడు గ్రహించాడు. వాల్మీకి మహర్షే స్వయంగా సీతను రాముని వద్దకు తీసుకువచ్చాడు. అయితే, లవకుశులను రాముడికి అప్పగించిన సీత, "నేనే గనక రాముణ్ణి మినహా మరొకరిని తలవనైనా తలవని దాననైతే, నా తల్లి భూదేవి నన్ను తన ఒడిలోకి చేర్చుకోవాలి" అంటూ పలికింది. ఆమె ప్రార్థనకు తగ్గట్లే, భూమి నెర్రెలు విచ్చి, చీలింది. సీతాదేవి అందులోకి వెళ్ళి, అదృశ్యమైంది. ఆ రకంగా సీతా మాత జీవితం విధి పెట్టిన వింత పరీక్షలను ధైర్యంగా ఎదుర్కొన్న ఓ సాధ్వీలలామ జీవితంగా వాసికెక్కింది.

ప్రాతఃకాలంలో ప్రతి ఒక్కరూ స్మరించాల్సిన ఏడుగురు పుణ్యవతులలో సీతామాత ఒకరు. భారత నారీమణులకు ఆమె ధైర్యం, ఆమె దివ్యచరిత ఆదర్శం.

...32వ పేజీ తరువాయి




అయితే ఈ సారి మీ బద్ధకం మాట వినకండి. కష్టమైనా సరే లేచివెళ్ళండి.

చేయాలనుకున్న పని వాయిదా వెయ్యకుండా చేయండి. అప్పుడు చూడండి మీపై మీకే తెలియని ఒక నమ్మకం, ధైర్యం కలుగుతాయి. ప్రయత్నిస్తే తప్పకుండా ఫలితం లభిస్తుంది.

**అభ్యాసం 4:** ఒకరోజు మీరు కాఫీ, టీ, పాలల్లో చక్కెర లేకుండా తాగేందుకో లేదా కనీసం పెరుగన్నంలో ఉప్పు లేకుండా తినేందుకో ప్రయత్నించండి. మీ కన్నా ముందు మీ నాలుక ఈ ప్రయోగానికి ఒప్పుకోదు. దాన్ని జయించడానికేగా ఈ ప్రయత్నమంతా! అలాగే వేడినీళ్ళ స్నానం అలవాటున్న వాళ్ళు వరుసగా వారం రోజులు చన్నీటి స్నానం చేసి మీలోని శారీరక, మానసిక నిబ్బరాన్ని పరీక్షించి సాధించండి. చదువుకునేటప్పుడు కష్టమైన సబ్జెక్టుతో వాయిదా వేయకుండా పోరాడండి. కొన్ని మాటలు మాట్లాడే కన్నా మాట్లాడకుండా ఉంటేనే ఎక్కువ ప్రయోజనం ఉన్నప్పుడు మౌనాన్ని ఆశ్రయించండి. మీ ఉద్వేగాన్ని అదుపులో ఉంచుకొని, సమయం కేటాయించుకొని నిశ్శబ్దంగా వినడం నేర్చుకోండి.

**జాగ్రత్తలు:**

1. అన్ని ప్రయోగాలూ ఒక్కసారిగా చేపట్టకండి, నిరుత్సాహం కలిగే ప్రమాదం ఉంది.
2. వెంటనే ఫలితాన్ని ఆశించకండి. ఆశావహ దృక్పథంతో అభ్యాసం చేయండి.
3. ఈ అభ్యాసం కేవలం మిమ్మల్ని మీరు మానసికంగా, శారీరకంగా బలవంతుల్ని చేయడానికే అని అర్థం చేసుకోండి.
4. ఇతరుల 'వ్యాఖ్యానాలు' విని మీ ప్రయత్నాలు మానుకోకండి.
5. వీటిని నిరంతరం అభ్యసించండి. వీటికి సమయం కేటాయించలేదు. అది మీ సాధనను బట్టి ఉంటుంది.
6. ఇవి మీకు మీరు చేసుకునే వ్యక్తిగత ప్రమాణాలు కాబట్టి వీలైనంత నిజాయతీగా ప్రయత్నించండి.
7. ఫలితాలను ఇతరులతో చర్చించండి.

ఇక చూడండి! మీ పైన విజయం మీదే!!

**విజయానికి పంచ సూత్రాలు**

**1. తప్పుల్ని ఒప్పుకునే ధైర్యం కలిగి ఉండడం. 2. సవాళ్ళను స్వీకరించే తత్త్వం. 3. అచంచల విశ్వాసం. 4. ఏ పనినైనా ఉత్సాహంగా చేయగలగడం. 5. కష్టాలను ధైర్యంగా ఎదుర్కోగలగడం.**



"Are you growing spiritually? Can you love others? Can you feel oneness with others? Have you peace within yourself? And do you radiate it around you? That is called spiritual growth, which is stimulated by meditation, inwardly, and by work done in a spirit of service outwardly." - Swami Ranganathananda

# వార్తావాహిని

## 'వివేకానంద విద్యా విహార్' ప్రారంభోత్సవం





**విజయవాడ రామకృష్ణ మిషన్** గుంటూరు జిల్లా సీతానగరం గ్రామంలో కోటీ ఇరవై లక్షల వ్యయంతో **'వివేకానంద విద్యా విహార్'** పాఠశాల భవనాన్ని నిర్మించింది. ఈ భవనాన్ని రామకృష్ణ మఠం,మిషన్ల ఉపాధ్యక్షులు పరమపూజ్య స్వామి స్మరణానందజీ మహరాజ్ 2008 ఫిబ్రవరి 14వ తేదీన ప్రారంభించారు. ప్రారంభోత్సవ సభలో పూజ్య స్వామి స్మరణానందజీ మాట్లాడుతూ 'విజయవాడ రామకృష్ణ మిషన్ శాఖ చేస్తున్న సేవా కార్యక్రమాలు శ్లాఘనీయం; ఉన్నత ప్రమాణాలతో కూడిన విద్యను వివేకానంద విద్యా విహార్ అందిస్తుంది'అని అన్నారు. విజయవాడ రామకృష్ణ మిషన్ కార్యదర్శి స్వామి శశికాంతానందజీ తమ స్వాగతోపన్యాసంలో 'వివేకానంద విద్యా విహార్‌లో తెలుగు, ఇంగ్లీషు మీడియం పాఠశాలలను నిర్వహించడంతో పాటు యువతీ యువకులకు వ్యక్తిత్వవికాస, వృత్తివిద్యా శిక్షణా తరగతుల్ని కూడా నిర్వహిస్తాం' అని తెలిపారు. ఈ కార్యక్రమంలో కాశీపూర్ (కొల్‌కతా) రామకృష్ణ మఠం అధ్యక్షులు స్వామి తత్త్వబోధానందజీ, కడప రామకృష్ణ మిషన్ కార్యదర్శి స్వామి ఆత్మవిదానందజీ, రాజమండ్రి రామకృష్ణ మఠం అధ్యక్షులు స్వామి అక్షరాత్మానందజీ భక్తులను, విద్యార్థినీ విద్యార్థులను ఉద్దేశించి ప్రసంగించారు. ఆ రోజు సాయంత్రం జరిగిన కార్యక్రమంలో కుమారి వైష్ణవి భక్తి సంగీతం, జి. బాలకృష్ణ ప్రసాద్‌గారి అన్నమాచార్య సంకీర్తనం ఆహూతులను అలరించాయి. ఫిబ్రవరి 15వ తేదీ ఉదయం జరిగిన తల్లితండ్రుల సదస్సులో 'పిల్లల్ని తీర్చిదిద్దడంలో తల్లితండ్రుల పాత్ర – నైతిక విలువలతో కూడిన విద్య'అనే అంశంపై స్వామి ఆత్మవిదానందజీ, స్వామి పరిజ్ఞేయానందజీ, శ్రీ ఎమ్.పున్నయ శాస్త్రి, డా॥ పి. శ్యామసుందరమూర్తి, డా॥పి.వి. రెడ్డి, శ్రీ.జె. గంగాధర, శ్రీ ఎన్. నటరాజన్ ప్రసంగించారు.

**నివేదిక: బ్రహ్మచారి హరీష్**

## యువ సమ్మేళనం

**రాజమండ్రి రామకృష్ణ మిషన్** రామకృష్ణ సంఘ ఉపాధ్యక్షులు పూజ్య స్వామి స్మరణానందజీ మహరాజ్ రాజమండ్రి పర్యటన సందర్భంగా ఫిబ్రవరి 17 నుంచి 22 వరకు మఠం ప్రాంగణంలో వివిధ సాంస్కృతిక కార్యక్రమాల్ని నిర్వహించింది. ఒకరోజు పాటు జరిగిన యువ సమ్మేళనంలో పూజ్య స్వామీజీ విద్యార్థినీ విద్యార్థులను ఉద్దేశించి ప్రసంగించారు. సుమారు 300 మందికిపైగా పాల్గొన్న ఈ యువ సమ్మేళనంలో స్వామి బోధమయానందజీ 'ఆశావహ దృక్పథంతోనే విజయం' అనే అంశంపై ప్రసంగించారు.



**నివేదిక: స్వామి అక్షరాత్మానంద**





## శ్రీ రామకృష్ణ ప్రార్థనా మందిరం సంప్రోక్షణ

**నిడదవోలు రామకృష్ణ సేవాసమితి** నిర్మించిన నూతన శ్రీరామకృష్ణ ప్రార్థనా మందిరాన్ని రామకృష్ణ సంఘ ఉపాధ్యక్షులు పూజ్య స్వామి స్మరణానందజీ మహరాజ్ ఫిబ్రవరి 20న సంప్రోక్షణ గావించారు. ఈ సందర్భంగా మందిరంలో శ్రీరామకృష్ణులకు ప్రత్యేక పూజ, హోమం, భజనలు జరిగాయి. సుమారు 1200 మంది భక్తులు పాల్గొన్న ఈ కార్యక్రమంలో పూజ్య స్వామీజీ అనుగ్రహ భాషణం చేశారు. **నివేదిక: కె. శ్యామ సుందరరావు**

# సుబోధ

ఒకడు నదిని దాటవలసి వచ్చింది. ఒక సిద్ధుడు వాడి కొంగుకు తాయెత్తు ఇచ్చి, "ఇది నిన్ను నదిని దాటిస్తుంది" అని చెప్పాడు. అతగాడు దాన్ని తీసుకొని నది మీదుగా పోతున్నాడు. సగం దూరం వెళ్ళగానే, తనకు అంత అద్భుతశక్తిని ఇచ్చిన ఆ తాయెత్తులో ఏముందో చూడాలని అతడికి కుతూహలం కలిగింది. వెంటనే దాన్ని విప్పి చూశాడు. దానిలో ఒక కాగితం మీద పవిత్రమైన రామనామం మాత్రం వ్రాసి ఉండడం చూశాడు. "ఇదేనా దీనిలోని రహస్యం" అనే తృణీకారభావం అతడిలో కలిగింది. ఈ అవిశ్వాసం కలగగానే అతడు నది నీటిలో బుడుంగున మునిగి పోయాడు. భగవన్నామంలోని శ్రద్ధాభక్తులు అద్భుతకార్యాలను చెయ్యగలవు. శ్రద్ధే జీవనం! అశ్రద్ధే మరణం!!

బ్రహ్మహత్యా పాపానికి పాల్పడ్డ రాజొకడు తాను ఎలాంటి ప్రాయశ్చిత్తం చేసుకొని పునీతుడవగలడో తెలుసుకోవడానికై ఒక ఋష్యాశ్రమానికి వెళ్ళాడు. ఆశ్రమంలో ఋషి లేడు కానీ, ఆయన కుమారుడు ఉన్నాడు. రాజు వచ్చిన పని తెలుసుకొని, "మూడుసార్లు రామనామం జపించు, నీకు పాపపరిహారమవుతుంది" అని ప్రాయశ్చిత్తాన్ని విధించాడు. తరువాత ఋషి వచ్చి తన కుమారుడు తెలిపిన ప్రాయశ్చిత్తాన్ని గురించి విని కోపగించుకొని ఇలా అన్నాడు: "శ్రీరామనామాన్ని ఒక్కసారి ఉచ్చరించగానే కోటి జన్మల్లో చేసిన పాపాలన్నీ హరించుకుపోతాయే! ఓరీ మూఢుడా! నువ్వెంతటి విశ్వాసహీనుడవు! అలాంటి పవిత్రనామాన్ని మూడుసార్లు ఉచ్చరించమని అన్నావా? నీ విశ్వాసహీనతకు ఫలితంగా చండాలుడవైపో". అలా శాపగ్రస్థుడైన ఋషి కుమారుడే రామాయణంలోని గుహుడు.

('శ్రీరామకృష్ణ బోధామృతం' నుంచి)



**శ్రీరామకృష్ణ ప్రభ**
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్ - 500 029
ఫోన్: 040-2766 7799, 2763 3936
E-mail : sriramakrishnaprabha@gmail.com



నిర్వాహక సంపాదకులు: **స్వామి జ్ఞానదానంద**
సంపాదకులు: **స్వామి పరిజ్ఞేయానంద**

# సురభి



**మాతృదేవి:** జపధ్యానాల కంటూ ఒక నిర్ణీత సమయం కేటాయించడం ఎంతో అవసరం. సరైన సమయం ఎప్పుడు ఆసన్నమవుతుందో చెప్పలేం. ఎవరూ ఎదురు చూడని వేళలో ఆ తరుణం హఠాత్తుగా వస్తుంది. డబ్బు ద్వారా, మానవ ప్రయత్నం వల్ల సాధించలేని అనేకం కాల మహిమ సాధింపగలుగుతుంది. అందువల్ల సమస్యల ఒత్తిడి ఎంతగా ఉన్నప్పటికీ కొన్ని నియమాలను అంటి పెట్టుకుని ఉండడం ఎంతో అవసరం.

**భక్తుడు:** పనులు ఒకవైపు, వ్యాధుల లాంటివి మరొకవైపు, ఇలా అనేక కారణాల వల్ల దేనినీ సరిగ్గా ఆచరించలేకపోతున్నాం.

**మాతృదేవి:** అవును. వ్యాధులు మనిషి కట్టడిలోనివి కావు. ఇక, నిజంగానే పనుల ఒత్తిడి నిన్ను కృంగదీసేదిగా ఉంటే ఇష్టదైవాన్ని మనస్సులో తలచుకుని నమస్కరించు. మరేం చేయగలం?

**భక్తుడు:** సాధనలకు తగిన సమయమేది?

**మాతృదేవి:** సంధ్యాసమయాలు. ఆ సమయాలలో భగవంతుణ్ణి స్మరించడం చాలా మంచిది. రాత్రి గడిచి పగలు రాబోయే సమయాన్ని, పగలు గడిచి రాత్రి ఏతెంచే సమయాన్ని సంధ్యాసమయమంటారు. ఆ సమయంలో సహజంగానే మనస్సు ప్రశాంతంగా ఉంటుంది.

మానసిక బలహీనతలను గురించి మాతృదేవితో చెప్పుకున్నప్పుడు ఆమె ఇలా అన్నారు:

"నాయనా! అమావాస్య, పౌర్ణమి రావడం ఎలా ప్రకృతి సహజమో, అదే విధంగా మనసులోని బలహీనత కూడా! కొన్ని సమయాల్లో ప్రశాంతంగానూ, కొన్ని సమయాల్లో అపవిత్రంగానూ, చంచలంగానూ ఉండడం మనస్సు స్వభావం."

('శ్రీశారదాదేవి వచనామృతం' నుంచి)

## ప్రవేశ / ఉద్యోగ ప్రకటన

**1. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది కోర్సులకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) 'వేదచూడామణి' : ఋగ్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క అధ్యయనము
యోగ్యతలు : మాతృభాషలో చదువగలిగి, వ్రాయగలిగి ఉండాలి.
వయస్సు : 8 నుంచి 10 సంవత్సరాల మధ్య
స్టైఫండ్ : నెలకు రూ. 1,000/-

(ఆ) 'వేదార్థచూడామణి' : ఋగ్వేదము/ యజుర్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క భాష్యాధ్యయనము
యోగ్యతలు : సంస్కృత పరిజ్ఞానముతో బాటు ఏదో ఒక వేదాన్ని పూర్తిగా అధ్యయనం చేసి ఉండాలి.
వయస్సు : 15 సం॥, ఆ పైన
స్టైఫండ్ : నెలకు రూ. 3,000/-

**2. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది ఉద్యోగాలకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) వేదాధ్యాపకుడు : (సామవేదము/ అథర్వవేదము – వేదానికి ఒక్కొక్కరు చొప్పున రెండు ఖాళీలు)
కావలిసిన అర్హతలు : క్రమాంతము లేక పదాంతము
అదనపు అర్హతలు : ఏదైన మఱియొక వేదము/ వేదభాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవము : 2 సంవత్సరములు
సంభావన : నెలకు రూ॥ 8,000/- మొత్తము, సౌకర్యములతో

(ఆ) వేదభాష్యాచార్యుడు : (ఒక్కొక్క వేదానికి ఒక్కొక్కరు చొప్పున 4 ఖాళీలు)
విద్యార్హత : ఏదైనా వేద భాష్యంలో ఉత్తీర్ణత
అదనపు అర్హత : మరొక వేద భాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవార్హత : 5 సం॥
సంభావన : నెలకు రూ. 10,000/- మొత్తము, సౌకర్యములతో

ముద్రించిన దరఖాస్తు ఫారములను శ్రీ **పి. వేంకటేశ్వర్లు గారు, మేనేజింగ్ డైరెక్టర్, కాకతీయ సిమెంట్, సుగర్ & ఇండస్ట్రీస్ లిమిటెడ్, 'గురుకృప' (ఆంధ్రా బ్యాంకు ఎదురుగా), 1 - 10 - 140/1, అశోక్‌నగర్, హైదరాబాద్ - 500 020** (ఫోను: 040 – 27637717) నుంచి ప్రత్యక్షముగా గాని, పోస్టు ద్వారా గాని పొందవచ్చు. పూర్తి చేయబడిన ఆ ముద్రిత దరఖాస్తులను ఈ పై అడ్రసుకు పంపవలెను. అవసరాన్ని బట్టి ఖాళీలను పూరించుట లోనూ, అర్హతల సవరణ లోనూ మేనేజ్‌మెంటుకు అధికారము కలదు.

సం/-
హైదరాబాద్ కులప్రశాసకుడు

Regd. Office : 1 - 10 - 140/1, Gurukrupa, Ashok Nagar, Hyderabad - 500 020
Ph: 2763 7717, 2763 3627, Fax No. 040-27630172, Email: info @ kakatiyacement.com

Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 65 సంచిక: 5 మే 2008

సకలగుణ నిధానం వానరాణా మధీశం ।
రఘుపతి వరదూతం వాతజాతం నమామి ॥

సకలగుణ నిధి, వానర నాయకుడు, రఘురాముని ప్రియభక్తుడు, వాయుపుత్రుడు అయిన హనుమంతునకు నమస్కారం.







## లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు**...... రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**రాజ పోషకులు**............ రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**పోషకులు**................. రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| | పేరు / చిరునామా | రూ. |
|---|---|---|
| పోషకులు | : శ్రీ టి. అమ్మయ్య, అత్తాపూర్, హైదరాబాద్ - 500 048 | 1,200 |
| | : శ్రీ పోతూరి ఉమామహేశ్వరరావు, నందిగామ, కృష్ణా జిల్లా - 521 185 | 1,116 |
| | : శ్రీ. దామోదర్, విద్యానగర్, హైదరాబాద్ - 500 044 | 1,116 |
| | : శ్రీ కె.వి.బి.ఆర్. చౌదరి, బాలుర జెడ్.పి.హెచ్.పాఠశాల, పరవాడ, విశాఖపట్నం | 1,000 |
| | : శ్రీమతి గాజుల జయంతి, తార్నాక, సికింద్రాబాద్ - 500 017 | 1,000 |

# శ్రీరామకృష్ణ ప్రభ గ్రంథాలయ నిధి పథకం

'శ్రీరామకృష్ణ ప్రభ గ్రంథాలయ నిధి పథకం'లో చేరి, మీ పేరు మీద పది మందీ మంచి విషయాలు చదివే వీలు కల్పించండి. ఈ పథకం కింద రూ॥750/- చందా కట్టినట్లయితే, 10 ఏళ్ళ పాటు ఒక గ్రంథాలయానికి (ఉన్నత పాఠశాలలకు/ కళాశాలలకు/ సంస్థలకు/ దేవాలయాలకు)ప్రతి నెలా మీ పేరిట 'శ్రీరామకృష్ణ ప్రభ' పంపిస్తాం. దాతల పేర్లనూ, వారి పేరిట పత్రికను పంపే గ్రంథాలయాల వివరాలనూ 'శ్రీరామకృష్ణ ప్రభ'లో ప్రచురిస్తాం.

| సంఖ్య | దాత పేరు | గ్రహీత సంస్థ |
|---|---|---|
| 1322 | శ్రీమతి వి. లలితాబాయ్, గోల్కొండ క్రాస్‌రోడ్, హైదరాబాద్-28 | లైబ్రేరియన్, బాలుర ప్రభుత్వ డిగ్రీ కళాశాల, సంగారెడ్డి, మెదక్ జిల్లా |
| 1323 | " " " | లైబ్రేరియన్, బాలికల ప్రభుత్వ డిగ్రీ కళాశాల, సంగారెడ్డి, మెదక్ జిల్లా |
| 1324 | శ్రీ ఎమ్. రంగారెడ్డి, సింహపురికాలని, కడప - 516 001 | అవధూత సుబ్బారెడ్డి నాయన, ఉయ్యాలవాడ, కర్నూల్ జిల్లా |
| 1325 | శ్రీ కె. పుల్లారెడ్డి, ఓబులదేవనగర్, అనంతపూర్- 515 001 | శ్రీ భవితాశాల, హంపిరెడ్డితోట, ఓబులదేవనగర్, అనంతపూర్-515 001 |
| 1326 | శ్రీ ఎన్. నాగశేష, కొత్తచేరువు, అనంతపూర్ - 515 133 | లైబ్రేరియన్, సంస్థాన్ నారాయణపురం, నల్లగొండ జిల్లా - 508 253 |
| 1327 | శ్రీ టి. సత్యనారాయణ, విద్యానగర్, రాజమండ్రి - 533 015 | లైబ్రేరియన్, సెంట్రల్ జైల్, రాజమండ్రి, తూర్పు గోదావరి జిల్లా |
| 1328 | శ్రీమతి కె. సుభ, మోడల్ కాలనీ, హైదరాబాద్-38 | లైబ్రేరియన్, ప్రభుత్వ ఉన్నత పాఠశాల, దాచెపల్లి, గుర్జాల, గుంటూరు జిల్లా |

ఈ పథకం ద్వారా శ్రీరామకృష్ణ ప్రభను మరింతమందికి చేరువ చేస్తున్న దాతలకు కృతజ్ఞతలు.



## చందా వివరాలు

| చందా వివరాలు | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా | : | రూ. 100 | $ 20 |
| మూడు సంవత్సరాలకు | : | రూ. 280 | $ 50 |
| ఐదు సంవత్సరాలకు | : | రూ. 450 | $ 80 |
| ఇరవై సంవత్సరాలకు | : | రూ. 1500 | $ 360 |



గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి. పంపవలసిన చిరునామా : Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.

## లోపలి పేజీల్లో...















## శ్రీరామకృష్ణ ప్రభ వార్షిక చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా! దిగువ పేర్కొన్న నెంబర్ల నడుమ ఉన్న సంవత్సర చందాదారుల చందా గడువు తీరిపోనుంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకొని, 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.*

60000 - 63286 మధ్యనున్న వారిలో **సంవత్సర** చందాదారుల చందా గడువు **2008 మే తో** తీరిపోనుంది!

70000 - 73601 మధ్యనున్న వారిలో **సంవత్సర** చందాదారుల చందా గడువు **2008 జూన్ తో** తీరిపోనుంది!

**శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ.... - సర్క్యులేషన్ మేనేజర్**

bమీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు. ✱ మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి. ✸ మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.

#శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకి కుడి భాగంలో మీ చందా గడువు నెల పొందుపరచబడి ఉంది.

ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకుడు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు.

– సంపాదకులు



SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH
Domalguda, Hyderabad - 500 029. Andhra Pradesh
Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com

# పరమాత్ముని సేవలో పరమోన్నతులు!

మనం ప్రారంభించే పనిలో ఫలితాన్ని సాధించాలంటే పురుష ప్రయత్నంతో పాటు, దైవానుగ్రహం తోడవ్వాలి. స్వప్రయత్నానికి దైవానుగ్రహం తోడైనప్పుడు కార్యసిద్ధి సుగమం అవుతుంది. కార్యరంగంలో ఎదురయ్యే అవరోధాల్ని ధైర్యంతో, బుద్ధికుశలతతో, ఆత్మవిశ్వాసంతో అధిగమించడానికి ప్రయత్నించే వారికి దైవానుగ్రహం లభిస్తుందనీ, తద్వారా విజయాన్ని సాధించవచ్చునీ అనడానికి ఆంజనేయస్వామి, వివేకానంద స్వామి జీవితాలే మనకు నిదర్శనం.

రామదూత ఆంజనేయుడు సీతాన్వేషణ కోసం సముద్రాన్ని లంఘించినప్పుడూ; రామకృష్ణ దాస వివేకానందుడు భారతదేశ ఔన్నత్యాన్నీ, సనాతన ధర్మ వైశిష్ట్యాన్నీ ప్రపంచ దేశాలకు తెలియజేయడానికి పాశ్చాత్యదేశాలు వెళ్ళినప్పుడూ వారు ఎన్నో కష్టాలను, అవరోధాలను ఎదుర్కోవాల్సి వచ్చింది. స్వామి కార్యంలో ఎదురైన అన్ని కష్టాల్నీ ఈ ఇద్దరు మహాత్ములు ఓర్పు, నేర్పు, ధైర్యసాహసాలతో ఎదుర్కొని ముందుకు సాగారు. అత్యంత క్లిష్ట సమయాల్లో కూడా భగవంతుని మీద విశ్వాసాన్ని కోల్పోకుండా తమ ప్రయత్నాన్ని కొనసాగించారు. కాబట్టే పురుష ప్రయత్నానికి దైవానుగ్రహం తోడై, స్వామి కార్యాన్ని సాధించగలిగారు.

మనం కూడా ఏ రంగంలోనైనా రాణించాలంటే –ఎదురయ్యే అవరోధాలకు అధైర్యపడకుండా ముందుకు సాగాలి. భగవంతునిపై అచంచల విశ్వాసం ఉంచి నిర్విరామంగా కృషి చేసినప్పుడు కార్యసిద్ధి కరతలామలకం అవుతుంది.

ఆంజనేయ స్వామి నామాన్ని స్మరించినా, వివేకానంద స్వామి సందేశాన్ని మననం చేసినా మనలోని భయం, బలహీనతలన్నీ పోతాయి. ఆత్మస్థైర్యం, ఆత్మవిశ్వాసం, క్షమ, గాంభీర్యం, ధైర్యం, ఉత్సాహం వృద్ధి చెందుతాయి. పరమాత్ముని సేవలో తరించి పునీతులైన వీరిద్దరూ శివాంశ సంభూతులే. త్రేతాయుగంలో రామకార్యార్థం అవతరించిన ఆ ఆంజనేయుడే, కలియుగంలో రామకృష్ణ సందేశ వ్యాప్తికి ఆవిర్భవించిన ఈ వివేకానందుడు. వీరిద్దరూ స్వామి కార్యంలో సఫలీకృతులై మనందరికీ ఆదర్శనీయులుగా నిలిచారు.

**ధ్యానయోగి కర్మయోగిగా:** యోగాసనంలో మహా ధ్యానంలో సదా నిమగ్నచిత్తుడైన పరమేశ్వరుడే రామ సేవ కోసం ఆంజనేయునిగా, రామకృష్ణ సేవ కోసం వివేకానందునిగా ఈ భువిపై అవతరించారు.

ఆంజనేయుడు శివావతారమని తెలియజేసే ఆధారాలు ఎన్నో ఉన్నాయి. దేవీ భాగవతం ఆధారంగా–రావణాసురుణ్ణి అంతమొందించే ఉపాయాన్ని తెలియజేయమని త్రిమూర్తులు దేవిని ప్రార్థించారు. అప్పుడు దేవి వారితో 'మహావిష్ణువు భువిపై అవతరించినప్పుడు రావణ సంహారంలో సహాయపడడానికి పరమేశ్వరుడే ఆంజనేయునిగా అవతరిస్తాడు' అని అభయమిచ్చింది.

స్వామి వివేకానందుని తల్లి భువనేశ్వరీదేవి తనకు కుమారుడు కావాలని పరమశివుణ్ణి ప్రార్థించింది. ఒకరోజు రాత్రి కలలో భువనేశ్వరీ దేవికి ధ్యానమగ్నుడైన శివుడు దర్శనమిచ్చాడు. ధ్యాన స్థితిలో ఉన్న శివుడు లేచి భువనేశ్వరీదేవిలో ప్రవేశించాడు. అలా ఆ వీరేశ్వరుడే వివేకానందునిగా ఆవిర్భవించాడు.

**దృఢ సంకల్పమే తరగని బలం:** కార్యసాధనలో ఎదురయ్యే కష్టాలకు భయపడకుండా శక్తి యుక్తులతో, ధైర్యస్థైర్యాలతో, పట్టుదల, విశ్వాసాలతో ముందుకు సాగాలి. అప్పుడే తలపెట్టిన కార్యంలో విజయాన్ని సాధించగలం.

శ్రీరాముని కార్యార్థం హనుమంతుడు సముద్రం లంఘించి లంక చేరే వరకూ మధ్యలో ఎన్నో ఆటంకాల్ని ఎదుర్కొన్నాడు. మైనాకుడు మిత్రభావంతో కాసేపు తన వద్ద విశ్రాంతి తీసుకోమని ఆంజనేయుణ్ణి కోరాడు. నిజమైన కార్యశూరుడు తలపెట్టిన కార్యాన్ని ముగించే వరకూ విశ్రమించడు. హనుమంతుడు తన లక్ష్యాన్ని సాధించేవరకు విశ్రమించనని సున్నితంగా మైనాకుని ప్రతిపాదనను తిరస్కరించి తమోగుణానికి అతీతుడయ్యాడు. సముద్రం లంఘిస్తున్నప్పుడు హనుమంతుణ్ణి మ్రింగడానికి సురస ప్రయత్నించినప్పుడు తన బుద్ధి కుశలతను ప్రదర్శించి ప్రమాదం నుంచి తప్పించుకున్నాడు. అలాగే తన పరాక్రమంతో సింహికనూ, లంకిణినీ హతమార్చి గమ్యస్థానమైన లంకా నగరంలో ప్రవేశించాడు.

సనాతన ధర్మ వ్యాప్తికి స్వామి వివేకానంద కూడా సముద్రాన్ని లంఘించి పాశ్చాత్యదేశాలకు వెళ్ళారు. ఆయన అమెరికాలో ఎన్నో ఆర్థిక ఇబ్బందులకూ, అపవాదులకూ, పరిహాసాలకూ గురయ్యారు. చలికాలంలో ధరించడానికి సరైన దుస్తులు కూడా లేక బాధపడుతుంటే కొంత మంది మత ఛాందసులు 'ఇక ఈ దయ్యం చలికి తట్టుకోలేక చనిపోతుంది' అని సంతోషాన్ని వ్యక్తం చేశారు. మరికొంత మంది స్వామీజీ వద్దకు స్త్రీలను పంపించి ఆయన్ని అప్రతిష్ఠపాలు చేయడానికి ప్రయత్నించారు. చివరికి స్వామీజీపై విష ప్రయోగం చేయడానికి కూడా వెనుకాడలేదు. మత ఛాందసులు స్వామీజీని మోసగాడనీ, వంచకుడనీ ప్రచారం చేశారు. ఏ విఘ్నాలూ లేకుండా మహత్కార్యాలు సాధించలేమని గ్రహించిన స్వామీజీ దృఢ మనస్కులై లక్ష్యసాధనలో ధైర్యంగా ముందుకు సాగారు.

**అచంచల విశ్వాసమే ఆధారం:** కార్యసాధనలో అడ్డంకులు ఎదురయ్యేటప్పుడు ఎంతటి వారైనా నిరాశా నిస్పృహలకు లోనవడం సహజం. కానీ భగవంతుని అనుగ్రహం వల్ల ఎలాంటి విషమ పరిస్థితులనైనా అధిగమించగలమనే విశ్వాసం ఉంటే ప్రయత్నాన్ని కొనసాగించగలం.

ఆంజనేయ స్వామి లంకలో సీతాన్వేషణ గావించాడు. ఎంత వెదికినా సీతమ్మ కనిపించ లేదు. తన శక్తివంచన లేకుండా ప్రయత్నం చేసి సాధించలేకపోతే, దైవకృపతో కార్యం సిద్ధిస్తుందనే విశ్వాసాన్ని ఆంజనేయుడు కోల్పోలేదు.

**నమో-స్తు రామాయ స లక్ష్మణాయ**
**దేవ్యై చ తస్యై జనకాత్మజాయై ।**

'లక్ష్మణ సమేతుడైన రామునికి నమస్కారం. జనకుని కుమార్తె అయిన సీతామాతకు నమస్కారం' - అలా సీతారాముల్ని స్మరించిన వెంటనే అశోక వనంలో సీతమ్మను దర్శించగలిగాడు. రామనామ స్మరణతో దేనినైనా సాధించవచ్చని నిరూపించిన పరమభక్తుడు ఆంజనేయుడు.

స్వామి వివేకానంద విశ్వమత మహాసభల్లో పాల్గొనడానికి వెళ్ళినప్పుడు చికాగోలో ఎన్నో ఇబ్బందులకు గురయ్యారు. ప్రతిఘటిస్తున్న చాలా మంది అసూయాపరులను ఉద్దేశించి స్వామీజీ ఇలా అన్నారు: 'నా వెనుక ఉండి నన్ను నడిపించే శక్తి ఆ భగవంతుడే'!

**కుర్మస్తారక చర్వణం త్రిభువన ముత్పాటయామో బలాత్**
**కింభో న విజానాస్యస్మాన్ రామకృష్ణ దాసావయమ్ ।**

'నక్షత్రాలను పొడిపొడి చేద్దాం. త్రిభువనాలను పెకలించి వేద్దాం. మనం ఎవరమో నీకు తెలియదా? మనం రామకృష్ణ దాసులం' అంటూ అపార విశ్వాసాన్ని వ్యక్తం చేసిన శిష్యాగ్రగణ్యుడు స్వామి వివేకానందుడు.

'శ్రీరామ కథ ఈ భువిపై వినిపించినంత వరకూ నేను రామనామ స్మరణలో, రామరూప ధ్యానంలో జీవితాన్ని కొనసాగించేలా ఆశీర్వదించు' అని శ్రీరాముణ్ణి వేడుకొని నిస్వార్థానికి ప్రతీకగా నిలిచిన ధన్యజీవి ఆంజనేయుడు. 'నేను శ్రీరామకృష్ణుని సేవకునిగా ఎన్ని జన్మలైనా ఎత్తడానికి సిద్ధమే' అని ప్రకటించిన నిరహంకార స్వరూపుడు వివేకానందుడు.

కష్టాలకూ, కలతలకూ కుంగిపోకుండా మానవ ప్రయత్నాన్ని కొనసాగిస్తూ భగవంతుని పట్ల అచంచల భక్తి విశ్వాసాలతో కార్యసిద్ధిని పొంది **'పరమాత్ముని సేవలో పరమోన్నతులు'**గా నిలిచిన ఆంజనేయ స్వామి, స్వామి వివేకానందలు మనకు సదా ఆదర్శనీయులు, ఆరాధ్యనీయులు. C

# శతవసంత జీవధార





'ది యూనివర్స్ అండ్ మ్యాన్' పుస్తకం లోపలి పేజీలో స్వామి రామకృష్ణానంద దస్తూరి

*To all the Mahatmas of the Math with the best love & regards of Ramakrishnananda*

*6.5.08*
*Madras*










వక్త: స్వామి జ్ఞానదానంద    కూర్పు: రెంటాల జయదేవ

*(తెలుగు ప్రచురణలకు జన్మస్థానమైన చెన్నై శ్రీరామకృష్ణ మఠ ప్రచురణల విభాగం 2008 ఏప్రిల్ 12 నుంచి 14 వరకు శతవార్షికోత్సవం జరుపుకొన్న సందర్భంగా ప్రత్యేక వ్యాసం)*

**ఆధునిక యుగంలో భావ ప్రచారానికీ, ఆధ్యాత్మిక భావ వ్యాప్తికీ అక్షరమే ఆధారం. అక్షరమే ఆయుధం. మూర్తిత్రయమైన శ్రీరామకృష్ణ - శారదాదేవి - వివేకానందుల భావ ప్రచారంలో కూడా గ్రంథాలు, పత్రికలు ఎంతో కీలక పాత్ర వహించాయి. దక్షిణ భారతావనిలో ఈ అక్షర యజ్ఞానికి ముఖ్య వేదికగా నిలిచింది - చెన్నైలోని శ్రీరామకృష్ణ మఠం. భారతదేశంలో బ్రిటిష్ పరిపాలన సాగుతున్న సమయంలో అవిభక్త మద్రాసు రాష్ట్రమే అటు తమిళులకూ, ఇటు తెలుగువారికీ నెలవు. కాబట్టి, ఆది నుంచీ ఆంగ్ల, తమిళ భాషా గ్రంథాలు, పత్రికలతో పాటు తెలుగు వాటికి సైతం చెన్నైలోని మఠమే మూలస్థానం. స్వాతంత్ర్య పూర్వం నుంచి నిన్న మొన్నటి వరకు అలాగే సాగింది. 2007 మార్చిలో తెలుగు ప్రచురణల విభాగం ఆంధ్ర దేశంలోని హైదరాబాద్ రామకృష్ణ మఠానికి తరలి వచ్చింది. అప్పటి నుంచి తెలుగు గడ్డ మీదే మూర్తిత్రయ భావ సాహిత్యం, పురాణేతిహాస గ్రంథాల ప్రచురణ జరుగుతోంది.**

**అయితే, జన్మనిచ్చిన చెన్నై మఠ ప్రచురణల విభాగాన్ని నేటి తెలుగు ప్రచురణల నిర్వాహకులు ఎన్నడూ విస్మరించలేదు. చెన్నైలోని శ్రీరామకృష్ణ మఠ ప్రచురణల విభాగం ఇటీవలే శతవార్షికోత్సవం (1908 - 2008) జరుపుకొంది. ఈ సందర్భంలో తెలుగు ప్రచురణల చరిత్రను ఒకసారి సింహావలోకనం చేసుకుందాం.**

చెన్నైలోని శ్రీరామకృష్ణ మఠం 1908లో తొలిసారిగా పుస్తక ప్రచురణలను చేపట్టింది. నిజానికి, అంతకన్నా ముందే చెన్నైలోని బ్రహ్మవాదిన్ పబ్లిషింగ్ కంపెనీ (బ్రహ్మవాదిన్ ఆఫీస్ అని పిలిచేవారు) తమిళనాడులో తొలిసారిగా రామకృష్ణ – వివేకానంద సాహిత్యాన్ని ఓ పద్ధతి ప్రకారం ప్రచురించడం మొదలుపెట్టింది. స్వామి వివేకానంద శిష్యుల్లో ప్రసిద్ధులైన అలసింగ పెరుమాళ్ ఆ సంస్థను స్థాపించారు. 'బ్రహ్మవాదిన్' పేరిట వేదాంత పత్రికను ప్రచురించడం ఆ సంస్థ ప్రాథమిక లక్ష్యం. 1895 సెప్టెంబర్ నెలలో సాక్షాత్తూ స్వామి వివేకానందే ఆ పత్రికకు శ్రీకారం చుట్టి, మార్గదర్శకత్వం వహించారు. అమెరికా నుంచి ఆ పత్రిక నిర్వహణకు ఆర్థిక సాయం అందించారు. అప్పట్లో అలసింగ పెరుమాళ్ ఈ పక్షపత్రికకు సంపాదకులుగా వ్యవహరించేవారు.

శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష శిష్యులైన స్వామి రామకృష్ణానంద 1897లో మద్రాసులో శ్రీరామకృష్ణ మఠాన్ని ప్రారంభించారు. మఠం ఆరంభమైన పదకొండేళ్ళకు కొత్త చరిత్ర శ్రీకారం చుట్టుకుంది. 1908 మార్చి 29న మద్రాసు రామకృష్ణ మఠం (అప్పట్లో మద్రాసు రామకృష్ణ మిషన్ అని పిలిచేవారు) తన మొట్టమొదటి ప్రచురణను ప్రచురించింది. స్వామి రామకృష్ణానంద రచించిన 'ది యూనివర్స్ అండ్ మ్యాన్' అనే ఆ 164 పేజీల పుస్తకంతో మఠం ప్రచురణల విభాగం మొదలైంది. అప్పటి

నుంచి గత వందేళ్ళ కాలంలో వివిధ భాషల్లో కొన్ని వేల పుస్తకాలను ప్రచురించి, ఆధ్యాత్మిక భావవ్యాప్తికి తోడ్ప డింది. ఈ ఏడాదికి నూరు వసంతాలు పూర్తి చేసుకొంది.

చెన్నై రామకృష్ణ మఠం నుంచి ఇప్పటికీ ప్రచురితమవుతున్న ఆధ్యాత్మిక మాసపత్రిక 'వేదాంత కేసరి'కి కూడా ఓ చరిత్ర ఉంది. స్వామి వివేకానంద ఆశీస్సులతో మొదలైన 'బ్రహ్మవాదిన్' పత్రిక సంపాదకుడు అలసింగ పెరుమాళ్ మరణానంతరం కొన్నేళ్ళకు 1914 ఏప్రిల్‌లో పూర్తిగా ఆగిపోయింది. అప్పుడు ఆ ఆధ్యాత్మిక భావధారను కొనసాగించే బాధ్యతను మద్రాసు శ్రీరామకృష్ణ మఠం చేపట్టింది. 1914 మే నుంచి ది వేదాంత కేసరి అనే ఆంగ్ల మాసపత్రిక ప్రచురణను ప్రారంభించింది.

తరువాత కొన్నేళ్ళకు తమిళంలో ఆధ్యాత్మిక మాసపత్రిక ప్రచురణకు నడుం కట్టింది. మఠానికి రెండో అధ్యక్షులుగా వ్యవహరించిన స్వామి శర్వానంద 1921 జనవరి నెలలో 'శ్రీరామకృష్ణ విజయం' తమిళ మాసపత్రికను మొదలుపెట్టారు. గత 87 ఏళ్ళుగా ఆ పత్రిక అవిచ్ఛిన్నంగా వెలువడుతూ, పాఠకాదరణ పొందుతోంది.

**తొలినాళ్ళలో రామకృష్ణ మఠ తెలుగు ప్రచురణలు**

తెలుగు మాట్లాడేవారిలో మూర్తిత్రయ సందేశాన్ని వ్యాపింపజేయడం కోసం మద్రాసు రామకృష్ణ మఠం ప్రచురణల విభాగం 1920ల నుంచీ కృషి చేస్తూ వచ్చింది. స్వామి వివేకానంద ఇచ్చిన 'షికాగో నగరోపన్యాసాలు' 1920లలో (తెలుగు అనువాదం) ప్రచురించారు. శ్రీరామకృష్ణ మఠం వెలువరించిన తొలి తెలుగు పుస్తకం బహుశా అదే కావచ్చునని అప్పటి సంగతులు పెద్దల ద్వారా విన్న మఠ స్వామీజీలు చెబుతున్నారు.



**చెన్నై శ్రీరామకృష్ణ మఠం ప్రచురణల విభాగం 1908 మార్చి 29న స్వామి రామకృష్ణానంద రచించిన 'ది యూనివర్స్ అండ్ మ్యాన్' అనే పుస్తకంతో ప్రారంభమైంది.**

**ప్రచురణల విభాగం శతవార్షికోత్సవం (1908 - 2008).**

**శ్రీరామకృష్ణ లీలామృతము (1932):** ఆంగ్లభాషలో మొదట 1898లో ప్రసిద్ధ పండితుడు ప్రొఫెసర్ మ్యాక్స్ ముల్లర్ 'రామకృష్ణ - హిజ్ లైఫ్ అండ్ సేయింగ్స్' (శ్రీరామకృష్ణుల జీవితం, ఉపదేశాలు) అనే గ్రంథాన్ని రచించి, ప్రకటించారు. ఇంచుమించుగా నాటి నుంచీ శ్రీరామకృష్ణుల జీవితోపదేశ సౌరభం వివిధ భాషల్లో జగద్వ్యాప్తం కాసాగింది. కాగా, శ్రీరామకృష్ణ పరమహంస జీవితచరిత్ర తెలుగులో 1920ల చివరలో అక్షరరూపం ధరించింది. 1929లోనే రచన పూర్తి అయిన ఈ *'శ్రీరామకృష్ణ లీలామృతము'* గ్రంథం, కొన్ని అనివార్య కారణాల వల్ల 1932 ఆగస్టు వరకూ ముద్రించడం జరగలేదు. ప్రభుత్వ ఆంధ్రానువాదకులైన వెదురుమూడి కృష్ణారావు పంతులు ఈ పుస్తకం ప్రథమ ముద్రణ పాఠాన్ని రచించారు. తరువాతి ముద్రణకు రిటైర్డ్ డిప్యూటీ కలెక్టరైన కందుకూరు మల్లికార్జునం సంగ్రహ రూపంలో పునర్విరచన చేశారు. తరువాత *'సందేశ తరంగిణి' (శ్రీవివేకానంద స్వామి కొలంబో - ఆల్మోరా ఉపన్యాసాలు)* (1936), *'శ్రీవివేకానంద జీవితచరిత్ర'* (1939) రచనలు వెలువడ్డాయి.

**స్వామి చిరంతనానంద విశేష కృషి**

ఇరవయ్యవ శతాబ్దంలో మూర్తిత్రయ సాహిత్యాన్ని తెలుగులోకి తీసుకురావడంలో స్వామి చిరంతనానంద చేసిన అవిరళ కృషి ఎన్నదగినది. ఎంతోమంది పాఠకులను ప్రభావితం చేసిన *'శ్రీశారదాదేవి చరిత్ర'* (1943), *'శ్రీరామకృష్ణుని జీవితచరిత్ర'* (1956) లాంటి ప్రాచుర్యం పొందిన గ్రంథాలు ఆయన రచనలే! ఆ రోజుల్లో వీటిని పలు విద్యాశాలల్లో పాఠ్యగ్రంథాలుగా పెట్టారు. ఇక, *'శ్రీరామకృష్ణుని జీవిత చరిత్ర'* గ్రంథానికి మరో ప్రత్యేకత ఉంది. ఢిల్లీలోని కేంద్ర సాహిత్య అకాడెమీ వారు ఈ గ్రంథాన్ని ఉత్తమోత్తమ రచనగా నిర్ణయించి, ఐదు వేల రూపాయలను బహూకరించారు. కాగా, 'లెటర్స్ ఆఫ్ స్వామి వివేకానంద' గ్రంథాన్ని సైతం స్వామి చిరంతనానంద *'శ్రీవివేకానంద లేఖావళి'* (1947)గాతెలుగులోకి అనువదించారు.

ఇక స్వామి వివేకానంద శత జయంతి సందర్భంగా *'కంప్లీట్ వర్క్స్ ఆఫ్ స్వామి వివేకానంద'* సంపుటాలు 1963లో *'వివేకానంద సంపూర్ణ గ్రంథావళి'* పేరిట తెలుగులోకి అనువాదమయ్యాయి. ఆపైన 'ది గాస్పెల్ ఆఫ్ శ్రీరామకృష్ణ' తెలుగులో తొలిసారిగా 1977లో 'శ్రీరామకృష్ణ కథామృతం'గా వెలువడింది. ప్రవ్రాజిక శ్యామాప్రాణ ఈ మహోన్నత గ్రంథాన్ని అనువదించారు.

*మిగతా 34వ పేజీలో...*

# నృసింహస్వామి దర్శనం

- శ్రీమతి గరిమెళ్ళ లక్ష్మి

ఆదిశంకరుల వారు శిష్యులతో కలసి దేశాటనం చేస్తూ శ్రీశైలం వచ్చారు. అక్కడి ఆటవికులు మనుష్య బలి ఇచ్చేవారు.

ఒకరోజు ఒక కాపాలికుడు వారి వద్దకు వచ్చి "అయ్యా! నాకు భైరవుని దర్శనం కావాలంటే మీ లాంటి అష్టసిద్ధులూ కలిగిన వారిని కానీ, అష్టైశ్వర్యాలు కలిగిన మహారాజును కానీ బలి ఇవ్వాలి"అన్నాడు. ఆ కాపాలికుడు తన శిరస్సుని కోరుతున్నాడని శంకరుల వారికి అర్థమైంది.

ఒక రాత్రి వారిని చంపడానికి కాపాలికుడు కత్తి పైకెత్తాడు. వెంటనే సింహగర్జన వినిపించి, ఆచార్యుల వారు కళ్ళు విప్పి చూసేసరికి, కాపాలికుని దేహం ముక్కలై క్రింద పడి ఉంది. వారి పక్కన సనందుడు నిలబడి ఉన్నాడు. వారు "ఇతణ్ణి చంపినది నువ్వా" అని అడిగారు. దానికి సనందుడు "లేదు, నేను గంగానది ఒడ్డున తపస్సు చేసుకుంటున్నాను. ఇక్కడకు ఎలా వచ్చానో నాకే తెలియదు" అని బదులిచ్చాడు. శంకరులవారు "నువ్వు నరసింహ మంత్రం ఉపదేశం పొందావా" అని అడిగారు. 'అవును' అని ఈ క్రింది కథను తెలియచేశాడు అతను.

సనందుడు (పూర్వాశ్రమనామం విష్ణుశర్మ) ఒకమారు గురువు వద్దకు వెళ్ళి 'నరసింహ స్వామిని దర్శించాలని ఉంది, దాని కోసం ఏం చెయ్యాలి' అని అడిగాడు. ఆ గురువుగారు అడవులకి వెళ్ళి 'తపస్సు చేయాలి'అని అన్నారు. యువకుడైన విష్ణుశర్మకు పట్టుదల, తాను పండితుణ్ణనే అహం ఎక్కువ. ఐదు రోజుల పాటు నిద్ర, ఆహారం మాని కొండ గుహలలో తిరుగుతూ నరసింహ మంత్రం జపించాడు; నీరసించి, స్వరం తగ్గిపోయినా పట్టువదలలేదు. అతణ్ణి చూసిన ఒక ఆటవికుడు విష్ణుశర్మ వద్దకు వచ్చి 'నీకు ఏం కావాలి?' అని ప్రశ్నించాడు. నరసింహస్వామి కోసం వెతుకుతున్నానని చెప్పగా, ఆ స్వామి ఎలా ఉంటాడో చెప్పమని అడిగాడు.

విష్ణుశర్మ నరసింహస్వామి రూపాన్ని వర్ణించాడు. ఆటవికుడు "రేపు ఈ పాటికి మృగాన్ని నేను నీ దగ్గరకి తీసుకు రాలేకపోతే నా ప్రాణం తీసుకుంటాను" అని చెప్పి వెళ్ళిపోయాడు. ఎంత వెతికినా ఆ మృగం ఎక్కడా కనపడలేదు. సూర్యాస్తమయం అయింది. ఏం చెయ్యాలో తోచక "ఆ బ్రాహ్మణ బాలునికి నేను మృగాన్ని చూపించ లేకపోయాను. ఇక నాకు మరణమే శరణ్యం" అనుకుంటూ, అడవిలోని తీగెలు తెచ్చి తాడుగా పేని దాన్ని చెట్టు కొమ్మకి కట్టి ఉరి తీసుకోబోతుండగా ఆ ఆటవికునికి స్వామి కోటిసూర్యుల కాంతితో సింహపు ముఖం, మానవ శరీరం, అభయహస్తంతో అమిత తేజస్సుతో దర్శనం ఇచ్చాడు. తన మెడలోని తాడు తీసి స్వామి మెడలో వేసి విష్ణుశర్మ దగ్గరకు తీసుకొని వెళ్ళాడు.

విష్ణుశర్మతో "రాత్రంతా నిద్రలేకుండా వెతికాను, ఇప్పటికి కనపడింది" అని ఆటవికుడు అన్నాడు. విష్ణుశర్మకి స్వామిని కట్టిన తాళ్ళు కనపడ్డాయే తప్ప, స్వామి కనపడలేదు. కంట నీరు కారుతుండగా "స్వామీ, ఎన్ని రోజుల నుండి నిన్ను చూడాలని తపించి పోతున్న నాకు దర్శనం ఇవ్వకుండా ఈ పామరుడికి దర్శనం ఇచ్చావా" అని రోదించసాగాడు. "నువ్వు పండితుడననే అహంకారంతో ఉన్నావు. కానీ ఇతడు పామరుడైనా రాత్రీ పగలూ నన్నే స్మరించాడు కాబట్టి ఇతనికి నా దర్శనం లభించింది. ఈ మారు నువ్వు నా మాటలు వింటున్నావు, మరొక మారు నా దర్శనం అవుతుంది" అని చెప్పి అంతర్ధానమయ్యాడు స్వామి.

ఇది చెప్పి సనందనుడు "ఆ స్వామి ఇప్పుడు కాపాలికుణ్ణి వధించాడు" అన్నాడు. అప్పుడు నరసింహస్వామి శంకరుల వారికీ, సనందునికీ కూడా దర్శనం ఇచ్చాడు. ఆ రోజు నుండీ సనందుడు శంకర భగవత్పాదుల వారి శిష్యుడయ్యాడు. తరువాతి కాలంలో అతనే పద్మపాదునిగా ప్రసిద్ధి గాంచాడు. C





# యౌవనము

కామక్రోధాది అనేక దోషాలతో కూడిన గంటల హారాన్ని ధరించిన 'అభిమానం' అనే మదపుటేనుగు సంచరిస్తోంది. ఇది జీవులు ఎంతో భయపడవలసిన విషయం కాదంటారా స్వామీ? 'దుఃఖాలు' అనే కాలకూట విషసర్పాలు 'విషయ వాసనలు' అనే గాలి పీలుస్తూ, జీవుణ్ణి కాటు వేయడానికి అటూ ఇటూ సంచరిస్తున్నాయి. ఇది గమనించని ఆ యువకుడు మాత్రం "ఆహా! నా శరీరం ఎంతగా మెరుస్తున్నదో! నా నూనూగు మీసాలు చూస్తున్నారా?" అని చెప్పుకుంటూ భ్రమిస్తున్నాడు. కుత్సిత మనో వికారాలను, రాగాదులను, దుశ్చింతలను ఆశ్రయించే మనస్సుకు నిజమైన సుఖశాంతులు ఎక్కడ లభిస్తాయి? యౌవనం అనే పొరచే కప్పబడిన కనులకు తనను అతి వేగంగా సమీపిస్తున్న అధి వ్యాధులు, సంకల్ప వికల్పాల పరిణామాలు, మూర్ఖచర్యల దుష్ఫలితాలు ఏ మాత్రం కనిపించడం లేదు.

అంతా బాగానే ఉంది కానీ, ఈ యౌవన దార్ఢ్యం ఎన్నాళ్ళు ఉంటుందంటారు? అయ్యో! ఎంతో ప్రయాసతో సంపాదించు కొన్న అనేక సద్గుణాలు ఈ త్రిగుణ రూపాలైన యౌవన వాయు వీచికలచే పెకిలించివేయబడుతున్నాయే! అహంకారం, మోహం సుకుమారత్వాన్ని త్రుంచి వేస్తున్నాయి. వివేకం మరుగున పడిపోతోంది. కామాంధకారంతో గ్రుడ్డిది అయిన మనస్సు తాను ప్రసరిస్తున్న స్థానాలు ఎలాంటివో ఏ మాత్రం పరీక్షించుకోవడం లేదు.

మహర్షీ! ఈ యౌవనం శరీరానికి వెన్నెలలా కనిపించినప్పటికీ, చిత్తాన్ని మాత్రం అధోగతిపాలు చేసి నీచత్వాన్నీ, మూర్ఖత్వాన్నీ తెచ్చిపెడుతోంది. అతి త్వరలో నశించబోయే ఈ యౌవనపు పై పై మెరుగులు చూసి మోసపోవడానికి నేను సిద్ధంగా లేను.

ఒక వ్యక్తి ఎంతో శ్రమించి, అనేక ప్రయాసలకు ఓర్చుకొని చివరకు ఒక 'చింతామణి'ని సంపాదించాడు. "ఆహా! చూశారా! నేను ఎంత గొప్పవాడినో! ఇప్పుడీ చింతామణి నాదే కదా"! అని తలచి ఇంటికి బయలుదేరాడు. కానీ పాపం ఒక నదిని దాటుతుండగా మధ్యలో మణిని చేజార్చుకొన్నాడు. చూస్తూ ఉండగానే ఆ మణి కాస్తా నీటి ఉరవడికి కొట్టుకుపోయింది. అప్పుడు అతని మానసిక స్థితి ఎలా ఉంటుంది? ఈ యౌవనం విషయం కూడా అంతే. ఆశపడినన్నాళ్ళు పట్టదు. ఎప్పుడో ప్రవేశిస్తుంది. కామం లాంటి వికారాలన్నీ తలెత్తుతాయి. రాగం మొదలైన అనేక దోషాలు వివేకాన్ని కప్పివేస్తాయి. ఈ కథ ఇలా నడుస్తూ ఉండగా, ఇంతలో ఎక్కడి నుంచో ముసలితనం వచ్చిపడుతుంది. చూశారా మహర్షీ! మరి ఈ విషయాలన్నీ బాల్యంలోనే జనులు ఎందుకు చక్కగా విచారించరు?. యౌవనాన్ని చూసి మురిసిపోవడం చావుకు సిద్ధంగా ఉన్న బాలుణ్ణి ముద్దు పెట్టుకోవడం లాంటిదేనని నేను అనుకొంటున్నాను. ఎవరైతే క్షణభంగురమైన యౌవనాన్ని చూసి మోహితులై, "విషయానందమే జీవిత లక్ష్యం" అనే భావన కలిగి ఉంటారో వారు 'నరపశువులు' అని చెప్పబడుతున్నారు. వారు అతి త్వరలో కాలం చేత మోసగించబడినవారై, పశ్చాత్తాప పడబోతున్నారు.

స్వామీ! మళ్ళీ మళ్ళీ చెప్తున్నాను. ఈ 'యౌవనం' అనే మాయ నుంచి క్షేమంగా బయటపడినవారే మెచ్చుకోదగినవారు. పెద్ద పెద్ద మొసళ్ళున్న నదినైనా దాటవచ్చు. రాగద్వేషాదులతో నిండి ఉన్న ఈ యౌవనాన్ని దాటడం అంత తేలికైన విషయం కాదు. అది మహాప్రాజ్ఞులకు మాత్రమే సాధ్యం. యౌవనంలో శాంతి, దయ, దాక్షిణ్యం, వినయం మొదలైన ఉత్తమ గుణాలతో ప్రకాశించేవారు మనకు చాలా అరుదుగా కనిపిస్తారు. అత్యంత మధురఫలాలు, సుందర పుష్పాలు గల ద్రాక్ష తీగెలు ఎక్కడో గానీ తారసపడవు కదా! అందువల్ల నేను ఈ యౌవనం యొక్క వటాటోపాన్ని తూష్ణీకరించి మౌనం వహించాలని నిర్ణయించుకొన్నాను. C

*('శ్రీవసిష్ఠ రామ సంవాదం' వైరాగ్య ప్రకరణం నుంచి)*

**అనువాదం : వై. హెచ్. రామకృష్ణ**




ప్రవచనం: **శ్రీ సామవేదం షణ్ముఖశర్మ** విలేఖనం: **శ్రీమతి ఎన్. శేషు**

**(గత సంచిక తరువాయి)**

విశ్వమంతా నిరంతర ప్రవాహ రూపమైన చైతన్యం. అందుకు కావ్యకంఠ గణపతి వాశిష్ఠముని "ఉమా సంహిత"లో **"నిఖిలేషు ప్రవహన్తీం నిరుపాధి విమర్శయోగ దృష్యోర్మిం అజరాం, అజాం, అమేయాం, కామపి వందే మహాశక్తిం"** అన్నారు. కామపి మహా శక్తిం అంటే అనిర్వచనీయమైన మహాశక్తి. ఆమె ఎలాంటిది – *నిఖిలేషు ప్రవహన్తీం* – ప్రతీ అలలో సముద్ర శక్తి ఉంది కానీ సముద్రం అలకి మాత్రమే పరిమితమై లేదు, సర్వత్రా అదే వ్యాపించి ఉంది. అలాగే సర్వ జీవుల యందూ, మనం చూసే ప్రతీ వస్తువునందూ అఖండమైన ఆ చైతన్యమే వ్యాపించి ఉంది. ఆ చైతన్యం మాత్రం నిరవధికంగా వీటన్నిటికీ ఆధారమై ఉంటూ, వీటికి పరిమితమై ఒదిగిపోయి లేదు. ఇది గ్రహించడమే సర్వ ఉపనిషత్తులకీ, ఉపాసనలకీ పరమ గమ్యం. ఆ ఏకత్వ దర్శనం మనకి కావాలి. ఆ ఏకమే అనేకమై అన్నిటిలో భాసిస్తున్నది. ఇది తెలిస్తే ఈ విశ్వమంతా ఒకే మహా చైతన్యాన్ని మనం పరిశీలించగలం. మనం చేసే సర్వ సాధనలకూ లక్ష్యం "ఏకా" అయిన ఆ మహాచైతన్యాన్ని దర్శించి ఉపాసన చెయ్యడం. భగవద్గీత కానీ, పురాణాలు కానీ ఈ లక్ష్యాన్ని ఉద్దేశించే మనకు చెబుతున్నాయి. ఆ చైతన్యాన్ని మనం ఉపాసించేటప్పుడు బహు రూపాలలో భాసిస్తూ చైతన్యమే దేవి అని అర్థం చెప్పుకున్నాం. "దివ్" అనే ధాతువుకు ప్రకాశం అని అర్థం, ప్రకాశం అంటే చైతన్యం. ఈ చైతన్య స్వరూపమైన దేవి అన్న శబ్దానికి మరికొన్ని అర్థాలు చెప్పారు "దివ్యతే క్రీడతే యస్మాత్ ద్యోతతే రోచతే విదీ" "దివ్యతే క్రీడతే – ప్రకాశించునదీ, ఆడునదీ అని అర్థం. ఆడడమంటే స్పందన, (కదలడమే) చైతన్యం... అదే ఆట.



ఈ ఆట అనే శబ్దం చాలా విశేషమైనది. అమ్మవారు చేసే పనులన్నీ ఆటలు, మనం చేసే పనులు అవస్థలు. అంటుకోకుండా చేసే పని ఆట. ఇంత జగత్తు నిర్మాణం చేస్తూ దేనికీ అంటకుండా ఏ పరిమితికీ లోను కాకుండా సత్ చిత్ అయి సత్యమైన జ్ఞాన స్వరూపిణి అయి ఉన్న జగదంబిక. ఆమె లీలే ఈ జగత్తు. ఆట అంటే లీల అని అర్థం. సర్వ జగత్తు ఆవిడ యొక్క లీల. బ్రహ్మ సూత్రాలు కూడా జగద్విషయం ఏమిటి అంటే లోకమంతా లీలా కైవల్యం అని చెప్పాయి – లోకమంతా లీల మాత్రమే అని. లీల ఎవరైతే చేస్తున్నారో ఆ తల్లి దేవి. దేవః అని పుంలింగంలోనూ, దేవీ అని స్త్రీ లింగంలోనూ అన్నాం. అమ్మవారు స్త్రీ కాదు, పురుషుడూ కాదు, ఒక మహాచైతన్యం అని అమ్మవారి గురించి చెప్పే శాస్త్రాలు మనకి బోధిస్తున్నాయి. అయితే మనం ఆ చైతన్యాన్ని అమ్మా అని ఎందుకు పిలుస్తున్నామంటే ఆ చైతన్యం యొక్క అవసరం మన అందరికీ ఉంది, అవసరం గుర్తించి దాన్ని మరింత అఖండంగా అనుభవాన్ని పొందడానికి అమ్మవారిని – ఆ చైతన్యాన్ని ఉపాసన చేస్తున్నాం. ఉపాసన చేసినపుడు దేవుని రూపంలోనో, దేవీ రూపంలోనో మనం భావన చేస్తున్నాం.

ఆ చైతన్య స్వరూపిణిని "అమ్మా" అని పిలవడంలో ఒక విశేషం ఉంది. ప్రతీ జీవికీ అమ్మ అనగానే ఒక ధైర్యం కలుగుతుంది. అమ్మ అంటే కారణం, పోషణం, రక్షణం – ఈ మూడు భావాల సమాహారం. దానికి తోడు వాత్సల్యం (కారుణ్యం) నాలుగవది. అమ్మ అంటే కారణం. సర్వ జగత్తుకీ ఏది కారణమో దానిని "అమ్మ" అని మనం పిలుస్తున్నాం. కారణస్వరూపిణి – ఆ తల్లే లేకపోతే ఈ జగం పోషింపబడుతుందా? ప్రతి వాడి శక్తీ వాడికి

పోషణము. కంటికి రక్షణ, పోషణ, లక్షణ అన్నీ చూపే! అది లేనిదే ఏముంది? చూపు రూపంతో కంటిని అమ్మ వారే పరిపూర్ణం చేస్తున్నారు. పోషణం అంటే నింపడం. అలాగే సర్వ జగతి యందూ అమ్మ తన శక్తిని నింపి ఉంచింది. అలా నింపి పోషిస్తోంది, రక్షిస్తోంది; మనం గమనించకున్నా మనల్ని గమనిస్తోంది. సర్వ జగతిలోనూ సూర్యుడు, చంద్రుడు, కమలాలు... నదీ నదాలు... ఇవన్నీ కూడా ఎవరు నడిపితే నడుస్తున్నాయి... ఆ అమ్మ ఎంత కనిపెట్టుకుని ఉంటోంది! ఆ సర్వ చైతన్య స్వరూపిణి యొక్క లక్షణాల్లో మాతృభావం ఎంతగా కనిపిస్తోంది! ఇలాగ కారణము, పోషకము, రక్షణము, కారుణ్యము, వాత్సల్యము... ఇవన్నిటి సమాహారం అయిన ఆ చైతన్యాన్ని ''అమ్మా'' అని పిలిచేటప్పుడు వచ్చే ధైర్యం, ఆనందం, తృప్తి ఇంకే భావంలోనూ రాదు మనకి. అందుకే పోతన గారు. **అమ్మల గన్న యమ్మ ముగ్గురమ్మల మూలపుటమ్మ చాల పెద్దమ్మ సురారులమ్మ కడుపాఱడి బుచ్చెడియమ్మ తన్నులో నమ్మిన వేల్పుటమ్మల మనమ్ముల నుండెడియమ్మ దుర్గమాయమ్మ కృపాబ్ధి ఇచ్చుత మహత్వ కవిత్వ పటుత్వ సంపదల్"** అని ఆ అమ్మని ఎన్ని రకాలుగా భావన చేశారు!



అమ్మవారు మణిద్వీపంలో కూర్చుని ఉన్నారు. మనం ఉండేవి ఇసుక (సైకత) ద్వీపాలు. ఇసుక తనంతట తాను ప్రకాశించదు. మన ద్వీపాలను చూపించడానికి సూర్యుడు, చంద్రుడు అవసరం అయ్యారు. కానీ అమ్మవారి ద్వీపానికి వారి అవసరం లేదట! ఎందుకంటే దాని పేరే మణి ద్వీపం. మణి అంటే ప్రకాశక, ప్రచోదక లక్షణం కలది, తనంతట తాను ప్రకాశిస్తుంది. ఉపనిషత్తులు **"న తత్ర సూర్యోభాతి న చంద్ర తారకమ్"** అని చెబుతున్నాయి. అలాగే శ్రీకృష్ణ పరమాత్మ **"న తద్భాసయతే సూర్యః న శశాంకో న పావకః యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ"** అని గీతలో చెప్పారు. "దేన్ని చేరితే వెనక్కిరారో ఆ పరంధామమే నాది" అన్నారు పరమాత్మ. ఆ పరంధామమే ఇక్కడ మణిద్వీపం అని చెప్పబడుతున్నది. స్వయం ప్రకాశ స్వరూపమైన ఆ మణి ద్వీపంలో అమ్మవారు ఆ దివ్యసభలో కూర్చుని ఉన్నారు.

అన్ని బ్రహ్మాండాల నుండీ సర్వదేవతలూ వెళ్ళారు. వీళ్ళందరూ అమ్మకి నమస్కరిస్తున్నారు. అప్పుడు ఆమె శరీరం నుండి ఎనిమిది తెల్లని కిరణాలు వచ్చాయట. ఆ ఎనిమిది కిరణాలూ వాగ్దేవతలు. ఆ వాగ్దేవతలు వచ్చి అమ్మవారికి నమస్కారం చేశారట. **"శశిమణి శిలాభంగ రుచిభిః"** అన్నారు శంకరుల వారు. చంద్రకాంత శిల ముక్కలయితే ఎలా వెలుగుతాయో అలాగ వెలుగుతున్నారట వారు. (మామూలు వజ్రం కన్నా ముక్కలైన వజ్రం నుండి మెరుపులు ఎక్కువ వస్తాయట) అలా తెల్లని కాంతులతో ప్రకాశిస్తూ ఉన్నారు– వశిని, కామేశ్వరి, మోదిని, జయిని, అరుణ, సర్వేశ్వరి, కౌళిని మొదలయిన రూపాలతో ఉన్న ఆ ఎనిమిది మంది వశిన్యాది వాగ్దేవతలు. మన అక్షర వర్గంలో అ కారం నుండి అః వరకూ ముందు అక్షరాలు ఉన్నాయి. రెండవది క ఖ గ ఘ తరువాత చఛ జఝ, టఠడఢ, తథదధన, పఫబభమ, యరలవశషస తరువాత సహ– ఇలాగ ఎనిమిది వర్గాలున్నాయి. ఈ ఎనిమిది వర్గాలలో ఒక్కొక్క వర్గానికి ఒక్కొక్కరు అధిష్ఠాన దేవత. మనం ఏం మాట్లాడినా అక్షరాల్లో నుంచే మాట్లాడుతున్నాం, ఈ అక్షరాలన్నిటికీ వీళ్ళు అధిష్ఠాన దేవతలు. సర్వ శబ్ద శక్తులూ ఆ ఎనిమిదిలోనే దాగి ఉన్నాయి. ఈ శబ్ద శక్తులు అమ్మవారికి నమస్కారం చేసి "అమ్మా, నీ ఆజ్ఞ ఏమిటి" అని అడిగాయి. "ఈ లోకాలన్నీ తరించి పోవడానికి నా వైభవాన్ని చెప్పే నామాలు మీరు చెప్పండి" అన్నదిట అమ్మ. ''మేమే చెప్పాలా'' అంటే "నాగురించి నేను తప్ప ఎవరూ చెప్పలేరు, నాకు అభిన్నులైన వాక్స్వరూపులు మీరు, కనుక మీరు చెప్పాలి" అన్నది అమ్మ. ఎందుకోసమంటే లోకాలు తరించడానికట! "ఈ నామాలను అనుకొని లోకాలు తరించాలి. ఈ నామాలను భావన చెయ్యగా చెయ్యగా చివరకు సర్వవ్యాపిని అయిన ఆత్మస్వరూపిణిని నేను అని వారికి తెలియాలి. అలాంటి నామాల్ని మీరు పలకండి" అంటే అమ్మకి నమస్కరించి, వాళ్ళు వెయ్యి నామాల్ని పలుకుతూ పరవశించి మొదటగా ఒక్క పేరంటున్నారు అదే ''శ్రీమాతా''; ఇదొక్కటి చాలట తరించిపోవడానికి! **# (సశేషం)**




- స్వామి సుకృతానంద

– హై. శ్రీనివాసులు, బేథమంగళ

**? : నిరంతర స్మరణకు సులభమైన మార్గం తెలుపమనవి?**

✍: స్మరణం అంటే మరల మరల జ్ఞాపకం చేసుకోవడం. "శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం, అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనమ్" అని నవ విధ భక్తిమార్గాలు.

ఇందులో 'స్మరణ'కు ప్రహ్లాదుణ్ణి ఉదాహరణగా చెబుతారు. బాల భక్తుడైన ప్రహ్లాదుడు ఎన్ని కష్టాలొచ్చినా చావుబ్రతుకుల్లో శ్రీహరి నామస్మరణ విడువ లేదు. పిప్పిపన్ను నొప్పి వచ్చిన వ్యక్తి అన్నపానాదులూ, ఇతర పనులూ ఏవీ ఆపడు. అయితే ఏ పని చేస్తున్నా మనసు పంటి నొప్పిపైనే ఉంటుంది. భగవంతుని స్మరణ అదే విధంగా జరగాలి. అన్య పురుషుని కామించిన స్త్రీ ఇంట్లో అన్ని పనులూ చేస్తున్నా ఆమె మనస్సు తాను వలచిన పురుషునిపైనే ఉన్నట్లు ఇష్టదైవం స్మరణ ఉన్నట్లైతే దైవదర్శనం అవుతుంది అంటారు రామకృష్ణులు. ఇంత కంటే సులభ మార్గం ఏమైనా ఉంటుందా అన్నది సందేహమే!

– పి. రామారావు, విశాఖపట్నం

**? : పంచాక్షరీ మంత్రం వివరించ ప్రార్థన?**

✍: పంచాక్షరి అంటే ఐదు అక్షరాల నిరంతర మననం. పునఃపునః గుర్తుచేసుకోవడమే మననం. "ఓం నమశ్శివాయ" అనేది పరమేశ్వరుని పంచాక్షరి అంటారు. ఓంకారం శబ్ద బ్రహ్మకు ప్రతీక. నటరాజు ఓంకార స్వరూపుడు కూడా. సకల శుభాలనిచ్చే శివునికి నా నమస్కారం అని భావం. హృదయంలో శివుడు లేని శరీరం శవం అవుతుంది.

– ఎమ్.సురేంద్ర, ఆదిలాబాద్

**? : మంత్రదీక్ష ఇచ్చిన గురువు దేహత్యాగం చేస్తే శిష్యుని కర్తవ్యమేంటి? ఆయన జన్మతిథినాడు ఏమైనా నిర్వహించాలా?**

✍: గురువు ద్వారా మంత్రదీక్ష పొందినప్పుడు ఆ గురువు ఉన్నప్పుడూ, మహాసమాధి అయిన తర్వాతా కూడా ఆయన ఉపదేశించిన ఆదర్శాల్ని సన్న్యాస, లేక గృహస్థ శిష్యులు తు.చ. తప్పక పాటించాలి. గురువుగారి జన్మతిథిన పండగ అంటే ఉపవాసం లేదా ఎక్కువ జపధ్యానాలు చెయ్యాలి. పేరు ప్రతిష్ఠల కోసం ఆడంబరంగా పెద్ద పూజలు, హోమాలు నిర్వహించి, లక్ష్యం మరిస్తే ప్రయోజనం లేదు. బుద్ధుడు, క్రీస్తు,శంకరాచార్యులు, శ్రీరామకృష్ణులు మహాసమాధి అయిన తర్వాత వారి సన్న్యాస, గృహస్థ శిష్యులు నిద్రాహారాలు మాని కఠోరసాధనలు చేశారు. తమ తమ జగద్గురువుల దర్శనాలు పొందారు. మనం వారిలా చెయ్యలేకపోయినా మంత్రదీక్ష ఇచ్చిన గురువు త్యాగం, దయ, జీవితం, సాధనలు చదివి, సర్వభూతహితైషత, అవ్యాజ కరుణామయత, వివేక వైరాగ్యాలు మన జీవితాల్లో ఒక్క శాతం ఆచరించినా మన గమ్యం చేరుకొని ధన్యులం కావచ్చు.

– ఊ. మల్లేశ్వరరావు, కొత్త అగ్రహారం

**? : యజ్ఞఫలాన్ని అనుభవించేది 'నేనే' అని శ్రీకృష్ణుడు భగవద్గీత (అ.9. శో॥24,25)లో అన్నాడు. మరి ఇతర దేవతారాధకులు మరల జన్మించాలన్నాడు. మరి ఆ నేను అనే దేవుడు ఎవరు?**

✍: సర్వ యజ్ఞాల భోక్త ఆ కృష్ణపరమాత్ముడే. "యజ్ఞోవై విష్ణుః" అని వేదం చెబుతుంది. పరమాత్మ 'అంతర్యామి'గా అందరు దేవతల్లో ఉండి, యజ్ఞఫలాలకు భోక్త అవుతున్నాడు. యజ్ఞాలతో ఇంద్రాదిదేవతల్నీ; అర్యమాది పితృదేవతల్ని పూజించి, శ్రాద్ధ కర్మలను నిర్వహించేవారు; ఇతర క్షుద్రదేవతల్ని పూజించేవారూ ఆ యా దేవతల నుండి వరాలు పొంది, మరలా మరలా జన్మిస్తారు. అయితే కృష్ణభగవానుణ్ణి పూజించేవారు, ఆయనని అంతర్యామిగా "సర్వస్య చాహం హృది సన్నివిష్టః" (గీత) సర్వుల హృదయాల్లో ఆత్మగా ఉండే వాడు;'ఈశావాస్యమిదం సర్వం'...(ఈశోపనిషత్తు). ఈ చరాచర సృష్టి ఈశ్వరుడే అయి ఉన్నాడు... ఈ విధంగా ఆ పురుషోత్తముని పూజించే వారు ఆయన్నే చేరుకొంటారు. నదుల గమ్యం సముద్రమైనట్లు అటువంటి శుద్ధాత్ములు ఆయనలో లయమవుతారు. శ్రీకృష్ణుడు 'నేను' అంటే ఆయన పరమాత్మగా చెబుతున్నాడు. ఆయనకు మనలా దేహాత్మ భావం లేదు. ○




- స్వామి వివేకానంద

# నిజమైన స్వాతంత్ర్యం!

ఈ లోకంలో పిరికిపందలకు స్థానం లేదు. పారిపోవడానికి ప్రయత్నించవద్దు. జయాపజయాలను లక్ష్యపెట్టవద్దు. నిర్దుష్టమైన నిస్వార్థ సంకల్పంతో నిన్ను నువ్వు అనుసంధించుకొని కృషి చేస్తూ పురోగమించు! విజయాన్ని సాధించడానికే జన్మించిన మనస్సు అచంచలమైన దృఢసంకల్పంతో కూడిన దీక్షతో సాధన చేస్తుంది. పని చెయ్యడానికి నీకు అధికారం ఉంది. కానీ, దాని ఫలితాన్ని ఆశించేటంతటి పతనావస్థలో పడవద్దు. నిరంతరం పని చెయ్యండి. కానీ, పని వెనుక ఉన్నదేదో గమనించండి. సత్కార్యాలు కూడా మానవుణ్ణి బంధించగలవు. కాబట్టి సత్క్రియల చేత గానీ, పేరు ప్రతిష్ఠల కాంక్ష చేత గానీ బద్ధుడవు కావద్దు. ఈ మర్మమెరిగినవారు జనన మరణాలతో కూడిన సంసారచక్రాన్ని అతిక్రమించి అమృతులవుతారు.

సాధారణంగా సన్న్యాసి సమాజాన్ని విడిచిపెట్టి, బయటకు వెళ్ళి దేవుణ్ణి ధ్యానిస్తాడు. నిజమైన సన్న్యాసి ఈ సమాజంలోనే నివసిస్తాడు. సన్న్యసించి అడవులలో నివసిస్తున్నా, నెరవేరని కోర్కెలను గూర్చి చింతిస్తూ ఉండేవారు నిజమైన సన్న్యాసులు కారు. జీవిత సంగ్రామ రంగ మధ్యంలో నివసించు. కొండ గుహలలోనూ, నిద్రావస్థలోనూ ఎవరైనా ప్రశాంతంగానే ఉంటారు. సుడిగుండంలో, తీవ్ర కార్యరంగంలో నిలబడి కేంద్రాన్ని చేరుకోండి. కేంద్రాన్ని కనుగొన్నావంటే నిన్నేదీ చలింపజెయ్యలేదు.

మనకు నేత్రాలున్నాయని ఫలితాలనుబట్టిగాని గ్రహించలేం. అదేవిధంగా ఆత్మను దాని ఫలితాల వల్ల కాక మరో విధంగా తెలుసుకోలేం. ఇంద్రియ గోచర మవడానికి దాన్ని కింది అంతస్తుకు తీసుకురాలేం. లోకంలోని ప్రతి వస్తువునూ అదే నియమిస్తుంది; అది మాత్రం శాసన రహితం. మనం ఆత్మను తెలుసుకొన్నప్పుడు ముక్తుల మవుతాం. ఆత్మ ఏ నాటికీ మార్పు చెందదు. అది ఏ కారణానికీ వశం కాదు. అదే సర్వానికీ కారణం. అది తనకు తానే కారణం. మనలో ఏ కారణానికీ వశం కాని వస్తువును కనుగొనగలిగితే, దేవుణ్ణి దర్శించినవాళ్ళమే అవుతాం.

స్వాతంత్ర్యం అమృతత్వంతో అనివార్యంగా కలిసే ఉంటుంది. స్వతంత్రుడవడానికి ప్రకృతి శాసనాలకు అతీతంగా ఉండాలి. మనం అజ్ఞానంలో ఉన్నంతకాలం శాసనం ఉంటుంది. జ్ఞానోదయం అవడంతో మనలోని స్వాతంత్ర్యమే శాసనమనే సంగతి గ్రహిస్తాం. ఇచ్ఛ ఏనాడూ స్వతంత్రమైనది కాదు. అది కార్యకారణ సూత్రానికి బానిస. కానీ ఇచ్ఛకు వెనుక ఉన్న 'నేను' స్వతంత్రమైనది, అదే 'నేను'. 'నేను ముక్తుణ్ణి' - అన్న ప్రాతిపదిక మీద జీవన నిర్మాణం జరగాలి. స్వాతంత్ర్యమంటే అమృతత్వమే. c



# పరమేశ్వరుని పరిరక్షణలో ...

## స్వామి జపానంద స్వీయ అనుభవాలు -11

(గత సంచిక తరువాయి...)

## భారీగా భక్తి వ్యాపారం

హృషీకేశ్ నుంచి లక్ష్మణ్ ఝూలా దాటి స్వర్గాశ్రమం వెళ్ళడానికి తోవ ఉంది. 1947 - 48 మధ్య కాలంలో స్వర్గాశ్రమం ద్వారం వద్ద మౌనీబాబా కుటీరం ఉండేది. మౌనీ బాబా కుటీరానికి దగ్గరలో ఝూలా వైపు ఒక పెద్ద



విశాలమైన మర్రిచెట్టు ఉండేది. ఎదురుగా ప్రవహిస్తున్న గంగా నది ఉంది. దగ్గరలో గ్రామం ఏదీ లేదు. ఒక దేవాలయమైనా లేదు. నిర్జన ప్రదేశం. చాలా అందంగా ఉంది. స్వామి జపానంద పరివ్రాజక సన్న్యాసిగా ఒకసారి ఆ ప్రదేశానికి చేరుకున్నారు. అక్కడ మర్రిచెట్టు కింద ఒక అడుగు ఎత్తుగా కూర్చునేందుకు వీలుగా త్రికోణాకారంలో పెద్ద రాయి ఉండడం జపానందజీ చూశారు. ఆ స్థలం ధ్యానం చేసుకుందుకు వీలుగా ఉంది. కానీ వచ్చే పోయే మనష్యులు మల మూత్రాదులతో ఆ స్థలాన్ని పాడు చేశారు. చుట్టూ పొదలు ఉన్నాయి. జపానంద ఆలోచిస్తూ ముందుకు వెళ్ళారు. స్వర్గాశ్రమంలో ఉండే మలబార్ బ్రహ్మచారి గిరిధారీ లాల్ ఎదురయ్యారు. "స్వామీజీ! మీరు ఇక్కడేం చేస్తున్నారు? ఇక్కడంతా దుర్వాసనతో నిండి ఉంది" అన్నారు. "నిజమే కానీ ఇక్కడికి వచ్చి చూడండి" అని పిలిచారు సన్న్యాసి. అక్కడ త్రికోణాకారంలో ఉన్న రాయిని చూపించి "ధ్యానానికి అనువైన స్థలం. ఇక్కడ శుభ్రం చేసుకుంటే బాగుంటుంది." అన్నారు. వారిద్దరూ ఆ ప్రాంతాన్ని శుభ్రం చేశారు. త్రికోణాకారంలో ఉన్న రాయి మీద ఇద్దరూ కూర్చుని సత్సంగం చేసుకుంటూ ఆనందించ సాగారు. కొన్ని రోజుల పాటు ఇది ఇలా కొనసాగింది. చలికాలం గడిచి గ్రీష్మకాలం ప్రారంభమైంది. కేదార్ - బదరీ యాత్రల సమయం వచ్చింది. జన సంచారం మొదలయింది. ఒక రోజు బ్రహ్మచారి వచ్చి సన్న్యాసితో "స్వామీజీ ఆ స్థానం ఎవరో ఆక్రమించారు. కొంతమంది వైష్ణవ సాధువులు ధుని వెలిగించి అక్కడ కూర్చుని ఉన్నారు. ఆ రాయికి సిందూరం కూడా పెట్టారు" అని చెప్పారు. అలాగా... అంటూ సన్న్యాసి కూడా అక్కడకు వచ్చి చూశారు. "ఈ రాయికి పూజ ఎందుకు చేశారు? ఈ సిందూరం ఏమిటి?" అని వాళ్ళను అడిగారు.

అటు నుంచి గంభీరంగా సమాధానం వచ్చింది "ఇది కూడా తెలియదా? ఇది సీతమ్మవారి ఆసనం. శ్రీరామచంద్రుడు రావణాసురుణ్ణి చంపిన తరువాత బ్రహ్మహత్యా పాపం నుంచి విముక్తుడయ్యేందుకు తపస్సు చేయడానికి ఈ ప్రదేశానికి వచ్చారు. వారితో కలిసి సీతమ్మ కూడా వచ్చారు. ఆ అమ్మ ఇక్కడే ఈ రాతి మీద కూర్చుని తపమాచరించారు" అన్నారు.

ఆ విధంగా సన్న్యాసి, బ్రహ్మచారి కూర్చుని ధ్యానం చేసుకునే త్రికోణాకారపు రాయి సీతమ్మ వారు తపస్సు చేసుకున్న ఆసనంగా ప్రచారమైపోయింది. దీన్ని ఇంగ్లీష్‌లో ప్రీస్ట్ క్రాఫ్ట్ (పండాల వ్యాపార ప్రవృత్తి) అంటారు. ఇలాగ అన్ని దేశాలలో ధర్మం పేరిట బ్రతుకు తెరువు బాట వెతుక్కోవడం జరుగుతుంది.

ఈ సంఘటన జరిగిన కొన్ని రోజులకు స్వర్గాశ్రమంలో మణికూట పర్వతం దగ్గర గంగానది మధ్యలో ఉన్న ఒక శిల మీద హనుమంతుడు తపస్సు చేశాడు అని ఒక వార్త ప్రచారమైంది. అది కూడా సన్న్యాసి, కేరళ బ్రహ్మచారి తరచుగా కూర్చుని ఉపనిషత్ పఠనంచేసే స్థలమే. అప్పుడప్పుడు వేరే సాధువులు కూడా వచ్చేవారు. ఆ శిల గంగ మధ్యలో తీరానికి దూరంగా ఉంది. వర్షాకాలంలో అది నీటిలో మునిగిపోయేది. దాని మీద నుంచి తీవ్రమైన వేగంతో నీరు ప్రవహించేది. అయినా చూడడానికి చాలా అందంగా ఉంటుంది. తీరం వైపు గోడలా ఉండి కూర్చొనేందుకు అనువుగా కుర్చీలా ఉంటుంది. నీటి

ప్రవాహ వేగానికి అరిగి ఎవరో చక్కగా పాలిష్ చేసినట్లు నున్నగా అర్ధ చక్రాకారంలో అందంగా ఉంది. దాని మీద స్వచ్ఛమైన ఇసుక ఉంది. అక్కడ కూర్చున్న వాళ్ళు తీరం నుంచి కనబడరు. అందుకని సన్న్యాసికి ఆ ప్రదేశం ఎంతో నచ్చింది.

ఒక శనివారం మధ్యాహ్నం భోజనమయ్యాక సన్న్యాసి, కేరళ బ్రహ్మచారి కలిసి అక్కడ కూర్చుని ఛాందోగ్యోపనిషత్ భాష్యం చర్చించుకుంటున్నారు. అప్పుడే స్వర్గాశ్రమంలో పని చేసే నేపాలీ వంటవాడు అక్కడికి వచ్చాడు. ఆ స్థలం చూసి "అబ్బ, ఎంత అందంగా ఉందో ఈ ప్రాంతం. ఈ గోడలా ఉన్న రాతి మీద హనుమాన్‌జీది చక్కటి బొమ్మ గీయవచ్చు" అన్నాడు. అతను హనుమంతుడి భక్తుడు, అక్కడక్కడ బొమ్మలు గీసేవాడు. సన్న్యాసి, బ్రహ్మచారితో "ఇంకేముంది. ఈ స్థలం కూడా మన చేతిలో నుంచి పోయేలా ఉంది. ఇతను ఇక్కడ తప్పకుండా హనుమంతుని బొమ్మ గీస్తాడు. వచ్చేపోయే వాళ్ళను పిలిచి చూపిస్తాడు. నిర్జన ప్రదేశంలో మనం పొందుతున్న ఆనందం ఇంతటితో సరి" అన్నారు.

అనుకున్నట్లే అయింది. ఆ రాత్రే పది గంటలకు నేపాలీ వంటతను కొబ్బరికాయ ప్రసాదం తీసుకుని కుటీరానికి వచ్చి "ఆంజనేయుని పూజ చేసి ప్రసాదం తీసుకొచ్చాను." అన్నాడు. ఉదయం సన్న్యాసి అక్కడికి వెళ్ళి చూస్తే అక్కడ నిలువెత్తు ఆంజనేయుని చిత్ర పటం ఉంది. ధూప దీప నైవేద్యాలు అన్నీ అయిపోయాయి. అంతటితో కథ ఆగి పోలేదు. కొంతకాలానికి అక్కడ సంతర్పణ జరిగింది. "సీతారామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు ఇక్కడకొచ్చి తపస్సు చేసుకొన్నప్పుడు హనుమంతుడు ఈ శిల మీద కూర్చుని తపస్సు చేశారు. ఇప్పుడు ఇక్కడ హనుమంతుని ఆలయం నిర్మించాలని నిర్ణయించాం. దాని కొరకు ఒక ధర్మ పరాయణుడైన వర్తకుడు నలభైవేల రూపాయలు విరాళం ఇచ్చారు" అని అచ్చువేసిన కరపత్రాలు అందరికీ పంచి పెట్టారు. ఈ విషయమై సన్న్యాసి, బ్రహ్మచారి భోజన సమయంలో మాట్లాడుకుంటున్నారు. సరిగా అప్పుడే వర్తకుడు అక్కడికి వచ్చారు. వారి సేవకుడు వచ్చి సన్న్యాసికి వారిని పరిచయం చేశాడు. "ఈయనే ఆలయ నిర్మాణ కార్యం చేపట్టారు" అని చెప్పాడు. సన్న్యాసి "అయ్యా మీరు ఆలయ నిర్మాణం చేయిస్తున్న స్థలాన్ని బాగా చూశారా? అక్కడ వర్షాకాలంలో గంగానది ప్రవాహ వేగం చాలా తీవ్రంగా ఉంటుంది. ఆ సమయంలో అక్కడకు ఎవరూ వెళ్ళలేరు. ఆ ఆలయం కొట్టుకుపోయే ప్రమాదం ఉంది" అని చెప్పారు. అందుకు సేవకుడు "తీరం నుంచి ఆ శిలదాకా ఎత్తుగా బాటలా వేద్దాం. అప్పుడేమీ అవదు"



అన్నాడు. కానీ అంచనావేస్తే అలా బాట కట్టడానికే లక్ష రూపాయలకు పైగా ఖర్చు అవుతుంది. వర్తకుడు చింతితుడై సన్న్యాసితో "ఇప్పుడు ఏమి చెయ్యడం. గంగాదేవి దగ్గర నిల్చుని నేను ఆలయ నిర్మాణం చేయిస్తానని సంకల్పం కూడా చేశాను. మరేదైనా ఉపాయం ఉందా?" అని అడిగారు. సన్న్యాసి ఇలా అన్నారు: "ఈ శిల ఎదురుగా గంగాతీరంలో ఖాళీ స్థలం చూసుకుని ఆలయం కట్టిస్తే మీ సంకల్పం సిద్ధిస్తుంది. మీ ఉద్దేశం కూడా నెరవేరుతుంది." ఈ ఉపాయానికి వ్యాపారి చాలా సంతోషించాడు. సేవకుడు కూడా అది బాగుందన్నాడు. తరువాతి కాలంలో గంగాతీరంలో హనుమంతుడి ఆలయం నిర్మించబడింది. అది ఇప్పటికీ ఉండే ఉంటుంది.

ఈ సంఘటనలన్నీ పరిశీలిస్తే ఈ ప్రకారంగా జనుల అజ్ఞానాన్ని చాలామంది స్వలాభానికి వాడుకుంటారని తెలుస్తుంది. భారతీయులకు దేవుని మీద శ్రద్ధా భక్తులు ఎక్కువగా ఉండడం వల్ల ఆలోచించకుండా ఇటువంటి విషయాలన్నీ నిజమనుకుంటారు. నిజంగా హనుమంతుడు వెతికి వెతికి అలాంటి స్థలం తపస్సుకు ఎంచుకుని ఉంటారా? నిజంగా సీతమ్మ వారు శ్రీరామచంద్రుణ్ణి వదలి ఒక్కరే ఉండి ఆ శిల మీద తపస్సు చేసి ఉంటారా? ఇవన్నీ జవాబులు లేని ప్రశ్నలు! C

**(మిగతా వచ్చే సంచికలో...)**

**అనువాదం : శ్రీమతి జి.ఎస్. లక్ష్మి**

## ఆచార వ్యవహారాలు - అంతరార్థాలు- 27

- రెంటాల జయదేవ

### 30 వేల ఫలితాన్నిచ్చే ఒకే ప్రదక్షిణం - చండ ప్రదక్షిణం

ఇంతకు మునుపే చెప్పుకున్నట్లు శివాలయంలో ఉత్తమోత్తమమైన ప్రదక్షిణం 'చండ ప్రదక్షిణం'. శివునికి ప్రదక్షిణం చేసేటప్పుడు సోమసూత్రం దాటకూడదు. అలా చేసి ఏ ప్రదక్షిణమైనా, ఒకటే లెక్క కిందకు వస్తుంది. అలా కాకుండా, 'చండ ప్రదక్షిణం' ఒక్కసారి చేసినా సరే, 30 వేల సార్లు ప్రదక్షిణ చేసిన ఫలం లభిస్తుంది. ఆ 'చండ ప్రదక్షిణం' ఎలా చేయాలో శైవాగమ గ్రంథాల్లో ఇలా చెప్పారు:

**చండ స్థానే తు సంకల్ప్య। వృషభా దౌ ప్రదక్షిణమ్ ॥**
**వృషం చండం వృషం చైవ। సోమసూత్రం పునర్వృషం ॥**
**చండం చ సోమసూత్రం చ। పునశ్చండం పునర్వృషం ॥**
**నవ ప్రదక్షిణోపేతం। యః కుర్యాచ్చ ప్రదక్షిణమ్ ॥**
**త్రింశత్ సహస్ర సంఖ్యాక। ప్రదక్షిణ ఫలం లభేత్ ॥**

(శైవాగమే)

**శివాలయంలో 'చండ ప్రదక్షిణ' చేయాలంటే...**

*1. మొదట శివాలయంలోని చండీశ్వరుని వద్ద సంకల్పించి, ప్రదక్షిణ ప్రారంభించాలి. (శివాలయంలో శివునికి అభిషేకం చేసిన జలం గర్భగుడిలో నుంచి బయటకు ధారగా వచ్చే సోమసూత్రం దగ్గర సాధారణంగా చండీశ్వరుడి విగ్రహం ఉంటుంది. ఒకవేళ చండీశ్వరుడు లేకపోయినా, సోమసూత్ర స్థానాన్నే చండీశ్వర స్థానంగా గుర్తించాలి). అక్కడ మొదలుపెట్టి, సవ్యదిశలో ధ్వజస్తంభం వద్ద ఉండే వృషభం (నందీశ్వరుడి) వద్దకు రావాలి.*

*2. అక్కడ నుంచి సవ్యదిశలోనే చండీశ్వరుని వద్దకు వెళ్ళాలి.*

*3. అప్పుడిక చండీశ్వరుని వద్ద నుంచి వెనక్కి తిరిగి, అపసవ్య దిశలో ప్రదక్షిణ ప్రారంభించి, మళ్ళీ ధ్వజస్తంభం దగ్గరుండే వృషభం దగ్గరకు వెళ్ళాలి.*

*4. వృషభం దగ్గర నుంచి అపసవ్యదిశలోనే చండీశ్వరుని దాకా పయనించాలి.*

*5. దాంతో, ఆలయాన్ని రెండు సార్లు చుట్టి వచ్చినట్లయింది. ఆ పైన మళ్ళీ మొదటిసారిలానే, సోమసూత్రం నుంచి సవ్యదిశలో ప్రదక్షిణ చేస్తూ, ధ్వజస్తంభం దగ్గరున్న వృషభం వద్దకు వెళ్ళాలి.*

*6. వృషభం వద్ద నుంచి చండీశ్వరుని దాకా ప్రదక్షిణ చేయాలి.*

*7. అప్పుడిక మళ్ళీ చండీశ్వరుని దగ్గర నుంచి అపసవ్య దిశలో ప్రదక్షిణ ప్రారంభించి, మళ్ళీ ధ్వజస్తంభం వద్దనున్న వృషభం దగ్గరకు వెళ్ళాలి.*

*8. వృషభం వద్ద నుంచి అపసవ్యదిశలోనే ప్రదక్షిణ చేస్తూ, చండీశ్వరుని దాకా పయనించాలి.*

*9. అక్కడ చండీశ్వరుని దర్శించి, నమస్కరించి, ఆయన దగ్గర నుంచి సవ్యదిశలో ధ్వజస్తంభం వద్దనున్న వృషభం దగ్గరకు రావాలి.*




ఇలా ఈ తొమ్మిది పనులూ చేస్తే, అప్పుడది ఒక 'చండ ప్రదక్షిణం' కింద లెక్క. (మరింత వివరంగా అర్థం కావడానికి పక్కన ఇచ్చిన రేఖా చిత్రం చూడండి) ఒక చండ ప్రదక్షిణంలో మొత్తం 9 ప్రదక్షిణలు ఇమిడి ఉన్నాయి. ఇలా ఒక 'చండ ప్రదక్షిణం' చేస్తే, శివుడికి 30 వేల ప్రదక్షిణలు చేసినంత పుణ్యం దక్కుతుంది.

ఇలా ప్రదక్షిణం చేయడం పూర్తయ్యాక, ధ్వజస్తంభం ఎడమ పక్క నుంచి శివాలయంలోకి వెళ్ళి, శివుణ్ణి దర్శించాలి.

నందికి ఏ పక్క నుంచి గుడి లోపలకు వెళతామో, ఆ పక్క నుంచి మాత్రమే వెనుకకు రావాలి. అంతేకానీ, శివలింగం, నందీశ్వరుల మధ్య నుంచి రాకూడదు. అలా వస్తే, పుణ్యం రాకపోగా, పూర్వజన్మ పుణ్యం కూడా పోతుంది.

శివాలయంలో నందీశ్వరుణ్ణి ప్రార్థించిన తరువాతే స్వామి వారిని దర్శించడానికి వెళ్ళాలి. నందీశ్వరుని అనుమతి లేనిదే శివపూజ చేయకూడదు. అలా చేస్తే ఫలితం ఉండదు. d

***(సవ్య ప్రదక్షిణ ఎక్కడ? అపసవ్య ప్రదక్షిణ ఎక్కడ? వచ్చే సంచికలో...)***

# పండితుల పరువు నిలిపిన పసివాడు

చిత్రాలు: దాకోజు శివప్రసాద్ కథ: స్వామి జ్ఞానదానంద
















"ఆ పొగరుబోతు కుర్రకుంకను
ఇక్కడకు తీసుకురండి"


ఎందుకు నాయనా మనకీ గొడవ !
ఆ సొమ్ము ఎలాగో ఇచ్చుకుంటాను.
నువ్వు జోక్యం చేసుకోకు!
గురువర్యా! మీ కష్టం నా కష్టం కాదా! ఈ
అన్యాయాన్ని చూస్తూ ఎలా సహించను?


పండితుల వారు నిన్ను తీసుకురమ్మన్నారు !
రాకపోతే రెక్కపట్టుకు ఈడ్చుకు రమ్మన్నారు.


మీకూ, మీ పండితుడికీ మర్యాద
తెలియనట్లుందే ! తగిన విధంగా
ఆహ్వానిస్తే, రావడానికి నాకు
అభ్యంతరం లేదు
శిష్యులు ఈ మాటలను
మహారాజుకు నివేదించారు.


రాజు సమస్త మర్యాదలతో ఆహ్వానం పంపించాడు.
మన పండితుల వారితో ఈ
పిల్లవాడు సరితూగగలడా!
నాకు మాత్రం ఈ రోజు
ఆ పిల్లవాడే గెలుస్తాడనిపిస్తోంది.


"పిల్లవాడు జయిస్తే వాడికి అర్ధరాజ్యాన్ని
ధారాదత్తం చేస్తాను.
ఆ పిల్లవాడు ఓడిపోతే మన రాజ్య
ప్రజలందరికీ నేనే స్వయంగా
వండి వడ్డిస్తాను.

మిగతా 36వ పేజీలో...

# బ్రహ్మానంద స్పర్శతో బ్రహ్మానుభూతి

సాధువులు, భక్తులు కలసి రోజూ సాయంకాలం భజన చేసేవారు. మహాపురుష్ (స్వామి శివానంద) మహరాజ్ తబలా వాయించగా రాజా మహరాజ్(స్వామి బ్రహ్మానంద) నృత్యం చేసేవారు. మిగతా భక్తులు కూడా వారితో కలిసేవారు. రాజా మహరాజ్ కళ్ళు సగం మూతబడగా, వారు చేతులతో చప్పట్లు చరుస్తూ ఉండడం చూశాను. వారు మత్తులో ఉన్నట్లు కనపడేవారు. అప్పుడు నాకదేమిటో తెలియక పోయినా 'శ్రీరామకృష్ణ కథామృతం' చదివాక వారు భావ సమాధిలో ఉండేవారని తెలిసింది.

నారాయణ స్వామి అయ్యర్ అనే ఓ భక్తుడు ఉండేవాడు. 'బ్రహ్మవాదిన్' అనే పత్రికకు అతను చందాదారుడు. శ్రీరామకృష్ణులు, స్వామి వివేకానంద, గురుదేవుల ఇతర ప్రత్యక్ష శిష్యుల గురించి అతనికి బాగా తెలుసు. అతను అవివాహితుడు. తల్లి బాగోగులు చూసుకుంటూ నెలకు 8 రూపాయల జీతంతో ఒక తోట పర్యవేక్షకునిగా పని చేసేవాడు. అతనికి శ్రీరామకృష్ణులను దర్శించిన వారిని స్పృశించాలనే కోరిక ఉండేది. దివ్యజనని శ్రీశారదామాత 1910లో మద్రాసు రానున్నారని తెలిసి, ఆమెను చూడాలనుకున్నాడు. దురదృష్టవశాత్తూ అతని కుటుంబంలో ఎవరో దివంగతులవడంతో అతని ప్రయాణం ఆగిపోయింది.

1921లో స్వామి బ్రహ్మానందజీ మద్రాసు రామకృష్ణ మఠంలో ఉన్నప్పుడు నారాయణస్వామి తన కోరిక నెరవేరుతుందని ఆశించాడు. రాజా మహరాజ్‌ను చూడాలని అతను మద్రాసు మఠానికి వెళ్ళాడు. రాజా మహరాజ్ రామకృష్ణ మిషన్ స్టూడెంట్స్ హోమ్‌లో ఉన్నారని తెలిసి అతను అక్కడకు వెళ్ళాడు. రాజా మహరాజ్ రామకృష్ణ మిషన్ స్టూడెంట్స్ హోమ్‌లో ఒక దుష్టశక్తి తిష్ఠ వేసినట్లు గ్రహించారు. అప్పుడు అక్కడ రామనామ సంకీర్తనం చేశారు. నారాయణ స్వామి మధ్యాహ్నం 1.30 గంటలకు అక్కడకు చేరాడు. రాజా మహరాజ్ మధ్యాహ్నం భోజనం ముగించి అప్పుడే విశ్రమించారు. ఆ సమయంలో వచ్చినందుకు నారాయణ స్వామిని వారి సేవకుడు మందలించాడు. అయితే రాజా మహరాజ్ వారిరువురి సంభాషణ విని, ఆ భక్తుణ్ణి తమ గదిలోకి పంపమని సేవక్‌తో చెప్పారు.

తరువాత నేను అడగగా నారాయణస్వామి తాను రాజా మహరాజ్‌ను కలసిన వైనం ఈ విధంగా చెప్పాడు: "నేను గదిలోకి వెళ్ళి పూలు, పళ్ళు సమర్పించి వారికి ప్రణామాలు అర్పించాను. వెంటనే వారి పాదాలను చేతులతో పట్టుకుని నా తల తాకించాను. నా కనుల నుండి అశ్రువులు ధారగా కారసాగాయి. అలా ఎంత సేపు ఉన్నానో నాకే తెలియదు. ఆనందంతో పులకించి పోయాను. నా చిరకాల వాంఛ నెరవేరింది అనుకున్నాను. శ్రీరామకృష్ణుల వారిని దర్శించిన రాజా మహరాజ్‌ను స్పృశించగలిగాను. రాజా మహరాజ్ తమ చేతిని నా తల మీద ఉంచి ఆశీర్వదించి, నన్ను లేచి నిలబడమన్నారు. ప్రశాంతంగా ఉన్న వారి వదనం చూశాను. తరువాత గౌరవ సూచకంగా వారికి అభిముఖంగా ఉండి, నేను వెనుకకు నడిచాను. శ్రీరామకృష్ణుల ఆధ్యాత్మిక పుత్రుణ్ణి కలవడం నా జీవితంలో మరువరాని క్షణం."

శ్రీరామకృష్ణులు చెప్పినట్లు మిరపకాయ తెలిసి కొరికినా, తెలియక కొరికినా నాలుక మండుతుంది. రాజా మహరాజ్ పాదాలను నారాయణ స్వామి భక్తితో స్పృశిస్తే, నేను భయంతో స్పృశించాను. అయితే రెండిటికీ ఫలితం బ్రహ్మానుభూతే! ◻

**(స్వామి సర్వజ్ఞానంద స్మృతుల నుంచి)**



# తారకనామంతో తరించిన త్యాగయ్య

– బి. సైదులు

**అది తమిళనాడులోని పుదుకోట్టై సంస్థానం... ఒకరోజు ఆ సంస్థానాధీశుడు రామచంద్ర తొండమాన్ కొలువు తీరిన పండితసభకు ఓ సవాలు విసిరాడు. కొలువులో ఓ దీపస్తంభాన్ని నిలబెట్టి, నూనెలో తడిసిన వత్తుల్ని అమర్చి, 'సంగీతానికి నిజంగా చైతన్య పూరితమైన శక్తే ఉంటే, స్వరాలతో ఈ దీపాలు వెలిగించండి' అన్నాడు. ఇది సంగీత జ్ఞానులకే కాదు... నిజంగా సంగీతానికే ఓ సవాలు. సభలో ఒక్కసారిగా నిశ్శబ్దం ఆవరించింది. గాయకులంతా నిరుత్తరులయ్యారు. ఇంతలో ఒక గురువుగారు తన ప్రియశిష్యుణ్ణి కనుసైగతో ఆదేశించారు. స్వరయజ్ఞం సాగించమని సూచించారు. అనుజ్ఞ అందుకున్న మరుక్షణమే ఆ శిష్యుడు 'జ్యోతి స్వరూపిణి' రాగంలో కీర్తన ఆరంభించాడు. ఆశ్చర్యం! అలా రాగధార ఓ వైపు... వెలుగుతున్న దీపాలు మరోవైపు మహారాజుతో పాటు, మహామహులైన స్వరపండితుల్ని కూడా సంభ్రమాశ్చర్యాల్లో ముంచెత్తాయి. ఆ స్వరం ఎవరిదో కాదు... వాగ్గేయకారుడు శ్రీత్యాగరాజస్వామిది.**

మధురకీర్తనలతో శ్రీరామ చరణాలను అర్చించి కర్ణాటక సంగీతానికే సొబగులద్దిన మహానుభావుడు త్యాగయ్య. నేడు మనం ఎంతో మధురంగా ఆలపించే, ఆస్వాదించే తరిస్తున్న ఎన్నో కీర్తనలు ఆయన ప్రసాదమే. తను మహానుభావుడైనా 'ఎందరో మహానుభావులు... అందరికీ వందనాలు..' అనగలిగే వినమ్రత, పరమపదమైన రామపాదాన్ని మించి ప్రాపంచిక సంపదంతా నిరుపయోగమని 'నిధి చాల సుఖమా? రాముని సన్నిధి సేవ సుఖమా?' అని ప్రశ్నించగలిగే నిబద్ధత ఆయన సొంతం.

తమిళనాడులోని తంజావూరు జిల్లాలో తిరువారూర్‌లో సర్వజిత్ నామ సంవత్సరంలో (1767 మే 4న) పుట్టారాయన. త్యాగయ్య వంశస్థులు తెలుగువారే. పురందరదాసు కీర్తనలు, జయదేవుని అష్టపదులు తల్లి జోలపాటలుగా పాడుతుంటే పొత్తిళ్ళలో నిద్రపోతూనే తనలో స్వరజ్ఞానాన్ని మేలుకొలిపాడు త్యాగయ్య. అందుకే ఏడేళ్ళకే ఆయన 'నమో నమో రాఘవాయ' అనే కీర్తనతో శ్రీరాముని స్వరార్చనకు శ్రీకారం చుట్టాడు. తనయుడి 'రాగ'కాంక్షకు ముచ్చటపడి తండ్రి రామబ్రహ్మం త్యాగయ్యని శొంఠి వేంకట రమణయ్య అనే సంగీత విద్వాంసుడి దగ్గర శిష్యునిగా చేర్చారు. ఆ తరువాత ఓ విద్వత్సభలో బిలహరి రాగంలో 'దొరకునా ఇటువంటి సేవ' అని ఆలపించిన త్యాగయ్య పాండిత్యానికి పులకించిన గురువుగారు 'దొరకునా ఇటువంటి శిష్యుడు...' అనుకుంటూ ఆనందబాష్పాలు రాల్చారట. అలా స్వరసాధనలో త్యాగయ్యకు ఒకానొక రోజు స్వయాన నారదుడే మారువేషంలో వచ్చి సంగీత జ్ఞానకోశాన్ని 'స్వరార్ణవం', 'నారదీయం' గ్రంథాల రూపంలో ఇచ్చివెళ్ళాడట.

## తారకమంత్రంతో తాదాత్మ్యం :

రామనామమే మధుర సుధారసంగా భావించే త్యాగయ్య అనన్య సామాన్యమైన రీతిలో ఆ తారకమంత్రాన్ని జపించాడు. ఒక సిద్ధుని ఆదేశం మేరకు 96 కోట్ల సార్లు రామమంత్రాన్ని పారాయణం చేశాడు త్యాగయ్య. తిరువయ్యూరులోని పంచనదీశ్వర దేవాలయ మండపంలో కూర్చొని మధ్యాహ్నవేళ తారకమంత్రాన్ని జపించేవాడు. ఆ సాధనకు బాలమోహన రూపంలో ఆ శ్రీరామచంద్రుడే ప్రత్యక్షమయ్యాడట. ఆ తాదాత్మ్యంలోనే ఆశువుగా ఎన్నో కీర్తనాలు ఆలపించాడాయన.

## నిధులనే కాదన్న యోగి :

ఊహ తెలిసినప్పటి నుంచీ ఉదర పోషణార్థం తాపత్రయపడడం నచ్చేది కాదు త్యాగయ్యకి. ఆయన పూర్వీకులు రాజుల్ని ఆశ్రయించి జీవనోపాధి కల్పించుకున్నవారే. కానీ ఈయనకది నచ్చేది కాదు.

చిన్నతనంలో తండ్రితో పాటు రాజ దర్బారుకు వెళ్ళేటప్పుడు రాజుల దురహంకారాన్ని, అవివేకాన్ని గమనించడం వల్ల అప్పటి నుంచే మానసికంగా రాజసేవను అసహ్యించుకునేవాడు. ఆ కారణంతో తన జీవితాన్ని పవిత్రంగా గడపాలని ఉంఛవృత్తి (భిక్షాటనం) స్వీకరించాడు. తంబురా చేత పుచ్చుకొని ఒకరిద్దరు శిష్యులతో తాళం వేస్తూ రామనామసంకీర్తన చేస్తూ గృహస్థులు ప్రీతితో సమర్పించే సంబారాలతో ఇంటికి వచ్చి దేవతార్చన చేసి ఆ పై భుజించేవాడు త్యాగయ్య.



ఈ గానప్రశస్తి తంజావూరు మహారాజు రెండో శరభోజి చెవిన పడింది. వైణికుడు, గాయకుడు, పరమ భక్తాగ్రేసరుడు అయిన త్యాగయ్యను చూడాలని కబురు పంపాడు. మహారాజు ఆంతరంగికులు త్యాగయ్య దగ్గరకు వచ్చి ఒకటి రెండు పాటలు ప్రభువుల పేర పాడితే పదెకరాల భూమి కూడా పారితోషికంగా ఇస్తారని ఆశ చూపారు. కానీ త్యాగయ్య సున్నితంగా తిరస్కరిస్తూ 'నిధి చాలా సుఖమా... రాముని సన్నిధి సేవ సుఖమా... నిజముగ తెల్పుము మనసా' అని కానుకల్ని కూడా నిరాకరించాడు. వెంటనే రాజభటులు త్యాగయ్య తిరస్కారాన్ని శరభోజికి నివేదించారు. రాజుకు పట్టరాని ఆగ్రహం కలిగింది. త్యాగయ్యను బంధించి తీసుకురమ్మని ఆజ్ఞాపించాడు. రాజసేవకులు బయలుదేరారు. ఆ భటులు ఊరి పొలిమేరలు దాటారో లేదో రాజుకి భరించరాని కడుపునొప్పి మొదలయింది. వైద్యులెన్ని విధాల ప్రయత్నించినా లాభం లేకపోయింది. జ్యోతిష్కులు శరభోజి జాతకచక్రాన్ని పరిశీలించారు. ఒక మహాపురుషునికి జరిగిన అపచారమే ఈ విపత్తుకు కారణమని తేల్చారు. విషయం తెలుసుకున్న త్యాగయ్య కదిలిపోయాడు. నిజమైన రామభక్తుడిగా కరిగిపోయాడు. వ్యాధి నయమవ్వాలని ఆ రాముణ్ణి ప్రార్థించి తులసితీర్థం పంపాడు. ఫలితంగా శరభోజి ఆరోగ్యవంతుడై భక్తుడిగా త్యాగయ్య ఏకాదశి భజనలకు ఆజన్మాంతం హాజరయ్యేవాడు.

### తన జాడ తానే తెలిపిన జానకిరాముడు :

త్యాగయ్య రాజుల కొలువులో పాడకుండా వచ్చే ధనాన్ని వెనక్కి పంపుతున్నాడని అతని అన్న జపేశానికి కోపంగా ఉండేది. అదే అక్కసుతో తమ్ముడిపై ఉన్న కోపాన్ని ఆయన కొలిచే సీతారాముల విగ్రహంపై చూపాడు. త్యాగయ్య భిక్షాటనకు వెళ్ళిన సందర్భం చూసి ఆ విగ్రహాన్ని అపహరించి కావేరీ నదిలో పడవేశాడు. ఇంటికి చేరిన త్యాగయ్యకు పూజా మందిరంలో తన ఇష్టదైవం ప్రతిమ కనిపించలేదు. ఒక్కసారిగా కుంగి కృశించి పోయాడా భక్తాగ్రేసరుడు. నిద్రాహారాలు మాని రామజపంతో పలవరించసాగాడు. ఒకరోజు ఆ శ్రీరామచంద్రుడే కలలో కనిపించి తాను కావేరీ ఘట్టంలో దాగి ఉన్నానని చెప్పాడట. అనంతరం రామవిగ్రహాలు అదే ప్రదేశంలో బయటపడ్డాయి.

మిగతా 35వ పేజీలో...

## భక్తులకు మంత్రోపదేశం

రామకృష్ణ మఠం, రామకృష్ణ మిషన్‌ల ఉపాధ్యక్షులు **పూజ్య స్వామి స్మరణానందజీ మహరాజ్** 2008 ఆగస్టు 15 నుంచి సెప్టెంబర్ 6వ తేదీ వరకు హైదరాబాద్ రామకృష్ణ మఠంలో బస చేస్తారు. పూజ్య స్వామీజీ ఆధ్యాత్మిక జిజ్ఞాసువులకు **ఆగస్టు 18, 22, 27**వ తేదీల్లో మంత్రదీక్ష ప్రసాదిస్తారు. మరిన్ని వివరాల కోసం

**స్వామి జ్ఞానదానంద అధ్యక్షులు, రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్-500 029** ను సంప్రతించవలెను.

## 'భక్తి' ఛానల్‌లో రామకృష్ణ మఠ కార్యక్రమాలు

**ప్రతీ సోమ, మంగళ, బుధ, గురు వారాల్లో సాయంత్రం 5.30 నుండి 6.00 గంటల వరకు హైదరాబాద్ రామకృష్ణ మఠ అధ్యక్షులు స్వామి జ్ఞానదానందజీ మహరాజ్ వారి ఆధ్యాత్మిక ప్రసంగాలు, భజనలు 'భక్తి' ఛానల్‌లో ప్రసారం అవుతాయి. భక్తులు ఈ కార్యక్రమాలను తిలకించి ఆనందించగలరని ఆశిస్తున్నాం.**

# మీ పిల్లలు అలుగుతున్నారా ?

– రామ్ జలదుర్గం

మీ ఇంట్లో పిల్లలు ప్రతివిషయానికీ అలుగుతున్నారా? తిండి మానేసి మరీ తమ అలకను ప్రదర్శిస్తున్నారా? అలక పోగొట్టడానికి మీరు చేస్తున్న బుజ్జగింపు ప్రయత్నాలు ఫలించడం లేదా? అయితే ఇది చదవడానికి సరైన వ్యక్తి మీరే!

అసలు 'అలుక' అనే మాట అతి పురాతనమైంది, పురాణకాలం నుంచి వినిపిస్తోంది. సత్యభామ అలిగినప్పుడు శ్రీకృష్ణుడు బుజ్జగించిన విధం పురాణ గాథల్లో చాలా ప్రాధాన్యాన్ని సంతరించుకుంది. రామాయణ, భారత, భాగవతాల్లో దేవతలు అలిగిన సందర్భాలు మనకు చాలా కనిపిస్తాయి. ఆ తర్వాత కాలంలో అలక ప్రదర్శించే వారికి ప్రత్యేక అలక పాన్పులు ఏర్పాటు చేయడం కూడా మనం విన్నాం. అంతేనా!.... పదవులు రాకపోతే రాజకీయ నాయకులు పార్టీలపై అలుగుతారు. అత్తగారు కోర్కెలు తీర్చలేదని అల్లుళ్ళు అలుగుతారు. సకాలానికి అవసరాలు తీరకపోతే భార్య, భర్త మీద ప్రయోగించే ఆయుధం అలక. ఇటీవలి కాలంలో మన మంత్రులు, ప్రతిపక్షనేతలు, అప్పుడప్పుడు అలిగి అసెంబ్లీ నుంచి వాకౌట్ చేస్తున్నారు.

అసలెవరైనా ఎందుకు అలుగుతారు? అని ఆలోచిస్తే వారి అలక తీరాలంటే వారు కోరే గొంతెమ్మ కోర్కెలు తీరడమే మార్గమా అన్న ఆలోచన కూడా రాకమానదు. తమకు ఇవ్వవలసిన ప్రాధాన్యం ఇవ్వడం లేదని చెప్పడానికే మాటలు లేకుండానే 'అలక'ను వ్యక్తీకరిస్తారు. వీరు అలిగారు అని ఎవరైనా గుర్తించేలా ఉంటుంది వారి ప్రవర్తన. ఈ ప్రవర్తన ద్వారా అవతలి వారు, అసంకల్పితంగానే అలిగిన వారికి అనుగుణంగా నడుచుకోవాలన్నది అలిగిన వారి ప్రధాన ఉద్దేశం.

నిజం చెప్పాలంటే ఈ అలుకకు వయస్సు, స్థాయి, స్థానం, కులం, మతాలతో సంబంధమే లేదు. సమయాన్ని, సందర్భాన్ని, అనుకూలతను బట్టి ఎవరైనా అలగవచ్చు. మన జీవన విధానాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తే ఎదుటి వారి దృష్టిని ఆకర్షించడానికి 'అలకనే' ఎందుకు ఆయుధంగా ఉపయోగించుకుంటారన్నది బోధపడుతుంది.

కైకేయి అలకే శ్రీరాముణ్ణి నిర్దాక్షిణ్యంగా అడవులకు పంపేలా దశరథుణ్ణి ప్రోత్సహించింది. దక్షయజ్ఞంలో పార్వతి తన తండ్రిపై అలిగి వెళ్ళిన తరువాత జరిగిన సంఘటనలు అందరికీ తెలిసినవే.

తమ పిల్లలు, ఇంకా పసిపిల్లలుగా ఉన్నప్పుడే ఏదైనా విషయానికి అలిగితే ప్రతి తల్లీ సంబరపడి, మురిసిపోతుంది. "అబ్బో వేలెడంత లేదు ఇప్పుడే అలక చూశారా!.. చూశారా! ఎంత చక్కగా అలుగుతున్నాడో" అని ముద్దు చేస్తుంది. కోరింది

ఇస్తుంది. అంతే అది చాలు తమకేం కావాలన్నా ఎలా సాధించాలో తెలుసుకోవడానికి. కాస్త పెద్దవగానే అలిగి అన్నం మానేస్తారు. అంతే తల్లి మనసు గిలగిల్లాడుతుంది. ఓ పదిసార్లు అలక గురించి వాకబు చేస్తుంది. అన్నం మీద అలగొద్దు. నీకేం కావాలో అదిస్తాన్లే... అని బుజ్జగిస్తుంది. పిల్లవానికి కావాల్సింది అందుతుంది. అప్పటి నుంచి అది జీవితంలో నిరూపించబడిన సత్యంలా గోచరించి ఎప్పుడు అవసరమైతే అప్పుడు అలగొచ్చు అన్న సిద్ధాంతాన్ని పాటించడం మొదలెడతారు. ఈ అలక కూడా వారితో పాటు పెరిగి పెద్దదై కేవలం ఇంట్లో వాళ్లతోనే కాకుండా ఆఫీసులో, అత్తవారింట్లో, స్నేహితుల వద్ద, దగ్గరివాళ్ల వద్ద ఇలా తమ అలకను ప్రదర్శిస్తుంటారు.



ఈ అలక వల్ల కొంత వరకూ తమ కోరికలు నేరవేరినా, కాస్త చులకన అయ్యే ప్రమాదం కూడా ఉంది. ప్రతీ విషయానికీ అలిగే వారి లక్షణాలు ఈ కింది విధంగా ఉంటాయి.

1. ఆత్మ విశ్వాసం తక్కువ ఉంటుంది.
2. ఇతరులపై ఆధారపడే మనస్తత్త్వం.
3. తమ నైపుణ్యంతో కాకుండా, ఇతర మార్గాల ద్వారా ఎదుటి వారి దృష్టిని ఆకట్టుకునే ప్రయత్నం చేయడం.
4. అనువుగాని చోట అధికులుగా గుర్తింపబడాలనే తపన.
5. ఎదుటివారి స్థానంలో ఉండి ఆలోచించగలిగే పరిజ్ఞానం లేకపోవడం.
6. స్వయం శక్తి మీద అపనమ్మకం.
7. జరుగుబాటు లేకపోతే అసంతృప్తితో జీవించడం.
8. మార్పును ఆహ్వానించే హృదయం లేకపోవడం.
9. తన మాట, ప్రవర్తనే సరైనదన్న మొండి నమ్మకం.

ప్రతి విషయానికీ అలిగే వారు 'తుమ్మితే – ఊడిపోయే...' ముక్కు చందాన ఎదుటివాళ్ళను భయపెట్టే అలవాటు కూడా నేర్చుకుంటారు.

అలిగి పుట్టింటికి వెళ్ళిపోయే భార్యలు... తల్లితండ్రులతో గొడవపడి ఇల్లొదిలి పారిపోయే పిల్లలు... ఆఫీసులో ఎవరితోనో సరిపడక రాజీనామాలు చేసే అధికారులు – ఇలాంటి కోవకు చెందినవారే! ఈ మనస్తత్వాన్ని కాస్త పెంచి పోషిస్తే ఆత్మహత్యల దాకా కూడా వెళుతుంది.

అలకను ప్రోత్సహించకుండా, ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించాలంటే... అది చిన్నప్పట్నుంచే పెంపకం ద్వారా చాలా వరకు సాధించవచ్చు తల్లితండ్రులు. దీనికి ఈ కింది చిట్కాలు పాటిస్తే సరిపోతుంది.

1. మీ పిల్లలు అలిగారని తెలిసినప్పుడు, మీరు ఎటువంటి పరిస్థితుల్లోనూ 'అలక' అనే మాటను వాడకండి. కానీ ఏం కావాలో అడిగి తెలుసుకోండి.
2. అలిగి భోజనం చేయకపోతే మీరు ఏదో ప్రమాదం జరిగినట్లు స్పందించకుండా అసలు మీరు ఆ విషయాన్ని గుర్తించనట్లే వాళ్ళ ముందు ప్రవర్తించండి. భోజనం చేయకపోవడానికి మరేదో కారణమై ఉంటుందన్నట్లు రెండుసార్ల కన్నా ఎక్కువగా భోంచేయమని అడగకండి.
3. అలుగుతున్న పిల్లలతో తల్లితండ్రులు ఎక్కువ సమయం గడపాలి. వారి అవసరాలు మాటలతో వ్యక్తీకరించడం ద్వారానే తీరే అవకాశం వుందని తెలియజెప్పండి.
4. తిండి మీద అలిగితే, కడుపు కాలుతుంది తప్ప మరే ప్రయోజనం ఉండదనీ, స్కూలుకు వెళ్ళకపోతే వాళ్ళకు తప్ప మరెవరికో నష్టం లేదనీ వివరించండి.
5. పిల్లలు నవ్వుతూ మాట్లాడుతున్నప్పుడే వాళ్ళను ప్రోత్సహించండి. అదే మంచి పద్ధతి అన్న విషయం వాళ్ళు తెలుసుకునేలా చేయండి.

ఇలా చేస్తే అలకలుండవ్– మాటలూ పలుకులూ తప్ప! c

## పండుగలు - పర్వదినాలు

### మే- 2008

| | | | |
|---|---|---|---|
| 01 | గురువారం | : | ఏకాదశి |
| 08 | గురువారం | : | అక్షయ తృతీయ |
| 09 | శుక్రవారం | : | ఆది శంకరాచార్య జయంతి |
| 15 | గురువారం | : | ఏకాదశి |
| 20 | మంగళవారం | : | బుద్ధపూర్ణిమ |
| 30 | శుక్రవారం | : | శ్రీహనుమజ్జయంతి |
| 31 | శనివారం | : | ఏకాదశి |

### జూన్- 2008

| | | | |
|---|---|---|---|
| 03 | మంగళవారం | : | ఫలహారిణి కాళీ పూజ |
| 14 | శనివారం | : | ఏకాదశి |
| 29 | ఆదివారం | : | ఏకాదశి |



- స్వామి పరిజ్ఞేయానంద

**ఎమ్. దివ్య, విజయవాడ**

**ప్రశ్న:** నేను ఇంటర్మీడియట్ చదువుతున్నాను. నాకు నాన్-స్టాప్‌గా మాట్లాడడం అలవాటు. అందువల్ల చదువు మీద ఏకాగ్రత కుదరటం లేదు. ఈ నా బలహీనత నుంచి బయటపడడం ఎలా?

**జవాబు:** అన్ని వేళలా 'అతి'ని విసర్జించాలని మన శాస్త్రాలు చెబుతున్నాయి. అతిగా తినడం, అతిగా నిద్రపోవడం, అతిగా మాట్లాడడం - ఇలా అవసరాన్ని మించి చేసే ఏ పనైనాసరే ప్రమాదకరం అని గ్రహించాలి. మహాత్ములంతా మౌనంతోనే మహత్కార్యాలను సాధించారు.



మనం ఏ రంగంలోనైనా విజయం సాధించాలంటే 'నోటిని' అదుపులో పెట్టడం అభ్యసించాలి. అనవసరంగా మాట్లాడడం కట్టిపెట్టాలి.

If we would make our endeavour more productive, we must try never to talk unnecessarily.

నోటిని అదుపులో ఉంచుకొంటే మనసును స్వాధీనంలో ఉంచుకున్నట్లే! అతిగా మాట్లాడడం వలన మనలో ఉన్న శక్తి వృథా అవుతుంది. కాబట్టి శక్తిని సమకూర్చుకోవాలి అన్న స్వామి వివేకానంద సలహాని పాటించండి.

Do not spend your energy in talking,
Accumulate power in silence *- Swami Vivekananda*

అతిగా మాట్లాడడం మీ బలహీనతని మీకు తెలుసు. దానివల్ల మీకు కలిగే అనర్థాన్ని కూడా గ్రహించారు. కాబట్టి పైన చెప్పిన విషయాల్ని మీ 'మనసు'లో బాగా ముద్రపడేలా పదే పదే మననం చేయండి.

What the mind can conceive and believe,
the mind can achieve *- W. Clement Stone*

బలహీనులు 'అదృష్టాన్ని' నమ్ముకుంటారు. బలవంతులు 'ప్రయత్నాన్ని' నమ్ముకుంటారు. మరి మీరు ఈ రెండింటిలో దేన్ని నమ్ముకుంటారో మీరే నిర్ణయించుకోండి.

**పి. బాలకృష్ణ, హైదరాబాద్**

**ప్రశ్న:** నేను ఎమ్.సి.ఏ. చదువుతున్నాను. మనసులో చెడు ఆలోచనల్ని అరికట్టలేకపోతున్నాను. మనసును నియంత్రించడానికి సూచనల్ని ఇవ్వండి.

**జవాబు:** మనసును నియంత్రించడం మానవులకే కాదు దేవతలకు కూడా ఒక పెద్ద సమస్యే! శ్రీరాముడు కూడా మనసుని నియంత్రించడం ఎలాగో తెలుపమని వశిష్ఠులవారిని ప్రార్థించాడు.

'నీరు' పల్లానికి పారడం ఎంత సహజమో, 'మనసు' విషయ వస్తువుల (Sense objects) వైపు పరుగులు తీయడం అంతే సహజం. నీటిలో తడవకుండా ఈత నేర్చుకోలేం. చెడు ఆలోచనలు రాకుండా మనోనిగ్రహాన్ని సాధించలేం.

No man ever learned to swim by refusing to get wet.
*-Robert Moore*

కాబట్టి మనసులో చెడు ఆలోచనలు వస్తున్నాయని ఆందోళన పడకుండా ఈ క్రింది సూచనలు పాటించండి.

1. మనసు తలుపును తలపులు తట్టినప్పుడు ఒక్కసారి ఆలోచించి తలుపు తెరవడం నేర్చుకోండి.
2. చెడు తలపులు తెచ్చే తంటాలను ఒక్కసారి వీక్షించండి.
3. మంచి ఆలోచనలతో మనసును నింపుతూ ఉండండి.
4. మనసుని ప్రలోభపరిచే పరిస్థితులకు దూరంగా ఉండండి.

మనోనిగ్రహం గురించి వివరంగా తెలుసుకోవాలంటే రామకృష్ణ మఠ ప్రచురణ 'మనసును నియంత్రించడం ఎలా?' (The Mind and its control -*Swami Budhananda*) అనే పుస్తకాన్ని చదవండి. d


మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా:

**యువవాణి**

శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,
దోమల్ గూడ, హైదరాబాద్ - 500 029
E- mail : rkprabhayuvavani@gmail.com

యువవాహిని

## మనసు - మర్మం

- శ్రీరామ్

# సాధనను ఆస్వాదిస్తేనే సాఫల్యం

**లక్ష్యాన్ని చేరేందుకు ఏం చేయాలి?**

సర్వసాధారణంగా వినపడే ఈ ప్రశ్నకు, అత్యంత తరచుగా చెప్పే జవాబు – 'నీటిలో మునిగి ఉన్నప్పుడు శ్వాస కోసం ఎంతగా తపిస్తామో, అంత తపన ఉన్నప్పుడే లక్ష్యాన్ని సాధించగలం!'.

పై సమాధానాన్ని కాస్త ఆచరణాత్మకంగా మార్చి చెప్పవచ్చు. గమ్యాన్ని చేరాలంటే, ప్రయాణాన్ని ఆస్వాదించగలగాలి. లక్ష్యాన్ని చేరాలంటే, మన మనసు లక్ష్యసాధనలో నిమగ్నమవ్వాలి. గమ్యాన్ని ఎప్పుడు చేరుతామా? అని ఎదురుచూసేవారికి ఆందోళన తప్పించి, ఆనందమే ఉండదు. కానీ లక్ష్యసాధనలో ఆనందాన్ని అనుభవించే వారికి, విసుగు అనిపించదు, కాలం తెలియదు.

ఒక యువకుడు యుద్ధ విద్యలు నేర్పే గురువును కలిశాడు. అప్పుడు ఆయన గంభీరంగా కూర్చొని, ఆలోచనలో నిమగ్నమై ఉన్నారు. "నేను కత్తి యుద్ధంలో ఆరితేరాలంటే ఎంత కాలం పడుతుందండీ!?" అంటూ ఎంతో వినయంగా ఆ యువకుడు ప్రశ్నించాడు. "కనీసం పదేళ్ళు పడుతుంది" ప్రశాంతంగా చెప్పారా గురువు. "బాగా కష్టపడి సాధన చేశారనుకోండి!" అంటూ ఆ యువకుడేదో చెప్పబోతున్నంతలో గురువు గారు అతడి మాటలకు అడ్డుతగిలారు. "అలాగైతే నీ విద్య పూర్తయ్యేందుకు ఇరవై ఏళ్ళు పడుతుంది!!".

నిజమే! అతురత చెందే వారికేదీ సులభంగా లభించదు. ఒక వేళ లభించినా అది సంతోషాన్నివ్వదు.

"కార్యసాధనకు ఒక రకమైన ఆవేశం అవసరమని నేను అనుకునే వాణ్ణి. కానీ అనుభవం పెరిగే కొద్దీ ఆ భావన మారిపోయింది. ఆవేశం మన శక్తిని హరిస్తుందనీ, ప్రశాంత మనస్కులే కార్యనిర్వహణకు సమర్థులనీ అర్థమవుతోంది" అని స్వామి వివేకానంద చెబుతారు.

ఇద్దరు యోగుల కథ కూడా ఇదే విషయాన్ని సూచిస్తుంది. సుదీర్ఘకాలంగా తపస్సును ఆచరిస్తున్న యోగి "ముక్తికి ఇంకా ఎంతకాలం నిరీక్షించాలి?" అని నారదుణ్ణి ప్రశ్నించాడు. "మరో నాలుగు జన్మలు" అని ఆయన చెప్పగానే హతాశుడయ్యాడు, ఎంతో దుఃఖించాడు. "చింత చెట్టుకు ఎన్ని ఆకులున్నాయో అన్ని జన్మలెత్తాలి అప్పుడే నీకు ముక్తి" అని మరో వ్యక్తికి నారదుడు చెప్పాడు. కానీ ఆ వ్యక్తి బాధపడలేదు, పైగా ఎంతో ఆనందించాడు. మరుక్షణమే అతడు ముక్తుడయ్యాడు. మొదటి వ్యక్తికి సాధనలోని రహస్యం అర్థం కాలేదు. అతడి సాధన ఇంకా బలవంతంగానే కొనసాగుతుంది. అందులో అతడికి ఏ మాత్రం ఆనందం లేనట్లుంది. కానీ రెండవ వ్యక్తి సాధనను పరిపూర్ణంగా ఆస్వాదిస్తూ ఉన్నాడు.

సాధన ఎప్పుడు ముగుస్తుందా అని ఎదురుచూసేవాడు లక్ష్యాన్ని చేరుకోగలడా? పనిని త్వరగా ముగించాలి అనుకునే వారికి ఫలితం లభిస్తుందా? లభించదు. పనిలో నిమగ్నమయ్యే వారికి ఫలితాలు వెతుక్కుంటూ వస్తాయి. C



# వివేకానంద విద్యార్థి భవన్

రామకృష్ణమఠం, ధన్‌తోలీ, నాగపూర్ - 440 012,
ఫోన్: 2423422, 2432690, ఫాక్స్:2437042
email: rkmath_ngp@sancharnet.in



## విన్నపం

ప్రియ భక్తులకు, మిత్రులకు,

నమస్కారం, శుభాభివందనలు!

నాగపూర్, ధన్‌తోలీలోని రామకృష్ణమఠం ఆశ్రమం ప్రారంభించినప్పటి నుంచీ అనేక సేవా సహాయ కార్యక్రమాలు నిర్వహిస్తోంది. వాటితో పాటు కళాశాల యువకుల కోసం 'వివేకానంద విద్యార్థి భవన్' అనే వసతి గృహాన్ని నిర్వహిస్తోంది. మా మఠం ప్రారంభించిన సేవా కార్యక్రమాల్లో ఇది మొదటిది.

విద్యార్థి భవన్‌లో ఉండే విద్యార్థుల సంపూర్ణ వ్యక్తిత్వ వికాసానికై తోడ్పడడం ఈ సంస్థ లక్ష్యం. ఈ లక్ష్యసాధనలో క్రీడలలో శిక్షణ నివ్వడం; సామూహిక చర్చలు నిర్వహించడం; వక్తృత్వం, నీతి సూత్రాలు, ఆధ్యాత్మిక అంశాలలో విషయ పరిజ్ఞానాన్ని అధికం చేయడం లాంటి వివిధ అంశాలలో విద్యార్థులను సుశిక్షితుల్ని చేస్తున్నాం.



వివేకానంద విద్యార్థి భవన్ నమూనా

గత కొద్ది సంవత్సరాలుగా స్థలాభావం వల్ల అనేక మంది పేద విద్యార్థులకు వివేకానంద విద్యార్థి భవన్‌లో ప్రవేశం లభించక, వారు నిరాశకు గురి అవుతున్నారు.

అందువల్ల గ్రామీణ పేద కుటుంబాలకు చెందిన 50 మంది విద్యార్థుల కోసం కొత్త విద్యార్థి భవన నిర్మాణాన్ని చేపట్టాం.

2007 జనవరి 22వ తేదీ సోమవారం ఉదయం 9.30గం॥లకు రామకృష్ణమఠం, రామకృష్ణమిషన్‌ల అప్పటి ఉపాధ్యక్షులు శ్రీమత్ స్వామి ఆత్మస్థానందజీ మహరాజ్ ఈ కొత్త విద్యార్థి భవన్‌కు శంకుస్థాపన చేశారు.

**సూచించిన ప్రణాళికలోని వివరాలు:**

| | | |
|---|---|---|
| పొడవు, వెడల్పు | - | 121'×62' |
| అండర్‌గ్రౌండ్ ఫ్లోర్ | - | 30'×36' |
| ఆడిటోరియమ్ | - | 29'×47' |
| లైబ్రరీ | - | 29'×60' |
| వ్యాయామశాల | - | 29'×11' |
| వంట,భోజనాల గది | - | 29'×60' |

మొత్తం ప్రణాళిక కయ్యే ఖర్చు సుమారు కోటి అరవై ఎనిమిది లక్షల రూపాయలు. దీని కోసం మేము ఉదారులైన భక్తులు ఇచ్చే విరాళాలపైనే ఆధార పడుతున్నాం. భక్తులూ, శ్రేయోభిలాషులూ ఉదారంగా విరాళాలిచ్చి ఈ ప్రణాళికకై తోడ్పడి పేద విద్యార్థులకు సహాయ పడగలరని ఆశిస్తున్నాం. భగవాన్ శ్రీరామకృష్ణులు మీ అందరినీ అనుగ్రహించు గాక!

విరాళాలను 'Ramakrishna Math, Nagpur పేరున డిడి/చెక్కుల రూపంలో Ramakrishna Math Dhantoli, Nagpur - 440 012 కు పంపవలసిందిగా మనవి. విరాళాలకు సెక్షన్ 80-జి కింద ఆదాయపు పన్ను మినహాయింపు కలదు. విదేశీ కరెన్సీ రూపంలో కూడా విరాళాలు ఇవ్వవచ్చు.

శ్రీరామకృష్ణుల సేవలో

**స్వామి బ్రహ్మస్థానంద**
అధ్యక్షులు



## బంధాలకు అతీతమైన భక్తి

నాలుగవ తరగతి చదువుతున్న కొంతమంది విద్యార్థులు ఒకచోట చేరి తాము పెద్దయ్యాక ఇంజనీర్లమవుతామనీ, డాక్టర్లమవుతామనీ చెప్పుకుంటుంటే అందులోంచి ఒక విద్యార్థి "నేను ఆంగ్లేయులను దేశం నుండి వెళ్ళగొడతాను" అని నిర్భయంగా చెప్పాడు. ఆ చిరుతడే భగత్‌సింగ్. సెప్టెంబరు 28, 1907న జన్మించిన భగత్‌సింగ్ జీవితాన్ని భరతమాత సేవకే అంకితం చేశారు.

దేశప్రజలను అవమానాలు, హింసాకాండకు గురిచేస్తున్న ఆంగ్లేయుల్ని దేశం నుండి తరిమికొట్టాలన్న తలంపే ఆయన మదిలో నాటుకుపోయింది.

జైల్లో ఉండగా భగత్‌సింగ్ తన తండ్రిని గీతారహస్యం పుస్తకాన్ని తప్పకుండా తీసుకు రమ్మని కోరారు. స్వతంత్ర పోరాటంలో ఆయనకు భగవద్గీత స్ఫూర్తినిచ్చింది. 1929 ఏప్రిల్ 26న వ్రాసిన లేఖలో తనను చూసేందుకు అమ్మతో కలిసిరావద్దనీ, అమ్మ కంటి తడిని తాను చూడలేననీ వ్రాశారు. తన విప్లవపంథాకు ఎటువంటి బంధాలూ ఆటంకం కాకూడదన్నది ఆయన భావన.

'భారతీయతను గుర్తించి... భారతీయుణ్ణని గర్వించు... పరాయిపాలనను తిరస్కరించు' అనే నినాదంతో యువభారతాన్ని మేలుకొల్పారు.

1931 మార్చి 23న బ్రిటీష్‌పాలకులు ఆయనను ఉరికంబమెక్కించారు. ప్రశాంతవదనంతో ఉరితాడును ముద్దాడి "మరో జన్మంటూ ఉంటే భారతదేశంలోనే పుడతాను, భారతమాతకు మరింత సేవ చేస్తాను" అని పలుకుతూ ఉరికంబం ఎక్కారు భగత్‌సింగ్.

**సేకరణ: ఆర్. కృష్ణారావు**



## ఆచార్యుణ్ణే ఆశ్చర్యపరచిన ఘనుడు

ఒకమారు ఓ పాఠశాలలో పరీక్షా ఫలితాలు ప్రకటించేందుకు ఆచార్యుడు వచ్చి ఉత్తీర్ణులైన విద్యార్థుల పేర్లు చదివి వినిపించాడు. ఒక విద్యార్థి లేచి "నా పేరు చదవలేదు" అన్నాడు. ఆచార్యుడు "నీవు ఉత్తీర్ణుడవు అవలేదు" అని చెప్పాడు. ఆ ఏడు ఆ బాలుడు చాలా కాలం మలేరియాతో బాధపడ్డాడు. అందువల్ల అతను ఉత్తీర్ణుడై ఉండడని ఆచార్యునికి అనిపించింది. "అలా జరగడానికి వీలులేదు'' అన్నాడా బాలుడు ఆత్మవిశ్వాసంతో. "అలాగే జరిగింది. నేను చెబుతున్నాను కూర్చో. ఇంకేమైనా మాట్లాడావంటే జరిమానా వేస్తాను". అని ఆచార్యుడు చెప్పాడు.

"నేను ఉత్తీర్ణుణ్ణయ్యాను. ఇందులో సందేహం లేదు" అని ఘంటాపథంగా చెప్పాడు ఆ బాలుడు. దాంతో, 'నీకు ఐదు రూపాయలు జరిమానా విధిస్తున్నాను'అని ఆచార్యులవారు చెప్పారు. అయినా విద్యార్థి పట్టుసడలక తాను పరీక్ష తప్పడానికి అవకాశమే లేదని చెబుతునే ఉన్నాడు. ఆచార్యుడు జరిమానా మొత్తాన్ని పెంచసాగాడు. జరిమానా మొత్తం 50 రూపాయల దాకా పెరిగింది. ఆ సమయంలో పాఠశాల లేఖకుడు పరుగెత్తుకుంటూ తరగతి గదికి వచ్చాడు. ఆచార్యుల వారికి ఆ బాలుని మార్కుల జాబితా అందించాడు. ఆ బాలుడికి అందరికంటే ఎక్కువ మార్కులు వచ్చాయి. అచంచల ఆత్మవిశ్వాసం, సత్యనిష్ఠ ఉన్న ఆ బాలుడే రాజేంద్ర ప్రసాద్. ఆయనే స్వతంత్ర భారతదేశానికి ప్రథమ రాష్ట్రపతి అయ్యాడు.

**సేకరణ: జి. సతీష్**



# ఆత్మవిశ్వాసానికి ప్రతిరూపం

- స్వామి గుణేశానంద

భగవంతుడి చరణాలను ఆశ్రయించి, "అహం" అనే దాన్ని పూర్తిగా వదిలిపెట్టి ఆ పరమాత్మ అవ్యాజ కరుణకు పాత్రులమవడమే "ఆరాధన" అంటే. పరమేశ్వరుడి పాదాల పైనే మనస్సు నిలిపి, లౌకికమైన పనులన్నీ చెయ్యవచ్చు. భగవంతుడి చరణాలకు తనను తాను సమర్పించుకున్న వారిలో ముఖ్యుడిగా ఆంజనేయ స్వామిని చెప్పవచ్చు, ఆయన జీవితం అందరికీ చక్కని ఉదాహరణగా నిలచింది.

శతయోజనాల విస్తీర్ణం గల మహాసముద్రపు ఒడ్డుకు చేరి, దానిని దాటాలి అనుకున్న వానరుల మనసులలో వివిధ రకాలైన ఆలోచనలు తలలెత్తాయి. జాంబవంతుడు వృద్ధాప్యం వలన "తాను అశక్తుణ్ణి" అన్నాడు; అంగదుడు "సముద్రం దాటి వెళ్ళగలను కానీ వెనక్కి తిరిగి రాలేను" అన్నాడు. ఇలా ఏ ఒక్కరూ సాహసించి ముందుకు రాలేక పోయారు. చివరికి దూరంగా, ఒక్కడూ కూర్చుని జరుగుతున్నదంతా మౌనంగా గమనిస్తున్న ఆంజనేయ స్వామి వద్దకు చేరారు అందరూ. శ్రీరాముడు అనుగ్రహించి, తనకు శక్తినిస్తే తాను సముద్రాన్ని దాటుతాను అన్నారు ఆంజనేయస్వామి. శ్రీరాముడి కృపా కటాక్షాలు ఉంటేనే అటువంటి మహత్కార్యాలు చెయ్యగలం. ఇక్కడ తన ప్రభువుకు పూర్తిగా విధేయుడై ఆరాధించిన ఆంజనేయస్వామిని చూస్తాం మనం. భక్తికి నిర్దిష్టమైన రూపమిస్తే అది ఆంజనేయస్వామి.

లంకాయానంలో ఆంజనేయులవారికి మూడు విధాలైన అడ్డంకులు ఎదురయ్యాయి. తన సునిశితబుద్ధి వల్ల ఆ అడ్డంకులను అధిగమించి ముందుకు పయనమయ్యారు. మనకు కూడా పరమార్థ లక్ష్యసాధనలో ఎన్నో అడ్డంకులు ఎదురవుతాయి. వాటిని ఎలా పరిష్కరించాలో చూద్దాం.

సముద్రాన్ని దాటేటప్పుడు మొదటి అడ్డంకి సురస. ఆంజనేయుణ్ణి మింగాలని నోరు తెరిచింది. ఆంజనేయ స్వామి సూక్ష్మరూపం ధరించి, ఆమె నోట ప్రవేశించి, తెరచిన నోరు మూసేలోపు వెలుపలకు వచ్చారు.

ఆధ్యాత్మిక సాధనా పథంలో ముందుకు సాగాలనుకునే సాధకునికి ప్రారంభంలోనే ఎదురయ్యే అడ్డంకి "అహం". ఆంజనేయులవారిని సురస మింగాలని చూసినట్లే అహంకారం మన వ్యక్తిత్వాన్నే మింగేసేటంతటి దవుతుంది. ఈ సమస్యను అధిగమించడానికి "అంతా భగవంతుడే చేస్తున్నాడు, నేను కేవలం నిమిత్తమాత్రుణ్ణి" అని అనుకోవాలి.

ఇంకాస్త దూరం వెళ్ళాక ఆంజనేయ స్వామికి తన వేగం తగ్గుతోందన్పించింది. ఎవరో తన ఛాయను పట్టుకుని తాను ముమ్ముందుకి సాగలేకుండా అడ్డుపడుతున్నారని గ్రహించారు. అలా చేస్తున్నది ఛాయాగ్రహి అయిన సింహిక అని తెలుసుకుని, వెంటనే ఆమెని సంహరించారు. దీనిని తామసికమైన అడ్డంకి అంటారు.

ఆంజనేయులవారి మార్గంలో సింహిక అడ్డంగా నిలచినట్లే ఈర్ష్య, అసూయలు మనల్ని మన మార్గంలో ముందుకు సాగనీయవు. కాబట్టి ఆంజనేయుల వారిలా వాటిని తక్షణం అణచివేయాలి.

సింహికను సంహరించి లంకానగరం చేరారు ఆంజనేయస్వామి. లంకలోకి ప్రవేశిస్తున్న ఆయనికి లంకానగరానికి కావలిగా ఉండే లంఖిణి ఎదురై, లోనికి ప్రవేశించనీయకుండా అడ్డుపడింది. ఆంజనేయస్వామి ఒక్క దెబ్బతో ఆమెని పడగొట్టి లంకలోకి ప్రవేశించారు. లంఖిణి రాజసికమైన అడ్డంకిని సూచిస్తుంది. మనం దీని దిశను మార్చి భగవత్ సాక్షాత్కారం అనే దిశలోకి మళ్ళించాలి.

స్వామి వివేకానంద ఆంజనేయస్వామిని ఆదర్శంగా చేసుకోమన్నారు. ఆయన చెప్పిన "లేవండి, మేల్కొండి, లక్ష్యాన్ని సాధించేవరకూ ఆగకండి" అన్న సందేశానికి చక్కని ఉదాహరణ ఆంజనేయస్వామి. ◻



# నవభారత నిర్మాణానికి నవీన సందేశం

– జిల్లా ప్రభు



"భారత దేశం గురించి సంపూర్ణంగా తెలుసుకోవాలంటే వివేకానందుని సాహిత్యం అధ్యయనం చేయండి" అని విశ్వకవి రవీంద్రనాథ్ ఠాగూర్ అన్నారు.

పై వాక్యాలను గమనిస్తే వివేకానందుని జీవన మార్గం, గమ్యం, ఆయన ప్రబోధాలకూ, అప్పటి భారతదేశ స్థితి గతులకూ మధ్య సన్నిహితత్వం, సమన్వయం ఎలాంటిదో తెలుసుకోవచ్చు. ఆయన స్పృశించని అంశమంటూ లేదంటే అతిశయోక్తి కాదు. ఆయన తన బోధనల్లో ధైర్యాన్నీ, ఆపదలో ఆశనూ ప్రసాదించిన మహనీయుడు. సుసంస్కృత పౌర నిర్మాణ కార్యభార నిర్వాహకుడైన ఆధ్యాత్మిక రసవాద శాస్త్రజ్ఞుడు స్వామి వివేకానంద.

నరేంద్రునిగా మొగ్గ తొడిగి, వివేకానందునిగా వికసించి, భారతీయాత్మగా తన ప్రబోధ సుగంధాన్ని విశ్వం నలువైపులా వెదజల్లాడు. బానిసత్వపు సంకెళ్ళను తెంచుకునే విధంగా ఒకవైపు స్వదేశీయులను మేల్కొల్పుతూ, మరొక వైపు ఆదర్శ సమాజ నిర్మాణం కోసం ఆధ్యాత్మిక విలువలను ప్రతిష్ఠిస్తూ జీవితాన్ని మాతృదేశ సేవకే అంకితం చేసిన మహనీయుడు స్వామీజీ.

హిందూ సమాజ వైభవానికి కేవలం రాజకీయ, ఆర్థిక సమానత్వ భావనలే కాదు, ధార్మిక, సాంస్కృతిక పునాదులపై నిలచిన ఏకాత్మబోధకమైన తత్త్వమే స్థిరమైన పునాది అవ గలదనే వాస్తవాన్ని ప్రకటించిన దివ్యవక్త. ఇనుప కండరాలు, ఉక్కు నరాలు, వజ్ర తుల్యమైన మనస్సు ఉన్న యువకులు కావాలనీ, బలమే జీవనం, బలహీనతే మరణమని ఉద్బోధించిన వివేకానందుడు యువతకు నిత్య స్ఫూర్తి ప్రదాత.

**యువత – దేశానికి భవిత**

ధన్యమైన పుణ్యభూమి అనిపించుకొనే అర్హత ఏ భూమికైనా ఉన్నదీ అంటే భారత భూమికే! మహోన్నత సౌజన్యం, ఉదారత్వం, పవిత్రత, ప్రశాంతత – అన్నిటికీ మించి ఆధ్యాత్మికత, అంతర్వీక్షణాలను మానవాళికి అందించిన మహత్తర భూమి అనేది ఈ విశ్వంలో ఉంటే–అది భారత భూమి మాత్రమే! అని స్వామీజీ దేశభక్తిని జాగృతం చేశారు.

మన పట్ల, పరమాత్మ పట్ల ముమ్మాటికీ విశ్వాసం కలిగి ఉండడమే విజయ రహస్యమని ఆత్మవిశ్వాసాన్ని మేల్కొలిపారు. ప్రతి కార్యమూ అవహేళన, ప్రతిఘటన, ఆమోదం అనే మూడు దశల గుండా పయనించవలసిందేనని ఆయన అన్నారు. తన కాలాని కన్నా ముందు చూపున్న వ్యక్తి సమకాలికుల వల్ల అపార్థం చేసుకోబడడం సహజమేననీ, అందువల్ల వ్యతిరేకతనూ, కార్యాన్ని తుదముట్టించే యత్నాలనూ ఆహ్వానించవలసిందేననీ కార్యోన్ముఖుల్ని చేశారు.

ప్రతి ఒక్కరూ తన శక్తినంతటినీ ధారపోసి పాటుబడకుంటే ఏ పనీ సాధ్యం కాదనీ, అనంతమైన శక్తి, ఉత్సాహం, సాహసం, సహనం ఉంటే మహత్తర విజయాలు సాధించగలమనీ అభయాన్ని అందించిన ధీర సన్యాసి స్వామి వివేకానంద. "ఏ దేశపు యువతరం హృదయాలు తమ దేశ గతం పట్ల గౌరవంతో, వర్తమానం గురించి వేదనతో, భవిష్యత్తుకు సంబంధించి బంగారు కలలతో నిండి ఉంటాయో, ఆ దేశం ప్రగతి పథంలో పరుగు తీస్తుంది" అని స్వామి వివేకానంద అన్నారు. నవ భారత నిర్మాణానికి ఆ మహనీయుని సందేశాన్ని ఆదర్శంగా తీసుకొని, ఒకప్పుడు జగజ్జనీయమానంగా ప్రకాశించి, జ్ఞానభిక్షను ప్రపంచానికి ప్రసాదించిన మన భారతమాతను తన పూర్వవైభవ సింహాసనంపై అధిష్ఠింపజేయడానికి త్యాగం, సేవ అనే గుణాలే పరికరాలుగా, 'స్వాభిమాన భారత్'ను నిర్మిద్దాం. ప్రపంచానికి శాంతి, సౌఖ్యాలను అందిద్దాం! c

# భారతదేశమే అందరికీ ఆదర్శం!

– గొర్తి నీలం నాయుడు

సృష్టిలోని 84 లక్షల జీవరాసుల్లో మానవజన్మ అత్యంత శ్రేష్ఠమైనది. మానవ జన్మ లభించడం ఎంతో అదృష్టం. అది వేదభూమి, దేవతలు నడిచిన పరమ పవిత్రమైన ఈ భారత భూమి పై జన్మించటం ఎన్నో జన్మల పుణ్యఫలం, పూర్వ జన్మల సుకృతం. అటువంటి పుణ్యభూమిని కీర్తిస్తూ భారతదేశమే అందరికీ ఆదర్శమని పాశ్చాత్య మేధావుల అభిప్రాయాలు ఇవి...

**మార్క్‌ట్వయిన్:** భారత దేశాన్ని జీవితంలో ఒక్క సారైనా దర్శించి తరించాలని ప్రతి ఒక్కరూ కలలుగంటారు. అలాంటి పుణ్యభూమిని దర్శించడం మొత్తం భూగోళాన్ని దర్శించడం కంటే ఉత్కృష్టమైనది.

**మాక్స్‌ముల్లర్:** ఏ సాహిత్యం చదవటం వల్ల మానవ జీవితానికి పరిపూర్ణత సిద్ధిస్తుందో, ఆధ్యాత్మికత పట్ల అవగాహన కలుగుతుందో అటువంటి సాహిత్యం గల దేశం 'భారతదేశమే'అనడంలో ఏమాత్రమూ సందేహం లేదు.

ఫ్లీట్, కెంట్ వంటి గొప్ప మేధావులను కూడా విస్మయపరచే పరిష్కారాలను కనుగొన్న భూమి ఏదని ఎవరైనా నన్ను అడిగితే అది 'భారతదేశమే' అని ప్రకటిస్తాను.

**రోమారోలా:** (ఫ్రెంచి తత్వవేత్త) విశ్వ మనుగడ గూర్చి స్వప్నాలను మనిషి దర్శించడం ప్రారంభించిన భూమి ఏదైనా ఉందంటే అది కేవలం భారత దేశం మాత్రమే.

**హ్యూషి :** (అమెరికాలో మాజీ చైనా రాయబారి) ఒక్క సైనికుణ్ణి కూడా సరిహద్దులు దాటి పంపకుండానే గత 20 శతాబ్దాలుగా భారత్ చైనాపై సాంస్కృతిక ఆధిపత్యాన్ని కొనసాగిస్తోంది. అదే భారతదేశ ప్రత్యేకత.

**విల్‌డ్యూరాంట్:** (ప్రపంచ ప్రఖ్యాత చరిత్రకారుడు) మనం (పాశ్చాత్యులు) భారత్ పై దండెత్తి మారణకాండను సృష్టించి దోపిడీలకు పాల్పడితే భారత్ మాత్రం అందుకు బదులుగా సహనం, దయ, ఆత్మశక్తి, సామరస్యం – ఇలా సర్వ శ్రేష్ఠమైన లక్షణాలను ఆచరించి చూపించిన దేశం. ఐరోపా తత్త్వశాస్త్రానికి తల్లి భారతదేశమే.

**ఆర్నాల్డ్ జోసెఫ్ టాయన్బీ:** మానవ జాతిని ఒక కుటుంబంగా తీర్చిదిద్దగల్గిన దృక్పథం భారత్‌కు మాత్రమే ఉంది. పరమాణు యుగంలో భారతీయ దృక్పథం మాత్రమే మనల్ని కాపాడగలదు.

మానవ జాతి అతి భయంకరమైన పరిస్థితుల నుంచి గట్టెక్కాలంటే భారత్‌లో జన్మించిన అశోకుడు, రామకృష్ణ పరమహంస, గాంధీజీ చూపిన జీవన విధానాన్ని అవలంబించటమే ఏకైక మార్గం. c



# సామరస్యం సమానత్వం

- స్వామి రంగనాథానంద



ప్రజాస్వామ్యంలో అందరినీ కలిపేది పౌరసత్వమైతే, ప్రపంచంలో అన్నిమతాల్నీ కలిపేది ఆధ్యాత్మికత. మన ప్రజాస్వామ్య వ్యవస్థలో భారతీయులందరినీ కలిపేది పౌరత్వం. "నేను భారతీయుణ్ణి, నా దేశం భారత దేశం" అని ప్రతి పౌరుడూ స్వతంత్రంగా ప్రకటించుకునే గొప్ప ప్రజాస్వామ్య వ్యవస్థ మనది. వృత్తిపరంగా హోదాలు వేరుకావచ్చు. ఆర్థికంగా ధనికులు, పేదలు అని తేడాలుండవచ్చు. పౌరసత్వంలో అందరూ ఒకటే, తారతమ్యం లేదు. రాజ్యాంగం కల్పించిన హక్కులు, బాధ్యతలు అన్నీ అందరికీ సమానం. ఓటు హక్కు అందరికీ సమానం. దేశ ప్రధానికీ, బీదవాడికీ ఉండేది ఒకే ఓటు!. రాష్ట్రపతి కూడా పదవీ విరమణ తరువాత కోట్లాది భారతపౌరుల్లో ఒకరవుతారు; మన ప్రజాస్వామ్యం ఎంత గొప్పదో మననం చేసుకుంటే దేశంపై గౌరవభావం మరింత పెరుగుతుంది.

ఆధ్యాత్మిక జీవనంలో మతాల మధ్య తారతమ్యం లేదు. ఎవరి విశ్వాసాలు వారికుంటాయి. పూజావిధానం, వేషధారణ, లౌకిక విధానాల్లో చాలా తేడాలు కనిపిస్తాయి. ఆధ్యాత్మిక జీవనంలో మొత్తంగా చూసేది "మంచిగా ఉండు, మంచినే చెయ్యి". ఇదే మతసారాంశం అన్నారు స్వామి వివేకానంద.

**మతసామరస్యం**

శ్రీరామకృష్ణుల జీవితం రెండు ఆణిముత్యాల్లాంటి సందేశాల్ని బోధిస్తుంది. మొదటిది వ్యక్తిగత ఆధ్యాత్మిక జీవితాన్ని గాఢంగా ప్రభావితం చేయడం. రెండవది ప్రపంచంలోని మతాల మధ్య సామరస్యం.

హిందూ ధర్మం పరిధిని, అందులోని వైయుక్తిక మత సంప్రదాయాలను అతిక్రమించి ఇస్లాం, క్రైస్తవ మతాలను సాదరంగా స్వీకరించి, భిన్నమతాలమధ్య ఏకత్వం, సామరస్యం సాధించేందుకొక సామరస్యపూర్వకమైన విధానాన్ని సృష్టించారు. నిస్సందేహంగా శ్రీరామకృష్ణులు ప్రపంచానికి చేసిన మహోపకారాల్లో ఇది ఒకటి. ఆధ్యాత్మిక చింతనలో జీవిస్తూ ఎవరికివారే సత్యాన్ని కనుగొనాలి. తోటివారిపట్ల ప్రేమాభిమానాలతో మెలగాలి. ఆపన్నులకు సహాయం చేయడంలో, త్యాగ బుద్ధిని కలిగి ఉండడంలో మత భేదానికి ఆస్కారం లేకుండా మానవత్వం చూపాలని శ్రీరామకృష్ణులు ఉపదేశించారు.

శ్రీరామకృష్ణులు అన్నిమతాలూ సనాతన ధర్మం నుంచి ఆవిర్భవించినవేనని గ్రహించినందున ఆయన ఏ మతాన్నీ సంస్కరించే ప్రయత్నం చేయలేదు. సత్యాన్వేషణకు ఎవరు ఏ మార్గాన్ని ఎన్నుకున్నా దానిని గౌరవించాలి.

సువిశాల భారతభూమిలో అతి ప్రాచీన కాలంనుంచీ పొరుగువారి మతాన్ని గౌరవించడం , భిన్నమతాలమధ్య సామరస్యాన్ని పెంపొందించడం అనేవి మన మతంలోనూ, ప్రభుత్వవిధానంలోనూ విడదీయలేని అంశాలుగా పెనవేసుకుపోయాయి.

మానవజాతిలో సామరస్యం నెలకొనడానికి ఆధ్యాత్మికతే పునాది. అన్ని మతాలకూ వేదాంతం ఇచ్చే సందేశం ఇదే. ఈ సాంస్కృతిక వారసత్వాన్ని భద్రంగా కాపాడుకుంటూ ఆచరణలో పెట్టినప్పుడే సమాజంలో సామరస్యం, సమానత్వం విలసిల్లుతాయి. ఆ బాధ్యత మనపైనే ఉంది.

సేకరణ: ఆర్. కృష్ణ



# అడుగకనే ఇచ్చేవాడు!

– బి.సంజీవరావు

అడుగకే ఓ మనసా అడుగుకొలది అడుగునపడునని అడుగని శబరిని ఆదరించలేదా; అడుగక తనకై మడసిన జటాయువు కడకేగి సద్గతి కలిగించలేదా? శబరి రాముణ్ణి ఏమీ అడుగలేదు. జటాయువు సీతను రక్షించడానికి రావణుణ్ణి ఎదిరించి అతని చేతిలో ప్రాణం పోగొట్టుకుంది. రాముని వలన సద్గతి పొందింది. వారు ధన్యులు, త్యాగమూర్తులు. అడిగితే ఇచ్చేవాడు ప్రభువు, అడుగకుండానే ఇచ్చేవాడు విభుడు.

మహాభక్తులు త్యాగయ్య, అన్నమయ్య, పోతన, తుకారాం, సక్కూబాయి, మీరాబాయి– వీరంతా దైవాన్ని ఏమి అడిగారు? భోగభాగ్యాలు అడుగలేదు; కేవలం భగవంతునియందు భక్తిని ప్రసాదించమని అడిగారు; ఫలితంగా దైవ సాయుజ్యం పొందారు.

దుర్భర దారిద్ర్యం అనుభవిస్తున్న కుచేలుడు భార్య సలహాపై తన దారిద్ర్యనివారణకు కాసిని అటుకులు మూట కట్టి తీసుకొని తన చిన్ననాటి స్నేహితుడైన కృష్ణుని వద్దకు వెళ్ళాడు. తీరా వెళ్ళిన తరువాత తాను వచ్చిన పని మరచి అటుకులు కృష్ణునికి సమర్పించి వట్టి చేతులతో తిరిగి వచ్చాడు. కుచేలుడు తన దారిద్ర్యాన్ని పోగొట్టమని కృష్ణుణ్ణి అడుగలేదు. కానీ కుచేలుని పరిస్థితి తెలిసిన శ్రీకృష్ణుడు కుచేలునికి అష్టైశ్వర్యాలు ప్రసాదించాడు. భగవంతుడే భక్తుని అవసరాల్ని తీరుస్తాడనడానికి ఇదో నిదర్శనం.

నరేంద్రుడు (స్వామి వివేకానంద) ఉద్యోగం కోసం అమ్మను (కాళికాదేవిని) ప్రార్థించమని రామకృష్ణ పరమహంసను అర్థించాడు. అప్పుడు నరేంద్రునితో 'ఇక్కడ సిఫారసులు చెల్లవు కావాలంటే స్వయంగా నువ్వే మందిరానికి వెళ్ళి ఉద్యోగం కోసం అమ్మను ప్రార్థించు' అని పరమహంస అన్నారు.



నరేంద్రుడు కాళీమాతను తనకు ఉద్యోగం కావాలని అడగడం మరచి భక్తి జ్ఞాన వైరాగ్యాల్ని ప్రసాదించమని ప్రార్థించాడు. అప్పుడు రామకృష్ణులు నరేంద్రుణ్ణి 'అమ్మ నీ కుటుంబ భారం తీసుకుంటుంది. చింతించవద్దు'అని ఆశీర్వదించారు.

పాండవులు ఎన్ని కష్టాలు అనుభవించినా వాటిని నివారించమని శ్రీకృష్ణుణ్ణి వేడలేదు. అడుగకపోయినా కృష్ణుని అనుగ్రహం వల్ల కౌరవులపై విజయం సాధించారు. భగవంతుణ్ణి ఏమీ అడుగకపోయినా భక్తులకు ఏమి కావాలో అది ప్రసాదిస్తాడు.

అడిగేకొద్దీ అడుగునపడిపోతాం. అడగకుండానే దైవ సహాయం పొందుతాం. కాబట్టి అడగడం మానేద్దాం. మన అవసరాల్ని తీర్చే ఆ అనంతుణ్ణి ఆశ్రయిద్దాం. C

**సుజనుతోడగలియు సుగుణంబులబ్బును**
**కుజనుగలియు చెడ్డ గుణములబ్బు**
**పూలనంటి దారము పరిమళించును**
**మసినితాకి చేయి మలినమగును**

**ఎపుడు కర్మలాచరించుటే ధర్మంబు**
**వాంఛ చేయరాదు ప్రతిఫలంబు**
**కృషి మన విధి ఫలము నిచ్చును పరమాత్మ**
**కాన చేయదగు సుకర్మలెపుడు**

– పి. సయ్యద్ సాహెబ్

## సంప్రదాయాన్ని గౌరవించిన

# జ్యోతిష విద్వన్మణి



భారతావని అందించిన అత్యుత్తమ జ్యోతిశ్శాస్త్రవేత్తల్లో ఒకరు - ఖానాదేవి. భారతావనికి చెందిన మహోన్నత మహిళల గురించి మాట్లాడినప్పుడల్లా స్వామి వివేకానంద ఆమె పేరును ప్రస్తావించేవారు.

జ్యోతిష, ఖగోళ శాస్త్రాల్లో వరాహదేవుడు గొప్ప నిపుణుడు. ఉజ్జయినికి చెందిన విక్రమార్క చక్రవర్తి ఆస్థానంలో నవరత్నాలుగా ప్రసిద్ధికెక్కిన వారిలో ఆయన ఒకరు.

వరాహదేవుడు, ధరణీ దేవి దంపతులకు మిహిరుడు జన్మించాడు. మిహిరుడు జ్యోతిశ్శాస్త్రంలో గొప్ప విద్వాంసుడిగా పేరుగాంచాడు. శ్రీలంక రాజకుమారి అయిన ఖానాదేవిని అతడు వివాహమాడాడు. ఖానాదేవికి కూడా చిన్నప్పటి నుంచీ జ్యోతిశ్శాస్త్రం పట్ల అపారమైన మక్కువ. పెరిగి పెద్దవుతున్న కొద్దీ జ్యోతిషంలో ఆమె దిట్టగా మారింది.

జ్యోతిషంలో మిహిరుడి నైపుణ్యం గురించి విన్న విక్రమార్క చక్రవర్తి ఆయనను తన ఆస్థాన జ్యోతిష్యునిగా నియమించాడు. జ్యోతిషం గురించి రాజసభలో పలువురు అడిగిన ప్రశ్నలన్నిటికీ, వరాహదేవుడు, మిహిరుడు సమాధానాలిచ్చేవారు. కొన్ని క్లిష్టమైన సమస్యలు, సందర్భాలు తలెత్తినప్పుడు వారు ఖానాదేవిని ఆంతరంగికంగా సంప్రతించి, ఆ పైన రాజసభలో వాటికి బదులిచ్చేవారు. విక్రమాదిత్యుడికి ఈ సంగతి తెలిసింది. ఖానాదేవిని కూడా రాజసభకు తీసుకురావాలనీ, ఆమె విజ్ఞానం ద్వారా ప్రజలు లబ్ధి పొందే వీలు కల్పించాలనీ ఆయన మిహిరుణ్ణి కోరాడు.

చక్రవర్తి అభ్యర్థన విని తండ్రీ కొడుకులిద్దరూ దిగ్భ్రాంతికి లోనయ్యారు. కుటుంబ సంప్రదాయం, గౌరవాల రీత్యా చక్రవర్తి అభ్యర్థనను పాటించలేమని వారు గ్రహించారు. అదే సమయంలో చక్రవర్తి మాటలను పెడచెవిన పెట్టలేమనీ అర్థం చేసుకున్నారు. చర్చోపచర్చల అనంతరం వారు ఓ ఘోరమైన నిర్ణయం తీసుకున్నారు. కుటుంబ సంప్రదాయం, గౌరవాలను కాపాడాల్సిన అవసరం ఉందని మిహిరుడు, ఖానాదేవికి వివరించాడు. అందువల్ల ఆమెను నిండుసభకు పంపడం సరి కాదని వాదించాడు. మాట్లాడగలిగితేనే కదా, ఆమెను చక్రవర్తి సభకు పిలిచి, మాట్లాడేది. అసలు మాట్లాడడానికి వీలు లేకుండా చేస్తే! ఈ ఆలోచనతో, తండ్రి ఆదేశం మేరకు మిహిరుడు, ఖానాదేవి నాలుకను కత్తిరించాలని భావించాడు.

ఆమె నిశ్చల చిత్తంతో భర్త దగ్గరకు వెళ్ళి, మామగారు చెప్పినట్లుగా నాలుక కోసివేయాల్సిందిగా పేర్కొంది. మిహిరుడు అలాగే చేయడంతో, ఆమె వీర నాయికగా మరణించింది.

పరుల కోసమే జీవిస్తూ, కుటుంబ సంప్రదాయం, గౌరవాలను కాపాడేందుకు జీవితాన్నే త్యాగం చేసిన సద్గుణవతి ఆమె. అందుకే, భారతావనిలోని మహోన్నత నారీ మణిదీపాల్లో మైత్రేయి, లీలావతి, సావిత్రి, సీత, తదితరుల సరసన ఖానాదేవికి కూడా స్వామి వివేకానంద స్థానం కల్పించారు. d

...7పేజీ తరువాయి.



**విరివిగా మూర్తిత్రయ సాహిత్యం**

ఇక, 1990ల చివర నుంచీ తెలుగు ప్రచురణలు జోరందుకున్నాయి. అప్పట్లో మద్రాసు శ్రీరామకృష్ణ మఠం మేనేజర్‌గా వ్యవహరించిన స్వామి జ్ఞానదానంద తెలుగు ప్రచురణలపై దృష్టి సారించడంతో, వరుసగా పలు బృహద్గ్రంథాలు తెలుగు పాఠకుల చేతికి అందాయి. స్వామి చేతనానంద రచన *'దే లివ్డ్ విత్ గాడ్'* తెలుగులో *'దైవంతో సహజీవనం'* మొదటి భాగంగా, *'గాడ్ లివ్డ్ విత్ దెమ్'* రచన *'దైవంతో సహజీవనం'* రెండో భాగంగా తెలుగులోకి వచ్చాయి. ఆ తరువాత స్వామి శారదానంద రచన *'శ్రీరామకృష్ణ – ది గ్రేట్ మాస్టర్'*ను స్వామి దయాత్మానందజీ తెలుగులో *'శ్రీరామకృష్ణ పరమహంస – సమగ్ర, సప్రామాణిక జీవిత గాథ'*గా వ్రాశారు.

అలాగే, శారదాదేవి జీవితం, బోధనలపై *'శారదాదేవి చరితామృతం', 'శారదాదేవి వచనామృతం'* అనే రెండు గ్రంథాలనూ, స్వామి వివేకానంద సమగ్ర జీవితచరిత్రను 'స్వామి వివేకానంద' పేరిట (స్వామి జ్ఞానదానంద) రెండు సంపుటాలుగా తెలుగులో ప్రచురించారు.

**సొంత గడ్డ పైకి తెలుగు ప్రచురణల విభాగం**

1944 జూలైలో మద్రాసు మఠంలో ఆరంభమై, ఆరు దశాబ్దాల పైచిలుకుగా అందరినీ అలరిస్తున్న తెలుగు ఆధ్యాత్మిక మాసపత్రిక 'శ్రీరామకృష్ణ ప్రభ' 2007 జనవరి సంచిక నుంచి హైదరాబాద్ రామకృష్ణ మఠం ఆధ్వర్యంలో ముద్రితమవుతూ, ఆధ్యాత్మిక జిజ్ఞాసువులను అలరిస్తోంది. అలాగే, తెలుగు ప్రచురణల విభాగం 2007 మార్చిలో చెన్నై నుంచి హైదరాబాద్‌కు తరలివచ్చింది.

2007 మార్చి 11న హైదరాబాద్ రామకృష్ణ మఠ ప్రాంగణంలోని 'ప్రకాశన్ భవన్'లో తెలుగు ప్రచురణల విభాగం కాలుమోపింది. ఇలా మూర్తిత్రయ భావ ప్రచారంలో రామకృష్ణ మఠం తెలుగు ప్రచురణల విభాగం కొన్ని దశాబ్దాలుగా పాటుపడుతోంది. మాతృసంస్థ అయిన మద్రాసు శ్రీరామకృష్ణ మఠం ప్రచురణల విభాగం శతవార్షికోత్సవం సందర్భంగా ఆ గతాన్నీ, భవిష్యత్ కర్తవ్యాన్నీ మరోమారు గుర్తు చేసుకుంటూ, తెలుగు ప్రచురణల విభాగం తన మాతృదేవికి కృతజ్ఞతాపూర్వక వందనాలు అర్పిస్తోంది. C

...21వ పేజీ తరువాయి

## తారకనామంతో తరించిన త్యాగయ్య

**స్వర'యాత్ర'విశేషాలెన్నో...**

దేశంలోని ఎన్నో పుణ్యక్షేత్రాలు పర్యటిస్తూ త్యాగయ్య తన స్వరసుమాలతో ఆ యా దేవతామూర్తుల్ని అర్చించాడు. కంచిక్షేత్రంలోని ఏకామ్రనాథస్వామిని, కామాక్షీదేవిని, వరదరాజస్వామిని కీర్తించి తరించాడు. ఆనక శ్రీ వేంకటేశ్వర వైభవాన్ని స్తుతించేందుకు తిరుపతి పయనమయ్యాడు. తీరా ఏడుకొండలకు చేరుకున్నాక దర్శనసమయం ముగిసిపోయింది. శ్రీవారిసేవలో భాగంగా తెరపడింది. ఒక్కసారిగా త్యాగయ్య నీరు కారిపోయాడు. భగవంతుడికీ, తనకీ మధ్య అహంకారమే పరదాగా పరచుకుందని కుంగిపోతూ 'తెరతీయగ రాదా... నాలోని...తిరుపతి వేంకటరమణ మచ్చరమును' అంటూ పలవరించాడు. ఆ తిరుమలవాసుడు కాసుల కన్నా కీర్తనలకు ప్రసన్నుడవుతాడని మరోసారి ఋజువు చేశాడు. త్యాగయ్య రాగసుధకు తెర తొలగిపోయింది.

**పాటతో ప్రాణం పోసిన దాత...**

ఆయన మధురగానగంధర్వుడే కాదు మానవతామూర్తి కూడా. తిరుపతి యాత్ర ముగించుకొని పుత్తూరు తిరిగి వస్తూండగా ఒక యాత్రికుడు ప్రమాదవశాత్తూ బావిలో పడి మరణించాడు. అది అర్ధరాత్రి సమయం... ఎవరూ ఆ శవాన్ని కనీసం బయటకు తీసే ప్రయత్నం కూడా చేయలేదు. అతని భార్యాబిడ్డలు కన్నీరు మున్నీరుగా విలపిస్తున్నారు. త్యాగయ్య కంటపడిందా సన్నివేశం. ఒక్కసారిగా ఆయన హృదయం ద్రవించింది. 'నా జీవనాధార..' అనే కీర్తనను ఆలపించమని శిష్యుల్ని ఆదేశించాడు. తనూ స్వరం కలిపాడు... శవంపై తులసి తీర్థం చల్లాడు.. ఒక్కసారిగా ఆ పార్థివశరీరంలో చలనం... స్థానికంగా సంచలనం.

**ఆలపించని ఆనందభైరవి...**

త్యాగయ్య కాలంలో త్రిభువన స్వామినాథ అయ్యర్ అనే ప్రసిద్ధ గాయకుడు ఉండేవాడు. ఆయన 'ఆనందభైరవి' రాగాలాపనలో ప్రసిద్ధులు. ఆ నోటా ఈ నోటా ఆయన ప్రతిభను తెలుసుకున్న త్యాగయ్య ఓ రోజు స్వయంగా అయ్యర్ కచేరీకి హాజరై అబ్బురపడ్డాడు. 'అయ్యర్! మీ రాగాలాపనకు పరవశించాను. నేను మనసారా అభినందిస్తున్నాను' అని ఆలింగనం చేసుకున్నాడు. 'అయ్యా! అలాగైతే నాకు ఓ చిన్నవరం ప్రసాదించండి. మీరు ఆనందభైరవి ఆలపిస్తే, చరిత్రలో నా పేరు ఉండదు. అందుకే ఆనందభైరవి కీర్తి శాశ్వతంగా నాకు దక్కనీయండి' అని వేడుకున్నాడు అయ్యర్. అడిగిందే తడవుగా అంగీకరించాడు త్యాగయ్య. సాటి కళాకారులంటే అంత గౌరవం ఆయనకు; అందుకే ఎన్నో రాగాలతో ప్రయోగాలు చేసి మెప్పించిన త్యాగయ్య ఆనందభైరవిని మాత్రం ఆలపించలేదు. C

...17వ పేజీ తరువాయి.


ఈ రోజు నామాట తప్పక నిలబెడతాడు నా తండ్రి!
ఈ పిల్లవాడిలో ఏదో మహత్తర శక్తి ఉంది.
వీడెవడో ఉద్దండ పిండంలా ఉన్నాడు. ఈ రోజు నా పరువు నిలబడితే చాలు !


పండితుడు యమునుణ్ణి కొన్ని ప్రశ్నలడిగి సరియైన సమాధానాలు పొందాడు.
?!


అయ్యా! పిల్లవాణ్ణిని చిన్నచూపు చూడకండి. జ్ఞానానికి శరీరాకృతితో సంబంధం ఉంటే ఎద్దుకు మీ కన్నా ఎక్కువ తెలివి ఉండాలి!


అయితే ఇప్పుడు నీవు ప్రశ్నలు అడుగు. నా పాండిత్యాన్ని నీకు రుచి చూపిస్తాను.


ఇప్పుడు నేను చేసే ఈ ప్రతిపాదనలను మీరు శాస్త్రబద్ధంగా నిరూపించండి చూద్దాం!


1. మీ తల్లి సంతానవతి కాదు.
2. మన రాజు సద్గుణశీలి కాదు.
3. మన రాణి పుణ్యస్త్రీ కాదు.


స్వయంగా పన్నిన ఉచ్చులో చిక్కుకుని రాజు చేతిలో మరణించ బోతున్నావు!
ఏకపుత్రో అపుత్రః। ఒకే పుత్రుడు ఉన్నా లేనట్లే. కాబట్టి మీ తల్లి సంతానవతి కాదు.


యమునుడు వర్ధిల్లాలి
శభాష్ !
పౌరుల పుణ్యపాపాలలో ఆరవవంతు రాజుదే. కాబట్టి రాజు సద్గుణశీలి కాదు.


రాజు యందు సూర్య చంద్రులు, కుబేర,వరుణులు, ఇంద్రుడు, అగ్ని, వాయువు వసిస్తారు. ఇంతమందిని పెండ్లాడిన రాణి పుణ్యస్త్రీ కాదు.
పసివయసులో ఎంత పాండిత్యం!


నన్ను రక్షించడానికి వచ్చావురా నాయనా !


నేటి నుండి యమునుడు అర్ధరాజ్యానికి రాజు. ఈ రోజునుంచి కోలాహలుడికి ఎవరూ పన్ను కట్టనక్కర లేదు.
"యమునుడు వర్ధిల్లాలి"
"యమునుడు వర్ధిల్లాలి"
"యమునుడు వర్ధిల్లాలి"


యమునుడు రాజయ్యాడు. కోలాహలుణ్ణి శిక్షించకుండా వదిలివేశాడు.
వర్ధిల్లాలి
వర్ధిల్లాలి
వర్ధిల్లాలి
యమునుడు...

# గ్రంథ పరిచయం

హైదరాబాద్ రామకృష్ణ మఠం వారి

## నూతన ప్రచురణలు

తెలుగు ప్రచురణల విభాగం

రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్-500 029.




## భాగవత సుధ

(శ్రీమద్భాగవతము)

**రచన: చిలుకూరు వేంకటేశ్వర్లు,**

**పుటలు: 642 (మొదటి భాగం) ; 712 (రెండవ భాగం)**

**వెల: రూ. 250/- (రెండు సంపుటలు)**

**ఆ**ంధ్రుల ఆరాధ్య గ్రంథం శ్రీమద్భాగవతం. భక్తిరసపూరితమైన ఈ శ్రీమద్భాగవత గ్రంథాన్ని ఎందరో భక్తులు, పండితులు సంస్కృతం నుంచి తెలుగులోకి అనువదించి, తరించారు. ఇప్పుడు 'రామకృష్ణ మఠం' హైదరాబాద్ వారు 'భాగవత సుధ' పేరిట చిలుకూరు వేంకటేశ్వర్లుగారు వచన రూపంలో అనువదించిన శ్రీమద్భాగవతాన్ని (వేదవ్యాస విరచిత) ముచ్చటగా రెండు సంపుటాల్లో ప్రచురించారు. అక్కడక్కడ పోతన మందార మకరంద పద్య మధురిమలను ఉటంకించారు. పాఠకులను ఆకట్టుకొనే సరళ రీతిలో సాగింది అనువాదం. మహావిష్ణువు అవతారాల ముఖచిత్రంతో సర్వాంగసుందరంగా ఈ 'భాగవత సుధ'ను ఆస్తిక మహాశయులకు అందించిన ప్రచురణ కర్తలు అభినందనీయులు. d **– బి. సైదులు**

## సంపూర్ణ హనుమత్ చరిత్రము

**అనుసృజన : విశ్వనాథం సత్యనారాయణ మూర్తి**

**పుటలు: 240, వెల: రూ. 100/-**

**మ**హర్షి వాల్మీకి రామాయణంలో సముచితమైన మేరకే హనుమంతుని దివ్యగాథను పొందుపరచారు. కాని సంస్కృత సారస్వతంలో అనేక పురాణాలలో హనుమంతుని ప్రస్తావన విస్తృతంగా చోటుచేసుకొని ఉంది. సంస్కృతాంధ్ర గ్రంథాలలో చెదురుమదరుగా ప్రస్తావితమైన హనుమంతుని గూర్చిన కథలలో ప్రాధాన్యం సంతరించుకొన్నవీ, రసవత్తరమైనవీ ఎంపిక చేసుకొని వాటిని క్రోడీకరించి 17వ శతాబ్దాంలో పుష్పగిరి తిమ్మనార్యుడు 'సమీర కుమార విజయము' అనే ప్రబంధ కావ్యం రచించాడు. ఆ కావ్యానికి ఈ 'సంపూర్ణ హనుమత్ చరిత్రము' వచనరూప అనుసృజన. సర్వులకూ అలవోకగా అర్థం అయ్యే తేట తెలుగు వచనంలో ఈ గ్రంథాన్ని రచించిన సత్యనారాయణమూర్తిగారి కృషి ప్రశంసనీయం. పుస్తకం అత్యద్భుతంగా ముద్రించబడి, పది కాలాలపాటు పదిలపరచుకోవడానికి వీలుగా రూపొందడం గమనార్హం. d **– డి. శ్రీధర్**




## గురుహృదయం

**రచన : బొడ్డుపల్లి వెంకట సుబ్రహ్మణ్య ప్రసాదు**

**వెల: 60/-, పేజీలు: 104, ప్రతులకు: బి.ఎన్. వసుంధర 21-14-24/2, శ్రీ చిన్మయిసీతారామ నిలయం, తోటవారి వీధి 2, రామలింగేశ్వరపేట, తెనాలి-522 201.**

## దైవశక్తి

**సంపాదకులు : పురాణపండ రాధాకృష్ణమూర్తి**

**వెల: 33/-, పేజీలు: 108, ప్రతులకు: ఇ.వి.ఎస్.ఆర్. ప్రకాశ్, ఫ్లాట్‌నెం. 406, బ్లాక్-ఎ, విశాల్ టవర్స్, ఏ.ఎస్. రాజునగర్, కూకట్‌పల్లి, హైదరాబాద్-500 072**

# వార్తావాహిని

## వ్యక్తిత్వ వికాస సదస్సులు

**శ్రీకాకుళం జిల్లా చెట్లతాండ్ర శ్రీరామకృష్ణ సేవాశ్రమం** 2008 ఫిబ్రవరి 28 నుంచి మార్చి 1వ తేదీ వరకు వివిధ పాఠశాలల్లో వ్యక్తిత్వ వికాస సదస్సులను నిర్వహించింది.



మూడు రోజులపాటు జరిగిన సదస్సుల్లో రాజమండ్రి రామకృష్ణ మఠం అధ్యక్షులు స్వామి అక్షరాత్మానందజీ పాల్గొని విద్యార్థినీ విద్యార్థులకు – 'ఆత్మవిశ్వాసం, ఏకాగ్రత, ఆశావహ దృక్పథం' అలవర్చుకునే మార్గాల్ని స్వామి వివేకానంద బోధనలతో సోదాహరణంగా వివరించారు. c నివేదిక :**అట్టాడ నరసింహమూర్తి**

## 'శ్రీరామకృష్ణ బాలకాశ్రమం' ప్రారంభోత్సవం

**కడప రామకృష్ణ మిషన్** గ్రామీణ పేద విద్యార్థుల కోసం నిర్మించిన శ్రీరామకృష్ణ బాలకాశ్రమ భవనాన్ని రామకృష్ణ మిషన్ ప్రధాన కార్యదర్శి పూజ్య స్వామి ప్రభానందజీ మహరాజ్ 2008 మార్చి 13న ప్రారంభించారు. ఈ ప్రారంభోత్సవ కార్యక్రమంలో



చెన్నై శ్రీరామకృష్ణ మఠం అధ్యక్షులు స్వామి గౌతమానందజీ మహరాజ్ పాల్గొన్నారు. ఆశ్రమ ప్రథమ వార్షికోత్సవాన్ని పురస్కరించుకొని గ్రామీణ యువతకు ఫిబ్రవరి 25వ తేదీ నుంచి ఒక వారం రోజులపాటు తోటల పెంపకంలో శిక్షణా తరగతుల్నీ, మార్చి 13 నుంచి 16 తేదీ వరకు భక్తులకు ఆధ్యాత్మిక శిబిరాన్నీ నిర్వహించారు. c **నివేదిక : స్వామి సుకృతానంద, కడప**

## విద్యార్థుల్లో ఉత్తేజాన్ని నింపిన 'కలాం'

**విజయవాడ రామకృష్ణ మిషన్** గుంటూరు జిల్లా సీతానగరంలో నిర్వహిస్తున్న 'వివేకానంద విద్యా విహార్' పాఠశాలను 2008 ఏప్రిల్ 3వ తేదీ సాయంత్రం మాజీ రాష్ట్రపతి,భారతరత్న డాక్టర్ అబ్దుల్ కలాం సందర్శించారు.



డాక్టర్ కలాం ముందుగా ఆశ్రమ ప్రార్థనా మందిరాన్ని సందర్శించి, స్వామి వివేకానంద విగ్రహానికి పూలమాలను వేశారు. తరువాత పాఠశాల ప్రాంగణంలో వేప మొక్కను నాటారు. రామకృష్ణ మిషన్ కార్యదర్శి స్వామి శశికాంతానందజీ విజయవాడ కేంద్రం చేస్తున్న సేవా కార్యక్రమాల్ని ఆయనకు వివరించారు.

డాక్టర్ కలాం భక్తులను, ఉపాధ్యాయులను, తల్లితండ్రులను ఉద్దేశించి "మానవాళికి శ్రీరామకృష్ణులొసగిన మహత్తర సందేశం – సర్వమత సమన్వయం. అదే నేటి సమాజానికి ఓ దివ్యౌషధం. ఈ మహత్తర సందేశ వ్యాప్తికై మీరందరూ కృషిచేయాలి"అని పిలుపునిచ్చారు.

'దేశభవిష్యత్తుకు విద్యార్థులే పునాదిరాళ్ళు. బాల్యం నుండే సృజనాత్మకత, సమదృష్టి, ధైర్యం మొదలైన లక్షణాలను అలవరచుకొని ఉత్తమ పౌరులుగా రూపొందాలి' అని డాక్టర్ కలాం విద్యార్థులకు స్ఫూర్తిదాయక సందేశాన్ని ఇచ్చారు. అవినీతి రహిత సమాజ నిర్మాణంలో తల్లితండ్రులు, ఉపాధ్యాయుల బాధ్యతను ఆయన గుర్తుచేశారు. విద్యార్థులు అడిగిన ఆసక్తికర ప్రశ్నలకు ఆయన ఉత్సాహంగా సమాధానాలిచ్చారు. విద్యార్థులచే నిర్వహించబడిన ఈ కార్యక్రమం ఆద్యంతం ఆసక్తికరంగా, ఉల్లాసభరితంగా సాగింది. జిల్లా కలెక్టర్ బి. వెంకటేశం, ఎస్.పి. మహేశ్‌చంద్ర లడ్హ పాల్గొన్న ఈ కార్యక్రమానికి అధిక సంఖ్యలో విద్యార్థులు, తలిదండ్రులు, స్థానికులు, భక్తులు హాజరయ్యారు. c

**నివేదిక: శ్రీనివాస్, సుధాకర్ – సీతానగరం**

# సుబోధ





ఒక శిష్యుడు తన గురువు అనంతశక్తి పట్ల అఖండ విశ్వాసం గలవాడై, గురునామస్మరణ మాత్రంతో నది నీటి మీద నడిచిపోసాగాడు. దాన్ని చూసి ఆ గురువు ఇలా తలచాడు: 'ఆహా! కేవలం నా పేరులోనే ఇంతటి మహిమ ఉంటే నే నెంతటి మహాత్ముణ్ణో, శక్తిమంతుణ్ణో కదా!'

మరునాడు ఆ గురువు 'నేను', 'నేను' అంటూ ఆ నదిలోని నీళ్ళ మీద నడచిపోవడానికి ప్రయత్నించాడు. కానీ అతగాడు నదిలో అడుగుపెట్టాడో లేదో, దానిలో మునిగిపోయాడు. ఈదుదామంటే పాపం అతడికి ఈత కూడా రాదు. విశ్వాసం అద్భుతకార్యాలను సాధిస్తుంది; అహంభావమనేది వినాశనం తెచ్చి పెడుతుంది.

సాక్షాత్తు అవతారమూర్తి అయిన శ్రీరామచంద్రుడు లంకకు పోవడానికై సముద్రానికి సేతువు కట్టవలసి వచ్చింది. కానీ ఆయన భక్తుడూ, సేవకుడూ అయిన హనుమంతుడు రామనామం పట్ల గల అఖండ విశ్వాసంతో ఒక్క గంతులో సముద్రాన్ని లంఘించాడు. కేవలం విశ్వాస మహిమతో స్వామి కన్నా సేవకుడే ఎంతటి ఘనతరకార్యం చెయ్యగలిగాడో చూడండి!

ఈశ్వర సాక్షాత్కారం కావాలంటావా – పూనికతో, దృఢవిశ్వాసంతో నామజపం చెయ్యి; నిత్యమేదో అనిత్యమేదో వివేచించు.

పసివాడి విశ్వాసం లాంటి విశ్వాసం ఉన్న మనిషి పట్ల భగవంతుడికి కరుణ కలుగుతుంది. లాభనష్టాలను గురించి బేరీజు వేస్తూ ఉండే లౌకిక భక్తులు భగవంతుణ్ణి పొందడం దుర్లభం. C

('శ్రీరామకృష్ణ బోధామృతం' నుంచి)


శ్రీరామకృష్ణ ప్రభ

రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్ – 500 029
ఫోన్: 040–2766 7799, 2763 3936
E-mail : sriramakrishnaprabha@gmail.com



నిర్వాహక సంపాదకులు: స్వామి జ్ఞానదానంద
సంపాదకులు: స్వామి పరిజ్ఞేయానంద

# సురభి





స్వామి భూమానంద తారాసుందరి మొదట శ్రీశారదాదేవి దగ్గరకు వెళ్ళడాన్ని గురించి ఇలా వివరించారు: ఉదయం ఎనిమిది గంటలు దాటింది. శ్రీమాత గోలాప్ మా, యోగేన్ మా, డాక్టర్ అఘోరనాథ్ ఘోష్ గారి శ్రీమతి - వీరందరి వద్ద కూర్చున్నారు. ఉన్నట్లుండి శ్రీశారదాదేవి వారితో "మీరంతా కూర్చుని ఉండండి, నేను ఇప్పుడే వస్తాను" అని మెట్ల వైపు వెళ్ళారు. ఒక పాతికేళ్ళ యువతి కారు దిగి మెట్లు ఎక్కి వస్తోంది. శ్రీశారదాదేవిని చూడగానే రోదించసాగింది.

అమ్మ ఆమె దగ్గరకు వెళ్ళి "నువ్వు ఠాకూర్ దగ్గరకు వచ్చావు, ఇంక ఎందుకు ఏడుస్తావు?" అన్నారు. అమ్మ మాటలు విన్న ఆ యువతి దుఃఖం అధికమైంది.

ఈ యువతి సాధారణ స్త్రీ కాదు - ఆ కాలంలో ప్రసిద్ధ నటి. శ్రీశారదాదేవి ఆమెను ప్రేమగా స్పృశించగానే ఆమెలో దుఃఖం కట్టలు తెంచుకుంది. శ్రీమాత ఆమె గడ్డం పట్టుకుని ముద్దు పెట్టి ఆమెను అనుగ్రహించారు. ఆ రోజు నటి తారాసుందరికి దివ్యజననితో కలసి ప్రసాదం స్వీకరించే అవకాశం లభించింది.

ఈ నాటకరంగమే తనను వైకుంఠవాసిని అయిన లక్ష్మీదేవి (శారదాదేవి) దగ్గరకు తీసుకువెళ్ళిందని అనుకూల్ చెబుతుండేవాడు. 'నేను చిన్నతనంలోనే అమ్మను కోల్పోయాను. మా అమ్మను దివ్యజననిలో చూడగలిగాను. నాకు మంత్ర దీక్షనిచ్చి శాంతి లేని నా మనస్సును శాంత పరిచారు' అని వివరించాడు ఆ నటుడు. C

(స్వామి ఋతానంద స్మృతుల నుంచి)

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

జూన్ 2008

వెల : రూ. 10



సర్వమంగళ మాంగళ్యే శివే సర్వార్థ సాధికే ...

## ప్రవేశ / ఉద్యోగ ప్రకటన

**1. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది కోర్సులకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) 'వేదచూడామణి' : ఋగ్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క అధ్యయనము
యోగ్యతలు : మాతృభాషలో చదువగలిగి, వ్రాయగలిగి ఉండాలి.
వయస్సు : 8 నుంచి 10 సంవత్సరాల మధ్య
స్టైఫండ్ : నెలకు రూ. 1,000/-

(ఆ) 'వేదార్థచూడామణి' : ఋగ్వేదము/ యజుర్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క భాష్యాధ్యయనము
యోగ్యతలు : సంస్కృత పరిజ్ఞానముతో బాటు ఏదో ఒక వేదాన్ని పూర్తిగా అధ్యయనం చేసి ఉండాలి.
వయస్సు : 15 సం॥, ఆ పైన
స్టైఫండ్ : నెలకు రూ. 3,000/-

**2. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది ఉద్యోగాలకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) వేదాధ్యాపకుడు : (సామవేదము/ అథర్వవేదము - వేదానికి ఒక్కొక్కరు చొప్పున రెండు ఖాళీలు)
కావలిసిన అర్హతలు : క్రమాంతము లేక పదాంతము
అదనపు అర్హతలు : ఏదైన మఱియొక వేదము/ వేదభాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవము : 2 సంవత్సరములు
సంభావన : నెలకు రూ॥ 8,000/- మొత్తము, సౌకర్యములతో

(ఆ) వేదభాష్యాచార్యుడు : (ఒక్కొక్క వేదానికి ఒక్కొక్కరు చొప్పున 4 ఖాళీలు)
విద్యార్హత : ఏదైనా వేద భాష్యంలో ఉత్తీర్ణత
అదనపు అర్హత : మరొక వేద భాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవార్హత : 5 సం॥
సంభావన : నెలకు రూ. 10,000/- మొత్తము, సౌకర్యములతో

ముద్రించిన దరఖాస్తు ఫారములను **శ్రీ పి. వేంకటేశ్వర్లు గారు, మేనేజింగ్ డైరెక్టర్, కాకతీయ సిమెంట్, సుగర్ & ఇండస్ట్రీస్ లిమిటెడ్, 'గురుకృప' (ఆంధ్రా బ్యాంకు ఎదురుగా), 1 - 10 - 140/1, అశోక్‌నగర్, హైదరాబాద్ - 500 020** (ఫోను: 040 - 27637717) నుంచి ప్రత్యక్షముగా గాని, పోస్టు ద్వారా గాని పొందవచ్చు. పూర్తి చేయబడిన ఆ ముద్రిత దరఖాస్తులను ఈ పై అడ్రసుకు పంపవలెను. అవసరాన్ని బట్టి ఖాళీలను పూరించుట లోనూ, అర్హతల సవరణ లోనూ మేనేజ్‌మెంటుకు అధికారము కలదు.

సం/-
హైదరాబాద్ కులప్రశాసకుడు



Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 65 సంచిక: 6 జూన్ 2008

అహః సూతే సవ్యం తవ నయన మర్కాత్మకతయా
త్రియామాం వామం తే సృజతి రజనీనాయకతయా,
తృతీయా తే దృష్టిర్దరదలిత హేమాంబుజరుచిః
సమాధత్తే సంధ్యాం దివసనిశయో రంతరచరీమ్.



నీ కుడికన్ను సూర్యుడు కనుక పగలు ఏర్పడుతోంది. నీ ఎడమకన్ను చంద్రుడు కనుక రాత్రి ఏర్పడుతోంది; సగం విరిసిన బంగారు కమలంలా ఉన్న నీ మూడవ కన్ను వలన ప్రాతఃసాయం సంధ్యలు ఏర్పడుతున్నాయి.

(సౌందర్యలహరి నుంచి)




## లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు**...... రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**రాజ పోషకులు**............ రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**పోషకులు**................. రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| పేరు | చిరునామా | రూ. |
|---|---|---|
| మహారాజ పోషకులు : | శ్రీమతి ఎస్. మహాలక్ష్మి, గోవా - 403 601 | 12,000 |
| " " : | శ్రీ కామేశ్వరరావు, గడ్డియన్నారం క్రాస్ రోడ్, హైదరాబాద్- 500 060 | 10,000 |

## సౌజన్యమూర్తులకు ఆహ్వానం

ఆబాల గోపాలాన్ని జాగృత పరిచే రీతిలో 'శ్రీరామకృష్ణ ప్రభ'ను తీర్చిదిద్దుతున్న విషయం మీకు విదితమే. ముఖ్యంగా యువతరానికి దిక్సూచిగా నిలిచే 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకు, కళాశాలలకు అందించాలని సంకల్పించాం. యువతలో వ్యక్తిత్వ వికాసాన్నిచ్చి, ఆత్మవిశ్వాసాన్ని నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను యువతకు మరింత చేరువచేయడానికి మీ ఆర్థిక, హార్దిక చేయూతను కోరుతున్నాం.

ఒక సంవత్సరానికి రూ.100/- చొప్పున కనీసం 50 పాఠశాలలకు/కళాశాలలకు తగ్గకుండా స్పాన్సర్ చేసినట్లయితే 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక మీ పేరున (మీరు సూచించిన లేదా మేము ఎంపిక చేసిన పాఠశాలలకు/కళాశాలలకు) పంపుతాం. యువతను ఉద్దేశించి 'నా ఆశలన్నీ మీ పైనే' అన్నారు స్వామి వివేకానంద. స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతను తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి మీ వంతు సహాయాన్ని అందించి తోడ్పడండి. c సర్క్యులేషన్ మేనేజర్, శ్రీరామకృష్ణ ప్రభ



### ADVERTISEMENT TARIFF

| | MULTI COLOUR | B & W |
|---|---|---|
| Fourth Cover | Rs.25,000 | - |
| Second Cover | Rs.20,000 | - |
| Third Cover | Rs.20,000 | - |
| Inside Full Page | Rs.15,000 | 10,000 |
| Inside Half Page | Rs.10,000 | 5,000 |

| చందా వివరాలు | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|
| విడి ప్రతి : | రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా : | రూ. 100 | $ 20 |
| మూడు సంవత్సరాలకు : | రూ. 280 | $ 50 |
| ఐదు సంవత్సరాలకు : | రూ. 450 | $ 80 |
| ఇరవై సంవత్సరాలకు : | రూ. 1500 | $ 360 |



గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి. పంపవలసిన చిరునామా : Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.

## లోపలి పేజీల్లో...





ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకుడు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు.

- సంపాదకులు




**SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH**

Domalguda, Hyderabad - 500 029. Andhra Pradesh

Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com

సంపాదకీయం

# అమ్మ ఒడి అసలైన బడి



తల్లితండ్రులు అందరూ తమ పిల్లలు గుణవంతులు, బుద్ధిమంతులు కావాలనీ విలువలతో కూడిన ఉత్తమ పౌరులుగా ఎదగాలనీ ఆశిస్తారు. అలా తమ పిల్లల గురించి బంగారు కలలు కనడం ప్రతి తల్లితండ్రులకూ సహజమే. కానీ తమ పిల్లలు అలాంటి బంగారు బాటలో పయనించడానికి అనువైన వాతావరణాన్ని కల్పించడంలోనూ; అవసరమైన శిక్షణ, తగిన ప్రోత్సాహం ఇవ్వడంలోనూ తమ పాత్ర అత్యంత ప్రాధాన్యమైనదనే విషయాన్ని తల్లితండ్రులు విస్మరించరాదు.

ఒక మొక్క పెరిగి చెట్టై పండ్లను ఇవ్వాలంటే ఆ మొక్కకు తగినంత గాలి,నీరు,వెలుతురు లభించేలా చేస్తూ, ఆ మొక్క సంరక్షణా భారాన్ని వహించాలి. అలాగే పిల్లలు మంచి సంస్కారవంతులుగా, సద్గుణవంతులుగా మారాలంటే తల్లితండ్రులు పిల్లలకు బాల్యం నుంచే సద్విషయాల్ని బోధించడంలో తగిన శ్రద్ధ వహించాలి. అప్పుడే వారు సద్గుణశీలురుగా మారగలరు.

### పిల్లలకు ప్రథమ గురువు తల్లి

పిల్లలు తల్లి ఒడిలో నేర్చిన పాఠాలే వారి జీవన సౌధానికి పునాది రాళ్ళు. అందుకే మన భారతీయ సంస్కృతి తల్లికి అగ్రస్థానాన్ని ఇచ్చింది.

**ఉపాధ్యాయన్ దశాచార్య, ఆచార్యాణాం శతం పితా।**
**సహస్రం తు పితౄన్ మాతా గౌరవేణాతిరుచ్యతే॥** *(మనుస్మృతి)*

'పదిమంది ఉపాధ్యాయులు ఒక ఆచార్యునితో సమానం, వందమంది ఆచార్యులు ఒక తండ్రితో సమానం, వెయ్యిమంది తండ్రులు ఒక తల్లితో సమానం. కాబట్టి గౌరవించవలసిన వారిలో అగ్రస్థానం తల్లిదే!'.

పిల్లల మనసు తెల్లని వస్త్రం లాంటిది. మనస్సనే తెల్లని వస్త్రాన్ని సద్విషయాలతో నింపితే సద్గుణాలు అలవడతాయి. దుర్విషయాలతో నింపితే దుర్గుణాలు అలవడతాయి. కాబట్టి బాల్యం నుంచే పిల్లలకు రామాయణ, భారత, భాగవతాలలోని కథలను వినిపించాలి. మన భారతీయ ఔన్నత్యాన్ని ఆ పసి మనసులలో ముద్రపడేలా బోధించాలి.

తన సర్వస్వాన్నీ కోల్పోయినప్పటికీ మాట తప్పని మహాత్ముడు సత్యహరిశ్చంద్రుని గురించి; తనకు ప్రాణహాని పొంచివుందని తెలిసినప్పటికీ అడిగినవారికి లేదనకుండా దానం చేసిన బలిచక్రవర్తి, దధీచి మహర్షి, కర్ణుడు మొదలైన దానగుణ సంపన్నుల గురించి; మూగ జీవుల ప్రాణాలను కాపాడడానికి తమ ప్రాణాలనే త్యాగం చేయ డానికి సిద్ధమైన శిబి చక్రవర్తి, బుద్ధుని గురించి – ఇలా ప్రేమత్యాగాలను, సత్యధర్మాలను ఆచరించి ఆచంద్రార్కం చరిత్ర పుటల్లో చిరస్మరణీయులుగా నిలచిన మహనీయుల జీవిత గాథలను తల్లి పిల్లలకు బాల్యంలోనే బోధించాలి. అలా లేత మనస్సుల్లో నాటిన స్ఫూర్తిదాయక భావనలు వారి భావిజీవిత భాగ్యోదయానికి మార్గదర్శకాలవుతాయి.

ఛత్రపతి శివాజీకి తన ఒడిలోనే పాఠాలు నేర్పి మహావీరునిగా తీర్చిదిద్దింది తల్లి జిజియాబాయి. తన ఆధ్యాత్మిక శక్తితో ప్రపంచాన్నే మేల్కొలిపిన వేదాంత కేసరి వివేకానందుణ్ణి మనకు అందించిన తల్లి భువనేశ్వరీదేవి నరేంద్రునికి సత్య, ధర్మాలను నూరిపోసింది తన ఒడిలోనే. కాబట్టి తమ పిల్లలు ఉన్నత భావాలతో ఆదర్శజీవితాన్ని గడపాలని ఆకాంక్షించే ప్రతి తల్లీ తన ఒడినే ఒక బడిగా, గుడిగా చేసి తొలి పాఠాలను నేర్పాలి.

## పసి హృదయమే పవిత్ర క్షేత్రం

కల్మషం లేని క్షేత్రం పసి హృదయం. అలాంటి పవిత్ర హృదయాలలో నాటిన విలువల బీజాలే కాలాంతరంలో సంస్కారవంతులైన ఉత్తమ పౌరుల్నిగా తీర్చిదిద్దుతాయి. పిల్లలు బాల్యం నుండే దేవాలయాలకు వెళ్ళినా, రామాయణం, భాగవతం, భగవద్గీత లాంటి సద్గ్రంథ పఠనం చేసినా కొంత మంది తల్లితండ్రులు అయిష్టతను వ్యక్తం చేస్తుంటారు. ఇలాంటివన్నీ చేయవలసింది వృద్ధాప్యంలోనే అని పిల్లల్ని నిరుత్సాహ పరుస్తుంటారు.

ఒక అబ్బాయి వాళ్ళ అమ్మను 'అమ్మా! తాతయ్య చేతిలో ఓ పెద్ద పుస్తకం ఉంది అది ఏమిటి?'అని అడిగాడు. అది 'భగవద్గీత' అని ఆమె బదులిచ్చింది. 'అయితే తాతయ్య ఎప్పుడూ ఆ పుస్తకాన్ని వదలకుండా చదువుతూనే ఉంటాడు ఎందుకు?'అని తిరిగి ప్రశ్నించాడు ఆ అబ్బాయి. ఆమె 'తాతయ్య ఆఖరి పరీక్షలకు తయారవుతున్నాడు. అయినా ఈ గొడవంతా నీకు ఎందుకురా, అలాంటి పుస్తకాలు చదవడానికి నీకు ఇంకా చాలా సమయం ఉందిలే' అని విసుక్కొంటూ బదులిచ్చింది ఆ తల్లి. నైతిక, ఆధ్యాత్మిక విలువల్ని బోధించే భగవద్గీత లాంటి ఉత్తమ గ్రంథాలు చిన్నప్పటి నుంచే చదవడం ఎందుకని తల్లితండ్రులు భావించినంత వరకూ మన సమాజంలో ఆదర్శవంతులు ఎలా ఆవిర్భవిస్తారు? సచ్ఛీలురూ, సత్పురుషులూ ఎలా ఉద్భవిస్తారు? మాతృమూర్తి ఒడి పిల్లల మానసిక పరివర్తన నొసగే పవిత్రమైన బడి అని ప్రతి తల్లీ గుర్తించి పిల్లల్లో సద్గుణాల్ని అలవర్చడానికి ఓర్పుగా, నేర్పుతో కృషిచేయాలి.

## ఆచరణలో చూపిన ఆదర్శం

తల్లితండ్రుల ప్రవర్తనే పిల్లల్లో ప్రతిబింబిస్తుంది. కాబట్టి తల్లితండ్రులు సత్యం, ధర్మం,ప్రేమ,సేవ,త్యాగం తమ జీవితాల్లో ఆచరించిననాడు ఆ సద్గుణాలు పిల్లల్లో కూడా వృద్ధిచెందుతాయి. విలువల్ని బోధించడం కంటే ఆచరించినప్పుడే ఆ లేతమనసుల్ని త్వరగా ప్రభావితం చేయగలం. Values are not taught but caught. తల్లితండ్రుల ప్రవర్తన పిల్లలపై ఎలాంటి ప్రభావాన్ని చూపుతుందో తెలియడానికి 1940లో జరిగిన ఒక సంఘటనను తెలుసుకుందాం.

ఓ ఊరిలో ఒక అనాథ విద్యార్థి ఉండేవాడు. అతడు చదువులో ముందున్నా ఆర్థికంగా వెనకబడినవాడు. పదవ తరగతి వరకైనా చదువుకోవాలనే తపన ఉండేది ఆ విద్యార్థిలో. అనాథ బాలుణ్ణి ఆదుకోవడానికి ఆ ఊరిలో కొంత మంది ముందుకు వచ్చారు. అయితే వారంలో రోజుకి ఒకరు చొప్పున ఆరు రోజులపాటు ఆరుగురు ఆ విద్యార్థికి భోజనం పెట్టడానికి అంగీకరించారు. కానీ ఏడవ రోజు ఆ బాధ్యతవహించడానికి ఎవరూ ముందుకు రాలేదు. ఆ విద్యార్థి దీనావస్థను తెలుసుకొన్న ఒక ఉపాధ్యాయుడు 'నాకున్నంతలోనే నా పిల్లలతో పాటు నీకూ భోజనం పెడతాను' అని ఆ విద్యార్థికి ధైర్యం చెప్పాడు. అప్పటి నుండీ ఆ విద్యార్థి ప్రతీ ఆదివారం ఉపాధ్యాయుని పిల్లలతో పాటు భోజనం చేస్తూవుండేవాడు. ఉపాధ్యాయుని భార్య కూడా ఆ విద్యార్థిని తన సొంత కుమారుని కంటే అధికంగా ప్రేమించేది. భోజనానికి కూర్చున్నప్పుడు మొదట ఆ విద్యార్థికే వడ్డించేది. అంతే కాకుండా తన సొంత బిడ్డలకు ముందు రోజు మిగిలిన అన్నాన్ని వడ్డిస్తే, ఆ అబ్బాయికి మాత్రం అప్పుడే వండిన వేడి వేడి అన్నం వడ్డించేది. ఇదంతా గమనిస్తున్న ఆ విద్యార్థి ఒకసారి ఆమెతో 'అమ్మా! నాకు మాత్రమే వేడి అన్నం వడ్డిస్తున్నావు నీ కన్నబిడ్డలకు మాత్రం నిలువ ఉన్న అన్నాన్ని వడ్డిస్తున్నావు. అలా చేయడం నాకు చాలా బాధగావుంది' అని అన్నాడు. అందుకు ఆమె బాధాతప్త హృదయంతో 'నాయనా! నా బిడ్డలకు ఆరోగ్యం పాడైతే వారికి సపర్యలు చేయడానికి నేను ఉన్నాను. మరి నీ ఆరోగ్యం పాడైతే నీకు సపర్యలు చేయడానికి ఎవరున్నారు? అందుకే నీ ఆరోగ్యం పాడవకుండా నీకు ఎప్పుడూ వేడి అన్నం పెడుతున్నాను'అని సమాధానమిచ్చింది. ఆ తల్లి ప్రేమాప్యాయతలు ఆ అనాథ బాలుని మనసుని కదిలించాయి. నిస్వార్థ ప్రేమ అంటే ఎలాంటిదో రుచిచూపించింది ఆ ఆదర్శమూర్తి. తరువాతి కాలంలో ఆ బాలుడు ఉన్నత విద్యల్ని అభ్యసించి ప్రభుత్వ కార్యాలయంలో అత్యున్నత పదవిని సంపాదించాడు. నిజాయతీగల అధికారిగా పేరుపొందాడు.

'నన్ను ఆదర్శ ఉద్యోగిగా, విలువలతో కూడిన వ్యక్తిగా తీర్చిదిద్దింది నిస్వార్థ ప్రేమను ఆచరణలో చూపిన ఆ మాతృమూర్తే!'అని వినమ్రతను వ్యక్తపరిచేవాడు అతడు.

నేటి సమాజంలో సత్యహరిశ్చంద్రుడు, శ్రవణ కుమారుడు, శివాజీ, వివేకానందుడులాంటి మహాత్ములు ఉద్భవించాలంటే **'అమ్మ ఒడి అసలైన బడి'** కావాలి. అందుకు ప్రతి తల్లీ ప్రయత్నించాలి. C



తల్లి,గురువు, దైవం

# అమ్మే!

- స్వామి జ్ఞానదానంద

భగవంతుని అవతారాలన్నిటిలో ఏదో ఒక రూపంలో మనం ఆయనను దర్శిస్తాం. ఉదాహరణకు శక్తి రూపంలో, మాతృ రూపంలో, గురువు రూపంలో– అలాగ ఒక్కొక్క అవతారంలో ఒక్కొక్క రూపం కనిపిస్తుంది. దివ్యజనని శారదా మాతలో ఈ మూడు రూపాలూ ప్రత్యేకంగా కనిపిస్తాయి. ఆ తల్లి మూడు విధాలుగా భక్తులను అనుగ్రహిస్తుంది.

మన శారదమ్మ మూడు రూపాలు ఏమిటో దర్శిద్దాం.

శ్రీరామకృష్ణ పరమహంస మహాసమాధి చెందిన తరువాత అమ్మ కొంతకాలం కలకత్తాలో, కొంతకాలం జయరాంబాటీలో నివసించేది. ఆ రోజుల్లో అమ్మ దగ్గరకు చాలామంది భక్తులు వచ్చేవారు. అమ్మ జయరాంబాటీలో ఉన్నప్పుడు బందోపాధ్యాయ అనే ఒక భక్తుడు అమ్మ సేవ చెయ్యడానికి తరచుగా వచ్చేవాడు.

బందోపాధ్యాయ నిస్వార్థంగా అమ్మ సేవ చేసేవాడు. అమ్మ కూడా అతని మీద చాలా దయ చూపేది. కన్నతల్లిలా వాత్సల్యం చూపేది. అతని భోజన వ్యవహారాలు దగ్గరుండి చూసేది, అతని జీవిత సమస్యలను పరిష్కరించేది. అతను కూడా తన జీవన భారమంతా అమ్మ మీద పెట్టేశాడు. అతను "నాకు అమ్మ ఉంది, ఇక బెంగ ఎందుకు! అమ్మ పెట్టింది తింటాను, అమ్మ ఇచ్చింది కట్టుకుంటాను. స్వయంగా అమ్మే నా భారమంతా తీసుకుంది" అనేవాడు.

"మీరు అమ్మకు ఇంత దగ్గరగా మెసులుతారు, అమ్మ సేవ చేస్తారు కదా! మరి అమ్మ దగ్గర మంత్రదీక్ష ఎందుకు తీసుకోరు?" అని అందరూ బందోపాధ్యాయను అడిగేవారు. నిజానికి, మంత్రదీక్ష ఇవ్వాల్సిందిగా అమ్మను బందోపాధ్యాయ అడిగాడు. సమయం వచ్చినప్పుడు అన్నీ జరుగుతాయి అని అమ్మ అన్నారు.

ఒకసారి అమ్మ జయరాంబాటీ వెళ్ళారు. కొన్ని రోజులు గడిచాక అమ్మ అస్వస్థురాలు కావడంతో గ్రామంలో ఉన్న వైద్యుణ్ణి పిలిపించారు. వైద్యుడు ఔషధం ఇచ్చినా గుణం కనిపించలేదు. చివరకు అమ్మను కలకత్తా తీసుకెళ్ళి పెద్ద వైద్యుడికి చూపించాలని నిశ్చయించారు. కొంతమంది సన్న్యాసులు, గృహస్థ భక్తులతో కలిసి అమ్మ కలకత్తా ప్రయాణమయ్యారు. జయరాంబాటీ నుంచి విష్ణుపూర్ వరకూ పల్లకీలో, విష్ణుపూర్ నుంచి కలకత్తాకు రైలులో వెళ్ళాలని నిశ్చయించారు. "అమ్మకు ఒంట్లో బాగా లేదు కలకత్తా వెళుతున్నారు. తిరిగి ఈ ఊరు వస్తారో లేదో" అని విని బందోపాధ్యాయ, అమ్మను చూడడానికి వచ్చాడు.

అతను జయరాంబాటీ చేరేసరికి అమ్మ కలకత్తాకు బయల్దేరినట్లూ, కోల్‌పారాలో కొద్దిసేపు ఆగి, విష్ణుపూర్ స్టేషన్‌కు వెళతారనీ తెలిసింది. అది విన్న బందోపాధ్యాయ త్వరత్వరగా కోల్‌పారా చేరాడు. కానీ అమ్మ అప్పటికే కోల్‌పారా నుంచి కూడా వెళ్ళిపోయారు. అయినా అతను పట్టు విడవకుండా విష్ణుపూర్ వెళ్ళాడు. చివరకు అతను విష్ణుపూర్ స్టేషన్‌లో అమ్మను కలిశాడు.

అక్కడ అతను మంత్రదీక్ష ఇవ్వాల్సిందిగా అమ్మను అడిగాడు. అమ్మ ఆ స్టేషన్‌లోనే అతడిని ఓ పక్కకు తీసుకెళ్ళి, మంత్రదీక్ష ఇచ్చారు. ఆ తరువాత అమ్మ అతణ్ణి గురుదక్షిణ ఇవ్వమని అడిగారు. అమ్మకు గురుదక్షిణ ఇవ్వడానికి అతని దగ్గర ఏమీ లేదు. అతను కట్టుబట్టలతో వచ్చాడు. ఆ విషయం అతను అమ్మకు తెలియజేశాడు. అంతా విన్న అమ్మ మరేమీ ఫరవాలేదని ప్రశాంతంగా అన్నారు.

బందోపాధ్యాయ వెనక్కితిరిగి కొంత దూరం వెళ్ళి, అమ్మ దగ్గరకు వచ్చాడు. "అమ్మా! నా దగ్గర ఒకటి ఉంది. అది మీరు స్వీకరించగలరా?" అని అడిగాడు. అమ్మ "ఎందుకు తీసుకోను! తప్పకుండా తీసుకుంటాను" అన్నారు. అప్పుడు నెమ్మదిగా బందోపాధ్యాయ "అమ్మా! జీవితంలో నేను ఇప్పటి వరకూ చేసిన పాపాలన్నీ మీరు తీసుకోండి" అన్నాడు. జగజ్జనని అయిన అమ్మ ఆ మాట విని, వెంటనే చేతిలో నీళ్ళు తీసుకుని సంకల్పం చేసి, నేల మీద వదిలేస్తూ, "నీవు చేసిన పాపాలన్నీ నేను స్వీకరిస్తున్నాను" అన్నారు.

అలా చేసి అమ్మ వెళ్ళిపోయారు. కానీ అలా అన్నాక బందోపాధ్యాయ చాలా పశ్చాత్తాపపడ్డాడు.

ఈ ఉదంతంలో మనం అమ్మను మూడు రూపాల్లో చూస్తాం.

**మొదటిది మాతృరూపం:** బందోపాధ్యాయ జయరాం బాటీ వచ్చినప్పుడు ఆమె తల్లిలా ప్రేమించేది. తల్లి ప్రతీ క్షణం తన పిల్లల్ని చూసుకునేటట్లే శారదామాత అందరి బాగోగులను చూసుకునేది. విరుద్ధ మనస్తత్వాలున్న వ్యక్తుల మీద ఒకే రకమైన వాత్సల్యం చూపించేది. ఉదాహరణకు శరత్ మహరాజ్(స్వామి శారదానంద)నూ, గజదొంగ అయిన అమ్జాద్‌నీ అమ్మ ఒకే రకంగా ప్రేమించేది. అదే అమ్మ మాతృరూపం.

**రెండోది గురురూపం:** అమ్మ విష్ణుపూర్ స్టేషన్‌లో ఉన్న సమయంలో మంత్రదీక్ష ప్రసాదించాల్సిందిగా బందోపాధ్యాయ అడిగాడు. దయామయి అయిన అమ్మ తక్షణం గురురూపం దాల్చి, మంత్రదీక్షనిచ్చారు. మామూలుగా ఈ కాలంలో తనని తాను గురువుగా చెప్పుకునే వ్యక్తి ముందుగా దక్షిణ కోసమే ఏమైనా చేస్తారు. కానీ అమ్మ కేవలం కరుణతోనే గురువై దయ చూపింది. ఈ రోజు వరకూ ఏ ఆధాత్మిక గురువూ రైల్వేస్టేషన్‌లో శిష్యునికి మంత్రదీక్ష ఇవ్వలేదు. కానీ శారదామాత స్టేషన్‌లోనే బందోపాధ్యాయకు మంత్రదీక్షనిచ్చి అనుగ్రహించింది.

**మూడోది శక్తి రూపం:** మంత్రదీక్ష స్వీకరించిన బందోపాధ్యాయ, గురుదక్షిణగా తన పాపాలన్నీ అమ్మకిచ్చాడు. అమ్మ కూడా తన శక్తి సామర్థ్యాలతో అతని పాపాలన్నీ స్వీకరించింది. ఈ ప్రక్రియ అమ్మకున్న అపారమైన శక్తిని చూపిస్తుంది.

ఒకసారి ఒక వ్యక్తి స్వామి ప్రేమానంద మహరాజ్ దగ్గరకు మంత్రదీక్ష తీసుకోవడానికి వచ్చాడు. అతని వైపు ఒకసారి చూసిన ప్రేమానంద మహరాజ్, అతణ్ణి శారదామాత వద్దకు పంపారు. అమ్మ దగ్గర మంత్రదీక్ష తీసుకొన్న ఆ వ్యక్తి ప్రేమానంద మహరాజ్‌కు చెప్పడానికి వచ్చాడు. "ఇంత విషాన్ని అమ్మ స్వీకరించిందా" అన్నారు ప్రేమానందజీ మహరాజ్. ఇది అమ్మ శక్తిరూపాన్ని తెలియ జేస్తుంది. అందువల్ల మనందరికీ తల్లి, గురువు, దైవం శారదమ్మే! e



# పరిపూర్ణతను సాధించిన

పూర్ణ యౌవనంలో ఉన్న శ్రీరామకృష్ణులు, నవయౌవన సంపన్నురాలైన మాతృమూర్తి శారదాదేవి - ఈ దివ్యదంపతుల దివ్యలీలా విలాసాలు ప్రపంచ ఆధ్యాత్మిక చరిత్రలో మరే అవతార పురుషుని జీవితంలోనూ జరిగినట్లు తెలియదు.

శ్రీరామకృష్ణుల మనసు స్వాభావికంగానే ఎల్లప్పుడూ దివ్య ఆధ్యాత్మిక భావనలో ప్రతిష్ఠితమై ఉండేది. జగజ్జనని అనుగ్రహంతో తన సాధన పరిపూర్తి అయిందనీ, తన మనసులో విరుద్ధమైన భావాలు మెదలవనీ ఆయన గ్రహించారు. అలాంటి స్థితిలో జగజ్జననిచే నిర్దేశితులైన శ్రీరామకృష్ణులు షోడశీపూజకు సన్నాహాలు జరిపారు.

1873 మే 25వ తేదీ (జ్యేష్ఠ అమావాస్య) పవిత్రమైన ఫలహారిణి కాళీపూజ పర్వ దినం. దక్షిణేశ్వర ఆలయంలో ఈ పర్వదినాన్ని పురస్కరించుకొని విశేష పూజలు నిర్వర్తింపబడతాయి. జగజ్జననిని పూజింపగోరి, ఆరోజు శ్రీరామకృష్ణులు ప్రత్యేక ఏర్పాట్లు చేశారు. ఈ ఏర్పాట్లు ఆలయంలో కాకుండా ఆయన ఇచ్ఛ మేరకు ఆయన గదిలో గోప్యంగా జరిగాయి. పూజా సమయంలో దేవిని ఆశీనురాలిని చేయడానికిగాను పసుపు కుంకుమాదులతో అలంకరింపబడిన ఒక కొయ్యపీఠం అమర్చబడింది. సూర్యాస్తమయం అయింది. అమావాస్య చిమ్మచీకట్లు క్రమంగా నలుదిక్కులా అలముకోసాగాయి. పూజ కోసం ఏర్పాట్లన్నీ పూర్తయ్యేటప్పటికి రాత్రి తొమ్మిది గంటలయింది. ఈలోపు కుంకుమాదులతో అలంకృతమైన పీఠం మీద కూర్చోవలసిందిగా మాతృదేవికి శ్రీరామకృష్ణులు సూచించారు. పూజా కార్యక్రమాన్ని తిలకిస్తూ ఉండగానే ఆమె అర్ధబాహ్యచైతన్య స్థితిని చేరుకొన్నది. తమ ముందున్న పాత్రలోని మంత్రపూత జలాన్ని శాస్త్రనిర్దేశానుసారం పదేపదే మాతృదేవిపై ప్రోక్షించారు శ్రీరామకృష్ణులు.

"ఓ బాలా ! సర్వశక్త్యాధీశ్వరీ, మాతా, త్రిపురసుందరీ! నాకై సిద్ధిద్వారాన్ని తెరువు. ఈమె (మాతృదేవి) మనశ్శరీరాలను పవిత్రీకరించి, ఈమెలో అభివ్యక్తీకరించి సర్వకల్యాణ సాధనభూతవుకా"అంటూ ఆవాహనం ముగించాక మాతృదేవి దేహంలో మంత్రపాఠంతో న్యాస క్రియను ముగించి శ్రీరామకృష్ణులు షోడశోపచారాలతో (అంటే అర్ఘ్యపాద్యాదులనే పదహారు ఉపచారాలతో నిర్వర్తింపబడే పూజ) ఆమెను సాక్షాత్తూ జగజ్జననిగా అర్చించారు. పిదప నైవేద్యం అర్పించి,



దాన్లో ఒకింత తమ చేతులతో ఆమె నోటికి అందించారు. ఈలోపు మాతృదేవి బాహ్య చైతన్యాన్ని పూర్తిగా కోల్పోయి సమాధి మగ్నురాలైంది. శ్రీరామకృష్ణులు కూడా అర్ధ బాహ్యస్మృతిలో మంత్రోచ్చారణ చేస్తూ సంపూర్ణ సమాధిలో లీనమై పోయారు.

అలా చాలసేపు గడచి పోయింది. శ్రీరామకృష్ణులు అర్ధబాహ్యస్మృతిలోనే దేవికి ఆత్మనివేదనం చేయసాగారు; తమ జపమాలనూ, సమస్త సాధనాఫలాలనూ శాశ్వతంగా దేవి పాదపద్మాల వద్ద సమర్పించి

**ఓం సర్వమంగళ మాంగళ్యే శివే సర్వార్థ సాధికే।**
**శరణ్యే త్ర్యంబకే దేవి నారాయణి నమో - స్తుతే॥**

అని స్తుతిస్తూ ఆమెకు ప్రణమిల్లారు.

మూర్తీభవించిన సకల విద్యారూపిణి అయిన ఒక నారీ శరీరం ద్వారా జగదీశ్వరి ఉపాసనతో శ్రీరామకృష్ణుల సాధనలు చరమావస్థను చేరుకొన్నాయి. సర్వతోముఖ పరిపూర్ణత్వాన్ని ఆ మహనీయుడు సంతరించుకొన్నారు. C

# ఆనందమయ జీవనానికి ఆచరణ మార్గం

– స్వామి రంగనాథానంద



సృష్టిలో ఉన్నది ఆనంద తత్త్వమే. దుఃఖం అనేది ఉందంటే అది మనం తెచ్చిపెట్టుకున్నదే. చరాచర జగత్తులో ఏ జీవికీ దుఃఖం అనేది లేదు. ప్రకృతి ధర్మంగా జీవనం సాగించడమే ప్రాణుల కర్తవ్యం. ఒక్క మానవజాతి మాత్రమే ప్రకృతి ధర్మాలకు ఎదురీదడం వల్ల దుఃఖాల బారిన పడుతోంది. మానవ జీవన ప్రధాన లక్ష్యాన్ని పక్కనపెట్టి శరీరాన్నీ, మనస్సునూ వక్రమార్గంలో ప్రయాణింపచేయడం వల్ల బాధలు కొనితెచ్చుకుంటున్నారు.

**దుఃఖాన్ని ఎదుర్కోవడానికి చిట్కా ఏమిటి?**

ఈ ప్రశ్నకు ఉపనిషత్తు ఇచ్చే సమాధానం నిష్కామ కర్మ. బంధాల్లో చిక్కుకోకుండా బాధ్యతల్ని నిష్కామ బుద్ధితో నిర్వర్తించే వారికి దుఃఖం దరి చేరదు. కాలిపోయిన తాడు, తాడులా పడి ఉన్నా దానికి బంధించే శక్తి ఉండదు అన్నారు శ్రీరామకృష్ణులు. కర్మ మనిషిని బంధిస్తుంది. కానీ, దాన్ని జ్ఞానాగ్నిలో కాల్చివేస్తే అప్పుడు అది పనిలా తోచినా దానికి బంధన శక్తి ఉండదు.

**కర్మలను దహింపజేసే జ్ఞానాగ్నిని రగిలించడం ఎలా?**

దీనికి సమాధానం అహంకార, మమకారాలను తగ్గించుకోవడమే. నేను–నాది అనే భావనలో నుంచి బయటకు రావాలి. భక్తి జ్ఞాన వైరాగ్యాల ద్వారా ఇది సాధ్యమవుతుంది. ఇందుకు సాధన కావాలి. గురుముఖంగా చేసే సాధన సత్ఫలితాల్నిస్తుంది. వెలుగుతున్న దీపమే ఇంకో దీపాన్ని వెలిగించగలదు. మంచి గురువు సాధకుణ్ణి ఉత్తమ స్థితికి తీసుకువెళ్ళగలడు.

ఆనందం మన తత్త్వంలోనే ఉంది. ఇంద్రియ సుఖాలు ఇచ్చే ఆనందం తాత్కాలికం. శాశ్వతానందం అవగాహనకు వచ్చేందుకు జ్ఞానాన్ని వృద్ధి చేసుకోవాలి. అది సాధన ద్వారా సాధ్యమవుతుంది. మనలో ఉన్న అరిషడ్వర్గాల బలాన్ని తగ్గించి, హరి చింతన చేయాలి. ఆధ్యాత్మిక సాధనకు అవరోధమనిపించేది ఏదైనా విషంలా భావించమన్నారు స్వామి వివేకానంద. త్యాగంలోనే అపార ఆనందం ఉంది. మన శరీరసుఖాలను కూడా త్యాగం చెయ్యవచ్చు. మహాత్ములు చేసి చూపిన మార్గం కూడా ఇదే.

**మానవ జీవిత లక్ష్యం:** దివ్య, అమర ఆత్మ ప్రతి మనిషిలోనూ ఉంది. ఇది మానవుని నిజస్వరూపం. ఇది సమస్త ప్రాణుల నిజస్వరూపమే అయినప్పటికీ జంతువులు సాక్షాత్కరించు కోలేవు. భగవంతుణ్ణి (సత్యాన్ని) సాక్షాత్కరించుకునే సామర్థ్యం ఒక్క మానవునికే ఉంది.

మనం ఎన్ని సున్నలు వరుసగా పెట్టినా వాటి విలువ సున్నాయే. అదే సున్నలకు ముందు ఒకటి అంకె వేసుకుంటే తరువాత పెట్టిన సున్నలకు విలువ పెరుగుతూ ఉంటుంది. జీవితంలో 'భక్తి' అనే ఒకటి చేర్చుకుంటే మానవ జన్మ సార్థకమవుతుందని శ్రీరామకృష్ణులు ఉపదేశించారు. భక్తి అంటే ప్రేమ, ముందు నీ మీద నీకు ప్రేమ, నీ వారి మీద ప్రేమ, పరిసరాల మీద ప్రేమ, చరాచర ప్రకృతి వనరుల మీద ప్రేమ ఉండాలి. మొత్తంగా విశ్వ ప్రేమ కలిగి ఉండాలి. అప్పుడు అంతా ఆనందమే గోచరిస్తుంది. మనం ఆనందంగా ఉంటేనే అంతా ఆనందంగా కనిపిస్తుంది.

శరీర ఆరోగ్యాన్ని కాపాడుకోవడానికి మంచి ఆహారం తీసుకుంటున్నట్లే మానసిక ఆరోగ్యం కోసం మంచి భావాల్ని వృద్ధి చేసుకోవాలి. ఆధ్యాత్మిక గ్రంథాలు పఠిస్తూ ఉండాలి. మనస్సుకు మంచి భావాలను అందిస్తే జీవితం ఆనందమయం అవుతుంది. c

**సేకరణ: ఆర్. కృష్ణ**




ప్రవచనం: **శ్రీ సామవేదం షణ్ముఖశర్మ** విలేఖనం: **శ్రీమతి ఎన్. శేషు**

**(గత సంచిక తరువాయి)**

మహావృక్షం ఒక విత్తనంతోనే ప్రారంభమవుతుంది. అలాగే లలితా సహస్రనామాలనే మహావృక్షం "శ్రీమాతా" అనే విత్తనంతో మొదలయింది. విత్తనంలో వృక్షమంతా ఉన్నట్లే శ్రీమాతా అనే నామంలో లలితా సహస్రనామాల శక్తి అంతా దాగి ఉంది. "శ్రీమాత్రే నమః" (మాతకు నమస్కారం) అనేది గొప్ప మంత్రం. ఇదొక్కటి చాలు జన్మ తరించడానికి. మనం ఊపిరి ఎలా తీస్తూ ఉంటామో అలాగే "శ్రీమాత్రే నమః" అనే మంత్రాన్ని జపించుకోవచ్చు. అలా జపించి ధన్యులం కావచ్చు. ఆ మాటలో, ఆ పిలుపులో అంత శక్తి ఉంది. 'శ్రీ అనబడే మాతా' అనే అర్థమూ ఉంది, 'శ్రీమంతమైన మాత' అనే అర్థమూ తీసుకోవచ్చు. 'శ్రీలకు మాత' అని కూడా అర్థం తీసుకోవచ్చు.

శ్రీ అనబడే మాత అని అర్థం తీసుకుంటే – శ్రీ ఒక మహాబీజాక్షరం. శ్రీ అనేది పెద్ద శక్తి బీజం. శక్తి బీజాలు కొన్ని ఉన్నాయి. అమ్మవారి ప్రణవాలు ఐదు ఉన్నాయి. పరబ్రహ్మకు సంబంధించిన ప్రణవం – ఓంకారం. 'శ్రీం కారం, హ్రీం కారం, క్లీం కారం, ఐం కారం, సౌః కారం' – ఈ ఐదూ శక్తి ప్రణవాలు. అందులో 'శ్రీం కారం' చాలా ముఖ్యం. ఎందుకంటే అమ్మ పేరే శ్రీమాత! అమ్మ సూక్తం – శ్రీ సూక్తం! అమ్మ యంత్రం – శ్రీ యంత్రం! అమ్మ మంత్రం – శ్రీ మంత్రం! అమ్మంతా శ్రీమయం. మనం "శ్రీ" అనే దాని అర్థాలు తెలుసుకోవాలి. శ్రీమాతా అన్నప్పుడు అవి గుర్తుకు రావాలి. అమ్మ వైభవం శ్రీ అనే పేరులోనే ఉంది.

'శ్రీ యతే ఇతి శ్రీ' అని మరొక అర్థం. అంటే ఆశ్రయించునది, ఆశ్రయస్థానమైనది ఇతి శ్రీ. అది విశేషం. "ఆశ్రయించునది" అంటే అమ్మవారు సదాశివుని ఆశ్రయించిన శక్తి. అంటే నిరంతరం పరబ్రహ్మను ఆశ్రయించారు. ఎలా ఆశ్రయించారు అంటే ఉదాహరణకు వెలుగు, జ్యోతిని ఆశ్రయించింది. తీపి, పంచదారను ఆశ్రయించింది. అలాగే శక్తి అంతా శక్తిమంతుడైన ఆ పరబ్రహ్మను ఆశ్రయించుకొని ఉంది. అందుకే పరబ్రహ్మ యందు ఆశ్రయించి ఉన్న శక్తియే శ్రీ అంటారు.

ఇంకొక రకంగా ఆశ్రయస్థానం అంటే సర్వ జీవులకూ ఏది ఆశ్రయమో అది శ్రీ. మనందరం అలలమైతే అమ్మ సముద్రం. జీవులందరం కూడా ఆశ్రయించవలసిన చోటు అమ్మే. ఈ విషయం మనకు దేవీ సప్తశతి చెబుతుంది – "*త్వామాశ్రితానాం న విపన్నరాణాం, త్వామాశ్రితాహి ఆశ్రయతాం ప్రయాంతి* (ఆశ్రయతాం = ఆశ్రయించతగ్గది) – అమ్మా నిన్ను ఆశ్రయించిన నరులకు విపత్తులనేవి లేవు తల్లీ! నిన్ను ఆశ్రయించిన వారు నిజమైన ఆశ్రయస్థానాన్ని ఆశ్రయించినవారు; వారే తెలివైనవారు". ఈ ఆశ్రయమనే స్వరూపాన్నే మనకు వేదోక్తమైన దుర్గా సూక్తమ్ "నా దేవ *సింధుం దురితాద్యగ్నిః*" అని చెబుతోంది. ప్రవాహంలో కొట్టుకుపోయేవాడు నావను ఆశ్రయించినట్లు అమ్మను ఆశ్రయించాలట! ఈ సంసారమనే సముద్రంలో కొట్టుకుపోయే వాళ్ళను ఒడ్డున చేర్చడానికి అమ్మ సిద్ధంగా ఉన్న నావ లాంటిది. ఆ నావను ఆశ్రయిస్తే మనం తప్పకుండా తరిస్తాం. మనల్ని తరింపచేసే శక్తి కలది కనుక "సుతరసి తరసే నమః" – అంత కన్నా తరింపజేసే శక్తి మరొకటి లేదు. ఎప్పుడూ మనల్ని అంటిపెట్టుకుని కనిపెట్టే ఏకైక జనని జగదంబిక. మన చైతన్యమే మనకు తల్లి. సర్వజీవులనూ సర్వకాల సర్వావస్థల్లో కూడా గమనించుకుంటూ ఎవరిని ఏ తొట్టెలో ఉంచాలో ఆ తొట్టెలో ఉంచి ఊపుతూ ఉన్న తల్లి. (తొట్టె అంటే ఉపాధి). మనం ఎన్ని ఉపాధులు మారుతున్నా అన్ని ఉపాధుల్లో ఉంచుతూ, ఊపిరి ఉయ్యాలలూపుతూ మనల్ని నడిపిస్తున్న ఏకైక చైతన్య స్వరూపిణి జగదంబిక. అందుకే "అమ్మల గన్నయమ్మ" అన్నారు. అమ్మలందరికీ అమ్మ అంటే కారణాలకి కూడా కారణం అని అర్థం. అన్నిటికీ పరమ కారణమే అమ్మ.

మాత అంటే మరొక విశేషం ఉంది. మానము, మేయము, మాత అని మూడు శబ్దాలున్నాయి. 'మానము' అంటే కొలత. 'మేయము' అంటే కొలవబడేది. 'మాత' అంటే కొలిచేది అని అర్థం. కొలత, కొలవబడేది, కొలిచేది అని మూడున్నాయి. సృష్టిలో అన్నీ కొలతకు అందేవే. ఇక్కడ అమ్మవారి అసలు

తత్త్వం మనకు తెలుస్తుంది. అన్నీ కొలతకు అందుతాయి. ఏమిటా కొలతలంటే దేశం, కాలం, వస్తువు. ఒక వస్తువు ఉందంటే ఎంత జాగా ఆక్రమించింది, ఎంతకాలం అది ఉంది; ఎంత స్థానం ఆక్రమించిందనేది దేశపు కొలత. వీటిని పరిచ్ఛిన్నాలు అంటారు.

పరిచ్ఛిన్నం అంటే పరిమితికి అందేది. సృష్టిలో దేన్ని చూసినా ఈ మూడు పరిమితుల్లోనే ఉంటుంది. ఎంత జాగా ఆక్రమించింది, ఎప్పటి నుంచి ఉంది, ఎప్పటి వరకూ ఉంటుంది; దాని పొడవు ఎంత, వెడల్పు ఎంత – ఈ పరిమితులు అందరికీ ఉంటాయి; సర్వ జీవులకూ ఉంటాయి. ఏ జీవి పరిమితి ఎంతో, వారిలో ఎంత నింపాలో ఆ నింపే శక్తి ఒకటి ఉంది. మన ఉపాధులన్నిటికీ కూడా ఈ దేశకాల పరిమితులకు అనుగుణంగా, మన కర్మలకు అనుగుణంగా ఏ జీవికి ఎంత ఇవ్వాలో ఆ కొలత తెలిసిన తల్లి ఆమె.



సర్వ జీవుల కర్మలు, పరిధులు, ఉపాధులు తెలుసుకుని ఎవరికి ఏది కావాలో నింపి పంపింది అమ్మ. ఇన్ని ఉపాధుల్లో ఇన్ని రకాల చైతన్యశక్తిని నింపి పంపిందంటే ఆవిడ అఖండ చైతన్యస్వరూపిణి కనుక తనను తానే నింపింది. చైతన్య స్వరూపిణి అయిన ఆ తల్లి ప్రతి జీవిలో తనదైన చైతన్యాన్ని ఎవరికి ఎంత నింపాలో అంత నింపి పంపుతుంది. అందుకే వారి వారి కర్మలకు అనుగుణంగా వారికి ఫల ప్రదాయిని – అది మాతా అనే శబ్దానికి మనకి కనిపించే మరొక అర్థం. ఆ తల్లి అనుగ్రహం పొందడానికి "శ్రీ మాతా" అనేది తప్ప మరొక మంత్రం మనకి లేదు. దాని వల్ల "నాది" అనే అహంకారం, "నేను" అనే మిడిసిపాటుతనం ఆవిడ పాదాలలోకి వెళ్ళిపోతాయి. అహంకారం తలెత్తినప్పుడు ఆ పరబ్రహ్మ స్వరూపిణిని తలచుకుంటే ధన్యులమవుతాం. అహంకారంలో ఉన్న మన మీద దయ కలిగితే అపరిమితమైన తన చైతన్యంలో లీనం చేసుకుని అమ్మ మనల్ని అనుగ్రహిస్తుందట.

సామవేదంలో ఉన్న కేనోపనిషత్తులో అమ్మవారి గురించి ఒక అద్భుతమైన కథ ఉంది. శంకరభగవత్పాదుల వారు భాష్యం రచించిన కేనోపనిషత్తులో ప్రతిపాదితమయ్యేది బ్రహ్మవిద్య. దీని ప్రథమ మంత్రం కేన అని ప్రారంభమవుతుంది కనుక దీనికి 'కేనోపనిషత్తు' అని పేరు. కేన అంటే దేని చేత అని అర్థం. 'దేని చేత' అని ప్రశ్నించి సమాధానం తరువాత చెబుతారు. 'కేన' అని ప్రశ్నిస్తే, 'యేన' అని సమాధానం వస్తుంది.

దేని చేత ఈ జగత్తంతా నడుస్తున్నదో అది పరబ్రహ్మం అని తీర్మానిస్తున్నారు. దేనివల్ల ఈ జగత్తు పుడుతోంది, దేని వల్ల ఈ జగత్తు జరుగుతోంది, దేనిలో ఈ జగత్తు లయమవుతోంది – ఈ ప్రశ్నలే సృష్టి, స్థితి, లయలు. *'యతో వా భూతాని జాయంతే యేన జాతాని జీవంతి యత్...'* అని ఉపనిషత్తులో చెప్పింది అదే. ఆ యత్ జ్ఞానమే యజ్ఞము. ఏదైతే ఈ జగత్తంతటికీ మూల కారణమో దానికి చెవి లేదు కానీ అన్ని శబ్దాలనూ వింటుంది; అదే అన్ని చెవులు పనిచేయడానికి మూలం అన్నారు. అంటే అమ్మకు ఇంద్రియాల పరిమితి లేదు; కానీ మన ఇంద్రియాలు పనిచేయడానికి ఆవిడే మూలం. అందుకు అమ్మవారు "సహస్ర శీర్షవదనా సహస్రాక్షీ సహస్రపాత్" – అనంత శక్తి స్వరూపిణి. 'సర్వోపనిషత్ ఉద్ఘుష్టా శాంత్యతీత కళాత్మికా'.... అని ఉపనిషత్తులు ఉద్ఘోషిస్తున్నాయి. ఉపనిషత్తులన్నీ ఏ ఆత్మ తత్త్వాన్ని ఎలుగెత్తి చాటుతున్నాయో ఆ ఆత్మ తత్త్వమే అమ్మ. ❖ **(సశేషం)**




- స్వామి సుకృతానంద

– జి. కాంతయ్య, హుజూర్‌నగర్

? : నిరక్షరాస్యులకు జ్ఞానం కలగాలంటే ఏం చేయాలి?

✍: అక్షరాస్యులైనా, నిరక్షరాస్యులైనా భగవంతునిపై అఖండ భక్తి శ్రద్ధలుండి, సాధన చేస్తే జ్ఞానం లభిస్తుంది. బందిపోటు దొంగ వాల్మీకి అయ్యాడు. 'తిన్నడు' భక్త కన్నప్ప అయ్యాడు. లాటూ మహరాజ్ (స్వామి అద్భుతానంద) సంగతి



తెలిసిందే! 'క' పలకడం రాని లాటూ మహరాజ్, శ్రీరామకృష్ణ భగవానుల స్పర్శవేదితో బ్రహ్మజ్ఞాని అయ్యారు. కాళిదాసు శ్రీకాళికాదేవి అనుగ్రహంతో మహాకవి అయ్యాడు కదా!

– ఎం. నారాయణరావు, ఆత్మకూరు

? : భగవంతుడు అంతటా వ్యాపించి ఉన్నాడంటారు. మన దేహంలో ఆ భగవంతుని ఉనికిని ఎక్కడ గుర్తించాలి? కొందరు సహస్రారంలో, మరికొందరు భ్రుకుటిలో, ఇంకొందరు హృదయంలో ఆయన ఉంటాడంటారు?

✍: భగవంతుడు సర్వవ్యాపి, సర్వాంతర్యామి అయినా దేహంలో హృదయస్థానంలో ఆయన సులభంగా దొరుకుతాడు. అంగుష్ఠ (బొటనవ్రేలు) పరిమాణం గల పురుషుడు, పరమాత్మ, అంతరాత్మ ఎల్లప్పుడూ జీవుల హృదయాల్లో నివసిస్తాడు.

"అంగుష్ఠ మాత్రః పురుషో ఽంతరాత్మా సదా జనానాం హృదయే సన్నివిష్టః" (కఠోపనిషత్తు)

"పద్మకోశ ప్రతీకాశగ్ం హృదయం చాప్య ధోముఖమ్"

*(నారాయణసూక్తమ్)*

హృదయ పుండరీకం పద్మం; అధోముఖంగా ఉన్న పద్మం లోపల పరమాత్మ ఉన్నాడు.

ఇక, భగవద్గీతలో శ్రీకృష్ణభగవానుడు ఇలా చెప్పాడు: "సర్వస్య చా ఽహం హృది సన్నివిష్ఠ". "అందరి హృదయాల్లో నేను ఉన్నాను" అని దాని అర్థం.

సహస్రారం గురు, శివస్థానం. భ్రుకుటి పై ధ్యానం చేస్తే 'తలనొప్పి' రావచ్చు. కాబట్టి, హృదయంలోనే భగవంతుణ్ణి ధ్యానం చెయ్యమని శ్రీరామకృష్ణుల ఉవాచ.

– ఆర్. రాఘవేంద్ర, నల్లగొండ

? : అస్పర్శయోగం అంటే ఏమిటి? దాన్ని అనుష్ఠించడానికి మార్గాలేమిటి?

✍:సూక్ష్మ భూతముల సమష్టి సత్త్వాంశాలతో మనోబుద్ధి చిత్తాహంకారాలు నిర్మితమయ్యాయి. ఇవన్నీ జడ పదార్థాలు. ఆత్మ చైతన్యం వీటిలో ప్రతిబింబించడం వల్ల ఇవి చేతనాల లాగ కనిపిస్తాయి. మోక్షం పొందిన జీవుడికి ఘటాకాశం మహాకాశంలో లీనమైనట్లుగా చైతన్యం ఒకటే అవుతుంది. *"తస్య ప్రాణాః ఇహైవ ప్రలీయంతే."* తస్య = జ్ఞాని యొక్క, ప్రాణాః = ఇంద్రియాలు, ఇహైవ = ఇచ్చటనే (వాటి వాటి కారములలో), ప్రలీయంతే = లీనమవుతున్నాయి. సూక్ష్మభూతాలు సూక్ష్మభూతాలలోను, స్థూలభూతాలు పంచ మహాభూతాలలోను లీనమవుతాయి. ఆ ఆత్మను ఏ భూతం కానీ, ఏ అజ్ఞానం కానీ స్పర్శించదు. దీన్నే "అస్పర్శ యోగం" అంటారు. మనస్సు తన కారణంలో లీనమవడం, ఆత్మను స్పర్శింపక పోవడమే అస్పర్శం. నిష్కామకర్మ, వేదాంత శ్రవణం, మననం, నిధిధ్యాసనలు, (జపాత్ సిద్ధిః యజ్ఞానాం జప యజ్ఞో ఽస్మి) జపం మొదలైనవి ఈ అస్పర్శ యోగం సిద్ధించడానికి మార్గాలు. పై మార్గాలను అవలంబించే వారికి సత్యవాక్య పరిపాలన, ఇంద్రియ నిగ్రహం, బ్రహ్మచర్యం మొదలైన గుణాలు ఉండి తీరాలి. ❖



ధీరవాణి

– స్వామి వివేకానంద

# శాశ్వతత్వం కోసం శ్రమిద్దాం!

ఏది లేక మనం జీవించలేమో అది మనకు సిద్ధించి తీరాలి. లేకపోతే బతకడమే అసాధ్యమవుతుంది.

నువ్వు యోగివి కాగోరే పక్షంలో నువ్వు స్వేచ్ఛగా ఉండాలి; బెడద, బాధ్యత, ఆందోళన లేని పరిస్థితి కల్పించుకోవాలి. ఒంటరిగా ఉండాలి. హాయిగా, సుఖప్రదంగా జీవించాలని అభిలషిస్తూనే, ఆత్మసాక్షాత్కారాన్ని పొందగోరేవాడు నదిని దాటాలనుకొని, దూలమనే భ్రాంతితో మొసలిని పట్టుకొన్నటువంటి అవివేకే!

"ప్రప్రథమంగా శాశ్వతుడైన భగవంతుణ్ణి కాంక్షించు. తక్కినవన్నీ తరువాత నీకు లభిస్తాయి." దేనినీ లక్ష్యపెట్టని వ్యక్తికే స్వర్గం లభిస్తుంది. అదృష్టం వగలాడి లాంటిది; తనను వరించే వ్యక్తిని అది లక్ష్యం చెయ్యదు. తనను ఎవరు నిర్లక్ష్యం చేస్తారో వారి పాదాలను అది ఆశ్రయిస్తుంది. ధనం తనను లక్ష్య పెట్టని వారి వద్దకు వచ్చి పడుతుంది. అలాగే కీర్తి కూడా భారమనిపించేటంతగా వచ్చి పడుతుంది. అవి సదా ప్రభువునే ఆశ్రయిస్తాయి. బానిసకెప్పుడూ ఏదీ లభించదు.

ధనం, కీర్తిప్రతిష్ఠలు లేకపోయినా ఎవరు జీవించగలరో, ఎవరి జీవితం ప్రాపంచిక క్షుద్రవిషయాల మీద ఆధారపడదో వారే ప్రభువులు! ఆశయం కోసం జీవించండి. ఒక్క ఆశయాన్నే లక్ష్యంగా పెట్టుకోండి. మహోన్నత, మహత్తర శక్తిమంతమైన ఆశయం మీద దృష్టి నిలుపుకోండి. మనస్సులో మరి దేనికీ తావు లేకుండా చెయ్యండి. మరి దేనికీ మీ సమయాన్ని వినియోగించవద్దు.

కొందరు ధనవంతులవడానికి తమ శక్తియుక్తుల్ని సంపూర్ణంగా ఎలా వినియోగిస్తారో కదా! నిద్ర లేచాక ఆహారం తీసుకోవడానికి కూడా వారికి తీరుబడి ఉండదు. ధనార్జన ప్రయత్నంలోనే నూటికి తొంభైమంది చనిపోతారు. తక్కినవారు ధనమార్జించినా దాన్ని అనుభవించలేని స్థితిలో ఉంటారు. ఎలాంటి స్థితి అది! ధనవంతులవడానికి ప్రయత్నించడం తప్పు పని అని నేను అనడం లేదు.

మనం మరణించేటప్పుడు సంపదలు విడిచిపెట్టి వెళ్ళవలసిందే అని మనకు తెలుసు. అయినా వాటి కోసం ఎంతటి శక్తిని వినియోగిస్తున్నామో చూడండి. మరి మనం శాశ్వతంగా మనతో ఉండే వస్తువు కోసం వెయ్యిరెట్లు ఎక్కువ శక్తిని ప్రదర్శించవద్దా! మరణానంతరం మనతో వచ్చేది ఆధ్యాత్మిక సంపద ఒక్కటే. తక్కినదంతా ఇక్కడే ఈ దేహంతోనే నిలిచిపోతుంది. e



# పరమేశ్వరుని పరిరక్షణలో ...

## స్వామి జపానంద స్వీయ అనుభవాలు -12

(గత సంచిక తరువాయి...)

## నర్మదా తీరంలో తపోయత్నం

నర్మదా నదీ తీరంలో హోషంగాబాద్‌కు కొంచెం దూరంలో భోపాల్ రాజ్య సురక్షిత వనం ఉంది. అది దాటాక మర్దాన్‌పూర్ గ్రామం ఉంది. అది భోపాల్ తాలూకాలో వింధ్య పర్వతశ్రేణి మధ్యలో ఉంది. పక్కనే కీకారణ్యం ఉంది. సన్నగా ప్రవహిస్తున్న స్వచ్ఛమైన నీటితో నిండిన నర్మదా నది వర్షాకాలంలో తప్ప సంవత్సరంలో మిగతా రోజులు శాంతంగా ప్రవహిస్తూ, ఆ క్షేత్రాన్ని సుసంపన్నంగా ఉంచుతుంది. అడవిలో వివిధ జాతుల మృగాలు, పులులు, చిరుతలు, సింహాల లాంటి క్రూర మృగాలుంటాయి. అడవికి దగ్గర గ్రామాల్లో నివసించేవారు ఎప్పుడూ భయం భయంగా గడుపుతారు. ఏ మాత్రం అజాగ్రత్తగా ఉన్నా మనుష్యుల్ని కూడా చంపుతాయి అవి.



నర్మదా తీరంలో కొంతకాలం తపస్సు చేయాలనే ఉద్దేశంతో స్వామి జపానంద 1920వ సంవత్సరంలో కాశీ నుంచి హోషంగాబాద్ వచ్చారు. తెలిసిన వాళ్ళెవరూ అక్కడ లేరు. అయినా ఈశ్వరుని కృప వల్ల ఏదో ఏర్పాటు జరుగుతుందనే ఆశతో వచ్చారు. ఉదయమే హోషంగాబాద్ స్టేషన్‌లో రైలు దిగి, నర్మదానదిలో స్నానం చేసి, ఇష్టదైవాన్ని స్మరించుకొని, తపస్సుకు అనుకూలంగా ఉండే స్థలం ఎక్కడ దొరుకుతుందా అని ఆలోచించసాగారు.

అదే సమయంలో అక్కడకు ఇద్దరు వ్యక్తులు వచ్చి స్నానం, పూజ చేసుకున్నారు. సాధువుని చూసి ఎప్పుడు వచ్చారని పలకరించారు. ఉదయం వచ్చాననీ, ఏకాంత ప్రదేశంలో తపమాచరించాలని ఉందనీ స్వామీజీ చెప్పారు. అది విని ఒకరు "భోపాల్ వెళ్ళండి, అక్కడ ఓ చెరువు దగ్గరలో ఒక గుహ ఉంది. అందులో మీరు హాయిగా ఉండవచ్చు. అప్పుడప్పుడు సత్సంగం కోసం మేము కూడా వస్తాం" అన్నారు. సన్న్యాసి "మీరు చెప్పింది బాగానే ఉంది. కానీ నేను నర్మదా తీరంలో తపస్సు చేయాలనే ఆలోచనతో అంత దూరం నుంచి వచ్చాను" అన్నారు. దానికి వారు "నర్మదా తీరంలో ఊరికి ఒక మైలు దూరంలో శిథిలమైన శివాలయం ఒకటి ఉంది. మీరు అక్కడికి వెళ్ళి తపస్సు చేసుకోవచ్చు" అని చెప్పారు.

అది విని సన్న్యాసి సంతోషంగా అక్కడికి వెళతానన్నారు. వారిద్దరూ "అక్కడ మీకు భోజన సదుపాయాలు మేం చూస్తాం. మీరు నిశ్చింతగా ఉండండి" అన్నారు. భగవంతుడు ఆ విధంగా దయ చూపించినందుకు శతకోటి నమస్కారాలర్పించి, సాయంత్రం రైలు ఎక్కి, నర్మదా నది దాటిన తరవాత వచ్చిన చిన్న స్టేషన్‌లో స్వామి జపానంద దిగారు. ఆ వ్యక్తులిద్దరూ ఆ స్టేషన్‌లో ఉన్న అధికారిని పిలిచి మర్దాన్‌పూర్ తహసీల్దార్ పేర ఒక ఉత్తరం ఇచ్చారు. దానిలో స్వామీజీ కోసం ఉండడానికి అన్ని ఏర్పాట్లూ చేయమని వ్రాశారు. మర్దాన్‌పూర్ వెళ్ళడానికి స్వామీజీ కోసం ఎడ్లబండి కూడా ఏర్పాటు చేయించమన్నారు.

సాయంకాలం పదిహేడు, పద్దెనిమిది సంవత్సరాల వయసు గల యువకుడు ఎడ్లబండి తీసుకుని వచ్చాడు. ఎడ్లబండిని చూసి సన్న్యాసి చాలా ముచ్చట పడ్డారు. కానీ ఆ యువకుణ్ణి చూసి గాభరా పడ్డారు. భయంకరమైన అడవిలో రాత్రి 30 మైళ్ళ దూరం బండి తీసుకుని వెళ్ళాలి. అంత చిన్న వయసున్న యువకుడు ఆ పని ఎలా చేయగలడని సందేహించారు. అయితే, దోవలో ఏదైనా ఆపద వస్తే పైవాడే చూసుకుంటాడని సమాధానపడ్డారు.

"తండ్రి వేరే పనిమీద వెళ్ళడంతో ఈ అబ్బాయి బండి నడపడానికి వచ్చాడు. అది అతనికి అలవాటే. మీరేమీ భయపడవద్దు" అని అధికారి చెప్పాడు. భగవంతుణ్ణి తలుచుకుని సన్న్యాసి బండి ఎక్కి కూర్చున్నారు. బండి బయల్దేరింది. ఎడ్లు రెండూ వాయువేగంతో పరుగు తీశాయి. ఇలా ప్రయాణం కొనసాగుతుండగా ఆ ఎడ్లు ఒక

లేడిని చూసి, సింహం అనుకొని భయపడి ఇష్టం వచ్చినట్లు పరుగుపెట్టాయి. రాళ్ళ మీద నుంచి గతుకుల్లో నుంచి ఎడ్లు పరిగెట్టే సరికి బండి ఎగిరి పడింది. బండి నడిపేవాడు, సన్యాసి ఇద్దరూ కింద ఒక పక్కకు పడ్డారు. అదృష్టవశాత్తూ అక్కడ గడ్డి ఉండడంతో వారికి దెబ్బలేమీ తగలలేదు. బండి కూడా విరగలేదు. ఎడ్లు ఆగకుండా పరుగుపెడుతూనే ఉన్నాయి. ఆ యువకుడు వాటి వెంట పరుగు తీసి ఎలాగో పట్టుకున్నాడు.

మళ్ళీ బండి ఎక్కారు ఇద్దరూ. మిగతా ప్రయాణంలో మరే ఇబ్బందీ కలుగలేదు. క్రూర జంతువులు అరుస్తూనే ఉన్నాయి. ఎడ్లు వాటి మానాన అవి పరిగెడుతూనే ఉన్నాయి. బండివాడు హాయిగా బండిలో నిద్రపోయాడు. సన్యాసి మాత్రం మేలుకునే ఉన్నారు. రాత్రి మరే దుర్ఘటనా జరగకుండా ప్రయాణం జరగాలని భగవంతుణ్ణి ప్రార్థిస్తూ కూర్చున్నారు.

మర్దాన్‌పూర్ చేరేసరికి ఉదయం ఎనిమిది గంటలు అయింది. తహసీల్దార్ దగ్గరకెళ్ళి ఉత్తరం చూపించారు. వారు సన్యాసిని సాదరంగా ఆహ్వానించి, కూర్చోపెట్టారు. ఆ ఊళ్ళో ఉన్న శివాలయంలో సన్యాసి ఉండడానికి ఏర్పాటు చేశారు. కొంత కాలం అక్కడి బ్యాంక్ మేనేజర్ ఒకరు భోజన ఏర్పాట్లు చేశారు. తహసీల్దార్ ముసల్మాన్ అయినా అందరితో కలిసి మెలిసి ఉండేవారు. అడవిలో శిథిలావస్థలో ఉన్న శివాలయం దగ్గరకు సన్యాసిని తీసుకువెళ్ళి చూపించారు. ఆ స్థలం భయం కలిగించే విధంగా ఉంది, కానీ సాధన చేసుకునే వారికి చాలా అనుకూలంగా ఉంది.

పగలు దారి తప్పిపోయి ఎవరైనా వచ్చినా సాయంకాలం అవకుండానే అడవి మృగాల భయంతో వెళ్ళిపోయేవారు. ఏళ్ళ తరబడి ఆ శివాలయం పూజా పునస్కారాలు లేకుండా ఉంది. గదులన్నీ విరిగిన గోడలతో పై కప్పు లేకుండా ఉన్నాయి. తలుపులు లేవు. ఒక గదిలో నుంచి నర్మదా నది కనిపిస్తోంది. ఆలయానికీ, నదికీ మధ్య విశాలమైన మైదానం ఉంది. ఆ గది సన్యాసికి నచ్చింది. ఆ గదిని శుభ్రం చేయించి, ధుని కోసం కట్టెలు తెప్పించి పెట్టమని సన్యాసి అడిగారు. అది శుభ్రం చేయించే వరకు ఊరిలోని శివాలయంలో బస చేశారు.

అడవిలోని ఆలయంలో సన్యాసి ఉండడానికి ఏర్పాట్లు జరిగిపోయాక ఒక అమావాస్య నాడు సాయంకాలం సన్యాసి అక్కడకు బయలుదేరారు. తహసీల్దార్, ఒక వంటవాడు, మరొక ఇద్దరు కూడా వారితో వెళ్ళారు. ధుని కోసం కట్టెలు పెట్టి ఉన్నాయి. ఎదురుగా నర్మద ఉండనే ఉంది. ప్రతి నిత్యం ఒకరు రొట్టెలు, కూర, పప్పు, ఒక లోటాతో పాలు తీసుకొచ్చి ఇచ్చే ఏర్పాటు జరిగింది.

తిరిగి ఊళ్ళోకి వెళ్ళిపోయే ముందు ఆ తహసీల్దార్, స్వామీజీతో "స్వామీజీ! మిమ్మల్ని భయపెట్టి మీ సంకల్పం నెరవేరకుండా చేస్తున్నాననుకుంటారని ఒక మాట మీకు నేను చెప్పలేదు. కానీ ఇప్పుడు చెప్పాలి. ఇక్కడ ఒక పిశాచం ఉంది. అది ఎవరినీ ఇక్కడ ఉండనివ్వదు. కొంతమంది ఒక రాత్రి ఉండి, దాన్నిచూసి భయపడి పారిపోయారు. దాన్ని చూసి భయంతో గుండె ఆగి మృత్యువాత పడ్డవాళ్ళు కూడా ఉన్నారు. ఇక్కడ క్రూర మృగాల సంచారం ఎక్కువగా ఉంటుంది. నా వంతు నేను చెప్పాను. ఇక మీ ఇష్టం. ఈ ఒక్క రాత్రి గడిపి మీకు కావాలంటే ఉదయం ఊళ్ళోకి రండి. అక్కడ శివాలయంలో మీరు ఉండేందుకు ఏర్పాట్లు చేయిస్తాను" అన్నారు.



అంతా విన్నాక సన్యాసి "మీరు ఈ విషయాలన్నీ ముందుగానే చెప్పి, నాకు ఉపకారం చేశారు. ఇప్పటి వరకూ నాకు పిశాచాలు ఎప్పుడూ కనపడలేదు. ఇప్పుడు వాటిని కూడా చూస్తాను." అన్నారు. "స్వామీజీ! నేను నిజమే చెబుతున్నాను. మీతో హాస్యమాడడం లేదు"అని తహసీల్దార్ అన్నారు. సన్యాసి "ఏమైనా సరే ఇవాళ రాత్రికి నేను ఇక్కడే ఉంటాను" అన్నారు. C **(మిగతా వచ్చే సంచికలో...)**

**అనువాదం : శ్రీమతి జి.ఎస్. లక్ష్మి**

# పాండురంగ నామం పరమపుణ్య ధామం!



కథ: అళగరాజా  చిత్రాలు: గోవి  తెలుగుసేత: స్వామి జ్ఞానదానంద

**1** భక్త తుకారామ్ మహిమలు బహుళ ప్రచారంలో ఉన్న రోజులవి. మహారాష్ట్రలో పింపల్ అనే గ్రామంలో నీళోబా అనే పాండురంగ భక్తుడు ఉండేవాడు. ఒకరోజు నీళోబా భజనచేస్తూ పారవశ్య స్థితిలో అలానే నిద్రపోయాడు. అతనికి కలలో భక్త తుకారామ్ కనిపించాడు.



**2** నీళోబా! నీళోబా!

హా! తుకారామ్ మహారాజ్! మీ దర్శన భాగ్యంతో ధన్యుణ్ణయ్యాను. స్వామీ! మీరు నన్ను మీ శిష్యుడిగా స్వీకరించండి!



జై విఠలా! విఠలుని ఇచ్ఛానుసారం అంతా జరుగుతుంది. ఈ క్షణం నుండీ 'రామకృష్ణహరి' అనే మంత్రాన్ని జపిస్తూ ఉండు.

**3** నిద్ర నుంచి లేచిన నీళోబా తన భార్యతో...

ఆహా! ఎంతటి అద్భుత స్వప్నం! నేను కలలో నా గురువును చూశాను!

కలలో కనబడిన గురువును ఎప్పుడు ప్రత్యక్షంగా దర్శించుకుంటారు?

వారు ఇప్పుడు చాలా దూరంగా 'దేహూ' అనే చోట ఉంటున్నారు. వారిని ఎలా దర్శించాలి? విఠలుడే దారి చూపించాలి!



నీళోబా తన పనులన్నీ చేసుకుంటూనే విఠలుణ్ణీ, గురువునూ స్మరిస్తూ 'రామకృష్ణహరి' అనే మంత్రాన్ని సదా జపిస్తున్నాడు.

**4** కొంతకాలం తర్వాత... నీళోబా కుమార్తె వివాహానికి ఏర్పాట్లు జరిగాయి.

స్వామీ! విందు భోజనం వండడానికి సరిపోయే సామగ్రి లేదే!



ఇక విఠలుణ్ణి ఆశ్రయించడం మినహా మరో మార్గమేదీ లేదు. ఆయనే మనల్ని ఆదుకుంటాడు. కలత చెందకు!

5 అప్పుడు ఒక వ్యక్తి వచ్చాడు.

అయ్యా! మీరెవరు? మీకు ఏం కావాలి?

నాకు చాలా ఆకలిగా ఉంది! నా వద్ద వంట దినుసులు ఉన్నాయి అవి తీసుకుని నాకు భోజనం పెట్టండి!

స్వామీ! మీ భోజనానికి మీరే దినుసులు ఇవ్వాలా ఏమిటి? విఠలుని దయవల్ల మాకు ఇంకా అలాంటి స్థితి రాలేదు.

6 సరే! ఇదేమిటి ఇంత సందడి ఇంట్లో ఏదైనా విశేషమా?

అవునండీ! రేపు మా కుమార్తె పెళ్ళి, విందు భోజనానికి ఏర్పాట్లు చేస్తున్నాం. ఇంత మందికి వండిపెట్టాలంటే బెంగగా ఉంది!

మీరేమీ బెంగ పెట్టుకోకండి! నాకు వంట బాగా వచ్చు. నా చేతనైన సహాయం చేస్తాను.

అయ్యా! సాక్షాత్తూ ఆ విఠలుడే మిమ్మల్ని ఇక్కడకు పంపాడు.

7 మరుసటి రోజు మేళతాళాలతో పెళ్ళి కుమారుని తరపు వారందరూ వచ్చేశారు. హఠాత్తుగా ఎక్కడ నుంచో బోలెడంత వంటసామగ్రి కూడా వచ్చింది.

స్వామీ! ఇంత సామగ్రి ఎక్కడ నుండి వచ్చింది? విఠలుడి అనుగ్రహం వలన అంతా సవ్యంగా జరగాలి.

నీళోబాజీ! మీరిరువురూ అతిథులకు ఉపచారాలు చేయండి! తక్కినవన్నీ నేను చూసుకుంటాను. బెంగ పెట్టుకోకండి!

మన ఇంటికి వచ్చినాయన తనకు సాయం చేయడానికి ఎవరూ వద్దని అంటున్నారు. ఇన్ని పనులు ఆయన ఒక్కరే ఎలా చేయగలరు?

8 వివాహం చక్కగా జరిగింది. విందులో ...

ఆహా! వంటకాలు ఎంత రుచికరంగా ఉన్నాయి!

వంటకాలన్నీ చాలా మధురంగా ఉన్నాయి!

9 అందరూ తృప్తిగా భోజనం చేస్తున్నారు.

ఏమాశ్చర్యం! ఈ వ్యక్తి బొంగరంలా గిరగిర తిరుగుతూ ఎంత పని చేస్తున్నారు! సాక్షాత్తూ ఆ విఠలుడే ఈయనను తగిన సమయానికి ఇక్కడకు పంపాడు. విఠలా! అంతా నీ కృపాకటాక్షమే!

మిగతా 36వ పేజీలో...

**ఆచార వ్యవహారాలు - అంతరార్థాలు- 28**
**- రెంటాల జయదేవ**

(గత సంచిక తరువాయి...)

## సవ్య ప్రదక్షిణ ఎక్కడ? అపసవ్య ప్రదక్షిణ ఎక్కడ?

ఇక్కడ మరో చిన్న విషయం ఉంది.

***సోమసూత్ర ద్వయం యత్ర । యత్ర వా విష్ణుమందిరమ్ ॥***
***అపసవ్యం న కుర్వీత । కుర్యాద్దేవ ప్రదక్షిణమ్ ॥***

*(ధర్మ నిర్ణయ చంద్రికా)*

అని పెద్దలు చెప్పారు. అంటే, *'రెండు సోమసూత్రాలున్న శివాలయంలోనూ, విష్ణ్వాలయం పక్కనున్న శివాలయంలోనూ అపసవ్య ప్రదక్షిణం పనికిరాదు. సవ్యదిశలోనే దేవుడికి ప్రదక్షిణం చేయాలి.'* అలాగే,

***స్వయంభూ లింగ త్వాద్వా ।***

*(ధర్మ నిర్ణయ చంద్రికా)*

అని పెద్దలు చెప్పారు. అంటే, *'స్వయం వ్యక్తాలైన ద్వాదశ జ్యోతిర్లింగ క్షేత్రాల్లో కూడా సవ్యాపసవ్య ప్రదక్షిణాలే చేయాలి. ఇక, స్వయం వ్యక్తాలు కాని శివాలయాల్లో శని త్రయోదశి నాడు సవ్యాపసవ్యంగానూ, మిగతా రోజుల్లో సవ్యంగానూ ప్రదక్షిణలు ఆచరించాలి.*

***సూత్రా ద్బహిర్లంఘనతో న దోషః ।***
***స దోష మభ్యంతరై లంఘనేన ॥***

*(ధర్మ నిర్ణయ చంద్రికా)*

అని శాస్త్రం చెబుతోంది. అంటే, *'సోమసూత్రాన్ని దాటరాదనే నిషేధం గర్భాలయంలోనే కానీ, వెలుపల లేదు.'*

బలి నిమిత్తం ద్వారం నుంచి ఆరంభించిన ప్రదక్షిణం విషయంలో సోమసూత్రాన్ని ఉల్లంఘించడం దోషం కాదు. సోమసూత్రానికి సమాంతరంగా మూరెడు విడిచిపెట్టి, అనులోమంగా ప్రదక్షిణం చేయడం దోషం కాదు. రత్నాది లింగాల విషయంలో ఆత్మభక్తి భావంతో హోమం చేసే నేలను విడిచి, ప్రదక్షిణం చేయాలి. ఈ ప్రదక్షిణం భక్తి ముక్తి దాయకం.

**ఒక్కటే ప్రదక్షిణ చేయవచ్చా?**

ఏ దేవుడికి ఎన్ని ప్రదక్షిణలు చేయాలో శాస్త్రంలో ఉంది. అలా కాకుండా, ఒకే ప్రదక్షిణతో సరిపెట్టడం సరికాదు. దీని గురించి,

***ఏక హస్త ప్రణామం చ । ఏకా చైవ ప్రదక్షిణా ॥***
***అకాలే దర్శనం చైవ । హన్తి పుణ్యం పురాకృతమ్ ॥***

*(హలాయుధే)*

అని పెద్దలు చెప్పారు. అంటే, *'ఒంటి చేత్తో నమస్కరించడం, ఏక ప్రదక్షిణం చేయడం, అకాల దర్శనమనేవి పురాకృత పుణ్యాన్ని హరిస్తాయి.'* అయితే,

***చండీ వినాయకయో రే కాపి ప్రదక్షిణా కార్యా, విశిష్ట విధానాత్ ॥***

*'శాస్త్రంలో ప్రత్యేకంగా చెప్పినందు వల్ల చండీ, వినాయకులకు మాత్రం ఒక ప్రదక్షిణం చేయవచ్చు.'*

**ప్రదక్షిణ కాలంలో ఎలా ధ్యానించాలి?**

***పదం పదాన్తరే న్యస్య । కరౌ చలన వర్జితౌ ॥***
***స్తుతీర్వాచి హృది ధ్యానం । చతురంగ ప్రదక్షిణమ్ ॥*** *(శ్రీపౌష్కరే, పారిజాతే)*

ప్రదక్షిణం చేస్తున్నప్పుడు *'నెమ్మదిగా అడుగు వెంట అడుగు వేస్తూ నడవాలి. కదలిక లేకుండా ఉండేలా చేతుల్ని జోడించి, హృదయంలో దేవుణ్ణి ధ్యానించే వాక్కుతో, స్తోత్రం చేస్తూ ప్రదక్షిణం చేయాలి. దీన్నే 'చతురంగ ప్రదక్షిణం' అంటారు.'* ☐

**(వచ్చే సంచికలో... 'నిత్య ప్రదక్షిణ యోగ్యమైనవి ఏమిటి? ప్రదక్షిణ ఫలితం ఏమిటి?')**

భగవంతుని నామం వింటే అశ్రుధారలు రావాలి. శరీరం రోమాంచమవ్వాలి. అలాంటి భక్తి భగవంతుని యందు జనించేంత వరకూ సంధ్యావందనాది కర్మలు ఆచరించడం అవసరం.

- శ్రీరామకృష్ణ పరమహంస



# ఆకారం లేని అసురుడు

అన్నిటికన్నా ప్రబల శత్రువు ఈ 'అహంకారం'. ఈతడు కారణం లేకుండానే పుడుతున్నాడు. రూపం లేకుండానే వ్యవహరిస్తున్నాడు. సంసారారణ్యంలో విచ్చలవిడిగా సంచరిస్తున్నాడు. అహంకారానికి అసలు కారణం అభిమానమే! ఆ అభిమానం వల్లనే రాగద్వేషాది దోషాలు వస్తున్నాయి. ఆకారాదులు లేకపోయినప్పటికీ ఇది అందరినీ బాధిస్తోంది. ఓ మహర్షీ! భూమ్యాకాశాల మధ్య మరే శత్రువును చూసినా నేను భయపడడం లేదు. కానీ, ఈ అహంకార శత్రువు గుర్తుకు వచ్చినప్పుడు మాత్రం గజగజ వణుకుతున్నాను. 'దీని ఉత్పత్తికి కారణమేమిటి' అని పరిశీలిస్తే 'అజ్ఞానమే' అని సమాధానం లభిస్తోంది. దీని నుండి ఆపదలు, మనోవ్యధలు, వికారాలు జీవునికి ప్రాప్తిస్తున్నాయి.

'అహంకారం' అనే కిరాతకుడు 'మాయ' అనే వల పన్నుతున్నాడు. ఈ జీవులు అజ్ఞాన మృగాలలా అందులో చిక్కుకొంటున్నారు. ఈతడు ఎందుకో నా పాలబడ్డాడు. నన్ను బంధించ యత్నిస్తున్నాడు. క్షణంలో శాంతి, సమత వంటి సద్గుణాలను పీల్చి, పిప్పి చేస్తున్నాడు. ఇంతటి శత్రువు ఎదురుగా ఉండగా భోజనమే చేయలేకపోతున్నాను. ఇక భోగాల మాట చెప్పేదేముంది!

మొదలే అసత్యమై ఉన్న ఆ అహంకారాన్ని ఆశ్రయించి ఏదేది చేస్తామో, గ్రహిస్తామో, వాంఛిస్తామో అవన్నీ కూడా అసత్యాలే అవుతాయి కదా! అహంకారాన్ని నమ్మినంతకాలం ఆశ, తృష్ణలు ఉంటాయి. అందువల్ల నేను అహంకారాన్ని తిరస్కరిస్తున్నాను. "నేను రాముడనే కాదు. నాకే కోరికలూ లేవు. నాకు చెందినదంటూ ఎక్కడా ఏదీ లేదు. నేను దేనికీ చెందినవాణ్ణి కాను" అని శాసిస్తున్నాను. "నా మనస్సు ఎటూ ప్రసరించకుండు గాక" అని శాసిస్తున్నాను. కానీ ఏం లాభం? అజ్ఞానం ఉండడం వల్లే కాబోలు నాకు ఏమీ తెలియకున్నది.

'దేహం' అనే కీకారణ్యంలో 'అహంకారం' అనే పిశాచం అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు. అతడు ఇలాంటి అనేక పంచభూతాత్మికమైన దేహాల్ని దండగా వేసుకొని ధరిస్తున్నాడు. ఈ జగత్తే అతని 'మెడ'లా ఉంది.

అసలు ఈ 'అహంకారం నివాస స్థానం ఎక్కడ? అంతః కరణమే కదా! ఎప్పుడైతే అంతఃకరణం మిక్కిలి చంచలమై, దుర్వాసనలతో కూడినదై, సద్గుణాలు లేనిదై ఉంటోందో అప్పుడు దానిలో అహంకారం వచ్చి తిష్ఠ వేస్తోంది. అన్ని ఆపదలనూ వెంటబెట్టుకొని సంచరించే ఈ అహంకారాన్ని ఆశ్రయించి రాజ్యాదులు ఏలమని నన్ను మీరు ఆజ్ఞాపించకుండెదరు గాక! దానికి బదులు ఈ అహంకారాన్ని జయించగల ఉపాయాలేమైనా ఉంటే నాకు ఉపదేశించి నన్ను కృతార్థుణ్ణి చేయండి. మనస్సులో పేరుకొన్న 'మహా మోహం' అనే మంచు మీ ఉపదేశ ప్రభావం వల్ల కరిగిపోవాలనే కోరుకొంటున్నాను. c

*('శ్రీవసిష్ఠ రామ సంవాదం' వైరాగ్య ప్రకరణం నుంచి)*

**అనువాదం : వై. హెచ్. రామకృష్ణ**



## పండుగలు - పర్వదినాలు

### జూన్- 2008

| | | | |
|---|---|---|---|
| 03 | మంగళవారం | : | ఫలహారిణి కాళీ పూజ |
| 14 | శనివారం | : | ఏకాదశి |
| 29 | ఆదివారం | : | ఏకాదశి |

### జూలై- 2008

| | | | |
|---|---|---|---|
| 13 | ఆదివారం | : | ఏకాదశి |
| 18 | శుక్రవారం | : | గురుపూర్ణిమ |
| 28 | సోమవారం | : | ఏకాదశి |
| 30 | బుధవారం | : | స్వామి రామకృష్ణానంద జయంతి |

మృగం నుంచి మనిషిని వేరు చేసే గుణాలలో విశిష్టమైనది జ్ఞానకాంక్ష. అణువు నుంచి అంతరిక్షం వరకు... ఆత్మ నుంచి ఆ పరమాత్మ వరకు అవగాహన, అనుభూతి సకలమూ మానవుని జ్ఞానతృష్ణకు ప్రతీకలే. నోరులేని జీవంలా అడవులు పట్టి తిరిగిన మనిషి నాగరకత నేర్చుకున్నది ఈ ఉత్సుకత... ఉత్సాహం వల్లనే. అందుకే భగవద్గీతలో కృష్ణ భగవానుడు అంటాడు 'న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే'... జ్ఞానాన్ని మించినది లేదు; అది పవిత్రం... పరమ సత్యం. మన మనసుని, మేధస్సుని నిరంతరం నిత్యయౌవనంగా ఉంచగలిగేది ఈ జ్ఞానార్జనే. అందుకే అన్ని అభిరుచులలో కెల్లా పుస్తకపఠనం మనలో మేథోపరమైన వికాసానికి విశేషంగా తోడ్పడుతుంది. ఎన్ని సాంకేతిక సౌలభ్యాలు, సౌకర్యాలు అందుబాటులోకి వచ్చినా అచ్చులో చదువుకోవాలనే ముచ్చటకు మాత్రం ఇంకా కాలం చెల్లిపోలేదు. పుస్తకాల అరలు లేని ఇల్లు, జీవం లేని శరీరం లాంటిదే! లోకమంతా మనను ఏకాకిని చేసినా... ఏకాంతంలో వదలినా మనకి తోడుగా నిలిచేది పుస్తకమే! అది పంచే జ్ఞానామృతమే!

**పుస్తకమూ ప్రపంచమే...**

There are more men ennobled by study than by nature అంటాడు సిసిరో. ఈ ప్రపంచాన్ని విస్తృతంగా పరిచయం చేయగల శక్తి, సామర్థ్యం పుస్తకానికే ఉన్నాయి. అనుభవంలోకివస్తే తప్ప బోధపడని ఎన్నో తత్త్వాలను, పుస్తకం ముందే మనకు అవగతం చేస్తుంది. భవిష్యత్తులో ఎదురయ్యే ఎన్నో సంఘర్షణల్లో, సవాళ్ళలో కరదీపికగా నిలుస్తుంది. ముఖ్యంగా లోకవ్యవహార జ్ఞానం... పారలౌకిక విజ్ఞానం పుస్తకపఠనంతోనే పెంపొందుతాయనటంలో సందేహం లేదు. ఒక కథలో కావచ్చు, కావ్యంలో కావచ్చు రచయిత సృజించిన పాత్రలు, సందర్భాలు,సంఘటనలు లోకంలోని భిన్నభిన్న వ్యక్తులతో ఎలా ప్రవర్తించాలో చెప్పకనే చెబుతాయి. అందుకే కళ్ళతో చూడలేని ప్రపంచాన్ని పుస్తకం భూత, భవిష్యత్ కాలాలతో సహా మనకు పరిచయం చేస్తుంది.

# పఠన





## నిత్య పఠితులు... జ్ఞాన వరిష్ఠులు

స్వామి రంగనాథానందజీ మహరాజ్

జ్ఞాన... రంగనాథాన... అయినా జ్ఞాన... అందుకే వా... నుంచి వేదా... ఆశ్రమంలో... రామకృష్ణ వ... కారణమనే... పఠించేవారని... వారి సమీప... పరిస్థితుల్లో... చదువుకునేవా... నోట్సు రాస...

**సంస్కారం... సంతోషం**

**"అమిత ధనధాన్య భాగ్య భోగముల కన్న**

**అమల వాఙ్మయ రామణీయకము ఘనము...** అంటారు ఓ రచయిత. నిజమే! భౌతికపరమైన సుఖసంతోషాలన్నీ బాహ్యానికి సంబంధించినవే. అవి ఇచ్చే ఆనందానికి అంతు, అదుపు

ఉంటాయి. కానీ రమ్యమైన సాహిత్యాన్ని చదివి లీనమైతే, అది ఇచ్చే ఆంతరంగిక ఆనందానికి అవధులే ఉండవు. మనల్ని సున్నితంగా సంస్కరిస్తూ, సమున్నతంగా తీర్చిదిద్దుతూ తోడుగా నిలిచేది పుస్తకపఠనమే. చిన్ననాటి నుంచే ఈ అభిరుచిని పెంచిపోషించుకుంటే,జీవిత చరమాంకం వరకూ జీవితాన్ని భౌతికస్థాయిని మించి ఆనందంగా అనుభవించగలం. బాపూజీ నుంచి బిల్‌గేట్స్ వరకూ మహామహులందరిలో సారూప్యమైన అభిరుచి నిరంతర పుస్తకపఠనమే!

### పఠనంతో పరిపూర్ణత

Literature is the thought of thinking souls అంటాడు మేథావి కార్లైల్. ఆరోగ్యం నుంచి ఆధ్యాత్మికత వరకూ ఏ రంగానికి సంబంధించైనా ముందుతరాల వారి నుంచి తీగసాగుతూ వస్తున్న భావ పరిణతిని పుస్తకాలు వారసత్వంగా మనకు అందజేస్తాయి. ఆ అడుగుజాడల వెంట మనం మరింత పటిష్టంగా పరుగులు తీసే అవకాశాన్ని కల్పిస్తాయి. భావాలపేటికలుగా అలరారే పుస్తకాలతో సాన్నిహిత్యం పెంచుకోవాలి. ఫలితంగా మన ప్రజ్ఞాపాటవాలు మరింత ఇనుమడిస్తాయి. మన ఆలోచనలు పరిపూర్ణతను సంతరించుకుంటాయి. ముఖ్యంగా ఇతరులపై ఆధారపడడం తగ్గి పోతుంది. అలాంటి జ్ఞానం వల్ల మన ముఖంలో వచ్చే తేజస్సు జీవితాంతమూ నలుగురికి ఉత్తేజాన్ని ఇస్తుంది. మన మేథస్సుని నిర్విరామ యంత్రంలా మలచుతుంది.

# ...ంతో ప్రజ్ఞ... పాటవం

– బి. సైదులు

...్ఞాన తృష్ణకు, ఆధ్యాత్మిక పరాకాష్ఠకు నిలువెత్తు సాక్ష్యం స్వామి ...నందజీ మహరాజ్. ప్రాపంచిక దృష్టిలో వారు చదివింది మెట్రిక్ స్థాయే ...జ్ఞానాభిలాషతో నిరంతర పఠనంతో ప్రపంచ మేథావులను మించిపోయారు. ...ారి ఉపన్యాసం కోసం ఐ.ఏ.ఎస్ అధికారులే బారులు తీరేవారు. వైద్యం ...ాంతం వరకు వారు స్పృశించని అంశం లేదు. మైసూర్ రామకృష్ణ ...ో బ్రహ్మచారిగా ప్రస్థానం ఆరంభించిన స్వామి రంగనాథానందజీ ... మఠం సర్వాధ్యక్ష స్థాయికి చేరుకోవటంలో నిరంతర పఠనం కూడా ...టంలో అతిశయోక్తి లేదు. వారు గొప్ప ఏకాగ్రతతో పుస్తకాలు ...రని, ఒక పుస్తకం చదవడం ఆరంభిస్తే దేశకాలాలను మరిచిపోయేవారని ...ప సాధు బృందం ఇప్పటికీ గుర్తుచేసుకుంటూ ఉంటారు. మరీ అనారోగ్య... ఇతరులను చదవమనేవారే తప్ప, సాధారణంగా వారే స్వయంగా ...వారట. బాగా వృద్ధాప్యం వచ్చిన తరువాత కూడా పుస్తకాల అంచులలో ...సుకునేవారట.

### సాంత్వననిచ్చేది సాహిత్యమే...

నిజానికి ఆధునికతరంలో మన చదువులన్నీ జీతానికి పనికి వచ్చేవే కాని జీవితానికి కాదు. అందుకే ఒకానొక దశలో మన జీవనయానం నిరామయంగా, నిస్తేజంగా మారిపోతుంది. మన మస్తకాలన్నీ మనోవికాసానికి ఏ మాత్రమూ తోడ్పడలేని పుస్తకాలతో నిండిపోతున్నాయి. జీవనమెళకువలను, మహోన్నత వ్యక్తిత్వవిలువలను బోధించలేని చదువుల పరిధిని దాటి మనం ఎదగలేకపోతున్నాం. బ్రతుకును తీర్చిదిద్దే సాహిత్యం వైపు మనసు పెట్టలేకపోతున్నాం. అందుకే సంస్కృత సుభాషితం అంటుంది... "సాహిత్య సంగీత కళా విహీనః సాక్షాత్ పశుః పుచ్ఛ విషాణహీనః ... సాహిత్య,సంగీత అభిరుచి లేనివారు తోక, కొమ్ములు లేని పశువులతో సమానమట!.

### చదివిన సద్వివేకము....

**చదువని వా డజ్ఞుండగు, చదివిన సద సద్వివేక చతురత గలుగున్, చదువగ వలయును జనులకు...** అంటోంది భాగవతం. ఈ రోజుల్లో మనలో చాలామంది డిగ్రీల పరంగా చదువరులే. కాని వ్యక్తిత్వపరంగా, విలువల పరంగా, నడవడిక పరంగా అజ్ఞానులే. నలుగురితో ఎలా నడుచుకోవాలో తెలీదు! జీవితంలో ఎలా మసలుకోవాలో తెలీదు! ఆ వివేకం, చతురత అలవడాలంటే గొప్ప సాహిత్యాన్ని చదవడం అభిరుచిగా చేసుకోవాలి. చదవడం కూడా ఒక తపస్సే. "తపః స్థితానాం సులభం హి సర్వమ్" .... తపస్సులో ఉన్న వాళ్ళకు అన్నీ సులభమే నట! "తపో మూల మిదం సర్వం దైవమానుషకం సుఖమ్"... ఈ లోకంలో మానవులకు కలిగే దైవసుఖమైనా మానుషసుఖమైనా ఈ తపస్సు వల్లనే సాధ్యపడుతుంది. అందుకే జ్ఞాన తపస్సును ఆరంభిద్దాం...

# పిల్లల చదువులో పెద్దల పాత్ర - స్వామి వివేకానంద సందేశం

- అమిరపు నటరాజన్



మనిషి విద్యాభ్యాసం పుట్టుక తోటే అమ్మా, నాన్నల సాంగత్యంలో మొదలవుతుంది. ప్రపంచంలోని జ్ఞానం అంతా మనిషి మనస్సులోనే ఉందనీ, దాన్ని వెలికితీసి వికసించేలా చేసేందుకు తోడ్పడేదే విద్యావిధానమనీ స్వామి వివేకానంద చెప్పారు.

**పుట్టుకతోటే మొదలయ్యే చదువు** : విద్యాభ్యాసంలో తల్లితండ్రుల బాధ్యత పిల్లల పుట్టుకతోటే మొదలవుతుంది. పిల్లల్ని పెంచడం అంటే కేవలం వాళ్ళ కోర్కెల్ని తీర్చడమే కాదు. వారికి ఏది మంచి చేస్తుందో, శ్రేయస్సు కలిగిస్తుందో దానినే తల్లితండ్రులు ఇవ్వాలి. పిల్లలకు తాము చేసే పనులకూ, మాట్లాడే మాటలకూ అర్థం ఏమిటో తెలియదు. కాబట్టి అన్ని విషయాలనూ ఎలా చేయాలో తల్లితండ్రులే వారికి చెప్పాలి. 'నీకేం కావాలి?' అని అడగకూడదు. ఏది మంచిదో దాన్నే పిల్లలకు ఇవ్వాలి.

విధేయత లేకుండా క్రమశిక్షణ, మనోనిగ్రహం అలవాటు కావు. అవి లేని విద్య, విద్య కాజాలదని మనందరికీ స్పష్టంగా తెలుసు. "విధేయతతో చెప్పిన మాట వినడం అనే లక్షణం మన దేశంలో అడుగంటి పోయింది. అందువల్లే దేశం అన్ని రంగాలలోనూ వినాశపుటంచులకు చేరుకుంది" అని స్వామి వివేకానంద చెప్పారు.

**రోజంతా ఒకటే అల్లరి!** : ఒక తండ్రి తన పిల్లల గురించి చెబుతూ, 'రోజంతా ఒకటే గోల. ఎంత చెప్పినా మాట వినరు' అన్నాడు. కానీ, సమస్య ఎక్కడుంది? వాళ్ళను గదిమాయించి, కూర్చోబెట్టడమే పరిష్కారమా? కాదు. బహుశః ఈ అల్లరి పిల్లల్ని స్వామి వివేకానందకు చూపిస్తే ఆయన ఎంతో సంతోషించి ఉండేవారు! "నొసటి మీద గాయాలూ, మచ్చలూ లేని పిల్లవాడు అసలు పిల్లవాడే కాదు!" అని ఆయన చెప్పారు.

కాబట్టి పిల్లలలో కనిపించే ఉత్సాహం, ఉల్లాసం మంచి లక్షణాలే. వాటిని సరైన దోవలో పెట్టి తీర్చిదిద్దాల్సిన బాధ్యత మనదే! వారికున్న అపారమైన శక్తిని సృజనాత్మక మార్గాలలోకి మళ్ళించాలి. బొమ్మలు గీయడమో, పాటలు పాడడమో, ఆటలాడడమో, కాగితాలతో, మట్టితో బొమ్మలు చేయడమో, ఇంకా ఏ పద్ధతిలో అయినా తమ బుద్ధినీ, శారీరక శక్తినీ ఒక క్రమపద్ధతిలో ఉపయోగించడం ఎలాగో నేర్వాలి. "ముందు మీరు చేసి చూపండి. అప్పుడే మీరు ఇతరులకు నేర్పించే అర్హత పొందుతారు!" అని స్వామి వివేకానంద చెప్పారు. కాబట్టి, మన పిల్లలు ఎలా తయారవుతారన్నది మన ప్రవర్తన మీద, మన చిత్తశుద్ధి మీద, మన సృజనాత్మకత మీదే ఆధారపడి ఉంటుంది.

**బలంగా ఉంటేనే ఘనకార్యాల సాధన** : మరొకవైపు పిల్లల అల్లరిని మాన్పించడానికి వాళ్ళను టీవీ ముందు కూర్చోబెట్టడం, ఉదయం, సాయంత్రం, రాత్రి ప్రైవేటు పాఠశాలల చుట్టూ తిప్పడం కూడా మంచిది కాదు. "చదువంటే కేవలం సమాచారాన్ని తెలుసుకోవడం మాత్రమే కాదు. చేతుల్నీ, కాళ్ళనీ ఎలా ఉపయోగించాలో తెలుసుకోవాలి. బుద్ధికీ, కళ్ళు, చెవులు, కాళ్ళు, చేతులు మొదలైన అవయవాలకూ చక్కని సమన్వయాన్ని తీసుకువచ్చి, వాటిని మనకు కావలసినట్లు ఉపయోగించడం ఎలాగో నేర్చుకోవాలి. అదే చదువంటే!" అని స్వామి వివేకానంద చెప్పారు.

శరీరం, మనస్సు – రెండూ బలంగా ఉండాలి. శరీరం బలంగా లేని పిల్లలు, మానసికంగా ఎదగలేరని ఈనాడు అందరూ చెబుతున్నారు. 'ఆశిష్ఠో దృఢిష్ఠో బలిష్ఠః', 'బలం గలవాడే ఘనకార్యాలు సాధించడానికి అర్హుడు!' అన్న ఉపనిషత్తుల మేలుకొలుపును స్వామీజీ పదే పదే గుర్తుచేసేవారు.

**ప్రతి పనీ గొప్పదే!** : ప్రపంచంలో మంచి పనులు, హీనమైన పనులు అని రెండు రకాలు లేవు. గొప్పతనం పనిలో లేదు, పని చేసే విధానంలో ఉంది.

"ఈ నిమిషంలో మీరు మీ తోటలో పని చేయడానికి సిద్ధంగా ఉండాలి. మరు నిమిషంలో ధ్యానంలో కూర్చొని, అందులో మునిగిపోగలగాలి. ఈ నిమిషంలో తోటలో పండిన

పంటను బజారుకు తీసుకొనిపోయి అమ్ముకొని రావాలి. మరు నిమిషంలో ఈ వేదిక మీద కెక్కి శాస్త్రాలలోని ధర్మసూక్ష్మాలను వివరిస్తూ ఉపన్యసించగలగాలి" అని స్వామీజీ చెప్పారు.

దీనికి అర్థం ఏమిటి? సాధారణంగా, కొన్ని రకాల పనులే మనం గొప్పవని అనుకుంటాం, కాయకష్టంతో చేసే పనులు తక్కువ రకమైనవని మన ఉద్దేశం. కానీ స్వామి వివేకానంద అలా చెప్పలేదు! ప్రతి పనినీ దేవునికి పూజ చేసినంత శ్రద్ధగా చేయమని చెప్పారు. అన్ని పనులలోనూ గొప్ప ప్రతిభను చూపించగలిగిన వాడే నిజంగా చదువుకున్నవాడని ఆయన వివరించారు. కాబట్టి అన్ని రకాల పనులూ చేయాల్సిందిగా చిన్నతనం నుంచే పిల్లలను ప్రోత్సహించాలి. మొక్కై వంగనిది, మానై వంగదు కదా!

**చీటికీ మాటికీ కీచులాట! :** ఆడుకోమని పంపితే, పిల్లలు ఐదు నిముషాలలో అరవై సార్లు, ఒకరి మీద ఒకరు చాడీలు చెప్పుకోవడానికి తయారవడం మనం రోజూ చూసేదే! అయితే ఇది ప్రకృతి సహజం.

'ముగ్గురు మనుష్యులు మన దేశంలో ఐదు నిమిషాలపాటు కలిసి పనిచేయలేరు' అని స్వామి వివేకానంద అన్నారు. కలిసి పనిచేయడాన్నీ, తోటివారి ప్రవర్తనను సహించగలిగే ఓర్పునూ పిల్లలకు ఓపికగా నేర్పించాలి. మన విద్యావిధానంలో లోపించిన ముఖ్యమైన విషయాల్లో ఇది కూడా ఒకటి. చిన్నతనంలోనే ఈ సహనాన్ని అలవరచకపోతే వారు పెద్ద అయిన తరువాత కుటుంబ విషయాలలో కలిసిమెలిసి ఎలా పనిచేయగలరు? చీటికీమాటికీ పోట్లాటకు దిగే తత్త్వం కుటుంబాలనూ, ఆ పైన సమాజాన్నీ విచ్ఛిన్నం చేస్తుంది కదా! అలాంటి కుటుంబాలలో పెరిగిన పిల్లలకు కూడా అవే లక్షణాలు అలవడతాయి.

**రాజీ లేని జీవితం :** ఒక మనిషి గొప్పవాడని ఎప్పుడు అంటాం? ఎప్పుడైతే ఒక మనిషి తాననుకున్న ఆదర్శాన్ని వదలకుండా, రాజీ పడకుండా జీవిస్తాడో, అప్పుడు అతణ్ణి సంఘం గౌరవిస్తుంది. ఈ లక్షణాన్ని తల్లితండ్రులు తమ ప్రవర్తన ద్వారా పిల్లలకు నేర్పించాలి. నచికేతుడు, సత్యకామ జాబాలి, మార్కండేయుడు, శ్రీరాముడు, సత్యహరిశ్చంద్రుడు, శ్రీరామకృష్ణులు, వివేకానందుడు – వీరందరూ ఇలా రాజీపడకుండా జీవించడాన్ని తమ తల్లితండ్రుల నుంచే నేర్చుకున్నారు. ఒక మనిషికి నిజంగా విద్య అబ్బిందా లేదా అని చెప్పడానికి అతడు తన జీవితాన్ని ఎంత సంయమనంతో, రాజీపడకుండా గడుపుతున్నాడన్న దాన్ని బట్టి అంచనా వేయవచ్చు.

**అందరూ ఆత్మ స్వరూపులే! :** ప్రతి ఒక్కరూ ఆత్మస్వరూపులే; పిల్లలూ, పెద్దలూ అందరూ ఈ విషయాన్ని చక్కగా తెలుసుకోవాలి. అప్పుడు వారిలో మంచి, మాన్యత పెరుగుతాయి. మనుష్యుల మనస్సులు పవిత్రమైనవిగా తయారవుతాయి.

మన పిల్లలకు మనం దొంగతనం చెయ్యకూడదని చెబుతాం. కానీ ఎందుకు దొంగతనం చెయ్యకూడదో చెప్పం. కొడతామని బెదిరించడం వల్ల, పోలీసులున్నారని చెప్పడం వల్ల ప్రయోజనం లేదు. దీనికి సమాధానాన్ని స్వామి వివేకానంద చక్కగా చెప్పారు. అందరిలోనూ అదే ఆత్మ ఉన్నదని తెలుసుకోవాలి. అప్పుడు మనల్ని మనం ఎలా గౌరవించుకుంటామో, తోటివారిని కూడా అలా గౌరవిస్తాం. ఇతరులు చేసిన ఏ పని మనకు కష్టం కలిగిస్తుందో, అలాంటి పనిని మనం ఇతరుల పట్ల చేయకుండా ఉంటాం.

*'ఒరులేయవి ఒనరించిన నరవర తన మనంబున కప్రియమగు తానది ఒరులకు సేయకునికి పరాయణము పరమధర్మ పథములకెల్లన్'* అన్న మహాభారతంలోని పద్యం ఈ సందర్భంలో మనం గుర్తుకు తెచ్చుకోవాలి. ఒకరు చేసిన పని వల్ల మనకు కష్టం కలిగితే అదే పనిని మనం చేయకూడదు. అన్ని ధర్మాలలోకీ ఇదే పరమధర్మమని చెప్పబడింది. అందరిలోనూ ఉన్నది ఒకే ఆత్మ అని తెలుసుకున్నప్పుడే ఇది ఆచరణసాధ్యం అవుతుంది. అందరిలోనూ ఒకే ఆత్మ ఉన్నదని తెలుసుకోవడమే విద్య నేర్చుకోవడానికి పరమ గమ్యం. పిల్లలకు అన్నిటికన్నా ముఖ్యంగా తల్లితండ్రులూ, ఉపాధ్యాయులూ నేర్పవలసిన విషయం ఇదే! C





## యువవాణి

**– స్వామి పరిజ్ఞేయానంద**

**కె. పవన్ కుమార్, హన్మకొండ.**

**ప్రశ్న:** 'యువతకి ఆదర్శం హనుమంతుడే' అని స్వామి వివేకానంద అన్నారు. ఎందుకు యువత హనుమంతుణ్ణే ఆదర్శంగా తీసుకోవాలి?

**జవాబు :** వ్యక్తిత్వ వికాసానికి ముఖ్యంగా కావలసినవి దేహబలం, బుద్ధిబలం, ఆత్మబలం. స్వామి వివేకానంద ఆశించింది దృఢమైన శరీరం, బుద్ధికుశలత, ఆత్మవిశ్వాసం గల యువతనుగానీ బలహీనుల్ని కాదు.

Men, men, these are wanted: everything else will be ready, but strong, vigorous, believing young men, sincere to the backbone, are wanted. - ***Swami Vivekananda***

కానీ నేటి యువతలో శారీరక శ్రమను ఓర్చుకునే శక్తీ, బాహ్య ఆకర్షణలకు వశంకాకుండా తప్పించుకునే మనోనిగ్రహమూ, కష్టాలను ఎదుర్కొనే ఆత్మవిశ్వాసం కొరవడడంతో మానసిక ఒత్తిళ్ళకుగురై ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు.

జీవితంలో దేన్ని సాధించాలన్నా వజ్ర సంకల్పంతో కూడిన దృఢమైన మనసు అవసరం. బలహీనులు దేన్నీ సాధించలేరు అన్నారు స్వామి వివేకానంద.

What work do you expect from men of little hearts?... You must have an iron will... You must be strong enough to pierce mountains. - ***Swami Vivekananda***

హనుమంతుడు తన కార్యసాధనలో ఎదురైన కష్టాలనన్నింటినీ దేహబలం, బుద్ధిబలం, ఆత్మబలం – ఈ మూడు శక్తుల్నీ ఉపయోగించి విజయాన్ని సాధించాడు. సంపూర్ణ వ్యక్తిత్వానికి సమగ్ర ప్రతిరూపం ఆ మహాత్ముడే కాబట్టి యువతకు ఆదర్శం 'హనుమంతుడు' అని స్వామీజీ సూచించారు.


మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా:

**యువవాణి**

శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,

దోమల్ గూడ, హైదరాబాద్ – 500 029

E- mail : rkprabhayuvavani@gmail.com


**ఎ. లక్ష్మణ్, హైదరాబాద్.**

**ప్రశ్న:** నాకు కోపం అధికం. కోపాన్ని అదుపుచేసుకోవడం ఎలాగో నాకు తెలిసినప్పటికీ, ఆచరణాత్మకం చేయడంలో విఫలుడనవుతున్నాను. దీనికి పరిష్కారం ఏమిటి?

**జవాబు :** కోపాన్ని అదుపుచేసుకోవడం ఎలాగో మీకు తెలిసినప్పటికీ ఆచరణలో విఫలులవుతున్నారు.

'ఉత్తముల్ని వివేకం, మధ్యముల్ని అనుభవం, అధముల్ని అవసరం, జంతువుల్ని స్వభావం నడిపిస్తాయి'.

మనుష్యులుగా జన్మించాం కాబట్టి భగవంతుడు మనకు ఇచ్చిన బుద్ధిని ఉపయోగించి బలహీనతలు మన స్వభావాలుగా మారకుండా ప్రయత్నించడమే సమస్యకు పరిష్కారం. Anger is a momentary madness. తాత్కాలిక ఉన్మాదమే కోపం. అలాంటి మానసిక స్థితిలో ఉన్నప్పుడు ఏ పనీ చేయకూడదు. అలా చేస్తే తుఫానులో సముద్రం మీదకు వెళ్ళినట్లే అవుతుంది. కోపంలో చేసిన ఏ పనైనా మనకు ప్రమాదాన్నే తెచ్చిపెడుతుంది.

ఒక మహారాజు అనేక దేశాలను జయించి తన రాజ్యానికి తిరిగి వస్తుండగా అడవిలో ఒక సాధువుని చూశాడు. ఆ రాజు సాధువు దగ్గరకు వెళ్ళి ధ్యానంలో ఉన్న ఆ సాధువుని 'స్వామీ! స్వర్గానికీ, నరకానికీ వెళ్ళే దారి ఏదో చెప్పండి' అని అడిగాడు. ధ్యాన నిమగ్నుడై ఉన్న ఆ సాధువు రాజు మాటలు వినలేదు. అడిగిన ప్రశ్నకు సాధువు సమాధానం చెప్పనందుకు రాజు కోపోద్రిక్తుడై సాధువుని చంపడానికి తన ఒరలోని కత్తిని పైకి తీశాడు. వెంటనే ఆ సాధువు కళ్ళుతెరిచి 'నరకానికి దారి ఇదే' అని చెప్పాడు. నరకానికి దారి కోపమే అన్న సాధువు మాటల్లోని అంతరార్థాన్ని గ్రహించిన రాజు శాంతించి కత్తిని ఒరలో పెట్టాడు. అప్పుడు 'స్వర్గానికి దారి ఇదే' అని ఆ సాధువు రాజుతో అన్నాడు.

మనకు కోపం వచ్చినప్పుడు 'నరకాన్ని' ఒకసారి ఊహించుకుంటే కోపం శాంతిస్తుంది. మన జీవితం 'స్వర్గం'గా మారుతుంది.

యువవాహిని

# మనసు - మర్మం

- గంపా నాగేశ్వరరావు

మనలోని నిరాశ, నిస్పృహ, దుఃఖాలకు మూల కారణం సమస్యలను గోరంతలు కొండంతలుగా భావించడం. భయంకరమైన సమస్యల్ని ఎదుర్కొనేవారు ఈ లోకంలో కోకొల్లలుగా ఉన్నారని గ్రహించగలిగితే బాధల వలన కలిగే భయాందోళనలు దరి చేరవు. సమస్యని సవాలుగా తీసుకొనే మానసిక దృక్పథం ఉన్నవారు జీవితంలో ఎలాంటి పరిస్థితుల్లోనైనా ఆనందంగా ఉండగలరు.

బావిలోని కప్పల్లా ఎంతసేపూ మన పరిధిలో మన సమస్యలనే ఆలోచిస్తున్నంత వరకూ ఎదుటివారి సమస్యల గురించి తెలుసుకోలేం.

## సమస్యలు ఎవరికి లేవు ?

ఒకసారి ఓ దంపతులు రైల్లో ప్రయాణం చేస్తున్నారు. భర్తకు ఒక కాలు లేదు. వారికి ఎదురుగా కూర్చున్న తోటి ప్రయాణికుడికి అతడికి కాలు ఎలా పోయిందో తెలుసుకోవాలని అనిపించింది. మాటల సందర్భంలో అతడు "నేను రెండు నెలల క్రితం వరకూ ఒక ఫ్యాక్టరీలో సూపర్‌వైజర్‌గా పని చేశాను. కానీ ఒక ప్రమాదంలో కాలు పోవడంతో ఉద్యోగం మానేశాను" అని చెప్పాడు.

"అలాగా!" అని తోటి ప్రయాణికుడు సానుభూతి ప్రకటించాడు. "కాలు పోతే పోయింది, అదృష్టవశాత్తూ ప్రాణాలు దక్కాయి" అని అతడి భార్య అంది.

"నీ ముఖం అదృష్టం. ప్రాణాలు పోయినా బాగుండేది. ఈ అవిటి బ్రతుకు బ్రతకలేక క్షణక్షణం నరకం అనుభవిస్తున్నాను. నా పరిస్థితే నీకు వచ్చుంటే తట్టుకోలేక ఆత్మహత్య చేసుకునేదానివి" అని భార్యపై చిందులేశాడు.

"కాలే పోయిన తరువాత ఇంకేం చెయ్యగలను సార్? మా అబ్బాయి ఇంట్లో ఒక మూల పడి ఉంటున్నాను" అన్నాడు నిరాశగా. నల్ల కళ్ళద్దాలు పెట్టుకొన్న ఓ స్త్రీ ఇదంతా విని, "అది కాదండీ! కాలు పోయినంత మాత్రాన దిగులుపడుతూ కూర్చోకపోతే, కూర్చుని చేసే పనులేవైనా చేసుకోవచ్చుగా" అని అంది. అప్పుడు ఆ అవిటి వ్యక్తి కాస్త చిరాగ్గా - "నీకేమమ్మా! ఒడ్డున కూర్చుని ఉచిత సలహాలు చెబుతావు. నీకేం తెలుసు నా బాధ?" అని కసురుకున్నాడు.

అతను అన్న మాటలకు ఆవిడ నొచ్చుకోకుండా చిరునవ్వుతో, "అయితే ఒక్కసారి ఇలా చూడండి!" అని నల్ల కళ్ళద్దాలను తీసివేసింది.

ఆమెకు చూపు లేదు. అదిచూసి వారు నిర్ఘాంతపోయారు. అంతేకాదు, అప్పటి వరకూ తన కాళ్ళ మీద కప్పుకున్న శాలువాను ఆమె తీసివేసింది. ఆమెకు రెండు కాళ్ళూ లేవు. ఆమెను చూసినవారికి కళ్ళల్లో ఒక్కసారిగా నీళ్ళు గిర్రున తిరిగాయి. అప్పుడు ఇలా చెప్పింది ఆవిడ: "నాకు రెండు వేర్వేరు ప్రమాదాలలో కళ్ళూ, కాళ్ళూ పోయాయి. మొదట్లో నిరుత్సాహంగా ఉన్నా పట్టుదలతో ప్రయత్నించి బ్రెయిలీ లిపి నేర్చుకున్నాను. ఇప్పుడు నేను ఒక సంస్థలో బ్రెయిలీ నేర్పడమే కాక, పుస్తకాలను బ్రెయిలీ లిపిలోకి అనువదించే ఉద్యోగం కూడా చేస్తున్నాను".



పై సంఘటనలో మొదటి వ్యక్తి తనకున్న సమస్యను అతిగా ఊహించుకున్నాడు. కానీ అతడి కన్నా పెద్ద సమస్య ఎదురైనా ఆమె మాత్రం సమస్యలను స్వీకరించి గెలిచి చూపించింది. సమస్యలను సవాళ్ళుగా స్వీకరించగలిగే మానసిక పరిణతే ఆమె ఆనందానికి అసలు కారణం.

ఇక నుంచి "నాకు ఫలానా సమస్య ఉంది" అనుకునే బదులు, "నా ముందు ఫలానా సవాలు ఉంది" అని అనుకోండి.

ఒక గంట ఎక్కువ పనిచేయడాన్ని మీరు సమస్యగా భావిస్తే ఆనందంగా ఆ పనిచేయలేరు. ఆ గంట సమయం ఎప్పుడవుతుందా అని ఎదురుచూస్తూ ఉంటారు. అదే పనిని మీరు సవాలుగా తీసుకుంటే చకచకా ఆ పనిని పూర్తి చేయగలరు. కావాలంటే పరీక్షించి చూడండి.

- రామ్ జలదుర్గం

**భగవంతుడు:** హలో! నన్ను పిలిచావా?

**మనిషి:** పిలిచానా! అబ్బే లేదే! ఇంతకీ మీరెవరు?

**భగవంతుడు:** నన్ను భగవంతుడంటారు. కాసేపు నీతో మాట్లాడదామని వచ్చాను.

**మనిషి:** ఇప్పుడు నాకు తీరిక లేదు.

**భగవంతుడు:** ఇంతకీ ఎందుకంత తీరిక లేకుండా ఉన్నావు?

**మనిషి:** జీవితమే అయోమయంగా ఉంది. ఎప్పుడూ ఇలా పరుగులు పెట్టాల్సి వస్తోంది.

**భగవంతుడు:** నిజమే ఉపయోగంలేని పని ఎప్పుడూ తీరిక లేకుండా ఉంచుతుంది. పనికొచ్చే పని ఫలితాలిస్తుంది. ఉపయోగంలేని పని సమయాన్ని మింగితే, పనికొచ్చేపని సమయాన్ని మిగులుస్తుంది.

**మనిషి:** నిజమే కానీ! కాలం అలానే గడిచిపోతోంది మరి!

**భగవంతుడు:** కాలంతో నీ పోరాటాన్ని చూసి సహాయం చేద్దామనిపించి వచ్చాను.



**మనిషి:** సరే.... జీవితం ఎందుకింత క్లిష్టంగా తయారైంది?

**భగవంతుడు:** జీవితాన్ని అనవసరంగా విశ్లేషించడం మానేసి, జీవించడమెలాగో తెలుసుకో! అంటే జీవితాన్ని కేవలం జీవించు! ...విశ్లేషణ సంక్లిష్టతకు కారణం.

**మనిషి:** అయితే మరి మనిషికి ఎందుకంత అసంతృప్తి?

**భగవంతుడు:** మనిషికెప్పుడూ రేపటి గురించి దిగులు, నిన్నటి గురించి అసంతృప్తి. అసంతృప్తికి కారణం అనవసరమైన దిగులు.

**మనిషి:** ఈ జీవితంలో బాధలు లేకుండా ఎలా ఉండగలం?

**భగవంతుడు:** బాధలు సహజం! అయితే బాధపడడం, పడకపోవడం మీ చేతుల్లోనే ఉంది.

**మనిషి:** ఎందుకు మంచి వాళ్ళే ఎక్కువగా బాధపడుతుంటారు?

**భగవంతుడు:** నిప్పులో కాల్చకుండా బంగారాన్ని శుభ్రపరచడం అసాధ్యం. మంచి వాళ్ళకు వచ్చేవి కష్టాలూ బాధలూ కాదు. పరీక్షలు మాత్రమే! ఆ పరీక్షలతో వారి జీవితం మరింత గట్టిపడుతుంది తప్ప వట్టిపోదు.

**మనిషి:** అంటే పరీక్షలు ప్రయోజనకరమేనంటారా?

**భగవంతుడు:** జీవితం పెట్టే పరీక్షలు చాలా అవసరం. జీవితం ముందు పరీక్ష పెడుతుంది. తరువాత పాఠాలు నేర్పుతుంది. ఆ పాఠాలే అనుభవాలు.

**మనిషి:** అయినా ఎందుకలాంటి పరీక్షలు? సమస్యల్ని నేరుగానే పరిష్కరించుకోవచ్చు గదా!

**భగవంతుడు:** పరీక్షలు, కష్టాలు మనిషి మానసిక, శారీరక సామర్థ్యాన్ని పెంచే సంఘటనలు మాత్రమే. అసలైన శక్తిమంతుడు సమస్యలు లేనివాడు కాదు... పరీక్షలకు రాటుదేలి, సమస్యంటే భయపడకుండా, ఓర్పును కలిగినవాడే సమర్థుడుగా గుర్తింపు పొందుతాడు.

**మనిషి:** నిజం చెప్పాలంటే, ఇన్ని సమస్యల మధ్య మేమెటు వెళుతున్నామో మాకే అర్థం కాదు. అంతా అగమ్యగోచరం.

**భగవంతుడు:** బాహ్యదృష్టితో చూస్తే మీ గమ్యం కనిపించదు. అంతర్నేత్రాన్ని తెరవండి. బాహ్యదృష్టితో చూస్తే కలలు కంటారు. అంతర్నేత్రం తెరిస్తే మేల్కొంటారు. మీ కళ్ళు దృష్టిని ప్రసాదిస్తే, హృదయం అంతర్ దృష్టిని ఇస్తుంది.

**మనిషి:** ఏది ఏమైనా సరైన మార్గాన పయనిస్తున్నామనుకునే కన్నా, విజయాన్ని ఆలస్యంగా పొందుతున్నామన్న విషయమే ఎప్పుడూ అసంతృప్తికి గురిచేస్తుంటుంది. మేమేం చేయాలి?

**భగవంతుడు:** 'విజయం' అనేది ఇతరుల కొలమానం అయితే 'ఆత్మతృప్తి' అనేది మీ సొంత కొలమానం! కానీ మీ దృష్టంతా ఇతరుల కొలమానం మీదే ఉంటుంది. అదే పెద్ద పొరపాటు. మీరు చూసే ఇతరులను గడియారాలతో పని చేయనివ్వండి.. కానీ మీరు దిక్సూచితో పని చేయండి. తేడా మీకే తెలుస్తుంది.

**తరువాయి 35వ పేజీలో...**

మహనీయుల జీవితాల్లో

## మధురఘట్టాలు

– బి. సైదులు

# అవరోధం కాని అపజయం !



“అవి నా జీవితంలో నిరాశ నింపిన క్షణాలు. నా చిరకాల స్వప్నమైన వైమానిక దళ ఉద్యోగం చేజారిపోవడం నాకు ఆశాభంగం కలిగించింది. వైమానికదళంలో చేరే అవకాశం నా వేళ్ళ సందుల్లో నుంచి జారిపోయిందన్న సత్యాన్ని జీర్ణించుకోలేకపోయాను. అందరు యువకుల లాగే ఆ వయసులో నా మనసును దిగులు మేఘాలు కమ్ముకున్నాయి. ఢిల్లీలో ఒక కొండచరియ దగ్గరకు పోయి నిలుచున్నాను. దూరంగా కింద ఒక సరస్సు. రాబోయే దినాలు భారంగా గడవబోతున్నాయని నాకు తెలుసు.

గుండె నిండా దుఃఖ భారంతో హృషీకేశ్ దారి పట్టాను. గంగలో స్నానం చేశాను. ఆ పరిశుద్ధ జలాలు నన్ను తెరపిన పడేశాయి. దూరాన కొండ మీద ఉన్న స్వామి శివానంద ఆశ్రమానికి (Divine Life Society) వెళ్ళాను. అక్కడ ఎందరో సాధువుల దర్శనం లభించింది. సాధువులకు అతీంద్రియ జ్ఞానం ఉంటుందనీ, వారు నా మనోభావాల్ని పసిగట్టగలరనీ భావించాను. అదే ఆశతో స్వామి శివానందను కలిశాను. కాషాయ ధోవతి, కాళ్ళకు పాంకోళ్ళతో ఆయన బుద్ధునిలా కనిపించారు. ఆయన దరహాసం నన్ను ప్రభావితం చేసింది. నన్ను నేను ఆయనకు పరిచయం చేసుకున్నాను. నా పేరు ఆయనలో ఏ అనన్యభావాన్నీ రేకెత్తించలేదు. నా కన్నా ముందు ఆయన పలకరించారు. నా దుఃఖానికి కారణమేమిటని అడిగారు. నేను చింతాగ్రస్థుడిగా ఉన్నట్లు ఆయన ఎలా పసిగట్టారో!

నేనాయనకు నా చిరకాల స్వప్నమైన ఆకాశయానం గురించీ, నేను ఆ పరీక్షలో నెగ్గకపోవడం గురించీ చెప్పాను. ఆయన చిరునవ్వు నవ్వారు. ఆ మందహాసం నాలోని దిగులునంతా తుడిచివేసింది. అప్పుడాయన మంద్రస్వరంలో ఇలా అన్నారు: “కోరిక అనేది హృదయం నుంచీ, ఆత్మ నుంచీ ఉప్పొంగినప్పుడు, అది పరిశుద్ధమూ, తీవ్రమూ అయినప్పుడు దానికొక గంభీరమైన విద్యుదయస్కాంత శక్తి వస్తుంది. మనసు నిద్రలోకి జారుకున్న ప్రతి రాత్రీ ఆ శక్తి శూన్యంలోకి విడుదలవుతుంది. తిరిగి ప్రతి ఉదయమూ అది విశ్వశక్తి ప్రవాహాల బలాన్ని పుంజుకొని మనల్ని చేరవస్తుంది. నువ్వేది సంభావించావో అది తప్పక సాక్షాత్కరిస్తుంది. నీకు ఏది దక్కాలో అది తప్పకుండా దక్కితీరుతుంది. ఈ కాలాతీత వాగ్దానం మీద నమ్మకం పెంచుకో. అనంతకాలం నుంచీ సూర్యోదయం గానీ, వసంతాగమనం గానీ గతి తప్పలేదు. ఈ వాగ్దానమూ అంతే!”

శిష్యుడు సిద్ధంగా ఉన్నప్పుడు గురువు ప్రత్యక్షమవుతాడు అన్న మాట ఎంత సత్యం! దాదాపుగా దారితప్పిన ఒక విద్యార్థికి ఇదిగో ఇక్కడొక గురువు లభించాడు. ‘నీ విధినంగీకరిస్తూ నువ్వు ముందుకు సాగిపో, నువ్వు విమానచోదకుడివి కావడానికి పుట్టలేదు. నువ్వేమిటి అవాలని ఉందో ఇప్పుడే తెలియదు. కానీ, అది ఇప్పటికే నిర్ణయమై ఉంది. ఈ వైఫల్యాన్ని మర్చిపో. నీ భవిష్యత్తు వైపు నిన్ను నడిపించడానికి ఈ వైఫల్యం కూడా అవసరమేనని భావించి అన్వేషించు. నీ జీవిత యథార్థ పరమార్థమేమిటో వెతుకు. నిన్ను నీవు చేరుకో. భగవత్సంకల్పానికి తలవంచు’ అన్నారు స్వామి శివానంద. భారత ఆధ్యాత్మికతత్త్వంలో ఎంత శక్తి, సాంత్వన ఉన్నాయో అప్పుడు తెలిసింది నాకు. ఆ తరువాత రక్షణశాఖలో పరిశోధకుడిగా ఉద్యోగం వచ్చింది”.

ఆ తరువాత ఆ భగవంతుడు అతణ్ణి ఏ వైపు నడిపించాడో మనందరికీ తెలిసిందే. వైఫల్యాన్ని విజయసోపానంగా మలచుకొన్న ఆ వ్యక్తే ‘భారతరత్న’ అబ్దుల్ కలామ్. ◻



## చిరశాంతికి చిరునామా !

ఈ చిత్రాన్ని ఒక్కసారి పరిశీలించండి. అన్నీ ప్రతికూల పరిస్థితులే! కంటికి కునుకుపట్టే అవకాశమే లేని దుఃస్థితి. చూరు నుంచి కారుతున్న చినుకులు. చోటు కూడా అంతంత మాత్రం. అయినా అక్కడ పిల్లి, కుక్క, సమస్తమూ ఎంత నిశ్చింతగా సర్దుకున్నాయో చూడండి! అంత చికాకుల్లోనూ అన్ని ముఖాల్లో అదే చిద్విలాసం. తొణకని ప్రశాంతత. అబ్బురపరిచే అద్భుతం. ఆనందమంటే ఏ సమస్యలూ లేని నిశ్చింతస్థితి కాదు... అమరిన సౌకర్యాలతోనే అనంతంగా తృప్తిపడే సర్దుబాటు పద్ధతి. అందుకే ఈ ప్రపంచంలో సమస్యలు లేనివారు ఆనందంగా ఉంటారనుకోవడం పొరపాటు. ఉన్నది పంచుకుంటూ, లేనిది సర్దుకోవడంలోనే సంతోషం దాగి ఉంది. C



# షష్టిపూర్తి స్వాతంత్ర్యమా ఎటు నీ పయనం!

– జిల్లా ప్రభు

స్వాతంత్ర్యం సిద్ధించి 60 సంవత్సరాలు పూర్తి అయ్యాయి. వందల ఏళ్ళ పోరాటం, అసంఖ్యాక బలిదానాలు మూల్యంగా చెల్లించి సాధించిన ఈ స్వాతంత్ర్యం ఎందుకోసం? భారతీయ విలువలు భ్రష్టమవుతుంటే భరించలేక మన దేశాన్ని మనమే పాలించుకొందామనే ధ్యేయంతో ఎందరో దేశభక్తులు ఉరకలెత్తే ఉత్సాహంతో స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నారు.

కారాగారాలు దివ్యభవనాలయ్యాయి. ఉరికంబాలు ఉయ్యాలలయ్యాయి. తుపాకిగుళ్ళు పూబంతులయ్యాయి. పాలకులు విద్యావిధానం మారిస్తే ప్రభుత్వ పాఠశాలలకు దీటుగా జాతీయ విద్యాలయాలు ప్రారంభమయ్యాయి. అసమంజసమైన పన్నులు వేస్తే అసహాయోద్యమం తలెత్తింది. మన ముడిసరుకులు తరలించి, వస్తువులుగా మార్చి మనకే అమ్ముతుంటే విదేశీ వస్తు బహిష్కరణోద్యమం పెల్లుబికింది. మన ధర్మం, మన సంస్కృతి మహనీయంగా వెలుగొందాలనీ, అందుకు స్వాతంత్ర్యమే పరిష్కారమనీ అందరు ఆకాంక్షించారు.

అలా సాధించిన స్వాతంత్ర్యం మన ప్రజలను మనమే చంపుకోవడానికా? మన దేశాన్ని మనమే పరులకు పంచిపెట్టడానికా? మన సంస్కృతిని మనమే కించపరచుకోవడానికా? మన ధర్మాన్ని మనమే నిరసించడానికా? మన యువశక్తిని మనమే పరదేశాల పరం చేయడానికా? 60 ఏళ్ళ స్వాతంత్ర్యం తరువాత ప్రతి భారతీయుడూ ఆలోచించవలసిన ప్రశ్నలలో కొన్ని ఇవి.

మన జాతీయ జీవన ఆదర్శాలనూ, ధర్మ సంస్కృతులనూ పరిరక్షించి ప్రచారం చేయడమే స్వాతంత్ర్యం యొక్క పరమలక్ష్యం. "ఏ దేశపు యువతరం హృదయాలు తమ దేశపు గతం పట్ల గౌరవంతో, వర్తమానం గురించి వేదనతో, భవిష్యత్తుకు సంబంధించి బంగారు కలలతో నిండి ఉంటాయో ఆ దేశం ప్రగతి పథంలో పరుగులు తీస్తుంది" అని స్వామి వివేకానంద అన్నారు.

కానీ మన బాలల నెత్తిన మెకాలే ప్రవేశపెట్టిన విదేశీ విద్యా విధానాన్ని రుద్దాం. అది జాతీయత, స్వాభిమానం లేని నిర్వీర్యమైన యువతరాన్ని తయారుచేస్తోంది. 'మదర్స్ డే' పేరుతో అనునిత్యం పూజ్యురాలైన తల్లిని సంకుచిత భావనతో, వ్యాపార దృష్టితో చూస్తూ మన దేశంలో కూడా వృద్ధాశ్రమాలను తెరుస్తున్నాం.

ఈ దేశం ఏమవుతుందో, ఎటు పోతుందో ఆలోచించి, దశనూ, దిశనూ మార్గదర్శనం చేయాల్సిన బాధ్యతను భుజస్కంధాలపై మోయాల్సిన సమయం ఆసన్నమైంది. అందరమూ తల్లి భారతి పునర్వైభవం కోసం స్వాభిమానం, సనాతన ధర్మాచరణ, జాతీయతల తోడుగా పాటుపడదాం! c

> వ్యవస్థీకరణ సామర్థ్యం మన దేశంలో పూర్తిగా శూన్యమనే చెప్పాలి. ఈ ఒక్క లోపం దేశంలో అన్ని దుఃస్థితులకూ హేతువు అవుతోంది. మనం ఏ సమస్యనూ ఇతరుల ప్రమేయంతో పరిష్కరించుకోవటానికి ఇష్టపడం. వ్యవస్థీకరణకు ప్రధానంగా కావలసింది విధేయత. – స్వామి వివేకానంద



# కాలాన్ని మనమే పాలించాలి..

– గొర్తి నీలం నాయుడు

**మా**నవుడు ఎంత మేధావి అయినా, అనునిత్యం శాస్త్రీయంగా ఎంతో వేగంగా అభివృద్ధి చెందుతున్నా – 'రెండింటిని' కోల్పోతే మాత్రం తిరిగిపొందడం అసంభవం. అందులో ఒకటి 'ప్రాణం', రెండోది 'సమయం'. మొదటిది మన చేతుల్లో లేనిది. అది మనిషి శరీరాన్ని విడిచి ఎప్పుడువెళ్ళిపోతుందో ఎవరికీ తెలియదు. కానీ, రెండోది మన చేతుల్లో ఉంది. ఎవరైతే సమయాన్ని సమర్థంగా వినియోగించుకొంటారో, వారి జీవితం సంతోషకరంగా సాగిపోతూ ఉంటుంది. సమయాన్ని ఎవరు వృథా చేస్తారో వారు తమ జీవితంలో ఎన్నో విలువైన మధుర ఘట్టాలను చేజేతులా దూరం చేసుకోవలసి వస్తుంది.

చాలామంది విద్యార్థులు రాత్రి పడుకొనే ముందు మరునాడు ఉదయం 4 గంటలకల్లా నిద్ర లేచి చదవాలనుకొంటారు. కానీ పొరపాటువల్లో, బద్ధకంవల్లో నిద్రలేవడం 5, 10 నిమిషాలు ఆలస్యం అయితే "మధ్యలో (4.05 – 4.10 గంటలకు) లేవడం ఎందుకు? నాలుగున్నరకో, అయిదు గంటలకో లేద్దాం లే" అని తమకు తామే సర్దిచెప్పుకొని, మళ్ళీ నిద్రలోకి జారుకుంటారు.

మరికొందరు విద్యార్థులు పరీక్షల సమయంలో రాత్రి 8 గంటలకు చదవడం ప్రారంభించాలని నిర్ణయించుకొంటారు. కానీ ఆ సమయానికి ఏదో ఒక పనిలో పడి నాలుగైదు నిమిషాలు ఆలస్యం చేస్తారు. ఆ తరువాత "అయిందేదో అయింది. మధ్యలో 8.05కి చదవడం మొదలుపెట్టడమెందుకు? 8.30 చదవడం ప్రారంభిస్తే సరిపోతుంది" అని తమను తాము సమర్థించుకొని తక్కిన 20, 25 నిమిషాలు (8.30 వరకూ) కాలక్షేపం చేస్తారు.

నిమిషాలను ఎంతో జాగ్రత్తగా సద్వినియోగం చేసుకొన్నప్పుడే గంటలు, రోజులు, వారాలు, నెలలు, సంవత్సరాలకి విలువ చేకూరుతుంది. అందుకే రేమండ్ "నేను నిమిషాల విషయంలో జాగ్రత్త పడతాను. అప్పుడు గంటలు వాటంతటఅవే జాగ్రత్త పడతాయి" అని పేర్కొన్నారు. నిమిషాలు చిన్నవేలే అని వాటిని వృథా చేస్తే, దాని ప్రభావం గంటలు, రోజులు, వారాలు, నెలలు, సంవత్సరాలపై పడుతుంది. తద్వారా జీవితంలో కష్టాలు, నష్టాలు చవిచూడాల్సి ఉంటుంది. బాధలను భరించాల్సి వస్తుంది.

సమయానికి ఉన్న ప్రాధాన్యత, విలువ ఏమిటో స్పష్టమవుతోంది. కనుక కాలాన్ని వృథాగా కరిగిపోనివ్వకుండా నేర్పుగా వినియోగించుకొందాం. విజేతలమవుదాం. C

***Rabindranath Tagore***

The butterfly counts not months but moments, and has time enough.

***Provers***

An inch of time cannot be bought by an inch of gold.

***Golda Meir***

We must govern the clock, not be governed by it.

***Jeanpaul Satre***

A great deal of time is needed to build; a moment is enough to hurt everything to the ground.

# దేన్ని అనుసరిద్దాం?

- స్వామి యోగీశానంద

భగవంతునిపై భక్తి శ్రద్ధలు, దృఢ విశ్వాసంతో ఉండడం చాలా అరుదుగా చూస్తుంటాం. సర్వసాధారణంగా అందరూ తమ కోరికలు తీరడం కోసమే దేవుణ్ణి పూజిస్తుంటారు. కొంచెం విచక్షణ ఉన్న చాలా కొద్ది మంది మాత్రం ఆధ్యాత్మికంగా ఎదగడానికి ప్రయత్నిస్తుంటారు. ఆధునిక యుగంలో ప్రాపంచిక సుఖాలకే ప్రాధాన్యమిచ్చి, వాటి కోసం రకరకాల శిక్షణలు పొందుతూ, ఈ సుఖాలనే తమ జీవిత లక్ష్యంగా ఎంచుకొని అందరూ పరుగులు పెడుతున్నారు.

ఆధునిక విజ్ఞాన శాస్త్రం ఎంతో పురోభివృద్ధి చెందుతున్నదని మనమంతా గర్విస్తున్నాం. కానీ సృష్ట్యాది విషయాలలో వారు ఏ విషయాన్నీ దృఢంగా చెప్పలేకపోతున్నారు. ఆధునిక ఖగోళ శాస్త్రజ్ఞులు కొన్ని సంవత్సరాల క్రితం సూర్య మండలంలో ఉన్న ఇతర గ్రహాలలో ఎలియన్స్ (Aliens) అనే విచిత్ర ప్రాణులు ఉన్నాయని చెప్పడం జరిగింది. కానీ ఆ శాస్త్రజ్ఞులే ఇప్పుడు తాము ప్రకటించిన విషయాలను తామే ఖండిస్తున్నారు. నోబుల్ పురస్కార గ్రహీత జార్జ్ బెర్నార్డ్ షా చెప్పినట్లు "Science is always wrong. It never solves a problem without creating ten more." దీనికి కారణం మానవుని శక్తి చాలా అల్పం. ఆ కొద్దిపాటి శక్తితో అనంత విశ్వాన్ని తన కన్నులతో చూడాలనుకొంటే అది అసంభవం. ఈ విషయాన్నే మాతృదేవి ఆ రోజుల్లో ఎంత దృఢంగా చెప్పారో చూద్దాం. స్వామి అరూపానంద మహరాజ్, మాతృదేవితో మాట్లాడుతూ, "అమ్మా! అనంతమైన ఈ సృష్టిలో ఎక్కడ ఏది జరుగుతోందో ఎవరికెరుక? అసంఖ్యాకమైన నక్షత్రాలూ, గ్రహాలూ ఉన్నాయి. వాటిలో దేనిలోనైనా ప్రాణులు నివసిస్తున్నాయో లేదో ఎవరు చెప్పగలరు?" అని ప్రశ్నించారు.

మాతృదేవి 'ఈ మాయా ప్రపంచంలో భగవంతుడొక్కడే సర్వజ్ఞుడు. బహుశా ఆ గ్రహాలలోనూ, నక్షత్రాలలోనూ ప్రాణులుండవు' అని చెప్పారు.



ప్రస్తుతం మన సమాజంలో పాశ్చాత్య సాంకేతిక పరిజ్ఞానం, పాశ్చాత్య నాగరకతకు ఆకర్షితులై మన ఆధ్యాత్మిక ధర్మాలను సందేహాస్పదంగా చూస్తున్నారు. అంతేకాదు మన మహర్షుల సత్య వచనాలను సైతం వైజ్ఞానికపరంగా నిరూపించగలరా అనే ప్రశ్నలు వింటూనే ఉన్నాం. అసలు నిరూపించడం అంటే ఏంటి? ఏ విషయ నిరూపణకైనా మొదట జ్ఞాత (Subject), జ్ఞేయం (Object) అనే ఇరుపక్షాలు అవసరం. ఏ విషయ నిరూపణనైనా లోకంలో ప్రతి వ్యక్తీ అర్థం చేసుకోలేడు. ఆ ప్రయోగాన్ని అర్థం చేసుకొనే స్థాయికి రావడానికి అతడికి పూర్వ శిక్షణ అవసరం. ఆధ్యాత్మిక నిరూపణలో కూడా జ్ఞేయపక్షంలో సంపూర్ణ ప్రమాణాలు కావాలి. వాటిని తెలుసుకోగోరే వారికి కూడా విశేష శిక్షణ అవసరం. ఆ ప్రమాణాలు, శిక్షణ ఉంటేనే వారు ఎదుటనున్న విషయ నిరూపణను కానీ, ఖండనాన్ని కానీ అవుననో కాదనో చెప్పగలుగుతారు. ఆధ్యాత్మిక లేక మనోగత విషయాలను తెలుసుకోవాలంటే విశేష శిక్షణ అవసరం. ఎందుకంటే ఒకవేళ ఎవరైనా నిరూపించినా, వాటిని గ్రహించే స్థితిలో మనం ఉన్నామో లేమో, అలాంటి విషయాలను గ్రహించడానికి మన దేహాలు, మనస్సులు యోగ్యమైనవో కావో తెలుసుకోవాలి.

సృష్టికర్త ఈశ్వరుణ్ణి "ఇది" అని ఒక వస్తువుగా చెప్పలేం. ఉదాహరణకు విద్యుత్తు అంటే ఏమిటో ఎవరికీ తెలియదు. దీన్ని ప్రాణంతో పోల్చవచ్చు. ఈ ప్రాణం సర్వత్రా ఉంది. మన శరీరంలో ఈ ప్రాణం ఒక చోట ఉందని కచ్చితంగా చెప్పలేం. ఈ విషయాలు ఆధ్యాత్మికమైనవి. ఇవి అర్థం చేసుకోవడానికి ఇంద్రియాతీతులు కావాలి. విజ్ఞాన శాస్త్రం పూర్తిగా ఇంద్రియ పరమైనది. ఏదైతే ఇంద్రియగోచరం కాదో దాన్ని విజ్ఞానశాస్త్రం విశ్వసించదు. ఏదైతే ఇంద్రియాతీత మైనదో దాన్ని మనం యోగశాస్త్రం అంటాం. కాబట్టి విజ్ఞానశాస్త్రాన్ని లౌకిక జీవితంలో అనుసరిస్తూనే, జీవిత లక్ష్యమైన భగవత్సాక్షాత్కారానికి యోగశాస్త్రాన్ని అనుసరిద్దాం. C




# రామకృష్ణ మిషన్ వివేకానంద విశ్వవిద్యాలయం

(యుజిసి చట్టంలోని విభాగం 3 క్రింద భారత్ ప్రభుత్వం చేత ప్రతిపాదింపబడినది)

**పి.ఒ. బేలూర్ మఠం, జిల్లా హౌరా, పశ్చిమ బెంగాల్–711 202**

## విన్నపం

ప్రియ మిత్రులారా!

స్వామి వివేకానంద "బేలూరు మఠంలో ప్రభవించిన ఆధ్యాత్మిక ప్రభంజన ప్రభావం 1500 సంవత్సరాల పాటు ఉంటుంది; అదొక గొప్ప విశ్వవిద్యాలయం అవుతుంది. ఇది నా ఊహ అనుకోవద్దు, నేను దర్శించి చెప్తున్నాను" అన్నారు. మరొక సందర్భంలో వారు "క్రమంగా దీనిని (బేలూరు మఠం) అనేక శాఖలలో సమర్థవంతమైన విశ్వవిద్యాలయంగా తీర్చిదిద్దడమే ప్రస్తుత లక్ష్యం" అని కూడా అన్నారు. వారు దర్శించిన ఈ విశ్వవిద్యాలయమే సుమారు ఒక శతాబ్దంగా స్వామీజీ అనుయాయులకీ, భక్తులకీ శ్రద్ధాపూర్వక ధ్యాన విషయంగా మారింది. దీని తొలిమెట్టు... యుజిసి చట్టంలోని విభాగం 3 కింద భారత ప్రభుత్వ మానవ వనరుల మంత్రిత్వశాఖ "రామకృష్ణ వివేకానంద విశ్వవిద్యాలయాన్ని ప్రతిపాదించడం. ఇది 2005, జూలై 4 (స్వామీజీ మహాసమాధి చెందిన రోజు)న ప్రారంభించబడింది.

ఇతర విశ్వవిద్యాలయాలు ప్రాధాన్యతనీయని విభాగాలకు వివేకానంద విశ్వవిద్యాలయం ప్రాముఖ్యత నిస్తుంది. దిగువ సూచించిన ప్రధాన విభాగాలను ఎన్నుకోవడం జరిగింది:

1. డెసెబిలిటీ మేనేజ్ మెంట్ & స్పెషల్ ఎడ్యుకేషన్
2. ఇంటిగ్రేటెడ్ రూరల్ డెవలప్‌మెంట్, ట్రైబల్ డెవలప్‌మెంట్
3. ఇండియన్ కల్చరల్ & స్పిరిట్యువల్ హెరిటేజ్ & వేల్యూ ఎడ్యుకేషన్
4. డిజాస్టర్ మేనేజ్‌మెంట్, రిలీఫ్ & రిహాబిలిటేషన్
5. ఫండమెంటల్ సైన్సెస్–ఇంటిగ్రేటెడ్ టీచింగ్ & రిసర్చ్

ఈ రంగాలలో ప్రావీణ్యతను పొందిన మా సుస్థాపిత కేంద్రాలలో మౌలికమైన సదుపాయాలున్నప్పటికీ విశ్వవిద్యాలయ స్థాయిలో తగినన్ని ఉపకరణ సౌకర్యాలు సమకూర్చాల్సిన అవసరం ఉంది. అందువలన రానున్న రెండు సంవత్సరాల్లో కనీసం 5 కోట్ల రూపాయలతో శాశ్వత నిధిని ఏర్పాటు చేయాల్సివుంది. ఈ విశ్వవిద్యాలయ అభివృద్ధికి భక్తులు,మిత్రులు,శ్రేయోభిలాషులు ఉదారంగా విరాళాలను ఇచ్చి తోడ్పడవలసిందిగా కోరుతున్నాం.

వివేకానంద విశ్వవిద్యాలయం కోసం పంపే విరాళాలు ఈ చిరునామాకు, వివరణ లేఖను జతపరచి పంపమనవి.

Vice Chancellor
Ramkrishna Mission Vivekananda University
P.O. Belur Math, Dist. Howrah - 711 202, West Bengal.

చెక్కులు/ డి.డి.లు Ramkrishna Mission Vivekananda University, Belur Math లేదా RKMVERI, Belure Math పేరున వ్రాసి పై చిరునామాకు పంపవలెను. వివేకానంద విశ్వవిద్యాలయానికి ఇచ్చే విరాళాలన్నిటికీ 1961, ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 80(G)లోని సబ్‌సెక్షన్ 2(a) (iiif) కింద 100% పన్ను మినహాయింపు ఉంది.

ఈ బృహత్పథకానికి ఉదార హృదయులు విరాళాలిచ్చి సహకరిస్తారని ఆశిస్తున్నాం.

మీ సేవలో
స్వామి ఆత్మప్రియానంద
ఉపకులపతి

ప్రజలు తమ స్వశక్తిపై ఆధారపడనంత వరకూ ప్రపంచ సంపదనంతనూ వెచ్చించినా దేశంలో ఒక చిన్న పల్లెను కూడా ఉద్ధరించలేం. కనుక మనం ప్రజలకు నైతికపరమైన, విజ్ఞానపరమైన విద్యను విధిగా అందచేయాలి. ప్రజలు స్వయంపోషకత్వాన్నీ, ఆర్థిక నైపుణ్యాన్నీ సంపాదించుకొని కరువుకాటకాల బారిన పడకుండా జీవించగలగాలి. అందుకు కావలసిన విజ్ఞానాన్ని మనం వారికి లభింపచేయాలి. విద్య విస్తరించకుండా, విజ్ఞానం వికసించకుండా దేశ ప్రగతి సాధ్యం కాదు. d

**– స్వామి వివేకానంద**

ఆంగ్లమూలం : డాక్టర్ ఎస్. రమణి

అనువక్త : రెంటాల జయదేవ



# విషాదాలకు తలొగ్గని వనితా రత్నం

ఇందోర్ సంస్థాన పరిపాలకురాలు అహల్యాబాయి (క్రీ.శ. 1735-95). మరాఠా చరిత్రను అక్షరబద్ధం చేసినవారిలో సుప్రసిద్ధులైన సర్ జాన్ మాల్కమ్ మాటల్లో చెప్పాలంటే, 'అత్యంత స్వచ్ఛమైన, ఆదర్శప్రాయమైన పరిపాలకుల్లో ఆమె ఒకరు'.

ఆమె ఔరంగాబాద్‌కు చెందిన మనకోజీ షిండే కుమార్తె. మల్హర్‌రావ్ హోల్కర్ ఏకైక కుమారుడైన ఖండూజీతో ఆమె వివాహమైంది. పీష్వా సైన్యంలో మల్హర్‌రావ్ సహాయ సైన్యాధికారి. కాగా, ఓ శతఘ్ని దాడిలో అహల్యాబాయి భర్త మరణించాడు. దాంతో, ఆమె జీవితంలో విషాదం అలముకుంది. అప్పటికి ఆమెకు నిండా 20 ఏళ్ళు కూడా లేవు. ఆ రోజుల్లోని ఆచారం ప్రకారం ఆమె తన భర్త చితిపై పడి, సతీ సహగమనం చేయాలనుకుంది.

అయితే, అంతపని చేయవద్దని మామగారైన మల్హర్‌రావు ఆమెకు నచ్చజెప్పారు. పరమ సోమరి, బాధ్యతా రహితుడూ, కోరికలు తీర్చుకోవడానికి పరుగులు తీసేవాడూ అయిన కుమారుడితో ఆయన విసిగిపోయారు. ఇప్పుడు ఆ కుమారుడు కూడా మరణించడంతో, తన జీవితంలో మిగిలిన కాస్తంత సాంత్వన కోడలు, మనుమలేనని ఆమెకు హితబోధ చేశారు. దాంతో, అహల్యాబాయి సతీ సహగమన ఆలోచనను విరమించుకుంది. అహల్యాబాయికి ఇద్దరు పిల్లలు. కుమారుడి పేరు మాలేరావు, కుమార్తె పేరు ముక్తా బాయి.

అహల్యాబాయి ఎంతో తెలివైనదిగా, ధైర్యవంతురాలిగా పెరిగింది. ఆమె మామగారు ఆమెకు పాలనా వ్యవహారాల్లో శిక్షణనిచ్చారు. అలాగే, రాజ్య వార్షికాదాయం వనరుల్లో తర్ఫీదునిచ్చారు. సైన్య నిర్వహణను కూడా నేర్పించారు. ప్రజా సంక్షేమం కోసం కృషి చేసే మంచి పరిపాలకుల లక్షణాలను, అలాగే ధార్మిక గుణాలను ఆమె తనలో పెంపొందించుకుంది. ప్రతిరోజూ ధర్మశాస్త్రాల అధ్యయనం, ధ్యానం, మననం చేస్తూ ఆమె ఎన్నో గంటలు గడిపేది.

మల్హర్‌రావు మరణం తరువాత అహల్యాబాయి కుమారుడైన మాలేరావును హోల్కర్ రాజ్య పాలకుణ్ణి చేశారు. అయితే, మాలేరావుకు అప్పటికింకా అంత సమర్థత లేకపోవడంతో, అహల్యాబాయే అన్నీ చూసుకొంటూ తెర వెనుక అసలు పాలకురాలిగా వ్యవహరించేది. రాజీ పరిష్కారం, దయ కలిగి ఉండడమనేవి ఆమె ఆచరణ సూత్రాలు. అయితే, సందర్భానుసారం అవసరమైతే ఆమె కొంత కఠినంగా ఉండడానికి కూడా వెనుకాడేది కాదు.

మామగారు మరణించిన తరువాత రాజపుత్ర వంశీకుల్లో ఒకరైన చంద్రావత్‌లు ఆమెపై తిరుగుబాటు చేశారు. అప్పుడు సమయానికి అహల్యాబాయి వద్ద సైన్యాధ్యక్షుడు కూడా లేరు. అయినప్పటికీ, అహల్యాబాయి వెనుకడుగు వేయలేదు. సమకూర్చుకోగలిగినంత బలగాన్ని సమకూర్చుకొని, ఆమే స్వయంగా ఆ సైన్యానికి నాయకత్వం వహించింది. చంద్రావత్‌ల తిరుగుబాటును అణచివేసింది. అలాగే, ఒకసారి ఆమె పరిపాలనలోని సాత్పురాలో కొందరు భిల్ల జాతివారు సమస్యలు సృష్టిస్తూ, తలనొప్పిగా తయారయ్యారు. అప్పుడు

అహల్యాబాయి ఆ భిల్ల జాతి వారి నాయకుణ్ణి నిర్బంధంలోకి తీసుకొని, మరణశిక్ష విధించింది. అలాంటి కఠినమైన చర్యలు చేపట్టడంతో ఆమె రాజ్యంలో అసాంఘిక శక్తులు శాశ్వతంగా కనుమరుగయ్యాయి.

అయితే, అహల్యాబాయిని ఒక విషయంలో దురదృష్టం వెంటాడింది. ఆమె కుమారుడు దుర్బల మనస్కుడు. కాలక్రమంలో అది పిచ్చిగా మారి, దానితోనే మరణించాడు. కాగా, ఈ రాజ్యానికి వారసుడు లేడనే విషయం గమనించి, పాలక పీష్వాకు సన్నిహిత బంధువైన రఘోబా దాడి చేయాలని భావించాడు. కొడుకు పోయిన దుఃఖంలో ఉన్నప్పటికీ, అహల్యాబాయి తన ఆత్మగౌరవాన్ని కోల్పోలేదు. అవసరమైతే యుద్ధభూమిలో కలుసుకోవడానికి తాను సిద్ధమంటూ ఆమె రఘోబాకు కబురు పంపింది. అలాగే, ఆమె మరో మాట కూడా చెప్పింది. తాను మహిళను గనక, యుద్ధంలో మరణిస్తే, అతని ఘనకీర్తి పెరిగేదేమీ లేదని పేర్కొంది. ఒకవేళ అలా కాక, తానే గెలిచి, అతనికి ఏదైనా జరిగితే దాని పర్యవసానం అతని విషయంలో ఎంత ఘోరంగా ఉంటుందో ఊహించుకోమని హెచ్చరించింది. ఆ మాటలతో ఆమె సూచించదలిచిన సందేశం ఏమిటన్నది సుస్పష్టమవడంతో, రఘోబా తన మనసు మార్చుకున్నాడు. ఆ తరువాత పీష్వాలు అహల్యాబాయి పాలనకు లాంఛనప్రాయమైన గుర్తింపునిచ్చారు. ఫలితంగా, సంస్థానాన్ని నడిపే మొత్తం బాధ్యతను ఆమె స్వీకరించింది.

అయితే, వ్యక్తిగత జీవితంలో అహల్యాబాయి ఎదుర్కొన్న విషాదాలకు అంతం లేదు. కుమారుడి మరణం తరువాత ఆమె కళ్ళెదుటే మనుమడు మరణించాడు. అల్లుడు ప్రాణాలు కోల్పోయాడు. అల్లుడి చితి మీద పడి కుమార్తె సైతం సహగమనానికి పాల్పడడం అహల్యాబాయిని మరింత కుంగదీసింది.

ఏమైనా, అహల్యాబాయి తన భక్తికీ, సమాజంలోని ప్రజల సంక్షేమానికీ చిహ్నాలుగా ఎన్నెన్నో పనులు చేసింది. ఎన్నో రహదారులు వేయించింది. బావులు తవ్వించింది. స్నానఘట్టాలు కట్టించింది. విశ్రాంతి గృహాలు నిర్మించింది. దేవాలయాలు నెలకొల్పింది. వాటిలో ప్రత్యేకంగా చెప్పుకోదగినవి కొన్ని ఉన్నాయి. కలకత్తా నుంచి వారణాసికి వేయించిన రహదారి వాటిలో ఒకటి. అలాగే, సౌరాష్ట్రలో సోమనాథ దేవాలయం, గయలో విష్ణు ఆలయం, వారణాసిలో విశ్వేశ్వర ఆలయం అహల్యాబాయి చలవే! పరిపాలనలోనూ, ధార్మికతలోనూ ఇంతటి ఉత్కృష్ట స్థాయిని అందుకున్న ఈ మహిళ నేటి తరానికి ఆదర్శప్రాయురాలు. c

...26వ పేజీ తరువాయి.



**మనిషి:** మరి కష్టకాలంలో కూడా ఈ ప్రేరణ ఇలాగే కొనసాగాలంటే ఎలా?

**భగవంతుడు:** నిత్యం మీరు సాధించాల్సిన దాని కన్నా ఎంత సాధించారో తలచుకుంటూ ఉండండి. లేని వాటి గురించి ఎప్పుడూ దిగులు పడే కన్నా, ఉన్నవాటి విలువలు తెలుసుకోవడం మంచిది కదా!

**మనిషి:** అసలు మీకు మనుష్యుల విషయంలో ఆశ్చర్యం కలిగించేదేమిటి?

**భగవంతుడు:** జీవితంలో కష్టాలెదురైతే మనిషి భగవంతుడా 'ఎందుకు నాకే ఈ కష్టాలు పరీక్షలు?' అంటాడు. అదే నేను వరాలు ప్రసాదించినప్పుడు 'ఎందుకు నాకే ఈ వరాలు, అదృష్టాలు?' అని అడగడు. న్యాయం ఎప్పుడూ తన వైపు ఉండాలనుకుంటాడే తప్ప, తను న్యాయం వైపు ఉండాలనుకోడు.

**మనిషి:** అసలు జీవితాన్ని అద్భుతంగా జీవించడమెలా?

**భగవంతుడు:** 1. గతంలోని అన్ని సంఘటనలనూ నిశ్చల మనస్సుతో అంగీకరించండి.

2. బాధను మరోసారి అనుభవించేలా గతాన్ని తవ్వుకోకండి.
3. వర్తమానాన్ని ఆత్మవిశ్వాసంతో ఎదుర్కోండి.
4. భవిష్యత్తును నిర్భయంగా ఆహ్వానించండి.
5. మీకున్న వాటిని చూసి గర్వపడండి.
6. మిమ్మల్ని మీరు ఇతరులతో పోల్చి అవమానించుకోకండి. అవసరమైతే ఇతరుల నుంచి సగర్వంగా నేర్చుకోండి.
7. జీవితంలో మీ ప్రాధాన్యతలను మర్చిపోకండి. విశ్వాసంతో ఉండండి.
8. మీ అనుమానాల్ని నమ్మకండి. మీ నమ్మకాల్ని అనుమానించకండి.

జీవితం ఓ అందమైన రహస్యం, దాన్ని ఛేదించండి. అంతేకానీ జీవితమేమీ సమస్య కాదు అనుక్షణం పరిష్కరించడానికి! నిజానికి మీకు జీవించడం తెలిస్తే, జీవితం అత్యద్భుతమైంది.

**మనిషి:** మీ విలువైన కాలాన్ని వెచ్చించి, నా ప్రశ్నలకు సమాధానాలిచ్చినందుకు ధన్యవాదాలు. మీ మాటలు ఎంతో ధైర్యాన్నిచ్చాయి.

# స్ఫూర్తి భావనలకు స్వాగతం...



**జీర్ణ**మయిన దుస్తుల్ని త్యజించినట్లు ఈ శరీరాన్ని త్యజించినా నా భావాలతో ముందు తరాలను నిరంతరం చైతన్య పరుస్తూనే ఉంటాను అనేవారు స్వామి వివేకానంద. విశ్వానికే ఆత్మవిశ్వాసాన్ని ప్రబోధించిన యుగపురుషుడాయన. ఆబాల గోపాలాన్నీ ఉత్తేజపరిచే ఉత్తుంగ చైతన్య సాగరం స్వామీజీ.

స్వామి వివేకానంద ఈ ప్రపంచం నుంచి భౌతికంగా నిష్క్రమించి ఒక శతాబ్దం అయినా వారి స్ఫూర్తి మాత్రం ఆచంద్రార్కం మనల్ని మేల్కొలుపుతూనే ఉంటుంది. అలా ఆ మహనీయుని జీవితంతో ఉత్తేజితులైన వారి అనుభూతులకు, అనుభవాలకు 'శ్రీరామకృష్ణ ప్రభ' స్వాగతం పలుకుతోంది.

స్వామి వివేకానంద జీవితంలోని ఒక సంఘటన కావచ్చు, సంభాషణ కావచ్చు.... ఉత్తరం కావచ్చు, ఉపన్యాసం కావచ్చు... ఏదైనా మిమ్మల్ని మహత్తరంగా ప్రభావితం చేసి ఉంటుంది. ఆ అనుభూతిని, అనుపమానమైన స్ఫూర్తిని 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులతో పంచుకోండి.

సమస్యల సాగరంలో చిక్కుకొని చుక్కాని లేని అగమ్యగోచరమైన నేటితరానికి స్వామి వివేకానంద సాహిత్యం ఆశాదీపమని మీ అనుభవాలు నిరూపిస్తాయి. మీ అనుభవాలను, అనుభూతులను వ్రాసి మీ ఛాయచిత్రం (ఫోటో)తో సహా పంపిస్తే **'నా జీవితంలో స్వామి వివేకానంద'** అనే శీర్షికలో ప్రచురిస్తాం.

మీ అనుభవాలను, భావనలను పంపవలసిన చిరునామా

**'నా జీవితంలో స్వామి వివేకానంద'**
శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,
దోమల్ గూడ, హైదరాబాద్ - 500 029
E- mail : rkprabhayuvavani@gmail.com

...17వ పేజీ తరువాయి



10
భేష్! భేష్! ఇంత రుచికరమైన వంటకాలు మేము ఎప్పుడూ తినలేదు. వంటమనిషి ఎవరు?
మొదట తాంబూలం తీసుకోండి! ఆ వంట చేసినది నేనే!


11
నీళోబాజీ! 'కేవలం భజనచేసే ఒక వ్యక్తి ఇంటి నుంచి నువ్వు కోడల్ని తెచ్చుకుంటున్నావే' అని ఎందరో నన్ను ఎగతాళి చేశారు. అలాంటి వారికి గుణపాఠం చెప్పేలాగ చాలా చక్కగా వివాహం జరిపించారు.
అంతా ఆ విఠలుని కృపాకటాక్షమే!


12
అయ్యా! మహానుభావా! మీరు చేసిన ఈ ఎనలేని సహాయానికి ప్రత్యుపకారంగా మేము మీకు ఏం చేయగలం! ఈ చిన్న కానుకను స్వీకరించండి!
కాస్త ఆగండి! పూజ గదికి వెళ్ళి వస్తాను!


13
పూజ గదికిలోకి వెళ్ళిన వ్యక్తి తిరిగి రాలేదే!
రామకృష్ణ హరి! రామకృష్ణ హరి!
పూజ గదిలో ఎవరూ లేరే! ఇది కూడా ఆ విఠలుని లీలావినోదమే!
విఠలుని కృపాకటాక్షాన్ని తలచుకుంటూ నీళోబా 'రామకృష్ణ హరి' అంటూ తన్మయంగా పాడసాగాడు.

14

మరొక రోజు తుకారామ్, నీళోబాకు కలలో కనబడి తనను చూడడానికి రమ్మని చెప్పాడు. నీళోబా వెంటనే దేహూకు బయలుదేరాడు. కానీ తీరా అక్కడకు వెళ్ళేసరికి కొద్దిరోజుల ముందే తుకారామ్ దేహం చాలించి భగవంతుణ్ణి చేరుకున్నాడని తెలిసింది. అయినా తుకారామ్‌ను దర్శించుకోకుండా తిరిగివెళ్ళనని సంకల్పించి, నీళోబా అక్కడే ధ్యానంలో నిమగ్నుడై పోయాడు.

15

అప్పుడు పాండురంగ విఠలుడు సాక్షాత్కరించాడు.




16




సంసారంలో ఉంటూనే భగవంతుణ్ణి నిరంతరం స్మరించు. నీ సర్వస్వాన్నీ భగవంతునికి అర్పించు. నువ్వు ఆయనని శరణు వేడితే నీకు ఎలాంటి బాధలూ ఉండవు. సకలమూ భగవంతుని సంకల్పానుసారమే జరుగుతుందని నువ్వు గ్రహిస్తావు.

– శ్రీరామకృష్ణ పరమహంస



# గ్రంథ పరిచయం




## జాగృతి

స్వామి వివేకానంద స్ఫూర్తి వచనాలు

**రూపకల్పన : స్వామి జ్ఞానదానంద, వెల: 80/-, పేజీలు : 127, ప్రతులకు : రామకృష్ణ మఠం దోమలగూడ, హైదరాబాద్ - 500 029.**

స్వామి వివేకానంద స్ఫూర్తి వచనాలు సామాన్యమైన సూక్తులు కావు. వాటిలోని ప్రతి అక్షరానికీ అక్షయమైన శక్తి ఉంది. అవి వ్యక్తుల దౌర్బల్యాన్నీ, ఆత్మన్యూనతాభావాన్నీ పటాపంచలు చేస్తాయి. చదివిన ప్రతిసారీ మనలో నూతన ఉత్తేజాన్ని నింపే ఆ వచనాస్త్రాలను అనువదించడం కొండను అద్దంలో బంధించడమే అవుతుంది.

ప్రకృతిలోని దృష్టాంతాలను ఉపయోగించి, అంతర్మథనాన్ని రేకెత్తించాలన్నదే ఈ పుస్తకం ప్రధాన ఉద్దేశ్యం. అందుకే స్వామి వివేకానంద భావాలను యువ హృదయాలకి హత్తుకునే విధంగా, మారిన కాలానికి తగ్గట్లుగా సచిత్రంగా అందించారు. స్వామి వివేకానంద మాటల్ని యథాతథంగా ఆంగ్లంలో అందిస్తూ, వాటి అంతరార్థాన్ని పాఠకులకు, ముఖ్యంగా యువతకు విశదీకరించాలనే తాపత్రయం వలననే ఈ పుస్తకం రూపొందింది.

మాతృభాషలోని మాధుర్యాన్ని రంగరించి, ఆ శక్తిగుళికలను స్వీకరించి జీర్ణం చేసుకోవాలనుకునే వారి కోసమే ఈ ప్రయోగం. కాబట్టి కేవలం చదవడానికే కాక, స్వామి వివేకానంద భావాలను అధ్యయనం చేయడానికీ, వాటిని ఆకళింపు చేసుకొని కొంతైనా ఆచరించడానికీ పుస్తకంలోని ప్రతీ పుటా ఉపయుక్తం కాగలదు. C **- శ్రీరామ్**

## భారతీయ ప్రతిభా విశేషాలు -108 నిజాలు

Eternally Talented India - 108 Facts

**ప్రచురణ: వివేకానంద లైఫ్ స్కిల్స్ అకాడమి, వెల: రూ. 200/- , పేజీలు : 338 ప్రతులకు : రామకృష్ణ మఠం దోమలగూడ, హైదరాబాద్ - 500 029.**

#ఈ పుస్తకం ఇంగ్లీషులో కూడా లభ్యమవుతోంది.




ఏమిటి ఆ 108 నిజాలు? వాటి వెనుక దాగి ఉన్న చరిత్ర ఏమిటి? చారిత్రకంగా పరిశోధించి తగిన ఆధారంతో ప్రచురించబడిన భారతీయ ప్రతిభా విశేషాలు పుస్తకరాజంలో వివరించబడ్డాయి.

భారతదేశ కీర్తిని, భారతీయుల ప్రతిభను ప్రపంచం నలు మూలలకూ వ్యాపింప జేసినవారు స్వామి వివేకానంద. ప్రపంచ పురోగతిలో భారతదేశం పాత్ర అతికీలకమైనదనీ, అందుకు ప్రపంచం ఎంతగానో ఋణపడి ఉందనీ ఆయన చెప్పారు.

సున్నా నుంచి 9 వరకూ ఉన్న ఆ పది అంకెలే నేటి మానవ సమాజానికి మూలాధారం. వాటిని భారతీయులు కనుగొన్నారు. వేదాంత విషయాలలో నేటికీ భారతీయులదే అగ్రస్థానమని ప్రఖ్యాత జర్మన్ తత్వవేత్త సోఫెన్ హౌసర్ చెప్పాడు.

మన పూర్వీకుల ప్రతిభను మనమే గుర్తించలేక తప్పుడు సమాచారంతో కూడిన పాఠ్యపుస్తకాలను నిర్లిప్తతతో ఆమోదిస్తూ మనల్ని మనమే కించ పరచుకుంటున్నాము. ఇలాంటి నిర్లిప్తత నుండి భారతీయులను మేల్కొల్పడానికి "భారతీయ ప్రతిభా విశేషాలు - 108 నిజాలు" అన్న గ్రంథాన్ని వివేకానంద లైఫ్ స్కిల్స్ అకాడమి ప్రచురించింది. ఈ పుస్తక సంకలనకర్తలైన జయంతి చంద్రశేఖర్, మన్నవ గంగాధరప్రసాద్ అభినందనీయులు. C **- కొల్లా భాస్కరరావు**

# వార్తావాహిని

## ప్రచురణాలయ శతవార్షికోత్సవం







**చెన్నై శ్రీరామకృష్ణ మఠం** 1908లో పుస్తక ప్రచురణాలయాన్ని ప్రారంభించింది. ఈ ప్రచురణాలయం 2008 నాటికి శతవసంతాలు పూర్తిచేసుకొన్న సందర్భంగా ఏప్రిల్ 12,13,14 తేదీల్లో శతవార్షికోత్సవాల్ని నిర్వహించింది.

రామకృష్ణ సంఘ ఉపాధ్యక్షులు పూజ్య స్వామి స్మరణానందజీ మహరాజ్ ఏప్రిల్ 12వ తేదీ ఉదయం 10.30 గంటలకు శతవార్షికోత్సవాల ప్రథమ సమావేశాన్ని ప్రారంభించారు. పూజ్య స్వామీజీ 'అన్నదానం, విద్యాదానం, జ్ఞానదానాల ప్రాముఖ్యతను వివరించారు. చెన్నై శ్రీరామకృష్ణ మఠం గత వందేళ్ళుగా ప్రచురణల విభాగం ద్వారా సమాజానికి చేస్తున్న సేవల్ని కొనియాడారు. రామకృష్ణ సంఘ ప్రధాన కార్యదర్శి స్వామి ప్రభానందజీ మహరాజ్ 'మానవ మేధస్సును, విశాల దృక్పథాన్ని అలవర్చడమే ప్రచురణల విభాగం ముఖ్య ఉద్దేశం' అని సూచించారు. తదనంతరం మఠ ప్రచురణల విభాగంలో సేవలందించిన రచయితలను, రచయిత్రులను జ్ఞాపికలతో సత్కరించారు. ఈ సందర్భంగా నిర్వహించిన సమ్మేళనాల్లో సుమారు 1500 మంది యువతీ యువకులు, ఉపాధ్యాయులు పాల్గొన్నారు. చెన్నై శ్రీరామకృష్ణ మఠ అధ్యక్షులు స్వామి గౌతమానందజీ ప్రచురణాలయ నిర్వహణలో సహకరించిన భక్తులకు, మిత్రులకు కృతజ్ఞతల్ని తెలియజేశారు. ఈ కార్యక్రమంలో వివిధ రామకృష్ణ మఠ శాఖల నుంచి స్వామీజీలు, అధిక సంఖ్యలో భక్తులు పాల్గొన్నారు. **నివేదిక : స్వామి అభిరామానంద**

## జూనియర్ కళాశాల ప్రారంభోత్సవం

**భోపాల్ రామకృష్ణ మిషన్ ఆశ్రమం** 2008 ఏప్రిల్ 16 నుంచి వివేకానంద విద్యా పీఠ్ ఆధ్వర్యంలో ఉన్న జూనియర్



కళాశాల నిర్వహణ బాధ్యతలను చేపట్టింది. ఈ కళాశాలను ఏప్రిల్ 16 ఉదయం 11.30 గంటలకు రామకృష్ణ మఠం, మిషన్‌ల ప్రధాన కార్యదర్శి స్వామి ప్రభానందజీ మహరాజ్ జ్యోతి ప్రజ్వలను చేసి ప్రారంభించారు. ఈ కార్యక్రమానికి స్వామి ప్రమేయానందజీ, స్వామి గౌతమానందజీ విచ్చేశారు. ఆ రోజు సాయంత్రం 7 గంటలకు జరిగిన బహిరంగ సభలో సుమారు 1000 మంది భక్తులు పాల్గొన్నారు. **నివేదిక : స్వామి భావరూపానంద**

## పన్నెండవ వార్షికోత్సవం

**గరగపర్రు శ్రీరామకృష్ణ సేవాసమితి** 2008 ఏప్రిల్ 24వ తేదీన పన్నెండవ వార్షికోత్సవం జరుపుకొంది. ఈ కార్యక్రమంలో రాజమండ్రి శ్రీరామకృష్ణ మఠం అధ్యక్షులు స్వామి అక్షరాత్మానందజీ మహరాజ్ 'ఎన్ని మతాలో అన్ని మార్గాలు' అనే అంశంపై ప్రసంగించారు. తదనంతరం భక్తులు మతసామరస్యాన్ని చాటే గీతాల్ని ఆలపించారు. ఈ కార్యక్రమంలో వంద మందికి పైగా భక్తులు పాల్గొన్నారు.

**నివేదిక : ఎమ్. విశ్వనాథరాజు**



# సుబోధ

ఒక శిష్యుడు భగవద్ధ్యానం చేస్తూ కాలం గడుపుతున్నా దుష్టసంకల్పాలు అప్పుడప్పుడు మనస్సులో కలుగుతూనే ఉన్నాయని చెప్పి కామాన్ని జయించటం ఎలాగని శ్రీరామకృష్ణుణ్ణి అడిగాడు. అందుకు గురుదేవులు ఇలా బోధించారు: “ఒక వ్యక్తివద్ద ఒక కుక్క ఉండేది. దాన్ని ఎత్తుకొని ముద్దాడుతూ, దానితో ఆటలాడుతూ, ఆ కుక్కను అతగాడు ఎంతో మక్కువతో పెంచుకోసాగాడు. అది చూసి ఒక జ్ఞాని కుక్క మీద అంతటి మక్కువ కూడదని అతణ్ణి మందలించాడు. ఎందుకంటే, కుక్క వట్టి జ్ఞానంలేని జంతువు కదా? ఎప్పుడైనా అతణ్ణి కరిచే ప్రమాదముంది. ఈ బోధలను అతడు ఆలకించి తన ఒళ్ళోని కుక్కను అవలతలికి తోసేసి, దాన్ని ఇక చేరదియ్యటంగానీ, బుజ్జగించటంగానీ చెయ్యరాదని నిశ్చయించుకొన్నాడు. కాని ఆ కుక్క యజమానికి తనపట్ల దృష్టి మారిందని తెలియక ఎప్పటి మాదిరే ఎత్తుకొని ముద్దులాడతాడని ఆశతో తరచూ అతగాడి వద్దకు పరుగెత్తేది. ఎన్నోసార్లు దెబ్బలు తిన్నాక చివరికి అది తనను లాలించమని యజమానిని ఇక బాధించటం మానేసింది. నీ స్థితీ అలాగే ఉంది. నీ అంతరంగంలో నువ్వింతవరకు బుజ్జగించిన కుక్కను వదలించుకోదలచినా నిన్నది సులభంగా విడువదు. ఐనా భయం లేదులే. ఆ కుక్కను ఇక బుజ్జగించక నీ వద్దకు చేరినప్పుడల్లా ఛీకొడుతుండు, నీచేత లాలింపబడటానికై నిన్ను పీడిస్తున్న ఆ కుక్క (కామం) కొంతకాలానికి నిన్ను విడిచివేస్తుంది”. c

(‘శ్రీరామకృష్ణ బోధామృతం’ నుంచి)



శ్రీరామకృష్ణ ప్రభ
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్ - 500 029
ఫోన్: 040-2766 7799, 2763 3936
E-mail : sriramakrishnaprabha@gmail.com



నిర్వాహక సంపాదకులు: స్వామి జ్ఞానదానంద
సంపాదకులు: స్వామి పరిజ్ఞేయానంద

# సురభి

నడి సముద్రంలో చిక్కుకొని అల్లాడిపోతున్న ఒక వ్యక్తికి ఒక చిన్న దీవి కనిపిస్తుంది. ఆ దీవిని చేరుకొంటే అతడికి ఇక ఈ బాధ తప్పుతుంది. అతడి చుట్టూ ఉవ్వెత్తున అలలు లేచిపడవచ్చు. కానీ అవి అతణ్ణి ఏ విధంగానూ బాధించవు. ప్రతి వ్యక్తికీ ఇలాంటి ఒక దీవి అవసరం. సమస్యలు, కలతలు, బాధలు, దుఃఖాలు మొదలైన వాటితో నానా అవస్థలూ పడుతున్నప్పుడు అతడు సేద తీర్చుకోవడానికి ఒక చోటు అవసరం. ఆ చోటే భగవంతుడు. ఇతరుల కంటే, ఇతర సాధనాల కంటే భగవంతుడే సేదతీర్చుకొనే ఉత్కృష్టమైన చోటుగా ఉన్నాడు. కన్నీటితో ఆయన సన్నిధానంలో మన సమస్యలను ప్రార్థనా రూపంలో వెలిబుచ్చినప్పుడు మనస్సులో ప్రశాంతత నింపుతాడు. దాంతో సమస్యలన్నీ పరిష్కారమవుతాయని కాదు. ఆ సమస్యలతో మనం కృంగిపోకుండా, వాటిని అధిగమించగలిగేటట్లు ఆయన మనలో శక్తిని జనింపచేస్తాడు. కనుక ప్రతి వ్యక్తీ తన జీవితంలో భగవంతునికి చోటు కల్పించి, ఆయనను తన దైనందిన జీవితంలో అభిన్న భాగంగా చేసుకోవడం అనివార్యం. అప్పుడు మాత్రమే మనం ఆయనతో సంసర్గం కల్పించుకోగలం. "ఎవరో నిన్ను రక్షిస్తున్నారని ఎన్నడూ మరువవద్దు".

(శ్రీశారదాదేవి చరితామృతం నుంచి)



# శ్రీ పరమాచార్య చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ వేదాధ్యయనానుసన్ధాన ప్రతిష్ఠానమ్

## ప్రవేశ / ఉద్యోగ ప్రకటన

**1. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది కోర్సులకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) 'వేదచూడామణి' : ఋగ్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క అధ్యయనము

యోగ్యతలు : మాతృభాషలో చదువగలిగి, వ్రాయగలిగి ఉండాలి.

వయస్సు : 8 నుంచి 10 సంవత్సరాల మధ్య

స్టైఫండ్ : నెలకు రూ. 1,000/-

(ఆ) 'వేదార్థచూడామణి' : ఋగ్వేదము/ యజుర్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క భాష్యాధ్యయనము

యోగ్యతలు : సంస్కృత పరిజ్ఞానముతో బాటు ఏదో ఒక వేదాన్ని పూర్తిగా అధ్యయనం చేసి ఉండాలి.

వయస్సు : 15 సం॥, ఆ పైన

స్టైఫండ్ : నెలకు రూ. 3,000/-

**2. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది ఉద్యోగాలకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) వేదాధ్యాపకుడు : (సామవేదము/ అథర్వవేదము – వేదానికి ఒక్కొక్కరు చొప్పున రెండు ఖాళీలు)

కావలసిన అర్హతలు : క్రమాంతము లేక పదాంతము

అదనపు అర్హతలు : ఏదైన మరియొక వేదము/ వేదభాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము

అనుభవము : 2 సంవత్సరములు

సంభావన : నెలకు రూ॥ 8,000/- మొత్తము. సౌకర్యములతో

(ఆ) వేదభాష్యాచార్యుడు : (ఒక్కొక్క వేదానికి ఒక్కొక్కరు చొప్పున 4 ఖాళీలు)

విద్యార్హత : ఏదైనా వేద భాష్యంలో ఉత్తీర్ణత

అదనపు అర్హత : మరొక వేద భాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము

అనుభవార్హత : 5 సం॥

సంభావన : నెలకు రూ. 10,000/- మొత్తము. సౌకర్యములతో

ముద్రించిన దరఖాస్తు ఫారములను శ్రీ పి. వేంకటేశ్వర్లు గారు, మేనేజింగ్ డైరెక్టర్, కాకతీయ సిమెంట్, షుగర్ & ఇండస్ట్రీస్ లిమిటెడ్, 'గురుకృప' (ఆంధ్రా బ్యాంకు ఎదురుగా), **1 - 10 - 140/1**, అశోక్‌నగర్, హైదరాబాద్ - **500 020** (ఫోను: 040 - 27637717) నుంచి ప్రత్యక్షముగా గాని, పోస్టు ద్వారా గాని పొందవచ్చు. పూర్తి చేయబడిన ఆ ముద్రిత దరఖాస్తులను ఈ పై అడ్రసుకు పంపవలెను. అవసరాన్ని బట్టి ఖాళీలను పూరించుట లోనూ, అర్హతల సవరణ లోనూ మేనేజ్‌మెంటుకు అధికారము కలదు.

సం/-

కులప్రశాసకుడు

హైదరాబాద్



Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020 and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 65 | సంచిక: 7 | జూలై 2008

హర త్వం సంసారం ద్రుతతరమసారం సురపతే
హర త్వం పాపానాం వితతిమపరాం యాదవపతే ।
అహో దీనానాథం నిహితమచలం నిశ్చితపదం
జగన్నాథస్వామీ నయనపథగామీ భవతు మే ॥

సంసార తాపత్రయాన్ని శీఘ్రంగా తొలగించేవాడవు నీవు. దేవతలకు నాయకుడవైన నీవు అన్ని పాపాలను నశింపజేయువాడవు. ఓ యాదవపతీ! దీనులకు నాథుడవు. శాశ్వతపదం ప్రసాదించు వాడవు. జగన్నాథస్వామీ! నా దృష్టి పథంలో నీవే గోచరించెదవు గాక! (ఆది శంకరాచార్య)





## లోపలి పేజీల్లో...





# శ్రీరామకృష్ణ ప్రభ

శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం, దోమల్‌గూడ
హైదరాబాద్- 500 029, ఫోన్ : 040-2766 7799





## విన్నపం

ప్రియ భక్తులకు, చందాదారులకు

ఆబాల గోపాలాన్ని జాగృతపరిచే రీతిలో 'శ్రీరామకృష్ణ ప్రభ'ను తీర్చిదిద్దుతున్న విషయం మీకు విదితమే. ముఖ్యంగా యువతరానికి దిక్సూచిగా నిలిచే 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకూ, కళాశాలలకూ అందించాలని సంకల్పించాం.

శ్రీరామకృష్ణుల, స్వామి వివేకానందుల సందేశాల ఆవశ్యకతను గురించి సుభాష్ చంద్రబోస్ ఒక సందర్భంలో "శీలనిర్మాణానికి రామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం వేరొకటి లేదు" అని అన్నారు.

యువతరంలో వ్యక్తిత్వ వికాసాన్నీ, ఆత్మవిశ్వాసాన్నీ నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను యువతరానికి మరింత చేరువ చేయడానికి మీ ఆర్థిక, హార్దిక స్నేహహస్తాన్ని కోరుతున్నాం.

ఈ పథకం కింద రూ. 1500/- జీవిత చందా (20 సంవత్సరాలకు) కట్టినట్లయితే మీరు సూచించిన లేదా మేము ఎంపిక చేసిన ఒక పాఠశాల/కళాశాలకు 20 ఏళ్ళ పాటు 'శ్రీరామకృష్ణ ప్రభ'ను మీ పేరున పంపుతాం. చందాదారుని పేరు, విద్యాసంస్థ పేరు పత్రికలో ప్రచురిస్తాం.

మీ చందాను ఎమ్.ఓ. / డి.డి./ చెక్కుల రూపంలో **Ramakrishna Math, Hyderabad** పేరున తీసుకొని, **Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029** చిరునామాకు పంపవలెను.

స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతరాన్ని తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి మీ వంతు సహాయం అందించగలరని ఆశిస్తున్నాం.

భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ప్రార్థిస్తూ...

భగవత్సేవలో
స్వామి జ్ఞానదానంద
అధ్యక్షులు

శ్రీ పార్థసారథి రాయ్, బంజారా హిల్స్, హైదరాబాద్
శ్రీ పి. విజయ్ కుమార్, బంజారా హిల్స్, హైదరాబాద్
శ్రీ గురురాజ హెబ్బార్, బంజారా హిల్స్, హైదరాబాద్
డాక్టర్ వి. వెంకట్, శ్రీనగర్ కాలనీ, హైదరాబాద్
డాక్టర్ సి. రాధాకృష్ణ, శ్రీనగర్ కాలనీ, హైదరాబాద్
శ్రీ ఎమ్. శివాజీ, ఎల్.వి.ప్రసాద్ మార్గ్, హైదరాబాద్
శ్రీ ఎమ్.వి. రామారావు, శ్రీనగర్ కాలనీ, హైదరాబాద్
శ్రీ ఆర్. మాధవరావు, బంజారా హిల్స్, హైదరాబాద్

**ఆంధ్రప్రదేశ్‌లోని 1000 పాఠశాలలు/ కళాశాలలకు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను స్పాన్సర్ చేశారు.**



| చందా వివరాలు | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా | : | రూ. 100 | $ 20 |
| మూడు సంవత్సరాలకు | : | రూ. 280 | $ 50 |
| ఐదు సంవత్సరాలకు | : | రూ. 450 | $ 80 |
| ఇరవై సంవత్సరాలకు | : | రూ. 1500 | $ 360 |



గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో **Ramakrishna Math, Hyderabad** అని వ్రాయాలి. పంపవలసిన చిరునామా : **Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.**

## లోపలి పేజీల్లో...































### శ్రీరామకృష్ణ ప్రభ వార్షిక చందాదారులకు విన్నపం

ప్రియ పాఠకులారా! దిగువ పేర్కొన్న నెంబర్ల నడుమ ఉన్న సంవత్సర చందాదారుల చందా గడువు తీరిపోనుంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకొని, 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.

**80005 - 83039** మధ్యనున్న వారిలో సంవత్సర చందాదారుల చందా గడువు **2008** జూలై తో తీరిపోనుంది!

**90000 - 96067** మధ్యనున్న వారిలో సంవత్సర చందాదారుల చందా గడువు **2008** ఆగష్టుతో తీరిపోనుంది!

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ.... - సర్క్యులేషన్ మేనేజర్

✿ మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరకపోయినట్లైతే, వెంటనే మాకు తెలియజేయగలరు. ✧ మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి. ✱ మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.

'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకి కుడిభాగంలో మీ చందా గడువు నెల పొందుపరచబడి ఉంది.

ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకుడు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు.

- సంపాదకులు




**SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH**

Domalguda, Hyderabad - 500 029, Andhra Pradesh

Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com



# ఏకనిష్ఠలో అగ్రగణ్యుడు!

విద్యార్థులు పరీక్షల్లో ఉత్తీర్ణులు కానప్పుడూ, తాము ఆశించిన విధంగా ఫలితాలు రానప్పుడూ నిరాశా, నిస్పృహలకు గురవుతుంటారు. కొంతమంది భయాందోళనలకు లోనై ఆత్మన్యూనతతో ఆత్మహత్యలకు పాల్పడుతుంటారు. నిజానికి అనుకూల పరిస్థితుల్లో విజయం సాధించిన వారి కన్నా ప్రతికూల పరిస్థితులకు ఎదురీది ఆశించిన మార్గంలో కృతకృత్యులు అయినవారే ఆదర్శ విద్యార్థులు. ఆదర్శ విద్యార్థిగా పరిణతి చెందాలంటే విద్యార్థికి ముఖ్యంగా కావలసింది ఏకనిష్ఠ. విద్యార్థి అన్యవిషయాలపై మనస్సును పోనీయకుండా విద్య మీదే తన దృష్టినంతా కేంద్రీకృతం చేసినప్పుడు ఎలాంటి ప్రతికూల పరిస్థితులనైనా తనకు అనుకూలంగా మలచుకోగలుగుతాడు.

**ఇష్టమైతే కష్టం ఉండదు :** మనకు ఇష్టమైన పని ఎంత కష్టమైనా ఆనందంగా చేయగలం. కాబట్టి చేసే ప్రతి పనీ కష్టమైనా ఇష్టంతో చేయడం నేర్చుకోవాలి.

**సుఖార్థీ చేత్ త్యజేత్ విద్యా, విద్యార్థీ చేత్ త్యజేత్ సుఖమ్।**
**సుఖార్థినః కుతో విద్యా, కుతో విద్యార్థిన స్సుఖమ్ ॥**

సుఖాన్ని కోరుకునే విద్యార్థికి విద్య రాదు. విద్యను ఆశించే విద్యార్థి సుఖాన్ని త్యజించాలి. సుఖాన్ని ఆకాంక్షించేవారికి విద్య ఎలా వస్తుంది? విద్యార్జన చేసేవారికి సుఖమెలా ఉంటుంది?" కాబట్టి విద్యార్జనే ప్రథమ కర్తవ్యమని గ్రహించిన విద్యార్థి సుఖాన్ని వదులుకొని, ఏకనిష్ఠతో కృషి చేయాలి.

ఓ గురుకులంలో ఒక విద్యార్థి రోజూ పాఠాలు నేర్చుకోవడంతో పాటు ఆశ్రమ ప్రాంగణాన్ని పరిశుభ్రం చేయడం, నది నుంచి నీళ్ళు తీసుకురావడం, వంట కోసం అడవికి వెళ్ళి కట్టెలు కొట్టి తీసుకురావడం- ఇలా ఎన్నో పనులు చేసేవాడు. ఐదేళ్ళుగా ఆ విద్యార్థి గురుకులంలో ఏకనిష్ఠతో గురుసేవ చేస్తూ విద్యను అభ్యసిస్తున్నాడు. ఒకరోజు ఆ శిష్యుడు "పప్పులో ఉప్పు లేదు" అని గురువుకు ఫిర్యాదు చేశాడు. వెంటనే గురువుగారు శిష్యునితో "నాయనా! ఇక నీవు ఇంటికి వెళ్ళవచ్చు. నీకు ఇంక చదువు రాదు" అని అన్నారు. శిష్యుడు ఆశ్చర్యంతో "ఎందుకు గురువుగారూ?" అని ప్రశ్నించాడు. "నాయనా! ఐదేళ్ళుగా ఉప్పులేని పప్పే తింటున్నావు. కానీ ఇన్నాళ్ళూ నీ ధ్యాస కేవలం చదువు మీదే ఉంది కాబట్టి పప్పులో ఉప్పు ఉందా, లేదా అనే విషయం నీకు తెలియలేదు. కానీ ఇప్పుడు నీ మనస్సు రుచుల వైపు మళ్ళింది. అంటే చదువుపై నీ నిష్ఠ కొరవడిందని తెలుస్తోంది" అన్నారు గురువుగారు.

మనస్సు ఒకే పనిలో నిమగ్నమై ఉన్నప్పుడు సుఖాలు, సౌకర్యాల కోసం పరుగులు తీయదు అని ఈ కథ సారాంశం.

**ప్రతికూల పరిస్థితుల్లోనూ పట్టువీడని వీరుడు:**

మంచి ఉపాధ్యాయులు ఉన్నప్పటికీ, అన్ని ఆధునిక సదుపాయాలూ ఉన్న విద్యాసంస్థల్లో విద్యను అభ్యసిస్తున్నప్పటికీ, తల్లిదండ్రులు కావలసినన్ని సౌకర్యాలు కల్పిస్తున్నప్పటికీ చదువంటే భారంగా భావించే విద్యార్థులకూ, చదువంటే భయం, ఆందోళన, ఒత్తిళ్ళకు గురయ్యే విద్యార్థులకూ ఆదర్శప్రాయుడైన ఓ విద్యార్థి కథను తెలుసుకుందాం.

ఆ విద్యార్థికి విద్య నేర్పడానికి గురువు నిరాకరించాడు. అతణ్ణి ప్రోత్సహించడానికి మరెవరూ ముందుకు రాలేదు.

ఎలాంటి సహాయమూ అతనికి లభించలేదు. అయినా అతడు అధైర్యపడలేదు. నిరాశ చెందలేదు, పట్టుదల వీడలేదు. గురువు తనకు విద్య నేర్పడానికి నిరాకరించినప్పటికీ గురువు పట్ల భక్తి విశ్వాసాల్ని కోల్పోలేదు. ఆ ఆదర్శ విద్యార్థే 'ఏకలవ్యుడు'.

ఏకలవ్యుడు ధనుర్విద్య నేర్పాల్సిందిగా ద్రోణాచార్యుని వేడుకొన్నాడు. ధనుర్విద్యలో అర్జునుడికి సాటి మరొకడు ఉండకూడదనే ఉద్దేశంతో ఏకలవ్యునికి ధనుర్విద్య నేర్పడానికి సమ్మతించలేదు ద్రోణాచార్యుడు. గురువు నిరాకరించినా నిరాశ పడకుండా ఏకలవ్యుడు అడవికి వెళ్ళి, ద్రోణాచార్యుని మట్టి ప్రతిమ తయారుచేసి, ఆ ప్రతిమలోనే గురువును పూజిస్తూ, దర్శిస్తూ ధనుర్విద్యను అభ్యసించాడు. ఒకరోజు కౌరవులు, పాండవులు వేటకు వెళ్ళి అడవి జంతువులను సంహరిస్తుండగా, వారి వేటకుక్క ఏకలవ్యుణ్ణి చూసి మొరిగింది. అది మొరుగుతుండగా ఏకలవ్యుడు ఒకేసారి దాని నోట్లోకి ఏడు బాణాలు వదిలాడు. అది చూసి పాండవులకు ఆశ్చర్యం కలిగింది. విలువిద్యలో అర్జునుణ్ణి మించిన మేటి విలుకానిగా ప్రఖ్యాతిగాంచాడు ఏకలవ్యుడు.

పట్టుదల ఉంటే ఎలాంటి పరిస్థితుల్ని అయినా ఎదుర్కొని, ఆశించిన రంగంలో విజయాన్ని సాధించవచ్చని నిరూపించిన స్ఫూర్తిదాత ఏకలవ్యుడు.

**అసాధ్యాలను సుసాధ్యం చేయాలంటే?:** "భారతీయుల నరనరాల్లో అశ్రద్ధ అనే భయంకర వ్యాధి చొచ్చుకుపోయింది. ఆ దీర్ఘవ్యాధి బారి నుంచి భారతీయులు బయటపడనంత వరకూ ఏ కార్యాన్నీ సాధించలేరు. శ్రద్ధ ఉంటే అసాధ్యాలను సుసాధ్యం చేయవచ్చు" అంటారు స్వామి వివేకానంద.

> What makes one man great and another weak and low is Shraddha, nothing else. Be strong and have this Shraddha, and everything else is bound to follow. - *Swami Vivekananda*

శ్రద్ధ ఉంటే దేనినైనా సాధించవచ్చు అన్న స్వామి వివేకానంద సందేశానికి ఉత్తమ ఉదాహరణగా నిలిచి విద్యార్థులకు ఆదర్శప్రాయుడయ్యాడు ఏకలవ్యుడు.

జ్ఞాన సముపార్జనకు కావలసింది 'శ్రద్ధ' అని శ్రీకృష్ణ భగవానుడు ఉద్బోధించాడు.

**శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరః సంయతేన్ద్రియః ...**

**శ్రద్ధ:** 'శ్రద్ధ' అంటే నేను అనుకొన్నదాన్ని ఎలాగైనా సాధించి తీరతాననే దృఢ సంకల్పం, ఉత్సాహ దృక్పథమే. సాధారణంగా మనకు కష్టాలు ఎదురైనప్పుడు నిరాశ మనల్ని ఆవరిస్తుంది. మనలోని సంకల్పబలం సన్నగిల్లడం వల్ల మన శక్తి సామర్థ్యాల మీద మనకే నమ్మకం పోతుంది. 'ఈ పని నేను సాధించగలనో, లేదో' అని సందిగ్ధావస్థను వీడి ఆత్మవిశ్వాసాన్ని ప్రదర్శించడమే విజయానికి తొలి మెట్టు.

**తత్పరః :** త్రికరణ శుద్ధిగా ఏకనిష్ఠతో కార్యసాధనలో నిమగ్నమైతే మనస్సు వేరే విషయాలపైకి వెళ్ళదు. చేపట్టిన కార్యం సాధించేవరకూ పూర్తి అంకిత భావంతో కృషిచేయడం కార్యసిద్ధికి కావలసిన రెండో లక్షణం.

**సంయతేన్ద్రియః :** ముఖ్యంగా విద్యార్థి దశలో ఇంద్రియ నిగ్రహం చాలా అవసరం. మనస్సు బాహ్య ఆకర్షణలకు బానిస కాకుండా జాగ్రత్త వహించాలి. మానసిక శక్తినంతా ఒకే విషయంపై ఏకాగ్రం చేయగలిగితే కార్యసిద్ధి కరతలామలకం అవుతుంది.

మనకు ఏకాగ్రత ఎంత ఎక్కువ ఉంటే అంత త్వరగా సత్ఫలితాలను సాధించగలుగుతాం. జ్ఞానసముపార్జనకు ఏకాగ్రత ఒక్కటే సరైన మార్గం. అధీనంలో లేని మనస్సు మన వినాశనానికి హేతువుగా పరిణమిస్తుంది.

> The Mind uncontrolled and unguided will drag us down for ever - rend us, kill us; and the mind controlled and guided will save us, free us. - *Swami Vivekananda*

**యస్త్వవిజ్ఞానవాన్ భవతి అయుక్తేన మనసా సదా ।**
**తస్యేంద్రియాణి అవశ్యాని దుష్టాశ్వా ఇవ సారథేః ॥** (కఠోపనిషత్తు)

మనస్సును అదుపు చేయకుండా విచ్చలవిడిగా వదిలేసే వారి ఇంద్రియాలు సారథి చేతిలో అదుపు తప్పిన దుష్ట అశ్వాల లాగ ప్రమాదాన్ని తెచ్చిపెడతాయి.

విలువిద్యలో శిక్షణను ఇవ్వడానికి గురువు అంగీకరించనప్పటికీ ఏకలవ్యుడు నిరాశ చెందకుండా 'శ్రద్ధ'తో సాధన చేసి లక్ష్యాన్ని సాధించాడు. అతడు ఆశించిన రంగంలో ప్రావీణ్యం పొందడానికి తన మనస్సులో వేరే ఆలోచనలు రానీయకుండా 'ఏకనిష్ఠ'తో మనసును కేంద్రీకరించాడు. యుక్త వయస్సులో ఉన్న ఏకలవ్యుడు 'ఇంద్రియ నిగ్రహం' పాటించి ఎలాంటి ప్రలోభాలకూ లోనుకాకుండా ఏకాగ్రతతో కృషి చేశాడు.

విద్యాసముపార్జనలో విద్యార్థికి ఉండవలసిన మూడు లక్షణాలు – శ్రద్ధ, ఏకనిష్ఠ, ఇంద్రియ నిగ్రహం ఏకలవ్యుని జీవితంలో సంపూర్ణంగా ప్రతిబింబించాయి. కాబట్టి విద్యార్థులు 'ఏకనిష్ఠలో అగ్రగణ్యుడైన ఏకలవ్యుణ్ణి' ఆదర్శంగా తీసుకొని ఆత్మన్యూనతను వదిలి, ఆత్మవిశ్వాసంతో ముందుకు పయనిస్తే విజయం తథ్యం.

# పడవలో నుంచే ప్రదక్షిణ

స్వామి వివేకానంద రెండోసారి అమెరికా వెళ్ళడానికి 1899 జూన్ నెలలో కలకత్తా నుంచి బయలుదేరారు. ఆయనతో పాటు స్వామి తురీయానంద, సోదరి నివేదిత కూడా ప్రయాణమయ్యారు. వాళ్ళు ఎక్కిన ఓడ మద్రాసు మీదుగా సముద్రజలాలలో పయనిస్తోంది. అయితే మద్రాసు నగరంలోకి ప్రవేశించాలన్న వాళ్ళ కోరిక తీరలేదు. కలకత్తాలో ప్లేగువ్యాధి ప్రబలంగా వ్యాపించినందున, కలకత్తా నుంచి బయలుదేరిన ఓడలోని జనం ఎవరూ మార్గమధ్యంలో ఇతర ప్రదేశాలలో సంచరించరాదని ఆంక్షలు విధించారు. అందువల్ల నౌక మద్రాసుకు చేరినా, అది సముద్రతీరం నుంచి కొంత దూరం లోపలే (సముద్రంలో) ఆగిపోవలసి వచ్చింది. ఒడ్డు నుంచి బాగా దూరంలో ఓడను నిలపడంవల్ల మద్రాసులోని భక్తులు ఎంతో నిరాశకు లోనయ్యారు. అయితే కొంతమంది భక్తులతో కలసి, స్వామి రామకృష్ణానంద ఒక చిన్న పడవలో ప్రయాణించి, స్వామీజీ ఉన్న ఓడను చేరుకున్నారు. స్వామీజీ కోసమని స్వామి రామకృష్ణానంద పిండి వంటలను, తీపి కాజాలను తానే స్వయంగా తయారుచేసి వాటి నన్నింటినీ పెద్ద పెద్ద డబ్బాలలో సర్ది తీసుకువచ్చారు. ఓడ పైభాగంలో అంచువద్దనే నిల్చొని, కొద్దిగా ముందుకు వంగి, స్వామి వివేకానంద పడవలో ఉన్న స్వామి రామకృష్ణానందతో మాట్లాడారు. శ్రీరామకృష్ణుల పూజ కోసం స్వామి వివేకానంద కలకత్తా నుంచి ఒక పింగాణీ జాడీ నిండా గంగాజలం తీసుకువచ్చారు. స్వామి రామకృష్ణానంద తాను తెచ్చిన భక్ష్యాలు, పళ్ళు, పువ్వులు, ఇతర కానుకలు అన్నీ గంపలో పెట్టి తాళ్ళ సాయంతో ఓడ పైకి పంపించారు. ఓడ పైనుంచి అదే గంపలో గంగాజలం ఉన్న పింగాణీ జాడీని స్వామి రామకృష్ణానందకు అందజేశారు.



స్వామి రామకృష్ణానంద

ఆ పరిస్థితులలో స్వామి వివేకానంద పాదాలకు నమస్కారం చెయ్యడానికి స్వామి రామకృష్ణానందకు వీలు కలుగలేదు. కనీసం స్వామీజీకి ప్రదక్షిణ చెయ్యాలి అని ఆయన సంకల్పించారు. తనతోపాటు పడవలో వచ్చిన వ్యక్తిని, "దయచేసి ఓడ చుట్టూ పడవను ఒకసారి తిప్పాల్సిందిగా పడవ నడిపేవాళ్ళి అడగండి. ఆ మహాత్ములు ఇద్దరి (స్వామి వివేకానంద, స్వామి తురీయానంద) పాదాలు అంటి నమస్కరించే భాగ్యం మన కెలాగూ లేదు. కనీసం వారికి ఒక్క ప్రదక్షిణమైనా చేద్దాం" అని అన్నారు. ఆవిధంగా స్వామి రామకృష్ణానంద పడవ నుంచే ప్రదక్షిణ చేశారు. తన సోదర సన్యాస శిష్యులపై ఆయన ప్రదర్శించిన భక్తి ప్రపత్తులు భావి తరాల వారికి ఆదర్శనీయం. ❁



నేటికీ చెన్నై శ్రీరామకృష్ణ మఠంలో భద్రపరిచి ఉంచిన పింగాణీ జాడీ.

# గృహస్థ జీవితంలో భగవత్ప్రాప్తి

- స్వామి జ్ఞానదానంద



గృహస్థ జీవితం గడిపేవారికి భగవత్ప్రాప్తి అవుతుందా అనే ప్రశ్న చాలామంది మనస్సులలో ఉదయిస్తుంటుంది. సూక్ష్మంగా చెప్పాలంటే ధర్మ విరుద్ధమైన పనులు చెయ్యకుండా గృహస్థ జీవితం గడిపితే తప్పకుండా భగవత్ప్రాప్తి లభిస్తుంది. అసలు భగవంతుడు ఎప్పుడూ మనలోనే ఉంటాడు. కానీ మన మనస్సు కలుషితమై ఉండడం వల్ల భగవంతుణ్ణి దర్శించలేక పోతున్నాం. ధూళి పేరుకున్న అద్దంలో మన ప్రతిబింబం మనకు కనిపించదు. అద్దాన్ని శుభ్రం చేస్తున్న కొద్దీ బాగా కనిపిస్తుంది. మన మనస్సనే అద్దంలో భగవంతుణ్ణి చూసే ప్రయత్నం చేస్తే ఆ భగవంతుడు మనకు తప్పక కనిపిస్తాడు. మనస్సనే అద్దం కలుషితమైతే మనలో భగవంతుడు ఉన్నప్పటికీ మనకు కనిపించడు.



మరి మన మనస్సనే అద్దాన్ని ఎలా శుభ్రపరచడం? దాన్ని శుభ్రపరచడానికి గృహస్థ జీవితాన్ని త్యజించి అడవుల్లోకి వెళ్ళిపోవాలా? అలా చెయ్యక్కరలేదు. మన మనస్సులో కల్మషం పేరుకోకుండా సంసార జీవితం గడపాలి. అంతేకాదు ముందుగా పేరుకొని ఉన్న కల్మషాన్ని క్రమంగా పోగొట్టుకోవాలి. మానవులు రెండు విధాలుగా జీవితం గడుపుతారు. ఒక రకం వాళ్ళు తమకంటూ ఒక నిర్దిష్టమైన లక్ష్యం లేకుండా జీవితం గడిపేస్తారు. అలాంటి వారి ప్రవృత్తి పశు ప్రవృత్తి. భౌతిక సుఖాల కోసమే జీవితం అనుకుని అలాగే గడుపుతారు. రెండోరకం ఏమిటంటే జీవిత లక్ష్యం భగవత్ప్రాప్తి అనుకొని, దాని కోసమే పనులన్నీ చేస్తారు. తదనుగుణంగా జీవితాన్ని మలచుకుంటారు. మొదటిరకం వారికి దేవుడు దొరకడు. ఎందుకంటే వాళ్ళు భగవంతుణ్ణి కోరడం లేదు. సుఖాలే కోరుకుంటున్నారు. రెండోవిధంగా జీవితాన్ని గడిపే వాళ్ళు తప్పకుండా దైవకృపకు పాత్రులవుతారు. ఎందుకంటే వాళ్ళు ఏ పని చేసినా భగవదర్పిత బుద్ధితో చేస్తారు.

సంసారంలో ఉంటూ భగవంతుణ్ణి పొందడం సాధ్యమా అని ఒకరు శ్రీరామకృష్ణుల్ని అడిగారు. ఆయన "సాధ్యమే" అన్నారు. "నువ్వు సంసారంలో ఉంటావు కాని నీలో సంసారం ఉండకూడదు. ఎలాగంటే పడవ నీటిలో ఉంటుంది; పడవలో నీరు కాదు. పడవలోకి నీరు చేరితే పడవ మునిగి పోతుంది. అలాగే సంసారం మనిషిలో ఉంటే మనిషిని ముంచేస్తుంది"అన్నారు.

మరి మనం సంసారంలో ఉంటూ, సంసారం మనలో ఉండకూడదన్నది ఎలా సాధ్యం? దానికి భగవద్గీతలో చెప్పిన ఉపాయమే 'కర్మయోగం'. తామరాకు నీటిలో ఉన్నా నీరు అంటనట్లు సంసార జలాల నుంచి మనల్ని దూరంగా ఉంచే రసాయనం పేరు కర్మయోగం. మనం యోగభావంతో చేసే పని కర్మ యోగం; మనస్సు మీద పేరుకున్న దుమ్మును శుభ్రం చేసే సాధనమవు తుంది అదే. అసలు కర్మయోగమంటే కర్మ, అకర్మ, వికర్మ అనే వాటి అర్థాలు తెలుసుకుని అకర్మ, వికర్మలను త్యజించి, కర్మను భగవంతునికి సమర్పిస్తూ చెయ్యడమే. కర్మ అంటే మనం చేయాల్సిన కర్తవ్యం. అకర్మ అంటే సోమరితనం, చేయాల్సిన పనుల్లో ఉత్సాహం లేకపోవడం. వికర్మ అంటే విపరీత కర్మలు- శాస్త్రాలను నిందించడం, భగవంతుడి పూజల్ని నిరసించడం లాంటి అశుభ కర్మలు. అందుకని కర్మయోగం చెప్పేది అకర్మ, వికర్మలకు దూరంగా ఉంటూ మనస్సునూ, బుద్ధినీ భగవంతుడికి అర్పించి కర్మ చెయ్యమని! మన పనులన్నీ చేసేవాడూ, చేయించేవాడూ దేవుడే అనే భావంతో చెయ్యాలి. ఫలితాన్ని కూడా దేవుడికే అర్పించాలి. ఫలితం ఆశించకూడదు. మనం అన్నిటికీ నిమిత్త మాత్రులమే అన్న భావం కలిగి ఉంటే గృహస్థ జీవితం గడుపుతున్నా భగవత్ప్రాప్తి సాధ్యమే! ❁



# శ్రీగురు ప్రార్థన

రచన: దేవేంద్రనాథ్ మజుందార్
వ్యాఖ్యానం: స్వామి మేధానందపురి

**భవసాగర తారణ కారణహే రవినందన బంధన ఖండనహే ।
శరణాగత కింకర భీతమనే గురుదేవ దయాకర దీనజనే ॥**

జన్మ మృత్యు రూపమైన సంసార సాగరం నుండి తరింప చేయడానికి గురుదేవులే కారణం. దాసుడనైన నేను భయభీతుడనై నీ శరణు జొచ్చాను. హే గురుదేవా, ఈ దీనునిపై దయచూపు!

యస్యదేవే పరాభక్తిర్యథా దేవే తథాగురౌ
తస్యై తే కథితాహ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః
(శ్వేతాశ్వతరోపనిషత్తు: 6-23). ఆ పరతత్త్వం పట్ల ఎంత భక్తి శ్రద్ధలున్నాయో అంతే భక్తిశ్రద్ధలు గురువు పట్ల ఉన్న వారికి శాస్త్రజ్ఞానం లభించి, ముక్తి పొందుతారు. గురుభక్తి కలవారిని భవసాగరం నుండి దాటించే వారు గురువులు. అన్నగారైన సనత్కుమారుని పట్ల గురుభక్తి గల నారదుడు తరించాడు. శ్రీరామకృష్ణుల పట్ల భక్తి గల గిరీష్ చంద్రఘోష్ తరించాడు. ఈ గురుభక్తులు యమపాశాల నుండి విడివడతారు. అందుకే గురుదేవులను 'భవబంధాలను ఖండించేవారు' అని స్తుతించారు.

**హృది కందర తామస భాస్కర హే తుమి విష్ణు ప్రజాపతి శంకరహే।
పరబ్రహ్మ పరాత్పర వేద భణే గురుదేవ దయాకర దీనజనే ॥**

సర్వవ్యాపకుడైన పరమాత్మ గురురూపంలో సూర్యునిలా హృదయంలో ప్రకాశించి, అంధకారమయమైన అజ్ఞానాన్ని తొలగిస్తాడు. బ్రహ్మ విష్ణు మహేశ్వరుల స్వరూపము, సాక్షాత్ పరబ్రహ్మ స్వరూపము అయిన గురుదేవులకు నమస్కారం. వేదాలు గురువులను శ్రేష్ఠమైన నిరాకార నిర్గుణ పరబ్రహ్మంగా వర్ణిస్తున్నాయి. గురుదేవా, ఈ దీనునిపై దయ చూపు.

దివ్యజ్ఞానోపదేష్టారం దేశికం పరమేశ్వరమ్ ।
పూజయేత్పరయా భక్త్యా తస్య జ్ఞానఫలం లభేత్ ॥ (యోగశిఖోపనిషత్)

అతి దివ్యమైన పరమాత్మ జ్ఞానాన్ని ఉపదేశించే గురువు సాక్షాత్ పరమేశ్వర స్వరూపుడు. అలాంటి గురువును భక్తితో పూజించే వారికి జ్ఞానఫలం లభ్యమవుతుంది.

**మనవారణ శాసన అంకుశ హే నరత్రాణ తరే హరి చాక్షుషహే।
గుణగాన పరాయణ దేవగణే గురుదేవ దయాకర దీనజనే ॥**

బంధమోక్షాలకు ఈ మనస్సు కారణం. బహిర్ముఖమై, మత్తగజంలా విజృంభించే ఈ మనస్సును అరికట్టడానికి గురువులు అంకుశం లాంటివారు. మానవ మాత్రులను ఉద్ధరించడానికి మానవావతారమెత్తి ప్రత్యక్షంగా గోచరించావు కనుకనే దేవతలందరూ నీ గుణగాన సంకీర్తనలలో మునిగి ఉన్నారు. హే గురుదేవా, ఈ దీనునిపై దయ చూపు.

**కులకుండలినీ ఘుమభంజకహే హృదిగ్రంథి విదారణ కారకహే।
మమ మానస చంచల రాత్రదినే గురుదేవ దయాకర దీనజనే ॥**

స్వామి బ్రహ్మానందజీని ఒక భక్తుడు "కుండలినీ శక్తి ఎలా జాగృతమవుతుంది"అని అడగగా "జపం వలన" అని చాలా సరళమైన జవాబిచ్చారు.

గురుదేవుల స్మరణ వల్ల కుండలినీ శక్తి జాగృతమై, అజ్ఞాననిద్ర తొలగి ఆధ్యాత్మికోన్నతి కలుగుతుంది. ప్రపంచంలో ఉన్నవి రెండే పదార్థాలు - ఒకటి చైతన్యం, రెండవది జడం. మనస్సు, ఇంద్రియాలు, శరీరం జడ పదార్థాలు. వీటిని ప్రకాశింపజేసేది ఆత్మ చైతన్యం. మనం కలలో చూసే ప్రకాశం ఈ స్వయం ప్రకాశరూపమైన ఆత్మ. ఈ చైతన్యం జడం నుంచి వేరైనా అజ్ఞానం వల్ల ఒకదాని మీద మరొక దాన్ని ఆరోపించి వ్యవహరిస్తున్నారు. జడం మీద చైతన్యాన్నీ, చైతన్యం మీద జడాన్నీ ఆరోపించి తాదాత్మ్యంగా వ్యవహరించడానికి గల కారణాన్నే హృదయ

గ్రంథి అన్నారు. దాన్ని ఖండించే వారు గురువులు.

విషయానురాగం వల్ల రాత్రీ-పగలూ చంచలమైన ఈ దీనుని మనస్సుపై దయ చూపి రక్షించు గురుదేవా!

**విపుల సూదన మంగళ కారక హే సుఖశాంతి వరాభయ దాయకహే।**
**త్రయ తాపహరే తవ నామగుణే గురుదేవ దయాకర దీనజనే॥**

శబ్దంలో ఒక అచింత్య శక్తి ఉంది. ఒక సాధారణ లౌకిక శబ్దం ఎదుటివాణ్ణి కోపిష్టిగా మార్చగలదు. వాడి రక్తం ఉడికి దెబ్బలాడడానికి సిద్ధపడతాడు. ఇది శబ్దానికి గల శక్తి. అలాగే గురువు ఇచ్చిన వేదోక్త మంత్రాలకు ఎంత శక్తి ఉంటుందో ఊహించగలం! గురువు ద్వారా పొందిన మంత్రోచ్చారణ ద్వారా మనస్సు శుద్ధి అయి కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలనే అరిషడ్వర్గాలు నశించి, శుభం కలుగుతుంది. అంతే కాకుండా గురుభక్తి సుఖ శాంతులనూ, అభయవరదానాలనూ లభింప చేస్తుంది. జగన్మాత శారదాదేవి "కష్టకాలంలో నీకు అండగా నేనున్నాను. నన్ను స్మరిస్తే చాలు నీ కష్టాలు తొలగిపోతాయి" అని హామీ ఇచ్చిన సంగతి అందరికీ తెలిసినదే! ఆధిదైవిక, ఆధ్యాత్మిక, ఆధిభౌతిక తాపత్రయాలను నశింపజేసే ఓ గురుదేవా ఈ దీనునిపై దయ చూపు!

**అభిమాన ప్రభావ విమర్దకహే గతిహీన జనే తుమి రక్షకహే।**
**చిత శంకిత వంచిత భక్తి ధనే గురుదేవ దయాకర దీనజనే॥**

అభిమానం (అహం) వల్లనే రావణుడు ఎవరి మాటా వినకుండా వంశంతో సహా నశించాడు. అలాగే దుర్యోధనుడు అభిమానం వల్లనే కృష్ణ పరమాత్మ సూచించిన సంధికి ఒప్పుకోక పోవడంతో ఆ వంశం పూర్తిగా నశించింది. గురువులు అలాంటి అహాన్ని తొలగిస్తారు. దిక్కులేని వారికి దేవుడే దిక్కు అంటారు. అలాగే గతి లేని వారికి గురువులే రక్షకులు.

**తవ నామ సదాశుభ సాధకహే పతితాధమ మానవ పావకహే।**
**మహిమా తవ గోచర శుద్ధమనే గురుదేవ దయాకర దీనజనే॥**

సనాతన ధర్మాచరణంలో ఆధ్యాత్మిక గురువులకు ఒక విశేషస్థానముంది. మాయాంధకారాన్ని తొలగించేవారు గురువులు. గురువులు జ్ఞాన ప్రదాతలు. భాగవత - భక్త - భగవానులకు తేడా లేదని శ్రీరామకృష్ణుల వారు చెప్పినట్లు ఈశ్వరునికీ - ఆత్మకీ - గురువుకీ భేదం లేదని భాష్యకార భగవానులు శంకర భగవత్ పాదులు చెప్పారు. అలాంటి గురునామస్మరణ శుభాన్ని కలుగచేస్తుంది.

*అపిచేత్సు దురాచారో భజతే మామనన్యభాక్।*
*సాధురేవ స మన్తవ్యః సమ్యగ్ వ్యవసితో హి సః॥*

*(గీత 9.30)*

తులసీదాసు, బిల్వమంగళుడు, రత్నాకరుడు మొదలైన దురాచారులు భగవన్నామ సంకీర్తన వల్ల తరించారు. అలాగే అధములనూ, పతితులనూ పవిత్రులను గావించి, మంచి నడవడి గల వారిగా తీర్చిదిద్దుతుంది గురువుల నామస్మరణ. అంతేకాక నిర్మలమైన మనస్సుగల వారికి గురువులు ప్రత్యక్షంగా దర్శనమిచ్చి, వారి మహిమను వెల్లడిస్తారు. హే గురుదేవా! ఈ దీనునిపై దయ చూపు.

**జయ సద్గురు ఈశ్వర ప్రాపకహే భవరోగ వికార వినాశకహే।**
**మన యేన రహే తవ శ్రీచరణే గురుదేవ దయాకర దీనజనే॥**

ఓ గురుదేవా! భవరోగమనే వికారాన్ని నశింపజేసేవాడివి నువ్వు. ఈ దీనుని మనస్సు నీ పాద పద్మాలపై లగ్నమయ్యేలా దయ చూపించు!

*జ్ఞానం వినా ముక్తి పదం లభ్యతే గురుభక్తితః*
*గురోస్సమానతో నాన్యత్సాధనం*
*గురోర్మార్గిః గురుమార్గిణామ్॥ (గురుగీత)*

శివపార్వతుల సంవాద రూపమైన గురుగీత స్కంద పురాణంలోది. సరైన జ్ఞానం లేకపోయినా కేవలం గురుభక్తి వల్లనే మోక్షం కలుగుతుంది. అందుకే గురువుల నుండి దీక్ష గ్రహించి, వారు చెప్పిన మార్గంలో నడిచే వారికి గురుభక్తి కన్నా మరొక సాధనం లేదు. ఈ గురుగీతలో చెప్పినట్లు ఈశ్వరుణ్ణి సాక్షాత్కారింపజేసే సద్గురువులైన మీకు జయఘోషలు. ❀

**( జూలై 18న గురుపూర్ణిమ )**

# దేవీ వైభవం

ప్రవచనం: శ్రీ సామవేదం షణ్ముఖశర్మ     విలేఖనం: శ్రీమతి ఎన్. శేషు

(గత సంచిక తరువాయి)

ఒకసారి దేవతలు రాక్షసుల్ని ఓడించి విజయోత్సవం జరుపుకొంటున్నారు. తాము ఎంత బాగా పోరాడారో, ఎలా విజృంభించారో అన్నీ చెప్పుకుంటున్నారు. అయితే సర్వవ్యాపకమైన చైతన్యం అన్నీ పరిశీలిస్తుంటుంది. ఆ శక్తికి దయ కలిగితే అహంకారం మీద ఒక దెబ్బ వేస్తుంది. అంతలో ఒక మహానాదం వినిపించి, ఒక మహాతేజం కనిపించిందట. దేవతలకు ఆ తేజో పుంజం ఏమిటో అర్థం కాలేదట. అర్థం కాకపోతే అర్థమవడానికి భగవంతుడు ఆకారం ధరిస్తాడు. అదే ఆకార - నిరాకారాల సమన్వయం. అర్థం కాని పరబ్రహ్మతత్త్వం మనకు అర్థం కావడానికి తనకు తాను ఆకారం కల్పించుకుంది. ఆ రూపం ఒక యక్షుని రూపంలా ఉంది. ఆ యక్షుడు వారికి చిన్న పరీక్ష పెట్టగా దేవతలు ఒక్కొక్కరూ ఓడిపోయి తలలు వంచుకున్నారు. చివరకు దేవేంద్రుణ్ణి పంపారట. వెంటనే యక్షుడు అంతర్ధానమై పోయాడట. ఇంద్రుడు అక్కడ ధ్యానం చేస్తూ నిలబడ్డాడట అంటే అహంకారం వదిలి ఆశ్రయించడం మొదలు పెట్టాడన్న మాట. ఆశ్రయించిన వారికే జ్ఞానం. భక్తికే దేవుడు పలుకుతాడు కానీ అహంకారానికి దొరకడు. ఆ విషయాన్నే నారదుల వారు తన భక్తి సూత్రాలలో "ఈశ్వరస్యాప్యభిమాన ద్వేషిత్వాత్ దైన్య ప్రియత్వాత్" అని చెప్పారు. ఈశ్వరుడు అహంకార విద్వేషి, దైన్యప్రియుడు; అహంకార రాహిత్యమే దైన్యం.

ఇంద్రుడు భక్తిగా ఆ చైతన్యాన్ని ధ్యానం చేయగానే అంతవరకూ యక్షునిలా కనిపించిన ఆ రూపం స్త్రీ రూపంలో కనిపించిందట. అప్పుడు ఇంద్రుడు "అమ్మా నువ్వెవరు, ముందు కనిపించిన ఆయనెవరు, ఆ జ్యోతి ఎవరు" అని అడిగాడట. దివ్యమైన ఆకాశంలో చక్కని స్త్రీగా ఆవిర్భవించినది ఆ పరబ్రహ్మం. ఆవిడ ఎవరంటే "బహుశోభమానాం ఉమాం హైమవతీం...". హిమవత్పర్వత రాజ పుత్రిక పార్వతి; అతడు "సా బ్రహ్మేతి హోవాచ" అని చెప్పింది ఆమె. సా బ్రహ్మ: సః బ్రహ్మ: తత్ బ్రహ్మ: - అంటే తత్ అనే అనిర్వచనీయమైన దానిని పుంలింగంలో సః అనీ, స్త్రీ లింగంలో సా అనీ అన్నారు; అనిర్వచనీయమైన బ్రహ్మాన్ని, "తత్" అంటే అది, ఆమె అంటే "సా", అతడు అంటే "సః" అని తెలుస్తుంది. అహంకారం పోగొట్టడానికి ఆయన వచ్చారు, విద్య చెప్పి అనుగ్రహించడానికి ఆవిడ వచ్చారు. ఆయన ఉండడం వల్లే దేవతలందరికీ వారి వారి శక్తులు వచ్చాయి. బ్రహ్మలో బ్రహ్మత్వం, సర్వ దేవతల్లో దేవత్వం ఆ తల్లే. అతడు బ్రహ్మమయితే ఆవిడ బ్రహ్మవిద్య. బ్రహ్మం వేరు బ్రహ్మవిద్య వేరు కాదు. బ్రహ్మమే బ్రహ్మం గురించి చెప్పగలదు. బ్రహ్మము శివుడు. బ్రహ్మము యొక్క శక్తి బ్రహ్మ విద్య పార్వతి. "పార్వతీ పరమాదేవీ బ్రహ్మ విద్యా స్వరూపిణీ" అని శివపురాణం స్పష్టం చేసింది. అమ్మను బాగా అర్థం చేసుకుంటే అమ్మ, అయ్య ఒకటే అని అర్థమవుతుంది. విశ్వమంతా వరుసనున్న చైతన్యం ఆ పరమేశ్వరునిది. వ్యక్తమైతే అమ్మ, అవ్యక్తమైతే అయ్య. "వ్యక్తమంబామయం సర్వం అవ్యక్తం తు మహేశ్వరం" అని శాస్త్రం చెబుతోంది. కనుక వ్యక్తావ్యక్తాలకు భేదం లేదు. వ్యక్తం ద్వారా అవ్యక్తాన్ని గ్రహించగలం. ఈ తత్త్వం అమ్మవారు బోధించారు. ఇదే శ్రీవిద్య అన్నది. దీనితో ఆ దేవతల అహంకారాలు పోయాయి. అమ్మవారు చెప్పిన బ్రహ్మవిద్యే శ్రీవిద్య.

(కలిదోషం వల్ల మొత్తం బ్రహ్మ విద్యా సంప్రదాయం దెబ్బతింటున్న సమయంలో ఉద్భవించిన ఆదిశంకర భగవత్పాదులు ఈ బ్రహ్మ విద్యాసంప్రదాయాన్ని ప్రతిష్ఠచేసి ఉపనిషత్తులకు భాష్యం రచించారు.) లలితా సహస్రంలో "ఆత్మవిద్యా మహావిద్యా శ్రీవిద్యా కామ సేవితా
శ్రీషోడశాక్షరీ విద్యా త్రికూటా కామకోటికా" అని చెప్పబడింది. సర్వోపనిషత్ ప్రతిపాద్యమైన ఆత్మ తత్త్వమేదో అమ్మ తత్త్వం అదే. మనలో ఉన్న ఆత్మ, ఆత్మ చైతన్యం రెండూ కూడా అమ్మ స్వరూపమే. బ్రహ్మాండ పురాణంలో లలితా దేవి ఎవరు అంటే "స్వాత్మైవ దేవతా ప్రోక్తా లలితా విశ్వవిగ్రహా" అని ఉంది. విశ్వమంతా వ్యాపించిన చైతన్యమే ఆత్మ. సర్వ జగత్తులో భిన్నాలు కనిపిస్తున్నా ఏకమైన చైతన్యం ఒక్కటే. కనుక అమ్మవారు "విశ్వ విగ్రహా లలితా"

విశ్వవ్యాపకమైన మహాచైతన్యం. మన దైవం విశ్వ వ్యాపకమైన చైతన్యమని తెలిస్తే విశ్వంలో ప్రతి అణువు నుంచీ దైవం మనల్ని రక్షిస్తాడు. దీనికి ఉదాహరణ ప్రహ్లాదుడే.

సర్వవ్యాపకమైన తత్త్వాన్ని చైతన్యం అన్నారు. ఆ చైతన్యమే అసలు అందం. అందుకు ఆ తల్లికి సుందరి అని మరొక పేరు. ఇప్పుడు పరాశక్తి యొక్క సుందరీ విద్య గురించి చెప్పుకోబోతున్నాం. అమ్మవారు అంటే సర్వవ్యాపకమైన చైతన్యం అనీ, ఉపనిషత్తులు ప్రతిపాదిస్తున్న ఆత్మ తత్త్వానికి అమ్మవారు భిన్నం కాదనీ చెప్పుకున్నాం. అదే సౌందర్యం అని



తెలుసుకోవాలి. సర్వ చైతన్యమూ అమ్మ అన్నది మొదటి అంశం, ఈ చైతన్యమే అందం అని రెండవ అంశం. నిత్య పరిణామ శీలమైన జగతిలో చైతన్యం నిరంతరం ప్రసరిస్తూ ఉంటుంది. మనం, పుట్టిన దగ్గర నుండీ నేననే చైతన్యం ఉంటుంది; పుట్టిన దగ్గర్నుండీ పోయే వరకూ అటు తరువాత మరొక ఉపాధిలోకి ప్రవేశించినా నిరంతర ప్రవాహశీలంగా ఆ చైతన్యం కదులుతోంది. సర్వ జగత్తులోనూ చైతన్యం ప్రవహిస్తోంది. ప్రవాహానికి లహరి అని మరొక అర్థం ఉంది. చైతన్యం లహరి రూపంలో జగత్తులో ఉంది కనుక శంకరులవారు తన గ్రంథానికి పేరు "సౌందర్యలహరి"అన్నారు. తద్వారా ఆయన శ్రీవిద్యయే సౌందర్యలహరి అన్నారు. శ్రీవిద్య అధిష్ఠాన దేవత పేరు సుందరి. ఈ సుందరి ఎక్కడుంది అంటే, అమ్మ త్రిపుర అన్నారు. అంటే మూడు పురముల యందు ఉన్న సుందరి. పురం అంటే చోటు అని అర్థం. ఏమిటా మూడు పురములు అంటే మూడు లోకాలు - ఊర్ధ్వ, మధ్య, అధో లోకాలు. కాలాన్ని కూడా చోటు అంటారు కనుక భూత, వర్తమాన, భవిష్యత్ అనే మూడు కాలాలు. ఇంకొకటి ఓంకారం. దీనిలో అకార ఉకార మకారాలు ముఖ్యమైనవి. అందుకు అమ్మవారికి 'ఆద్యాం విద్యాం చ ధీమహి' అని పేరు. ఆద్యా అంటే మొదటిది. "అ" ఆదిగా కలది ఆద్యా అని నిర్వచనం; అంటే ప్రణవ స్వరూపిణి. అకార ఉకార మకారాత్మకమైన ప్రణవమే త్రిపురం. ముజ్జగాలూ త్రిపురాలు, ముక్కాలాలూ త్రిపురాలు, ఈ మూడు పురాల్లో ఉండే అందమే త్రిపురసుందరి. ఆద్యాం అంటే మరొక అర్థం కూడా ఉంది. "అ"అకారం నుండి చెప్పబడిన మాతృకా వర్ణాలన్నీ ఆ తల్లి రూపాలు. అందుకే మాతృకావర్ణ రూపిణి, సర్వాక్షర స్వరూపిణి.

అలా సృష్టి అంతా మూడింటిలోనే నిబద్ధమై ఉన్నదట. ఈ మూడంతా ఏదయితే నిండిపోయి ఉందో ఆవిడ ఒక్కటే. ఇప్పటి వరకూ బయటి మూడు చెప్పుకున్నాం. ఇక లోపలి మూడు: శరీరాలు మూడు - స్థూల, సూక్ష్మ, కారణ శరీరాలు. స్థూలంగా కనబడే శరీరం ఒకటి, దానికి ఆధారంగా ఉండే మనోబుద్ధ్యాత్మకమైన అంతఃకరణ రూప చైతన్యం మరొకటి, వాసనామయమైన జన్మల్ని తీసుకెళ్ళే కారణ శరీరం ఇంకొకటి. ఈ మూడింటికీ ఆధార చైతన్యం ఆ తల్లి. ఆ తల్లి ఈ మూడింటి లోనూ ప్రసరితమవుతోంది, ఈ మూడింటికీ అతీతంగా కూడా ఉందట. అందుకే 'త్రిపుర' అనే మాటకు ఉన్న అందం మరొక దానికి లేదు. త్రిపురములయందూ ఉన్నది. ఈ మూడింటిలో ఆ తల్లే ఉందిట. మూడు పురాలతో పాటు మూడు అవస్థలున్నాయి. అవి - జాగ్రత్, స్వప్న, సుషుప్తి అవస్థలు. మన జీవితం అంతా కూడా ఈ మూడు అవస్థల్లోనే ఉంటుంది. మన బ్రతుకు అనుభూతి అంతా మూడే. జాగ్రత్ అంటే మెలకువ. స్వప్నం అంటే కల. సుషుప్తి అంటే గాఢ నిద్ర. ఈ మూడూ ఉన్నప్పుడు ఎవరున్నారు? స్వప్నంలో జాగ్రత్ లేదు, నిద్రపోతున్నప్పుడు బాహ్యజగత్తు లేదు. జాగ్రత్‌లో స్వప్నం లేదు. ఈ రెండూ సుషుప్తిలో లేవు. కానీ ఈ మూడు అవస్థల్లో కూడా మనల్ని వదలని ఒక చైతన్యం ఉందే - అది ఆవిడే! "జాగ్రత్ స్వప్న సుషుప్తీనాం సాక్షి భూత్యై నమో నమః", అలా మూటిటిలోనూ ఆవిడ కనపడుతుంది. మన బ్రతుకంతా వీటితోనే తిరుగుతుంది. ❁ (సశేషం)




- స్వామి మేధానందపురి

- భాస్కరరావు, శ్రీకాకుళం

? : గురూపదేశం అంటే ఏమిటి?

జ: అజ్ఞానాన్ని తొలగించి ఆత్మజ్ఞానానికి సహకరించే బోధ గురూపదేశం. పూర్వకాలంలో శిష్యులు గురు సాన్నిధ్యంలో ఉంటూ గురుశుశ్రూష చేస్తూ గురువు ద్వారా ఉపదేశం పొందేవారు. శిష్యులు నిరంతరం గురువు పర్యవేక్షణలో ఉండడం వల్ల వారి మానసిక స్థితిని గమనించి గురువు ఉపదేశం చేసేవారు. ఈ కాలంలో ఆ విధంగా ఉపదేశం పొందడం కష్టం. అందువల్ల గురువులు సాకార సగుణ బ్రహ్మనామాన్ని మంత్ర రూపంలో ఉపదేశిస్తున్నారు. ఈ మంత్ర దీక్షనే గురూపదేశం అంటారు. దీర్ఘకాల నిరంతర మంత్ర జపం చేయడం వల్ల మనసు పవిత్రమవుతుంది.

- రామానుజం, తిరుపతి

? : ప్రాణాయామం ఎలా చేయాలి? ఏకాగ్రత ఎలా కలుగుతుంది?

జ: ప్రాణాయామం అష్టాంగయోగంలో ఒకటి. ప్రాణాయామాన్ని అభ్యసించినట్లయితే ఏకాగ్రత కలుగుతుంది. కానీ ప్రాణాయామాన్ని సరియైన గురువుల వద్ద అభ్యసించాలి. గురువు లేకుండా ప్రాణాయామాన్ని అభ్యసిస్తే విపరీత ఫలితాల్ని ఎదుర్కోవలసి వస్తుంది. నిరంతరం భగవన్నామాన్ని స్మరించడం వల్ల ఏకాగ్రత కలుగుతుంది. "అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే"- ఏకాగ్రతను సాధించాలంటే విషయ వస్తువులయందు విరాగాన్ని, భగవంతునియందు అనురాగాన్ని అలవర్చుకోవాలి. ఇది అభ్యాసం ద్వారానే సాధ్యమవుతుంది.

- శివరామ్, ఒంగోలు

? : పడుకొని నామస్మరణ చేయవచ్చునా?

జ: అపవిత్రః పవిత్రో వా సర్వావస్థాం గతోఽపి వా ।
యః స్మరేత్ పుండరీకాక్షం స బాహ్యాభ్యంతరశ్శుచిః ॥

పవిత్రుడైనా, అపవిత్రుడైనా సర్వావస్థల్లోనూ ఎవరు ఆ భగవంతుణ్ణి స్మరిస్తారో వారి అంతరంగం, బాహ్యం శుద్ధి అవుతుంది. సత్త్వగుణం వృద్ధి చెందుతుంది. "సమం కాయశిరోగ్రీవం" (6-13) అని గీతోక్తి కదా! పడుకొని నామస్మరణ చేయడం వల్ల నిద్రలోనికి జారుకునే ప్రమాదం ఉంది. కాబట్టి జపం కూర్చొని చేయడం ఉత్తమం. ❀

## 'నా జీవితంలో స్వామి వివేకానంద'



జీర్ణమైన దుస్తుల్ని త్యజించినట్లు ఈ శరీరాన్ని త్యజించినా నా భావాలతో ముందు తరాలను నిరంతరం చైతన్య పరుస్తూనే ఉంటాను అనేవారు స్వామి వివేకానంద. విశ్వానికే ఆత్మవిశ్వాసాన్ని ప్రబోధించిన యుగపురుషుడాయన. ఆబాల గోపాలాన్నీ ఉత్తేజపరిచే ఉత్తుంగ చైతన్య సాగరం స్వామీజీ.

స్వామి వివేకానంద ఈ ప్రపంచం నుంచి భౌతికంగా నిష్క్రమించి ఒక శతాబ్దం అయినా వారి స్ఫూర్తి మాత్రం ఆచంద్రార్కం మనల్ని మేల్కొలుపుతూనే ఉంటుంది. అలా ఆ మహనీయుని జీవితంతో ఉత్తేజితులైన వారి అనుభూతులకూ, అనుభవాలకూ 'శ్రీరామకృష్ణ ప్రభ' స్వాగతం పలుకుతోంది.

స్వామి వివేకానంద జీవితంలోని ఒక సంఘటన కావచ్చు, సంభాషణ కావచ్చు... ఉత్తరం కావచ్చు, ఉపన్యాసం కావచ్చు... ఏదైనా మిమ్మల్ని మహత్తరంగా ప్రభావితం చేసి ఉంటుంది. ఆ అనుభూతినీ, అనుపమానమైన స్ఫూర్తినీ 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులతో పంచుకోండి.

సమస్యల సాగరంలో చిక్కుకొని, చుక్కాని లేని నావ లాగ అగమ్యగోచరమైన నేటితరానికి స్వామి వివేకానంద సాహిత్యం ఆశాదీపమని మీ అనుభవాలు నిరూపిస్తాయి. మీ అనుభవాలనూ, అనుభూతులనూ వ్రాసి మీ ఛాయాచిత్రం (కలర్ ఫోటో)తో సహా పంపిస్తే 'నా జీవితంలో స్వామి వివేకానంద' అనే శీర్షికలో ప్రచురిస్తాం. ❀

మీ అనుభవాలను, భావాలను పంపవలసిన చిరునామా

**'నా జీవితంలో స్వామి వివేకానంద'**

శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం, దోమలగూడ, హైదరాబాద్ - 500 029

E-mail : rkprabhayuvavani@gmail.com

ధీరవాణి 

- స్వామి వివేకానంద

# సుఖ దుఃఖాల సంగమం!

మంచీ చెడుల మిశ్రమమే ఈ లోకం. దుఃఖం కలిగినప్పుడు కొందరు క్రుంగి కృశించిపోతారు. మరికొందరు చెడు అనేది లేనేలేదని తలుస్తారు. సర్వం శుభప్రదమే అనుకొంటారు. అదీ దౌర్బల్యమే; కష్టాన్ని గురించిన భయమే అందుకు కారణం. దుర్వాసన వస్తుంటే దాని మీద పన్నీరు చల్లి, అది సౌరభాన్ని విరజిమ్ముతుందని అనుకోవడం ఎందుకు? ప్రపంచంలో మంచి చెడ్డలు రెండూ ఉన్నాయి - అవును భగవంతుడు లోకంలో మంచినీ, చెడునూ కలబోసి ఉంచాడు. అతడు చేసిన పనిని మనం ఎందుకు కప్పిపుచ్చాలి? చెడు ఎందుకు ఉందని ప్రశ్నించే అధికారం మనకు లేదు.

గురుదేవులు శ్రీరామకృష్ణులు జబ్బుపడ్డప్పుడు తన మనోసంయమంతో చికిత్స చేసుకోవలసిందని ఒక బ్రాహ్మణుడు సూచించాడు; దేహంలో రోగగ్రస్తమైన భాగంలో మనస్సును ఏకాగ్రంగా కేంద్రీకరిస్తే, అది స్వస్థత చెందుతుంది. ఆ సూచనకు శ్రీరామకృష్ణులు ఇలా అన్నారు: "ఏమిటేమిటీ ఈశ్వరార్పితమైన నా మనస్సును ఈ తుచ్ఛ శరీరం కోసం వినియోగించనా?" ఆయన మనస్సు నిరంతరం ఈశ్వరుడిపై లగ్నమై ఉండేది. ఆయన దాన్ని సంపూర్ణంగా ఈశ్వరుడికి అంకితం చేశారు. మరొక పనికి దాన్ని ఆయన వినియోగించరు.

చెడుతో పోరాడుతూ నేను దేహాన్నే భావిస్తాను. తలనొప్పి వస్తే చికిత్స కోసం ఆవేదనతో లోకమంతా తిరుగుతాను. అలాంటప్పుడు ఈ మహాపురుషులను నేను ఎలా అర్థం చేసుకోగలను? దైహిక సుఖం, సంకుచిత భావం, కష్టాలు, సుఖాలు, అపకారాలు, భోగాలు - వీటిని గురించిన ఆలోచనలు ఉన్నవారు మహాత్ముల మాహాత్మ్యాన్ని అర్థం చేసుకోలేరు. భౌతికతత్త్వం నుండి మనసును వేరు చేసి ఆత్మధ్యాన నిష్ఠులమైతేగాని ఈ ప్రపంచాన్ని అర్థం చేసుకోలేం.

ఆరోగ్యం, ఐశ్వర్యం, ఆయుర్దాయం, ఈ విధమైన లౌకిక విషయవస్తువుల నిమిత్తం ఆరాటపడడం భ్రమే! వీటి సమృద్ధికీ పరిపోషణకూ, రక్షణకూ మనస్సును వినియోగించడంవల్ల ఆ భ్రమ మరింత పెరుగుతుంది.

ప్రపంచమంతా స్వర్గతుల్యం అనే భ్రమ నుంచి బయటపడితే సుఖాన్నీ, దుఃఖాన్నీ సమంగా స్వీకరించగలిగే మానసిక శక్తి మనలో అలవడుతుంది.





# పరమేశ్వరుని పరిరక్షణలో ...

## స్వామి జపానంద స్వీయ అనుభవాలు - 13

(గత సంచిక తరువాయి...)

### భ్రమకు మూలం అజ్ఞానం

సన్యాసిని ఒక్కరినీ అక్కడ వదిలేసి మిగతా అందరూ గ్రామానికి తిరిగి వెళ్ళిపోయారు. క్రూర జంతువులు ఏవీ రాకుండా ధుని వెలిగించుకుని సన్యాసి గుమ్మానికి ఎదురుగా కూర్చున్నారు. ఏది వచ్చినా ఎవరు వచ్చినా ఆ ద్వారం ఒక్కటే మార్గం. నాలుగు వైపులా ఎత్తయిన గోడలున్నాయి. ఎదురుగా పెద్ద మైదానం. అది దాటితే నర్మదా నది. అమావాస్య అవడంతో అంతా కటిక చీకటిగా ఉంది. ధుని మంట తప్ప మరేమీ కనిపించడం లేదు. అప్పుడప్పుడు సింహ గర్జనతో అడవి అంతా మారు మ్రోగుతూ భయం కలిగిస్తోంది. ఇంకే చప్పుడూ లేదు. సన్యాసి మనస్సును ఏకాగ్రపరచుకునే ప్రయత్నం చేస్తున్నారు. అప్పుడే అక్కడకు 50 - 60 అడుగుల దూరంలో అకస్మాత్తుగా నీలం, పసుపు రంగులు కలిసిన జ్యోతి కనపడింది.

అదేమిటి అలా వెలుగు వచ్చింది అని అటు చూశారు. కొంచెం సేపు ఏమీ కనిపించ లేదు. చీకటి ఇంకా ఎక్కువ అవుతున్నట్లుంది. మళ్ళీ అక్కడే అలాగే మంట లాగ వెలుగు కనిపించింది అది దగ్గరకూ రాలేదు, దూరమూ జరగలేదు. ఒక నిర్దిష్టమైన స్థలం నుంచి వస్తున్నట్లు అనిపిస్తోంది. ఎదురుగా ఉన్న మైదానం రాళ్ళతో నిండి ఉంది. బురద కూడా లేదు, భూమి పొరల్లో ఉన్న విష వాయువు ఏదైనా బయటకు వచ్చి గాలితో కలిసి మంట వస్తున్నాదనుకోవడానికి! ఫాస్ఫరిన్ అనే వాయువుకు అలాంటి గుణం ఉంటుంది. లేకపోతే శంఖిణి అనే భయంకర సర్పం కావచ్చు, దాని నోటి నుంచి అలాంటి వెలుగు వచ్చి దానికి కనిపించడానికి సహాయపడుతుంది.

సన్యాసి ఇలా ఆలోచిస్తూ ఉండగా పిశాచం మాట కూడా జ్ఞాపకం వచ్చింది. తెల్లవారుతూనే కర్ర పట్టుకుని అదేమిటో చూడడానికి బయల్దేరారు. శంఖిణి సర్పమేమో అనే భయం మనస్సులో ఉంది. అన్ని వైపులా చూస్తే రాతి మీద పెద్ద కన్నం కనిపించింది. ఆ కన్నంలో నుంచి విచిత్రమైన జంతువు బయటకు వచ్చింది. అది చిన్న గుంటనక్కలా ఉంది. 'నువ్వేనా రాత్రి పిశాచంగా అందరికీ కనిపిస్తున్నావు' అని సన్యాసి అనుకున్నారు. రాత్రి మళ్ళీ అదే స్థలంలో నీలం, పసుపు రంగులు కలిసిన జ్యోతి కనిపిస్తూనే ఉంది. సన్యాసి నెమ్మదిగా అక్కడకు వెళ్ళారు. ఆ చిన్న జంతువే అక్కడ ఉంది. సన్యాసిని చూడగానే పరుగుపరుగున కన్నంలో దూరిపోయింది. ఈ వెలుగును చూసి పిశాచం అనుకుని మనుషులు భయపడుతున్నారు. అజ్ఞానమే ఈ భయానికి కారణం. అక్కడ భయంకరమైన క్రూర మృగం కానీ, పిశాచం కానీ ఏమీ లేదు. మూడో రోజు తహసీల్దార్ వచ్చారు. తహసీల్దార్ "స్వామీజీ! మీకు పిశాచం కనపడలేదా?" అని అడిగారు. సన్యాసి "ఆ పిశాచం ఇక్కడే ఉంది రండి. రండి" అన్నారు. తహసీల్దార్ "లేదు లేదు. మేము రాము. మేము గృహస్థులం, భార్యా బిడ్డలు గల వాళ్ళం. మీకు మంత్రాలు వచ్చు, అందుకని మీకు భయం లేదు" అన్నారు. "దానికి మంత్రాలతో పని లేదు.



భయపడడానికి ఏమీ లేదని నేను చెబుతున్నాను కదా! అందరినీ భయపెట్టే చిన్ని పిశాచాన్ని మీరు కూడా చూడండి" అంటూ సన్యాసి కర్ర తీసుకుని కన్నంలోకి దూర్చారు. వెంటనే ఆ జంతువు బయటకు వచ్చింది. "ఇదే ఆ పిశాచం, మీ అందరినీ భయపెట్టేది" అన్నారు సన్యాసి. తహసీల్దార్ "లేదు స్వామీజీ! ఇదేదో జంతువు" అన్నారు.

అప్పుడు సన్యాసి, "అవును. దాని నోట్లో ఫాస్ఫరస్ ఉంటుంది. అది పురుగుల్నీ, కీటకాల్నీ తినడానికి నోరు తెరిచినప్పుడు నోట్లో నుంచి వెలుగు వస్తుంది. ఆ వెలుగును చూసి అందరూ పిశాచం అనుకొని భయపడుతున్నారు" అని అన్నారు.

ఆ తరువాత సన్యాసి అక్కడ సుమారు రెండు నెలలున్నారు. రోజూ ఉదయం ఆ జంతువుతో ఆడుకుని ఆనందించేవారు. ❁



# అమరనాథ్ గుహ ప్రాశస్త్యం

పరమశివుడు పార్వతీదేవికి అమరత్వం, విశ్వసృష్టిల గురించి తెలియచేసింది అమరనాథ్ గుహలోనే. ఆ కథను ఈ విధంగా చెబుతారు:

ఒకసారి మాత పార్వతి శంకర భగవానుడు ముండమాల ఎప్పటి నుండి, ఎందుకు ధరిస్తున్నాడో తెలుసుకోవాలని కుతూహల పడింది. అప్పుడు శంకరుడు "నువ్వు జన్మ ఎత్తినప్పుడల్లా నేను నా ముండమాలకు మరొక శిరస్సును జత చేస్తాను" అన్నాడట. అమ్మ "ప్రభూ! నేను మళ్ళీ మళ్ళీ మరణిస్తున్నాను, నా దేహం నశిస్తోంది; కానీ మీరు అమరులు. దీనిలోని అంతరార్థం నాకు తెలియచేయండి" అన్నదట. శంకరుడు దానికి "అమరగాథ కారణంగా అలా జరుగుతోంది" అని బదులిచ్చాడట.

ఆ రహస్యమేమిటో తనకు తెలియజేయాల్సిందిగా అడిగింది ఆ తల్లి. చాలాకాలం వరకూ శంకరుడు అదేమిటో చెప్పకుండా తప్పించుకున్నాడు. ఆఖరకు పార్వతి మరీ మరీ కోరడం వల్ల 'అమర రహస్యం' చెప్పాలని నిశ్చయించాడట. ఏ ప్రాణీ లేని ప్రదేశంలో ఆ గాథ చెప్పాలనే ఉద్దేశంతో, అందుకు 'అమరనాథ్ గుహ' తగినది అని నిర్ణయించాడు. ఏ ప్రాణీ ఆ సమయంలో అక్కడ ఉండకూడదు అని ముందుగా తన వాహనమైన నందిని పహల్ గాంవ్ (బైల్ గాంవ్ అసలు పేరు. బైల్ అంటే ఎద్దు)లో విడిచిపెట్టాడట. చందన్‌వాడీలో తన జటల మధ్యనున్న చంద్రుణ్ణి, శేష్‌నాగ్ సరోవరం ఒడ్డున తన సర్పాలనూ, మహా గునాస్ పర్వతం (మహాగణేశ పర్వతం) వద్ద తన కుమారుడైన గణేశుణ్ణి, పంచతరణి దగ్గర సర్వ జీవులనూ సృష్టించడానికి అవసరమైన పంచభూతాలనూ (ఆకాశం, వాయువు, అగ్ని, నీరు, భూమి) విడిచిపెట్టాడట ఆ పంచభూతాల ప్రభువు పరమేశ్వరుడు. ఐహిక ప్రపంచాన్ని త్యజించడానికి ప్రతీకగా శివపార్వతులు తాండవ నృత్యం చేశారట. ఆ విధంగా అన్నీ విడిచిపెట్టి పార్వతితో కలసి పవిత్రమైన అమరనాథ్ గుహలోకి ప్రవేశించిన శంకర భగవానుడు లేడి చర్మాన్ని ఆసనంగా వేసుకొని సమాధిలోకి ప్రవేశించాడు. అమరకథను ఏ జీవీ వినకూడదనే తలంపుతో కాలాగ్ని అనే రుద్రుణ్ణి సృష్టించి గుహ వెలుపలా, లోపలా అగ్నిని వ్యాపింపజేసి దగ్ధం చెయ్యమన్నాడట. అప్పుడు ఆ దేవదేవుడు తల్లి పార్వతీ దేవికి అతి రహస్యమైన అమరగాథను తెలియచేశాడు.

అయితే జింకచర్మం కింద యాదృచ్ఛికంగా ఉండిపోయిన ఒక గుడ్డు సురక్షితంగా ఉంది. అది ప్రాణం లేనిదనీ, శివపార్వతుల ఆసనం దానిని రక్షించిందనీ అంటారు. ఆ గుడ్డు నుంచి వెలువడిన రెండు పావురాలు అమరకథ వినడం వల్ల అమరత్వాన్ని పొందాయి.

కఠినమైన మార్గం గుండా మంచులింగాన్ని దర్శించడానికి వెళ్ళే అమరనాథ్ యాత్రికులు అనేకులు తోవలో పావురాల జంట కనిపించిందని చెబుతుంటారు.

అమరనాథ యాత్ర ప్రతి ఏటా ఆషాఢ పౌర్ణమితో మొదలై శ్రావణ పౌర్ణమితో ముగుస్తుంది. ●

## పండుగలు - పర్వదినాలు

### జూలై - 2008

| | | | |
|---|---|---|---|
| 13 | ఆదివారం | : | ఏకాదశి |
| 18 | శుక్రవారం | : | గురుపూర్ణిమ |
| 28 | సోమవారం | : | ఏకాదశి |
| 30 | బుధవారం | : | స్వామి రామకృష్ణానంద జయంతి |

### ఆగస్టు - 2008

| | | | |
|---|---|---|---|
| 12 | మంగళవారం | : | ఏకాదశి |
| 16 | శనివారం | : | స్వామి నిరంజనానంద జయంతి |
| 24 | ఆదివారం | : | శ్రీకృష్ణ జయంతి |
| 27 | బుధవారం | : | ఏకాదశి |
| 29 | శుక్రవారం | : | స్వామి అద్వైతానంద జయంతి |

# మహేశ్వరుని మహాభక్తుడు

చిత్రాలు: శంకర్   కథ: టి.ఎం.ఎస్   తెలుగుసేత: స్వామి జ్ఞానదానంద



రాజమహేంద్రవరంలో బ్రహ్మరాయల కులంలో జన్మించిన లింగరాయుడు మైసూరు సామ్రాజ్యానికి మంత్రిగా ఉండేవాడు. ఆయన కుమారుడు శ్రీధర వెంకటేశుడు. ఇతను కూడా మంత్రి అయ్యాడు. ఈయనే తరువాతి కాలంలో శ్రీధరయ్యగా ప్రసిద్ధిచెందాడు. ఒకరోజు....

అమ్మా! నాకు ఈ రాజ్యాంగానికి సంబంధించిన పనులు చెయ్యాలనిపించడం లేదు. ఈ ప్రదేశాన్ని వదిలి బోధేంద్రుడు, సదాశివ బ్రహ్మేంద్రుడు లాంటి మహాత్ములను దర్శించాలని ఉంది. కానీ ఈ రాజ భోగాలకు అలవాటుపడిన మీరు ఎలా ఉండగలరు?




శ్రీధరయ్య తిరుచ్చిరాపల్లికి వచ్చి ఉంఛవృత్తిని అవలంబించి రోజూ తాయుమానవ స్వామిని దర్శించుకొని ఆనందంగా ఉండేవాడు. ఒకరోజు...

అమ్మా! నువ్వు ఎందుకు ఏడుస్తున్నావు? నీ బిడ్డకు ఏమయింది!

ఈ బిడ్డ చలనం లేకుండా పడివున్నాడు.

"మన తాయుమానవ స్వామి కరుణామయుడు. నీ బిడ్డను బాగుచేస్తాడు" అంటూ శ్రీధరయ్య పరమేశ్వరుణ్ణి కీర్తించాడు.

శివకుటుంబం, దేవతలు శివుని సేవించడం లాంటి స్తుతులను హృదయం ద్రవించేలా పాడాడు శ్రీధరయ్య. వెంటనే ఆ బిడ్డలో చలనం వచ్చింది.



శ్రీధరయ్య రోజూ గోవిందపురంలో ఉంటున్న బోధేంద్రస్వామితో ముచ్చటిస్తూ ఆనందించేవాడు. అక్కడ సదాశివ బ్రహ్మేంద్రుడు కూడా ఉండేవారు. ఆయన మౌనం పాటిస్తున్నందున ఇరువురి సంభాషణలూ విని ఆనందించేవారు. ఒకరోజు...




వెంటనే సదాశివ బ్రహ్మేంద్రుడు తన తలను కిందపెట్టారు. ఆ సాయంత్రం...







ఆ తరువాత భక్తి పారవశ్యంతో సదాశివ బ్రహ్మేంద్రులు చాలా కీర్తనలు పాడారు.

మిగతా 36వ పేజీలో...

## ఆచార వ్యవహారాలు - అంతరార్థాలు - 29

- రెంటాల జయదేవ

(గత సంచిక తరువాయి...)

### ప్రదక్షిణ ఎలా చేయాలి?

ప్రదక్షిణం ఎలా చెయ్యాలంటే,

**నవమాస యుతా నారీ । పూర్ణకుంభం ధృతా సతీ ।**
**పదే పదం చ నిక్షిప్య । యథా గచ్ఛతి సాఽలసా ।**
**తథా భక్తి యుతో భూత్వా । ప్రదక్షిణ విధిం చరేత్ ॥**

(స్మృత్యంతరే)

'నవమాసాలూ నిండిన గర్భవతి నిండు నీళ్ళ బిందెను భుజం మీద పెట్టుకొని, ఎంత నెమ్మదిగా, జాగ్రత్తగా అడుగులో అడుగు వేసుకుంటూ నడుస్తుందో, అదే విధంగా నడుస్తూ, భక్తులు దేవుని మీద భక్తిశ్రద్ధలతో ఆలయం చుట్టూ ప్రదక్షిణం చేయాలి.' అంటే, వెనుక పాదపు బొటనవేలి ముందు కొన, ముందరి పాదపు మడమ వెనుక అంచును తాకాలి. సవ్యంగా మూడు సార్లు ప్రదక్షిణం చేయాలని పెద్దల మాట. అలాగే, దేవాలయానికి వెనుక భాగాన పిశాచాలు, భూతగణాలు ఉంటాయి. కాబట్టి, వెనుక భాగాన్ని ముట్టుకోకూడదని అంటారు.

**నిత్య ప్రదక్షిణ యోగ్యమైనవి**

అనునిత్యం ప్రదక్షిణం చేయదగిన వాటి గురించి,

**చిత్ర భాను మనడ్వాహం । దేవం గోష్ఠం చతుష్పథమ్ ।**
**బ్రాహ్మణం ధార్మికం చైవ । నిత్యం కుర్యాత్ప్రదక్షిణమ్ ॥**

(స్మృతి దీపికాయాం)

అని చెప్పారు. 'అగ్నిహోత్రానికీ, వృషభానికీ, దేవాలయానికీ, గోశాలలకూ, నాలుగు రోడ్ల కూడలికీ, బ్రాహ్మణులకూ, ధార్మికులకూ నిత్యం ప్రదక్షిణలు చేయాలి.'

**ప్రదక్షిణ ఫలితం**

అశ్వత్థ ప్రదక్షిణం, భూప్రదక్షిణం, కులశైల ప్రదక్షిణం - ఇవి ఒకదాని కన్నా మరొకటి పది రెట్లు ఎక్కువ ఫలితాన్నిస్తాయి. అలాగే, తండ్రికీ, గురువుకూ, తల్లికీ చేసిన ప్రదక్షిణాలు ఒకదాని కన్నా మరొకటి పది రెట్లు ఎక్కువ ఫలాన్నిస్తాయి. అలాగే, ఉదయం, సాయం కాల వేళల్లో సూర్యప్రదక్షిణం సర్వసిద్ధిప్రదం.

తల్లికి నమస్కారం చేస్తే, ఎంతో పుణ్యమని శాస్త్రాలు చెబుతున్నాయి.

**భూ ప్రదక్షిణ షట్కేన కాశీయాత్రాఽ యుతేన చ ।**
**సేతు స్నాన శతైర్యచ్చ తత్ఫలం మాతృవందనే ॥**

(సూక్తి ముక్తావళ్యాం)

'తల్లికి నమస్కారం చేసినంత మాత్రాననే ఆరు సార్లు భూప్రదక్షిణ చేసిన ఫలం లభిస్తుంది. వేయిసార్లు కాశీయాత్రకు వెళ్ళిన పుణ్యం దక్కుతుంది. వందసార్లు సముద్ర స్నానం చేసిన ఫలితం కలుగుతుంది.'

**ఆలయంలో ప్రదక్షిణ ఫలితం**

ఆలయాలలో భక్తితో మనం చేసే ప్రదక్షిణల ఫలితం గురించి స్కాంద పురాణం ఇలా చెబుతోంది:

**దేవాలయే తు రాజేంద్ర**
**యశ్చ కుర్యా త్ప్రదక్షిణాం ।**
**ప్రదక్షిణీ కృతా తేన ససాగరధరా ధరా ॥**

(శ్రీస్కాంద మహాపురాణ రేవాఖండం, అధ్యాయం172 - 57)

'దేవాలయంలో ప్రదక్షిణం చేసిన వ్యక్తి సాగర పర్వత సహితమైన భూమికి ప్రదక్షిణం చేసినట్లే!' అని దీని భావం.

అందుకే, ప్రదక్షిణ చేయాల్సిన విధానాన్నీ, దాని వల్ల కలిగే ఫలితాన్నీ తెలుసుకొని మరీ ప్రదక్షిణలు చేయడం మనందరికీ ఉపకరిస్తుంది. ✿

(మరో 'ఆచార వ్యవహారం - దాని అంతరార్థం' వచ్చే సంచికలో)



# మేలుకో! మృత్యువుని తెలుసుకో!

ఈ శరీరాన్ని అనేక వ్యాధులు, ముసలితనం ఆక్రమించగా, జీవుడు దీనాలాపం చేస్తూ ఉంటాడు. ఇంతలో ఒకానొక అనుకోని క్షణంలో 'మృత్యువు' అనే గుడ్లగూబ వచ్చి ఎదురుగా వాలుతుంది. సాయం సంధ్యను చూడగానే చీకటి ఎక్కడి నుండో వచ్చి వాలదూ? ఇదీ అంతే! గ్రద్ధ మాంసాన్ని మ్రింగడానికి వచ్చినట్లు ఈ శరీరాన్ని మ్రింగడానికే 'ముసలితనం' దాపురిస్తుంది. పుష్పము బాలిక జడలో అలంకరించుకొని, కొంతసేపటికి ఆ పూవు వాడిపోగా, తీసి దూరంగా విసరివేస్తుంది, చూశారా! అదే విధంగా 'కాలం' అనే బాలిక కూడా కొంతసేపు ఈ శరీరాన్ని కలిగిఉండి, ఆ తరువాత 'మృత్యువు' అనే చీకట్లోకి త్రోసివేస్తుంది.

ఈ జీవుడు బాల్య యౌవనాలలో ఉన్నప్పుడు అప్పటి ఆయా అల్పకాలిక కార్యాలలో నిమగ్నుడై ఉంటున్నాడు. ఉత్తమ కార్యాల పట్ల "ఇప్పుడేం తొందర? మాకు ఇంకా సమయముంది. పెద్ద అయిన తరువాత చూసుకోవచ్చులే" అని తలచి ఎంతో అలసత్వం, అశ్రద్ధ కలిగి ఉంటున్నాడు. మృత్యువు ఎదురుగా నిలిచి ఉండగా అప్పుడు ఆ అనుకున్న ప్రణాళిక అంతా ఏమైంది? మంచు బాగా కురవడంతో వాడిపోతున్న పుష్పంలాగ ఈ శరీరం శిథిలమవుతూ ఉంటే, మృత్యువు అనే పేరుగల శరీర వినాశనం సమీపిస్తూ ఉంటే ఇక ఈ జీవుడు ఏం చేయగలడు?

శరీరం జీర్ణం అయిపోతూ ఉంటుంది. వాతాది రోగాలు ప్రజ్వలిస్తూ ఉంటాయి. బూడిద గుమ్మడికాయలా తల తెల్లబడగా, కాలుడు "ఆహా! ఈ పండు పక్వానికి వచ్చినట్లుందే! ఇక కోసుకుందామా?" అని అనుకొంటూ ఒకరోజు వచ్చి కోయనే కోస్తాడు.

'ముసలితనం' అనే నక్క ఊళ వినేవరకే ఈ మానవుడి ప్రతాపమంతా! 'జర' అనే అగ్ని ఈ శరీర గృహాన్ని అంటగానే ఇక అతడు అనేక శారీరక బాధలకు గురై, దుఃఖితుడు అవుతున్నాడు. అవయవాలు పాలిపోతున్నాయి. నడుము వంగిపోతోంది. అధి వ్యాధులు ముందు నడుస్తూ ఉండగా ఈతడు మృత్యువుకు 'కబళం' అవుతున్నాడు. పర్వత గుహలో దాగినా, సుతిమెత్తని పరుపులపై ధన-జనాల మధ్య ఉన్నా మృత్యువు నుంచి తప్పించుకోగలరా? ఇంద్రియాలు బిగదీసుకు పోతుంటే ఏ తెలివితేటలైనా ఎందుకు పనికివస్తాయి?.

మూడవకాలితో (చేతికఱ్ఱతో) జర, జీవుడి చేత తప్పటడుగులు వేయిస్తూ ఉంటే, అనేక అసంతృప్తులు, రోగాలు అందుకు తాళం వేస్తూ ఉంటాయి. ఏ క్షణంలో మృత్యువు పంజా విప్పబోతోందో ఎవరికి తెలుస్తుంది చెప్పండి? అశక్తత, ఆర్తి, ఆపద శరీరంలోనే తిష్ఠ వేసుకొని ఉంటాయి కదా! ఓ మహాశయా! చూడండి. మనకు కనబడే ఈ శరీరం యొక్క 'ఉత్పత్తి- ఉత్తరోత్తరగతి' ఇదంతా పరిశీలిస్తే నాకు దీనిపై ఏ మాత్రం విశ్వాసం కలగడం లేదు.

తండ్రీ! మహర్షీ! అసలు నాకొక విషయం చెప్పండి. ముసలితనం మీదపడ్డ తరువాత కూడా జనులకు భార్య-పుత్ర-గృహాదులపై పేరాశ ఎందుకు ఉంటోంది? ఈ మోహమంతా కల్పిస్తున్నవారెవరు? వార్ధక్యాన్ని జయించిన వారంటూ ఎక్కడా ఉండరు కదా! మరి ఈ విషయం అందరికీ తెలియదా? ముసలితనం వచ్చినదే సమయానికి అనేక కోర్కెలు కలిగివున్న ఈ జీవుడు ఆ కోర్కెలు తీరక అపూర్ణత్వాన్ని అధిగమించలేకపోతున్నాడు. బాల్య యౌవనాలలోనే 'అసలు కోర్కెలంటూ లేకుండా ఉండేదెట్లా?' అనే విషయం విచారించి తగిన కర్మ జ్ఞానాలు అభ్యాసం చేసి ఉండి ఉంటే ఇప్పుడీ గతి పట్టేదా?

అందుచేత, అలాంటి ముసలితనం నన్ను సమీపించక ముందే ఆత్మ - అనాత్మ విచారణతో ఈ శరీర భావాన్ని జయిస్తాను. అందుకోసం, నా శక్తి యుక్తులన్నీ వినియోగించదలచాను. ●

('శ్రీవసిష్ఠ రామ సంవాదం' వైరాగ్య ప్రకరణం నుంచి)

అనువాదం : వై.హెచ్. రామకృష్ణ



# అమర భారత ప్రతిభ

## 108 సంఖ్యా ప్రాముఖ్యం

**భారతదేశ ఔన్నత్యాన్ని, భారతీయుల ప్రతిభనూ ప్రపంచం నలుమూలలకూ వ్యాపింపజేసినవారు స్వామి వివేకానంద. ప్రపంచ పురోగతిలో భారతదేశం పాత్ర అతికీలకమైనదనీ, అందుకు ప్రపంచం మన దేశానికి ఎంతగానో ఋణపడి ఉందనీ ఆయన చెప్పారు.**

**మన భారతీయ ప్రతిభను మనం గుర్తించలేక మనల్ని మనమే కించ పరచుకుంటున్నాం. ఇలాంటి ప్రతికూల భావాల నుంచి బయటపడడానికి వివేకానంద లైఫ్ స్కిల్స్ అకాడమి సౌజన్యంతో శ్రీరామకృష్ణ ప్రభ ఈ సంచిక నుంచి 'అమర భారత ప్రతిభ' శీర్షికను పాఠకులకు అందిస్తోంది...**



108 సంఖ్య భారతీయులకు చాలా పవిత్రమైనది. అన్ని ఆధ్యాత్మిక కార్యక్రమాలలోనూ 108 అనే సంఖ్యకు ప్రాముఖ్యం ఉంది. దైవపూజలో దేవతను మంత్ర పుష్పాలతో పూజిస్తూ - 108 పవిత్ర పూసలు గల జపమాలను గణిస్తూ జపం చేస్తారు.

108 సంఖ్య యొక్క ప్రాముఖ్యాన్ని హిందువులే కాదు, బౌద్ధులు, జైనులు, సిక్కులు, టావోయిస్టులు మొదలైన వారందరూ గుర్తించారు. తనలోని దైవత్వాన్ని గ్రహించడానికి ఆత్మ 108 మెట్లు దాటాలని వీరి నమ్మకం. ఈ సంఖ్య భగవంతునికీ భక్తునికీ మధ్య అనుసంధాన కారకమని భారతీయుల నమ్మకం.

ఋషులు ఖగోళ శాస్త్రానికి సంబంధించిన గణనలో

* భూమికీ, చంద్రునికీ మధ్య దూరం చంద్రుని వ్యాసానికి 108 రెట్లు ఉందనీ,

* భూమికీ, సూర్యునికీ మధ్య దూరం సూర్యుని వ్యాసానికి 108 రెట్లు ఉందనీ,

* సూర్యుని వ్యాసం భూమి వ్యాసానికి 108 రెట్లు అనీ నిర్ధారించారు. ఈ వేదగణన ఆధునిక సాంకేతిక విశ్వగణన ప్రకారం భూమికీ చంద్రునికీ, భూమికీ సూర్యునికీ ఉన్న దూరంతో దాదాపు సరిపోయింది.

ఆయుర్వేదం మనిషి శరీరంలో 108 మర్మ స్థానాలను గుర్తించింది. 108 మర్మాలున్న ఈ గొలుసులో 107 గ్రంథులు శరీరంలో ఉంటాయని ఆయుర్వేదం చెబుతోంది. పవిత్రమైన శ్రీచక్ర యంత్రంలో 54 చొప్పున స్త్రీ, పురుష అంతర్భాగా లుంటాయి. వీటి మొత్తం 108. ఇక, జ్యోతిశ్శాస్త్రం మానవ ప్రవృత్తికి సంబంధించి బ్రహ్మాండాన్ని 27 చంద్ర సూచికలైన నక్షత్రాలతో, ఒక్కో నక్షత్రం తిరిగి 4 పాదాలతో ఉంటుందని గుర్తించింది. ఇది 27 ×4= 108 పాదాలైంది. అవే 108 ప్రాథమిక మానవ ప్రవృత్తులు. శిశు జనన సమయంలో చంద్రుడు ఏ పాదంలో ఉంటాడో, దాని ప్రభావం ఆ వ్యక్తి జీవితంలో, వృత్తిలో, ఆనందంలో, కుటుంబంలో, చివరకు మోక్ష మార్గాలలోనూ ప్రతిఫలిస్తుంది.

భారతీయ జ్యోతిశ్శాస్త్రం ప్రకారం 12 రాశులు, 9 గ్రహాలు ఉంటాయి. 12×9 = 108. ఇక, మానవుడు సగటున ప్రతి రోజూ 21,600 సార్లు శ్వాస తీసుకుంటాడు. అందులో 10,800 సూర్యాంశ, 10,800 చంద్రాంశ. 108ని 100తో గుణిస్తే 10,800 వస్తుంది. దీనిని 2తో గుణిస్తే 21,600 వస్తుంది అని తంత్ర శాస్త్రం చెబుతోంది.

భరతుడు తన 'నాట్యశాస్త్రం'లోని నాట్య భంగిమల మొత్తం సంఖ్యను 108గా గుర్తించాడు. వీటిని 'కరణము' అంటారు. 108 ఉపనిషత్తులు, ఎన్నో ప్రముఖ సంస్కృత కావ్యాలలో శ్లోకాలు 108 ఉంటాయి.

సంస్కృత భాషలో 54 అక్షరాలుంటాయి. వీటికి శివ, శక్తి తత్త్వాలైన స్త్రీ, పురుష రూపాలుంటాయి. అంటే 54×2=108. భారతీయ కాలగణన ప్రకారం బ్రహ్మకు ఒక రోజు అంటే 4 యుగాలు కలిసిన 43,20,000 సంవత్సరాలు. ఇది 108తో భాగింపబడుతుంది.

సంఖ్యా శాస్త్రంలో 108ని 1+0+8=9గా వ్రాస్తారు. ఒక సంఖ్యను 9తో గుణించి, వచ్చిన సంఖ్యను కూడగా తిరిగి 9 వస్తుంది.

గణితంలో 108 అనగా $1\times2^2\times3^3=108$ వస్తుంది.

ఇంతటి వైశిష్ట్యం గల 108 సంఖ్య ఎంతో దివ్యమైనది. అది సృష్టికర్తకూ, సృష్టికీ అనుసంధానం కలిగించేది. అందుకే మన భారతీయ సంస్కృతి 108 సంఖ్యకు ఇంతటి పవిత్రతను, ప్రాధాన్యతను ఇచ్చింది.

# శ్రీ జగన్నాథ ధామం పూరీ క్షేత్రం

- చెవుటూరి కుసుమకుమారి



అయోధ్యా మథురా మాయా కాశీ కాంచీ అవంతికా ।
పూరీ ద్వారవతీ శ్చైవ సప్తైతే మోక్షదాయికా ॥

అయోధ్య, మథుర, కాశీ, కాంచి, అవంతి, పూరి, ద్వారక - ఈ ఏడూ మోక్షదాయక క్షేత్రాలు. భారతదేశంలో ఇలాంటి పుణ్యక్షేత్రాలు, పుణ్య తీర్థాలు ఎన్నో ఉన్నాయి. భారతదేశపు నాలుగు ఎల్లలలో తూర్పు దిక్కులో పూరీ జగన్నాథం, పడమరలో ద్వారకానాథ్, ఉత్తరాన బదరీనాథ్, దక్షిణంలో రామనాథ్ (రామేశ్వరము) క్షేత్రాలున్నాయి.

ఈ నాలుగు క్షేత్రాలలో కృతయుగంలో శ్రీమన్నారాయణునిగా బదరీలోను, త్రేతాయుగంలో రామేశ్వరంలో శ్రీరాముడిగాను, ద్వాపరయుగంలో శ్రీకృష్ణునిగా ద్వారకలోను పూజింపబడి కలియుగంలో దారుబ్రహ్మరూపంలో పూరీ జగన్నాథంలో శ్రీహరి పూజలందుకుంటున్నాడు అని పురాణప్రమాణం.

పూరీ క్షేత్రానికి శ్రీక్షేత్రము, నీలాచలధామం, పురుషోత్తమ క్షేత్రం, శంఖ క్షేత్రం, ఉచ్ఛిష్ట క్షేత్రం, జమనిక తీర్థం, మర్త్య వైకుంఠం, ఓఢ్యాణ పీఠం, కుశస్థలి, భౌమక్షేత్రం అనే పేర్లున్నాయి.

జగన్నాథస్వామి ఆలయ ప్రాకారంలో మొత్తం 39 మందిరాలు ఉన్నాయి. వాటిలో కల్పగణేశ, సర్వమంగళ, మహా వజ్రేశ్వర (ఇది క్షేత్ర పాలకులైన శివశక్తుల మందిరం. మహా వజ్రేశ్వరి పేరు ఇంద్రాణి), విమలా దేవి మందిరం (ఈ విమలాదేవి దక్షరాజు పుత్రి సతీదేవి; దక్షయజ్ఞవాటికలో చిదగ్నిలో ప్రాణత్యాగం చేసిన సతిని మోసుకుని శివుడు తిరుగుతున్నప్పుడు ఆమె కాలి అందెపడిన భాగం. అందుచేతనే ఆమెను శక్తి స్వరూపిణిగా ఆరాధించడం మొదలైంది ఇక్కడ.) లాంటివి ప్రసిద్ధమైనవి.

తరువాత సాక్షిగోపాల మందిరం. దీనిని ఒక అత్యంత ప్రామాణిక సత్యంగా చెప్పుకుంటారు. ఉత్కళదేశపు రాజు గణపతి నరేశుడు, శ్రీజగన్నాథుడు, బలభద్రుడు సహాయంగా



వెళ్ళగా కాంచీ రాజును ఓడించాడట. అతడు కాంచీపురం నుండి తిరిగివస్తూ సాక్షిగోపాల విగ్రహాన్ని తెచ్చి ప్రతిష్ఠించగా, నేటికీ సాక్షిగోపాలునికి భక్తి శ్రద్ధలతో ఆరాధన జరుగుతూనే ఉంది. తరువాత క్షీరగోపీనాథ మందిరంలో విగ్రహం చూడదానికి బహురమ్యంగా ఉంటుంది.

తరువాత నీలమాధవుని మందిరం. జగన్నాథ మందిర ప్రాంగణంలోనే మహానదీ తీరంలో ఉంది. మొట్టమొదట శబరరాజు విశ్వవసువు నీలమాధవుని పూజించిన చోట ఉన్న మందిరం. ఆ నీలమాధవుడే ఈ జగన్నాథుడు అని ప్రసిద్ధి. అటు తరువాత అతి ప్రసిద్ధమైనది, ముఖ్యమైనది లక్ష్మీదేవి మందిరం. చోడగంగ దేవుడు ముమ్మూర్తులా జగన్నాథ ఆలయం లాగనే ఈ లక్ష్మీ మందిరం కూడా నిర్మించాడు. దీనికి 'త్రిపాద వైకుంఠమణి' అని కూడా పేరుంది. ఈ మందిరంలో నిరంతరం సనాతన హిందూ ధర్మం గురించి సభలు, సమాలోచనలు జరుగుతూ ఉంటాయి.

పూరీలో జరిగే ఉత్సవాలలో వైశాఖ శుక్ల విదియ అక్షయ తృతీయ నాటి చందనయాత్ర, నరేంద్ర సరోవరంలో జలవిహారం, జ్యేష్ఠ పూర్ణిమ నాటి స్నానోత్సవం, ఆషాఢ శుక్ల విదియ నాటి రథోత్సవం ప్రపంచ ప్రఖ్యాతమైనవి. రథోత్సవంలో జగన్నాథుడికి పీతవాసుదు అని పేరు గనుక పసుపు రంగు వస్త్రాలు ధరింపజేసి నందఘోషమనే రథాన్ని అధిరోహింపజేస్తారు. బలభద్రునికి నీలాంబరుడని పేరు. ఆయనకు నీలిరంగు వస్త్రాలు ధరింపజేస్తారు. ఆయన రథం పేరు తాళధ్వజం. సుభద్రాదేవి రథం పేరు దేవదళనం. నల్లని వస్త్రంతో రథాన్ని అవృతం చేసి ముగ్గురినీ రథాల మీద అధిరోహింపజేస్తారు. పూరీ గజపతిరాజు బంగారు చీపురుతో తుడిచి, చందనం జల్లగా మహా సంరంభంగా వేద ఘోషతో రథం బయలుదేరుతుంది. జగన్నాథుని భక్తజన సముద్రంగా మారుతుంది పూరీ జగన్నాథం. జగన్నాథ నామస్మరణ దిగంతాలకు వ్యాపిస్తుంది. దేశవిదేశాల నుండీ లక్షలాది భక్తులు జగన్నాథ రథం లాగి, తమ జన్మజన్మల పాపాలు పటాపంచలయ్యాయనీ, తాము చరితార్థులం అయ్యామనీ భావిస్తారు.

మరొక అద్భుత ఉదంతం 'నవకళేబర ఉత్సవం'. పాత దారు విగ్రహం జీర్ణమై పోయినప్పుడు సరికొత్త దారువుతో విగ్రహ నిర్మాణం చేయడమే నవకళేబర నిర్మాణం. అధిక ఆషాఢ మాసం వచ్చిన సంవత్సరం ఈ ఉత్సవం చేస్తారు. ఆషాఢ పూర్ణిమ నాడు దైవజ్ఞులు క్రొత్త దారువు కోసం మంగళమయీ దేవిని ప్రార్థిస్తారు. కలలో దేవి ఆదేశించిన ప్రకారం కర్రను వెదకడానికి మూడు జట్లుగా బయల్దేరి వెళ్ళి, దారువును అన్వేషిస్తారు. వారిని దయితా మనుష్యులు అంటారు.

బలభద్రుని కోసం సేకరించే కర్ర తెల్లగా ఉంటుంది. దాని మీద శంఖ చిహ్నం కనిపిస్తుంది. ఆ చెట్టుకు 5 శాఖలు మాత్రం ఉంటాయి. జగన్నాథదేవుని కోసం సేకరించే దారువు మీద చక్రం గుర్తు ఉంటుంది. దానికి ఏడు శాఖలుంటాయి. దారువు దొరకగానే అక్కడే పూజాదికాలు జరిపి, ముందుగా బంగారు, తరువాత వెండి గొడ్డలితో చెట్టు మొదలు మీద దెబ్బవేస్తారు. తరువాత ఇనుప గొడ్డలితో నరికి, ఎడ్లబండి మీద వేసి, శ్రీక్షేత్రానికి తీసుకువస్తారు. ఆ విధంగా దారువును తెచ్చే ఉత్సవానికి కూడా జనం నలుదిక్కుల నుండీ వస్తారు. శంఖ, ఘంటారావాలతో ఉత్తర ద్వారం నుండి కోవెలకు చేరుస్తారు. అక్కడ అర్చనల తరువాత జ్యేష్ఠ కృష్ణ చతుర్దశి నుంచి ఆషాఢ శుక్ల నవమి వరకూ నూతన విగ్రహాల నిర్మాణం, అలంకారం జరుగుతాయి. అమావాస్య నాడు జగన్నాథుడు భక్తులకు పునర్దర్శనం ప్రసాదిస్తాడు. దీనికి యౌవన దర్శనం అని పేరు. ఈ దర్శనానికి అశేషజనం తరలి వస్తారు. శ్రీజగన్నాథునికి సంవత్సరానికి 13 యాత్రలు జరుగుతాయి. పూరీజగన్నాథుని దర్శనం అనేక జీవిత సత్యాలను బోధిస్తుంది. అనేక సందేహాలను నివృత్తి చేస్తుంది. పరమాత్మానుభవాన్ని కలిగిస్తుంది. ❖

# ఆలోచనలకు పదును పెట్టండి!

\- స్వామి రంగనాథానంద

సాధారణంగా వీచే గాలి తేలికగా ఉంటుంది. అదే గాలి ఏకీకృతమైతే పెద్ద పెద్ద రాళ్ళను ఎత్తిపడేయగలదు. కొండల్ని కూడా తొలిచే శక్తి వాయు పీడనానికి ఉంటుంది. అదేవిధంగా మనస్సును ఏకాగ్రం చేస్తే వచ్చే శక్తి అపారంగా ఉంటుంది. నిశ్చలమైన మనస్సుతో ఉత్సాహంగా బాధ్యతలను నిర్వర్తించవచ్చు. చంచల మనస్కులు ఏ పనిలోనూ రాణించలేరు. జీవితంలో విద్యార్థి దశ ముఖ్యమైంది. మనస్సు ఉన్నత స్థితికి చేరడానికీ, పతనమవడానికీ ఈ దశలోనే బీజం పడుతుంది. ఈ వయస్సులోనే మనస్సుకు దిశా నిర్దేశం చేయాలి. పిల్లల చేతివ్రాత కుదురుగా వచ్చేందుకు పెన్సిల్‌ను సూదిగా చెక్కినట్లే వారి జీవితం ఉన్నతంగా మారాలంటే ఎంతో ఉత్తమమైన విద్యను అందివ్వాలి.

**ఏకాగ్రత:** ఒకే విషయంపై మనస్సును లగ్నం చేసి పనిచేస్తున్నప్పుడు మనస్సు ఏకాగ్రమవుతుంది. ఏకాగ్ర చిత్తం ఉన్నవారికి పని భారం తెలియదు. ఇది ఒక తపస్సు లాంటిది. దృఢసంకల్పం మనస్సును ఏకీకృతం చెయ్యగలదు. మొదట అభ్యాసం చెయ్యాలి. ముందు మనం అభ్యాసం ప్రారంభిస్తే తరువాత అదే అలవాటుగా మారుతుంది. నిరంతర పరిశ్రమ కూడా చిత్తాన్ని ఏకాగ్రపరచగలదు.

**లక్ష్య నిర్దేశం:** ఒక లక్ష్యం ఏర్పరచుకొని, ఆ దిశగా ఆలోచనలు కొనసాగిస్తూ, అంచెలంచెలుగా ఉన్నత స్థితికి చేరినవారిని మనం గమనించవచ్చు. "కలలు కనండి. వాటిని సాకారం చేసుకునే దిశలో ఆలోచనలకు పదును పెట్టి, ఆచరణలో పెట్టండి. లక్ష్యాన్ని ఛేదించండి" అని స్వామి వివేకానంద చెప్పిన మాటలు నేటి యువతరానికి శిరోధార్యాలు. గురి కుదరాలంటే మన ముందు ఒక లక్ష్యం ఉండాలి. దిశా నిర్దేశంతోనే గొప్ప కార్యాలు నెరవేరుతాయి.

**క్రమశిక్షణ:** లక్ష్యం సాధించేందుకు క్రమశిక్షణ ముఖ్యం, నిత్యజీవితంలో క్రమశిక్షణను అలవరచుకొని, పద్ధతి ప్రకారం విధులు, బాధ్యతలు నిర్వర్తించేవారిలో శక్తిసామర్థ్యాలు అధికంగా ఉంటాయి. కాలనియమాన్ని పాటించడం ప్రకృతి ధర్మం. ప్రకృతిలో రాత్రింబవళ్ళు, ఋతువులు కాల నియమాన్ని అనుసరించి వస్తాయి. మన శరీరం కూడా ప్రకృతి నియమాలను పాటిస్తుంది. వేళకు ఆకలి వేయడం, రాత్రి నిద్ర రావడం, తెల్లవారగానే మెలకువ రావడం... ఇవన్నీ ప్రకృతిధర్మంగా నడిచే ప్రక్రియలు. అలాగే మన మనస్సు కూడా కాల నియమాల ప్రకారం క్రమశిక్షణాయుతంగా ఉండాలంటే మంచి వ్యాపకం కల్పించుకొని, కాలాన్ని సద్వినియోగం చేసుకోవాలి. ప్రతి పనిలోనూ సమయం, నియమం పాటిస్తే పని నాణ్యత పెరుగుతుంది.

**భక్తి శ్రద్ధలు:** మనస్సు కోపంతోనూ, అసహ్యంతోనూ నిండి ఉన్నప్పుడు బలహీనులం అవుతాం. అలాంటి స్థితిలో పరమాత్మతో మనకున్న సంబంధం క్షీణిస్తుంది. కోపం, ద్వేషం, ఏవగింపు మొదలైన వాటి నుండి దుఃఖం పుడుతుంది. ఆనందం కొరవడుతుంది. దుఃఖాన్ని జయించి ఆనందమయ జీవనం గడపడానికి జీవనయానంలో శ్రద్ధాభక్తులు కలిగి ఉండాలి. శ్రద్ధతో చేసే ఏ పని అయినా సత్ఫలితాన్నిస్తుంది. శ్రద్ధకు భక్తి తోడైతే మనస్సు పరిమళిస్తుంది. గాఢమైన నిష్ఠను కలిగించే శక్తి శ్రద్ధకి ఉంది. నిరంతర పరిశ్రమ ద్వారా మన ఆలోచనల్ని పదును పెడితే లక్ష్యాన్ని సులభంగా చేరుకోవచ్చు. ✿ సేకరణ: ఆర్. కృష్ణ



# యువవాణి

- స్వామి పరిజ్ఞేయానంద

**బాబి, నిజామాబాద్**

**ప్రశ్న:** గత రెండు సంవత్సరాలుగా నేను 'శ్రీరామకృష్ణ ప్రభ'ను చదువుతున్నాను. అప్పటి నుంచీ మంచి మార్గంలో నడుస్తున్నాను. కానీ గతంలో చేసిన తప్పులు నన్ను వేధిస్తున్నాయి. నేను చేసిన తప్పులకు వచ్చే జన్మలో శిక్ష అనుభవించక తప్పదు. నా దోషాలకు ప్రాయశ్చిత్తం ఏమిటి?

**జవాబు :** చేసిన తప్పులకు ప్రాయశ్చిత్తం పశ్చాత్తాపమే! గతంలో చేసిన అపరాధాలను ఎలాంటి పరిస్థితుల్లోనూ మరల చేయనని మనస్సులో దృఢంగా సంకల్పించుకోవాలి.



నిజమైన గొప్పతనం పైకి లేవడంలో లేదు. క్రిందపడిన ప్రతిసారీ పైకి లేవడంలోనే ఉంది. 'తప్పులు చేయడం మానవ సహజం. వాటిని సరిదిద్దుకుని మాధవునిగా మారే శక్తి ఒక్క మనిషికే ఉంది' అంటూ స్వామి వివేకానంద ఇలా చెప్పారు:

Never mind failures. The cow never tells a lie; but she remains a cow, all the time. Man tells a lie - and becomes a god too.

గతాన్ని తలుచుకుంటూ క్రుంగిపోవడం కన్నా గతంలో చేసిన తప్పుల నుంచి గుణపాఠాలు నేర్చుకొని, వర్తమానాన్ని వృథా చేయకుండా భవిష్యత్తుకు బంగారు బాట వేసుకోండి.

One should learn from the past but one should not live in the past. My concern is to look to the future, learn from the past and deal with the present.

*- George Fernandes*

చేసిన తప్పులకు వచ్చే జన్మలో శిక్ష అనుభవించాల్సి వస్తుందని ఈ జన్మలోనే మానసిక శిక్షను అనుభవించకండి. రాబోయే శీతకాలాన్ని తలుచుకుంటూ ఇప్పుడే వణకడమెందుకు? గతాన్ని తలుచుకొంటూ అశాంతికి లోనుకాకుండా, సన్మార్గంలో శాంతిగా జీవించడానికి ప్రయత్నించండి.

**త్రివేణి, తాడిపత్రి**

**ప్రశ్న:** నేను డిగ్రీ చదువుతున్నాను. మా అమ్మ నన్ను ప్రతి చిన్న విషయానికీ వేధిస్తుంది. అందువల్ల నేను చదువుపై మనస్సును ఏకాగ్రం చేయలేకపోతున్నాను. నా ఈ సమస్యకు పరిష్కారం ఏమిటి?

**జవాబు:** మీ అమ్మగారు మిమ్మల్ని వేధిస్తున్నారని బాధపడే ముందు మీరు ఆమె మనస్సు కష్టపడేలా ప్రవర్తిస్తున్నారేమో ఒకసారి ఆత్మవిమర్శ చేసుకోండి. మీ అమ్మగారికి మీలో నచ్చని విషయం ఏమిటో అడిగి తెలుసుకొంటే అపార్థాలకు ఆస్కారం ఉండదు.

Misunderstanding may occur through repression and failure to express the feelings. *- Charles*

ఓ దంపతులు వాళ్ళ అబ్బాయితో రెస్టారెంట్‌కు వెళ్ళి మొదట టమోటా సూప్ ఆర్డర్ చేశారు. సూప్ రాగానే ఆ అబ్బాయి, తండ్రితో "నాన్నా! నేను ఈ సూప్ తాగలేను" అన్నాడు. తండ్రి వెంటనే వెయిటర్‌ను పిలిచి, వెజిటబుల్ సూప్ తీసుకురమ్మని చెప్పాడు. వెయిటర్ వెజిటబుల్ సూప్ తెచ్చి టేబుల్ మీద పెట్టాడు. అబ్బాయి ఆ సూప్ కూడా తాగలేనని మారాం చేశాడు. ఏ సూప్ తెచ్చినా తాగనని అన్నందుకు ఆ అబ్బాయిని తండ్రి మందలించాడు. అందుకు ఆ అబ్బాయి ఏడుస్తూ "సూప్ చాలా వేడిగా ఉంది. చెమ్చా లేకుండా ఎలా తాగగలను?" అని తండ్రితో చెప్పాడు.

ఆ అబ్బాయి సూప్ తాగకపోవడానికి కారణం ఏమిటో తండ్రి పిల్లవాణ్ణి అడిగి తెలుసుకోలేదు. వేడిగా ఉన్న సూప్ తాగడానికి తనకు చెమ్చా కావాలని తండ్రితో ఆ అబ్బాయి చెప్పనూ లేదు. విషయాన్ని వివరంగా అడిగి తెలుసుకోకపోవడమే ఈ సమస్యకు కారణం.

పంతాలకూ, పట్టింపులకూ పోకుండా మనస్సు విప్పి మాట్లాడితే మన నిత్యజీవితంలో ఎదురయ్యే ఎన్నో సమస్యల్ని పరిష్కరించుకోవచ్చు.

మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా:
**యువవాణి**
శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,
దోమల్ గూడ, హైదరాబాద్ - 500 029
E- mail : rkprabhayuvavani@gmail.com

యువవాహిని

## మనసు - మర్మం

– గంపా నాగేశ్వర్‌రావు

# అనంత శక్తికి అధికారులు మీరే!

మనం ఎంతో శక్తిమంతులం కానీ చిన్నప్పటి నుండీ మన తల్లితండ్రులు, స్నేహితులు, మన చుట్టూ ఉన్నవారు నువ్వు "ఆ పని చెయ్యలేవు, ఈ పని చెయ్యలేవు", అని నిరుత్సాహపరిచే మాటలతో మన మనస్సులను ఒక పరిమిత ప్రపంచానికే పరిమితం చేస్తారు.

మీరు ఎప్పుడైనా సర్కస్‌లో జంతువులను చూశారా? సామాన్య మానవుడు భయపడే సింహాలనూ, పులులనూ, ఎలుగుబంట్లనూ, పాములనూ ఆ రింగ్ మాస్టర్ ఎలా ఆడిస్తాడో గమనించారా? చేతిలో కొరడా పట్టుకుని ఎదురుగా నిలుమంటే ఆ పులులు, సింహాలు అతని ముందు తోక ముడిచి, విచిత్ర విన్యాసాలు చేస్తాయి. కొండంత బలం ఉన్నా ఏనుగులు కుక్కపిల్లల్లాగ ప్రవర్తిస్తాయి. ఇదెలా సాధ్యం?

ఎలా అంటే ముందుగా వాటిని అడవిలో నుండి పట్టి తెస్తారు. ఆకలితో మాడ్చి కొరడాతో హింసించి, వాటిని తన దారికి తెచ్చుకుంటాడు రింగ్‌మాస్టర్. మొదట్లో అవి తీవ్రంగా ప్రతిఘటిస్తాయి. కానీ రోజుల తరబడి వాటికి సరైన ఆహారం



పెట్టక, శక్తిహీనమైనవిగా చేసి, వాటిని భయపెట్టి వాటిచేత విన్యాసాలు చేయిస్తాడు రింగ్ మాస్టర్.

ఆ సింహాలు తలచుకుంటే ఆ రింగ్ మాస్టర్‌ను నమిలి మింగేయడానికి ఒక్క నిముషం చాలదూ? తప్పకుండా అవి ఆ పని చేయగలవు. కానీ చేయవు. ఎందుకంటే వాటి మనస్సులలో ఆ రింగ్ మాస్టర్ పట్ల భయం తప్ప మరొకటి లేదు. అవి తమ సహజ గుణాలనూ, తమ సహజ శక్తినీ మరచిపోయాయి. మరచిపోయేలా చేశాడు ఆ రింగ్ మాస్టర్. తను చెప్పినట్లే నడుచుకునేలా వాటికి శిక్షణనిచ్చాడు.

మనలో కొందరు ఆ సర్కస్ జంతువులలానే వ్యవహరిస్తారు. తమ శక్తిని మరచిన స్థితిలో నేడు వారున్నారు. ఆ పరిధి నుంచి బయటపడి ఆలోచించడం వారు నేర్చుకోవాలి.

"సమస్త శక్తీ నీలోనే నిక్షిప్తమై ఉంది. నీకు కావలసిన సహాయం కూడా నీలోనే ఉంది. నీవు విజేతనని అనుకుంటే నీవు విజేతగా ఉంటావు. పరాజితుడనని అనుకుంటే పరాజితుడిగానే మిగిలి ఉంటావు" అన్న వివేకానందుని మాటలు గుర్తుకు తెచ్చుకోండి.

ఒక కప్పను తీసుకువెళ్ళి పెద్ద గాజుతొట్టిలో వేశారు. పై అంచు వరకూ నీళ్ళున్నాయి. అది హాయిగా అందులో తిరుగుతోంది. కాసేపు అయ్యాక ఆ తొట్టి క్రింద మంట పెట్టారు. కాసేపటికి ఆ నీళ్ళు వేడెక్కాయి. హాయిగా తిరుగుతున్న కప్ప నీళ్ళు వేడెక్కడంతో ఆ తొట్టి నుంచి బయటకు గెంతి పారిపోయింది. ఈసారి అదే కప్పను తీసుకుని అదే నీటి తొట్టిలో వేశారు మంట తీసివేసి! తొట్టిపై పారదర్శకమైన గాజు మూత పెట్టారు. కప్ప బెదురుతూ బయటకు ఎగరడానికి ప్రయత్నిస్తుంది. కానీ మూతకు తగిలి లోపలికే పడిపోతుంది. అలా చాలా సార్లు జరిగాక ఆ కప్ప ఇక ఎగరడం మానుకుంటుంది. పై మూత తీసివేశారు. అయినా ఆ కప్ప ఎగిరే ప్రయత్నం చెయ్యలేదు. ఈసారి ఆ తొట్టి క్రింద పెద్దమంట పెట్టారు. లోపల నీళ్ళు మరుగుతుంటాయి. కానీ ఆ కప్ప ఎగిరే ప్రయత్నం చేయదు. చివరకు ఆ వేడికి ప్రాణం కోల్పోతుంది.

చూశారా! ఆ కప్పకు పైకి ఎగిరే శక్తి ఉన్నప్పటికీ ఆ శక్తిని వినియోగించుకోలేకపోయింది! ఫలితంగా ప్రాణం కోల్పోయింది. పరాజితులూ అంతే. తమ శక్తిని తాము గుర్తించరు. ఒకసారి విఫలమైతే ఇక ప్రయత్నమే మానుకుంటారు. అనంత శక్తికి అధికారులం మనమే అని విశ్వసించిననాడు ఎలాంటి ప్రతికూల ఆలోచనల్ని అయినా ప్రతిఘటించవచ్చు. ప్రయత్నించండి.



# యుగ నాయకుడు! యువ నాయకుడు!!

-స్వామి వినిశ్చలానంద

చికాగో మహోపన్యాసాలు ముగిసిన తర్వాత భారతజాతి స్వామి వివేకానందను ఒక గొప్ప దేశ భక్తునిగా కీర్తించింది. కానీ విదేశీయులు ఆయనను ఒక గొప్ప జ్ఞానిగా అభివర్ణించారు. నిజానికి స్వామి వివేకానంద ఒక గొప్ప దేశభక్తుడూ, జ్ఞానీ మాత్రమే కాదు; ఆయన మహామేధావి, విజ్ఞాన విపంచి. సమస్త శాస్త్ర సార సంగ్రహం ఘనీభూతమై ఆవిర్భవించిన విరాట్ పురుషుడు.

పరివ్రాజకుడిగా యావద్భారతం పర్యటించి, మన దేశాన్ని గురించి స్వామీజీ అర్థం చేసుకున్నట్లు మరొకరు అర్థం చేసుకోలేదు. అప్పటి మన దేశ దుస్థితిని చూసి స్వామీజీ చింతించినంతగా మరొకరు చింతించి ఉండరు. ఆయన అవగాహనా శక్తి అత్యద్భుతం. ప్రతి ఒక్కరూ సమస్యల గురించి వివరించేవారే తప్ప, పరిష్కారాలను సూచించేవారు అరుదు. స్వామీజీ దృష్టికోణం వేరు. ఆయన సమస్యలను సమస్యలుగా చూడడమే కాక, ప్రతి సమస్యకూ పరిష్కారం సూచించారు.

భారతదేశాన్ని అర్థం చేసుకోవాలని అనుకొనేవారు తప్పకుండా స్వామీజీ సందేశాన్ని చదవాలి. ఒక సందర్భంలో స్వామీజీ తనను తాను 'సంక్షిప్త భారతావని'(I am condensed India) గా పేర్కొన్నారు.

విద్యావిహీనతే మన దేశ దుస్థితికి కారణం అన్నారు స్వామీజీ. ప్రతి ఒక్కరూ విద్యావంతులు కావాలి. ఆకలితో ఒక దుక్క కూడా పస్తుండకూడదు అనేవారు స్వామీజీ. వృత్తి విద్యలకు అత్యంత ప్రాముఖ్యమిచ్చారు. చెప్పులు కుట్టే కుటీరం నుంచి, వ్యవసాయ క్షేత్రాల నుంచి దేశాభ్యున్నతి కలగాలి అనేవారు. బలమే జీవనం, బలహీనతే మరణం అన్నారు. ఉక్కు కండరాలు, ఇనుప నరాలు కలిగిన కొందరు యువతీ యువకులు తనకు లభిస్తే దేశస్థితినే మార్చివేయగలను అని అన్నారు స్వామీజీ.

అలాంటి యువకులు కచ్చితంగా స్వామీజీని ఆదర్శంగా స్వీకరించాలి. నేటి యువత పైనే స్వామీజీ ఆశలన్నీ. ఆయన జన్మతః ఒక నేత. యువత కోసం యువకుని గానే జీవించి యువకునిగానే అదృశ్యమైన యువనాయకుడు వివేకానంద. అందుకనే ఆయన జన్మదినాన్ని యువజనోత్సవంగా మనదేశం ఘనంగా జరుపుకుంటుంది.

వివేకానందుని గురించి గానీ, ఆయన సాహిత్యాన్ని గానీ చదివినప్పుడు ఉత్తేజభరితులు కాని వారుండరు. యువకులను ఉత్సాహంతో ఉరకలు వేయించగల మహానాయకుడు వివేకానంద. ఈ యువనాయకుణ్ణి ఆదర్శంగా స్వీకరించి, మన దేశ అభ్యున్నతికి మన యువతరం సన్నద్ధం కావాలి.

ఈ యుగ నాయకుడిని గురించి తెలుసుకోవడమే గొప్ప ఆధ్యాత్మిక సాధన. "ఈ వివేకానందుడు ఏమి చేశాడన్నది తెలుసుకోవడానికి మరో వివేకానందుడు కావాలి" అని స్వయంగా ఆయనే అన్నారు.

ఎన్నో కాలాల నుంచి నిద్రాణంగా పడివున్న భారత జాతిని మేల్కొల్పారు స్వామీజీ. సేవా త్యాగాలను మన జాతీయా దర్శాలుగా పేర్కొన్నారు. మహాత్యాగాల వల్లనే మహత్కార్యాలు సాధింపబడతాయనేది స్వామీజీ విశ్వాసం.

నిజానికి త్యాగం చేయవలసింది మనలోని అహంకారాన్ని. వట్టి మాటలతో కాలాన్ని వృథా చేయక, ఆచరణలో చూపా లనేది స్వామీజీ ఆదేశం. కడివెడు కబుర్ల కన్నా గరిటెడు ఆచరణ మేలు అని ఒక చోట స్వామీజీ అన్నారు. మనం ఇప్పటికే ఎంతో సమయం వృథా చేశాం. 'లే, లేచి నిలబడు. గమ్యం చేరే వరకూ ఆగవద్దు' అనే సందేశాన్ని స్వీకరించి, వివేకానందుని మార్గదర్శకత్వంలో అడుగు వేద్దాం. దేశాన్ని క్రాంతి పథంలో నడుపుదాం. ✿

## చెంపదెబ్బ రగిలించిన స్ఫూర్తి



అల్లూరి సీతారామరాజు జీవితాన్ని మలుపుతిప్పిన సంఘటన ఆయన బాల్యంలో రాజమండ్రిలో జరిగింది. ఆయన తండ్రి వెంకట రామరాజు కుటుంబ సమేతంగా రాజమండ్రికి వచ్చి, మెయిన్‌రోడ్డు డీలక్స్ సెంటర్ వద్ద ఫోటో స్టూడియో ఒకటి నడిపేవారు. అప్పుడు సీతారామరాజు వయస్సు ఏడు సంవత్సరాలు. ఒకరోజు సీతారామరాజు, ఆయన తండ్రి వెంకట రామరాజుతో కలిసి గోదావరి గట్టు మీద వాహ్యాళికి వెళుతున్నారు. అదే సమయంలో బ్రిటిషు దొర కొరడా ఝుళిపిస్తూ గుర్రం మీద వెళుతున్నాడు. అదిమాని చిన్నవాడైన సీతారామరాజు కేక వేసి బెదిరిపోయి వెనక్కి తుళ్ళిపడి ఆ దొరకు చేతులెత్తి భయంతో నమస్కారం చేశాడు. దాంతో తండ్రి వెంకట రామరాజు అతని చెంప ఛెళ్ళుమనిపించారు. 'ఇంకెప్పుడూ అలా చేయకు' అంటూ కోప్పడ్డారు. ఆ ఒక్క చెంపదెబ్బే అల్లూరి సీతారామరాజుని బ్రిటిషువారిని గడగడలాడించిన కొదమసింహంలా మార్చింది. ❁ సేకరణ : ఆర్. కృష్ణ

## పెళ్ళినాడు కూడా ప్రయోగమే!



1849 మే 29న వివాహానికి ఏర్పాట్లన్నీ పూర్తి అయ్యాయి. అతిథులు అంతా విచ్చేశారు. వధువు, బంధువులు అందరూ వరుని కోసం ఎదురు చూస్తున్నారు. వివాహం చేయించేందుకు ఫాదరీ వచ్చి కూర్చున్నారు. కానీ పెండ్లి కుమారుని జాడ లేదు, వెదక సాగారు. వరుని మిత్రుడు చప్పూయిస్ అక్కడే ఉన్నాడు. మిత్రుని స్వభావం అతనికి తెలుసు. అతను 'ఎక్కడ ఉండి ఉంటాడు, బహుశా తన ప్రయోగశాలలో!' అనుకుని వెళ్ళి చూస్తే అక్కడే ఉన్నాడు పెళ్ళి కొడుకైన లూయీ పాశ్చర్. వివాహమండపంలో అందరూ అతడి కోసం ఎదురు చూస్తూ ఉంటే, అతడేమో తన ప్రయోగాలలో మునిగి ఉన్నాడు.

"ఏం మిత్రమా! ఇవాళ నీ వివాహమన్న మాట తెలుసా?"

"తెలుసు!"

"అయితే ఇంకా ఇక్కడ ఏం చేస్తున్నావు?"

"అయిపోయింది. ఈ కాస్త పని పూర్తి చేసి వస్తాను. ప్రయోగాన్ని మధ్యలోనే వదలి రావడానికి మనస్కరించ లేదు. కొద్దిసేపటిలో ఇది పూర్తవుతుంది. వెంటనే వచ్చేస్తున్నాను."

"కష్టాలలో ఉన్న ప్రతి మనిషికీ సేవ చేయడమే నాకున్న కోరిక. ఆ మనిషిది ఏ రంగు అయినా, ఏ దేశమైనా కావచ్చు" అని లూయీ పాశ్చర్ చెబుతుండేవాడు.

పాశ్చర్ ఎన్నో కొత్త విషయాలు కనుగొన్నాడు. పట్టుపురుగులను గురించి, సారాయిని పులియబెట్టే సూక్ష్మజీవులను గురించి వివరాలు తెలుసుకొని, దెబ్బతిన్న పరిశ్రమలను రక్షించాడు. పశువులలోనూ, మనుషులలోనూ జీవకణాల ద్వారా రోగాలు వ్యాపిస్తాయి. దీన్ని గురించి పాశ్చర్ అన్వేషణ జరిపాడు. మశూచి లాంటి రోగాలకు ఔషధాలు కనుగొన్నాడు. అన్నిటినీ మించి కుక్క కాటుకు ఆయన మందు కనిపెట్టాడు.

పాశ్చర్‌లా ప్రతి ఒక్కరూ పట్టుదల, వినమ్రత, సేవాపరాయణతలు అలవరుచుకొంటే, ఈ అవనీతలం సుందరంగా మారిపోతుంది. ❁ సేకరణ : జి. సతీష్

# ...ఆ ఆశే శ్వాస

- వి. సైదులు

సముద్రతీరం ...సంధ్యాసమయం... ఇసుకతిన్నెలపై భగవంతుడు వాహ్యాళికి బయలుదేరాడు. తోడుగా మానవజాతికి ప్రతినిధిగా ఓ వ్యక్తి, ఆ విధాత వెంట నడుస్తున్నాడు. మనుష్యులు తన గురించి ఏమనుకుంటున్నారో తెలుసుకోవాలన్న ఆసక్తి కలిగింది ఆ భగవానుడికి. తోడుగా వస్తున్న మనిషితో తన మనసులో మాట చెప్పాడు భగవంతుడు... అప్పుడు మనిషి "ఏం చెప్పమంటావు తండ్రీ! మనుష్యులకు నీ మీద నమ్మకం సన్నగిల్లుతోంది. నీవు కష్టసుఖాల్లో మా వెంటే ఉంటానని అంటావు. కాని వాస్తవానికి నీవు సుఖాల్లో తప్ప, కష్టాల్లో మా దరికి కూడా రావు. తప్పించుకొని, మా మానాన మమ్మల్ని వదిలేస్తావు. ఇది మరీ అన్యాయం. కావాలంటే నా జీవితాన్నే చూడు! నా జీవనగమనాన్ని సూచిస్తున్న ఆ పాదముద్రలు చూడు. సుఖాల్లో నా పక్కనున్నావు... అందుకే నావీ, నీవీ కలిసి నాలుగు పాదముద్రలు కనిపిస్తున్నాయి. కష్టసమయాల్లో చూడు! ఒక జత పాదముద్రలే ఉన్నాయి. అంటే నువ్వు నన్ను ఒంటరిని చేసి వెళ్ళిపోయినట్లే కదా!" అన్నాడు. అప్పుడు ఆ దేవదేవుడు, కరుణాంతరంగుడు, దయామయుడు చిద్విలాసంతో "లేదు నాయనా! నేనెన్నడూ మాట తప్పను. మీ కష్టసుఖాల్లో మిమ్మల్ని వెన్నంటే ఉంటాను. నీ ఆనంద ఆహ్లాదాల్లో నీ వెంట నడిచాను. నీ విషాద విలాపాల్లో నిన్ను నా భుజాన ఎత్తుకున్నాను... ఆ రెండు పాదముద్రలు నావి!" అన్నాడు ఆ మనిషిని ఆలింగనం చేసుకుంటూ...

ఆ జగదోద్ధారకుడికి ఎంతటి ప్రేమో చూడండి మనమంటే! అందుకే ఓ మహాకవి అంటారు – "ఆ అడుగుల సడి నాకొరకే.... ఆ అడుగుల సడి నా కొరకే..."

నిజానికి భగవంతుడు ఎక్కడో కొండపైనో, బండలోనో ఉంటాడనుకోవడం పొరపాటు. అతడు సకల చరాచర సృష్టి జాతంలో అవ్యక్తరూపంగా మమేకమయ్యే ఉన్నాడు. మనం ఊపిరి పోసుకున్న తొలిక్షణం నుంచీ ఆయన మనలోనే ఉంటూ మనల్ని నడిపిస్తున్నాడు. అందుకే ఎంతటి కఠినాతికఠినమైన పరిస్థితుల్లో కూడా మనం ఓదార్పు ఒడి కోసం నిరీక్షించి, వేరెవరిపైనో ఆధారపడాల్సిన అవసరం లేదు. కన్నీటి జడివానలో మన గుండే మనకు గొడుగు పట్టాలి. మనకు ఎవరూ లేరనుకోవడం నైరాశ్యం. మనకు మనం ఉన్నామనుకోవడం అఖండమైన ఆత్మవిశ్వాసం. ఆ ఆశే మనకు శ్వాస...

నీకు నీవే....

"భగవంతుణ్ణి నమ్మనివారిని నాస్తికులని మన ప్రాచీన మతాలు ఘోషిస్తున్నాయి. కానీ తనపై తనకు నమ్మకం లేని

వారే నాస్తికులని ఆధునిక మతసిద్ధాంతాలు వల్లె వేస్తున్నాయి" అంటారు స్వామి వివేకానంద.

సకల వైఫల్యాలకూ మూలకారణం మనపై మనకు నమ్మకం లేకపోవడమే! మనం తరచూ మానసికంగా బలహీనులమవుతూ నిరంతరం ఎవరో ఒకరిపై ఆధారపడటం అలవాటు చేసుకున్నాం. సంతోష, సంతాప సమయాలన్నిటిలో, అవి పంచుకునేందుకు ఎవరో ఒకరు కావాలి. ఇలాంటి Emotional dependence నుండి ఎంత త్వరగా బయటపడితే మన వ్యక్తిత్వం అంత త్వరగా పరిపూర్ణతను సంతరించుకుంటుంది. నిజానికి మనకు మనల్ని మించిన స్నేహితుడు, సన్నిహితుడు, శ్రేయోభిలాషి వేరెవరూ లేరు.

### అందరివాడు... అందనివాడు

సకల మానవాళికీ ఆరాధ్యుడు, ఆదర్శనీయుడు శ్రీకృష్ణుడు. అవమానాలనూ, అవహేళనలనూ అన్నింటినీ ఆయన ఒంటరిగానే ఎదుర్కొన్నాడు. కురుక్షేత్ర యుద్ధాన్ని తన కనుసన్నల్లో కదలాడించాడు. ఒంటరిగా వచ్చాడు, ఒంటరిగానే అవతారాన్ని చాలించాడు. అందరివాడిలా మెలగినా అందనివాడిగానే మిగిలిపోయాడు. అందుకే ఆయన జగదేకనాయకుడు. మన జీవితానికి మనమే సూత్రధారులం, పాత్రధారులం. మనమూ ఈ ప్రపంచంలో నాయకులుగా నిలిచిపోవాలంటే ముందు ఆ ధైర్యస్థైర్యాలను అలవరచుకోవాలి. ఎంతటి క్లిష్ట పరిస్థితులనైనా ఒంటరిగానే ఎదుర్కోవాలి. అందుకే భగవానుడు భగవద్గీతలో అంటాడు "సమదుఃఖ సుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే..." సుఖంలోనూ, దుఃఖంలోనూ ఏ మాత్రం చలించకుండా ఉండేవాడు ధీరుడు, అతడే అమృతత్వాన్ని సాధించగలడు.

### విశ్వాసమే వికాసం...

మక్కాలో మహమ్మద్ ప్రవక్త ఇస్లాం బోధనల్ని ప్రచారం చేస్తున్న సమయమది. కొందరు ఛాందసులు ఆయన ఉదాత్త భావాల్ని వ్యతిరేకిస్తూ ఆయనను హతమార్చేందుకు వెంబడించారు. విషయం తెలిసిన మహమ్మద్ ప్రవక్త మిత్రునితో కలసి సమీపంలోని ఒక గుహలో తలదాచుకున్నారు. సాలెగూళ్ళతో నిండిన ఆ గుహను ఆ ఛాందసులు గమనించలేదు. వేరే చోటు వెతుక్కుంటూ వెళ్ళిపోయారు. గుహలో ప్రవక్తతో స్నేహితుడు "ఇక్కడ ఇద్దరమే ఉన్నాం, ఒకవేళ వాళ్ళు మనల్ని గమనిస్తే ఎంత ప్రమాదం సంభవించేది" అన్నాడు. అప్పుడు మహమ్మద్ ప్రవక్త ఎంతో నిబ్బరంతో "కాదు ఇక్కడ ఇద్దరం కాదు ముగ్గురం ఉన్నాం. ఆ మూడో వ్యక్తే భగవంతుడు" అన్నాడు. అదీ విశ్వాసమంటే!

అదృశ్యమైన శక్తి మన వెన్నంటే ఉంటుంది. కేవలం ఆ శక్తిపై నమ్మకంతో ముందుకు సాగితే చాలు. సమస్త సహాయం మన నుంచే మనకు లభిస్తుంది. మనపై మనకు నమ్మకం సడలనంత కాలం, లోకమంతా కలసికట్టుగా ఎదిరించినా మనం ఓడిపోయే ప్రసక్తే లేదు.

### నీ విధికి నీవే విధాతవు....

వక్త్ ఇన్‌సాన్‌కో అయినా భీ కభీ ఆతా హై.... రాహ్ మే ఛోడ్‌కే ఛాయా భీ చలా జాతా హై... అంటాడు ఓ హిందీ కవి. అవును, మన నీడ కూడా మన నుంచి పారిపోయే పరిస్థితి వస్తుంది. అయినా భయపడాల్సిన పనే లేదు. అలాంటి ఏకాంతంలో మనసుకు నిశ్చలత్వాన్ని నేర్పాలి. ఆ నిశ్శబ్దం నుంచే నిబిడీకృతమైన మన శక్తిని ప్రజ్వలింప చేయాలి. గెలిచిన ప్రతివారినీ, ఎప్పుడో ఒకప్పుడు కాలం ఒంటరిని చేసి ఆడించిందే కానీ ఓడించలేకపోయింది. కారణం మనల్ని సృజించిన ఆ విధాత మనల్ని విజేతలుగానే చూడాలనుకుంటాడు, కానీ పరాజితులుగా కాదు. అందుకే మనం సర్వశక్తులూ ఒడ్డి ప్రయత్నం ప్రారంభించి, స్థిరంగా నిలబడితే చాలు, అన్యమైన సహాయసహకారాలన్నీ ఆయన అందిస్తాడు.

> ఏకాంతానికీ, ఒంటరితనానికీ
> చాలా తేడా ఉంది.
> మనకు ఎవరూ లేరే అని బాధపడటం
> ఒంటరితనం. మనకు మనం
> ఉన్నామనుకుంటూ ఒక్కరమే ఆనందంగా
> గడపడం ఏకాంతం.
> మనలో సృజనాత్మకశక్తి పెరిగేది ఈ
> ఏకాంతంలోనే. అందుకే ఎప్పుడూ మనుష్యుల
> మధ్యే ఉండటం తగ్గించుకోవాలి. తరచూ
> ఏకాంతాన్ని కల్పించుకోవాలి.



### అహం బ్రహ్మాస్మి...

సాక్షాత్తూ సృష్టికర్త తన సహజగుణాలను పోతపోసి మనల్ని తీర్చిదిద్దాడు. తేజస్సు, క్షమ, ఓర్పు, పట్టుదల, పవిత్రత, పరులకు మేలు చేయడం, నిరహంకారం...ఇవన్నీ దైవీగుణాలు. వీటిని సప్త అశ్వాలుగా చేసుకొని మనసు సారథిగా దేహయాత్ర సాగిపోతే మనకు అపజయం అన్నమాటే లేదు. కానీ దురదృష్టవశాత్తూ రాక్షస గుణాలు మనలో దొంగల్లా చొరబడతాయి. కపటం, క్రోధం, గర్వం, దురభిమానం, కాఠిన్యం, అజ్ఞానం, అభిజాత్యం... ఇవి మనస్సును తప్పు దారి పట్టిస్తాయి. ఆ భగవంతుడి సహజ గుణాల్ని పులికిపుచ్చుకున్న మనం అమృతపుత్రులం. ఆ నమ్మకంతో, ఆ ఆత్మవిశ్వాసంతో జీవితాన్ని సుసంపన్నం చేసుకుంటే అజేయులుగా మిగిలిపోతాం.

# లక్ష్యాన్ని సాధించడమే మన లక్ష్యం!

- డాక్టర్ అబ్దుల్ కలాం

(2008 ఏప్రిల్ 3వ తేదీన మాజీ రాష్ట్రపతి డాక్టర్ అబ్దుల్ కలాం విజయవాడ రామకృష్ణ మిషన్‌ను సందర్శించారు. ఆ సందర్భంగా 'వివేకానంద విద్యా విహార్' విద్యార్థులను ఉద్దేశించి డాక్టర్ కలాం చేసిన ప్రసంగం, విద్యార్థులు అడిగిన ప్రశ్నలకు ఆయన ఇచ్చిన స్ఫూర్తి దాయక సమాధానాల సమాహార సారమే ఈ వ్యాసం).

జీవితంలో అభివృద్ధి సాధించాలంటే జీవితానికి ఓ లక్ష్యాన్ని ఏర్పరచుకోవాలి. ఆ లక్ష్య సాధనకై ప్రతి విద్యార్థీ ముఖ్యంగా మూడు అంశాలను అలవర్చుకోవాలి. అవి - సృజనాత్మకత, సత్యసంధత, ధైర్యం.

సృజనాత్మకత: ప్రతి మనిషిలోనూ సృజనాత్మకత నిగూఢంగా ఉంది. ఆ సృజనాత్మకతను వెలికి తీయడానికి విద్య అవసరం. విద్య వల్ల బుద్ధి వికసిస్తుంది. అలాంటి బుద్ధి వల్ల పరిజ్ఞానం లభిస్తుంది. మనం ఉన్నత స్థాయికి ఎదగడానికి తోడ్పడేది జ్ఞానం. కాబట్టి ప్రతి ఒక్కరూ సృజనాత్మకతను అలవర్చుకోవడానికి ప్రయత్నించాలి.

సత్యసంధత: ప్రతి విద్యార్థీ బాల్యం నుంచే సత్యసంధతను అభ్యసించాలి. ఎవరయితే ఈ సత్యసంధతను పాటిస్తారో వారి జీవితం మహోన్నతమవుతుంది. పిల్లల్లో సత్యసంధత అలవడాలంటే ఆ బాధ్యత తల్లితండ్రులు, అధ్యాపకులదే!

ధైర్యం: యువతరం ఏ రంగంలోనైనా విజయం సాధించాలంటే సవాళ్ళను ఎదుర్కొనే మనోబలం, సాధ్యం కాని దాన్ని ఎలాగైనా సాధిస్తాననే పట్టుదల అవసరం. విద్యార్థులు ఉత్తమ పౌరులుగా ఎదగాలంటే సృజనాత్మకత, సత్యసంధత, ధైర్యం తప్పక అలవర్చుకోవాలి.

ఈ మూడు లక్షణాలు అలవర్చుకోవడానికి ఏమి చేయాలి? అందుకు విద్యార్థులు 'సమయాన్ని' వృథా చేయకుండా 'సద్వినియోగం' చేసుకోవాలి.

భూమి సూర్యుని చుట్టూ తిరగడానికి ఒక సంవత్సరం పడుతుంది. సంవత్సరంలో 12 నెలలూ, నెలకి 4 వారాలూ, వారంలో 7 రోజులూ ఉన్నాయి. ఒకరోజులో 24 గంటలూ, గంటకి 60 నిముషాలూ, నిముషానికి 60 సెకన్లూ ఉన్నాయి. సమయం త్వర త్వరగా గడిచిపోతుంది. సమయాన్ని ఎవరం నియంత్రించలేం. మనకు ఇష్టం ఉన్నా, లేకపోయినా భూమి సూర్యుని చుట్టూ తిరుగుతూనే ఉంటుంది. సమయాన్ని మనం అదుపు చెయ్యలేం కానీ సమయంతో పాటు మనం శ్రమించవచ్చు. ఒక డాక్టర్‌గానో, ఇంజనీరుగానో, కలెక్టరుగానో, పారిశ్రామిక వేత్తగానో అవాలనుకుంటే మీరు పరిశ్రమించాలి. "సమయాన్ని వృథా చెయ్యను" అనుకోవాలి. ప్రతీ సెకనూ, ప్రతీ నిమిషమూ, ప్రతీ గంటా, ప్రతీ రోజూ ముఖ్యమైనవే! ఒక్క నిముషం కూడా వృథా చేయకూడదు. సమయాన్ని సద్వినియోగం చేసుకుంటే మీరు ఆశించిన రంగంలో నిష్ణాతులవుతారు.



.......................

రవితేజ: ఇతర దేశాల కన్నా భారతదేశం అగ్రస్థానంలో ఉండాలంటే ఏం చేయాలి?

జవాబు: మన దేశం అగ్రస్థానంలో ఉండాలంటే ప్రతి ఒక్కరూ

మూడు లక్షణాలను అలవర్చుకోవాలి: 1. జీవితంలో ఒక లక్ష్యాన్ని ఏర్పరచుకోవడం 2. లక్ష్యసాధనకై పరిశ్రమించడం 3. లక్ష్యాన్ని సాధించి తీరుతాననే పట్టుదల కలిగి ఉండడం – అంటే ఏ సమస్యా మనల్ని ఓడించకూడదు, మనమే సమస్యలని ఓడించాలి అనే దృఢ నిశ్చయం.







కృష్ణ : విజ్ఞాన శాస్త్రం ఎన్నో విధాలుగా అభివృద్ధి చెందింది; అయినా కొన్ని గ్రామాలలో మూఢ నమ్మకాలు ఇంకా తీవ్రంగా ఉన్నాయి. ఈ మూఢనమ్మకాలను ఎలా రూపుమాపగలం?

జవాబు: విద్య ద్వారా! విద్య వల్ల తార్కికంగా యథార్థాన్ని తెలుసుకునే సామర్థ్యం వస్తుంది. ఉదాహరణకు: భూమి తన అక్షం చుట్టూ తిరిగినంత కాలం రాత్రీ, పగలూ ఏర్పడతాయి. అలాగే భూమి, సూర్యుని చుట్టూ తిరగడానికి సంవత్సరం పడుతుంది. అందువల్ల మంచీ, చెడూ అని లేకుండా అన్ని వేళలూ మంచివే. ఇక్కడ మూఢ నమ్మకానికి తావు లేదు. అందరూ విద్యావంతులయితే మూఢ నమ్మకాల్ని రూపుమాపవచ్చు.

ధనుజ: ఎందుకు ధనవంతులు పేద వారిని దూరంగా ఉంచుతారు? ధనిక –పేద అనే వ్యత్యాసాలు లేకుంటే అందరూ సంతోషంగా ఉండవచ్చుకదా!

జవాబు: కొన్ని సంవత్సరాల పాటు ప్రజలు కష్టించి పనిచేస్తే ధనవంతులు కావచ్చు. భారత్‌లో "విజన్ ఇండియా 2020" అనేది రూపొందించడం జరిగింది. 2020కి భారత్ ఆర్థికంగా అభివృద్ధి చెందిన దేశంగా రూపొందాలి. ఆర్థికంగా వెనుకబడి ఉన్న వారిలో చాలా మందిని ఉద్ధరించడం జరుగుతుంది. అందువల్ల అందరూ సుఖంగా, సంతోషంగా ఉంటారు. మీరందరూ పెరిగి పెద్దయ్యే నాటికి "విజన్ ఇండియా 2020" నిజమై, భారత్ గొప్ప దేశంగా వర్ధిల్లుతుంది.

మిథున్ & అక్షయ్ : నేనొక ఆదర్శవంతమైన వ్యక్తిని అవాలంటే ఏమి చేయాలి?

జవాబు : ఆదర్శవంతమైన వ్యక్తిగా ఎదగాలంటే ... మంచి అధ్యాపకులు, మంచి పుస్తకాలు, మంచి స్నేహితులు, మంచి మనుష్యుల మధ్య ఉండాలి.

కోటేశ్వరి : ఒక దేశ భక్తుడిగా అందరికీ స్ఫూర్తినిచ్చే మీరు మాకిచ్చే సందేశమేమిటి?

జవాబు: "నేను ఏదైనా చెయ్యగలను" అనే ఆత్మ విశ్వాసాన్ని పెంపొందించుకోవాలి. "నేను చెయ్యగలను, మేము చెయ్యగలం, భారత దేశం చెయ్యగలదు" అని అనుకోవాలి.

మానిక: మీరు చేపట్టిన ప్రణాళికలు, ప్రయోగాలన్నిటిలోకీ మీకు బాగా నచ్చింది ఏది?

జవాబు: మేము ఒక బృందంగా చాలా నిర్వహించాం. 'అగ్ని' క్షిపణిని తయారు చేశాం. అంతకు ముందు ఒక న్యూక్లియర్ టెస్ట్ చేశాం. ఆ తరువాతది – విజన్ ఇండియా 2020. అయితే అన్నిటిలోకీ ఎక్కువ సంతోషాన్ని కలగచేసిన సంఘటన ఒకటి ఉంది. 'అగ్ని' కోసం మా బృందం కార్బో‌కార్బన్ హీట్‌షీల్డ్ అని అత్యధిక ఉష్ణాన్ని భరించే లోహంతో చాలా తేలికగా ఉండే కవచాన్ని తయారు చేసింది. మా మిత్రులొకరు (ప్రొఫెసర్ ప్రసాద్, కేర్ సంస్థలో పనిచేస్తున్నారు) నన్ను వికలాంగుల విభాగానికి తీసుకువెళ్ళారు. అంగవైకల్యంతో బాధ పడుతున్న పిల్లల కోసం తేలికగా ఉండే (కార్బోకార్బన్) పదార్థంతో కవచం చేయమని కోరారు ఆయన. అంతవరకూ వారు ఉపయోగిస్తున్న 4 కిలోల బరువు స్థానే 400 గ్రాములతో తయారుచేసి ఇచ్చాం. అందుకు పిల్లలంతా చాలా సంతోషించారు. వారి సంతోషాన్ని చూసి నాకు చాలా ఆనందం కలిగింది. ఆపదల్లో ఉన్నవారికి ఆనందాన్ని ఇవ్వగలిగే ప్రయోగమే నిజమైన ప్రయోగం.

## సౌశీల్యమే పవిత్ర ఆచ్ఛాదన

– షేక్ గౌస్ సాహెబ్

మనస్సులో విజ్ఞానం లేకపోతే నేత్రాలున్నా ప్రయోజనం లేదు. శీలం లేని వాడు కలుపుతోట లాంటివాడు. శీలం ఉన్నవాడు అవగుణాలను వదలి, అవసరగుణాలు అలవరచుకుంటాడు; అర్థానికి కాక ఆచరణకు ప్రాముఖ్యం ఇస్తాడు. అజ్ఞానం, క్రమశిక్షణా రాహిత్యం, సోమరితనాలను వదలి భూషణకు పొంగిపోక, దూషణకు క్రుంగిపోక కార్యక్రమాలు చేస్తుంటాడు. ముఖ్యంగా శీలవంతుడు సమబుద్ధితో సమాజశాంతికై పాటుపడతాడు. కనుక జీవితానికి లక్ష్యం ఆనందం కాదు – శీలం.

కష్టాల వల్ల మనస్సు దృఢపడుతుంది. పరిశ్రమ వల్ల శరీరం గట్టిపడుతుంది. శీలవంతులు చెడుకు దూరంగా ఉండి, మంచిని పెంచి అందరికీ పంచడం తమ ధర్మమని ఎరిగి జీవిస్తారు. కలిమిలో, లేమిలో ధర్మాచరణ వదలరు. కోపాన్ని దిగమింగి ఇతరుల తప్పుల్ని క్షమిస్తారు. ఆదర్శం లేని సాధన, సాధన లేని ఆదర్శం నిష్ప్రయోజనమని శీలవంతుడు గమనించి మసలుకుంటాడు. పిల్లలపై ఇంట్లో తల్లితండ్రుల ప్రభావం, విద్యాలయాల్లో ఉపాధ్యాయుల ఆదర్శాలు, చదువరులపై ఉదాత్తుల చరితలు, సజ్జనుల సహవాస ప్రభావం ఉంటాయి.

"శ్రద్ధావాన్ లభతే జ్ఞానం" – జ్ఞానాభివృద్ధి భక్తి ప్రపత్తుల వల్ల లభ్యమవుతుంది. "బుద్ధిః కర్మానుసారిణీ" – మతిని బట్టి గతి ఉంటుంది. "సర్వం సత్యే ప్రతిష్ఠితమ్" – సకలమూ సత్యమునందే ప్రతిష్ఠింపబడింది. "స్వయం తీర్ణః పరాన్ తారయతి" – స్వయంగా తరించినవాడు పరులను తరింపజేస్తాడు. "ఏకః స్వాదున భుంజీత" – రుచికరమైన పదార్థాన్ని తానొక్కడే భుజింపరాదు. డబ్బు వచ్చి పోతుంది. నీతి వచ్చి వర్ధిల్లుతుంది.

శీలవంతుడు సత్య ప్రియుడిగా ఉంటూ తనను తాను తరింపజేసుకొని, ఇతరుల అవసరాలు తీరునట్లు తరింపజేయడానికి ప్రయత్నిస్తాడు. ఇంట్లో శీలవంతులైన తల్లితండ్రులుంటే పిల్లలు శీలవంతులవుతారు. తల్లి ఒడి మొదటి బడి అని చెబుతారు. ఛత్రపతి శివాజీ శీలవంతుడూ, ఘనుడూ అవడానికి తల్లి జిజియాబాయి కారకురాలు. గాంధీ మహాత్ముడవడానికి తల్లి పుత్లీబాయి సత్యసంధత, పవిత్రత, ఉపవాస దీక్షలు దోహదపడ్డాయి. ప్రేమ, ధర్మగుణాలే ప్రపంచానికి మూల స్తంభాలు. బాధను ఓర్పుతో భరించడమే నిజమైన శీలం. బలం లేనివాడు అందరికీ చులకనే! శీలవంతునికి ప్రకృతి తన హృదయాన్ని విప్పి చెబుతుంది. ❀

భారతీయ మహిళా మణిదీపాలు : మండోదరి



ఆంగ్లమూలం : డాక్టర్ ఎ.వి. రమణి

అనువక్త : రెంటాల జయదేవ

# పతివ్రతా శిరోమణి

లంకాధిపతీ, రాక్షసులకు రాజూ అయిన రావణాసురుడి భార్య మండోదరి. రామాయణంలో ఆమెను పరమ పవిత్రురాలిగా, అపారమైన సుగుణాల రాశిగా అభివర్ణించారు. మృదు స్వభావిని అయిన ఆమె ఎంతో హుందాగా వ్యవహరించేది. రావణుడి పట్ల అపార ప్రేమానురాగాలు చూపేది. సీతాన్వేషణ ప్రయత్నంలో లంకకు వచ్చిన హనుమంతుడు సైతం మొదట మండోదరిని చూసి, ఆమెనే సీతగా పొరపడ్డాడు.

సీతను అపహరించి, నిర్బంధించడం సరైన పని కాదని మండోదరి పదే పదే రావణాసురుణ్ణి హెచ్చరించింది. శ్రీరాముణ్ణి జయించడం ఎవరి వల్లా కాదనే విషయాన్ని తెలిపింది. ఎంతో పవిత్ర జీవితం గడిపిన ఆమెకు పతివ్రతల ఉసురు ఊరకే పోదన్న సంగతి బాగా తెలుసు. పతివ్రతల కంటి నుంచి కారి భూమి మీద పడ్డ కన్నీటిబొట్లు వృథా కావనీ, రాముని పట్ల సీత పాటిస్తున్న పతివ్రతా దీక్షాగ్నిలో రావణాసురుడు దగ్ధం కాక తప్పదనీ మండోదరి హెచ్చరించింది.

ఎన్ని విధాలుగా నచ్చచెప్పినా, ఆమె భర్త ఆమె మాటలు వినలేదు. సీతా నిర్బంధం విషయంలో రావణుడు మూర్ఖంగా వ్యవహరించడం గమనించిన మండోదరి, ఇక తానేమీ చేయలేనని గ్రహించింది. ఆ పతివ్రత తన భర్తకు ఎదురు చెప్పకుండా, ఆయన చేస్తున్న తప్పుల వల్ల కలిగే బాధను నిశ్శబ్దంగా భరించింది. పర్యవసానంగా భర్తకు ఎదురయ్యే వినాశనానికి మౌనంగా సిద్ధపడింది. రావణాసురుణ్ణి వివాహమాడినందు వల్ల తనకు సంభవించిన పరిణామాల్ని అంత దుఃఖంలోనూ హుందాగా ఎదుర్కొంది ఆమె.

పవిత్ర జీవనం, భర్త పట్ల అపారమైన భక్తి ప్రపత్తుల్ని ప్రదర్శించడంలో మండోదరి సాటిలేని మహిళ. ప్రాతఃకాలంలో ప్రతి ఒక్కరూ స్మరించాల్సిన ఏడుగురు పుణ్యవతులలో మండోదరి కూడా ఒకరు. ❀




# హరిపద ధ్యానము

## (శ్రీ రామకృష్ణ కథామృతంలోని పాటలు)

## సి. డి. ఆవిష్కరణ

శ్రీరామకృష్ణులు భావ పారవశ్యంలో భగవంతుణ్ణి స్తుతిస్తూ, స్మరిస్తూ ఎన్నో పాటలు పాడారు. అవన్నీ ఎంతో భావ గర్భితంగా ఉంటూ జీవిత రహస్యాలను, భక్తితత్త్వాన్నీ విశదీకరించేవిగా ఉంటాయి. వాటిని అర్థవంతంగా తెలుగులోకి అనువదించి 'శ్రీరామకృష్ణ కథామృతం'లో క్రోడీకరించారు. ఆ పాటలను అన్నింటినీ హైదరాబాద్ రామకృష్ణమఠం వారు 'భజన మాల' పుస్తకం రెండవ ముద్రణలో పొందుపరిచారు.

ఆ భక్తి రసామృతాన్ని భావసహితంగా, సరళమైన శైలిలో, సామాన్యులు సైతం పాడుకునేవిధంగా గానం చేశారు స్వామి జ్ఞానదానంద. ఆ గానసుధాలహరిని 'హరిపద ధ్యానము' అనే పేరుతో సి.డి.గా రూపొందించారు. దానిలో **1. మనసా చేయుము... 2. హరిపద ధ్యానము... 3. హే! భక్తి ప్రియా!.. 4. మునుగవే లోతుకు... 5. హరి హరి హరియని 6. ఎన్నటికో నికెన్నటికో... 7. ప్రసన్న వదనముతోడ... 8. ఎన్నడు అడిసమేగు...** అంటూ వీనులవిందైన పల్లవులతో మొదలయ్యే ఎనిమిది పాటలు ఉంటాయి. ఈ సి.డి.లను 2008 జూలై 18 శుక్రవారం గురుపూర్ణిమ పర్వదినాన విడుదల చేయనున్నారు. కేవలం ఆరోజున మాత్రం భక్తులకు వాటిని **తగ్గింపు ధర : రూ. 20 కే (అసలు ధర రూ. 40)** అందజేస్తారు. ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని 'హరిపద ధ్యానము'లో ఓలలాడుతూ తరించాలని కోరుతున్నాం. ❀



# ఉత్తమ శిష్యుని లక్షణాలు

- స్వామి శ్రీకాంతానంద

"గురు కృపాంజన పాయో మేరే భాయీ" - గురువు అనుగ్రహం (కృప) నాకు లభించింది అంటారు సంత్ కబీర్ దాస్. మనస్సు పవిత్రమైతే మనం అన్నీ సాధించగలం. ఈ క్రింది లక్షణాలను అలవరచుకుంటే గురువు అనుగ్రహం మనకు కూడా లభిస్తుంది.

**1.** నమ్రత: మనలో అహం ఉంటే మనం ఆధ్యాత్మిక జీవితానికి అనర్హులమవుతాం. 'శ్రీరామకృష్ణ కథామృతం' రచించిన 'మ' తాను విద్యావంతుడు కనుక తనకు అన్నీ తెలుసుననీ, తన భార్య నిరక్షరాస్యురాలు కనుక ఆమెకు ఏమీ తెలియదనీ శ్రీరామకృష్ణులతో వాదించాడు. ఆధ్యాత్మిక శిక్షణ, లౌకిక విద్య కన్నా భిన్నమైనది. చాలామంది "నేను విద్యాధికుణ్ణి కనుక నాకు గురువు అవశ్యకత లేదు" అనుకుంటారు. ఉపనిషత్తులు, వేదాలలో చెప్పినట్లు గురు పరంపర అనే అవిచ్ఛిన్న సంప్రదాయం వలన గురువు అవశ్యకత తెలుస్తుంది. నిజానికి మనందరికీ 'కార్పణ్యదోషం' అంటే మనోదుర్బలత్వం ఉంటుంది. శ్రీకృష్ణునితో అర్జునుడు "శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్ - నిన్ను శరణాగతి కోరుతున్న నీ శిష్యుణ్ణి నేను. నా మనస్సు వికలమై ఉంది. ధర్మాచరణకు సరైన మార్గం చూపు" అని శరణు వేడగా శ్రీకృష్ణుడు, అర్జునునికి ధర్మబోధ చేశాడు. నమ్రత (అణకువ) ఉంటే గురువు అనుగ్రహం తప్పక కలుగుతుంది.

**2.** వివేకం: నిత్యానిత్య వస్తువుల మధ్య, సత్యాసత్యాల మధ్య భేదాన్ని గ్రహించాలి.

పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో
నిర్వేదమాయాన్నాస్త్యకృతః కృతేన ।
తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్
సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్ ॥ (ముండకోపనిషత్తు)

"ఈ ప్రపంచాన్ని పరీక్షించి, కర్మ ఫలితమే ఈ ప్రపంచం అని తెలుసుకో" అని ముండకోపనిషత్తు చెబుతోంది. 18-19 ఏళ్ళ వయస్సులోనే నరేంద్రనాథ్ (స్వామి వివేకానంద), గురువు ఆవశ్యకతను గుర్తించారు. అలాగే ఆయన ఎన్నో గ్రంథాలు పఠించారు, కానీ తృప్తి కలగలేదు. అందువల్ల గురుదేవుల శరణు వేడారు.

"మీరు భగవంతుణ్ణి చూశారా" అని శ్రీరామకృష్ణుల్ని స్వామి వివేకానంద అడిగారు. గురుదేవులు ఈ ప్రశ్న విని చాలా ఆనందించారు. నచికేతునికి సత్యాన్వేషణలోగల శ్రద్ధను గమనించిన యముడు ఆనందించాడు. సత్యం కోసం సర్వస్వాన్నీ పరిత్యజించగలగాలి. మన అహాన్నీ, ఐహిక సుఖాల్నీ కూడా త్యజించాలి.

**3. విశ్వాసం:** గురువు మాట మీద విశ్వాసం ఉండాలి; ఇది చాలా ముఖ్యం. ఆదిశంకరుల వారు 'వివేకచూడామణి'లో "శాస్త్రస్య గురువాక్యస్య సత్యబుద్ధ్యా" - శాస్త్రాల పట్ల, గురువాక్యం పట్ల విశ్వాసం ఉండాలని అంటారు.

గురువైన గౌతముడు సత్యకాముడికి 400 ఆవులనిచ్చి వాటి సంఖ్య వెయ్యి అయ్యేవరకూ అడవి నుంచి తిరిగి రావద్దని ఆదేశించాడు. సత్యకాముడు మారుమాట్లాడకుండా ఆ ఆవులను తీసుకొని అడవులకు వెళ్ళాడు. గురువు ఆదేశాన్ని పాటించడం వల్ల అతనికి బ్రహ్మజ్ఞానం లభించింది. బెంగాల్‌ను మరచి పోయి, హిమాలయాలకు వెళ్ళి, అక్కడి రోగులకు వైద్యసహాయం చెయ్యాల్సిందిగా స్వామి కల్యాణానందజీని స్వామి వివేకానంద ఆదేశించారు. స్వామి కల్యాణానందజీ తాము తుదిశ్వాస విడిచేవరకూ ఆ ఆదేశాన్ని పాటించారు. గురు వాక్యం మీద విశ్వాసం లేకపోతే ప్రగతిని సాధించలేం.

**4. భక్తి:** గురువు పట్ల భక్తి ఉండాలి. గురువు పట్ల, దైవం పట్ల అపార భక్తి గలవాడు మహాత్ముడు. గురుసేవ వల్ల ఆత్మసాక్షాత్కారం కలుగుతుంది. ఆదిశంకరులను సేవించడం వల్ల పద్మపాదునికి దైవసాక్షాత్కారం లభించింది. గుర్వాజ్ఞను పాటించడానికి గురుసేవ కోసం ఉధృతంగా ప్రవహిస్తున్న నదిని దాటాడు అతడు. అలా దాటుతున్నప్పుడు, అతను మునిగిపోకుండా ఆ నది అతని పాదాల కింద పద్మాలను వికసింపజేసింది.



స్వామీజీకి కూడా గురుదేవుల పట్ల అపారమైన భక్తి విశ్వాసాలు ఉండేవి. నెలరోజులు గురుదేవులు తన వంక చూడకపోయినా, తనతో మాట్లాడకపోయినా గురుదేవుల దర్శనానికి వెళ్ళడం మానలేదు స్వామీజీ . "నాకు మీరంటే ఇష్టం, అందుకే మిమ్మల్ని చూడాలని వస్తున్నాను" అన్నారు ఆయన. శ్రీరామకృష్ణులు తమ ప్రత్యక్షశిష్యులకు "మానవసేవే మాధవ సేవ" అని చెప్పినప్పుడు, మిగిలిన శిష్యులు దానిలోని అంతరార్థాన్ని గ్రహించలేకపోయారు. అయితే నరేంద్రుడు (స్వామి వివేకానంద) మాత్రం గురుదేవుల మాటల్లో ఇమిడి ఉన్న భావాన్ని గ్రహించాడు; శ్రీరామకృష్ణులు నరేంద్రకు అష్టసిద్ధులు ప్రసాదిస్తాననీ, వాటి వల్ల అతను ధర్మబోధ చెయ్యగలడు కానీ దైవసాక్షాత్కారానికి అవి తోడ్పడవనీ అన్నప్పుడు తనకు అష్టసిద్ధులు వద్దని అంటాడు నరేంద్ర. అది విని గురుదేవులు చాలా ఆనందించారు.

**5. శ్రద్ధ :** స్వామి రామానందుల శిష్యుడవ్వాలని కబీర్‌దాస్ కోరిక. అయితే తాను మహమ్మదీయుడు కనుక వారు తనని శిష్యునిగా స్వీకరించరేమోనని అతని సందేహం. అందువల్ల రామానందుల వద్ద నుండి మంత్రం పొందాలని రోజూ వారు గంగాస్నానానికి వెళ్ళే తోవలో ఒకరోజు గంగ ఒడ్డున మెట్ల మీద పడుకున్నాడు కబీర్. ఉదయం 4 గంటలకు నదీ స్నానానికి వెళుతుండగా చీకట్లో కబీర్ దేహం కాలికి తగలగానే రామానందులు "రామ రామ రామ" అన్నారు. అది విని దానినే తన (ఇష్ట) మంత్రంగా స్వీకరించాడు కబీర్. ఇలాంటి శ్రద్ధ ఉంటే దేనినైనా సాధించవచ్చు.

పైన చెప్పిన లక్షణాలు అలవడినప్పుడు గురువు అనుగ్రహం (గురు కృపాంజన) లభిస్తుంది. గురుకృపతో మనలోని అజ్ఞానం తొలగి అంతరాత్మ దర్శనం లభిస్తుంది. ❁

ధ్యాన మూలం గురోర్మూర్తిః
పూజా మూలం గురోః పాదం ।
మంత్ర మూలం గురోర్వాక్యం
మోక్ష మూలం గురోః కృపా ॥

ధ్యానాధారం గురువు. గురుపాదములు పూజాధారం. గురూపదేశం మననానికి ఆధారం. గురుకృప మోక్షప్రాప్తికి మూలం. ❀

...17వ పేజీ తరువాయి.

కావేరి నదికి ఆవలిగట్టున మహాలింగస్వామి ఆలయానికి వెళ్ళి, శివుణ్ణి ప్రతిరోజూ దర్శించేవాడు శ్రీధరయ్య. ఒకసారి వర్షాకాలంలో కావేరీనది వరదలతో ఉధృతంగా ఉంది. అందువల్ల నదిని దాటి శివుణ్ణి దర్శించలేకపోయాడు.




శ్రీధరయ్య ఎడతెగక నామజపం చేస్తున్నాడు. అప్పుడు ఎవరో తలుపు తట్టారు. తలుపు తీసి...




అంతా ఆ మహాలింగస్వామి కృపా కటాక్షం!



మరునటి రోజు శివాలయానికి వెళ్ళాడు శ్రీధరయ్య.












సచ్చిదానందస్వరూపుడైన భగవంతుణ్ణి శాశ్వతంగా బంధించడానికై భక్తుని చేతిలో ఉండే దారమే 'ప్రేమ'. ఈ ప్రేమతో భక్తుడు భగవంతుణ్ణి తనకు అత్యంత ఆప్తునిగా భావిస్తాడు. ఇలాంటి భక్తిని పొందిన వ్యక్తి 'పరమేశ్వరా! నాకు ఐశ్వర్యం వద్దు, కీర్తి వద్దు, సౌఖ్యం వద్దు. నీ పాదారవిందాల్లో నాకు వినిర్మల భక్తిని ప్రసాదించు' అని భగవంతుణ్ణి ప్రార్థిస్తాడు. ✤

– శ్రీరామకృష్ణ పరమహంస

# గ్రంథ స్వీకారం



## ఉపదేశ పీయూషమ్

రచన : స్వామి అఖండానందగిరి
పేజీలు : 121, వెల : తెలుపలేదు
ప్రతులకు : మేనేజర్, శ్రీవ్యాసాశ్రమం, శ్రీవ్యాసాశ్రమం (పోస్టు), ఏర్పేడు (మండలం), చిత్తూరు జిల్లా - 517 621



## ధర్మపథం

రచన: బులుసు వేంకట రమణయ్య
పేజీలు: 162, వెల: 95/-
ప్రతులకు: బి.వి.ఆర్. ట్రస్ట్, 146, డోయన్స్ టౌన్‌షిప్, శేరిలింగంపల్లి, హైదరాబాద్ - 500 019

## సాలగ్రామ శాస్త్రం



సంపాదకులు: కపిలవాయి లింగమూర్తి
పేజీలు: 212, వెల: 150/-,
ప్రతులకు: కె. కిశోర్‌బాబు, 17-110, వాణీ నదనం, నాగర్‌కర్నూలు, మహబూబ్‌నగర్ జిల్లా - 509 209

## శ్రీవరివస్యా రహస్యము



ఆంధ్ర వివరణకర్త - పరిష్కర్త: పాతూరి సీతారామాంజనేయులు
పేజీలు: 200, వెల: 90/-
ప్రతులకు: టాగూరు పబ్లిషింగ్ హౌస్, షాప్ నెం. 20, వైశ్యా హాస్టల్ బిల్డింగ్, కాచిగూడ చౌరస్తా, హైదరాబాదు - 27



## ఓంకార విజ్ఞానము

రచయిత: కాశీభట్ల సుబ్బరామ శర్మ
పేజీలు: 118, వెల: తెలుపలేదు
ప్రతులకు: కాశీభట్ల సుబ్బరామ శర్మ శ్రీ సాయినాథ్ కాంపౌండ్ శ్రీరాముల పేట, ప్రొద్దుటూరు కడప జిల్లా.



## గుణానంద లహరి

రచయిత: ప్రయాగ
పేజీలు: 90, వెల: 20/- ప్రతులకు: ఇం.నెం. 17-1-388/5, ప్లాట్ నెం. 20, రోడ్ నెం. 16, శ్రీలక్ష్మీనగర్ కాలనీ, సైదాబాద్, హైదరాబాద్ - 500 059.

## శ్రీసద్గురు రాఘవేంద్ర స్వామి జీవిత చరిత్ర



రచయిత: ఓరుగంటి రామకృష్ణప్రసాద్,
పేజీలు: 235, వెల: 70/-
ప్రతులకు: నవరత్న బుక్ హౌస్, 28-22-20, రెహమాన్ వీధి, అరండల్ పేట,విజయవాడ-520 002

## మణిద్వీప వర్ణన



రచన: జోస్యుల రామచంద్రశర్మ,
పేజీలు: 79, వెల : 58 /-,
ప్రతులకు: పీసపాటి దుర్గాప్రసాద్, కెనరా బ్యాంక్ వీధి, నిడదవోలు, పశ్చిమ గోదావరి జిల్లా.



## ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి

గ్రంథకర్త: ఆచార్య ఖండవల్లి లక్ష్మీ రంజనం, ఖండవల్లి బాలేందు శేఖరం,
పేజీలు: 454, వెల: 135/- ప్రతులకు: టాగూరు పబ్లిషింగ్ హౌస్, షాప్ నెం. 20, వైశ్యా హాస్టల్ బిల్డింగ్, కాచిగూడా చౌరస్తా, హైదరాబాదు - 500 027



## వయోజన సంస్కృత పాఠమాలా

రచయిత: పులవర్తి నూకాలరావు,
పేజీలు: 113, వెల: 30/-,
ప్రతులకు: సంస్కృత భారతి, శివరావు వీధి, సత్యనారాయణపురం, విజయవాడ - 520 011.

# వార్తావాహిని

## విద్యార్థులకు వేసవి శిబిరం







హైదరాబాద్ రామకృష్ణ మఠం బాలబాలికలకు నెల రోజుల పాటు వేసవి శిబిరాన్ని నిర్వహించింది. సుమారు 1120 మంది విద్యార్థినీ విద్యార్థులు పాల్గొన్న ఈ శిబిరంలో యోగాసనాలు, భజనలు, గీతాపారాయణం మొదలైన అంశాలలో శిక్షణ నిచ్చారు. ఏప్రిల్ 27న గ్రేటర్ హైదరాబాద్ అదనపు మునిసిపల్ కమిషనర్ డాక్టర్ వాణీ మోహన్ ప్రారంభించిన ఈ శిబిరం మే 24న ముగిసింది. ఈ ముగింపు కార్యక్రమానికి ముఖ్య అతిథిగా ఆంధ్రప్రదేశ్ దేవాదాయ, ధర్మాదాయ శాఖ కమిషనర్ శ్రీ సుందర్ కుమార్ పాల్గొని సంగీతం, వక్తృత్వ, పారాయణ పోటీల్లో విజేతలైన విద్యార్థులకు బహుమతి ప్రదానం చేశారు. విద్యార్థులు ప్రదర్శించిన సాంస్కృతిక కార్యక్రమాలు అందరినీ అలరించాయి. ❀ నివేదిక : స్వామి శ్రీకాంతానంద

## 'వివేకానంద విద్యా నికేతన్' శంకుస్థాపన



కడప రామకృష్ణ మిషన్‌ను ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి డాక్టర్ వై.ఎస్. రాజశేఖర్ రెడ్డి మే 22న సందర్శించి, 'వివేకానంద విద్యా నికేతన్' పాఠశాల భవనానికి శంకుస్థాపన చేశారు. ఈ కార్యక్రమంలో చెన్నై శ్రీరామకృష్ణ మఠం అధ్యక్షులు స్వామి గౌతమానందజీ మహరాజ్, స్థానిక ఎం.పి. శ్రీ వివేకానంద రెడ్డి, చెన్నైలోని విజయా ఆసుపత్రి ట్రస్టీ శ్రీ పి. రమణా రెడ్డి పాల్గొన్నారు. ❀ నివేదిక : స్వామి ఆత్మవిదానంద

## ఆధ్యాత్మిక అంతర్యోగం



ఖమ్మం శ్రీరామకృష్ణ సేవాసమితి మే 4వ తేదీన ఆధ్యాత్మిక అంతర్యోగ శిబిరాన్ని నిర్వహించింది. ఈ కార్యక్రమంలో గుంటూరు శారదా మఠం అధ్యక్షులు ప్రవ్రాజిక భవానీప్రాణ మాతాజీ, ప్రవ్రాజిక బోధమయప్రాణ మాతాజీ, డాక్టర్ పన్నాల శ్యామసుందరమూర్తి పాల్గొని శ్రీరామకృష్ణ, శ్రీశారదాదేవి, స్వామి వివేకానందుల జీవిత సందేశాలపై ప్రసంగించారు. సుమారు 60 మంది పాల్గొన్న ఈ కార్యక్రమంలో భక్తులు గీతా, లలితా సహస్రనామ పారాయణం చేశారు. ❀ నివేదిక: కె. త్రివిక్రమరావు

# సుబోధ



ధనం ఉందని గర్వపడనవసరం లేదు. నేను ధనికుడనంటావా, నీ కన్నా ఎందరో అధిక ధనవంతులున్నారు. వారితో పోల్చి చూస్తే నువ్వు వట్టి దరిద్రుడవని చెప్పాల్సి వస్తుంది. సంధ్య చీకట్లు కమ్మగానే మిణుగురులు బయలుదేరి "మేమే ప్రపంచానికి వెలుగునిస్తున్నాం" అని గర్విస్తాయి. కానీ నక్షత్రాలు మినుకు మినుకుమని ప్రకాశించగానే మిణుగురుల గర్వం అణగుతుంది. అప్పుడు నక్షత్రాలు "లోకాన్నంతా మేమే ప్రకాశింపజేస్తున్నాం" అని తలపోస్తాయి. కాసేపయ్యాక చంద్రుడు ఉదయించి, తన చల్లని కిరణాలతో ప్రకాశించగా, నక్షత్రాలు వెలవెలపోతాయి. ఆ చంద్రుడు, తన కాంతితో లోకాన్నంతా శోభాయమానం చేస్తున్నానని పొంగి పోతుంటాడు. ఇంతలో ప్రభాత కాలం తూర్పుదిశలో సూర్యోదయ వైభవాన్ని చాటుతుంది. అప్పుడు చంద్రుడి ప్రభావం ఏమైంది?

ధనాధికులమని విర్రవీగేవారు ఈ ప్రకృతి యథార్థాలను అవలోకించి, తమ భోగభాగ్యాల గురించి, అధికారం గురించి మిడిసిపడకుండా ఉండాలి.

('శ్రీరామకృష్ణ బోధామృతం' నుంచి)


శ్రీరామకృష్ణ ప్రభ

రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్ - 500 029

ఫోన్: 040-2766 7799, 2763 3936

E-mail : sriramakrishnaprabha@gmail.com



నిర్వాహక సంపాదకులు: స్వామి జ్ఞానదానంద

సంపాదకులు: స్వామి పరిజ్ఞేయానంద

# సురభి

ఉద్బోధన్ కార్యాలయంలో పనిచేసిన చంద్ర మోహన్ మాతృదేవితో చనువుగా మెలిగేవాడు.

ఒకరోజు వృద్ధ సాధువులలో ఒకరు అతణ్ణి, "నువ్వు అనుకున్నప్పుడల్లా మాతృదేవి వద్దకు వెళ్ళగలుగుతున్నావు. ప్రసాదం స్వీకరిస్తున్నావు. కానీ నువ్వెందుకు ముక్తి కావాలని అమ్మను ప్రార్థించవు?" అని అడిగారు.

అందుకు చంద్రమోహన్ "అదేం గొప్ప విషయం! ఇదిగో ఇప్పుడే వెళ్ళి అడిగి వస్తాను" అంటూ గొప్పలు చెబుతూ మాతృదేవిని వెతుక్కుంటూ వెళ్ళాడు.

అప్పుడు మాతృదేవి పూజలో ఉన్నారు. చంద్రమోహన్ ఆమె దృష్టిని ఆకర్షించడానికి గది తలుపు వద్ద నిలబడ్డాడు. కానీ కొంతసేపటికి అతడి శరీరం కంపించసాగింది.

మాతృదేవి అతణ్ణి చూసి 'ఏం కావాలి?' అంటూ సైగ చేశారు. అతడు వెంటనే బదులు చెప్పలేకపోయాడు. తడబడుతూ నిలబడ్డాడు. ఇన్ని రోజులుగా అడుగుతున్న అలవాటు ప్రకారం, "నాకు ప్రసాదం కావాలి" అన్నాడు. మాతృదేవి ఏమీ మాట్లాడకుండా ప్రసాదం ఉన్నచోటు చూపారు. అతను కూడా ఎప్పటిలాగే ప్రసాదం తీసుకుని తిరిగి వచ్చాడు.

ముక్తిని పొందాలంటే శారదమ్మ అనుగ్రహంతో అర్హతను సాధించాలి.

('శ్రీశారదాదేవి చరితామృతం' నుంచి)



Vol.65-7, Sri Ramakrishna Prabha (Telugu Monthly) July 2008, Regd. with the Registrar of Newspaper for India Under
No. 1120/57. Postal Registration No. H-HD-1071/2007-09. Licensed to Post Under WPP : CPMG/AP/HC-13/WPP/2007-09.

# శ్రీ పరమాచార్య చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ వేదాధ్యయనానుసన్ధాన ప్రతిష్ఠానమ్

## ప్రవేశ / ఉద్యోగ ప్రకటన

**1. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది కోర్సులకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) 'వేదచూడామణి' : ఋగ్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క అధ్యయనము
యోగ్యతలు : మాతృభాషలో చదువగలిగి, వ్రాయగలిగి ఉండాలి.
వయస్సు : 8 నుంచి 10 సంవత్సరాల మధ్య
స్టైఫండ్ : నెలకు రూ. 1,000/-

(ఆ) 'వేదార్థచూడామణి' : ఋగ్వేదము/ యజుర్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క భాష్యాధ్యయనము
యోగ్యతలు : సంస్కృత పరిజ్ఞానముతో బాటు ఏదో ఒక వేదాన్ని పూర్తిగా అధ్యయనం చేసి ఉండాలి.
వయస్సు : 15 సం॥, ఆ పైన
స్టైఫండ్ : నెలకు రూ. 3,000/-

**2. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది ఉద్యోగాలకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) వేదాధ్యాపకుడు : (సామవేదము/ అథర్వవేదము – వేదానికి ఒక్కొక్కరు చొప్పున రెండు ఖాళీలు)
కావలిసిన అర్హతలు : క్రమాంతము లేక పదాంతము
అదనపు అర్హతలు : ఏదైన మఱియొక వేదము/ వేదభాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవము : 2 సంవత్సరములు
సంభావన : నెలకు రూ॥ 8,000/- మొత్తము, సౌకర్యములతో

(ఆ) వేదభాష్యాచార్యుడు : (ఒక్కొక్క వేదానికి ఒక్కొక్కరు చొప్పున 4 ఖాళీలు)
విద్యార్హత : ఏదైనా వేద భాష్యంలో ఉత్తీర్ణత
అదనపు అర్హత : మరొక వేద భాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవార్హత : 5 సం॥
సంభావన : నెలకు రూ. 10,000/- మొత్తము, సౌకర్యములతో

ముద్రించిన దరఖాస్తు ఫారములను **శ్రీ పి. వేంకటేశ్వర్లు గారు, మేనేజింగ్ డైరెక్టర్, కాకతీయ సిమెంట్, సుగర్ & ఇండస్ట్రీస్ లిమిటెడ్, 'గురుకృప' (ఆంధ్రా బ్యాంకు ఎదురుగా), 1 - 10 - 140/1, అశోక్‌నగర్, హైదరాబాద్ - 500 020** (ఫోను: 040 – 27637717) నుంచి ప్రత్యక్షముగా గాని, పోస్టు ద్వారా గాని పొందవచ్చు. పూర్తి చేయబడిన ఆ ముద్రిత దరఖాస్తులను ఈ పై అడ్రసుకు పంపవలెను. అవసరాన్ని బట్టి ఖాళీలను పూరించుట లోనూ, అర్హతల సవరణ లోనూ మేనేజ్‌మెంటుకు అధికారము కలదు.

సం/-
హైదరాబాద్ కులప్రశాసకుడు



Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 65 సంచిక: 8 ఆగష్టు 2008

కృష్ణ! త్వదీయపదపఙ్కజపఞ్జరాన్త-
మద్యైవ మే విశతు మానసరాజహంసః
ప్రాణప్రయాణసమయే కఫవాతపిత్తైః
కణ్ఠావరోధనవిధౌ స్మరణం కుతస్తే

స్వామీ! ఈ క్షణం నుండి నా మనస్సనే రాజహంస నీ పాదపద్మాలలో లయమయ్యేటట్లు అనుగ్రహించు! ఈ శరీరం నుండి ప్రాణం పోయే సమయంలో కఫవాత పిత్తాలు కంఠానికి అవరోధమైతే నీ స్మరణ ఎలా చేయగలుగుతాను? అందువల్ల ఇప్పటి నుండే నీ స్మరణ చేసే శక్తి నాకివ్వు. (ముకుంద మాల)






## లోపలి పేజీల్లో...































# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి




ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు......** రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**రాజ పోషకులు...........** రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**పోషకులు................** రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| | దాత పేరు చిరునామా | రూ. |
|---|---|---|
| రాజ పోషకులు : | శ్రీ కృష్ణమూర్తి, సరూర్‌నగర్, హైదరాబాద్-500 035 | 6,000 |
| | కీ॥శే॥ కావలిపాటి రామచంద్రరావు జ్ఞాపకార్థం, విశాఖపట్నం - 530 001 | 5,050 |
| | శ్రీ ప్రభాకర్ రెడ్డి, తార్నాక, సికింద్రాబాద్- 500 017 | 5,000 |
| | శ్రీమతి కస్తూరమ్మ & శ్రీ పి.వి. రెడ్డి, కొంగరెడ్డిపల్లి, చిత్తూరు - 517 001 | 5,000 |
| పోషకులు : | శ్రీ యు.ఎల్.ఎన్. పట్నాయక్, సాలిగ్రామపురం, విశాఖపట్నం - 530 024 | 2,000 |
| | శ్రీ నేరెళ్ళ వెంకట సుబ్బారావు, గిద్దలూరు, ప్రకాశం జిల్లా -523 357 | 1,116 |
| | శ్రీ అంజయ్య ఉప్పల, ఫీల్‌ఖానా, హైదరాబాద్ - 500 012 | 1,116 |
| | శ్రీ సి.వి.జి. శంకర్, విల్లివాకమ్, చెన్నై - 600 049 | 1,001 |
| | శ్రీ జి. రవిందర్, విల్లివాకమ్, చెన్నై - 600 049 | 1,001 |
| | శ్రీ అనిల్ కుమార్, కళ్యాణ్‌నగర్, హైదరాబాద్ - 500 018 | 1,000 |
| | శ్రీ రఘు కుమార్, కర్నూల్ రోడ్, ఒంగోల్- 523 002 | 1,000 |



ప్రియ త్రిగుణాతీతానంద,
శ్రీరామకృష్ణుల సందేశం ప్రతి ఇంటికీ చేరేందుకు పత్రికను ప్రారంభించు. సంసార తాపాగ్నిలో చిక్కుకున్నవారికి ఆయన సందేశమే శరణ్యం. ప్రజలను బలవంతంగానైనా ఒప్పించి పత్రికను చదివేలా చేయు... – స్వామి వివేకానంద



| చందా వివరాలు | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|
| విడి ప్రతి : | రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా : | రూ. 100 | $ 20 |
| మూడు సంవత్సరాలకు : | రూ. 280 | $ 50 |
| ఐదు సంవత్సరాలకు : | రూ. 450 | $ 80 |
| ఇరవై సంవత్సరాలకు : | రూ. 1500 | $ 360 |



గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి. పంపవలసిన చిరునామా : Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.

## లోపలి పేజీల్లో...





## శ్రీరామకృష్ణ ప్రభ వార్షిక చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా! దిగువ పేర్కొన్న నెంబర్ల నడుమ ఉన్న సంవత్సర చందాదారుల చందా గడువు తీరిపోనుంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకొని, 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.*

90000 - 96067 మధ్యనున్న వారిలో **సంవత్సర** చందాదారుల చందా గడువు **2008 ఆగష్టుతో** తీరిపోనుంది!

100001 - 102300 మధ్యనున్న వారిలో **సంవత్సర** చందాదారుల చందా గడువు **2008 సెప్టెంబర్‌తో** తీరిపోనుంది!

**శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ.... - సర్క్యులేషన్ మేనేజర్**

_ మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు. ❖ మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి. ✷ మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.

'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకి కుడి భాగంలో మీ చందా గడువు నెల పొందుపరచబడి ఉంది.

ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకుడు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు.

- సంపాదకులు




**SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH**

Domalguda, Hyderabad - 500 029. Andhra Pradesh

Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com

మనిషి సంఘజీవి. సంఘంలో జీవిస్తున్న ప్రతి మనిషికీ ఇతరుల సహాయ సహకారాలు అవసరం. ఇతరుల సహాయం లేకపోతే ఈ భువిపై మానవ మనుగడే కష్టతరమవుతుంది. మనిషి జీవించడానికి గాలి,నీరు,ఆహారం ఎంత ముఖ్యమో ప్రేమాప్యాయతలనూ, సానుభూతి సహకారాలనూ, సుఖదుఃఖాలనూ పంచుకోవడానికి వేరొకరి సాన్నిత్యం, సాంగత్యం కూడా అంతే ముఖ్యం.

మనిషిగా జన్మించిన ప్రతి ఒక్కరిలోనూ భావోద్వేగాలు అనివార్యం. ఆ భావోద్వేగాలను బయటకు వ్యక్తపరచు కోవడానికి సన్నిహితుల అవసరం ఎంతైనా ఉంది. మన

# స్నేహమే ఓ పెన్నిధి!



కష్టనష్టాలను మనసు విప్పి సన్నిహితులతో చెప్పుకుంటే మనోభారం తగ్గి మానసిక ఆహ్లాదం పెరుగుతుందని ఆధునిక మానసిక వైద్యులు కూడా నిరూపించారు.

**వ్యాధితస్యార్థహీనస్య దేశాంతరగతస్య చ ।**
**సత్యస్య శోకదగ్ధస్య సుహృద్దర్శనమౌషధం ॥**

'వ్యాధితో బాధపడేవానికీ, పేదరికంలో ఉన్నవానికీ, దేశాంతరగతుడైనవానికీ, సత్యవంతుడైనవానికీ, శోకతప్తుడైన వానికీ మిత్రుల దర్శనమే గొప్ప ఔషధం'.

కాబట్టి మానవ జీవితం ప్రశాంతంగా కొనసాగించడంలో స్నేహితుల పాత్ర అత్యంత ప్రధానమైనది.

**నిజమైన స్నేహితుడు :** సుఖదుఃఖాల్లో మనకు తోడూ నీడగా ఉంటూ మన శ్రేయస్సును కాంక్షించేవాడే నిజమైన మిత్రుడు. అలాంటి విశ్వాసపాత్రుడు, శ్రేయోభిలాషి అయిన వ్యక్తిని స్నేహితునిగా పొందగలిగితే అదే నిజమైన శాశ్వత సంపద. స్నేహబంధం అతి పవిత్రమైనది. స్నేహం కేవలం ప్రాపంచిక ప్రయోజనాలకే కాదు ఆధ్యాత్మిక మార్గంలో పురోగతికి కూడా తోడ్పడుతుంది.

బృందావన గోపగోపికలు శ్రీకృష్ణుని సాంగత్యంలో పొందిన ఆనందం వర్ణనాతీతం. వారు శ్రీకృష్ణుని నుంచి ఆశించింది ఏమిటి? కేవలం ఆయనతో ప్రతిఫలాపేక్షలేని పవిత్ర స్నేహాన్ని మాత్రమే! అలాగే అర్జునుడు శ్రీకృష్ణుణ్ణి మిత్రునిగానే భావించాడు. భక్తుడు భగవంతుణ్ణి స్నేహితునిగా భావించి ఆయన్ని పొందవచ్చు. సుహృదం సర్వభూతానాం – 'స్నేహితుల మధ్య స్నేహాన్ని నేనే' అని అంటాడు శ్రీకృష్ణుడు. కాబట్టి స్నేహం అతి పవిత్రమైనది.

In happiness, in misery, in famine, in pain, in the grave, in heaven, or in hell who never gives me up is my friend. Is such friendship a joke? A man may have salvation through such friendship.*- Swami Vivekananda*

"సుఖదుఃఖాల్లోనూ, కరువుకాటకాల్లోనూ, స్వర్గ నరకాల్లోనూ వెన్నంటి తోడుగా ఉండేవాడే నిజమైన స్నేహితుడు. నిజానికి అలాంటి స్నేహితుణ్ణి పొందడం దుర్లభం. ఎలాంటి ప్రతిఫలాన్నీ ఆశించని స్నేహం ముక్తికి సోపానం" అంటారు స్వామి వివేకానంద.

**స్నేహితుల్లో రకాలు :** మంచివారితో స్నేహం పరమశాంతినిస్తే చెడ్డవారి సావాసం ప్రాణ సంకటంగా పరిణమిస్తుంది.

**వేఱుపురుగు చేరి వృక్షంబు జెఱచును**
**చీడపురుగు జేరి చెట్టు చెఱచు**
**కుత్సితుండు చేరి గుణవంతు జెఱచురా**

అని అన్నారు యోగి వేమన. కాబట్టి స్నేహితుల్ని ఎన్నుకొనే ముందు వారి స్వభావాన్ని బాగా పరిశీలించి, పరీక్షించి ముందడుగు వేయాలి. Chance makes our parents, but choice makes our friends – మంచి స్నేహితుల్ని ఎంపిక చేసుకోవడం మన చేతుల్లోనే ఉందంటారు అనుభవజ్ఞులు.

There are three kinds of friends - best friends, guest friends and pest friends. *- Laurence J. Peter*

Best friend : తన సుఖాన్ని సైతం త్యజించి కేవలం స్నేహితుని శ్రేయస్సునే అభిలషించేవాడు ఉత్తమ స్నేహితుడు.

Guest friend : తన అవసరాలు తీరేంతవరకూ స్నేహంగా ఉండి అర్ధాంతంగా కనుమరుగైపోయేవాడు మధ్యముడు.

Pest friend: ఐశ్వర్యం, అధికారం రాగానే అహంకారపూరితుడై స్నేహితునికే హాని తలపెట్టేవాడు అధమ తరగతికి చెందేవాడు.

**అధికార గర్వంతో అంధత్వం:** అధికారం, సంపదలు – మనిషిని అహంకార పూరితుణ్ణి చేస్తాయి. వీటి వ్యామోహంలోపడి మనిషి మంచీ, చెడుల మధ్య విచక్షణా జ్ఞానాన్ని కోల్పోతాడు. గర్వం పెరిగి మిత్రుల్నీ, ఆత్మబంధువుల్నీ నిరాదరిస్తాడు. వారితో సంబంధమే తనకు చిన్నతనంగా భావించి వారిని అగౌరవపరచడానికి కూడా వెనుకాడడు. అధికార గర్వంతో అంధుడైన మనిషి ఎలా ప్రవర్తిస్తాడో తెలుసుకోవడానికి ద్రుపదరాజు వృత్తాంతమే ఒక ఉదాహరణ.

ద్రోణుడు, ద్రుపదుడు చిన్నప్పటి నుంచీ గాఢ స్నేహితులు. వారిద్దరూ కలిసి అస్త్రవిద్యను అభ్యసించారు. ద్రోణుడు పేదవాడు కాబట్టి తాను రాజ్యాధికారం చేపట్టినప్పుడు తన రాజ్యంలో సగభాగం ద్రోణుడికి ఇస్తానని ద్రుపదుడు మాట ఇచ్చాడు. ద్రోణుడు అస్త్రవిద్యలో నిష్ణాతుడైనప్పటికీ పేదరికం మాత్రం అతణ్ణి పీడిస్తూ వచ్చింది. తన చిన్ననాటి స్నేహితుడైన ద్రుపదుడు రాజు అయ్యాడని ద్రోణుడికి తెలిసింది. ద్రోణుడు ద్రుపదరాజు ఆస్థానానికి వెళ్ళి వారిద్దరి స్నేహం గురించి గుర్తుచేశాడు. ద్రుపదుడు ఐశ్వర్య మదంతో కన్నూ మిన్నూ కానక 'నువ్వెవరో నాకు తెలియదు. నేను రాజాధిరాజును, నీవు అష్టదరిద్రుడవు. దరిద్రుడికీ, ధనికుడికీ; మూర్ఖుడికీ, విద్వాంసుడికీ; పిరికివాడికీ, వీరుడికీ స్నేహం అసంభవం'. అని ద్రుపదుడు ద్రోణుణ్ణి అవమానించాడు.

ఐశ్వర్యం, అధికారం కలిగినప్పుడు అహంకారంతో స్నేహితుణ్ణి అవమానపరిచేవాడు అధముడు.

**ఎంత ఎదిగినా ఒదిగి ఉండే తత్త్వం :** ఎంత ఎదిగినా ఒదిగి ఉండే తత్త్వం కలిగి చిన్ననాటి మిత్రుల్ని సైతం ఆదరించి వారికి చేతనైన సహాయం చేసే సద్గుణం ఉత్తమ మిత్రుని లక్షణం.

శ్రీకృష్ణుడు, కుచేలుడు బాల్యస్నేహితులు. ఇద్దరూ సాందీపుని వద్ద విద్యనభ్యసించారు. కుచేలుడు వేదవేదాంగాలు అభ్యసించిన మహాపండితుడు. కానీ అతణ్ణి దారిద్ర్యం వీడలేదు. తినడానికి తిండి కూడా లేక భార్యాబిడ్డలతో సహా పస్తులు ఉండాల్సిన పరిస్థితి అతడిది. కుచేలుడు భార్య సలహాపై ద్వారకలో ఉన్న తన చిన్ననాటి స్నేహితుడైన శ్రీకృష్ణుని వద్దకు ఆర్థిక సహాయం కోసం బయలుదేరి వెళ్ళాడు. ద్వారకకు పయనమై వెళుతుండగా 'శ్రీకృష్ణుడు ద్వారకాధిపతి, యాదవ ప్రభువు, చిన్ననాటి స్నేహితుడినైన ఈ పేద బ్రాహ్మణుణ్ణి గుర్తుపడతాడో లేదో? ద్వారపాలకులు నన్ను రాజప్రాసాదంలోనికి వెళ్ళనిస్తారో లేదో?" ఇలా ఎన్నెన్నో ఆలోచనలు కుచేలుణ్ణి కలవరపరిచాయి. చివరికి శ్రీకృష్ణుడున్న అంతఃపురంలోకి కుచేలుడు ప్రవేశించాడు. శ్రీకృష్ణుడు కుచేలుణ్ణి చూడగానే పరుగెత్తుకువచ్చి ప్రేమతో ఆహ్వానించి ఆలింగనం చేసుకున్నాడు. ఎన్నో ఏళ్ళ తరువాత బాల్యస్నేహితుణ్ణి చూసినందుకు ఆనంద పారవశ్యంతో తన పక్కనే కూర్చోబెట్టుకుని చిన్ననాటి కబుర్లలెన్నో చెప్పాడు. అష్టైశ్వర్యాలతో తులతూగుతున్న శ్రీకృష్ణుడు, కుచేలుడు ప్రేమతో తెచ్చిన అటుకులను అమృతతుల్యంగా ఆస్వాదించి సంతృప్తి చెందాడు. కుచేలుడు కటిక దారిద్ర్యం అనుభవిస్తున్నాడని గ్రహించి అతనికి అష్టైశ్వర్యాలను ప్రసాదించాడు శ్రీకృష్ణుడు.



ద్వారకాధిపతి అయిన శ్రీకృష్ణుడు ఎక్కడ, దుర్భర దారిద్ర్యంలో మునిగి ఉన్న కుచేలుడు ఎక్కడ? సిరి సంపదలతో తులతూగుతున్న వారు ఒకరైతే, చేతిలో చిల్లిగవ్వకూడా లేని నిరుపేద మరొకరు. కయ్యానికైనా, వియ్యానికైనా సమ ఉజ్జీలు అవసరమంటారు. కానీ పవిత్ర స్నేహబంధం ముందు అధికారం, ఐశ్వర్యం అడ్డురావు అని తన జీవితంలో ఆచరించి చూపించాడు అచ్యుత కృష్ణుడు. మనం కూడా ఈ ఆదర్శాన్ని ఆచరణాత్మకం చేయగలిగితే **'స్నేహమే ఓ పెన్నిధి!'** అవుతుంది.

# కష్టాలెన్నయినా కాపాడేది ఆయనే!

ఒక ఘోరమైన అడవిలో ఒక లేడి తన రెండు పిల్లలతో నెమ్మదిగా వెళుతోంది. అలా ముందుకు సాగుతున్న లేడి కంటికి ఒక వేటగాడు వేసిన వల కనబడింది. ముందుకు వెళితే ప్రమాదమని వెనుతిరిగే సరికి భయంకరంగా మొరుగుతూ అతి వేగంగా పరుగులు తీస్తూ వస్తున్న వేటకుక్కలు రెండు కనపడ్డాయి. వాటి బారి నుండి ఎలాగైనా తప్పించుకోవాలని ఎడమవైపు తిరిగేసరికి దూరంగా ఒక ఎలుగుబంటి పరుగు పెట్టుకుంటూ రావడం కనపడింది. ఎడమ పక్కకు వెళితే ప్రమాదమని గ్రహించి కుడివైపు వెళదామని అటు తిరగగానే 'మంచి ఆహారం దొరకబోతోంది' అన్నట్లుగా గుటకలు మింగుతూ వస్తున్న తోడేలును చూసింది. ''ఈ స్థితిలో ఏమిటి చెయ్యడం,



భగవంతుడా" అని పైకి చూసేసరికి దగ్గర్లోనే ఉన్న పెద్ద మర్రి చెట్టు మీద విషం పూసిన బాణాన్ని ఎక్కుపెట్టడానికి సిద్ధంగా ఉన్న వేటగాడు కనిపించాడు. ఇంతటి క్లిష్టతరమైన పరిస్థితిలో ఏమిటి చెయ్యడం అనుకుంటుండగా దూరంగా రగులుతున్న దావానలం విజృంభించి పెద్దపెద్ద చెట్లు అతి వేగంగా కాలిపోసాగాయి. ఆ చప్పుళ్ళకు గుహలో ఉన్న మృగరాజు బయటకు వచ్చి దిక్కులు ప్రతిధ్వనించేటట్లు గర్జించసాగింది. అటువంటప్పుడు ఆ లేడి మానసిక స్థితి వర్ణనకు అందనిది!

ఆ హరిణి తన రెండు కనులూ మూసి ఏకాగ్రచిత్తంతో లక్ష్మీనాథుణ్ణి 'ఆర్తత్రాణ పరాయణా! నాకు ఎదురైన దయనీయ స్థితి ఏ ప్రాణికీ ఎన్నడూ కలుగకూడదు. ఈ చిక్కుల నుండి బయట పడే మార్గం ఏదైనా ఉందా? నీవే శరణు!" అని ప్రార్థించసాగింది.

అంతలో కాలసర్పం కాటు వెయ్యగా కిరాతుడు చెట్టు మీద నుండి క్రిందపడ్డాడు. అతని చేతిలో సిద్ధంగా ఉన్న విషం పూసిన బాణం గురి తప్పి ఎలుగుబంటికి తగలడంతో, అది గిలగిల లాడుతూ నేలకూలింది. తోడేలు తమ వేటను పట్టుకుపోతుందేమో అని వేటకుక్కలు రెండూ దాన్ని తరుముతూ అడవిలోకి వెళ్ళి మాయమయ్యాయి. ఈలోగా దావానలం నుండి ఒక అగ్ని కణం గాలికి వచ్చి వల మీద పడింది. వల కాలిపోయింది. సరిగ్గా అప్పుడే అంతటి వేసవి కాలంలో ఆకాశం మేఘావృతమై కుంభవృష్టి పడి, దావానలం అణిగిపోయింది. అన్ని చిక్కులూ క్షణాలలో తొలగిపోవడం చూసిన ఆ లేడి హృదయం ఆనందంతో ఎంత ఉప్పొంగిందో!

ఈ కథను వేదవ్యాసుల వారు కేవలం ఒక లేడిని ఉద్దేశించి చెప్పలేదు. ప్రతి మనిషీ తన జీవనయాత్రలో ఎప్పుడో ఒకప్పుడు ఇలాంటి క్లిష్టమైన సన్నివేశాలను ఎదుర్కోక తప్పదు. వర్ణనాతీతమైన చిక్కులలో చిక్కుకున్న వాడు భగవంతుడి కరుణకు పాత్రుడు కాగలిగితే ఆ కష్టాలను సునాయాసంగా అధిగమించగలడు.



ఏ అపార కరుణామయుని అనుగ్రహం వల్ల మనం అత్యంత దుర్లభమైన మానవ జన్మను పొందగలిగామో ఆ దేవదేవుణ్ణి మనకున్న ఇరవైనాలుగు గంటల కాలంలో కనీసం ఒక్క గంట కూడా ప్రార్థించకుండా అజ్ఞానంలో పడి కొట్టుకుపోతున్నాం! సర్వకాల సర్వావస్థలలో కాకున్నా ఉదయం, సాయంకాలం (రెండు సంధ్యలలోనూ) తప్పక ఒక అరగంట భగవన్నామ సంకీర్తన ప్రతి ఒక్కరూ చెయ్యాలి. అది మానవ జీవితానికి కావలసిన మార్గాన్ని సమయానుకూలంగా చూపుతుంది. "కలౌ స్మరణాన్ ముక్తిః" అన్న పెద్దల మాటను అర్థం చేసుకొని, శ్రద్ధా విశ్వాసాలతో భగవంతుణ్ణి స్తుతిస్తూ జీవనయాత్రను కొనసాగించాలి అందరూ!

# స్వర్గం ఎక్కడ ఉంది? - స్వామి రంగనాథానంద





పుణ్యం కోసం దేవతలనందర్నీ పూజించడం ఉన్నతమైన పూజ కాదు. అలా చేసేవారి పుణ్యఫలాలు కొంతకాలం వరకే ఫలించి, పుణ్యం తీరిపోయాక మరల యథాస్థితికి చేరుతారు. అది శాశ్వతంగా నిలిచి ఉండే ఫలితం కాదు. పరిమితంగా ఉన్న కార్యం యొక్క ఫలితం కూడా పరిమితంగానే ఉంటుంది.

**తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి**
**ఏవం త్రయీధర్మమనుప్రపన్నా గతాగతం కామకామా లభన్తే**

చాలా విశాలమైన స్వర్గలోకంలో ఉండి, 'క్షీణే పుణ్యే' - పుణ్యం తరిగిపోయాక, 'మర్త్యలోకం విశన్తి' - మళ్ళీ యథావిధిగా భూలోకంలోకి వస్తావు. మళ్ళీ కొత్తశరీరం, కష్టపడడం మామూలుగా జరుగుతుంటుంది. 'ఏవం త్రయీ ధర్మం అనుప్రపన్నా' - మూడు వేదాల్లో తెలియజేసిన ధర్మం ప్రకారం, కర్మకాండను అనుసరించి, 'గతా గతం' -వస్తూ, పోతూ ఉంటారు. ఎందుకు? 'కామ కామా లభన్తే'- కోరికలు ఉండడం చేత ఆ విధంగా జరుగుతుంటుంది. అది ఏమంత ఆనందమైన జీవితం కాదు.

ఉపనిషత్తుల ద్వారా జ్ఞానకాండను పరిశీలించినట్లయితే, నీ యందే అనంతమైన స్వర్గం ఉంది. దాన్ని నువ్వు వదలి పెట్టి, చిన్న చిన్న ఆనందాల కోసం అక్కడకు, ఇక్కడకు తిరుగాడుతున్నావు అని చెప్పడం వల్ల, ఉపనిషత్తుల్లో స్వర్గం ఉనికికి చాలా తక్కువ ప్రాముఖ్యం ఇవ్వబడింది. భగవద్గీత కూడా ఆ విధంగానే చెప్పింది. ఇక్కడే స్వర్గాన్ని సృష్టించు అని అన్ని పురాణాలూ చెప్పాయి. తర్వాత ఆ స్వర్గానికి వెళ్ళే కార్యక్రమం క్రమంగా తగ్గిపోయి, భక్తుడిగా భగవంతుణ్ణి పూజిస్తూ, ప్రజలను అదే ఉద్దేశంతో సేవించు అన్న భావం కలిగింది. శ్రీమద్భాగవతంలో దేవతలు ఈ దేశంలో పుట్టడానికి ఇష్టపడతారు అని చెప్పారు.

'భారతదేశం' పవిత్రమైన భూమి. స్వర్గంలో దేవతలందరూ సమావేశమై, 'మనం చేసిన పుణ్య ఫలాలు అన్నీ తరిగిపోయాక ఏ మాత్రమైనా పుణ్యం మిగిలి ఉన్నట్లయితే మనం దానితో భారతావనిలో పుట్టాలి' అని తీర్మానించారట. ఇది పుణ్యభూమి అనీ, వారు ఇక్కడ జన్మించాలనీ ఇష్టపడతారు. ఎందువల్లనంటే భక్తులు, జ్ఞానుల చేత ఈ భూమి పావనమయింది. అందువల్ల భారతదేశాన్ని పుణ్యభూమిగా చెబుతున్నారు. ఇక్కడ ఉన్నవారు అది తెలియక స్వర్గానికి వెళ్ళాలనుకుంటే, స్వర్గం లోనివారు ఇక్కడకు రావాలనుకుంటున్నారు. మన దేశీయులు అమెరికా వెళ్ళాలని అనుకుంటూ ఉంటే, అమెరికా వారు ఇక్కడకు రాదలచిన విధంగా ఉందన్న మాట. అందరిలో దైవాన్ని చూడు. 'దైవం అక్కడ, అక్కడ అన్నది అజ్ఞానం. ఇక్కడ ఇక్కడే అన్నది జ్ఞానం' అని శ్రీరామకృష్ణ పరమహంస చెప్పారు.

ఇది కర్మభూమి, స్వర్గం భోగభూమి. పుణ్యం తరిగిపోయినంతనే భోగభూమి నుంచి తిరుగు ప్రయాణం కావలసిందే. మనం దైవాన్ని అంతటా చూడగలిగితే, దాని వల్ల అందరి పట్లా ప్రేమ కలుగుతుంది. అలా అంతా ప్రేమతో నిండిపోతే ఈ భువియే దివిగా మారుతుంది.

## పండుగలు - పర్వదినాలు

**ఆగష్టు- 2008**

| | | | |
|---|---|---|---|
| 12 | మంగళవారం | : | ఏకాదశి |
| 16 | శనివారం | : | స్వామి నిరంజనానంద జయంతి |
| 24 | ఆదివారం | : | శ్రీకృష్ణ జయంతి |
| 27 | బుధవారం | : | ఏకాదశి |
| 29 | శుక్రవారం | : | స్వామి అద్వైతానంద జయంతి |

**సెప్టెంబర్- 2008**

| | | | |
|---|---|---|---|
| 03 | బుధవారం | : | వినాయక చతుర్థి |
| 11 | గురువారం | : | ఏకాదశి |
| 23 | మంగళవారం | : | స్వామి అభేదానంద జయంతి |
| 25 | గురువారం | : | ఏకాదశి |
| 29 | సోమవారం | : | స్వామి అఖండానంద జయంతి |

# దక్షిణేశ్వరంలో ద్వారకా కృష్ణుడు



- స్వామి జ్ఞానదానంద

క్రీణీహి భోః ఫలానీతిశ్రుత్వా సత్వరమచ్యుతః ।
ఫలార్థీ ధాన్యమాదాయ యయౌ సర్వఫలప్రదః ॥
(శ్రీమద్భాగవతం-దశమస్కంధం-
11వ అధ్యాయం-10శ్లో.)

జగన్నాటక సూత్రధారి, సర్వాంతర్యామి అయిన కృష్ణుని బాల్యలీలలు అంతులేనన్ని! ఎన్ని మార్లు విన్నా, చదివినా అవి కొత్తగానే ఉంటాయి.

కృష్ణుడు బాల్యంలో తన తోటివారితో ఆటలాడుకుంటూ ఉండగా ఒక స్త్రీ 'పండ్లు కావాలా? రండి; బాబూ రండి! పండ్లు కొనుక్కోండి" అంటూ వీధిలో పండ్లు అమ్మసాగింది. ఆ కేక విని



సర్వఫల ప్రదాత అయిన కృష్ణుడు "నాకు కొన్ని పండ్లు ఇవ్వు" అన్నాడు. ఆమె "మరి, నేనిచ్చే పండ్లకు తగిన వెల ఇవ్వాలి" అంది.

"వెల అంటే ఏమిటి?" అని అడిగాడు బాలకృష్ణుడు ఎంతో అమాయకంగా!

"నువ్వు పండ్లు తీసుకుంటే, వాటి బదులుగా నాకు తిరిగి ఏమైనా ఇవ్వాలి" అంది ఆమె.

"సరే, నేను ధాన్యం ఇస్తాను, నాకు పండ్లిస్తావా?" అన్నాడా బాలకృష్ణుడు. "అలాగే! వెళ్ళి ధాన్యం తీసుకురా" అంది ఆమె.

నల్లని కురులు ముఖం మీద చిరుగాలికి కదిలీ కదలనట్లు కదులుతుండగా, తల మీద అలంకృతమైన నెమలి పింఛంతో, చెవులకు రత్నఖచిత కుండలాలు, చేతులకి రత్న కంకణాలు, కంఠాన ముత్యాలపేర్లు, రత్నమణి మయహారాలు, దండకడియాలు, బంగారు మొలత్రాడు, తెల్లని పట్టుపంచతో, కలువరేకుల లాంటి కన్నులతో, నీలమేఘ ఛాయతో, నుదుట కస్తూరీ తిలకం, హృదయభాగంలో కౌస్తుభమణితో, కాలి అందెలు ఘల్లుఘల్లు మంటుండగా ముగ్ధమనోహర రూపలావణ్యాలు, పసిడి పలుకులు పరవశింపజేస్తుండగా చిన్ని కృష్ణుడు లోపలికి వెళ్ళి పద్మాల లాంటి దోసిలి నిండా ధాన్యం తెచ్చాడు.

ఫలవిక్రయిణీ తస్య చ్యుతధాన్యం కరద్వయమ్ ।
ఫలైరపూరయద్ రత్నైః ఫలభాండమపూరి చ ॥
(శ్రీమద్భాగవతం - దశమస్కంధం - 11వ
అధ్యాయం-11శ్లో.)

లోపలి నుండి వీధి గుమ్మం దగ్గరకు వచ్చేసరికి దోసిట్లోని గింజలన్నీ దోవ అంతా పడిపోయాయి. ఆమె పారవశ్యంతో బాలకృష్ణుని చూస్తూ లేత గులాబీ రంగులో మెరుస్తున్న చిన్నికృష్ణుని చేతుల్లో పండ్లను ఉంచి, బుట్టను నెత్తిమీద పెట్టుకొని ఇంటికి బయల్దేరింది. ఇంటికి వెళ్ళిన తరువాత పండ్లగంపలో విలువైన రత్నాలు, మణులు ఉండడం

చూసి ఆమె ఆశ్చర్యపోయింది. ఆ బాలుడు దైవాంశ సంభూతుడని గ్రహించింది.

బృందావనంలో బాలకృష్ణుడు ఎవరినైతే తనకు పండ్లను ఇమ్మని అడిగాడో ఆమెనే తనకు వెన్న తినిపించమని దక్షిణేశ్వరంలో మారాం చేశాడు. శ్రీరామకృష్ణుల భక్తురాలైన అఘోరమణీదేవికి బాలకృష్ణుడు ఆరాధ్య దైవం. బాలకృష్ణుడు ఎల్లవేళలా ఆడుతూ పాడుతూ అల్లరిచేస్తూ ఆమెతోనే ఉండేవాడు. బాలకృష్ణునిపట్ల ఆమెకున్న అనన్య భక్తి కారణంగా అఘోరమణీదేవిని 'గోపాలేర్‌మా' (గోపాలుని తల్లి) అని పిలిచేవారు.

శ్రీరామకృష్ణులు గోపాలేర్‌మాను ఉద్దేశించి "కృష్ణావతారంలో పండ్లు విక్రయించిన ఆ బృందావన స్త్రీయే ఈ అఘోరమణి" అని చెప్పారు.

మొదటిసారి శ్రీరామకృష్ణులను దర్శించుకొన్న తరువాత గోపాలేర్‌మాకు గురుదేవుల పట్ల అత్యంత ఆకర్షణ జనించింది.

కాలాంతరంలో గోపాలేర్‌మా తన అనుభవాలను ఇలా వర్ణించారు:

"ఒకరోజు వేకువజామున మూడు గంటలకు నేను జపం చేయడానికి కూర్చున్నాను. అప్పుడు నా ఎడమ వైపున శ్రీరామకృష్ణులు కూర్చుని ఉండడం చూశాను. ఆయన కుడి చేతి పిడికిలి బిగిసి ఉంది. 'ఇదేమిటి? ఈ వేళప్పుడు ఈయన ఇక్కడికెలా వచ్చారు?' అని ఆశ్చర్యపోయాను. నేను అలా చూస్తుండగా శ్రీరామకృష్ణులు కూర్చుని చిరునవ్వులు చిందిస్తున్నారు. నేను ఆయన దగ్గరకు వెళ్ళేసరికి శ్రీరామకృష్ణులు అదృశ్యమైపోయారు. ఆ స్థానంలో బాల గోపాలుడు పాకుతూ వచ్చి 'అమ్మా! వెన్న తినిపించు' అని అడిగాడు. ఆ విచిత్ర అనుభవానికి విస్తుపోయాను.

నేను విలపిస్తూ, 'నాయనా! ఏమీలేని అభాగ్యురాలిని. నీకు ఏం తినిపించగలను? నాయనా! ఎక్కడ నుండి వెన్న, పాలు తెచ్చి ఇవ్వగలను?' అని అన్నాను. ఆ గోపాలుడు నా మాటలు పట్టించుకొంటాడా? 'తినేందుకు ఏమన్నా పెట్టు' అని సతాయిస్తూనే ఉన్నాడు. నేనేం చేయగలను? ఏడుస్తూ లేచి నిలబడి, ఎండుకొబ్బరి ఉండను తెచ్చి అతడి చేతిలో పెట్టాను. తరువాత, 'నాయనా, గోపాలా! ఈ పనికిమాలిన పదార్థాన్ని తినడానికి ఇచ్చానని నాకు మాత్రం ఇలాంటిది తినడానికి ఇవ్వవద్దు' అని చెప్పాను."

గోపాలేర్‌మా దక్షిణేశ్వరం వచ్చినప్పుడు జరిగిన సంఘటనను ఒక భక్తురాలు ఇలా వివరించారు:

"ఒకరోజు శ్రీరామకృష్ణులు తన చిన్న మంచం మీద కూర్చుని సమాధిమగ్నులయ్యారు. గోపాలేర్‌మా ఆయన ప్రక్కన వచ్చి కూర్చుంది. శ్రీరామకృష్ణులు చిన్న పిల్లవాడిలా వెళ్ళి ఆమె ఒళ్ళో కూర్చున్నారు. ఆమె కళ్ళ వెంట అశ్రువులు ధారలు కట్టాయి. తనతో పాటు తెచ్చిన వెన్న మీగడలను స్వహస్తాలతో ఆయనకు తినిపించసాగింది. పట్టరాని



ఆనందంతో ఆమె లేచి నిలబడి, 'బ్రహ్మ నృత్యం చేస్తున్నాడు, విష్ణువు నృత్యం చేస్తున్నాడు' అంటూ గదిలో నృత్యం చేయసాగింది. ఆమె భావపారవశ్యాన్ని చూసి గురుదేవులు నవ్వుతూ నాతో, 'అలా చూడు. ఆమెలో పరమానందం పొంగిపొరలుతోంది. ఆమె మనస్సు ప్రస్తుతం గోలోకంలో ఉంది' అని అన్నారు".

గోపాలేర్‌మా ఒకసారి అపరిమిత భావపారవశ్యంలో "నా గోపాలుడు ... అదుగో నీలో (శ్రీరామకృష్ణులను చూపుతూ) ప్రవేశించాడు... ఇదుగో మళ్ళీ బయటికి వస్తున్నాడు... రా నాయనా! ఈ పేదతల్లి ఒళ్ళో వచ్చి కూర్చో" అని ఆమె అంది. ఆ గోపాలుడే రామకృష్ణులుగా అవతరించారని ఆమె ప్రగాఢ విశ్వాసం.




ప్రవచనం: **శ్రీ సామవేదం షణ్ముఖశర్మ** విలేఖనం: **శ్రీమతి ఎన్. శేషు**

(గత సంచిక తరువాయి)



**స్థూ**ల సూక్ష్మ కారణాలు ఎప్పుడూ ఉండేవి కాదు. అలాగే లోకాలు మూడూ కూడా ఎప్పుడో పోతాయి. పోయే వాటన్నిటిలో అమ్మ ఉంది. పోయేవాటితో అమ్మ పోతోందా? మనం ముందే చెప్పుకున్నట్లు అలలో సముద్రం ఉంది కానీ, అల శాశ్వతం కాదే! ప్రతీ అలకీ సమయం ఉంది. అల లేవడం జన్మ, అల నిలవడం స్థితి, అల తిరిగి సముద్రంలో కలవడం లయ. కనుక అలకు ఉనికి పరిమితం, సముద్రానికి ఉనికి శాశ్వతం.

అలాగే జీవుల యొక్క ఉపాధులు పుట్టి, పెరిగి మూడు లోకాలతో మూడు కాలాలతో పోతున్నాయి. కానీ "నేను" అనే చైతన్యం పోదు. అది ఎలాగ అని తెలుసుకోవాలి. ఈ మూడూ రాక ముందు ఉంది కనుక మూడింటిలోనూ అదే ఉంది; మూడూ పోయినా అదే ఉంటుంది. కనుక ఉండడమే దాని లక్షణం. ఉండడం అనే దానికి సంస్కృతంలో "సత్" అని పేరు. 'సత్' అనే శబ్దానికే "అమ్మ" అని చెప్పాలంటే "సతి" అని అర్థం; దానికే భవానీ అని అర్థం. భవానీ అంటే ఉన్నది అని అర్థం; ఉన్నాడు అని ఆయన పేరు అంటే భవః. భవస్య పత్నీ భవానీ! ఎవరైతే ఎప్పుడూ ఉన్నాడో ఆయన భవుడు, శాశ్వతుడు – శివుడు; ఆయన శక్తి శాశ్వతం, అందుకే ఆమె భవానీ – అంటే ఉన్నది. అందుకే సృష్టిలో ఏదున్నా లేకపోయినా నాకు అమ్మ ఉంది అనుకోండి చాలు!

ఈ ముజ్జగాలూ పుట్టక ముందు అమ్మ ఉంది. మూడు కాలాలకూ అతీతంగా ఉంది అమ్మ. ముజ్జగాలలోనూ అమ్మ ఉంది, మూడు కాలాలలోనూ అమ్మ ఉంది. మన మూడు శరీరాలలోనూ, మూడు అవస్థలలోనూ అమ్మ ఉంది. సర్వకాల సర్వావస్థలలోనూ సర్వ వ్యాపకమైన ఏ చైతన్యం ఉందో ఆ చైతన్యమే అమ్మ. అదే త్రిపుర అనడంలో అర్థం – మూడింటి యందూ నిండి ఉన్నది.

పుర అనే శబ్దానికి మూడు అర్థాలున్నాయి. పురా అంటే చోటు. పురా అంటే పూరణాత్వాత్ పుర! నింపేది అని అర్థం. మూడింటి యందు నింపేసి ఉంది. మూడు శరీరాల్లో చైతన్యం నింపింది, మూడు కాలాల్లో చైతన్యం నింపింది, మూడు లోకాలలో చైతన్యం నింపింది. అంతే కాదు "త్రిభిః పురా ఇతి త్రిపుర" అన్నారు. త్రిభిః = ఈ మూడింటికీ కూడా పురా = ముందున్నది. అలాగే "త్రిషు పూరణ ధర్మాత్ త్రిపుర" మూడింటి యందూ నిండి పోయింది. అందుకే అమ్మ మూడింటికీ అతీతం. అమ్మ మూడింటి యందూ వ్యాపించింది.

అతీతం తెలియాలంటే నాలుగో భూమికి చేరాలి. అదే తురీయం. "తురీయాత్ సర్వావస్థా వివర్జితా" అన్నారు. ఈ తల్లి జగదంబిక **"విశ్వరూపా జాగరిణీ స్వపంతీ తైజసాత్మికా సుప్తా ప్రాజ్ఞాత్మికా తుర్యా సర్వావస్థా వివర్జితా"** ఆ నాలుగు స్వరూపాలతో ఉన్నది. కనుక మూడింటిలోనూ ఉన్నది అని చెబుతూ త్రిపుర అన్నారు. ఇలా ఉన్న ఆ తల్లి ఈ ముజ్జగాలనే లోకాలకు అతీతమైన లావణ్యంతో ఉంది. మనం చూసే లావణ్యాలన్నీ పోయేవే. ఆమె 'లోకాతీత, లావణ్యాత్ లలితా'. అదే లలితా త్రిపుర సుందరి.

ఆ తల్లిని చూడగానే, లలితా త్రిపుర సుందరి ఆమె అని తెలుసుకోగానే – "అమ్మా మూడు అవస్థలలోనూ నన్ను గమనించుకుంటున్నావు తల్లీ! ఏ అవస్థలేని స్థితిలో కూడా గమనిస్తున్న తల్లీ! ఈ అవస్థలలోకి రాక ముందు నుండీ నన్ను గమనిస్తున్న తల్లీ! ఈ కాలంలో నేనున్నంత కాలం నన్ను గమనిస్తున్న తల్లీ! ఈ కాలాలు లేని స్థితిలో నన్ను గమనించే తల్లీ" అని అమ్మను మనం ఆరాధిస్తున్నాం. విశ్వ వ్యాపిని ఆ తల్లి, విశ్వాతీత ఆ తల్లి, విశ్వేశ్వరి ఆ తల్లి. విశ్వవ్యాపిని, విశ్వాతీత, విశ్వేశ్వరి – ఈ మూడూ కలిపి లోకాతీత లావణ్యాత్ లలితా. ప్రపంచంలోని ఆ అందమే అమ్మ; ఆ చైతన్యమే అమ్మ, ఆ చైతన్యం పేరే లలితా మహాత్రిపుర సుందరి.

అమ్మ అనగానే ఎంత ఉపనిషత్ తత్త్వం ఉందో! అందుకే

"సర్వోపనిషత్ ఉద్ఘృష్టా శాంత్యాతీత కళాత్మికా". ఇది తెలిశాక ఉన్నది అదే అందమైతే ఇక నా అహం అనే అందం ఎక్కడిదీ? ఉన్నది అదే అని తెలుసుకుని "అహం" ఆ ఉన్న దాన్ని ఆశ్రయించాలి. "అహమిత్యేవ విభావయామి భవానీం" సృష్టిలో ఎల్లవేళలా భవానీ అనుకుంటే చాలుట. శంకరులవారు "భవానీ భవానీ భవానీ త్రివారం ఉదారం ఉదాసం పదం యే జపన్తి న శోకం న మోహం న పాపం న భీతిః కదాచిత్ కథంచిత్ కుతశ్చిత్ జనానాం" అంటారు. లలితా సహస్రం చదివే ముందు మనం "అహమిత్యేవ విభావయామి భవానీం" అని కీర్తిస్తున్నాం. అమ్మ నామాలలో రహస్యనామం "భవానీ" అని చెప్పబడుతూ "విసతంతు తనీయసీ" అన్న నామం తరువాత **"భవానీ భావనా గమ్యా భవారణ్య కుఠారికా, భక్తప్రియా భక్తిగమ్యా భక్తివశ్యా భయాపహా"** అన్నారు. ఎప్పుడు కష్టం వచ్చినా 'భవానీ' అనుకోమన్నారు. అంటే అమ్మ ఉంది అని అర్థం. అమ్మ ఉంది అనుకుంటే ఎంత ధైర్యం మనకి! మనం పట్టుకున్న పట్టుగొమ్మ ఆ అమ్మ. భవానీ అంటే చాలు అమ్మ ఉనికి మనకు అనుభూతంలోకి వస్తోంది. లలితా భవాని, దుర్గా భవాని, ఉమా భవాని, గౌరీ భవాని, గంగా భవాని... అమ్మ ఏ రూపం ధరించినా భవాని.



ఏది సత్ పదార్థమై ఈ జగత్తు అంతా వ్యాపించిన చిదానంద స్వరూపమో, అదే భవానిగా పలురూపాలతో మనకు కనిపిస్తోంది. ఏ రూపాన్ని చూసినా, ఏ నామాన్ని భావించినా మిగిలేది భవాని. ఆ భవాని గురించి ఎంత చెప్పినా అర్థం కాదు. చెబితే అర్థం కాదు అమ్మ, వింటే అర్థం కాదు అమ్మ, భావిస్తే అర్థమవుతుంది అమ్మ. అందుకే "భవానీ భావనా గమ్యా". అంత భావిస్తే ఏం లభిస్తుంది? "భవారణ్య కుఠారికా" మనలో అజ్ఞానం అనే మహా అడవి ఉంది, ఈ అడవి అంతా ఛేదింపబడాలి అంటే భావనాగమ్య అయిన భవానీని ఆశ్రయించాలి. కనుక సచ్చిదానంద స్వరూపిణి అయిన మహాచైతన్యం ముల్లోకాలలో, ముక్కాలాలలో, మూడు అవస్థలలో, మూడు శరీరాలలో వ్యాపించి త్రిపురసుందరి అయి, వీటికి వెనుకా ముందూ కూడా ఉన్న సర్వాతీత స్వరూపిణి అని దీని సారాంశం.

సర్వ జగత్తులో ఆత్మరూపంగా ఎవరు ప్రకాశిస్తున్నారో ఆ చైతన్యమే దేవి. దేవి అంటే చైతన్య స్వరూపిణి. ఈ చైతన్యానికి శ్రీమాతా అని అర్థం చెప్పుకున్నాం. శ్రీ అంటే శ్రేష్ఠత్వవాచకం. శ్రీ అంటే సిరి (అంటే సంపద) అని అర్థం. ఈ జగత్తంతా సంపన్మయం. సంపద అంటే ఐశ్వర్యం. జగత్తంతా ఐశ్వర్యమయం. "ధనం అగ్నిర్ధనం వాయుః ధనం సూర్యో ధనం వసుః" అన్నారు. అగ్ని, వాయువు, సూర్య గ్రహ నక్షత్రాదులు అన్నీ ఐశ్వర్యాలే. మన ఇంద్రియాలలో ఏ ఇంద్రియానికి ఉండవలసిన ఐశ్వర్యం దానికి ఉంది. కంటికి చూపు ఐశ్వర్యం, చెవికి వినికిడి ఐశ్వర్యం... ఇవి నిజమైన శ్రీలు. ఈ జగత్తు అంతా కూడా ఆ జగజ్జనని తన శ్రీలతో నింపింది. ఆ శ్రీలన్నిటికీ కూడా ఎవరు తల్లో ఆ తల్లి శ్రీమాత. అందుకే శ్రీ అంటే శోభ. శ్రీ శబ్దానికి కాంతి, సౌందర్యం, శోభ, లక్ష్మి, కళ అని అర్థాలు. సర్వ జగత్తులో ఉండే శోభలన్నీ అమ్మ వారి స్వరూపాలే. అమ్మ ఎక్కడుంటే అక్కడ శోభ. నిజమైన సిరి (శ్రీ) ఏదీ అంటే చైతన్యమే... శోభ. ఈ చైతన్యం త్రిపురాలలో ఉంది. మూడు కాలాలలో ఉంది, మన మూడు శరీరాలలోనూ (స్థూల, సూక్ష్మ, కారణ శరీరాలు) ఉంది. మనం చూసే మూడు లోకాలలో (ఊర్ధ్వ, మధ్య, అధో లోకాలు) ఉంది. అలాగే భూః, భువః, సువః – మూడు లోకాలలో ఉంది. అకార, ఉకార, మకారాత్మకమైన ప్రణవంలో ఉంది. అదే సౌందర్యం. సర్వ జగత్తు కూడా మూడింటితో ఉంటే, మూడింటి యందూ అమ్మ ఉంది కనుక అమ్మను త్రిపురసుందరి అన్నారు. ఈ మూడింటి యందు ఉండడమే కాక మూడింటికీ అతీతంగా కూడా ఉంది ఆ జగజ్జనని కనుక అమ్మకు లలితా అన్న పేరు. **(సశేషం)**



- స్వామి సుకృతానంద

– జి. హనుమంతరావు, తలుపూరు

**? : అవస్థా త్రయాన్ని వివరించ మనవి?**

✍: జాగ్రత్ = మేల్కొని ఉన్న సమయం, స్వప్నం = కలలు కనడం, సుషుప్తి = కలలు లేని గాఢ నిద్ర; సృష్టిలోని ప్రతి జీవికీ ఈ మూడు అవస్థలూ ఉంటాయి. వీటికి అతీతమైనది తురీయావస్థ. జ్ఞానులు, యోగులు దీన్ని తీవ్ర ఆధ్యాత్మిక సాధన, భగవత్ కృపతో పొందుతారు. ఈ నాలుగోదైన 'తురీయం' అవస్థ కాదు. మిగతా మూడు అవస్థలూ చెప్పి దీన్ని కూడా అవస్థ అన్నారు. వీటి గురించి వివరణ ఇచ్చే గ్రంథం మాండూక్యోపనిషత్తు. దానిపై గౌడపాద కారికలు, మాండూక్యోనవనిషత్తు గౌడపాద కారికలపై శ్రీ ఆదిశంకర భగవత్పాదుల భాష్యం, దానిపై టీకాలు – ఇలా ఎన్నో గ్రంథాలున్నాయి. పై అవస్థా త్రయాన్ని 'ఓం' కారంలోని 'అ'కార, 'ఉ'కార, 'మ'కారాలతో పోల్చారు. పై అవస్థలను 'వ్యష్టి' పరంగా వైశ్వానర, తైజస, ప్రాజ్ఞులుగా, సమష్టి దృష్టిలో విరాట్, హిరణ్యగర్భ, ఈశ్వరులుగా చెబుతూ నాలుగో అవస్థ తురీయం – పరబ్రహ్మ అని మాండూక్యోపనిషత్తు వివరిస్తోంది. పై అవస్థా త్రయంలో చైతన్యం ఒకటే. అద్వితీయ చైతన్యమే ఉంది. అది సర్వవ్యాపి, సర్వాంతర్యామి అని అవస్థాత్రయ ఉదాహరణతో, శ్రుతియుక్తి అనుభవాలతో జ్ఞానులు ఋజువు చేస్తున్నారు.

– ఎల్. దిలీప్ కుమార్, జమ్మికుంట

**? : నిద్రపోయినప్పుడు, మరణించినప్పుడు ఆత్మ ఎటు పోతుంది? మరలా జన్మించకుండా ఉండాలంటే ఏం చేయాలి?**

✍: పరమాత్మను ఆత్మ అంటారు. జీవుల్ని జీవాత్మలుగా వర్ణిస్తారు. అలాగే శరీరం, ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి – వీటిని సందర్భానుసారంగా 'ఆత్మ' అనే వ్యవహరిస్తారు. సందర్భాన్ని బట్టి శాస్త్రాల్లో ఆత్మ పదానికి అర్థం చెప్పుకోవాలి. ఆత్మ, పరబ్రహ్మగా సర్వాంతర్యామి. జీవాత్మ ప్రాజ్ఞుడుగా గాఢనిద్రలో 'అజ్ఞానం'లో ఉంటుంది. జీవుడు మరణించిన తర్వాత జీవాత్మ సంచిత కర్మలను బట్టి మళ్ళీ కొత్త శరీరంలో ప్రవేశిస్తుంది. దీన్ని 'పంచాగ్ని విద్య' అని ఛాందోగ్యోపనిషత్తులో వివరించారు. "గహనా కర్మనో గతిః" – అంటే జీవుడు మరణించిన తరువాత మళ్ళీ పుట్టుక ఎలా జరుగుతుందో చెప్పడం కష్టం, అసాధ్యం. కర్మపరిపాకం, పునర్జన్మ ఒకే పద్ధతిలో ఉంటాయని చెప్పడం సాధ్యం కాదని వేదమే చెబుతోంది. భగవంతుణ్ణి, లేదా ఆత్మ సాక్షాత్కారాన్ని పొందితే మరుజన్మ ఉండదు. ఎవరికి శాశ్వత పరమానందం, మోక్షం కావాలో వారు ఈశ్వర పూజ, నిష్కామకర్మ, యోగం, జ్ఞాన సాధనలతో భగవత్ కృపతో గమ్యాన్ని చేరుకోవాలి. 'అన్యథా మార్గం నాస్తి'.

– సి. హెచ్. శ్రీరామిరెడ్డి, పొదలకొండపల్లె

**? : 'మంత్రపుష్పం' ఏ సమయాల్లో పఠించవలెనో తెలుప మనవి.**

✍: నిత్యం, పర్వదినాల్లో, ప్రత్యేక పూజలు, హోమాలు, యాగయజ్ఞాలలో ఎప్పుడైనా మంత్ర పుష్పం పఠించవచ్చు. అందులో వరుణుడు, చంద్రుడు, అగ్ని, సర్వేశ్వరుల ప్రార్థన, ప్రశంసలు ఉన్నాయి. భక్తి శ్రద్ధలతో, స్వరయుక్తంగా పారాయణ చెయ్యాలి. బాహ్యంగా సర్వజీవులకూ జీవనాధారమైన జలం, అగ్ని, చంద్రుడు, వాయుదేవతల్ని ప్రకృతి శక్తులుగా పొగుడుతున్నట్లుగా ఉన్నా ఆ యా శక్తుల వెనుక వున్న ఈశ్వర శక్తినే 'మంత్రపుష్పం' పారాయణ సమయంలో భక్తులు భావిస్తారు. స్వరయుక్త వేద పారాయణం ఋషియజ్ఞం కిందకు వస్తుంది. దీని పారాయణ భగవద్భక్తి, జ్ఞానదాయకం.

# పరహితం స్వప్రయోజనం కోసమే!

పరహితమొనర్చడం మన ధర్మం. మన మెందుకు లోకహితం జరపాలి? మనం లోకానికి సహాయం చేస్తున్నట్లు పైకి కనిపించినా నిజానికి అది మనకు మనం చేసుకునే సహాయం మాత్రమే! పరోపకారం చెయ్యడానికి ఎల్లప్పుడూ మనం ప్రయత్నించాలి. అదే మన ముఖ్యోద్దేశంగా ఉండాలి కానీ మనం బాగా ఆలోచించి చూస్తే లోకానికి మన సహాయం అవసరం లేదు. నీ చేతా, నా చేతా ఉపకారం పొందడానికి ఈ లోకం సృష్టింపబడలేదు. క్రైస్తవ ధర్మోపదేశంలో ఇలా చదివాను: "సుందరమైన ఈ ప్రపంచమంతా చాలా మంచిది. ఎందుకంటే పరోపకారం చెయ్యడానికి మనకిది అవకాశాన్ని కల్పిస్తోంది."



పైకి చూడడానికి చక్కని ఆశయమే గానీ, లోకానికి మన సహాయం కావలసి ఉన్నదనడం సరికాదు! అయినప్పటికీ పరులకు ఉపకారం చెయ్యడమే మన ధర్మం. పరులకు ఉపకార మొనర్చడమంటే కేవలం మనకు మనమే ఉపకారం చేసుకోవడమే అని అనుభవంతో అర్థమవుతుంది.

నా చిన్నతనంలో నా వద్ద కొన్ని తెల్లని ఎలుకలుండేవి. చక్రాలున్న ఒక చిన్న పెట్టెలో వాటిని ఉంచేవాడిని. ఎలుకలు ఆ పెట్టె నుండి బయటకు వెళ్ళడానికి ప్రయత్నించేవి. అలా ప్రయత్నించినప్పుడల్లా చక్రాలు గిరగిర తిరుగుతుండటం చేత అవి యథా స్థానంలోనే ఉండేవి. లోకానికి మనం చేసే ఉపకారం కూడా ఇలాంటిదే. ఈ ప్రపంచం మంచిదీ కాదు, చెడ్డదీ కాదు. ప్రతి వ్యక్తీ తనకు తానే ఒక లోకాన్ని నిర్మించుకొంటాడు. అంధుడు ప్రపంచాన్ని గురించి భావించడానికి ప్రయత్నిస్తే దానిని గట్టిదిగానో, మెత్తనిదిగానో, వెచ్చనిదిగానో, చల్లనిదిగానో భావిస్తాడు కదా! మనం సుఖంగా ఉన్నప్పుడు జీవితం సుఖంగానూ, దుఃఖంతో ఉన్నప్పుడు జీవితం దుఃఖమయంగానూ భావించడం జరుగుతూ ఉంటుంది. ఇది మనందరికీ అనుభవ పూర్వకమైన విషయమే!

సర్వ సాధారణంగా యువకులు ఆశా పూరితులుగానూ, వృద్ధులు నిరాశాజనితులు గానూ ఉంటారు. యువకులకు జీవితం ముందుంది. వృద్ధులు తమ కాలం దాటి పోయిందని మొర పెట్టుకొంటూ ఉంటారు. తీర్చుకోలేని అనేక కోర్కెలకు వారి మనస్సులలో సంఘర్షణ జరుగుతుంటుంది. ఏమైనా, వీరిద్దరూ అవివేకులే. మన మనః స్థితిని బట్టి, మన దృక్పథాన్ని బట్టి జీవితం మంచిదిగానో, చెడ్డది గానో కనిపిస్తుంది. స్వతస్సిద్ధంగా అది వీటిలో ఏదీ కాదు. అగ్ని స్వతస్సిద్ధంగా మంచిదీ కాదు, చెడ్డదీ కాదు. శీతకాలంలో మనం చలి కాచుకొంటున్నప్పుడు 'నిప్పెంత బాగుంది!' అనుకొంటాం. నిప్పు వల్ల మన చేతులు కాలినప్పుడు దాన్ని తిడతాం. అయినా దాని పరంగా అది మంచిదీ కాదు, చెడ్డదీ కాదు. మనకు దానివల్ల కలిగే అనుభవం ద్వారా 'మంచిది', 'చెడ్డది' అనే తలపులు కలుగుతాయి. ప్రపంచ విషయం కూడా ఇలాంటిదే.



# పరమేశ్వరుని పరిరక్షణలో ...

## స్వామి జపానంద స్వీయ అనుభవాలు -14

(గత సంచిక తరువాయి...)

## అహంకారం లేని వ్యాపారి

అజ్మీర్ దగ్గర బ్యావర్ అనే సుసంపన్నమైన పట్టణం ఉంది. అక్కడి వారు ధార్మికులు, సత్సంగ ప్రియులు. ఒకసారి స్వామి జపానంద బ్యావర్ వెళ్ళారు. ఒక స్నేహితుడు బ్యావర్‌లో సూరజ్‌మల్ అనే ఒక వ్యాపారికి ఉత్తరం వ్రాసి, అతని తోటలో జపానందజీ నివసించడానికి ఏర్పాటుచేశారు. ఆ తోట అజ్మీర్ రోడ్డు చివరన ఉంది. వేసవిలో ఆ వ్యాపారి కుటుంబసమేతంగా అక్కడే ఉండే వారు. ఆ ఇంట్లో ఉన్న భూగృహాన్ని ఆ వ్యాపారి, స్వామీజీకి



చూపించి "వేసవి కాలంలో మీరు వస్తే ఇక్కడ మాతో కలిసి ఉండవచ్చు. ఇక్కడ చల్లగా ఉంటుంది, సదుపాయంగానూ ఉంటుంది" అని చెప్పారు. 'విచారసాగరం' లాంటి గ్రంథాలను ఆ వ్యాపారి చదివేవారు. సత్సంగ ప్రియుడైన ఆయన తరుచుగా పండితులతో ఆ గ్రంథాల గురించి చర్చించేవారు.

జపానందజీ ఉండడానికి మంచి గది ఏర్పాటు చేశారు. అందులోనే ఇంకొక ఇద్దరు సాధువులు కూడా నివసించే వారు. అందులో ఒకరు సుమారు మూడు సంవత్సరాల నుంచి అక్కడే ఉన్నారు. మధుకరి భిక్ష తెచ్చి ఇచ్చేవారు. ఎప్పుడైనా వ్యాపారి ఇంటికి భిక్షకు వెళ్ళేవారు. ప్రతి సాయంత్రం అక్కడ ఉన్న సాధువులందరికీ వ్యాపారి పాలు తెచ్చి ఇచ్చేవారు. తోటమాలి ఉదయం పది గంటల నుంచి సాయంకాలం వరకూ దుకాణం పని చూసేవాడు. సన్న్యాసి చలి కాలంలో అక్కడికి వెళ్ళారు. వ్యాపారి తన కొడుకులతో కలిసి మైలు దూరంలో ఉన్న తమ ఇంటి నుంచి నడిచివచ్చి తానే బావి నుంచి నీరు తోడుకుని స్నానం చేసేవారు. ఆ తరువాత పూజ, గీతా పఠనం మొదలైనవి చేసేవారు. కొడుకులు కూడా స్నానం, పూజ అయ్యాక భగవద్గీత చదివేవారు. వృద్ధ వ్యాపారి పూజాదికాలు అయ్యాక తోటలో కాసిన కూరగాయలు కోసుకుని సాధువులతో కొంచెంసేపు మాట్లాడి, కూరగాయలు తీసుకుని ఇంటికి వెళ్ళేవారు. జపానందజీతో వినయపూర్వకంగా మాట్లాడి, భిక్షకు వారిని ఇంటికి రమ్మని పిలిచేవారు. కానీ జపానందజీ ఇతర సాధువులతో కలిసి కానీ, లేదంటే ఒక్కరే కానీ మధుకరి భిక్షకు వెళ్ళేవారు. జపానందజీ కోసం వ్యాపారి తానే నిత్యం సాయంకాలం పాలు తీసుకొచ్చి ఇచ్చేవారు. జపానందజీ తాగాక, మిగతా సాధువులకు ఇచ్చేవారు. తరువాత సత్సంగం మొదలు పెట్టేవారు.

అతనితో కలిసి సమయం గడపడానికి జపానందజీ కూడా ఆనందించేవారు. శాంత స్వభావి అయిన వ్యాపారి కూడా సాధువులతో సత్సంగాన్ని ఆనందించేవారు. జపానందజీ ఎప్పుడు వ్యాపారి ఇంటికి భోజనానికి వెళ్ళినా వారి ఇంటి తలుపులు తెరిచే ఉండేవి. వంట ఇల్లు తెరిచే ఉండేది. చాలా మంది వచ్చి వ్యాపారి ఇంట్లో భోజనం చేసి వెళ్ళేవారు. చుట్టుపక్కల పల్లెల నుంచీ, గ్రామాల నుంచీ తమ సొంత పనుల మీద బ్యావర్ వచ్చే మనుష్యులు తమ పనులు చూసుకొని, వీరి ఇంటికి వచ్చి భోజనం చేసి వెళ్ళేవారు. సొంత ఇంట్లో లాగ కావలిసినవి అడిగి వేయించుకుని మరీ తినేవారు. వంట వాళ్ళు కూడా ఏమీ అనకుండా అన్నీ వడ్డించేవారు.

ఉదయం పది – పదిన్నర గంటల నుంచి మధ్యాహ్నం రెండు – రెండున్నర వరకూ విద్యార్థులు వస్తూనే ఉండేవారు. భోజనం చేసేవారు. ఆ విధంగా అక్కడ నిత్యాన్నదానం జరిగేది. అసలు సంగతి ఏమిటంటే అందరి కోసం వండిన వంటకాలనే వ్యాపారి కూడా తినేవారు. జపానందజీ అక్కడకు భిక్షకు వెళితే, ఆ రోజు వారి కోసం వేరే కూర

వండించి, విస్తట్లో పెరుగు కూడా వడ్డించేవారు. మొదటి రోజు జపానందజీకి కూర, పెరుగు వడ్డించిన వ్యాపారి మామూలు భోజనం వడ్డించుకుని జపానందజీ పక్కన కూర్చున్నారు. అది చూసి జపానందజీ తన విస్తట్లో నుంచి కొంత కూర, పెరుగు వ్యాపారి విస్తట్లో బలవంతంగా వేశారు. ఆ తరవాత నుంచి ఎప్పుడు జపానందజీ వచ్చినా ఇంకొంచెం కూర, పెరుగు తెప్పించేవారు. అది రెండు భాగాలు అవుతుందని ముందే తెలుసు మరి.

రెండు వారాల తరువాత స్వామి జపానందజీ ఒక సభలో పాల్గొనడానికి ఢిల్లీ వెళ్ళవలసి వచ్చింది. వ్యాపారికి ఒక గుర్రపు బండి ఉంది. వ్యాపార సంబంధమైన అన్ని పనులకూ వారు అందులోనే వెళ్ళేవారు. రైల్వే స్టేషన్ తోటకు రెండుమైళ్ళ దూరంలో ఉంది. స్టేషన్‌కు వెళ్ళడానికి వ్యాపారి బండి పంపిస్తారని తెలిసినా, అది సమయానికి ఊళ్ళో ఉంటుందో ఉండదో అని సన్న్యాసి ముందే బాడుగకి మరొక గుర్రపు బండి మాట్లాడుకున్నారు. ఢిల్లీ వెళ్ళే రైలు సాయంత్రం నాలుగు గంటలకు వస్తుంది.

వ్యాపారి నడుచుకుంటూ తోటకు వచ్చారు. "గుర్రపు బండి సమయానికి వస్తుంది కదా" అని సన్న్యాసి అడిగారు. వ్యాపారి "బండి పని మీద పక్క ఊరికి వెళ్ళింది. సరిగ్గా సమయానికి వస్తుందని ఆశిస్తున్నాను, అయినా మీరు బాడుగకు మరొక బండి మాట్లాడుకున్నారు కదా!" అన్నారు.

"అవును. మీ బండి రాకపోతే అది ఉంటుంది. ఇవాళ నేను ఢిల్లీ వెళ్ళి తీరాలి. వాళ్ళకు మాట ఇచ్చాను" అన్నారు సన్న్యాసి. ఎంతసేపటికీ బండి రాకపోయేసరికి సన్న్యాసికి భయం మొదలైంది. స్టేషన్ దూరంగా ఉంది. అక్కడకు తీసుకువెళ్ళడానికి చాలా పుస్తకాలున్నాయి. వ్యాపారి బండి రాలేదు. బాడుగ బండి కూడా రాలేదు. సన్న్యాసి అసహనంగా అటూ ఇటూ చూస్తున్నారు ఎవరైనా కూలీ దొరుకుతాడేమో అని! తోటమాలి ఊళ్ళోకి వెళ్ళాడు.



"స్వామీజీ మీరు అధైర్యపడకండి. సామాన్లు తీసుకుని నెమ్మదిగా నడుస్తూ వెళదాం. ఇంతలో ఏదో ఒక బండి దొరుకుతుంది" అని చెప్పి వ్యాపారి సుమారు 20 కిలోల బరువున్న పుస్తకాల సంచీని భుజం మీద పెట్టుకున్నారు. స్వామీజీ పక్కచుట్ట పట్టుకుని నడక మొదలుపెట్టారు.

స్వామి జపానందజీ నడుస్తూ, "ఎవరైనా చూస్తే వ్యాపారి బాబా సామాన్లు మోస్తూ నడుస్తున్నారంటారు" అన్నారు. వ్యాపారి "అంతే కదా! అలా అనుకుంటే ఏమయింది? బాబాజీ సామానులే కదా నేను పట్టుకుంది. వేరెవరిదో కాదు కదా" అన్నారు.

ఇంతలో బాడుగ బండివాడు వచ్చాడు. అందులో కూర్చొని, సమయానికి స్టేషన్‌కు చేరుకున్నారు. అప్పటికి ఢిల్లీ వెళ్ళే రైలు వచ్చింది. వ్యాపారి బ్యావర్‌లో గొప్ప ధనవంతులలో ఒకరు అయినప్పటికీ నిగర్వి. సాధువుల సామాన్లు మోయడానికి కూడా ఏ మాత్రం సంకోచించేవారు కాదు. ధనవంతులలో ఇలాంటి సత్పురుషులు కనిపించడం చాలా అరుదు. a

# నిస్వార్థమే నిజమైన బలం!

చిత్రాలు : దాకోజు శివప్రసాద్ కథ : స్వామి జ్ఞానదానంద

శ్రేయోభిలాషుల ప్రోద్బలంతో ధర్మరాజు రాజసూయ యాగం చేయాలని సంకల్పించాడు.

మహర్షీ! రాజసూయం చేయమని మిత్రులు ప్రోత్సహిస్తున్నారు.

అవును అది క్షత్రియోచితమైనపనే. విజయోస్తు !

శ్రీకృష్ణుడే అనుమతించాక ఇక తిరుగేముంది?

ధర్మరాజు రాజసూయ యాగ దీక్ష పూనాడు.

అందులో భాగంగా యాగాశ్వాన్ని భూ ప్రదక్షిణకు వదిలారు. దాని వెంట శ్రీకృష్ణార్జునులు రక్షణగా వెళ్ళారు.

వారు కొంత కాలం తరువాత మయూరధ్వజుడు పాలించే మణిపుర రాజ్యాన్ని చేరారు. ఆయన కూడా అదే సమయంలో రాజసూయ యాగాన్ని ఆరంభించాడు.

మయూరధ్వజుడు కూడా రాజసూయం చేస్తున్నాడట! అతడి యాగాశ్వాన్ని ఎలాగైనా బంధించాలి!

అవును అలాగే చేద్దాం!

మరునాడు వారు యాగాశ్వం వెళ్ళబోయే దారిలో సైన్యంతో నిరీక్షించసాగారు.

నా శరీరం మొద్దుబారి నట్లుంది.

నేను కదలలేక పోతున్నాను

యోధానుయోధుణ్ణి, నేనే శిలా ప్రతిమలా కొయ్యబారి పోయానే! ఈ విచిత్ర స్థితికి కారణం ఏమిటో?

వారు వేషాలు మార్చుకొని, నగరంలోకి వెళ్ళారు. అక్కడ ఓ వీధిలో పురజనులు మహారాజును కీర్తించడం విన్నారు.

ఆహా! మయూరధ్వజ మహారాజుకు స్వార్థం ఏ కోశానా లేదు.

ఆయన అపర శిబి చక్రవర్తే! అలాంటివారు రాజు కావడం మన అదృష్టం!

మణిపుర రాజ్యంలో మారువేషాల్లో పర్యటిస్తే తెలియవచ్చు!

మరునాడు వారిద్దరూ వేషాలు మార్చుకొని రాజాస్థానానికి వెళ్ళారు. మహారాజు వారిని చూస్తూనే...

చూడబోతే పరాయి దేశం వారిలా ఉన్నారు! మీకు నా నుండి ఏమైనా సహాయం కావాలా? ఏం కోరి వచ్చారో చెప్పండి!

మహారాజా! నా కుమారుడితో కలిసి మేము వైశాలీ నగరానికి వెళుతున్నాం. అడవి మధ్యలో...

ఒక సింహం గర్జిస్తూ భయంకరంగా మా మీదకు దూకి...

మా పిల్లవాణ్ణి పట్టుకుంది. ఆ సింహంతో...

మిగతా 36వ పేజీలో...

**ఆచార వ్యవహారాలు - అంతరార్థాలు- 30**

- రెంటాల జయదేవ

# గంట ఎందుకు కొట్టాలి ?

**భా**రతీయ సంస్కృతీ సంప్రదాయాల్లో ప్రతి అంశానికీ ఏదో ఒక ప్రత్యేకత కని పిస్తుంది. హిందువులు తమ పూజా పునస్కారాల్లో, దేవాలయానికి వెళ్ళినప్పుడూ తరచూ గంట మోగిస్తుంటారు. జైన, బౌద్ధ మతాల్లో కూడా గంటలకు విశిష్ట స్థానం ఉంది.

హైందవ ఆలయాల్లో మనకు తప్పనిసరిగా గంటలు కనిపిస్తాయి. గుడికి వచ్చిన భక్తులు లోపలకు ప్రవేశించగానే ముందుగా గంట మోగించి, ఆ తరువాత దైవ దర్శనానికి వెళుతుంటారు. మరికొంతమంది భక్తులు ముందుగా ప్రదక్షిణలు చేసి, ఆ తరువాత గర్భగుడి దగ్గరకు వెళ్ళే ముందు మూడుసార్లు గంటను మోగించి, అటుపైన దేవుణ్ణి దర్శించుకుంటూ ఉంటారు. గంట ఎందుకు మోగిస్తారు? ఘంటానాదం ఉపయోగమేమిటి?

ఘంటానాదంలో ఓ విశేషం ఉంది. గుడిలో నెలకొన్న దేవీ దేవతలను మేల్కొల్పడానికి భక్తులకు ఈ ఘంటానాదం ఉపకరిస్తుందని కొందరు అంటారు. సాధారణంగా దేవుడి విగ్రహం ఎదురుగా, ఆలయం మొదట్లోనే గంటలు వేలాడదీసి ఉంటాయి. గుడిలోకి రాగానే భక్తులు దేవునికి తమ రాకను నివేదించడానికి ఈ ఘంటానాదం ఉపయోగపడుతుందని మరికొందరు చెబుతారు. అయితే, దీనికి వ్యతిరేకమైన వాదన కూడా ఉంది. సకలమూ తెలిసిన నిత్య చైతన్యస్వరూపుడైన దేవుణ్ణి ఘంటానాదంతో మేల్కొల్పడమేమిటి? సకల చరాచర జగత్తునూ పాలించే దేవుడు నిద్రించడమేమిటి? సమస్తమూ తెలిసిన ఆ దేవదేవుడికి భక్తులమైన మనం వచ్చామని ప్రత్యేకంగా చెప్పాల్సిన అవసరం ఉంటుందా? మనల్ని అందరినీ సృష్టించిన ఆ తండ్రి నెలకొన్న గుడిలోకి వెళ్ళడానికి గంట మోగించి, అనుమతి కోరాలా? గంటలు మోగించడానికి ఇచ్చే వివరణపై ఇలాంటి ప్రశ్నలు సహజంగానే వస్తాయి.

**నాదంలోని పవిత్రత, విశిష్టత**

గంట మోగించడం వల్ల ఓ పవిత్రమైన శబ్దం పుడుతుంది. అది భగవంతుని విశ్వజనీన నామమైన ఓంకారం. ఆ ఘంటానాదం పవిత్రమైనది గనక, విన్న వారినీ, ఆ పరిసరాలనూ అది పవిత్రవంతం చేస్తుంది. పరమ పవిత్రుడూ, పరిశుద్ధుడూ, సకల శుభదాయకుడూ అయిన భగవానుణ్ణి దర్శించడానికి భక్తుల బాహ్య, అంతరంగాలు రెండూ పరిశుద్ధమై ఉండాలి గనక అందుకు ఘంటానాదం ఉపకరిస్తుంది. గంటతోపాటు శంఖం, ఇతర సంగీత వాద్యాలను కూడా ఉపయోగిస్తారు. ఘంటానాదంతో కూడిన ఈ వాద్య ఘోష అశుభాలనూ, ఇతర రణగొణ ధ్వనులనూ, మాటలనూ దూరం చేసి, భక్తులను ఏకాగ్రచిత్తులను చేస్తుంది.

శబ్దమనేది ధ్వని, నాదం అని రెండు విధాలని చెబుతారు. ఒక్కసారి వినపడి ఆగిపోయేది 'ధ్వని' కాగా, అవిచ్ఛిన్నంగా సాగే శబ్దం 'నాదం'. 'న' అంటే ప్రాణమనీ, 'ద' అంటే అగ్ని అనీ, ఆ ప్రాణాగ్నుల కలయికే 'నాదమ'నీ ఓ వివరణ. నాదం కూడా 'ఆహత నాదం', 'అనాహత నాదం' అని రెండు రకాలు. చెవికి వినిపించేది - ఆహత నాదం. ఇది చెవులకు ఇంపుగా వినిపిస్తూ, రసానుభూతినీ, రక్తినీ, ఆనందాన్నీ కలిగిస్తుంది. చెవికి వినిపించకుండా, మానసికంగా అనుభూతి కలిగించేది - 'అనాహత నాదం'. నిశ్చల మనస్కులై, యోగదృష్టి కలవారికే ఈ నాదం అనుభవంలోకి వస్తుంది. ఇది ముక్తిని కలిగిస్తుంది.

ఘంటానాదం వల్ల పుట్టే శబ్ద తరంగాలు చెవి మీద, మనస్సు మీద కూడా మంచి ప్రభావం చూపెడతాయి. చంచలమైన మనస్సును దేవుని మీద లగ్నం చేయడానికి ఘంటానాదం ఓ సంజ్ఞ. విగ్రహాల్లో ప్రాణప్రతిష్ఠితులైన దేవీదేవతల్లో ఈ ఘంటా నాదం వల్ల దైవత్వం ప్రేరేపితమవుతుంది.

*( 'ఎప్పుడెప్పుడు గంట మోగించాలి...' వచ్చే సంచికలో...)*

# పురుష ప్రయత్నం



ఓ రఘునందనా! ఈ జగత్తులో ఎవరికైనా, ఏ వస్తువైనా లభించాలంటే కృషి చెయ్యడమే ఉపాయం కదా! కృషి లేకుంటే ఏదీ ప్రాప్తించదు. **"ఫల ప్రాప్తౌ పౌరుషాదేవ నాన్యతః"** "ఏ ఫలితమైనా పురుష ప్రయత్నం చేతనే లభిస్తోంది కానీ, మరి దేని చేతనూ కాదు". అదే విధంగా ప్రయత్నం చేతనే జీవునికి జ్ఞానం ప్రాప్తిస్తోంది. ఆ జ్ఞానం వల్లనే కామ క్రోధాది తాపాలను నశింపజేసే 'జీవన్ముక్తి' కూడా లభిస్తోంది.

అనేక విషయ చింతనలతో మోహితులైన వారు, మందబుద్ధి కలవారు మాత్రం "మాది ఏముంది? అంతా దైవం, లేక అదృష్టం యొక్క అధీనంలోనే ఉంది'' అని నచ్చజెప్పుకుంటున్నారు. ఇంద్రియానుకూలంగా మాత్రమే ప్రవర్తిస్తూ, "నేను పొందాలనే అనుకుంటున్నాను. కానీ, సాధించలేకపోతున్నాను. అయినా, మా వల్ల ఎక్కడవుతుంది? దైవమే ప్రసాదించాలి" అని అనుకొని విచారిస్తూ కూర్చుంటే లాభం ఏమిటి?

ముందుగా నీవు ఏం సాధించదలచుకున్నావో, సుస్పష్టంగా నిర్ణయించుకో. ఇప్పుడు సరి అయిన అవగాహనతో శాస్త్రోక్తమైన (శాస్త్రములచే చెప్పబడిన) ప్రయత్నం చేయి. ఎవడు ఏది కోరుకుంటాడో దాని కోసం శాస్త్రాలు ఉపదేశించిన మార్గాన్ని అనుసరిస్తూ, మధ్యలో తన ప్రయత్నాన్ని విరమించకుండా కొనసాగిస్తాడో, అలాంటివాడు ఆ లక్ష్యం తప్పక సాధించి తీరుతాడు. కాబట్టి రామా! మానవుడు తన జీవిత లక్ష్యాన్ని ముందుగా దృఢీకరించుకొని, ఆ పై శాస్త్ర సమ్మతమైన నిజమార్గంలో ప్రయత్నం చెయ్యాలి. అంతేకానీ, ఏదో కొంత ప్రయత్నం చేసి, మరికొంత ఎక్కడో దృష్టి పెట్టి, మధ్యలో తనపై తానే జాలిపడుతూ క్రుంగిపోవడం అర్థం లేని పని.

ఈ ప్రయత్నం అనేది రెండు విధాలు.

1. ప్రాక్తనం = ఇతఃపూర్వం చేసిన ప్రయత్నాలు.
2. ఆద్యతనం = వర్తమాన ప్రయత్నాలు. ఈ రెండింటిలో మొదటిదైన 'ప్రాక్తన' పురుషకారాన్ని 'దైవం' లేక 'అదృష్టం' అని అంటారు. అయితే ఇప్పటి ప్రయత్నాలు ఇతఃపూర్వపు క్రియల యొక్క ప్రభావాన్ని జయించివేయగలవు. ఇందులో ఏ మాత్రం సందేహం లేదు.

ప్రాక్తన ప్రయత్నాల ప్రభావాన్నే 'సంస్కారాలు' లేక 'వాసనలు' అని కూడా అంటున్నారు.

**యత్నవద్భి దృఢాభ్యాసైః ప్రజోత్సాహ సమన్వితైః**
**మేరవోపి నిగీర్యంతే కైవ ప్రాక్పౌరుషే కథా ॥**

*'ప్రయత్నాలు, దృఢమైన అభ్యాసం కలవారు, ఉత్సాహవంతులు మేరుపర్వతాన్నైనాసరే మింగి జీర్ణం చేసుకోగలరు. ఇక వారికి ఈ దైవం, అదృష్టం అనేవి ఒక లెక్కలోవి కావు'.*

శాస్త్రోచితంగా ప్రయత్నించడమే ఉచితం. 'శాస్త్రోచితం' అంటే ఏమిటి? అనుభవజ్ఞులైన పెద్దలు సర్వుల సానుకూల్యతనూ దృష్టిలో పెట్టుకొని, తమ అనుభవమంతా రంగరించి "ఇది ఇలా అనుసరించాలి. ఈ విధమైన విధి విధానం నిర్వర్తించాలి. ఇలా చేయకూడదు" అని చెప్పినదే "శాస్త్రానుశాసితం" అంటున్నాం. చిత్తానికి అధీనులై, విషయలోలత్వంతో చేసే ప్రయత్నాలు వ్యర్థం. తమవంతు ప్రయత్నం చెయ్యని మంద భాగ్యులను కాపాడగలిగేది ఎవరు? ఓ రామా! ఈ ప్రపంచంలో అజ్ఞానం, పేదరికం తాండవించడానికి కారణం ప్రజలంతా తగినంత ప్రయత్నశీలురు కాక పోవడమే. కాబట్టి ప్రయత్నశీలుణ్ణి అతని లక్ష్యం నుంచి దూరం చేయగలిగేది అతని "ప్రయత్న రాహిత్యం" ఒక్కటే!



*('శ్రీవసిష్ఠ రామ సంవాదం' ముముక్ష-వ్యవహార ప్రకరణం నుంచి)*

**అనువాదం : వై. హెచ్. రామకృష్ణ**



# అమర భారత ప్రతిభ

## భూ“గోళమే”నా!

ప్రప్రథమంగా భూమి గుండ్రంగా ఉందని చెప్పింది ఎవరు? ఇంతవరకూ మనం చదువుకున్నది కెప్లర్ కోపర్నికస్, గెలీలియోలు అని! వీరంతా 16,17 శతాబ్దాలకు చెందినవారు. కానీ మనకు ఈ విషయం వేదకాలం నుంచే తెలుసు. ఋగ్వేదంలో 1.33.8 మంత్రంలో

**“చక్రాణాసః పరీణహం పృథివ్యా ...”** అని ఉంది.

“భూమి యొక్క వృత్తపు అంచున ఉన్న వారు...” అని ఆ మాటకు భావం. ఇక ‘సూర్య సిద్ధాంతం’ అనే అతి ప్రాచీన గ్రంథంలో 12వ అధ్యాయం 32వ శ్లోకంలో–

**“మధ్యే సమన్తాదణ్డస్య భూగోళో వ్యోమ్ని తిష్ఠతి ॥”**

“బ్రహ్మాండం మధ్యలో భూగోళం ఆకాశంలో నిలిచి ఉంది” అని దాని అర్థం.

ఆర్యభట్టు క్రీ.శ. 476 ప్రాంతం వాడు. ఆయన **“భూగోళః సర్వతో వృత్తః”** అని ‘ఆర్యభట్టీయం’ అనే గ్రంథంలో గోళపాద అనే అధ్యాయంలో 6వ శ్లోకంలో చెప్పాడు. అంటే భూమి వృత్తాకారంలో ఉన్నదని అర్థం.

క్రీ.శ. 505లో ‘పంచ సిద్ధాంతిక’ అనే గ్రంథంలో వరాహ మిహిరుడు **పంచ మహాభూతమయ స్తారా గణ పంజరే మహీ గోళః**

**... (13-1)**

“పంచ భూతాత్మకమైన గుండ్రని భూమి, పంజరంలో వేలాడే ఇనుప బంతిలా, ఖగోళంలో తారల మధ్య నిలిచి ఉంది” అన్నాడు.

లీలావతి అడిగిన ప్రశ్నకు భాస్కరాచార్యుడు అనే ప్రముఖ గణిత శాస్త్రజ్ఞుడు – “నీవు చూసేదంతా నిజం కాదు. భూమి ‘చదరంగా’ లేదు. ఎందుకంటే నీవు ఒక పెద్ద వృత్తం గీసి అందులో నాల్గవ భాగం చూస్తే అది మనకు ఒక సరళ రేఖలాగా కనిపిస్తుంది. కానీ నిజానికి అది ఒక వృత్తమే. అలాగే భూమి కూడా గుండ్రంగానే ఉన్నది” అని ఆమెకు వివరించాడు. ‘(లీలావతి’ అనే గ్రంథంలోనిది)

ఇక మన ‘ఆర్యభట్టీయం’ అనే గ్రంథం 13వ శతాబ్దంలో లాటిన్ భాషలోకి అనువదితమైంది. తదనంతర ఖగోళ పరిశోధనల మీద ఈ శాస్త్ర ప్రభావం ఉండి ఉంటుంది.

‘ఆర్యభట్టీయంలోని గోళపాదం 37వ శ్లోకంలో ఆర్యభట్టు **“ఛాదయతి శశీ సూర్యం శశినం మహతీ చ భూచ్ఛాయా”** – సూర్యుణ్ణి చంద్రుడు కప్పినప్పుడు ఆ నీడ భూమి మీదకు ‘సూర్యగ్రహణం’గానూ, చంద్రుణ్ణి భూమి కప్పినప్పుడు చంద్ర గ్రహణంగానూ కనిపిస్తుంది’ అని చెప్పాడు.



ఇంతే కాకుండా ఈ సూర్య, చంద్ర గ్రహణాల లెక్కలు, రాకపోకలు కచ్చితంగా ఆనాడే ఆర్యభట్టు గణించగలిగాడు. భూమి తన కక్ష్యలో తన చుట్టూ తాను తిరగడానికి 23 గంటల 56 నిముషాల 4.1 సెకన్ల కాలం పడుతుందని ఆనాడే చెప్పాడు. ఇది ఆధునిక కాలగణనకు కచ్చితంగా సరిపోతోంది.

భూమి ‘గోళ’మని ప్రతి భారతీయునికీ యుగ యుగాలుగా తెలిసిన విషయమే!

*( ‘భారతీయ ప్రతిభా విశేషాలు’ నుంచి)*




# 'సేవాసమితి' స్థాపనకు స్ఫూర్తినిచ్చిన స్వామీజీ....



స్వామి వివేకానంద భౌతికంగా మనమధ్య లేకపోయినా, ఆయన మహోన్నత జీవనం, భాషణం, అనుభవం ఆచంద్రార్కం మనల్ని ఉత్తేజపరుస్తూనే ఉంటాయనడానికి నా జీవితమే నిదర్శనం. ఎక్కడో నెల్లూరు జిల్లాలోని మారుమూల గ్రామమైన ఆరిమానిపాడులో ఉపాధ్యాయుడిగా పనిచేస్తున్న నన్ను స్వామీజీ సాహిత్యం ఎంతో ప్రభావితం చేసింది. డిగ్రీ చదివే రోజుల నుంచే స్వామీజీ జీవితం నాకు ఎంతో స్ఫూర్తినిచ్చేది. అందులో భాగంగా నెల్లూరులోని శ్రీరామకృష్ణ సేవాసమితికి వెళుతూ సత్సంగాల్లో పాల్గొనేవాణ్ణి. నాతో బాటు మరింతమంది గ్రామీణ యువతీ యువకులు స్వామీజీ నుంచి స్ఫూర్తి పొందాలన్న సదాశయంతో స్థానికుల సహాయ సహకారాలతో ఆరిమాని పాడులో పది అడుగుల ఎత్తున్న స్వామి వివేకానంద విగ్రహాన్ని ప్రతిష్ఠించాము. అదే విధంగా సేవాకార్యక్రమాలు నిర్వహించాం.


వి.వి. కుమార్


గూడూరు శ్రీరామకృష్ణ సేవా సమితి

అయితే వ్యక్తిగత కారణాల వల్ల మా కుటుంబం ఆ కుగ్రామం నుంచి గూడురు పట్టణానికి తరలించాల్సి వచ్చింది. ఆ పట్టణంలో స్వామీజీకి సంబంధించిన భావప్రచారానికి అవకాశం లేకపోవడం నన్ను ఎంతో బాధించింది; మనసులోనే స్వామీజీని ప్రార్థించాను. అదే సమయంలో స్వామి వివేకానంద జీవితంలోని ఒక సంఘటన నన్ను ఎంతో కదిలించింది. వారు ఒకసారి హిమాలయాల సమీపంలో నరసంచారం లేని అటవీప్రాంతంలో పర్యటిస్తున్నప్పుడు భగవద్గీతలోని "అనన్యాశ్చింతయంతో మామ్... యోగ క్షేమం వహామ్యహమ్" అన్న శ్లోకం గుర్తుకువచ్చి నిజంగా ఆ భగవంతుడు తన యోగక్షేమాలు చూసుకుంటాడా? అన్న సంశయం కలిగిందట. ఇంతలో దూరంగా ఒక ఆటవికుడు కనిపించడం, తినుభండారాలు అందజేయటం స్వామీజీని ఆశ్చర్యానికి గురిచేసాయట! అయితే స్వామీజీ మరింత సంశయంతో వాటిని స్వీకరించకుండా పారిపోతుండటంతో ఆ ఆటవికుడి వెంటబడి మరీ తినిపించటం స్వామి వివేకానందను ఆనందాశ్చర్యాల్లో ముంచివేసిందట! నిజంగా భగవానుడు మాట తప్పడు అని ఇక్కడ రుజువైనట్లు స్వామీజీ గుర్తుచేసుకున్నారు. ఈ సంఘటన చదివిన నేను స్వామీజీతో ఇలా విన్నవించుకున్నాను: 'అందరి మనసుల్లో అంతర్యామిగా మీరు ఉండడం నిజమైతే, నాకు వారం రోజులలోపు మీ సత్సంగ భాగ్యం కలిగింతురుగాక! అప్పుడు మీ ఉనికిని నేను సంపూర్ణంగా విశ్వసిస్తాను'. అలా అనుకున్న మూడోరోజు నాకు నెల్లూరు శ్రీరామకృష్ణ సేవాసమితి కార్యదర్శిగారు ఫోన్ చేసి, గూడూరులో స్టేట్‌బ్యాంకు ఉద్యోగి రమాశంకర్ గారు అనంతపురం బదిలీపై వెళుతూ గూడూరులో ఉన్నవారి సొంత భవనాన్ని శ్రీరామకృష్ణ సేవాసమితి నిర్వహణకు అందజేయడానికి ఉత్సాహం చూపుతున్నారనీ; సమితి నిర్వహణ బాధ్యతను కూడా నేను చూసుకోవాల్సి ఉంటుందనీ చెప్పారు. నాకు నోటమాట రాలేదు. ఎంతో సంతోషంతో స్వామీజీ పటం ముందు కూర్చొని కన్నీళ్ళతో కృతజ్ఞతలు అర్పించాను. స్వామీజీపై విశ్వాసం అసాధ్యాలను కూడా సుసాధ్యం చేస్తుందనడానికి ఇదే నిదర్శనం. పదిరోజుల్లో ఆ భవనాన్ని తీర్చిదిద్దడమయింది; 2007 అక్టోబరు 2న గూడురులో శ్రీరామకృష్ణ సేవాసమితి ప్రారంభమయింది. జీవితాల్ని మహోన్నతంగా మార్చగలిగే మహత్తర శక్తి స్వామీజీ సందేశానికి ఉందని నా ప్రగాఢ విశ్వాసం.

*వి.వి. కుమార్, గూడూరు శ్రీరామకృష్ణ సేవాసమితి.*

# స్వామి వివేకానందుల 'త్రిసూత్రం'

- స్వామి అర్చనానంద




ఆత్మశక్తినీ, ఆధ్యాత్మిక చైతన్యాన్నీ జాగృతం చేయడానికి స్వామి వివేకానంద ఆవిర్భవించారు. వారి ముఖ్యబోధన - "సత్యం, పవిత్రత, నిస్వార్థం అనే మూడు గుణాలున్న వ్యక్తిని ముల్లోకాల్లోని ఏ శక్తీ ఏ హానీ చేయలేదు. ఈ మూడు సద్గుణాలతో శోభిల్లే వ్యక్తి సమస్త విశ్వాన్నీ ఎదుర్కోగల సమర్థుడవుతాడు". ఈ మూడు అతి ముఖ్య గుణాలనూ వివేకానందుని త్రిసూత్రాలుగానూ, ఆయన సాక్షాత్తూ శివస్వరూపుడు, వీరేశ్వరుడు కాబట్టి అజ్ఞాన తామసాసురుణ్ణి నాశనం చేసే 'వివేకానంద త్రిశూలం' గానూ వర్ణించవచ్చు. కలియుగ ప్రత్యక్ష దైవాలైన శ్రీరామకృష్ణులు, శ్రీశారదామాత, స్వామి వివేకానందులే ఈ త్రిసూత్రాలకు సజీవ భాష్యాలు, సాక్షాత్ స్వరూపాలు.

**1. సత్యం:** 'సత్యమేవ జయతే నా నృతమ్'. 'సత్యమే జయిస్తుంది, అసత్యమెన్నటికీ కాదు' అని వేదోక్తి. "సత్య వచనమే కలికాలంలో తపస్సు. మనసా వాచా కర్మణా సత్యాన్ని ఆచరించేవాడు భగవంతుని ఒడిలోనే ఉంటాడు. (భగవత్ సాక్షాత్కారం అతనికి కరతలామలకమన్నమాట)" అని శ్రీరామకృష్ణుల ఉవాచ. స్వయంగా శ్రీరామకృష్ణులే వారి ఈ బోధనకు ప్రత్యక్ష నిదర్శనం. సత్యస్వరూపమే, సత్య అవతారమే శ్రీరామకృష్ణులు. మాట వరుసకైనా, సరదాకైనా ఆయన అసత్యం పలికేవారు కాదు. అప్రయత్నంగా ఏమయినా తన నోట వచ్చినా దాన్ని ఆచరించే వరకూ వారికి మనఃశాంతి కలిగేది కాదు.

'సత్యమే మాట్లాడుతూ ఆఫీసుల్లో, వ్యాపారాలలో ఈ కాలంలో పని చేయడం అసంభవం' అనేవారూ, అనుకునే వారూ ఆత్మశక్తిపై విశ్వాసంలేని బలహీనులు. 'సత్యం-పురాతనమైనా, ఆధునికమైనా ఏ సమాజానికీ తలవంచదు; సమాజమే సత్యానికి తలవంచాలి' అన్నది స్వామి వివేకాందుని అగ్ని సూత్రం.

**2. పవిత్రత:** శ్రీ శారదామాత పవిత్రతా స్వరూపిణి. 'భగవంతుడు భక్తుని హృదయాన్ని చూస్తాడు' (బాహ్య ఆడంబరాన్ని కాదు) అన్నది అమ్మ. హృదయ శుద్ధి, బాహ్య, ఆంతరిక జీవితాలలో పవిత్రత లేకపోతే మనం ఎంత ఆర్భాటంగా, ఆడంబరంగా జపతపాలు, పూజా వ్రతాలు, సమాజసేవలు, యోగాసన, ప్రాణాయామాలు చేసినా అన్నీ నిష్ఫలమే. 'యోగ' అంటే కేవలం ఆసనాలు, ప్రాణాయామం మాత్రమే కాదు. రాజయోగ మూల పురుషుడైన మహర్షి పతంజలి తన యోగ సూత్రాలలో - 'అష్టాంగయోగం'లో యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధి - ఈ క్రమంలో యోగ సాధన వివరించారు.

మొట్టమొదట 'యమం'లో సత్య, అస్తేయ, బ్రహ్మచర్య, అపరిగ్రహ - ఈ నాలుగు సాధనలు. రెండవ అంగం 'నియమం' లో శౌచ, సంతోష, స్వాధ్యాయ, ఈశ్వర ప్రణిధాన - ఈ నాలుగు సాధనలు. పరికించిచూస్తే ఇవన్నీ 'హృదయ పవిత్రత' కోసం ఆవశ్యకమని స్పష్టంగా తెలుస్తుంది.

పవిత్ర హృదయులు ధన్యులు. ఏలన వారు భగవంతుని దర్శిస్తారు. ఒక వేళ అన్ని మతగ్రంథాలూ, మత ప్రవక్తలూ కనుమరుగైనా ఈ ఒక్క వాక్యమే మానవాళిని రక్షించగలదు అన్నది వివేక వాణి. 'పవిత్రత'తో నిండిన హృదయం -

కులం, మతం, జాతి సంప్రదాయం – అనే భేదబుద్ధిని విడిచి సమస్త విశ్వాన్నీ ఆలింగనం చేసుకుంటుంది. అలా విశ్వాన్ని ఒక శిశువుగా మార్చి తన ఒడిలోకి తీసుకున్న పవిత్రతామూర్తి శ్రీశారదామాత. అందుకే అమ్మ తన దగ్గరకు వచ్చిన వారి పాపం, పుణ్యం, ధనం, గుణం, కులం, జాతి, భాష – ఏవీ చూడలేదు.

'ప్రతి జీవి హృదయంలో భగవంతుడున్నాడు, భక్తుని హృదయం భగవంతుని నివాసస్థానం' అని శ్రీరామకృష్ణులు చెప్పారు. 'యో వేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్...' 'హృదయ గుహలో అనంతమైన సర్వవ్యాపకమైన ఆత్మ ప్రకాశిస్తున్నదని' ఉపనిషద్వాణి. దివ్య చైతన్య స్ఫురణలో ఎంతగా ఎదుగుతామో అంతగా మనం పవిత్రతలో నెలకొంటాం. 'నేను భగవంతుని బిడ్డను, జగన్మాత ముద్దు బిడ్డను, భక్తుడను. అమ్మ నామాన్ని, జపించాను! నాకు పాపమేమిటి? అని భావించాలి. అప్పుడు పాపచింతనలు, సంస్కారాలు పోయి పవిత్రులం అవుతాం'అని శ్రీరామకృష్ణులు చెప్పిన అమృత వచనాలు ఎంతో విలువైనవి!

**3. నిస్వార్థం:** 'నిస్వార్థమే భగవంతుడు' అన్నారు స్వామి వివేకానంద. ఈ 'నిస్వార్థా'నికి ఆయన జీవితమే అత్యుత్తమ నిదర్శనం. 'నేను ముందు తింటాను. నేను ముందు సుఖ సంతోషాల్ని అనుభవిస్తాను. నేనే అందరి కన్నా ముందు ముక్తుడనవుతాను' అనే వాడు స్వార్థపరుడు. 'నేను ఆఖరున తింటాను. అందరి సుఖ సంతోషాల కోసం కష్టపడతాను. ఇతరులకు ముక్తి లభించడం కోసం నేను నరకానికి పోవడానికి కూడా సిద్ధమే' అనేవాడు నిస్వార్థపరుడు.

**సత్యం, పవిత్రత, నిస్వార్థం ఈ మూడు గుణాలున్న వ్యక్తిని ముల్లోకాల్లోని ఏ శక్తీ ఏ హానీ చేయలేదు. ఈ మూడు సద్గుణాలతో శోభిల్లే వ్యక్తి సమస్త విశ్వాన్నీ ఎదుర్కోగల సమర్థుడు. - స్వామి వివేకానంద**

'స్వ + అర్థం' (స్వార్థం) – అంటే 'సొంత ప్రయోజనం కోసం' అని అర్థం. 'స్వ' (నేను) అంటే కేవలం శరీరం మాత్రమే అనుకుని భ్రమపడే మనమందరమూ స్వార్థపరులమే. నిజమైన 'స్వ' – స్వ స్వరూపము – అనంత ఆత్మ చైతన్యమే – నేను (స్వ) అని అనుభూతి చెందినప్పుడు మన శరీరం నుండి మనం బయటకు వెళ్ళి, ఇతరుల ఆత్మలతో తాదాత్మ్యం చెంది వారి కష్టాలు మనవిగా భావించి వారికి సాయం చేస్తాం, సేవ చేస్తాం. 'ఇతరుల పట్ల ఆత్మీయతను కలిగి ఉండడం – ఆధ్యాత్మిక లక్షణం' అనేవారు పూజ్య స్వామి రంగనాథానందజీ.

'సర్వభూత హితే రతాః' అని భగవద్గీతలో చాలా సార్లు అంటాడు శ్రీకృష్ణ పరమాత్మ. 'భగవద్గీత' కేవలం వృద్ధాప్యంలో మనఃశాంతి కోసం పారాయణ చేసుకొనే పవిత్ర గ్రంథమని తలచే అజ్ఞానులకు ఈ వాక్యం గొప్ప కనువిప్పు. నిస్వార్థానికీ, 'సర్వభూత హితే రతాః' అనే గీతోక్తికీ స్వామీజీ ప్రతీక, పరాకాష్ఠ. విశ్వమానవాళి సేవలో తన సర్వస్వాన్నీ సమర్పించి, కేవలం $39^1/_2$ సంవత్సరాల వయస్సులోనే 39 శతాబ్దాలపాటు గుర్తుంచుకొనే సేవాసందేశం అందించి, శరీరాన్ని ఒక జీర్ణవస్త్రంలా త్యాగంచేసి, 'I am a voice without a form' – 'నేను ఓ అశరీరవాణిని' అన్నారా మహాత్ముడు. ఎక్కడో భూకంపం వచ్చి, ఎంతో మంది మరణిస్తే ఆయన నిద్ర పోలేకపోయారు. మఠంలో భోజనానికి కూర్చొని, 'మన సోదరులు కోట్ల మంది 'అన్నమో రామచంద్రా' అని అలమటిస్తూ ఉంటే మనకు హాయిగా తినడానికి మనసెలా వస్తుంది?' అని కన్నీళ్ళు పెట్టుకొనేవారు. బేలూరు మఠంలో పనిచేస్తున్న పేద కూలీలను చూసి వారితో ఎంతో ప్రేమతో మాట్లాడేవారు. వారి కోసం మంచి వంటకాలు వండించి, స్వయంగా తమ హస్తాలతో వడ్డించేవారు. వారు తృప్తిగా తింటూ ఉంటే 'సరళ, నిర్మల హృదయులైన ఈ నిరుపేదల కష్టాలను తీర్చడానికై కృషి చేయకపోతే మీ సాధన, మీ సన్న్యాసం అంతా వ్యర్థమే!' అంటూ తోటి సోదర సన్న్యాసులతో, శిష్యులతో అనేవారు.

ఒక నీగ్రో యువకుడు అమెరికాలో స్వామీజీతో కరచాలనం చేసి "మా సోదరుడొకడు ఇంత గొప్ప స్థానాన్ని పొందినందుకు గర్విస్తున్నాను" అంటూ అభినందిస్తే, సంతోషంగా కరచాలనం చేసి విశ్వమానవ సౌభ్రాతృత్వాన్ని ఆచరణలో చూపిన ఆదర్శ పురుషుడు స్వామి వివేకానంద. చాలామంది గొప్పవాళ్ళు, ప్రజానాయకులు – పేరుకు మాత్రమే గొప్పవాళ్ళు. పేరు, ప్రతిష్ఠ, అధికారంపై వారికి ఎనలేని ప్రేమ, ఆశ, దాహం! ఈ 'గొప్ప'వాళ్ళు, ప్రజా 'నాయకులు' అందరూ స్వామీజీ జీవితం బాగా అధ్యయనం చేస్తే, మన దేశానికి నిజమైన సేవ చేయగలుగుతారు. స్వామి వివేకానందుని ఈ త్రిసూత్రాన్ని ఎవరు ఆచరిస్తారో వారి జీవితం మహోన్నతమవుతుంది అనడంలో సందేహంలేదు.



– స్వామి పరిజ్ఞేయానంద

కె. మురళీధరస్వామి, జగిత్యాల.

**ప్రశ్న :** స్వామి వివేకానంద జీవితంలో జరిగిన ఓ సంఘటన ద్వారా విద్యార్థులకు ఆయన ఇచ్చిన సందేశాన్ని తెలియజేయండి.

**జవాబు :** 'యువవాణి' శీర్షిక కోసం విద్యార్థుల నుంచి అధికశాతం 'ఏకాగ్రతను సాధించడానికి సూచనలివ్వండి' అని ఉత్తరాలు వస్తున్నాయి. ఏ రంగంలోనైనా రాణించాలంటే అందరికీ కావలసిన అర్హత 'ఏకాగ్రత'. స్వామి వివేకానంద 'మనసును ఏకాగ్రం చేయగలిగితే ఏ పనిలోనైనా విజయం సాధించవచ్చు. కాబట్టి మొదట ఏకాగ్రతను అలవరచుకోండి' అని అంటారు.





If I had to do my education over again... I would develop the power of concentration and detachment, and then with a perfect instrument I could collect facts at will. - ***Swami Vivekananda***

స్వామి వివేకానంద విద్యార్థులకు ఇచ్చిన సందేశాన్ని ఆయన జీవితంలో జరిగిన ఓ సంఘటన ద్వారా తెలుసుకుందాం.

స్వామీజీ అమెరికాలో ఉన్నప్పుడు ఒక రోజు ఆయన వాగు పక్కగా నడుస్తూ వెళుతున్నారు. అక్కడ కొంత మంది యువకులు నీటి మీద తేలుతున్న గుడ్ల పెంకులను (egg shells) తుపాకితో ఒకరి తరువాత ఒకరు పేల్చడానికి ప్రయత్నిస్తున్నారు. కానీ వారిలో ఎవ్వరూ ఆ పెంకులను పేల్చలేకపోయారు. ఇదంతా చూస్తున్న స్వామీజీ వారి దగ్గరకు వెళ్ళి ఓ యువకుని చేతిలో ఉన్న తుపాకీని తీసుకొని నీటిమీద తేలుతున్న ఆ పెంకుల్ని వరుసగా పేల్చారు. ఆ యువకులంతా ఆశ్చర్యంతో 'స్వామీజీ! మొదటి ప్రయత్నంలోనే మీరు ఎలా పేల్చగలిగారు? మీకు తుపాకీ గురిపెట్టడంలో అనుభవముందా?' అని స్వామీజీని అడిగారు. అందుకు స్వామీజీ 'నేను ఇంతవరకూ తుపాకీ పట్టుకోలేదు. నా మొదటి ప్రయత్నంలోనే లక్ష్యాన్ని సాధించడంలోని రహస్యం ఏకాగ్రతయే' అని బదులిచ్చారు.

రాత్రీ, పగలూ విరామం లేకుండా ఎంత కష్టపడి చదివినా పరీక్షల్లో ఆశించిన ఫలితాన్ని సాధించలేకపోయాం అని చాలామంది విద్యార్థులు బాధను వ్యక్తం చేస్తూవుంటారు.

ఒక గురువు తన ఇద్దరు శిష్యుల్ని అడవికి వెళ్ళి కట్టెలు కొట్టి తీసుకురమ్మని పంపించాడు. ఆ ఇద్దరి శిష్యుల్లో ఒకడు ఉదయాన్నే అడవికి వెళ్ళి గొడ్డలితో చెట్టును నరకడం ప్రారంభించాడు. సూర్యాస్తమయం అవుతున్నా ఇంకా ఆ చెట్టును నరుకుతూనే ఉన్నాడు. రెండో శిష్యుడు గొడ్డలిని బాగా పదునుపెట్టిన తరువాత చెట్టును నరకడం ప్రారంభించాడు. అతి తక్కువ సమయంలోనే తాను అనుకున్న పని పూర్తిచేయగలిగాడు. మొదటి శిష్యుడు విరామం లేకుండా శ్రమించాడు. కానీ తనవద్దనున్న గొడ్డలి పదునుగా లేనందు వల్ల చెట్టును కొట్టడానికి అతనికి ఎక్కువ సమయం పట్టింది. రెండో శిష్యుడు గొడ్డలిని బాగా పదును పెట్టాడు. అందువల్ల అతడు అతి తక్కువ సమయంలోనే పనిని పూర్తిచేయగలిగాడు.

మనం చేపట్టిన ఏపనిలోనైనా విజయాన్ని సాధించాలంటే ముందుగా మనసు అనే గొడ్డలిని పదునుపెట్టాలి. పనిలో మనసును ఎంత ఎక్కువ ఏకాగ్రం చేయగలిగితే అంత త్వరగా ఫలితాలను పొందవచ్చు.

The more this power of concentration, the more knowledge is acquired... Even the lowest shoeblack, if he gives more concentration, will black shoes better... the stronger the power of concentration, the better will that thing be done. - ***Swami Vivekananda***

విద్యార్థులు ప్రసారమాధ్యమాల ప్రభావంలో పడి చెడు మార్గాన్ని అనుసరించకుండా జాగ్రత్తపడాలి. చెడు ఆలోచనలతో నిండిన మనసు కళ్ళెంలేని గుర్రంలాంటిది. అలాంటి చంచల మనసుతో చదవడానికి ప్రయత్నిస్తే పదునులేని గొడ్డలితో చెట్టును నరకడానికి ప్రయత్నించినట్లే అవుతుంది. అందువల్ల విద్యార్థులు మనసును మంచి ఆలోచనల వైపు మళ్ళిస్తే ఏకాగ్రతను సాధించడం సులభం అవుతుంది.

మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా:
**యువవాణి**
శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,
దోమల్‌గూడ, హైదరాబాద్ – 500 029
E- mail : rkprabhayuvavani@gmail.com

యువవాహిని

# మనసు - మర్మం

- గంపా నాగేశ్వర్‌రావు

# అవరోధాలను అధిరోహించడమే అసలైన 'ప్రతిభ'

కొంతమందికి అద్భుతమైన ప్రతిభ ఉంటుంది. కానీ అవకాశాలు అందిపుచ్చుకోవడంలో విఫలమై చతికిలబడుతూ ఉంటారు. ఇంకొందరు ప్రతిభ ఉన్నప్పటికీ, తమను తాము మార్కెట్ చేసుకోవడంలో విఫలమవుతూంటారు. దాంతో వారికి అవకాశాలు రాక, నిరాశగా కాలం వెళ్ళదీస్తూ ఉంటారు.

"ప్రతిభకు ఎప్పటికైనా గుర్తింపు వస్తుంది" అని సరిపెట్టుకునే రోజులు పోయాయి. సరైన సమయంలో గుర్తింపు వస్తేనే ఆ ప్రతిభకు నిజంగా న్యాయం జరిగినట్లు.

నిజానికి, గుర్తించేవారు లేక చాలా అవకాశాలు వృథాగా పడి ఉంటాయి. చాలా మంది, "నాకు కనుక అవకాశం వచ్చి ఉంటే..." అనో, "నాకు సరైన సమయంలో అవకాశం వచ్చి ఉంటే..." అనో తరచూ అనడం మనకు అనుభవమే. కానీ ఇలాంటివారు నిజానికి తమకు రాని అవకాశాల గురించి తలచుకొని చింతిస్తూ, ఎదురుగా వచ్చిన అవకాశాన్ని పట్టించుకోరు.

పండిత మదన్‌మోహన్ మాలవ్యా బెనారస్ హిందూ విశ్వవిద్యాలయాన్ని స్థాపించాలని సంకల్పించారు. సంకల్పమైతే ఉంది కానీ, చేతిలో పైసా లేదు. అందుచేత ఆయన దేశమంతా తిరిగి విరాళాలు సేకరించ తలపెట్టారు.

దేశ పర్యటన చేస్తూ దాతల నుండి విరాళాలు సేకరిస్తూ ఆయన హైదరాబాద్ వచ్చారు. అప్పుడు హైదరాబాద్ నిజాం ఏలుబడిలో ఉంది. పండిత మదన్‌మోహన్ మాలవ్యా సభలోకి వచ్చి తాను వచ్చిన పని వివరించి, విరాళం ఇవ్వవలసిందిగా నవాబును అర్థించారు.

"ఒక హిందూ యూనివర్సిటీకి విరాళం ఇవ్వమని నన్ను అడగడానికి నీకు ఎంత ధైర్యం?" అని అంటూ నవాబు పట్టరాని ఆవేశంతో తన కాలిచెప్పు తీసి మదన్‌మోహన్ మీదకు విసిరివేశాడు.

మదన్‌మోహన్ మాలవ్యా తొణకలేదు. బెణకలేదు. ఆ చెప్పు తీసుకొని, సరాసరి హైదరాబాద్‌లోని సుల్తాన్‌బజార్ వెళ్ళి "ఇది మన నవాబ్‌గారి కాలి చెప్పు" అని ప్రకటించారు.

వేలం పాట మొదలైంది. జనం చుట్టూ మూగారు కానీ వేలంపాట మందకొడిగా సాగుతోంది.

చారుల ద్వారా ఈ విషయం నవాబుకి తెలిసింది. తన చెప్పుకి తక్కువ ధర పలికితే అది తనకు పరువు తక్కువ అని భావించిన నవాబు తన మనిషికి పెద్ద మొత్తం ఇచ్చి పంపాడు. వేలంపాటలో ఆ చెప్పును పెద్దమొత్తానికి పాడి తీసుకురమ్మన్నాడు. అతను వెళ్ళి ఆ పెద్ద మొత్తాన్ని మదన మోహనుడికి ఇచ్చి, చెప్పు తీసుకువెళ్ళాడు. విరాళం కోసం వచ్చిన మదన్‌మోహన్ ఆశించిన దాని కన్నా ఎక్కువ ధనంతో ఆ విధంగా తిరిగి వెళ్ళారు.

ఇక్కడ జాగ్రత్తగా ఒక విషయాన్ని గమనించండి. చెప్పు విసరగానే అవమానపడి తను వచ్చిన దారినే వెళ్ళినట్లయితే మదన్‌మోహన్ మాలవ్యా తాను అనుకున్నది సాధించేవారు కాదు. ప్రతికూలతను సైతం ధైర్యంగా సరైన దృక్పథంతో ఎదుర్కోవడం వల్ల నైతికంగా ఆ నవాబు మీద విజయం సాధించారు.

సమస్యల పట్ల, సంఘటన పట్ల మనకు గల దృక్పథమే మన జయాపజయాలను నిర్ణయిస్తుంది. కాబట్టి జీవితంలో మనకు ఎదురయ్యే అవరోధాలను అధిరోహించడానికి సరైన దృక్పథాన్ని అలవర్చుకోగలగడమే నిజమైన ప్రతిభ.

# జీవితాన్ని మలచే సజీవమూర్తులు

– స్వామి రంగనాథానంద

గురువును సాక్షాత్తూ త్రిమూర్తులతో పోల్చిన గొప్ప సంస్కృతి మనది. మానవజాతిలో అత్యున్నత స్థానం 'గురువు'కు లభిస్తుంది. పిల్లల్ని భావిభారత పౌరులుగా తీర్చిదిద్దే బాధ్యత నిర్వహిస్తున్న ఉపాధ్యాయులందరూ సామాజిక సేవాభాగ్యం కలిగిన ధన్యజీవులు. ఎందువల్లనంటే ఏ దేశ ప్రగతి అయినా ఆ దేశంలోని మానవ వనరులపై ఆధారపడి ఉంటుంది. విద్యార్థులను ఉత్తమ లక్షణాలున్న మానవ వనరులుగా తీర్చిదిద్దే భాగ్యం ఉపాధ్యాయులదే!

అందుకే గురువు స్థానంలో ఉన్నవారు ఎప్పుడూ వారి ధర్మాన్ని సక్రమంగా నిర్వర్తిస్తుండాలి. జీతం కోసమే ఉద్యోగం అనే స్థితి నుంచి పిల్లలకు పాఠాలు బోధించడం కోసమే ఉద్యోగం అనే స్థితికి రావాలి. దీన్నే భగవద్గీతలో ఫలాపేక్ష లేకుండా విధినిర్వహణ అని జగద్గురువు అయిన శ్రీకృష్ణ భగవానుడు చెప్పారు. దాని అర్థం జీతం తీసుకోవద్దని కాదు. అంతకన్నా ఉన్నతమైన బాధ్యత తమది అని ఉపాధ్యాయులు గ్రహించాలని భావం.

**ఆదర్శ జీవనం:** ఉన్నతమైన ఉపాధ్యాయ వృత్తిలో ఉన్నవారు ఎంతో ఆదర్శంగా మెలగాలి. విశాల దృక్పథంతో ఉండాలి. దేశానికి మంచి మానవ వనరులను అందించే బాధ్యత తమది అన్న స్పృహను ఎప్పుడూ కలిగి ఉండాలి. ఉపాధ్యాయులు విద్యార్థులతో మమేకమై, విద్యాబోధన చేయాలి. చిన్న పిల్లలతో మనం ఆడుకునేటప్పుడు మనకు తెలియకుండానే వారితో మమేకమవుతాం. మనమూ చిన్నపిల్లల్లా ప్రవర్తిస్తాం. అలానే పిల్లలు కూడా మనల్ని అనుకరిస్తారు. కాబట్టి విద్యార్థులకు ఉపాధ్యాయుడు ఆదర్శప్రాయంగా ఉండాలి.

చాలా మంది తల్లితండ్రులు విద్య వల్ల తమ పిల్లలకు ఉన్నత ఉద్యోగం లభించాలి అనే సంకుచిత స్వభావంతో వ్యవహరిస్తున్నారే కానీ, సామాజిక చైతన్యమున్న భావిభారత పౌరునిగా తీర్చిదిద్దే ఉత్తమవిద్యను అందించాలనే తపన వారిలో కొరవడుతోంది.

ఏది మంచో, ఏది చెడో వివరించాల్సిన ఉపాధ్యాయవృత్తిలో ఉన్నవారు పాఠ్యాంశాలతో పాటూ నైతిక ఆధ్యాత్మిక విలువల్ని కూడా బోధించాలి అప్పుడే దేశం అభివృద్ధి పథంలో నడుస్తుంది. ` **సేకరణ : ఆర్. కృష్ణ**

మహనీయుల జీవితాల్లో

# మధురఘట్టాలు



## ఆదర్శం నిండిన ఆచార్యుడు!

– జిల్లా ప్రభు

**డా**క్టర్ ప్రఫుల్ల చంద్ర రే భారతదేశంలో స్వదేశీ మందుల తయారీకి శతాబ్దం కిందట శ్రీకారం చుట్టిన గొప్ప వైజ్ఞానికుడు. మెర్క్యురస్ నైట్రేట్ లాంటి రసాయనాన్ని కనుగొన్న శాస్త్రవేత్త ఆయన. భారతీయులంటే అజ్ఞానులనీ, వారు అన్ని విషయాలనూ పాశ్చాత్య దేశాల నుంచే నేర్చుకోవలసి ఉన్నదనీ భావిస్తున్న రోజుల్లో "హిందూ రసాయనశాస్త్ర చరిత్ర" అనే ప్రసిద్ధ గ్రంథాన్ని రచించిన మహనీయుడు ఆయన.

**పేదరికంపై విజయం:** ఆ రోజుల్లో లండన్ విశ్వ విద్యాలయం 'గిల్‌క్రిస్ట్ పురస్కార స్కాలర్‌షిప్' కోసం పోటీ పరీక్షలు నిర్వహిస్తుండేది. విజయం సాధించిన అభ్యర్థి ఉన్నత విద్యాభ్యాసం కోసం విదేశాలకు వెళ్ళగలిగేవాడు.

ప్రఫుల్ల చంద్ర రహస్యంగా ఆ పరీక్షకు తయారు కావడానికి పూనుకున్నారు. అతను ఎంతో సంపన్న కుటుంబంలో జన్మించినప్పటికీ ఆ సంపదంతా ఆనాడు కరి మింగిన వెలగపండు రీతిగా అదృశ్యమై పోయింది. విదేశాలకు వెళ్ళేందుకు ఈ ఒక్క అవకాశమే ఉంది. కొద్ది నెలల తర్వాత పరీక్షా ఫలితాలు ప్రచురితమయ్యాయి. అందులో ప్రఫుల్ల చంద్ర రే విజయం సాధించారు. లండన్ వెళ్ళి ఉన్నత విద్యనభ్యసించి, 1888లో భారతదేశానికి తిరిగి వచ్చారు.

**స్వదేశీ భావన**: ఆనాడు విద్యాశాఖలోని ఉన్నతోద్యోగాలన్నీ ఇంగ్లీషు వారికే ప్రత్యేకించేవారు. వైజ్ఞానిక శాస్త్రంలో డాక్టరేటు తెచ్చుకున్నా స్వదేశంలో గుర్తింపు సాధించడం ప్రఫుల్ల చంద్రుడికి అందని చందమామ అయింది. భారతదేశ ప్రగతి పారిశ్రామికీకరణతోనే ముడిపడి ఉన్నదనీ, అది లేనిదే ముక్తి లేదనీ ప్రఫుల్ల చంద్రుడు గ్రహించారు.

అప్పట్లో మందులు కూడా విదేశాల నుంచే తెప్పించుకోవలసిన దుస్థితి భారతదేశంలో ఉండేది. మందులను మన దేశంలోనే తయారు చేయాలనే ఉద్దేశంతో 'ది బెంగాల్ కెమికల్ అండ్ ఫార్మస్యూటికల్ వర్క్స్'ను స్థాపించారు.

సైన్సు కాలేజీలో రసాయన శాస్త్రంలో ఆచార్యునిగా ఉంటూ, అనేక పరిశోధనలు చేశారు. వస్త్రాల మిల్లులు, సబ్బుల కర్మాగారాలు, చక్కెర కర్మాగారాలు, రసాయన పరిశ్రమలు, పింగాణీ పరిశ్రమలు మొదలైన సంస్థల ద్వారా నాడు ప్రారంభమైన దేశ పారిశ్రామీకరణకు వెన్నుదన్నుగా నిలిచిన చోదక శక్తి ఆయన.

**త్యాగమే మహోన్నత ఆదర్శం:** 60 ఏళ్ళ వయసులో ఆయన విశ్వవిద్యాలయంలో మిగిలిన పదవీకాలంలో తనకు లభించే మొత్తం జీతాన్ని రసాయన శాస్త్ర విభాగం అభివృద్ధికి విరాళంగా ఇచ్చారు. జీవితంలో సామాజిక సేవను మహదాదర్శంగా స్వీకరించారు.

చిన్నప్పుడు తల్లితో "నేను డబ్బు సంపాదించి మన కుటుంబపు ఆస్తిని తిరిగి సాధిస్తాను" అని ప్రఫుల్ల చంద్ర చెప్పారు. కానీ 'ఒక వ్యక్తి తన సంపాదనను తోటి ప్రజల సేవకై ఖర్చు చేయడమే మహత్తరమైన జీవనాదర్శమవుతుందనీ, పేదల కోసం జీవించినవాడే ధన్య(మన్య) జీవి' అనీ చెప్పిన స్వామి వివేకానందుని మాటను అక్షరాలా ఆచరించి చూపిన మహనీయుడు ప్రఫుల్ల చంద్ర రే! ఆయన మేఘనాథ సాహా, శాంతిస్వరూప్ భట్నాగర్ లాంటి శిష్యరత్నాలను జాతికి అందించారు. అలా ఆదర్శవంతుడైన ఆచార్యుడిగా, అకుంఠిత దేశభక్తుడిగా ఆచార్య ప్రఫుల్ల చంద్రరే చిరస్మరణీయుడయ్యారు.

**(ఆగష్టు 2న డాక్టర్ ప్రఫుల్ల చంద్ర రే జన్మదినం)**

యువవాహిని

# నేను సైతం.. నేను సైతం...

– బి. సైదులు

**జింకను తినందే పులికి ఆహారం లేదు; ఇది ప్రకృతి ధర్మం. కాని ఆకలి తీరాక కూడా పులి జింకను తింటూ ఉంటే అది మృగలక్షణం. మనుష్యులకూ ఆ లక్షణం అలవడితే అంతకు మించిన దౌర్భాగ్యం ఇంకొకటి లేదు. అయితే దురదృష్టవశాత్తూ నేడు ప్రపంచమంతా ఈ మృగలక్షణమే రాజ్యమేలుతోంది. విలాసాల్ని అవసరాలుగా భ్రమిస్తూ, కాసులు కూడబెట్టుకునే యావలో పక్కవారి గురించి పట్టించుకోవాలనే స్పృహనే కోల్పోయాం. మేధస్సు ఆకాశాన్ని తాకింది; మనస్సు పాతాళానికి కుంగింది. అందుకే స్వామి వివేకానంద అంటారు Heart is greater than mind. విలువలు దిగజారిన సమాజాన్ని ఎవరో వచ్చి, ఎప్పుడో ఒకప్పుడు ఉద్ధరిస్తారని ప్రతి ఒక్కరూ ఎదురుచూస్తున్నారు. కాని ఆ ఒక్కరూ తామే కావాలని ఎవరూ ప్రతినబూనటం లేదు. 'నా చిట్టి పొట్టకు శ్రీరామరక్ష' అనుకుంటూ స్వార్థపరులుగా మిగిలిపోతున్నాం. అందుకే ఉన్నవారికీ, లేనివారికీ మధ్య తారతమ్యం నానాటికీ పెరిగిపోతోంది. నిజానికి ఆనందం మనం కూడబెట్టటంలో లేదు; అందుకే ఈశావాస్య ఉపనిషత్తు అంటుంది 'తేన త్యక్తేన భుంజీథా...' అంటే ఎంత త్యాగం చేస్తే అంత ఆనందం లభిస్తుంది. ఈ త్యాగభావం తీగసాగి, పరంపరగా పరిఢవిల్లాలి. ఈ యజ్ఞంలో ప్రతి ఒక్కరూ నేను సైతం... నేను సైతం అంటూ ముందుకు రావాలి.**



## సంపద కాదు సేవ ప్రధానం....

ఈ ప్రపంచం ధనవంతుణ్ణి స్మరించుకోదు... దానగుణాన్నే కలకాలం కొనియాడుతుంది. "మనం ఉన్నతస్థానానికి ఎదగడంలో పరోక్షంగా సమాజం ఎంతో తోడ్పడుతుంది; ఇతరులకు మించిన అవకాశాల్ని మనకెన్నో కల్పిస్తుంది; అందుకే ప్రతి ఒక్కరూ తమ పరిధిలో ఈ సమాజ ఋణాన్ని తీర్చుకోవాలి; తమకున్నది ఇతరులతో పంచుకోవాలి" అని అనేవారు టాటా సంస్థలను విశ్వవ్యాప్తం చేసిన జె.ఆర్.డి. టాటా. మనం ఏ రంగంలో ఉన్నా మన పరిధిలో మనం సమాజం పట్ల ఎంతో కొంత బాధ్యత వహించాలి. ఊపిరిపోసుకున్న తొలిక్షణం నుంచీ ఈ గాలి, నేల మనను కంటికి రెప్పలా కాపాడుతున్నాయి. నాలుగు అక్షరాలు నేర్పింది, నాలుగురాళ్ళు వెనకేసుకునేలా చేసింది కాబట్టి ఈ సమాజాన్ని సేవించుకునే బాధ్యత ప్రతి ఒక్కరిపైనా ఉంది.

## జననీ జన్మభూమి....

లంకా నగరాన్ని జయించాక అక్కడి స్వర్ణమందిరాల్ని, రాజవైభోగాల్ని చూసి లక్ష్మణుడు రాముడితో "అన్నా! ఇంత అందమైన నగరాన్ని విడిచి వెళ్ళడమెందుకు? ఇక్కడే ఉండిపోదాం" అంటాడు; అప్పుడు రాముడు "లక్ష్మణా! పరాయినేల బంగారంతో నిండినా, జన్మభూమితో పోలిస్తే మట్టితో సమానం. జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి" అన్నాడు. అలాగని విదేశాలకు వలస వెళ్ళవద్దని కాదు కానీ మూలాలు మరువని సంస్కారం అలవడితే చాలు. నవమాసాలు మోసిన కన్నతల్లినే దేవతగా పూజించే సంస్కృతి మనది; మరి నీవేంటో నిరూపించుకునే అవకాశం కల్పించిన ఈ నేలను ఎంతగా ఆరాధించాలి! గురజాడ వారన్నట్లు దేశమంటే మట్టికాదు మనుష్యులు; ఆ మనుష్యుల్ని సేవించుకుంటే ఈ మట్టిని సేవించుకున్నట్లే!

## ఎవరో ఒకరు.. ఎపుడో అపుడు...

కాలినడకతో దేశమంతా పర్యటించాడు; కన్యాకుమారిలో

సముద్రం ఈదుకుంటూ వెళ్ళి ఈ నేల కన్నీటిని తుడిచేందుకు రోజులు తరబడి తపస్సు చేశాడు; ఈ పుణ్యభూమికి పూర్వవైభవం తెచ్చాడు.... స్వామి వివేకానంద. ఆ బాధ్యత తనదే అనుకున్నాడు; తానొక్కడినే ఆ మహోన్నత ఆశయాన్ని ఆచరణలో పెట్టగలననుకున్నాడు. నిండా నలభై ఏళ్ళు జీవించకపోయినా, ఈ నేల, ఆ గాలి... ఉన్నంత కాలం ఆయనను స్మరించుకునేలా చేశాడు. మహాత్మాగాంధీ... చిన్నకొల్లాయి, బక్కపలచని శరీరం... సర్వమూ త్యజించాడు; ఒక్క దేశభక్తిని తప్ప! కోట్లాది జనాల్లో స్వాతంత్ర్యకాంక్షను రగిలించాడు; తానొక్కడే ఆ పని చేయగలనని; ఆ బాధ్యత తనదేనని నమ్ముకున్నాడు. రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యాన్ని ఉప్పుతో ముప్పుతిప్పలు పెట్టించాడు. మరి ఆ త్యాగం, ఆ సైర్థ్యం, ఆ లక్ష్యం నేడు ఏమయ్యాయి?!.

**సంభవామి యుగే...యుగే....**

ధర్మసంస్థాపనార్థం మరలా మరలా అవతరిస్తానన్నాడు శ్రీకృష్ణభగవానుడు. అది విని ఆ భగవంతుడే అన్నీ చూసుకుంటాడని మనం అచేతనంగా పడి ఉన్నాం; నిజానికి మనమంతా ఆ భగవానుడి అంశలమే! కళ్ళ ముందు కనిపించే కుళ్ళును కొంతైనా ప్రక్షాళన చేయడానికి పూనుకోవాలి. ముఖ్యంగా ఈతరం యువతీ యువకులు ఉపాధివేటలో, ఉద్యోగం పేరుతో సామాజిక బాధ్యతలను విస్మరిస్తున్నారు. రాజకీయం, సామాజిక చైతన్యం లోపించి తమ సంకుచిత చట్రంలో బందీలవుతున్నారు. దేశం ఎటు పోతే మాకేంటన్న ధోరణితో వ్యవహరిస్తున్నారు. అదృష్టవశాత్తూ ఈనాటి తరం ఆర్థికంగా ఆశవహ మార్గంలో పయనిస్తోంది; నలుగురికి చేయూతనిచ్చే స్థాయికి చేరుకుంది. ఈ సమయంలో అభ్యుదయ భావాలను పుణికిపుచ్చుకొని, ఆర్థికంగా, హార్దికంగా సమాజానికి తోడ్పాటునందించేందుకు ముందుకు రావాలి.

**నీ వెంటే నలుగురు...**

***యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్త దేవేతరో జనః; సయత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే....*** అంటుంది భగవద్గీత! అంటే శ్రేష్ఠుదయిన వాడు ఏదైతే ఆచరిస్తాడో లోకమంతా అదే ఆచరిస్తూ అతని వెంట నడుస్తుంది. అందుకే వెంటనడిచే వారిలో ఒకడిలా కాకుండా, నలుగురిని తన వెంట నడిపించుకునే ఉన్నతుడిగా ఎదగాలి. చరిత్ర అలాంటి ఉన్నతుడినే స్మరించుకుంటుంది. ఈ లోకం నుంచి అనామకంగా, చరిత్రహీనులుగా నిష్క్రమించడానికి మించిన దురదృష్టం మరొకటి లేదు. ఆరడుగుల నేలతో అంతమయ్యే జీవితంలో మనకంటూ, మనదంటూ మిగిలేది త్యాగమూ, పరోపకారమే. ఎంత ఆర్జించావన్నది గణనలోకి రాదు; ఎంత ఇచ్చావన్నదే లెక్క! త్యాగభావన చిన్ననాటి నుంచే అలవాటు చేసుకుంటే, ఎదిగాక అది మన అలవాటుగా, అభిరుచిగా మారుతుంది. నలుగురి మనసులో నీ పేరు నిలిచిపోతుంది. అది ప్రవాహంగా, పరంపరగా ముందుతరాలను నడిపిస్తుంది.

---

## దీనులలోనే దేవుడు

ఒంటరిగా ఈ గుడి చీకటి మూలలో ఎవరిని పూజిస్తున్నావు?
కళ్ళు తెరిచిచూడు, నీ ఎదుట
నీ ఈశ్వరుడు లేడు.
తమ స్వేదంతో సేద్యం చేస్తున్న
కర్షకుల మధ్యలో,
తమ రెక్కలముక్కలతో రహదారులు
పరుస్తున్న కార్మికుల మధ్యలో
ఎండనకా, వాననకా చిరిగిన వస్త్రాలతో
దుమ్ముకొట్టుకొని తిరుగుతున్నాడు
నీ ఈశ్వరుడు.
నీ మడిబట్టలు అవతల పెట్టి మట్టినేలపైకి రా!
నీ పుష్పాలు, ధూపదీపాలు కొద్దిసేపు దూరానపెట్టి,
తోటిమానవుణ్ణి సేవించు.... తరించు!

గీతాంజలి... రవీంద్రనాథ్ టాగూరు

---

**"Are you growing spiritually? Can you love others? Can you feel oneness with others? Have you peace within yourself? And do you radiate it around you? That is called spiritual growth, which is stimulated by meditation, inwardly, and by work done in a spirit of service outwardly."** - Swami Ranganathananda




# మంచీ చెడుల మర్మం!

- కస్తూరి మురళీకృష్ణ



నిత్య జీవితంలో మనకు ఎన్నో సందేహాలు వస్తుంటాయి. వాటికి సమాధానాలు దొరకవు. సందేహాలు సందేహాలుగానే మిగిలిపోతాయి. దాంతో మనకు తెలియకుండానే మనలో అశాంతి రగులుకుంటుంది.

ఇలాంటి సందేహాలలో ఒకటి–మనుష్యులు మంచి వాళ్ళయి కూడా ఎందుకని హఠాత్తుగా చెడ్డగా ప్రవర్తిస్తారో అర్థం కాదు. మనం ఎంతో మంచి వాళ్ళు అనుకుంటాం. వాళ్ళను మనఃస్ఫూర్తిగా నమ్ముతాం. కానీ, హఠాత్తుగా, అనూహ్యమైన రీతిలో వాళ్ళు దుష్టంగా ప్రవర్తిస్తారు. మనకు వాళ్ళ వల్ల కలిగిన నష్టం కన్నా మన నమ్మకం దెబ్బ తిన్నదన్న బాధ ఎక్కువవుతుంది.

అలాగే, కొందరిని చెడ్డవాళ్ళనుకుంటాం. వాళ్ళ ప్రవర్తన కూడా చెడుగానే ఉంటుంది. కానీ అనుకోని రీతిలో వాళ్ళు మంచిగా ప్రవర్తిస్తారు. మన అంచనాలను తలక్రిందులు చేస్తారు. ఇలా ఎందుకు జరుగుతుంది? మనకు ఎప్పుడు ఎలాంటి సందేహం కలిగినా దానికి సమాధానం శాస్త్రాల్లో దొరుకుతుందంటారు. ఈ విషయంలో మన ఋషులేమంటారో చూద్దాం ! 'తైత్తరీయోపనిషత్తు', 'బృహదారణ్యకోపనిషత్తు'లలో మన సందేహానికి సమాధానం దొరుకుతుంది!

సృష్టి పూర్తయింది. ప్రపంచాన్ని సృష్టించిన సృష్టికర్త దేవతలనూ, దానవులనూ సృజించాడు. వారి ఆహారం కోసం దేవుడు వారికి మనిషిని చూపించాడు. మనిషిని చూస్తూనే దేవతలు సంతోషించారు. రాక్షసులూ సంతోషించారు. 'దేవుడి లాంటి రూపాన్నే కలిగి ఉన్న మానవుడు సంపూర్ణమైన జీవి' అనుకున్నారు. వెంటనే 'కంటి'కి చూపునిచ్చే సూర్యుడు కంట్లో ప్రవేశించాడు. నాసికకు వాసన శక్తినిచ్చే వాయుదేవుడు నాసికలో ప్రవేశించాడు. ఇలా ఒక్కో దేవత శరీరంలోని ఒక్కో భాగంలో ప్రవేశించారు. దాంతో మనిషి శరీరం దేవతలకు నివాసం అయింది.

మనిషి మీద దేవతలకు ఎంత హక్కు ఉందో, రాక్షసులకూ అంతే హక్కు ఉంది. అందుకే మనిషి శరీరంలో ప్రతి అంగంలో దేవతలు ఎలా నివాసమున్నారో, అలాగే రాక్షసులు కూడా నివాసమున్నారన్నమాట. దాంతో మన శరీరంలోని ప్రతి అంగంలో అనుక్షణం దేవతలకూ, రాక్షసులకూ యుద్ధం జరుగుతోందన్నమాట. ఈ యుద్ధంలో దేవతలు గెలిచినపుడు... కన్ను మంచి చూస్తుంది, చెవి మంచి వింటుంది, నాసిక మంచి వాసన చూస్తుంది, మెదడు మంచి ఆలోచన చేస్తుంది. కన్ను చెడు చూసి, చెవి చెడు విని, మెదడు చెడు ఆలోచన చేస్తోందంటే అర్థం మనలోని రాక్షసులు గెలుస్తున్నారని!

'అయితే మన మంచి, చెడు దేవతలు, రాక్షసులు నిర్ణయించేటట్లయితే మరి మనం చేసేది ఏముంది?' అన్న సందేహం వస్తుంది.

నిజానికి చేసేదంతా మనమే! దేవతలకు కానీ, రాక్షసులకు కానీ శక్తి నిచ్చేది మనమే! ప్రతి వ్యక్తికీ సంకల్పశక్తి ఉంటుంది. కంట్లోని దేవుడు మంచి చూడమంటాడు. రాక్షసుడు చెడు చూడమంటాడు. మంచి చూసి దేవతలకు శక్తి నివ్వాలో, చెడు చూసి రాక్షసులను శక్తిమంతం చేయాలో నిర్ణయించుకోవాల్సింది మనమే. మనం మంచి చూడాలి, మంచి వినాలి, మంచి ఆలోచనలు చేయాలి అని నిశ్చయించుకుని, అలా చేస్తే దేవతలు శక్తి పొందుతారు. మనం మంచి వాళ్ళమవుతాం. అలాకాకుండా, మనం చెడు వైపు మొగ్గితే రాక్షసులు విజృంభిస్తారు.

దేవతలు మంచి, రాక్షసులు చెడు. దేవతలు జీవితం, రాక్షసులు మరణం. వీటిలో ఏది కావాలో ఎంచుకోవాల్సింది మనమే!



# రామకృష్ణ మిషన్, కడప

పుట్లంపల్లి, రిమ్స్ ఆసుపత్రి దగ్గర, కడప - 516 002.

ఫోన్ : 08562 - 200120, 200633 Email : kadapamath@yahoo.com

## విన్నపం

రామకృష్ణ సంఘ రెండవ సర్వాధ్యక్షులైన స్వామి శివానందజీ మహరాజ్, ఖాన్ బహదూర్ మంజుమియా అనే ముస్లిం భక్తుని ఆహ్వానంపై రాయలసీమ ప్రాంతంలో కడప పట్టణాన్ని సందర్శించారు. పూజ్య స్వామీజీ సందర్శన భాగ్యమే నేటి రామకృష్ణ మిషన్ శాఖ ఆవిర్భవానికి నాంది. కడపలో సుమారు తొమ్మిది దశాబ్దాలుగా 'రామకృష్ణ సమాజం' పేరిట నిర్వహించబడుతున్న ఈ సంస్థ 2005లో రామకృష్ణ మిషన్ శాఖగా గుర్తింపు పొందింది. 2007లో ఈ శాఖ కడపలోని పుట్లంపల్లి గ్రామంలో 10 ఎకరాల నూతన ప్రాంగణానికి మార్చబడింది.

గత మూడు సంవత్సరాల్లో కడప రామకృష్ణ మిషన్ నూతన ప్రాంగణంలో సభాగృహం, సాధునివాసం, రామకృష్ణ బాలకాశ్రమం నిర్మించి ఎన్నో సేవా కార్యక్రమాలకు శ్రీకారం చుట్టింది.

1. రాయలసీమ ప్రాంతంలోని పాఠశాల, కళాశాలల్లో విలువలతో కూడిన విద్యను ప్రచారం చేసే దిశలో కార్యక్రమాలు చేపట్టడం జరిగింది. ఈ కార్యక్రమాలన్నీ కూడా అనుభవజ్ఞులైన సిబ్బంది సహాయంతో, దృశ్య, శ్రవణమాధ్యమాల సహకారంతో వైవిధ్యమైన రీతిలో నిర్వహిస్తున్నాం.

2. ఆర్థికంగా వెనుకబడిన గ్రామీణ విద్యార్థులకు సముచిత విద్య గరపడానికి 'శ్రీరామకృష్ణ బాలకాశ్రమము' ప్రారంభించాం. ఆర్థికంగా వెనుక బడిన బాలురకు ఆశ్రయం కల్పించడమే మా లక్ష్యం. ఈ నేపథ్యంలో ప్రస్తుతం పదిమంది విద్యార్థులకు భోజన, వసతి సౌకర్యాలతో పాటు దుస్తులు, పుస్తకాల ఖర్చులు, రవాణా సౌకర్యాలు కల్పిస్తున్నాం. ఈ విద్యా సంవత్సరం నుండి ముప్ఫై మంది బాలురకు ఆశ్రయం కల్పించాలన్నది లక్ష్యంగా నిర్ణయించుకున్నాం.

3. నిరుద్యోగ గ్రామీణయువతకు ఉద్యానవన, తత్సంబంధిత విభాగాల్లో ఉచితంగా వసతి సౌకర్యంతో శిక్షణా కార్యక్రమాల్ని నిర్వహిస్తున్నాం. వారం నుంచి పదిరోజుల పాటు రెండు దఫాలుగా ఈ శిక్షణకార్యక్రమాల్ని ఏర్పాటు చేయడం జరిగింది.

కడప ట్రంకురోడ్డులో ఉన్న సిటీ సెంటర్‌లో యువతకు "ఆంగ్లసంభాషణా తరగతులు" (Spoken English Courses) ప్రారంభిస్తున్నాం.

అదేవిధంగా విలువలతో కూడిన విద్యను అందించాలన్న ఆశయంతో 'వివేకానంద విద్యా నికేతనం' పాఠశాలను ప్రారంభించి, తొలిదశలో ప్రీ ప్రైమరీ నుండి ఏడవ తరగతి వరకూ పాఠశాలను నిర్వహించాలని సంకల్పించాం.



'వివేకానంద విద్యానికేతన్' భవన నమూనా

ఈ క్రింద తెలుపబడిన సేవా కార్యక్రమాలకు ఉదారులైన దాతల నుండి ఆర్థిక సహాయ సహకారాల్ని కోరుతున్నాం.

1. 'శ్రీ రామకృష్ణ బాలకాశ్రమం' విద్యార్థులలో ఒకరి లేదా కొందరి నిర్వహణ బాధ్యతను స్వీకరించవచ్చు. ఒక బాలుడికి సంవత్సరానికి అయ్యే ఖర్చు 15 వేల రూపాయలు.
2. బాలకాశ్రమ నిర్వహణకు గాను 60 లక్షల రూపాయలతో శాశ్వత నిధి ఏర్పాటుకై మీ విరాళాన్ని అందించవచ్చు.
3. 69 లక్షల రూపాయలతో నిర్మించనున్న 'వివేకానంద విద్యా నికేతనం' పాఠశాల భవనానికి దాతలు విరాళాలు అందజేయవచ్చు.

విరాళాలను 'Ramakrishna Mission, Kadapa పేరున డిడి/చెక్కుల రూపంలో Ramakrishna Mission, Putlampalli, Kadapa - 516 002 కు పంపవలసిందిగా మనవి. విరాళాలకు సెక్షన్ 80 –జి కింద ఆదాయపు పన్ను మినహాయింపు కలదు.

కడప రామకృష్ణ మిషన్ సేవా కార్యక్రమాలకు ఆర్థికంగా, హార్దికంగా చేయూతనిచ్చి భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ఆశిస్తూ...

**భగవత్సేవలో**
**స్వామి ఆత్మవిదానంద**
కార్యదర్శి

ADVT.

# నాణెంలోని నిగూఢార్థం

ఒకరోజు ఒక రాజుగారు స్వారీ చేస్తూ ఒక గ్రామం మీదుగా వెళుతుండగా ఒక రైతు ఎదురయ్యాడు. ప్రజల క్షేమాన్ని గురించి ఎక్కువ శ్రద్ధ చూపే ఆ రాజుగారు ఆ రైతు సంపాదన ఎంతో తెలుసుకోగోరారు.

రైతు "నా సంపాదన రోజుకి నాలుగు నాణేలు మహాప్రభూ" అన్నాడు.

"వాటిని ఎలా వినియోగిస్తావు?"

"ఒకటి నా గురించి, ఒకటి కృతజ్ఞతగా ఇస్తాను, ఒకటి మళ్ళీ సమకూర్చడానికి ఇస్తాను, మరొకటి ప్రయోజనం కోసం ఇస్తాను".

రాజుగారికి ఏమీ అర్థం కాలేదు. రైతునే వివరించమన్నారు.

"నా సంపాదనలో మొదటి భాగం నా కోసం ఖర్చు పెట్టుకుంటాను. రెండో భాగం ఇంట్లో కష్టపడి అన్ని పనులూ చేసే నా భార్య కోసం కృతజ్ఞతగా ఖర్చుపెడతాను. మూడవ భాగం నన్ను ప్రయోజకుణ్ణి చేసిన నా తల్లితండ్రులకు ఇస్తాను. చివరి భాగం వృద్ధాప్యంలో నా కోసం, నా భార్య కోసం వడ్డీతో సహా ఖర్చుపెట్టాల్సిన నా పిల్లలకు వినియోగిస్తాను" అన్నాడు రైతు.

"నువ్వు చెప్పినది ఒక చిక్కు ప్రశ్నలా ఉంది. నువ్వు కొంత కాలం పాటు, కనీసం నువ్వు నా ముఖం వందమార్లు చూసే వరకూ అయినా దీని జవాబు రహస్యంగా ఉంచు. ఎవరికీ చెప్పకు" అన్నారు రాజుగారు. రైతు దీనికి ఒప్పుకున్నాడు.

ఆ సాయంత్రమే రాజుగారు ఈ పొడుపు కథను తన సభలోని వారికి చెప్పారు. తాను వేసిన ప్రశ్న చెప్పి, దానికి రైతు ఏమని జవాబు ఇచ్చాడో అదీ చెప్పారు. రైతు చెప్పిన సమాధానానికి వివరణ అడిగారు. సభలోని వారెవ్వరూ సరైన వివరణను ఇవ్వలేకపోయారు. అయితే వారిలో ఒక వ్యక్తి మాత్రం తనకు 24 గంటలు గడువిస్తే తాను ఆ చిక్కు ప్రశ్నకి జవాబు చెప్పగలనన్నాడు.

రాజుగారు కలిసిన రైతును వెతుకుతూ వెళ్ళాడు అతను. ఆ రైతును కలిసి, అతణ్ణి ఆ ప్రశ్నకు జవాబు చెప్పమని అడిగాడు. జవాబు చెప్పడానికి ముందు రైతు సుముఖత చూపలేదు. రాజుగారి ఆస్థానం నుండి వచ్చిన వ్యక్తి కొంత ధనం ఉన్న సంచి అతని చేతిలో పెట్టాడు. దాంతో, ఆ రైతు ఆ ప్రశ్నలోని రహస్యాన్ని విప్పి చెప్పాడు. మర్నాడు రాజుగారి సభకు వెళ్ళి ఆ వ్యక్తి చిక్కుముడి విప్పి చెప్పగానే రైతు ఆ రహస్యం ఇతనికి చెప్పాడని గ్రహించారు రాజుగారు.

రాజుగారు ఆ రైతును సభకు పిలిపించి "నా ముఖాన్ని కనీసం వందమార్లు చూసే వరకూ ఈ రహస్యం ఎవరికీ చెప్పవద్దని నేను నీకు చెప్పలేదా" అని గద్దించారు. తనకు ఇచ్చిన మాట నిలబెట్టుకోలేకపోయినందుకు కారణం అడిగారు.



"నేను ఆ రహస్యం విప్పి చెప్పే ముందు మీ ముఖాన్ని వంద మార్లు చూశాను మహాప్రభూ!" అని రైతు చెప్పాడు.

రాజుగారు ఆశ్చర్యంతో "నేను నిన్ను కలవలేదుకదా! మరి అదెలా సాధ్యమయింది"అని రైతుని అడిగారు.

"మీ ఆస్థానం నుండి వచ్చిన వ్యక్తి నాకు వంద నాణేలిచ్చాడు, వాటి మీద ముద్రితమై ఉన్న మీ ముఖాన్ని చూశాను" అన్నాడు రైతు చమత్కారంగా.

అతని తెలివికి మెచ్చుకుని రాజుగారు ఆ రైతుకు చక్కని బహుమతినిచ్చి సత్కరించారు.

# శ్రీరామకృష్ణ ప్రభ గ్రంథాలయ నిధి పథకం

'శ్రీరామకృష్ణ ప్రభ గ్రంథాలయ నిధి పథకం'లో చేరి, మీ పేరు మీద పది మందీ మంచి విషయాలు చదివే వీలు కల్పించండి. ఈ పథకం కింద రూ॥750/- చందా కట్టినట్లయితే, 10 ఏళ్ళ పాటు ఒక గ్రంథాలయానికి (ఉన్నత పాఠశాలలకు/ కళాశాలలకు/ సంస్థలకు/ దేవాలయాలకు)ప్రతి నెలా మీ పేరిట 'శ్రీరామకృష్ణ ప్రభ' పంపిస్తాం. దాతల పేర్లనూ, వారి పేరిట పత్రికను పంపే గ్రంథాలయాల వివరాలనూ 'శ్రీరామకృష్ణ ప్రభ'లో ప్రచురిస్తాం.

| సంఖ్య | దాత పేరు | గ్రహీత సంస్థ |
|---|---|---|
| 1329 | శ్రీ రామసుబ్బయ్య, పొలికొండ, నందివాడ, కృష్ణాజిల్లా -521 327 | శ్రీ రామసుబ్బయ్య లైబ్రరీ, పొలికొండ, నందివాడ, కృష్ణాజిల్లా -521 327 |
| 1330 | డాక్టర్. బి. రామసుబ్బయ్య | వాసవీ గ్రంథాలయం, నందికొట్కూరు, కర్నూల్‌జిల్లా - 518 401 |
| 1331 | శ్రీ కోసూరి బంగార్రాజు, ఆటపాక, కైకలూరు- 521 333 | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, కైకలూరు, కృష్ణాజిల్లా - 521 333 |
| 1332 | ,, ,, ,, | సి.ఆర్.కె.ఆర్.మెమోరియల్ జెడ్.పి. ఉన్నత పాఠశాల, దొడ్డిపట్ల, కైకలూరు |
| 1333 | శ్రీ జి. వేంకటేశ్వర్లు, ద్వారకానగర్, ఆదిలాబాద్-504 001 | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, థమ్సి, ఆదిలాబాద్‌జిల్లా - 504 312 |
| 1334 | శ్రీ పి. బాబూరావు, గవరపేట వీధి, అనకాపల్లి, విశాఖపట్నం | తెలుగు విజ్ఞాన ఇన్‌ఫర్‌మేషన్ సెంటర్ లైబ్రరీ, అనకాపల్లి, విశాఖపట్నం జిల్లా |
| 1335 | ,, ,, ,, | గౌరీ గ్రంథాలయం, గవరపేట వీధి, తుమ్మపాల,అనకాపల్లి,విశాఖపట్నం జిల్లా |
| 1336 | ,, ,, ,, | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, తుమ్మపాల, అనకాపల్లి, విశాఖపట్నం జిల్లా |
| 1337 | శ్రీ పి. ప్రతాప్, వి.టి.కాలనీ, నల్లగొండ - 508 001 | జిల్లా పరిషత్ బాలికల ఉన్నత పాఠశాల, బన్స్‌వాడ, నిజామాబాద్ జిల్లా |
| 1338 | శ్రీమతి బి. అరుణకుమారి, జూబ్లీహిల్స్, హైదరాబాద్ | ప్రాథమికోన్నత పాఠశాల (పాత), కొవ్వూరు, పశ్చిమ గోదావరి జిల్లా |
| 1339 | శ్రీమతి ఎ. శివలీల, శ్రీనగర్ కాలనీ, హైదరాబాద్ | జిల్లా పరిషత్ ఉన్నతపాఠశాల, రెబ్బన్‌పల్లి, ఆదిలాబాద్-504 215 |
| 1340 | శ్రీమతి ఆర్.వి. పద్మజ, మూసాపేట్, హైదరాబాద్ | శ్రీ సూర్యరాయ లైబ్రరీ, పిఠాపురం, తూర్పుగోదావరి జిల్లా |
| 1341 | శ్రీమతి కె. వీణారావ్, జూబ్లీహిల్స్, హైదరాబాద్ -33 | ప్రభుత్వ బాలికల ఉన్నత పాఠశాల, శ్రీకాకుళం - 532 001 |
| 1342 | ,, ,, ,, | టి. డబ్ల్యు ఉన్నత పాఠశాల, ధర్మాలలక్ష్మీపురం, విజయనగరం జిల్లా |
| 1343 | ,, ,, ,, | ట్రైబల్ వెల్‌ఫేర్ ఆశ్రమ, కురుపం, విజయనగరం జిల్లా |
| 1344 | శ్రీ టి. భాస్కర్‌రావ్, కామారెడ్డి,నిజామాబాద్-503 111 | మహావీర్ ఆసుపత్రి, కామారెడ్డి, నిజామాబాద్ -503 111 |
| 1345 | శ్రీ కె. సూర్యనారాయణరాజు,తాడేపల్లిగూడెం, ప.గో.జిల్లా | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, మేడపాడు, ఎలమంచలి, ప.గో.జిల్లా |
| 1346 | శ్రీ దుర్గారావు, నారాయణపురం, ప.గో.జిల్లా- 534 406 | శ్రీ రాఘవేంద్రస్వామివారి పీఠం, తాడేపల్లిగూడెం, ప.గో.జిల్లా-534 101 |
| 1347 | శ్రీ బి. మోహన్‌రెడ్డి, చింతలపల్లి, మహబూబ్‌నగర్ జిల్లా | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, చింతలపల్లి, మహబూబ్‌నగర్ జిల్లా |
| 1348 | శ్రీ వేంకటేశ్వర్లు, ద్వారకనగర్,ఆదిలాబాద్ జిల్లా - 504 001 | జెడ్.పి.పి. పాఠశాల, బెల్లంపల్లి, ఆదిలాబాద్ - 504 001 |
| 1349 | శ్రీ కె. రామనర్సింహారావు,కోదాద,నల్లగొండజిల్లా - 508 206 | బ్రాంచ్ లైబ్రరీ, కోదాద, నల్లగొండ జిల్లా - 508 206 |
| 1350 | శ్రీమతి పి. వసంతకుమారి, భీమవరం, ప.గో.జిల్లా - 534 201 | బర్డోలి ఇంగ్లీష్ మీడియం ఉన్నత పాఠశాల, భీమవరం - 534 201 |
| 1351 | శ్రీ జి. వేంకటేశ్వర్లు, శాంతినగర్, ఆదిలాబాద్‌జిల్లా - 504 001 | జిల్లాపరిషత్ పాఠశాల, జైపూర్ గ్రామం, ఆదిలాబాద్ జిల్లా |
| 1352 | శ్రీ ఎ. శ్రీహరిరావ్, శ్రీనగర్‌కాలనీ, హైదరాబాద్ - 500 073 | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, మెదికొండ, గుంటూరు జిల్లా |
| 1353 | శ్రీ పి. ప్రతాప్, వి.టి. కాలనీ, నల్లగొండజిల్లా-508 001 | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, బద్మి, నిజామాబాద్ జిల్లా 503 187 |
| 1354 | శ్రీ పి. సత్యనారాయణ, శాంతాపేట, నెల్లూరు - 524 001 | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, సీతారామపురం గ్రామం, నెల్లూరు జిల్లా |
| 1355 | శ్రీ బి. సురేష్, విద్యానగర్, హైదరాబాద్ - 500 044 | బ్రాంచ్ లైబ్రరీ, టెక్మల్, మెదక్ - 502 302 |
| 1356 | శ్రీమతి ఎమ్. రఘు రాజకుమారి, హైదరాబాద్ - 500 020 | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, చిన్నమారంగి, విజయనగరం జిల్లా |
| 1357 | సింధూరి సర్జికల్స్, పంజాగుట్ట, హైదరాబాద్ - 500 082 | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, నంబులపల్లి కుంట, అనంతపూర్ జిల్లా |
| 1358 | ,, ,, ,, | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, గండ్లపెంట, అనంతపూర్ జిల్లా - 515 521 |

ఈ పథకం ద్వారా శ్రీరామకృష్ణ ప్రభను మరింతమందికి చేరువ చేస్తున్న దాతలకు కృతజ్ఞతలు.

# 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

| దాత పేరు | విద్యాసంస్థ |
|---|---|
| శ్రీ ఎ. సుధాకర్, గాంధీ కళాశాల, గోదావరిఖని | గాంధీ మెమోరియల్ బాలికల డిగ్రీ కళాశాల, గోదావరిఖని |
| " " " | ఎ. మాధవరెడ్డి మెమోరియల్ కళాశాల, చౌటుప్పల్, నల్లగొండ జిల్లా |
| " " " | అరోర స్కూల్ ఆఫ్ ఎడ్యుకేషన్, భువనగిరి, నల్లగొండ జిల్లా |
| శ్రీ అతిన్ బెనర్జీ, న్యూ ఎస్.బి.హెచ్ కాలనీ, హైదరాబాద్ – 500 029 | వివేకానంద కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్, ఆదిలాబాద్ |
| " " " | శ్రీ సరస్వతీ కాలేజ్ ఆఫ్ ఎడుక్యేషన్, కళ్యాణ్‌దుర్గంరోడ్, అనంతపూర్ |
| " " " | లిటిల్ ఫ్లవర్ కాలేజ్ ఆఫ్ ఎడుక్యేషన్, ఆదిమూర్తినగర్, అనంతపూర్ |
| శ్రీ జి. వేంకటరావు, చికోటిగార్డెన్స్, బేగంపేట్, హైదరాబాద్–16 | క్రెసెంట్ కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్, రామ్‌నగర్, అనంతపూర్ |
| " " " | ఇంటెల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టీచర్ ట్రైనింగ్, జార్జ్‌పేట్, అనంతపూర్ |
| " " " | జనభారతి కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్, కళ్యాణ్‌దుర్గం, అనంతపూర్ |
| శ్రీ కె. క్రిష్ణయ్య శెట్టి & శ్రీమతి కె. శాంత అశోక్‌నగర్, హైదరాబాద్ –20 | కె. సి. నారాయణ కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్, హనుమేష్‌నగర్, గుంతకల్ |
| " " " | శ్రీ సత్యసాయి ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హైయర్ లెర్నింగ్, ప్రశాంతి నిలయం |
| " " " | బాలాజీ కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్, అనంతపూర్ – 515 001 |
| శ్రీమతి మైథిలీ రామచంద్రరావ్, శ్రీనగర్‌కాలనీ, హైదరాబాద్ – 500 073 | మాడపాటి హనుమంతరావు ఉన్నత పాఠశాల, నారాయణగూడ, హైదరాబాద్ |
| " " " | ఆర్.బి.వి.ఆర్.ఆర్. డబ్లూ. కళాశాల, నారాయణగూడ , హైదరాబాద్ |
| " " " | డా॥ కంచర్ల రాజరత్నం క్రిష్టియన్ కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్, రేణిగుంట |

ఈ పథకం ద్వారా శ్రీరామకృష్ణ ప్రభను మరింతమందికి చేరువ చేస్తున్న దాతలకు కృతజ్ఞతలు.

# 'నా జీవితంలో స్వామి వివేకానంద'



జీర్ణమైన దుస్తుల్ని త్యజించినట్లు ఈ శరీరాన్ని త్యజించినా నా భావాలతో ముందు తరాలను నిరంతరం చైతన్య పరుస్తూనే ఉంటాను అనేవారు స్వామి వివేకానంద. విశ్వానికే ఆత్మవిశ్వాసాన్ని ప్రబోధించిన యుగపురుషుడాయన. ఆబాల గోపాలాన్నీ ఉత్తేజపరిచే ఉత్తుంగ చైతన్య సాగరం స్వామీజీ.

స్వామి వివేకానంద ఈ ప్రపంచం నుంచి భౌతికంగా నిష్క్రమించి ఒక శతాబ్దం అయినా వారి స్ఫూర్తి మాత్రం ఆచంద్రార్కం మనల్ని మేల్కొలుపుతూనే ఉంటుంది. అలా ఆ మహనీయుని జీవితంతో ఉత్తేజితులైన వారి అనుభూతులకూ, అనుభవాలకూ 'శ్రీరామకృష్ణ ప్రభ' స్వాగతం పలుకుతోంది.

స్వామి వివేకానంద జీవితంలోని ఒక సంఘటన కావచ్చు, సంభాషణ కావచ్చు.... ఉత్తరం కావచ్చు, ఉపన్యాసం కావచ్చు... ఏదైనా మిమ్మల్ని మహత్తరంగా ప్రభావితం చేసి ఉంటుంది. ఆ అనుభూతినీ, అనుపమానమైన స్ఫూర్తినీ 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులతో పంచుకోండి.

సమస్యల సాగరంలో చిక్కుకొని, చుక్కాని లేని నావ లాగ అగమ్యగోచరమైన నేటితరానికి స్వామి వివేకానంద సాహిత్యం ఆశాదీపమని మీ అనుభవాలు నిరూపిస్తాయి. మీ అనుభవాలనూ, అనుభూతులనూ వ్రాసి మీ ఛాయాచిత్రం (కలర్ ఫోటో)తో సహా పంపిస్తే 'నా జీవితంలో స్వామి వివేకానంద' అనే శీర్షికలో ప్రచురిస్తాం.

మీ అనుభవాలను, భావాలను పంపవలసిన చిరునామా

**'నా జీవితంలో స్వామి వివేకానంద'**

శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్ - 500 029

E- mail : rkprabhayuvavani@gmail.com

...17వ పేజీ తరువాయి.


'దయచేసి పిల్లవాణ్ణి వదిలి పెట్టు. వాడి బదులు మాలో ఒకరిని భక్షించి నీ ఆకలి తీర్చుకో' అన్నాం.

బాలుణ్ణి వదిలిపెడతాను కానీ ఓ షరతు. ఎవరైనా సత్పురుషుణ్ణి నాకు ఆహారంగా సమర్పించాలి. నాకు తెలిసి మయూరధ్వజ మహారాజుగారిని మించిన ఉత్తములు లేరు. ఆయన శరీరంలోని కుడి సగభాగాన్ని నాకు సమర్పిస్తే చాలు, మీ కుమారుణ్ణి వదిలిపెడతాను!

నా కుమారుడి ప్రాణాలు మీ కరుణా కటాక్షాలపై ఆధారపడి ఉన్నాయి.

మీకు అవసరమైన నా శరీరంలోని సగభాగాన్ని...

రాజు మాట పూర్తి చేసేలోపే మహారాణి తెరచాటు నుండి బయటకు వచ్చింది.

నేను ఆయన అర్ధాంగిని. ఆయనకు బదులుగా నన్ను సింహానికి ఆహారంగా సమర్పించండి!

మన్నించండి! సింహానికి కావలసింది ఆయన శరీరంలోని కుడిభాగం! అర్ధాంగి అంటే భర్తలో ఎడమ భాగమే!

వారు ఇలా మాటలతో కాలయాపన చేయడం మయూరధ్వజుడికి నచ్చలేదు.

కాలాన్ని వృథా చేయకండి! ఈ ఖడ్గంతో నా ఈ శరీరాన్ని ఖండించండి. ఊ.. త్వరగా...

మారువేషంలోవున్న శ్రీకృష్ణుడు ఖడ్గాన్ని పైకెత్తగానే రాజు ఎడమ కంటి నుండి భాష్పధారలు కారడం గమనించాడు.

రాజా! నీ ఎడమ కంటి నుండి నీరు కారుతోందే! ప్రాణత్యాగం చేయడం నీకిష్టం లేదా!

అయ్యా! కన్నీరు కార్చేది ఎడమ కన్నే కానీ రెండు కళ్ళు కాదు కదా! 'ఇతరులకు సహాయపడే సౌభాగ్యం తనకు లేకపోయిందే' అని నా వామభాగం బాధపడుతోంది. మరో ఆలోచన లేకుండా, మీ పని కానివ్వండి.

వెంటనే శ్రీకృష్ణార్జునులు స్వస్వరూపాలు ధరించారు!...

దేవా! నన్ను ఎన్నటికీ స్వార్థం ఆవహించకుండా అనుగ్రహించండి.

మహారాజా! నీ త్యాగనిరతి అపూర్వం! తరతరాలకూ ఆదర్శప్రాయం. నీ పేరు చిరస్థాయిగా నిలిచిపోతుంది.

శ్రీకృష్ణార్జునులు మయూరధ్వజుని రాజసూయంలో పాల్గొని ఆయన్ని ఆశీర్వదించారు.

జయం!

నిస్వార్థమైన ప్రేమకు సాధ్యం కానిది ఏముంటుంది అర్జునా! అందుకే మయూరధ్వజుడు అజేయుడు!

మయూరధ్వజ మహారాజు వర్ధిల్లాలి.. వర్ధిల్లాలి... వర్ధిల్లాలి...

యాగం ముగిసిన తరువాత శ్రీకృష్ణార్జునులు, మయూరధ్వజునితో కలిసి ధర్మరాజు చేసే రాజసూయానికి హాజరయ్యారు.

# గ్రంథ పరిచయం




## అమృతస్య పుత్రాః!

(స్వామి వివేకానంద భావజ్వాల)

**పుటలు : 160, వెల : 125/-**
**ప్రచురణ : రామకృష్ణ మఠం**
**ప్రతులకు : రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్- 29, ఫోన్ : 040- 2763 1149**
email: rktelugubook@gmail.com

"**శృణ్వంతు** విశ్వే అమృతస్య పుత్రాః" (శ్వేతాశ్వతరోపనిషత్తు, 2.5) అంటే "అమృతపుత్రులారా! ఆలకించండి" అంటూ ప్రాచీన భారతీయ ఋషివరేణ్యులు తాము సాక్షాత్కరించుకొన్న సత్యాలను తోటి మానవులను మాత్రమే కాక పరలోకవాసులను సైతం ఆలకించమని ఆహ్వానించారు. ఆ నేపథ్యంలో ఈ పుస్తకానికి "అమృతస్య పుత్రాః" అని పేరుపెట్టడం ఎంతో సమంజసనీయం. నిరాశానిస్పృహలతో యాంత్రిక జీవనం సాగిస్తున్న నేటి ఆధునిక పాఠకులకు ఈ 'అమృతస్య పుత్రాః!' సంజీవని లాంటిది.

స్ఫూర్తిదాయకమైనవీ, సార్వకాలీనమైనవీ అయిన స్వామి వివేకానంద భావాల సంగ్రహ సమాహారమే ఈ 'అమృతస్య పుత్రాః!' ఈ భావజ్వాలలకు చిత్రరూపాలు తోడు కావడం వలన, పాఠకులు స్వామీజీ వ్యక్తం చేస్తున్న భావాలను అలవోకగా అర్థం చేసుకొని, ఇట్టే ప్రేరణ పొందగలరనడం సత్యదూరం కాదు. ఆర్ట్ కాగితం మీద పంచరంగులలో ముద్రణకావడం ఈ పుస్తకానికి మరింత సొబగులను, ముస్తాబులను చేకూరుస్తోంది. ఒక్క మాటలో చెప్పాలంటే ప్రతి తెలుగు పాఠకుడూ సొంతం చేసుకుని తీరవలసిన పుస్తకం ఇది! a **- శ్రీధర్**

# గ్రంథ స్వీకారం



## అలరించే అన్నమయ్య సంకీర్తనలు

సంకలనం : అల్లూరు శివకోటేశ్వరరావు,
పేజీలు: 55, వెల: 20/-,
ప్రతులకు: అల్లూరు శివకోటేశ్వరరావు
కారంచేడు -523 168, ప్రకాశం జిల్లా




## మనుధర్మ శాస్త్రము

పేజీలు: 95, వెల: 30/-
ప్రతులకు: భరణి పబ్లికేషన్స్
28-20-17/4, జానీ వీధి
అరండల్‌పేట
విజయవాడ - 520 002

## రథ సారధి

ఖండ కావ్యము
రచన: మేడిచర్ల ప్రభాకర రావు
పేజీలు: 68, వెల: 30/-,
ప్రతులకు: గీతా భవనము,
స్టేషన్ రోడ్, నిజామాబాద్.




## శ్రీ భజన సుధ

రచన : స్వామి అఖండానందగిరి
పేజీలు : 174, వెల : 50/-
ప్రతులకు: మేనేజర్, శ్రీ వ్యాసాశ్రమము
వ్యాసాశ్రమం పోస్టు, ఏర్పేడు,
చిత్తూరు జిల్లా -517 621







## గరుడ పురాణము

పేజీలు: 95, వెల: 30/-
ప్రతులకు: భరణి పబ్లికేషన్స్
28-20-17/4, జానీ వీధి
అరండల్‌పేట
విజయవాడ - 520 002




## బాలకాండ

**గేయకావ్యం**
రచయిత: ఫోతేదార్ కేశవాచార్య
పేజీలు: 212, వెల: 50/-
ప్రతులకు: ఎఫ్. కేశవాచార్య
6-2-23/ఎ, తుమ్మలగడ్డ బజార్
ఖమ్మం-507 001

# వార్తావాహిని

## వరద బాధితులకు ఆపన్న హస్తం

పశ్చిమ బెంగాల్, ఝార్ఖండ్ రాష్ట్రాల్లో జూన్ నెలలో సంభవించిన భారీ వరదలు కారణంగా తూర్పు, పశ్చిమ మేదినీపూర్; ఝార్ఖండ్‌లో అనేక ప్రాంతాలు జలమయం అయ్యాయి. ఈ ప్రాంతాల్లో నిరాశ్రయులైన లక్షలాది మంది వరద బాధితులకు రామకృష్ణ మిషన్-బెల్‌ఘరియా, కొంటాయ్, చండీపూర్, మెదినీపూర్, తమ్లుక్, నరేంద్రపూర్, జమ్‌షెడ్‌పూర్, ఘాట్‌శిల కేంద్రాలు తక్షణ సహాయక చర్యలను చేపట్టాయి.

ఈ ప్రాంతాల్లోని వరద బాధితులకు ఆహారపు పొట్లాలు, పంచదార, పాలు, పప్పులు, బెల్లం, అటుకులు, బిస్కెట్లు, కొవ్వత్తులు, అగ్గిపెట్టెలు, దుప్పట్లు, మందులు మొదలైన నిత్యావసర సామాగ్రిని సరఫరా చేశాయి.

వరద బాధితులకు సహాయక చర్యలు ఇంకా కొనసాగుతున్నాయి. ఈ సేవా కార్యక్రమాల నిమిత్తం దాతల నుంచి విరాళాలను కోరుతున్నాం. విరాళాల్ని 'Ramakrishna Mission, Kolkata' పేరున చెక్కు, డి.డి. లేక నగదు రూపంలో ఈ క్రింది చిరునామాకు పంపగలరు.

**The General Secretary**
**Ramakrishna Mission**
**P.O. Belur Math, Howrah**
**West Bengal - 711 202**
**Ph : 033- 2654 9581/ 9681, Fax : 2654 9885**
**E- mail: rkmrelief@gmail.com**
**Website: www.belurmath.org/relief**

విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలో 80(జి) సెక్షన్ క్రింద పన్ను మినహాయింపు కలదు.

## గిరిజనులకు ప్రత్యేక వైద్యశిబిరం





**రాజమండ్రి రామకృష్ణ మిషన్** 2008 జూన్ 29న రంపచోడవరం, సిరిగిండలపాడు ప్రాంతాల్లోని గిరిజన వాసుల కోసం ప్రత్యేక వైద్య శిబిరాన్ని నిర్వహించింది. పదిహేడు మంది వైద్యనిపుణులు, వంద మందికిపైగా కార్యకర్తలు, సిబ్బందితో నిర్వహించిన ఈ శిబిరంలో సుమారు 800 మంది రోగులకు వైద్యపరీక్షలు చేసి ఉచితంగా మందులు పంపిణీ చేశారు.

నివేదిక : స్వామి అక్షరాత్మానంద

## 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

**ప్రియ భక్తులారా!**

**యువతరంలో ఆత్మవిశ్వాసాన్ని నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకూ, కళాశాలలకూ అందించాలని సంకల్పించాం.**

**శ్రీరామకృష్ణుల, స్వామి వివేకానందుల సందేశాల ఆవశ్యకతను గురించి సుభాష్ చంద్రబోస్ ఒక సందర్భంలో "శీలనిర్మాణానికి రామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం వేరొకటి లేదు" అని అన్నారు.**

**యువతరానికి 'శ్రీరామకృష్ణ ప్రభ'ను మరింత చేరువ చేయడానికి మీ ఆర్థిక సహాయాన్ని కోరుతున్నాం. ఈ పథకం కింద రూ. 1500/- జీవిత చందా (20 సంవత్సరాలకు) కట్టినట్లయితే మీరు సూచించిన లేదా మేము ఎంపిక చేసిన ఒక పాఠశాల/కళాశాలకు 20 ఏళ్ళ పాటు పత్రికను మీ పేరున పంపుతాం. చందాదారుని పేరు, విద్యాసంస్థ పేరు పత్రికలో ప్రచురిస్తాం.**

**మీ చందాను ఎమ్.ఓ. / డి.డి./ చెక్కు రూపంలో Ramakrishna Math, Hyderabad పేరున తీసుకొని, Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029 చిరునామాకు పంపవలెను.**

**స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతరాన్ని తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి మీ వంతు సహాయం అందించగలరని ఆశిస్తున్నాం.**

**భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ప్రార్థిస్తూ...**

**భగవత్సేవలో**
స్వామి జ్ఞానదానంద
**అధ్యక్షులు**

# సుబోధ

గోపికల ప్రేమను గురించి చెప్తూ గురుదేవులు, తమ శిష్యుడు 'మ'కు ఇలా చెప్పారు: "ఆహా! గోపికల ప్రేమ ఎంత గాఢమైందో! తమాల వృక్షాన్ని చూడగానే వారు ప్రేమోన్మత్తులయ్యారు! ఎందుకంటె తమాల వృక్ష శ్యామలవర్ణం వారికి శ్యామసుందరుడైన కృష్ణుణ్ణి తలపునకు తెచ్చింది. గౌరాంగుడి (చైతన్యుడి) విషయం కూడా ఇలాంటిదే. వనాన్ని చూసి అతడు బృందావనమని భావించాడు! ఆహా! ఈ ప్రేమలో అణుమాత్రం లభించినవాడు ఎంత ధన్యుడో కదా! ఏం ప్రేమ పారవశ్యం! ఈ దివ్యప్రేమ వారిలో పరిపూర్ణమై ఉండడమేగాక, నిరంతరం వారి హృదయకాసారం నుంచి పొర్లి ప్రవహించింది.

గోపికల నిష్ఠ ఎంతటి అద్భుతం! శ్రీకృష్ణుడు మధురానగరంలో ఉండగా గోపికలు ద్వార పాలకులను బతిమాలుకొని సభామందిరంలోకి వెళ్ళారు. అక్కడ కిరీటధారియై ఉన్న కృష్ణుణ్ణి నేలచూపులు చూస్తూ, 'ఈ కిరీటధారి ఎవడు? మనం అతడితో మాట్లాడతగదు. మాట్లాడితే కృష్ణుడి పట్ల అపచారం చేసినవారమవుతాం. అయ్యో మన స్వామి ఏడి? పీతాంబరాన్నీ, నెమలి ఫించాన్నీ ధరించే మన ప్రియుడేడి?' అని తమలో తాము గొణుగుకోసాగారు. ఈ గోపికల అనన్యభక్తి ఎంతటి గొప్పదో!

('శ్రీరామకృష్ణ బోధామృతం' నుంచి)



Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

# సురభి

శ్రీకృష్ణుని ఎడబాటును భరించలేని గోపికలు ఆయన స్మరణలోనే నిమగ్నమై శ్రీకృష్ణుని మాదిరే ప్రవర్తించేవారని భాగవతం వచిస్తోంది. మాతృదేవి కూడా గురుదేవులతో ఏకమై అచ్చం ఆయన మాదిరిగానే ప్రవర్తించేవారు. సమాధి స్థితి నుండి కిందికి దిగివచ్చినప్పుడు ఆమెను నేను కొన్ని నిగూఢమైన ప్రశ్నలు అడిగాను. అందుకు మాతృదేవి, గురుదేవుల లాగనే సమాధానమిచ్చారు. గురుదేవులు సమాధానమిచ్చే వైఖరిలోనే, ఆయన సూచించే ఉదాహరణలను, దృష్టాంతాలను చూపి సరళంగా మాట్లాడారు.

కొన్ని సందర్భాలలో ఆమె సామాన్యమైన బాలికలా ప్రవర్తించేవారు. బృందావనంలోని అనేక దేవాలయాలను దర్శించాలనీ, యమునాతీరంలో కృష్ణుడు గోపికలతో విహరించిన స్థలాలకు వెళ్ళాలనీ మాతృదేవి తమ అభిలాషను వ్యక్తం చేశారు. శ్రీకృష్ణుణ్ణి కలుసుకోవడానికి ఆమె చూపిన ఆరాటం, కృష్ణ నామాన్ని ఉచ్చరించిన తీరూ మాకు రాధాదేవిని జ్ఞప్తికి తెచ్చాయి. బృందావనంలో బస చేసిన రోజులలో మాతృదేవి తమను రాధగానే భావించుకొన్నారు. నిరంతరం ధ్యానం, జపం, పారవశ్యస్థితిలో మాతృదేవి ఉండేవారు.

(స్వామి యోగానంద స్మృతుల నుంచి)



Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020 and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

ఆధ్యాత్మిక అమృతవాహిని
# శ్రీ రామకృష్ణ ప్రభ
సంపుటం: 65 సంచిక: 9 సెప్టెంబర్ 2008

ఓం నమస్తే గణపతయే । త్వమేవ ప్రత్యక్షం తత్త్వమసి । త్వమేవ కేవలం
కర్తా - సి । త్వమేవ కేవలం ధర్తా - సి । త్వమేవ కేవలం హర్తా - సి।
త్వమేవ సర్వం ఖల్విదం బ్రహ్మాసి । త్వం సాక్షాదాత్మా - సి నిత్యమ్ ॥

ఓంకార స్వరూపుడవైన ఓ గణపతీ! నీకు నమస్కారం. స్వామీ నీవే 'తత్త్వమసి'అనే మహావాక్యానివి. ఓ గణపతి! నీవే కర్తవు(బ్రహ్మవు), నీవే ధర్తవు (విష్ణువు), నీవే హర్తవు (శివుడవు), సమస్త సృష్టివీ నీవే, ఆత్మ స్వరూపుడవు కూడా నీవే స్వామీ! (శ్రీ గణపతి అథర్వ శీర్షోపనిషత్ నుంచి)






## లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి




ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు......** రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**రాజ పోషకులు............** రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**పోషకులు.................** రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| దాత పేరు | చిరునామా | రూ. |
|---|---|---|
| మహారాజ పోషకులు | : శ్రీ జిన్నూరు నాన్నగారు, జిన్నూరు | 10,000 |
| " " | : శ్రీ వై. శంకర బ్రహ్మయ్య, హనుమంతనగర్, బెంగుళూరు - 560 019 | 10,000 |

## 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

ప్రియ భక్తులారా!

యువతరంలో ఆత్మవిశ్వాసాన్ని నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకూ, కళాశాలలకూ అందించాలని సంకల్పించాం.

శ్రీరామకృష్ణుల, స్వామి వివేకానందుల సందేశాల ఆవశ్యకతను గురించి సుభాష్ చంద్రబోస్ ఒక సందర్భంలో చెబుతూ, "శీలనిర్మాణానికి రామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం వేరొకటి లేదు" అని అన్నారు.

యువతరానికి 'శ్రీరామకృష్ణ ప్రభ'ను మరింత చేరువ చేయడానికి మీ ఆర్థిక సహాయాన్ని కోరుతున్నాం. ఈ పథకం కింద రూ. 1500 మొత్తాన్ని జీవిత చందా (20 సంవత్సరాలకు) కట్టినట్లయితే మీరు సూచించిన, లేదా మేము ఎంపిక చేసిన ఒక పాఠశాల/కళాశాలకు 20 ఏళ్ళ పాటు పత్రికను మీ పేరున పంపుతాం. చందాదారుని పేరు, విద్యాసంస్థ పేరు పత్రికలో ప్రచురిస్తాం.

మీ చందాను ఎమ్.ఓ./డి.డి./చెక్కు రూపంలో Ramakrishna Math, Hyderabad పేరున తీసుకొని, Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029 చిరునామాకు పంపవలెను.

స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతరాన్ని తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి మీ వంతు సహాయం అందించగలరని ఆశిస్తున్నాం.

భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ప్రార్థిస్తూ...

భగవత్సేవలో
స్వామి జ్ఞానదానంద
అధ్యక్షులు



| | | | |
|---|---|---|---|
| శ్రీ తలారి అనంతబాబు, సీనియర్ అడ్వకేట్, హైదరాబాద్ | - | 1000 | పాఠశాలలు/ కళాశాలలకు |
| శ్రీ సి. శ్యామ్ మోహన్ (కీ॥శే॥ నరేంద్ర మోహన్ జ్ఞాపకార్థం) | - | 500 | పాఠశాలలు/ కళాశాలలకు |
| శ్రీ ఎమ్. సత్యనారాయణ రాజు, విశాఖపట్టణం, | - | 500 | పాఠశాలలు/ కళాశాలలకు |

'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను స్పాన్సర్ చేశారు.

### ADVERTISEMENT TARIFF

| | MULTI COLOUR | B & W |
|---|---|---|
| Fourth Cover | Rs.25,000 | - |
| Second Cover | Rs.20,000 | - |
| Third Cover | Rs.20,000 | - |
| Inside Full Page | Rs.15,000 | 10,000 |
| Inside Half Page | Rs.10,000 | 5,000 |

| చందా వివరాలు | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|
| విడి ప్రతి : | రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా : | రూ. 100 | $ 20 |
| మూడు సంవత్సరాలకు : | రూ. 280 | $ 50 |
| ఐదు సంవత్సరాలకు : | రూ. 450 | $ 80 |
| ఇరవై సంవత్సరాలకు : | రూ. 1500 | $ 360 |



గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి. పంపవలసిన చిరునామా : Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.

## లోపలి పేజీల్లో...































### శ్రీరామకృష్ణ ప్రభ వార్షిక చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా! దిగువ పేర్కొన్న నెంబర్ల నడుమ ఉన్న సంవత్సర చందాదారుల చందా గడువు తీరిపోనుంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకొని, 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.*

100001 - 102300 మధ్యనున్న వారిలో **సంవత్సర** చందాదారుల చందా గడువు **2008** సెప్టెంబర్‌తో తీరిపోనుంది!

110001 - 115922 మధ్యనున్న వారిలో **సంవత్సర** చందాదారుల చందా గడువు **2008** అక్టోబర్‌తో తీరిపోనుంది!

**శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ.... - సర్క్యులేషన్ మేనేజర్**

_ మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు. ❖ మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి. ✸ మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.

**'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకి కుడి భాగంలో మీ చందా గడువు నెల పొందుపరచబడి ఉంది.**






**SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH**

Domalguda, Hyderabad - 500 029. Andhra Pradesh

Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com






## జీవన సూత్రాలను నేర్పే
# వినాయక రూపం!

మనిషి ఆశాజీవి. ఆ ఆశే మనిషికి ఆయువుపట్టు. ఆశావాదం లేకపోతే మానవ ప్రగతి సాధ్యం కాదు. చేపట్టిన పని నిర్విఘ్నంగా కొనసాగాలనీ, సత్ఫలితాలను పొందాలనీ ఆశించడం మానవ నైజం. అయితే ఆటంకాలను అధిగమించడానికి మానవ ప్రయత్నంతోపాటూ దైవానుగ్రహం కూడా అవసరం.

మనం ఏ పని ప్రారంభించినా విఘ్నాల్ని తొలగించాల్సిందిగా ప్రథమ పూజలు అర్పించి 'వక్రతుండ మహాకాయ సూర్యకోటి సమప్రభ నిర్విఘ్నం కురుమే దేవ సర్వ కార్యేషు సర్వదా' అంటూ ప్రార్థించేది విఘ్ననాయకుడైన వినాయకుణ్ణే.

వినాయక రూపాన్ని దర్శించగానే మనందరినీ ఆశ్చర్యపరిచే విషయం ఒకటి ఉంది. అదే ఆయన భారీ కాయం, మూషిక వాహనం. అంత మనిషికి ఇంత చిన్న వాహనమేమిటి? బహుశా ఈ పరుగుల ప్రపంచంలో ఒక్క క్షణమైనా తీరిక లేకుండా వేగవంతమైన జీవన శైలికి అలవాటు పడ్డ మనకు 'నిదానమే ప్రధానం' అనే జీవన సూత్రాన్ని అందించడానికేమో!

ఉరుకులూ పరుగులతో సాగే ఈ జీవనయాత్ర ఆనందమయం కావడానికి వినాయకుడు మనకు నర్మగర్భంగా మూడు జీవన సూత్రాల్ని అందిస్తున్నాడు. 'పరిశీలనాశక్తి, విచక్షణా జ్ఞానం, నిశ్చల మనస్సు' – ఈ మూడు జీవన సూత్రాల్నీ మనం ఆచరణాత్మకం చేయాలి.

**పరిశీలనా శక్తికి పరీక్షా సమయం :** ఇసుకలో పడిన చిన్న గుండుసూదిని కూడా ఏనుగు చూడగలుగుతుంది. వినాయకుని కళ్ళు సూక్ష్మ దృష్టికీ, నిశిత పరిశీలనా శక్తికీ ప్రతీకలు. జీవితంలో ఉన్నత స్థితికి చేరడానికి మనిషికి కావలసిన లక్షణాల్లో పరిశీలనా శక్తి ఒకటి. నిత్యం మన ముందు జరుగుతున్న ఎన్నో సంఘటనల్నీ, చూస్తున్న ఎన్నో వస్తువుల్నీ, వింటున్న ఎన్నో విషయాల్నీ మనం సరిగా గమనించం. అందుకు కారణం మనలోని పరిశీలనా శక్తి లోపమే! ఒక మేకు ఊడిపోయి, ఇంటి ముందున్న 'నేమ్ ప్లేట్' ఓ పక్కకు వేలాడుతూ ఉన్నా కొందరు గమనించరు. తమ పక్కింట్లో ఎవరున్నారో గుర్తించలేనంత యాంత్రిక జీవనం గడుపుతున్న వారు మరికొందరు. ఈ పరుగుల ప్రపంచంలో కొంచెం నిదానంగా గమనించి జీవించే తత్త్వాన్ని అలవర్చుకోవడం ఎంతైనా అవసరం.

ఇద్దరు మిత్రులు పాదయాత్ర చేస్తూ కాశీ బయలుదేరారు. పగలంతా వారిద్దరూ నడుస్తూ వెళ్ళేవారు; రాత్రయ్యాక ఎక్కడైనా బస చేసేవారు. ఒక రాత్రి ఓ గ్రామ శివార్లలోనే బస చేసి ఉదయాన్నే ప్రయాణం కొనసాగించాలని నిర్ణయించుకొన్నారు. అక్కడే ఓ గుడారం వేసుకొని అందులో నిద్రపోయారు. వారిలో ఒకడు గాఢనిద్రలో ఉన్న తన మిత్రుణ్ణి అర్ధరాత్రి లేపి 'ఓ మిత్రమా! పైకి చూడు, ఆకాశం ఎంత నిర్మలంగా ఉందో, ఆ వినీలాకాశాన చల్లని చంద్రుడు మనసుకు ఎంత ఆహ్లాదాన్నిస్తున్నాడో, ఆ ప్రక్కనే మినుకు మినుకుమంటూ తారలు కంటికి మరింత విందు చేస్తున్నాయి' అని కవిత్వాన్ని వల్లించాడు. కళ్ళు తెరచి చూసిన ఆ రెండవ మిత్రుడు 'మిత్రమా! మన గుడారాన్ని ఎవడో ఎత్తుకు పోయాడు. ఇప్పుడు నిజంగానే చుక్కలు కనిపిస్తున్నాయి'అని ఆందోళనతో బదులిచ్చాడు.

మొదటి వ్యక్తి కళ్ళు తెరవగానే గుడారం ఉందో, లేదో కూడా గమనించలేదు. అందని ఆకాశంలోని చుక్కలు లెక్కపెట్టసాగాడు. రెండో వ్యక్తి కళ్ళు తెరచీ తెరవగానే గుడారం లేదనే విషయాన్ని గ్రహించాడు.

నిత్య జీవితంలో మన ముందు జరుగుతున్న విషయాలను పరిశీలించే శక్తి లేకపోతే మనకు ఎదురయ్యేవి సమస్యలు మాత్రమే! కాబట్టి మన జీవితం సాఫీగా సాగడానికి పరిశీలనా శక్తి ఎంతైనా అవసరమని గ్రహించాలి.

**మంచిని పెంచి చెడును త్రుంచు:** వినాయకుని చెవులు చాలా పెద్దవి. చీమ చిటుక్కుమన్నా వినగలిగే శక్తి వాటికి ఉంది. బియ్యంలోని రాళ్ళను వేరు చేయడానికి చేటను ఉపయోగిస్తాం. చేటను పోలే వినాయకుని చెవులు మంచీ చెడులను వేరుచేసే శక్తిగలవి అనడానికి సంకేతం. మనం తరచూ వేర్వేరు మనస్తత్త్వాలు గల మనుష్యులతో పనిచేయాల్సి ఉంటుంది. అందరు చెప్పినవీ ఓర్పుతో విని అందులోని మంచిని మాత్రమే స్వీకరించి చెడును విస్మరించగలిగే విచక్షణా

జ్ఞానాన్ని అలవర్చుకోవాలి. అలా కాకపోతే దుష్ప్రవర్తనకులోనై పతనమయ్యే ప్రమాదం ఉంది. శకుని మాటలు విని దుర్యోధనుడూ, దుర్యోధనుడి మాటలు విని కర్ణుడూ విచక్షణా జ్ఞానాన్ని కోల్పోయి ఎంత విధ్వంసాన్ని సృష్టించారో భారత సంగ్రామం చెప్పకనే చెబుతోంది.

పాలలోని నీళ్ళను వేరుచేసి పాలనే స్వీకరించే శక్తి హంసకూ, ఇసుక నుంచి పంచదారను వేరుచేసి పంచదారను మాత్రమే స్వీకరించే గుణం చీమలకూ ఉన్నాయి. ఏ భాషా, భావం తెలియని మూగ జీవులే మంచీ చెడుల మధ్య తారతమ్యాన్ని ఎరిగి వ్యవహరించ గలిగినప్పుడు భగవంతుడు మనిషికి ప్రత్యేకంగా ఇచ్చిన మస్తిష్కంతో మంచీ చెడుల విచక్షణ చేయ లేకపోతే అందుకు బాధ్యులెవరు? సమాజంలో రోజు రోజుకూ అవినీతీ, అన్యాయాలూ, అశాంతీ పెరిగిపోతున్నాయని ఆందోళన చెందడం కన్నా దైవం మనకు ఇచ్చిన బుద్ధిని ఉపయోగించుకొని చెడును త్రుంచి మంచిని పెంచుకొనే ప్రయత్నం చేయాలి.





**చపల చిత్తులకు శాంతి ప్రదాత :** వినాయకుని వాహనం మూషికం. అది మానవుని మనసుకి సంకేతం. చంచలత్వం ఉన్న చుంచెలుక పంటల్నీ, విలువైన వస్తువుల్నీ నాశనం చేస్తుంటుంది. అలాంటి దుష్ట స్వభావం ఉన్న ఎలుకను అణచివేసినట్లు, మనిషి చపల చిత్తాన్ని అదుపు చేసి సద్వర్తనులుగా తీర్చిదిద్దేవాడు సిద్ధి వినాయకుడు.

నిశిత పరిశీలనాశక్తి, విచక్షణా జ్ఞానం – ఈ రెండింటినీ సాధించడానికి నిశ్చలమైన మనసు అవసరం. గణపతి జ్ఞాన నిధి. అందుకే వ్యాస భగవానుడు మహాభారత గ్రంథాన్ని వ్రాయడానికి వినాయకుడి సహాయాన్ని అర్థించాడు. 'మహాభారత గ్రంథాన్ని వ్రాస్తున్నప్పుడు చెప్పేదాని భావం పూర్తిగా అర్థం చేసుకొని వ్రాయాలి' అన్న వ్యాసుని నిబంధనను అంగీకరించాడు వినాయకుడు. మహాభారత గాథను విజయవంతంగా ముగించి మనకు అందించిన విద్యల వేలుపు ఆయన. మహాభారత గాథను పూర్తిగా అర్థం చేసుకొని గ్రంథస్థం చేయడానికి ఎంత ధీశక్తి, ఏకాగ్రత, మనోనిశ్చలత అవసరమో మనం ఊహించవచ్చు.

మనసు మన అధీనంలో లేకపోతే ఏ పనిలోనూ నైపుణ్యతను సాధించలేం. కాబట్టి కార్యసిద్ధి కరతలామలకం కావాలంటే మనో నిగ్రహం చాలా ముఖ్యం. ***'మనసశ్చ ఇంద్రియాణాంచ హైకాగ్ర్యం పరమం తపః'*** – ఈ ఆకర్షణల యుగంలో మనసు పరిపరివిధాల పరుగులు తీస్తుంది. విషయ వస్తువుల వైపు పరుగులు తీసే మనసును అదుపులో పెట్టుకొని, ధ్యేయ వస్తువుపై ఏకాగ్రం చేయడానికి ప్రయత్నించడమే అసలైన తపస్సు.

మనం ఏమి సాధించాలన్నా మనసు క్షణికానందాలకు అధీనం కాకుండా మనో నిగ్రహంతో ముందుకు సాగితే జీవితంలో దేనినైనా సాధించవచ్చు. స్వాధీనంలో ఉన్న మనసుకు ఏ విషయాన్నైనా శీఘ్రంగా గ్రహించగలిగే శక్తి వస్తుంది. అలాంటి ఏకాగ్రమైన మనసుతో ఏ పనిలోనైనా తక్కువ సమయాన్ని వినియోగించి ఉత్తమ ఫలితాల్ని పొందవచ్చు. 'విజయ రహస్యమంతా మనోనిగ్రహం పైనే ఆధారపడి ఉంది'అని అంటారు స్వామి వివేకానంద.

There is no limit to the power of the human mind. The more concentrated it is, the more power is brought to bear on one point; that is the secret.

***- Swami Vivekananda***

కాబట్టి పరుగులు తీసే ఈ మనసుకు 'నిదానమే ప్రధానం' అనే పాఠాన్ని నేర్పిద్దాం. మన జీవనయానం విజయవంతంగా, ప్రశాంతంగా సాగేందుకు వీలుగా మనం పరిశీలనా శక్తినీ, విచక్షణా జ్ఞానాన్నీ, నిశ్చల మనసునూ అలవర్చుకొనేందుకు ప్రయత్నిద్దాం. అందుకు వినాయకుణ్ణి ప్రార్థిద్దాం.

# భగవంతుడి ప్రేమ

- స్వామి జ్ఞానదానంద

ఒక భక్తుడుండేవాడు. భగవంతుని పట్ల, తోటివారి పట్ల అతనికి ప్రేమ, అభిమానం ఎక్కువ. భగవంతుడి తరపున అందరికీ అభిమానంతో సేవ చేసేవాడు. ధర్మనిష్ఠకూ, అతిథి సత్కారానికీ అతని పేరు ప్రసిద్ధి కెక్కింది.

ఒక రాత్రి అతని కుటుంబ సభ్యులూ, పని వారూ కూడా నిద్రపోయాక ఎవరో అతని ఇంటి తలుపు కొట్టారు. ఆ భక్తుడు మేల్కొని, తలుపు తెరిచాడు. గుమ్మంలో మురికిగా, చాలా అలసిపోయి, ఆకలితో అలమటిస్తున్న ఒక వృద్ధుడు నిలబడి ఉన్నాడు. అతను చాలా జాలిగా "అయ్యా! నాకు తినడానికి ఏమైనా పెట్టండి బాబూ! వారం రోజులుగా నేను ఏమీ తినలేదు, పస్తున్నాను" అన్నాడు.

ఆ వృద్ధుడి దయనీయమైన స్థితికి భక్తుడి హృదయం ద్రవించిపోయింది. అతణ్ణి చాలా ప్రేమగా లోపలకు పిలిచి భోజనం పెట్టి "అయ్యా! భగవంతుడి తరపున నా ఆతిథ్యాన్ని స్వీకరించి, నన్ను అనుగ్రహించండి" అన్నాడు ఆ భక్తుడు. ఆకలితో అలమటిస్తున్న వృద్ధుడు పళ్ళెం దగ్గరకు లాక్కుని ఆవురావురుమని తినడం ప్రారంభించాడు.

తింటూనే ఆ వృద్ధుడు "ఆహారం ఇచ్చినందుకు మీకు కృతజ్ఞతలు. కానీ భగవంతుడి పేరెందుకు మధ్యలో? పూజ చెయ్యడానికి ఏ దేముడున్నాడు? అవన్నీ అసందర్భపు మాటలు" అన్నాడు.



ఇది విని భక్తుడు నిశ్చేష్టుడయ్యాడు. భగవంతుడి ఉనికిని అంగీకరించని వ్యక్తులు ఉంటారని కూడా అతను ఎప్పుడూ ఊహించలేదు. "ఇంత రాత్రి వేళ ఒక అపరిచితుని ఇంట కరుణామయుడైన ఆ ఈశ్వరుడు మీకు ఆహారాన్ని ఎలా సమకూర్చాడో గ్రహించారా? అత్యంత ప్రేమాస్పదుడైన ఆ ప్రభువు మిమ్మల్ని ఆదుకోకపోయి ఉంటే మీరు ఎలా జీవించి ఉన్నారని?" అన్నాడు భక్తుడు.

వృద్ధుడు తినడంలో నిమగ్నమై ఉన్నాడు. అన్నం తింటూనే, "అయ్యా! భగవంతుడి గురించి ఎందుకు మాట్లాడతారు? మీరు ఎప్పుడైనా ఆయనను చూశారా? మీ స్వభావం మంచిది కనుక మీరు నాకు భోజనం పెట్టారు. నేను మీకు కృతజ్ఞుణ్ణి. లేని దైవం గురించి ఆలోచిస్తూ, వ్యర్థంగా కాలం గడిపే మూర్ఖుణ్ణి కాను నేను" అన్నాడు.

భక్తుడు దీన్ని సహించలేకపోయాడు. తనను తాను నిగ్రహించుకోలేకపోయాడు. వెంటనే కోపంగా "అయితే తమరు భగవంతుణ్ణి నమ్మరన్నమాట! ఆ ప్రభువు లేకుండా, మీ పట్ల మీరే శ్రద్ధ వహిస్తున్నాననుకుంటున్నారా? అదే నిజమైతే, నా ఇంట్లో నుండి బయటకు నడవండి. నాస్తికులకు మా ఇంట స్థానం లేదు" అని మండిపడ్డాడు. అతను తింటున్న పళ్ళెం లాగివేసి, అతణ్ణి ఇంటి బయటకు నెట్టి, తలుపులు మూశాడు. భగవంతుణ్ణి ప్రార్థించి, పడుకుని నిద్రపోయాడు.

ఆ భక్తుడికి కలలో భగవంతుడు కనిపించి, "ఆ వ్యక్తిని తిండి తిననివ్వకుండా, బయటకి తోసేసావెందుకు నాయనా? అతను చాలా ఆకలితో ఉన్నాడు. అతణ్ణి తిండి తిననివ్వలేదేం?" అని ప్రశ్నించాడు.

సర్వాంతర్యామి ఎదుట ఆ భక్తుడు వినమ్రతతో, "స్వామీ! నేను అతనికి కావాల్సినంత తిండి పెడదామనుకున్నాను. అయితే అతను మీ ఉనికిని ఒప్పుకోవడం లేదు. మళ్ళీ మళ్ళీ అదే అంటుంటే నేను ఓర్చుకోలేక పోయాను. మీరు (భగవంతుడు) లేరనే అతని మాటలను నేను ఎలా సహించగలను?" అన్నాడు.

భగవంతుడు చిరునవ్వు నవ్వి, "గడచిన అరవై ఏళ్ళుగా అతను అదే అంటున్నాడు. అయినా కూడా నేను అతనికి తిండి ఇచ్చి, అతణ్ణి ఆదుకుంటున్నాను. నా కోసం నువ్వు అతణ్ణి ఒక్కరోజు భరించలేవా?" అన్నాడు.

భక్తుడు సిగ్గుతో తల వంచుకున్నాడు. తీవ్రమైన పశ్చాత్తాపంతో కన్నీరు కారుస్తూ 'ప్రభూ! ప్రపంచంలోని అన్ని ప్రాణుల పట్లా నాకు అదే ప్రేమ ఉండేలా అనుగ్రహించు. ఏ కారణంగానూ, ఎవరి మీదా నాకు కోపం రాకుండా చూడు. జరిగిన అపరాధానికి నన్ను క్షమించు!' అన్నాడు. భగవంతుడు భక్తుణ్ణి దీవించి అంతర్ధానమయ్యాడు.



# పగ్గాలు వదిలితే ప్రమాదం

– స్వామి రంగనాథానంద

**జీ**వనయాత్ర సఫలం కావాలంటే బుద్ధి, మనస్సు తమ నిజ తత్త్వాలను ప్రదర్శించేలా మలచి, నిగ్రహిస్తేనే ఇది సాధ్యమవుతుంది. మనస్సు ఇంద్రియాల ఆధీనంలో ఉండకుండా శుద్ధమై, బుద్ధితో కలిసినప్పుడే దాని నిజతత్త్వం ప్రకటితమవుతుంది.

బుద్ధి, ఇంద్రియాలు విరుద్ధంగా వ్యవహరించే రెండు గొప్ప శక్తులు; ఈ రెండింటికీ మధ్య మనస్సు ఉంటుంది. మనస్సు శుద్ధమైనప్పుడే బుద్ధి మనస్సుకూ, ఇంద్రియాలకూ అతీతంగా వ్యవహరించగలదు. అప్పుడు శుద్ధ బోధను ప్రసరింపజేసి, వివేకం కలిగి ఉంటుంది. మద్యపానం వల్ల కానీ, ఐశ్వర్యాధికారాల వల్ల కానీ, అభిజాత్య మదం వల్ల కానీ మత్తెక్కిన బుద్ధి నిజతత్త్వం కోల్పోయి, ఇంద్రియాలకు అధీనమవుతుంది. మదమెక్కని బుద్ధి ప్రశాంతంగా, నిశ్చలంగా ప్రకాశిస్తుంది. ఇలాంటి బుద్ధి జీవనయాత్రకు అత్యుత్తమ మార్గదర్శి. శుద్ధమైన తెలివితేటలు, శుద్ధ ఊహాశక్తి, శుద్ధ సంకల్పాల కూడలి అది. జీవితం పై దీని ప్రభావం అత్యంత హితకరమైనది.

ఇంద్రియాల ఆధిపత్యం అధికంగా ఉన్నప్పుడు మనిషి పశుప్రాయుడిగా జీవిస్తాడు. విషయ భోగాల అనుభవమే జన్మ సార్థకతకు కొలమానం అనుకుంటాడు. సహజంగా చపలంగా ఉండే మనస్సు ఆధిపత్యం చలాయిస్తే, జీవితంలో తప్పటడుగులు వేస్తాం. మనస్సు ఒకసారి స్ఫూర్తిదాయకంగానూ, మరోసారి అందుకు భిన్నంగానూ ఉంటుంది. అప్పుడప్పుడు ఉన్నత విలువల మేఘాలతో తేలిపోతుంది, మరొక తడవ సాంసారిక, స్వార్థబుద్ధుల భారంతో క్రుంగిపోతుంది. ఈ విధంగా జీవితం ఊగిసలాడుతూ ఉంటుంది.

జీవితం బుద్ధి అధీనంలో నడిస్తే – స్థిరమైన నైతిక ఆధ్యాత్మిక స్థాయికి ఎగసి, నిజమైన స్వేచ్ఛ, ఆహ్లాదాలను చవి చూసి, ఆధ్యాత్మిక ఉద్దీపనతో సాఫల్యసిద్ధి పొందుతుంది. యమధర్మరాజు ఈ విషయాన్ని కఠోపనిషత్తులో సూత్రప్రాయంగా బోధించాడు.

**విజ్ఞాన సారథిర్యస్తు మనః ప్రగ్రహవాన్ నరః ।**
**సో – ధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్ ॥**

'ఎవడు విజ్ఞానాన్ని సారథిగానూ, మనస్సును కళ్ళెంగానూ ఉపయోగిస్తాడో, అతడు విష్ణుపదాన్ని చేరుతాడు'.

రథం రూపకల్పనలోని ప్రధాన విషయాన్ని ఇక్కడ చెప్పారు. మానవుని మానసిక, శారీరక శక్తులను బుద్ధి నిర్దేశించినప్పుడు జీవనయాత్రలో ఒక్కొక్క మైలురాయినీ దాటుతూ సులభంగా గమ్యాన్ని చేరగలుగుతాడు. మనసు తన అధీనంలో లేకపోతే విషయభోగాల్ని అనుభవిస్తూ, సుఖ సంపదల రాశినే కొలుస్తూ నిజమైన ఆధ్యాత్మిక తత్త్వాన్ని ప్రదర్శించక, ప్రకృతి చేతిలో కీలుబొమ్మగా మారుతాడు.

కాబట్టి ఇంద్రియాలు, మనసు, బుద్ధి మన ఆధీనంలో ఉండాలి. అప్పుడే మన జీవిత గమ్యమైన పరమ పదాన్ని చేరవచ్చు. మనసు ఇంద్రియాలు ఆడించినట్లు ఆడితే మనం ప్రకృతి చేతిలో కీలుబొమ్మలుగా మారే ప్రమాదం ఉంది.

## పండుగలు - పర్వదినాలు

### సెప్టెంబర్- 2008

| | | | |
|---|---|---|---|
| 03 | బుధవారం | : | వినాయక చతుర్థి |
| 11 | గురువారం | : | ఏకాదశి |
| 23 | మంగళవారం | : | స్వామి అభేదానంద జయంతి |
| 25 | గురువారం | : | ఏకాదశి |
| 29 | సోమవారం | : | స్వామి అఖండానంద జయంతి |

# అమ్మ చేతి పసుపు బొమ్మ! అందరికీ దైవమమ్మా!!

- శ్రీమతి గరిమెళ్ళ లక్ష్మి



గణానాం త్వా గణపతిగ్ం హవామహే
కవిం కవీనాముపమశ్రవస్తమమ్ ।
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత
ఆ నః శృణ్వన్నూతిభిః సీదసాదనమ్ ॥

గణపతి పూజలో గణపతిని ఆహ్వానించడానికి చెప్పే ఈ మంత్రం ఋగ్వేదంలోనిది. "సకల వేద మంత్రాలకూ అధిష్ఠాత, అధిపతి అయిన ఓ బ్రహ్మణస్పతీ! దేవగణాలన్నిటికీ నీవే అధిపతివి. విద్వాంసులందరిలోకీ గొప్ప విద్వాంసుడివి. లోకంలోని ఏ పదార్థానికైనా, ఎవరికైనా పోలిక చెప్పాల్సి వస్తే నీతోనే పోల్చాలి. నువ్వు అంత సర్వ సద్గుణవంతుడివి. రాజులందరిలోకీ శ్రేష్ఠుడవైన రాజువు - అలాంటి నిన్ను స్తుతిస్తూ, మేము చేసే ఈ యజ్ఞ కర్మలో నిన్ను ఆహ్వానిస్తున్నాం. నిన్ను ఉద్దేశిస్తూ చేసే ఈ స్తోత్రాలను వింటూ ఈ యజ్ఞశాలకు వచ్చి, ఇక్కడ కూర్చో" అని దీని భావం.

**గణపతి పూజ:** ఏ పూజ చేసినా ముందు పసుపుతో వినాయకుణ్ణి చేసి, పళ్ళెంలో బియ్యం పోసి, ఆ బియ్యంలో తమలపాకు ఉంచి దానిమీద ఈ పసుపు వినాయకుణ్ణి పెట్టి పూజిస్తాం. ఆ పసుపు వినాయకుడికి బెల్లం నివేదన చేసి, వెంటనే ఉద్వాసన చెప్పి, ఆ తరువాత అసలు పూజ (ఏది చెయ్యాలనుకున్నామో అది) చేస్తాం. ఇది భారతీయులందరికీ అలవాటు. దీనికి ఒక కథ చెబుతారు:

**వినాయక ఆవిర్భావం :** పూర్వం గజాసురుడనే రాక్షసుడు శివుణ్ణి గురించి తపస్సు చేశాడు. శివుడు అతనికి ప్రత్యక్షమై ఒక వరం కోరుకోమన్నాడు. అప్పుడా రాక్షసుడు శివుడు తన శరీరంలోనే ఉండిపోవాలని కోరాడు. అందుకు సమ్మతించి, ఆయన అతడి శరీరంలో ఉండిపోయాడు. తరువాత విష్ణుమూర్తి ఇతర దేవతల సహాయంతో ఆ గజాసురుణ్ణి వధించి, శివుణ్ణి బయటకు తీసుకువచ్చాడు. పార్వతీదేవి స్నానం చెయ్యబోతూ తన దేహానికి రాసుకున్న నలుగుపిండితో ఒక బొమ్మను చేసింది. ఆ బొమ్మకు ప్రాణం పోసి గుమ్మంలో కాపలా ఉంచి, ఎవరూ రాకుండా చూడమని చెప్పింది. గజాసురుడు మరణించాక అతని శరీరం నుంచి బయటపడి, కైలాసానికి వచ్చిన శివుడు, ఆ బాలుణ్ణి అడ్డు లెమ్మంటాడు. 'అమ్మ ఎవరినీ లోనికి రానీయ వద్దంది' అని బాలుడు చెబుతాడు. శివుడు ఆ బాలుడి తల నరికి లోపలకు వెళ్ళాడు. బాలుడి తల తెగిపడి ఉండడం చూసి, పార్వతీదేవి దుఃఖించింది. అప్పుడు ఉత్తరం వైపుగా తలపెట్టి పడుకున్న ఏనుగు తలను ప్రమథగణాలు తీసుకొని రాగా, దాన్ని ఆ బాలుని దేహానికి అమర్చి, ఈశ్వరుడు ప్రాణం పోసి, ఆశీర్వదించాడు. ఆ బాలుడే వినాయకుడు.

**నందీశ్వరుడి మూడు కొమ్ముల కథ:** త్రిపురాసురులు అనే రాక్షసులు ముగ్గురూ మూడు పురాల్లో ఉండేవారు. అవి కదులుతూ ఉండేవి. వాళ్ళు దేవతలను బాధపెట్టేవారు. ఆ మూడు పురాలూ ఒకే స్థాయిలో ఒక దగ్గరకు వచ్చినప్పుడే వాళ్ళను సంహరించడం వీలవుతుంది. అందువల్ల ఆ మూడు పురాలనూ ఒక దగ్గరకు చేర్చవలసిందిగా శివుడు, నందీశ్వరుడితో చెప్పాడు. ఆ రోజుల్లో నందికి మూడు కొమ్ములుండేవి. నంది తన మూడు కొమ్ములతో మూడు పురాలనీ ఒక దగ్గరకు చేర్చి, అవి కదలకుండా తన తల మీద నిలిపి ఉంచాడు. అప్పుడు ఆ త్రిపురాలనూ

త్రిపురాంతకుడు బాణంతో కొట్టాడు. ఆ సందర్భంలో నందికి ఉన్న మూడు కొమ్ములలో మధ్యది క్రింద పడిపోయింది. అందుకు నందీశ్వరుడు తన కొమ్ము విరిగి పడిందని విచారించాడు.

భూలోకానికి వెళ్ళి ఆ కొమ్మును వెతికి తీసుకు రావాల్సిందిగా అమ్మ వారు వినాయకుణ్ణి పంపింది. వినాయకుడు అలాగే భూలోకానికి వెళ్ళి, తీసుకుని వచ్చాడు. అప్పుడు ఉమాదేవి "ఇది పశువు (పసుపు) కొమ్ము. దీన్ని పొడి చేసి దానితో వినాయకుణ్ణి తయారు చేసి పూజించాకనే, ఏ పూజ అయినా చెయ్యాలి. అలా చేస్తే ఏ విఘ్నాలూ రావు" అంది. అందుకనే ముందు పసుపుతో వినాయకుణ్ణి చేసి, గరికతో పూజించాలి. అలా పసుపుతో చేసిన వినాయకుడికి నివేదన చేసిన బెల్లాన్ని ఎవరూ తినకూడదంటారు.

**మహాభారత రచనా గాథ:** మహాభారత యుద్ధం జరిగాక వ్యాసమహర్షికి ఆ కథ వ్రాయాలనిపించింది. వెంటనే బ్రహ్మదేవుని దగ్గరకు వెళ్ళి "నాకు మహాభారతమంతా కథగా వ్రాయాలని ఉంది. నేను చెబుతుంటే, ఆ కథను వ్రాయడానికి ఎవరైనా కావాలి" అన్నాడు. బ్రహ్మదేవుడు విఘ్నేశ్వరుడి దగ్గరకు వెళ్ళి అడగమన్నాడు. వెంటనే వేదవ్యాసుడు వినాయకుడి దగ్గరకు వెళ్ళి అడిగాడు. అప్పుడు వినాయకుడు "నాదొక షరతు! మీరు ఎక్కడా ఆపకుండా చెబితే, నేను వ్రాస్తాను" అన్నాడు. అప్పుడు వ్యాసుడు "నాదీ ఒక షరతు ఉంది. నేను చెప్పినది చెప్పినట్లు, అర్థం చేసుకొని మరీ వ్రాయాలి. మధ్యలో ప్రశ్న వెయ్యకూడదు" అన్నాడు. ఇద్దరూ ఒకరి షరతుకు మరొకరు అంగీకరించారు. మంచి ముహూర్తం చూసి, మహాభారత రచన ప్రారంభించారు. ఆ విధంగా వేదవ్యాసుని నోటి నుంచి రాగా, సాక్షాత్తూ ఆ విఘ్నేశ్వరుడే వ్రాసిన మహాభారతం పంచమ వేదం అయింది.



**విఘ్నేశ్వర రూపంలోని అంతరార్థం:** విఘ్నాలను తొలగించడానికి మేధావిత్వం అవసరం. మేధ భగవచ్ఛక్తి. వినాయకుడి గజముఖం మేధావిత్వాన్ని సూచిస్తుంది. ఓంకారాన్ని స్ఫురింపచేసే తొండం భగవంతుడు ప్రణవ స్వరూపుడని బోధిస్తుంది. విశాలంగా ఉన్న పెద్ద పెద్ద చెవులు ఆత్మసంబంధమైన విషయాలు వినడం వల్ల లౌకికమైన విషయ సంస్కారాలు దూరమవుతాయని సూచిస్తాయి. లోకాలను తనలో ధరించిన పరమేశ్వరుడితడే అని తెలియచేసేది ఆయనకున్న పెద్ద పొట్ట (లంబోదరుడు). ఆయన నాలుగు చేతులలో – రెండు చేతులలోని పాశాంకుశాలు కామ క్రోధాలు ఆయన వశంలో ఉంటాయనీ; మూడవ చేతిలోని పుస్తకం ఆయన సకల విద్యాస్వరూపుడూ, విద్యాప్రదాత అనీ; నాలుగో చేతిలోని మోదకం ఆయన ఆనందస్వరూపుడు, ఆనంద ప్రదాత అనీ చెబుతాయి. భగవచ్ఛక్తిని సర్పంగా పేర్కొంటారు. జ్ఞాన బల క్రియా రూపమైన శక్తి ఆయనకు అలంకారమని సర్పభూషణాలు చెబుతాయి.

వినాయకుడికి ఎన్నోపేర్లు. వేరొక నాయకుడు లేని సర్వ స్వతంత్రుడు కనుక వినాయకుడు. ఏనుగు ముఖం ఉంది కనుక గజాననుడు, గజముఖుడు. గణాలకు అధిపతి కనుక గణపతి. విఘ్నాలకు నాయకుడు కనుక విఘ్న నాయకుడు, విఘ్నేశ్వరుడు. ఒకే దంతం ఉంది కనుక ఏకదంతుడు. చెడుపనులకు విఘ్నాలు కలిగిస్తాడు కనుక విఘ్న కర్త. మంచి పనులకు విఘ్నాలను తొలగిస్తాడు కనుక విఘ్న హంత... ఇలా ఎన్నో పేర్లున్నాయి.

**వినాయక పూజతో విజేతలు:** వనవాసం పూర్తయ్యాక పాండవులు వినాయక వ్రతం చేసి యుద్ధానికి వెళ్ళారు. వృత్రాసురుణ్ణి చంపినప్పుడు దేవేంద్రుడు, బలి చక్రవర్తిని అణచడానికి వెళ్ళేటప్పుడు వామనుడు, త్రిపురాసుర సంహారమప్పుడు పరమేశ్వరుడు, మహిషాసురుణ్ణి వధించడానికి ముందు దుర్గాదేవి, రావణ సంహారానికి ముందు శ్రీరాముడు, గంగను భూలోకానికి తీసుకురావడానికి ముందు భగీరథుడు వినాయకుణ్ణి పూజించి విజయం సాధించారు.

# దేవీ వైభవం

ప్రవచనం: శ్రీ సామవేదం షణ్ముఖశర్మ      విలేఖనం: శ్రీమతి ఎన్. శేషు

(గత సంచిక తరువాయి)

లలిత శబ్దానికి అనేక అర్థాలున్నాయి. లలిత అంటే లావణ్యవతి అని అర్థం. ఇంతవరకూ చెప్పుకున్న సౌందర్యమే లావణ్యం. అందుకు సుందరి, లలితా – రెండూ ఒకే అర్థాన్ని చెబుతున్నాయి. ఎలాంటి లావణ్యం అంటే మత్స్యపురాణం ఇచ్చిన నిర్వచనం "*లోకాతీత లావణ్యాత్ లలితా*". బ్రహ్మాండ పురాణంలో లలితోపాఖ్యానం, లలితా సహస్రం వస్తాయి. లోకాలకన్నిటికీ అతీతంగా ఉందిట ఆ తల్లి. ముజ్జగాలూ నడిపిస్తూనే ముజ్జగాలకు అతీతంగా ఉన్నది.

త్రిపుర అంటే మూడు పట్టణములలోనూ ఉన్నది అనే అర్థం కాకుండా, "త్రిభిః పురా త్రిపురా" అనే నిర్వచనం చెప్పుకున్నాం. మూడింటి ముందున్నదీ, మూడింటి తరువాత ఉన్నదీ కూడా ఈ తల్లే. ముజ్జగాలూ పుట్టక ముందు ఆ తల్లే, ముజ్జగాలూ పుట్టించి ఆ జగాల నిండా తన చైతన్యం నింపి ఉంచిన తల్లి. మనం మన జీవితంలో అనుభవించే మూడు అవస్థలు – జాగ్రత్, స్వప్న, సుషుప్తులలో ఉన్న చైతన్యాన్ని గుర్తించాలంటే మనం నాలుగో అవస్థకు చేరాలి. అదే "త్రిభిః పురా" అనేది.



మూడింటికీ అతీతమైన అవస్థే తురీయావస్థ. ఆ అనుభూతి ఎలాంటిది అంటే మనకు మెలకువలో దొరికే అనుభూతి కాదు. నిద్రలో దొరికే అనుభూతి కాదు. కలలో దొరికే అనుభూతి కాదు. కానీ రోజూ దాన్ని మనం ధ్యానం ద్వారా సంపాదించుకోవచ్చు. ధ్యానం ద్వారా మనం క్రమక్రమంగా లోకాతీత స్థితికి చేరగలుగుతాం. అందుకే మనం ధ్యానం చెయ్యడానికి ప్రయత్నించినప్పుడు కళ్ళు మూసుకొని, కదలకుండా కూర్చుంటాం. మనస్సును లోకాలు తిరగకుండా నియంత్రించాలి.

ధ్యానం అంటే మన ఇంద్రియ వృత్తులన్నిటినీ మనస్సులోకి లాగి, మనస్సును బుద్ధిలోకి లాగి, బుద్ధిని పరమాత్మ యందు లయం చెయ్యడం. ఈ ధ్యానస్థితి మెలకువలోని అనుభూతి కాదు, నిద్రలోని అనుభూతి కాదు, కలలోని అనుభూతి కాదు. ఈ మూడింటికీ అతీతమైన దివ్యానుభూతి – అదే తురీయావస్థ. అక్కడ ఉంది అమ్మ అసలు స్వరూపం. దాని కాంతే ఈ మూడింటి యందూ ప్రసరిస్తూ ఉంది. ఆ అసలు స్వరూపాన్ని మనం తెలుసుకుంటే ఈ మూడు అవస్థల్లోనూ అమ్మనే చూడగలం. ఈ నాలుగు అవస్థల్లో అమ్మ ఉంది.

ఈ నాలుగు అవస్థలకూ సంబంధించి అమ్మ యొక్క చైతన్య విశేషాన్ని మనకు లలితా సహస్రంలో చెప్పారు. **"విశ్వరూపా జాగరిణీ స్వపన్తీ తైజసాత్మికా। సుప్తా ప్రాజ్ఞాత్మికా తుర్యా సర్వావస్థా వివర్జితా"....** తురీయం అనేది అవస్థ కాదు. అవస్థాతీతమైన స్థితి. అందుకే 'తుర్యా సర్వావస్థా వివర్జితా' అన్నారు. అక్కడుంది అమ్మ అసలు చిరునామా; ఆత్మ యొక్క అసలు స్థానం అక్కడుంది. మిగిలిన మూడిటిలో అంతర్ ప్రవాహ రూపంలో ప్రసరిస్తున్నది. అది తెలిస్తే ఇది అర్థం అవుతుంది. ధ్యానభూమికి వెళ్ళిన వాడికి మాత్రమే పరమాత్మ యొక్క అనుభూతి లభిస్తుంది. భగవద్గీత ఆరో అధ్యాయం ధ్యానయోగంలో ఇదే విషయాన్ని కృష్ణ పరమాత్మ "తపస్సుల కన్నా, కర్మల కన్నా, జ్ఞానం (జ్ఞానమంటే శాస్త్ర జన్య జ్ఞానం అని అర్థం ఇక్కడ) కన్నా ధ్యానం గొప్పది" అని చెప్పాడు.

ఆత్మ సంయమనం ఎవరైతే చేస్తున్నారో వారికి అమ్మవారు లభ్యమవుతారు. మిగిలినవన్నీ కూడా మనం అమ్మవారి

గురించి తెలుసుకునే ప్రయత్నాలే తప్ప, అసలైన అమ్మవారి స్వరూపం ఆత్మ సంయమన స్థితికి ప్రయత్నించినవారికే లభ్యమవుతుంది. ఎన్ని పురాణాలు చదివినా, ఎన్ని ప్రవచనాలు విన్నా అమ్మ దొరకదు. అమ్మ దొరకాలంటే అది తప్ప మరొక మార్గమే లేదు. ఈ సంగతినే లలితా సహస్రం 'అంతర్ముఖ సమారాధ్యా బహిర్ముఖ సుదుర్లభా' అని చెబుతోంది. అంతర్ముఖత్వమే ఆత్మ సంయమనం. దీనికి మించింది మరొకటి లేదని కృష్ణ పరమాత్మ కూడా భగవద్గీత ఆరో అధ్యాయంలో చెప్పారు. అందుకే "నియతాత్మా" అన్నారాయన. మనస్సును నియంత్రించి అంతర్ముఖం చెయ్యడమే నిజమైన మార్గం అని 'మే మతిః = నా అభిప్రాయం' అన్నారు కృష్ణ పరమాత్మ. ఎన్ని కబుర్లు చెప్పినా ఆత్మ నిగ్రహం లేని వాడికి అమ్మ అర్థం కాదు. మూడింటిలో వ్యాపించిన చైతన్యాన్ని దర్శించాలీ అంటే మూడింటికీ అతీతమైన ధ్యానావస్థ కోసం ప్రయత్నించాలి. త్రిపురసుందరి అంటే మూడింటి యందూ వ్యాపించినది, మూడింటికీ అతీతమైనది.

జగత్తంతా మూడుగా ఎలా వ్యాపించి ఉందో ఒక మహానుభావుడు 'సిద్ధ సారస్వత స్తోత్రం'లో చెప్పారు. అమ్మ వారి స్తోత్ర వాఙ్మయం విస్తారంగా ఉంది. అమ్మవారి స్తోత్ర సాహిత్యానికున్న విస్తృతి మరెక్కడా కనిపించదు. ఆ స్తోత్ర సాహిత్యం ద్వారా అమ్మతత్త్వమంతా మనకు తెలుస్తుంది. ఈ స్తోత్ర సాహిత్యమంతా కూడా అమ్మవారి వైభవాన్ని బహు విధాల వర్ణించింది. అందులో శంకర భగవత్పాదుల వారు అందించిన 'సౌందర్యలహరి' ఒకటి. రెండోది దుర్వాస మహర్షి 'ఆర్యాద్విశతి' పేరిట రెండువందల శ్లోకాలుగా అందజేసినది. 'మూక పంచశతి' అని మూక మహాకవి రచించిన 500 శ్లోకాలున్నాయి. ఈయన కాంచీపురవాసి. కాంచీ అంటే శ్రీవిద్యా అధిష్ఠాన దేవత అయిన సాక్షాత్ రాజరాజేశ్వరి **"అరుణాం కరుణా తరంగితాక్షీం ధృత పాశాంకుశ పుష్పబాణ చాపామ్"** – బిందు స్థానంలో ఉన్న తల్లి కొలువైన చోటు. అందుకే కామాక్షీ (కాంచీ) క్షేత్రం మోక్ష క్షేత్రాల్లో ఒకటి. లలితా సహస్రం పుట్టిన చోటు కాంచీ క్షేత్రం. కాంచీ క్షేత్రంలోనే ఈ లలితోపాఖ్యానం చెప్పారని పురాణాల ఆధారంగా తెలుస్తోంది. అక్కడే అగస్త్య మహర్షికి హయగ్రీవ స్వామి లలితా ఉపాఖ్యానాన్ని వివరించి, శ్రీ విద్యా రహస్యాలన్నీ తెలియజేసినట్లు అనేక గ్రంథాలు మనకు వివరిస్తున్నాయి. అమ్మ వారి స్వరూపం చిదగ్ని కుండంలో నుంచి ఆవిర్భవించిన తరువాత, దేవతలందరూ నమస్కరించాక అప్పుడు అమ్మవారి పేరు 'శివా స్వాధీన వల్లభా' అని చెప్పారు. శివా అంటే అమ్మవారి పేరు. అదే కామాక్షి. కామాక్షి, కామదాయిని అనే రెండు పేర్లున్నాయి. మిగిలినవన్నీ విశేషణాన్ని తెలియచేసే పేర్లే.

మూక కవి జన్మతః మూగవాడు. గురువుల ద్వారా ఆయనకు అమ్మవారి మంత్రం లభించి, అమ్మను చూస్తూ జపం చేస్తున్నారట కాంచీపుర క్షేత్రంలో. అప్పుడు జగదంబిక సాక్షాత్కరించి, అతనికి మాట ప్రసాదించిందట! అమ్మ ఇచ్చిన పలుకులతో అమ్మను స్తోత్రం చేశారాయన. ఎవరికి పలుకు ఇవ్వాలన్నా, బుద్ధి ఇవ్వాలన్నా, జ్ఞానమివ్వాలన్నా అమ్మే ఇవ్వాలి. శరీరానికి కదలిక ఇవ్వాలన్నా అమ్మే ఇవ్వాలి. జగత్తులో ఏ ఐశ్వర్యమైనా అమ్మే ఇవ్వాలి. ఐశ్వర్యమే అమ్మ, ఐశ్వర్యాన్ని ఇచ్చేది అమ్మ. అది తెలుసుకుంటే నేననే అహం పూర్తిగా పోతుంది. అదే 'కేనోపనిషత్తు' సారం.

అమ్మను చూడగానే మూక కవి మొదట "కారణపర చిద్రూపా..." అని 'ఆర్యా శతకం' ప్రారంభించి, వంద శ్లోకాలు రచించాడు. తరువాత అమ్మ చిరునవ్వు మీద వంద పద్యాలు రచించాడు. అమ్మ కడగంటి చూపు మీద వంద శ్లోకాలు, అమ్మ పాదాల మీద వంద శ్లోకాలు రచించాడు. ఆ తరువాత అమ్మను స్తోత్రం చేస్తూ స్తుతి శతకం రచించాడు. ఇలా మొత్తం ఐదు శతకాలు రచించాడు ఆ మహానుభావుడు.

అలా అమ్మపై వచ్చిన వాఙ్మయంలో కాళిదాసాది మహాకవులు రచించిన చిన్న చిన్న స్తోత్రాలు మొదలుకుని మహా స్తోత్రాల వరకూ ఉన్నాయి. మహాకవి కాళిదాసు ఆ తల్లిని ఉపాసించి, సాక్షాత్కరింపచేసుకొని, *"మాణిక్యవీణా ముపలాలయంతీం మదాలసాం మంజుల వాగ్విలాసాం మాహేంద్ర నీలద్యుతి కోమలాంగీం మాతంగ కన్యాం మనసా స్మరామి"* అని కీర్తించి, క్రమంగా కామాక్షీదేవిని వర్ణించాడు– *"చతుర్భుజే చంద్రకళావతంసే కుచోన్నతే కుంకుమ రాగ శోణే పుండ్రేక్షు పాశాంకుశపుష్పబాణ హస్తే నమస్తే జగదేకమాతః"* అంటూ! ఇదంతా జగజ్జనని అయిన లలితా త్రిపుర సుందరి యొక్క రూపవైభవం. నిజానికి ఆ తల్లికి ఏ రూపమూ లేదు. ఆవిడ సౌందర్యలహరి. సౌందర్యం అన్నప్పుడు స్త్రీ కానీ, పురుషుడు కానీ లేకుండా ఆ సౌందర్యం నిరంతర ప్రవాహ రూపంలో ఉంది కనుక 'సౌందర్య లహరి' అన్నారు.

**(సశేషం)**




- స్వామి మేధానందపురి

– ఎస్. వాసవి, హనుమకొండ

**? : 'కూర్మనాడ్యాం స్థైర్యమ్' అనే సూత్రం పాతంజలి యోగసూత్రాల్లో ఎక్కడ ఉంది? దీని అర్థమేమిటి?**

✍: ఈ సూత్రం విభూతి పాదంలోని 31వ సూత్రం. 'కూర్మనాడి యందు సంయమం చేస్తే స్థిరత్వం లభిస్తుంది'అని ఈ సూత్రానికి అర్థం. ఈ నాడి కంఠానికి క్రింద గుండెల లోపల తాబేలు ఆకారంలో ఉంటుంది. కామ చేష్టలను అరికట్టి, నిషిద్ధ ఆచారాలను వదలి, మనస్సును ఈ



నాడిపై చక్కగా ఏకాగ్రం చేసినట్లయితే స్థిరత్వం ఏర్పడుతుంది. ఎలాంటి స్థిరత్వం అంటే పాము పట్టు, ఉడుము పట్టుల్లాంటి స్థిరత్వం. పుట్టలో సగం దూరిన పామును పట్టుకొని పైకి తీద్దామని ప్రయత్నించినా రాదు, కానీ త్రాడు లాగ సగానికి తెగిపోతుంది. ఉడుము గోడ మీద పాకి డాబా పైకి ఎక్కిన తరువాత దాని నడుముకు కట్టిన త్రాడు సహాయంతో మనిషి పైకి ఎక్కగలడు. ఛత్రపతి శివాజీ కోటలు ఎక్కడానికి ఉడుమును ఉపయోగించేవాడు. పాము, ఉడుము ఎలా స్థిరంగా ఉంటాయో ఆ స్థిరత్వం ఈ నాడిపై సంయమం వలన కలుగుతుంది. దీనికి ఉదాహరణ అంగదుని కాలును రావణుని సభలో ఎవరూ కదపలేకపోవడం!

– జి. కేశవరావు, కాకినాడ

**? : భగవంతునికి ఫలాలు నైవేద్యం చేస్తే ఆయన సంతోషిస్తాడా? అసలు బేరమాడకుండా నైవేద్యానికి కొనాలా?**

✍: భగవంతుడు భావానికి ఎక్కువ ప్రాధాన్యమిస్తాడు. ధర్మరాజు అబద్ధం ఆడకపోయినా ఆయన భావం ద్రోణాచార్యుడు చావాలని! కనుక సత్యానికి కూడా అసత్య ఫలం లభించి, నరకాలన్నీ తిరగాల్సి వచ్చింది. సర్వాంతర్యామి పరమాత్మ. అందువల్ల అన్ని నైవేద్యాలూ స్వీకరిస్తాడు. భగవద్గీతలో చెప్పినట్లు:

*పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి*
*తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః* (9–26 గీత)

"నేను సుఖారాధనుడను. పత్రాన్ని కానీ పుష్పాన్ని కానీ, ఫలాన్ని కానీ, నీటిని కానీ భక్తితో నాకు ఇచ్చినా, భక్తితో సమర్పించినా ఆ వస్తువులను నేను గ్రహిస్తాను" అని భావం. దేవునికి సమర్పించేవన్నీ శ్రేష్ఠమైనవై ఉండాలి. ఉదాహరణకు "పుణ్యో గంధః పృథివ్యాం చ" (7–9, గీత) – "భూమిలో మంచి సుగంధ స్వరూపుడను నేనే" అని భగవంతుడే పేర్కొన్నాడు. అలా మంచి సుగంధం ఉన్న అగరవత్తులను దేవునికి సమర్పించాలి. అలాగే మంచి పళ్ళు నివేదించాలి. అవి తక్కువ ధరకు దొరికినా మంచిదే కదా! బేరమాడడంలో తప్పు లేదు! శ్రీరామకృష్ణ పరమహంస సమర్పించిన నైవేద్యాన్ని జగన్మాత కాళీదేవి స్వయంగా స్వీకరించేది. అలాగే శారదాదేవిని నైవేద్యం గురించి అడిగినప్పుడు ఆమె ఇలా జవాబు చెప్పారు:

"నైవేద్యంపైన దేవత నుండి వచ్చే సూక్ష్మకిరణాలు పడి, నైవేద్యం పవిత్రమవుతుంది. దాని నుండి సూక్ష్మరసాలను దేవత గ్రహిస్తుంది". అందువల్ల భగవంతుడు తప్పక సంతోషిస్తాడు. ఆయన సర్వవ్యాపకుడు అయినా, తండ్రి ఇచ్చిన పదార్థాలను చిన్న కుమారుడు తిరిగి తండ్రి నోట్లో కొంచెం పెట్టినప్పుడు ఆ తండ్రి సంతోషించినట్లే భగవంతుడు ఇచ్చిన పదార్థాలను ఆయనకు సమర్పించాక గ్రహించాలి. ఆయన తప్పక సంతోషిస్తాడు.

స్మృతిలో ఈ విధంగా చెప్పారు. "నా – –త్మార్థం పాచయే దన్నమ్" – భగవంతుని నైవేద్యం కోసం, ఇతరులకు పెట్టడానికీ వంట చెయ్యాలి. అంతేతప్ప, కేవలం తమకోసమే వండుకొని తినకూడదు.

స్మృతిలో "అప్రదాయైభ్యో యో భుంక్తే స్తేన ఏవ సః" (గీత, 3–12). ఇతరులకు పెట్టకుండా తినేవాడు దొంగ అన్నారు. అలాగే, తన ఇంద్రియ తృప్తి కోసం తినేవాడు దేవతల సొత్తును అపహరించిన దొంగతో సమానం. ❧

# మనోనిశ్చలతకు మార్గం!

మనం యోగారూఢులమై పని చెయ్యాలి. యోగం ద్వారా పనిచేసేటప్పుడు 'నేను ఇది చేస్తున్నాను, అది చేస్తున్నాను' అనే చింత ఉండదు. పాశ్చాత్యులకు ఇది అర్థం కాదు. 'నేను అనే భావం లేకపోతే, మానవుడు ఎలా పనిచేయగలడు' అని వారు అంటారు. తనను గురించిన ఆలోచన లేక, ఏకాగ్రచిత్తంతో చేసిన పని అనేక రెట్లు నాణ్యమైనదిగా ఉంటుంది. ఒక చిత్రకారుడు తన అహంకారాన్ని (నేను అనే భావాన్ని) విడిచి, చిత్రలేఖనంలో నిమగ్నుడైతే అద్భుతమైన చిత్తరువులను రూపొందించగలడు. అన్ని పనులనూ ఈ విధంగానే చెయ్యాలని భగవద్గీత బోధిస్తోంది. ఎవరు యోగం ద్వారా ఈశ్వరుడితో ఐక్యమవుతారో, అలాంటివారు కార్యాలన్నింటినీ ఏకాగ్ర చిత్తంతో చేస్తారు. వారు స్వప్రయోజనమేమీ ఆశించరు. అలాంటి కర్మ వల్లనే లోకానికి శుభం కలుగుతుంది.

సమస్త కర్మల ఫలితం మంచి చెడుల సమ్మిశ్రమం. స్పర్శ మాత్రంగా కొంచెమైనా చెడు కలవని సత్కార్యం లేదు. నిప్పును ఆవరించి ఉండే పొగ లాగ ప్రతీ పనినీ కొంత చెడు అంటుకొనే ఉంటుంది. సాధ్యమైనంత ఎక్కువ శుభం, వీలైనంత తక్కువ అశుభం కలిగే పనులలోనే మనం నిమగ్నులం కావాలి. భీష్మ ద్రోణులను అర్జునుడు చంపాడు; ఆ పని జరగకపోతే దుర్యోధనుణ్ణి జయించడం సాధ్యం కాదు. అధర్మమే ధర్మాన్ని అణచివేసి, ప్రవర్ధమానమయ్యేది. ఆ విధంగా దేశానికి మహారిష్టం వాటిల్లేది. అలాగే శ్రీకృష్ణుడు క్రూరులైన కంసుడు, జరాసంధుడు, తదితరులను వధించాడు. కృష్ణుడు తన కోసం చేసుకొన్న పని ఒక్కటీ లేదు. అతడు ప్రతి కార్యాన్నీ ఇతరుల మేలు కోసమే చేశాడు. మనం కొవ్వొత్తి దీపం వద్ద కూర్చొని, భగవద్గీతను పఠిస్తున్నాం. ఎన్నో పురుగులు దీపాన్ని తాకి కాలిపోయి, నశిస్తున్నాయి. ఈ విధంగా మనం చేసింది సత్కార్యమైనా ఏదో కొంత చెడు అంటుకొనే ఉంటుంది. ఎలాంటి కోర్కెలూ, మమతా లేకుండా చేసే పని వల్ల మనోనిశ్చలత సాధ్యం అవుతుంది. ఇదే కర్మయోగ రహస్యం.



# పరమేశ్వరుని పరిరక్షణలో ...

## స్వామి జపానంద స్వీయ అనుభవాలు -15

(గత సంచిక తరువాయి...)

## ప్రార్థనతో ఏదైనా సాధ్యమే !

**శ్రీ**రామకృష్ణ పరమహంసకున్న గృహస్థ భక్తులలో శ్రీదేవేంద్రనాథ్ మజుమ్‌దార్ ఒకరు. అతనితో సహవాసం చేసిన భక్తులు చాలా మంది ధర్మమార్గంలో పయనించారు. మజుందార్‌కు భగవంతుడి మీద అపారమైన భక్తి శ్రద్ధలు. భగవంతుణ్ణి నమ్ముకొనే ఆయన జీవితమంతా గడిపారు. పరమేశ్వరుని కృప వల్ల ఎప్పుడు ఏది ప్రాప్తమయితే, దానితోనే కాలం గడిపేవారు. ఇక్కడ ఆయన ప్రియ శిష్యురాలి కథ చూద్దాం. స్వామి జపానంద కూడా ఆమెకు పరిచితులే.



గురుదేవుల భక్తురాలైన ఆ మహిళకు స్వామి జపానంద పట్ల అత్యంత భక్తి. వయస్సులో ఆమె తమ కన్నా పెద్ద కాబట్టి, స్వామి జపానందజీ ఆమెను మాతృభావంతో "పిన్నీ!" అని సంబోధించేవారు. వృద్ధాప్యం వల్ల ఆమె కళ్ళకు శుక్లాలు వచ్చాయి. కళ్ళు సరిగ్గా కనిపించేవి కావు. ఆ రకమైన కేటరాక్ట్‌కు వైద్యం లేదు. అది త్వరగా ముదరదు కానీ క్రమక్రమంగా చూపు తగ్గుతూ, చివరకు పూర్తిగా చూపు పోయే ప్రమాదం ఉంది. తాను జీవించి ఉన్నంత వరకూ మామూలుగా తిరిగేలా, దైనందిన కార్యక్రమాలు చేసుకోగలిగేటంత చూపునివ్వమని ఆమె నిత్యం భగవంతుణ్ణి వేడుకునేది. రోజులు గడుస్తున్న కొద్దీ చూపు ఇంకా తగ్గిపోసాగింది. దగ్గరగా ఉన్న వస్తువుల్ని చూడడం కూడా చాలా కష్టమై పోయింది.



ఒకరోజు ఆమె ఏడుస్తూ, "మహరాజ్! ఒకసారి బేలూరు వెళ్ళి శ్రీరామకృష్ణుల మందిరం దర్శించాలని తీవ్రమైన కోరిక ఉంది. కానీ దగ్గర వస్తువులు కూడా ఇప్పుడు స్పష్టంగా కనిపించడం లేదు. భగవంతుని విగ్రహం దగ్గరకు నన్ను వెళ్ళనివ్వరు కదా! వెళ్ళినా అంత పెద్ద విగ్రహం నేను చూడగలనో, లేదో? భగవాన్! ఒక్క సారి చూపు వచ్చి నిన్ను తనివితీరా చూడగలిగితే చాలు, నా జన్మ తరిస్తుంది'అని స్వామి జపానందజీతో అన్నారు.

స్వామి జపానంద ఆమెకు ధైర్యం చెబుతూ "దైవ ప్రార్థన చేసుకుంటూ ఉండండి. వారి దయ ఉంటే అనుకున్నవి అన్నీ జరుగుతాయి. మీరు భక్తి శ్రద్ధలతో భగవత్సేవ చేస్తూనే ఉన్నారు. భగవంతుడు మీ ప్రార్థనలు వినకపోతే మరి ఇంకెవరి మాట వింటారు?" అన్నారు. అలా చెప్పి ఆయన వెళ్ళిపోయారు.

రెండేళ్ళ తరవాత స్వామి జపానంద మళ్ళీ పిన్నిని కలిశారు. అప్పుడు ఆమె ఎవరి సహాయమూ లేకుండా ఇంట్లో తిరుగుతోంది. చాలా సంతోషంగా కనిపిస్తోంది.

అప్పుడు ఆమె స్వామి జపానందజీతో "భగవంతుడి దయ అపారం. ఏడాది క్రితం ఒకరోజున అకస్మాత్తుగా నా కళ్ళ ముందున్న తెరను ఎవరో తీసివేసినట్లు అనిపించింది. అప్పటి నుంచి నాకు అన్నీ కనిపిస్తున్నాయి. ఏ సహాయమూ లేకుండా తిరుగుతున్నాను. బేలూరు వెళ్ళి, శ్రీరామకృష్ణుల దర్శనం చేసుకున్నాను. నాకు ఎంత ఆనందంగా ఉందో చెప్పలేకపోతున్నాను. శ్రీరామకృష్ణులు నా మీద చూపిన దయ తలుచుకుంటే చాలా ఆనందంగా ఉంది. వారి దయ వల్ల నా కోరిక తీరింది. గురుదేవుని మందిరం చూశాను. నా పనులు నేను చేసుకుంటున్నాను. భగవంతుడు ఎంత దయామయుడు!" అన్నారు.

(మిగతా వచ్చే సంచికలో...)

అనువాదం : శ్రీమతి జి.ఎస్. లక్ష్మి



# మూన్నాళ్ళ ముచ్చట

– భాస్కర పంతులు

**కా**లమే జీవితం. కాలాన్ని వృథా చేసుకోవడమంటే జీవితాన్ని వృథా చేసుకోవడమే. జీవితం జీవించడానికే కానీ, బాధపడడానికి కాదు. అర్ధంతరంగా అంతం చేసుకోవడానికీ కాదు. జీవితం ఒక అవకాశం. వీలైనంత ప్రశాంతంగా జీవితాన్ని గడపాలి. అనవసరమైన ఆరాటాలు పడుతూ, పోరాటాలు చేస్తే పోయేది మనశ్శాంతే. ప్రణాళికాబద్ధమైన జీవితంలో కష్టాలు ఉండవు. ఒకవేళ ఉన్నా ప్రతి కష్టమూ మనల్ని దైవానికి దగ్గర చేస్తుంది.

**ప్రాణం ఉంటే శివం! లేకుంటే శవం!!**

ఎవరైనా ఏ గుడికో వెళ్ళబోతూ ఏ పక్కింటివాళ్ళనో, లేదా ఏ కొబ్బరి కాయల అంగడి వాడినో 'కాస్త చెప్పులు చూస్తూ ఉండండి' అంటే, పెద్దగా ఇష్టం లేకపోయినా కాదనలేరు. కానీ, శవాన్ని మోసుకువెళుతున్నవారు "శ్మశానం చాలా దూరంగా ఉంది. శవం కూడా చాలా బరువుంది, భుజాలు నొప్పి పెడుతున్నాయి. కొంతసేపు మీ పంచలో శవాన్ని ఉంచుతాం" అంటే ఎవరైనా ఒప్పుకుంటారా, ఒప్పుకోరు. అంటే శ్వాస ఆగిపోయిన శరీరం చెప్పుల కన్నా హీనాతిహీనమైందని భావం. కాబట్టి శరీరంలో శ్వాస పరుగులు పెడుతున్న కాలంలోనే నువ్వు ఏమైనా చెయ్యాలి. "ప్రాణం ఉంటే శివం! లేకుంటే శవం!!" అనేది అందుకనే!

జీవితానికి అర్థం మనం జీవిస్తేనే తెలుస్తుంది. అలాగే మరణానికి అర్థం మన ఆత్మీయులు మరణిస్తేనే తెలుస్తుంది.

భౌతిక సౌందర్యం రోజు రోజుకూ తరిగిపోయేదైతే, భావసౌందర్యం రోజు రోజుకూ పెరుగుతూ ఉంటుంది. కాబట్టి, తరిగిపోయే శరీర సౌందర్యం మీద వ్యామోహం విడిచి, భావ సౌందర్యానికి ప్రాధాన్యమివ్వాలి. అలా చేస్తే, కాలగమనంలో ఎదురయ్యే ఆటుపోట్లను ఎదుర్కొనే శక్తి లభించి జీవితం సవ్యంగా, హాయిగా సాగుతుంది.

కొన్ని అన్నదాన సత్రాలలో మూడు రోజుల పాటు ఉచిత భోజన సదుపాయాలు కలుగజేస్తారు. ఆపైన ఉండనివ్వరు. అలాగే ఈ ప్రపంచం – భగవంతుడు జీవకోటికి ప్రసాదించిన అన్న సత్రం. సమస్త జీవకోటికీ బాల్యం ఒకరోజు, యౌవనం ఒక రోజు, వృద్ధాప్యం ఒక రోజు. ఈ మూడు కాలాలూ దాటితే మూన్నాళ్ళ ముచ్చట ముగిసినట్లే! కాలపురుషుడైన యముడు వస్తాడు. అన్నసత్రం నుంచి నిర్దాక్షిణ్యంగా గెంటివేస్తాడు.

అలాగే మానవ జీవితంలో చేసిన కర్మలకు ఫలితాలు మూడు రకాలుగా ఉంటాయి. అవి – స్వర్గం, నరకం, మోక్షం. పరులకు ఉపకారం కలిగించే కర్మలను చేస్తే అందరూ కీర్తిస్తారు. అదే – 'స్వర్గం'. అందరికీ అపకారం చేస్తూ, అందరితో శాపాలు పొందుతూ జీవించడం – 'నరకం'. పరోపకారం చేయడంలో పూర్తిగా మునిగిపోతే వచ్చేదే– 'మోక్షం'. కాబట్టి మనిషి – మానవత్వంతో పండిపోతే మోక్షం దానంతట అదే ప్రాప్తిసుంది. ఆ అన్న సత్రంలో ఉండగానే దాన్ని సాధించుకోవడం ఉత్తముని లక్షణం. ఉన్నతమైన, ఆదర్శవంతమైన లక్ష్యసాధనకు సామాన్యమైన ఆకర్షణలనూ, ఆనందాలనూ, అల్పమైన కోరికలనూ వదులుకోవాలి.

- సత్యవంతునిగా ఉండాలంటే అసత్యాన్ని వదులుకోవాలి.
- మంచిగా ఉండాలంటే చెడును వదులుకోవాలి.
- నిత్యమైన, నిశ్చలమైన, నిజమైన ఆనందం కావాలంటే అల్పమైన క్షణికానందాలను త్యజించాలి.
- వేలెత్తి చూపించేలాగ కాదు, చెయ్యెత్తి నమస్కారాలు అందుకునేలా జీవించాలి.
- ఆశలతో కాక ఆశయాలతో జీవించాలి.
- ఆశలు ఉంటాయి అందరికీ! ఆశయాలు ఉండేది కొందరికే!
- అందరిలో కొందరిలా, ఆ కొందరిలో 'ఒక్కడి'లా జీవించాలి.
- దీన, హీన జీవితం కాదు, దివ్యమైన జీవితం గడపాలి.

ఈ మూన్నాళ్ళ జీవితాన్ని సద్వినియోగం చేసుకొని జీవిత లక్ష్యాన్ని సాధిద్దాం.

# వినాయకునికి వెయ్యి విఘ్నాలు

చిత్రాలు : దాకోజు శివప్రసాద్ కథ: స్వామి జ్ఞానదానంద

కుమారస్వామి దేవతలకు సేనానాయకుడై, తారకాసురుణ్ణి వధించాడు. ఆయనకు దేవేంద్రుడి కుమార్తెతో వివాహం నిశ్చయమైంది.



నాయనా వినాయకా! తమ్ముడి కన్నా ముందుగా నీ వివాహం జరగాలి నాయనా!

అమ్మా! దయచేసి నన్ను ఈ రొంపిలోకి దింపవద్దు! తమ్ముడి పెళ్ళికి నా వల్ల ఏ ఇబ్బందీ లేదు కదా!

అమ్మా! తమ్ముడు ఎంతో తపస్సు చేశాడు. నేను పెద్దవాడినై ఉండీ ఏమీ చేయలేదు. తపస్సు చేసేందుకు అనుజ్ఞ ఇవ్వమ్మా!

సరే నాయనా! అలాగే కానీ!

దేవేంద్రుడు అప్సరసలతో...

మీరు వినాయకుడి తపస్సును భంగం చెయ్యండి!

'అర్క' అనే అప్సర అందుకు నిరాకరించింది.

క్షమించండి ప్రభూ! ఆ పాపానికి నేను ఒడిగట్టలేను!

జిల్లేడువై భూమి మీద పడి ఉండు! దేవలోకంలో నీకు ఇక స్థానం లేదు!


విఘ్నేశ్వరుడు తపస్సు ప్రారంభించాడు. అక్కడ పల్లేరు కాయలు నేలంతా ఉన్నాయి. అక్కడే జిల్లేడు కూడా మొలిచింది. మిగిలిన అప్సరసలు అక్కడకు చేరారు.


అబ్బా! పల్లేరు ముళ్ళు! బాధ! అమ్మో! మనకు తగిన శాస్తే జరిగింది! వెళ్ళిపోదాం రండి!


ప్రభూ! శాపవశాత్తూ ఈ దుర్గతి కలిగింది! కనికరించండి
మిమ్మల్ని చవితి రోజున వినాయక పూజకు ఉపయోగిస్తారు! నేను జిల్లేడును ప్రీతితో ధరిస్తాను


నాయనా! తపస్సు ముగిసింది కదా! మరి పెళ్ళి....
ముగియడమేమిటి? అసలు జరగనే లేదు. ఇదిగో అందుకు ఇప్పుడు బయలుదేరుతాను


ఓం... ఓం...
ఈసారి విఘ్నేశ్వరుడు ఎన్నుకున్న ప్రదేశం పాముల పుట్టలతో నిండి ఉంది

మిగతా 36వ పేజీలో...





# ఘంటానాద విశిష్టత

- రెంటాల జయదేవ

(గత సంచిక తరువాయి...)

**పాపాలను పోగొట్టడానికీ.. దేవతలను ఆహ్వానించడానికీ..**

గంటలు మోగించగా వచ్చే ధ్వని అన్ని రకాల దోషాలనూ, దుష్ఫలితాలనూ పోగొడుతుందని ఓ నమ్మకం. గుడిలో గంట మోగించడం వల్ల వంద జన్మల్లో చేసిన పాపాల నుంచి మనిషి విముక్తుడవుతాడని 'స్కాంద పురాణం' చెబుతోంది.

సర్వసాధారణంగా నిత్య పూజల సందర్భంలో దేవత లను ఆహ్వానించడానికీ, రాక్షసులను తరమడానికీ గుర్తుగా మనం గంట మోగిస్తూ, ఓ శ్లోకం పఠిస్తాం. దేవతార్చన ప్రారంభించేటప్పుడు చెప్పే ఆ శ్లోకం ఏమిటంటే -

***ఆగమార్థం తు దేవానాం గమనార్థం తు రాక్షసామ్,***
***కుర్వే ఘంటారవం తత్ర దేవతాహ్వాన లక్షణమ్ ॥***

'దేవతలను ఆవాహన చేస్తూ, ఈ ఘంటారావం చేస్తున్నాను. దీని వల్ల శుభప్రదమైన దైవీ శక్తులు (మా *గృహంలోకీ, హృదయంలోకీ) ప్రవేశించుగాక! అశుభమైన* రాక్షస శక్తులు నిష్క్రమించుగాక!' అని ఈ శ్లోకానికి స్థూలంగా అర్థం.

**ఎప్పుడెప్పుడు గంట మోగించాలి?**

ఏ యే సమయాల్లో తప్పనిసరిగా గంట మోగించాలో కూడా మన పూర్వీకులు శాస్త్రపూర్వకంగా చెప్పారు.

***ఆదౌ మధ్యే - భిషేకాంతే । ధూపే దీపే తథైవ చ ।***
***నీరాజనే చ శయనే । ఘంటానాదం సమాచరేత్ ॥***
***ఘంటానాద విహీనా యా। సా పూజా నిష్ఫలా భవేత్॥*** (పారిజాతే)

*'సంకల్పం చేయడానికి ముందూ, అభిషేక సమయంలో, అభిషేకం తరువాత, ధూప - దీప - నీరాజన సమయాల్లో, పవళింపు సేవలో ఘంటానాదం చేయాలి. ఘంటానాదం లేని పూజాదికాలు నిష్ఫలమవుతాయి'* అని మన శాస్త్రాలు చెబుతున్నాయి.

**గంట ఎలా కొట్టాలి?**

గంట కొట్టడానిదేముంది! చకచకా మూడుసార్లు మోగించడమే కదా అనుకొంటే పొరపాటే! కొన్ని సందర్భాల్లో గంటను ఒక వైపు అంచుకే తగిలేలా కొట్టాలి. మరికొన్ని సందర్భాల్లో రెండు వైపు అంచులకూ తగిలేలా కొట్టాలి. ఆ సమయ, సందర్భాల గురించి శాస్త్రం ఇలా చెబుతోంది:

***స్నానే ధూపే తథా దీపే ఏక పార్శ్వం తు తాడయేత్ ।***
***పార్శ్వాభ్యాం తాడనం చేత్స్యా చ్ఛాగస్య గళ ఘంటవత్॥*** (శైవాగమే)

*'స్నాన, ధూప, దీప సమయాల్లో గంటకు ఒక పార్శ్వంలోనే (ఒకే అంచున) కొట్టాలి. ఈ సమయాల్లో గంటకు రెండు వైపులా (రెండు అంచులలోనూ) కొట్టినట్లయితే, మేక మెడలో కట్టిన గంట లాగా నిష్ఫలమవుతుంది. (కానీ, ఇతర సమయాల్లో, అంటే పూజా ప్రారంభంలో, పూజా మధ్యకాలంలో, పూజాంతంలో, నీరాజనంలో రెండు పార్శ్వాలకూ తగిలేలా గంట కొట్టాలి).'*

**గంట కొట్టకూడనిది ఎప్పుడు?**

అలాగే, మన పూజల్లో కూడా కొన్ని సందర్భాల్లో మాత్రం గంట మోగించకూడదు. దాని గురించి పెద్దలు ఇలా చెప్పారు:

***ఘంటానాదం తథా వాద్యం। నృత్యం గీతం తథైవ చ ।***
***నైవేద్యకాలే యః కుర్యా। ద్రౌరవం నరకం వ్రజేత్॥*** (శైవాగమే)

*'దేవుడికి నైవేద్యం పెడుతున్నప్పుడు గంట మోగించడం కానీ, ఇతర నృత్య, గీత వాద్య ధ్వనులు కానీ చేయకూడదు. అలా చేసినవాళ్ళు రౌరవ నరకానికి వెళతారు.'*

శ్రావ్యమైన సంగీత ధ్వని సమక్షంలోనే మానవ జాతి సృష్టి జరిగింది. ఆలయ ఘంటికలు మోగినప్పుడు కూడా అలాంటి ధ్వనే వినిపిస్తుంది. ఓంకారాన్ని జపిస్తున్నప్పుడు సైతం ఆ రకమైన శబ్దమే పుడుతుంది. ఈ శ్రావ్యమైన శబ్దానికి నందీశ్వరుణ్ణి ప్రతీకగా భావించడం కద్దు.

సాధారణంగా రాగి, కంచు, ఇత్తడి లాంటి లోహాలతో గంటలను రూపొందిస్తుంటారు. అయితే, ఇతర లోహాలతో రూపొందించిన గంటల కన్నా బంగారం, వెండి లోహాలతో చేయించిన గంటల శబ్దం మృదువుగా ఉంటుంది. వైష్ణవాలయాల్లో నెలకొల్పే గంటల మీద గరుత్మంతుని బొమ్మ ఉండాలని 'స్కాంద పురాణం' చెబుతోంది. మొత్తం మీద ఈ ఘంటానాదం దేవుని ఉనికిని ప్రతిధ్వనింప జేయడానికే గాక, దుష్ట శక్తులను పారదోలేందుకు ఉపయోగపడుతుంటుంది. అందుకే, గంట మోగించడంలో ఎంతో విశిష్టత నిబిడీకృతమై ఉంది.

# మనసులోని మాటనెరిగిన మహాయోగి

– డా॥ అబ్దుల్ వాజీజ్



తూర్పు బెంగాల్‌లోని 'ఖుల్నా' జిల్లాలో 'సత్‌ఖిరా' నా (అబ్దుల్ వాజీజ్) జన్మస్థలం. డాక్టర్ మహేంద్రలాల్ సర్కార్ నడిపిన ఉచిత వైద్యశాలలో వైద్యుడిగా పనిచేశాను. అప్పుడే అన్ని మతాలూ సత్యాలే అని అంగీకరించిన దక్షిణేశ్వర మహాసాధువు శ్రీరామకృష్ణుల గురించి విన్నాను. రాంబాబు (రామ్‌చంద్ర దత్తా) వారి ముఖ్య శిష్యుడని తెలిసింది.

నా స్నేహితుడు అబ్బాస్ అలీ, నేను కలసి రాంబాబు ఇంటికి వెళ్ళాం. 'దక్షిణేశ్వరంలోని శ్రీరామకృష్ణులను దర్శించాలనుకుంటున్నాం' అని మా కోరికను ఆయనతో చెప్పాం. మేము ముగ్గురం కలసి దక్షిణేశ్వరం బయలుదేరాం.

మేము వెళ్ళేటప్పటికి శ్రీరామకృష్ణులు తమ గదిలో లేరు. ఆయన కోసం ఎదురుచూస్తూ మేము పంచవటి దగ్గర ఉన్నాం. శ్రీరామకృష్ణులు అక్కడకు రాగానే రాంబాబు ప్రణామం చేశాడు. మేము మాత్రం సాష్టాంగం చేయకూడదనుకున్నాం. ఎందుకంటే మా మతాచారం ప్రకారం 'అల్లా'కు తప్ప ఎవరికీ ప్రణామం చేయకూడదు. అయితే మా దగ్గరకు రావడంతోనే ఆయనే ముందుగా మాకు నమస్కరించారు. మేము కంగారుపడ్డాం. వారికి ప్రణమిల్లక తప్పలేదు.

ఆ తర్వాత శ్రీరామకృష్ణులు మమ్మల్ని తమ గదికి తీసుకువెళ్ళి మేము కూర్చోవడానికి ఒక తివాచీ పరిచారు. వారు మరొక తివాచీపై కూర్చొని, మాతో మాట్లాడసాగారు. అక్కడ కూర్చుంటూ నేనిలా ఆలోచించాను: "ఈయన పవిత్రుడని విన్నాను. మమ్మల్ని దూరంగా ఎందుకు ఉంచారు? మేము మహమ్మదీయులం, ఆయన హైందవ బ్రాహ్మణుడు కనుకనే మాకు వేరే తివాచీ పరిచారా?"

కానీ ఈ సందేహం ఎంతో సేపు నిలవలేదు. భగవంతుణ్ణి గూర్చి మాట్లాడుతూ ఆయన ఎంతగా పరవశులయ్యారంటే, కొద్ది కొద్దిగా జరుగుతూ పూర్తిగా మా తివాచీ మీదకే వచ్చారు. ఈ పుణ్యమూర్తి యొక్క ప్రేమాస్పదమైన ప్రవర్తన మాకు అంతులేని ఆనందాన్నిచ్చింది.

దక్షిణేశ్వరానికి వచ్చేటప్పుడు వారిని మూడు ప్రశ్నలు అడగాలని అనుకున్నాను. కానీ ఆ ప్రశ్నలు అడగకుండానే మనస్సుకు హత్తుకొనేలా వాటికి సమాధానాలు చెప్పారు. నేను అడగదలుచుకున్న ఆ మూడు ప్రశ్నల్లో ఒకటి: గృహస్థుగా ఉంటూనే యోగాభ్యాసం సాధ్యమేనా?

గురుదేవులు తమ మాటల మధ్యలో ఇలా అన్నారు: "ఆధ్యాత్మిక సాధనలు చేసిన తరువాత సంసారంలోకి ప్రవేశిస్తే ఆధ్యాత్మిక మార్గం నుంచి పతనమయ్యే అవకాశాలు బహు తక్కువ. కానీ సంసారంలో చిక్కుపడి ఆధ్యాత్మిక పురోగతి సాధించడం చాలా కష్టం. నువ్వు మసితో నిండిన గదిలో ఉంటే, ఎంత జాగ్రత్తగా ఉన్నా, ఎంతో కొంత మసి అంటుకోక తప్పదు. అలాగే సంసారంలో ఉంటూ, ఆధ్యాత్మిక సాధనలు చేసినా, ఎక్కడో కొంత మోహం అంటిపెట్టుకొనే ఉంటుంది".

అంతకు ముందే శ్రీరామకృష్ణులు గొంతునొప్పితో బాధపడుతున్నారన్న విషయం తెలిసింది. కాబట్టి ఎక్కువ ప్రశ్నలతో వారిని బాధించదలుచుకోలేదు. కానీ వారంతట వారే దివ్యపారవశ్య స్థితిలో సంభాషిస్తూ మా సందేహాలను నివృత్తి చేసి, మా హృదయాలను ఆనందంతో నింపివేశారు.

గురుదేవులు మాట్లాడడం అయిపోయిన తరువాత, రాంబాబు (రామ్‌చంద్ర దత్తా) నన్ను వైద్యుడిగా పరిచయం చేశారు. అప్పుడు శ్రీరామకృష్ణులు నన్ను చూసి "చాలా మంచిది. నా గొంతు నొప్పి నయం చేయకూడదూ" అన్నారు. అందుకు సమాధానంగా నేను, "మీరు నాకు శక్తిని ప్రసాదిస్తే, నేను ప్రయత్నిస్తాను. లేకపోతే మీ లాంటి మహనీయుల వ్యాధిని నయం చేసే శక్తి నాకు లేదు" అన్నాను.

మా పవిత్ర గ్రంథమైన 'ఖురాన్' దైవదూతల లక్షణాలను పేర్కొంది. ఆ లక్షణాలను శ్రీరామకృష్ణులలో మేము చూశాం. వారిని చూసి, వారితో మాట్లాడిన తరువాత శ్రీరామకృష్ణులు ఒక దైవదూత అని మేము నమ్మాం.

(జ్ఞానేంద్రనాథ్ బిశ్వాస్ రచన 'యోగోద్యాన్ మహాత్మ్య' నుంచి)

**అనువాదం: కె. సత్యప్రసాదరాయ్**



# అమర భారత ప్రతిభ

## గురుత్వాకర్షణ సిద్ధాంతాన్ని కనుగొన్నది ఎవరు?

గురుత్వాకర్షణ సిద్ధాంతం కనుగొన్నది ఎవరు? భౌతిక శాస్త్రం కాస్తంత చదువుకొన్న ఎవరైనా సరే ఈ ప్రశ్నకు న్యూటన్ అని జవాబు చెబుతారు. కానీ, ఆ మాట అసత్యం. ఎందుకంటే, న్యూటన్‌కు ఎన్నో వందల ఏళ్ళకు ముందే ప్రాచీన భారతీయ గ్రంథాలలో గురుత్వాకర్షణ సిద్ధాంతం ప్రతిపాదితమైంది.

1. 'సూర్య సిద్ధాంతం' (12 అధ్యాయం-32 శ్లోకం) అనే గ్రంథంలో ఇలా చెప్పారు: "ధారణాత్మక శక్తి కారణంగా భూమి పడిపోకుండా ఆకాశంలో నిలబడుతోంది."

**మధ్యే సమన్తా దణ్డస్య భూగోళో వ్యోమ్ని తిష్ఠతి ।**
**బిభ్రాణః పరమాం శక్తిం బ్రహ్మణో ధారణాత్మికామ్ ॥**

2. వరాహ మిహిరుడు (క్రీ.శ. 505) తన 'పంచ సిద్ధాంతి' (13అధ్యాయం-4శ్లోకం) గ్రంథంలో గురుత్వాకర్షణశక్తి గురించి చెప్తూ - "భూతలంలోని ఏ భాగంలోనైనా... జ్వాలలు పైకి ఎగుస్తాయి. పైకి వేసిన వస్తువు కింద పడుతుంది. ఈ అనుభవం అందరికీ తెలిసినదే. సమానమైనదే" అని అంటాడు.

**గగన ముపైతి శిఖిశిఖా క్షిప్తమపి క్షితిముపైతి గురు కించిత్ ।**
**యద్వదిహ మానవానాం అసురాణాం తద్వ దేవాఙ్గః ॥**

3. 'లీలావతి' అనే గ్రంథంలో 'భువనకోశం' అనే సర్గలో భాస్కరాచార్యుడు (క్రీ.శ. 1114) తన పుత్రిక లీలావతికి "భూమి గురుత్వాకర్షణ శక్తి కలిగి ఉంది. ఖగోళంలో గ్రహాల పరస్పర ఆకర్షణ శక్తి వల్ల అవి అక్కడ తమకు తామే ఆధారభూతమై నిలిచి ఉన్నాయి" అని చక్కగా వివరించాడు.

4. 'సిద్ధాంత శిరోమణి' (భాస్కరాచార్యుడు) అనే గ్రంథంలో 'భువనకోశం' అనే అధ్యాయంలో 6వ శ్లోకంలో గురుత్వాకర్షణ శక్తి గురించి చాలా చక్కగా వివరించాడు.

**ఆకృష్టశక్తిశ్చ మహీతయా యత్ స్వస్థం, గురు స్వాభిముఖం స్వశక్త్యా।**
**ఆకృష్యతే తత్పతతీవభాతి,సమే సమన్తాత్ క్వ పతత్వియం ఖే॥**

భూమి ఆకాశంలో ఉన్న వస్తువులను స్వశక్తితో తన వైపు ఆకర్షిస్తుంది. ఆ ఆకర్షణ వల్ల అన్ని వస్తువులూ భూమి మీద పడతాయి. ఆకాశంలోని వివిధ గ్రహాల మధ్య సమాన ఆకర్షణాశక్తి ఉన్నప్పుడు అవి ఎక్కడ పడతాయి?

5. బ్రహ్మగుప్తుడు (క్రీ.శ. 591) రచించిన 'బ్రహ్మస్ఫుట సిద్ధాంతం'లో "వస్తువులు భూమి వైపు ఆకర్షింపబడతాయి. నీటికి ఎలా సహజ ప్రవాహశక్తి ఉందో, అలా భూమికి సహజమైన ఆకర్షణశక్తి ఉంది" అని చెప్పాడు.

6. జగద్గురువు ఆదిశంకరుల వారు వారి 'ప్రశ్నోపనిషత్'(3-8 శ్లోకాలు) భాష్యంలో 'అపాన'శక్తి గురించి వ్రాస్తూ "ఒక వస్తువును పైకి ఎగురవేస్తే దానిని ఎలా భూమి ఆకర్షిస్తోందో అలాగే పైకి లాగబడే 'ప్రాణ' శక్తిని 'అపాన'శక్తి కిందకు లాగుతోంది. అని చెప్పారు.

**తథా పృథివ్యామభిమానినీ యా దేవతా ప్రసిద్ధా సైషా।**
**పురుషస్య అపానవృత్తిమవష్టభ్యాకృష్య వశీకృత్యాధ ఏవ॥**
**అపకర్షేణ అనుగ్రహం కుర్వతీ వర్తత ఇత్యర్థః ।**
**అన్యథా హి శరీరం గురుత్వాత్ పతేత్ సావకాశే వోర్ధ్వచ్ఛేత్ ॥**

ఆ తరువాతి భారతీయ ఖగోళ శాస్త్రజ్ఞుల గ్రంథాలలో కూడా 'గురుత్వాకర్షణ' సిద్ధాంతాన్ని వివరించారు. ఇలా న్యూటన్ కన్నా ఎన్నో వందల ఏళ్ళకు పూర్వమే 'గురుత్వాకర్షణ' గురించి భారతీయ విజ్ఞానం ఘోషించింది.

*('భారతీయ ప్రతిభా విశేషాలు' నుంచి)*

# నా జీవితంలో స్వామి వివేకానంద

## సమస్యల సాగరంలో స్వామీజీ సందేశమే ఓ వారధి!

నేను ఒక ఉపాధ్యాయురాలిని. నాకు జీవితంపై సరైన అవగాహన లేక ఎన్నో ఆర్థిక, శారీరక, మానసిక సమస్యల్లో కూరుకుపోయాను. మనశ్శాంతే కరువయింది. ఇలా నిరాశా, నిస్పృహలతో అల్లాడుతున్న సమయంలో నాలో ఆత్మవిశ్వాసాన్ని నింపి నన్ను విజయ పథం వైపు దూసుకుపోయేలా చేసింది స్వామి వివేకానంద సందేశమే!


శీల మల్లీశ్వరి

నేను టీచర్‌గా పని చేస్తున్నప్పుడు (Asst. వెటర్నరీ డాక్టర్) గెజిటెడ్ పోస్టుకు కాల్‌లెటర్ రెండు సార్లు (ఎంప్లాయ్‌మెంట్ ద్వారా) వచ్చింది. నాకు సరైన అవగాహన లేకపోవడం వల్ల దాన్ని వదులుకున్నాను. నా ఆర్థిక సమస్యల్ని పరిష్కరించుకోవడానికి వచ్చిన సదవకాశాన్ని వదులుకున్నాను అనే శోధన నాలో మొదలైంది. అదృష్టం నా తలుపు తట్టినా వినియోగించుకోలేక పోయానని చాలా కుమిలి పోయాను. రెండు రోజుల పాటు నిద్రాహారాలు మాని శోకసముద్రంలో మునిగిపోయాను. ఎవరికీ చెప్పుకోలేని బాధను ఆ భగవంతుని ఎదుట వెళ్ళబోసుకున్నాను. ఇంతలో ఆ దేవుడే నా మొర ఆలకించాడా అన్నట్లుగా స్వామి వివేకానందుని స్ఫూర్తి భావనలతో నిండిన 'శ్రీరామకృష్ణ ప్రభ' 2008 జూన్ సంచిక వచ్చింది. అందులోని ప్రతీ అక్షరం నాకోసమే వ్రాశారు అన్నట్లుగా ఉంది. ఆ పత్రిక అంతా చదివాక నా మనసులోని బాధంతా దూదిపింజలా ఎగిరి పోయింది. ఏదీ మన చేతుల్లో లేదనీ, దైవసంకల్పం లేకుండా ఏ పనీ జరగదనీ, ఏమి జరిగినా నా మేలుకోరే జరిగి ఉంటుందనీ దృఢంగా నమ్మాను. ధీరవాణి శీర్షికలో "శాశ్వతత్త్వం కోసం శ్రమిద్దాం" అనే స్వామి వివేకానందుని సందేశం నా మనసుకి హత్తుకుంది. అశాశ్వతమైన సంపద గురించి ఆలోచించి శాశ్వతమైన ఆధ్యాత్మిక సంపదకు ఎంతదూరంలో ఉన్నానో అప్పుడు అర్థమైంది.

స్వామి వివేకానందుని స్ఫూర్తి భావనలతో నిండిన 'శ్రీరామకృష్ణ ప్రభ' 2008 జూన్ సంచిక వచ్చింది. "అందులోని ప్రతీ అక్షరం నాకోసమే వ్రాశారు" అన్నట్లుగా ఉంది. ఆ పత్రిక అంతా చదివాక నా మనసులోని బాధంతా దూదిపింజలా ఎగిరి పోయింది.

గ్రంథాలయంలో ఉన్న స్వామి వారి ఉపన్యాసాలు మరికొన్ని చదివాక, జీవితం పట్ల సరైన దృక్పథాన్ని ఏర్పరచుకున్నాను. నా దైనందిన జీవితంలో అనుక్షణం స్వామీజీ వారి అమృత వాక్కులే నన్ను ముందుకు నడిపిస్తున్నాయి. నా అపరిష్కృత సమస్యలకు చక్కని సమాధానాలు స్వామివారి సందేశాలలో లభించాయి.

యువతరాన్ని ముందుకు నడిపించగల శక్తి ఒక్క స్వామీజీ సందేశాలకే ఉంది అనడంలో సందేహం లేదు.

- లే, లేచి నిలబడు, గమ్యం చేరేవరకూ ఆగవద్దు.
- బలమే జీవనం బలహీనతే మరణం.

ఇలాంటి స్ఫూర్తిదాయక సందేశాలు నా మనసుపై ఎనలేని ప్రభావాన్ని చూపాయి. అవి మాటలా? కాదు, మనసు లోతుల్ని తాకే ఆత్మీయ తూటాలు అవి.

"ఉక్కు కండరాలు, ఇనుప నరాలు కలిగిన కొందరు యువతీ, యువకులు లభిస్తే దేశస్థితినే మార్చివేయగలను'' అన్న స్వామీజీ పలుకుల్లో ఈ దేశ భవిత యువతరం పై ఎంతగా ఆధారపడి ఉందో తెలుస్తుంది. బాలబాలికలను ఉత్తమ భావిభారత పౌరులుగా తీర్చిదిద్దడానికి అనువుగా ప్రాథమిక స్థాయినుంచే పాఠ్యాంశాలలో స్వామి వివేకానందుల వారి సందేశాల్ని ప్రవేశపెట్టాలి. తల్లి, తండ్రి, గురువు విద్యార్థుల్లో క్రమశిక్షణ, నైతికవిలువలు పెంపొందించేలా ఇలాంటి మహానుభావుల చరిత్రలను వారికి అందజేయాలి. నావంతు కృషిగా స్వామీజీ వారి సందేశాలను మా పాఠశాలలో సమయం దొరికినప్పుడల్లా విద్యార్థులకు అందిస్తున్నాను.

సమస్యల సాగరాన్ని దాటించేందుకు 'స్వామీజీ సందేశం ఓ వారధిలాంటిది' అని నా ప్రగాఢ విశ్వాసం.

– శ్రీమతి శీల మల్లీశ్వరి, సాలూరు, విజయనగరం జిల్లా.

# పరులతో పోటీ ఎందులో?

- స్వామి అనుపమానంద

"విద్యాభ్యాసం అంటే మనిషిలో గర్భితంగా ఉన్న కౌశలాన్ని (వెలికితీసి) వ్యక్తం చెయ్యడం" అంటారు స్వామి వివేకానంద. కౌశలం బయటి నుంచి పొందేది కాదు. అది మనలో గర్భితంగా ఉంది. స్వామీజీ "శీలం, మానసిక బలం, వివేకం వృద్ధి చెంది, తద్వారా తన కాళ్ళపై తాను నిలబడగలిగేలా చేసేదే విద్య" అని కూడా అంటారు. మన విద్యాసంస్థలలో మనం విద్యాభ్యాసం చేస్తున్నప్పుడు అవి మనల్ని ఆ విధంగా ఆయత్తం చేస్తున్నాయా, ఆ విధమైన విద్యాబోధన జరుగుతోందా అన్నది ప్రశ్న! అలాగే జరిగి ఉంటే నేడు మన దేశం ఈ స్థితిలో ఉండేది కాదు!

**అన్నీ ఉన్నా లేనిది ఒక్కటే!:** మన దేశంలో సంపదలున్నాయి, సాంకేతిక రంగం, ఇతర రంగాలలో విజ్ఞానం ఎంతగానో వృద్ధి చెందింది. అయితే యువతలో ఆనందం, సంతృప్తి కనబడడం లేదు. తమకు ఏదో కొరత ఉన్నట్లు భావిస్తూ, తాము ఏదో సాధించలేకపోతున్నామని అనుకుంటారు. వారికి మానసిక శాంతి లేదు. అందరం నిత్యం ఏదో కావాలని తపన పడుతుంటాం; అదేమిటి అన్నది మనకే తెలియదు. దీనికంతటికీ కారణం మన విద్యాసంస్థలు మనకు జీవితమంటే ఏమిటి, మనం ఎలా జీవించాలి అనే ముఖ్యమైన విషయాల గురించి ఏమీ బోధించకపోవడమే! దేశాభివృద్ధికి ఎలా తోడ్పడాలి, సంభాషణా చాతుర్యాన్ని ఎలా వృద్ధి చేసుకోవాలి, పరీక్షలలో ఎలా విజయం సాధించాలి మొదలైన అంశాలెన్నో మన విద్యాసంస్థలు నేర్పుతున్నాయే కానీ మనలోనే అంతర్గతంగా ఉన్న నైపుణ్యాలనూ, సామర్థ్యాలనూ ఎలా వృద్ధి చేసుకోవాలనే అంశంలో శిక్షణనివ్వడం లేదు.

విద్య వల్ల శీలం పెంపొందాలని స్వామి వివేకానంద అనేవారు. అయితే శీలం (కేరెక్టర్) అంటే ఏమిటి అని ఆలోచిస్తే... నేడు మన యువకులనూ, ప్రజలనూ చూస్తే – సమస్యలు ఎదురైనప్పుడు, వారిలో 99% మంది అపజయాన్నే పొందుతున్నారు. చక్కటి ఉద్యోగం, సొంత ఇల్లు – ఇలా అన్ని రకాల సదుపాయాలూ ఉన్నా, నేడు మరొక రకమైన కష్టాలు ఎదురవుతున్నాయి. ప్రయాసలు, ఒత్తిళ్ళు అనే కొత్త పదాలెన్నో పుడుతున్నాయి! నేడు మన దేశంలో అందుబాటులో ఉన్నన్ని సదుపాయాలు వంద సంవత్సరాల క్రితం లేవు. ఆ రోజులలో వారు ఎక్కడికైనా వెళ్ళాలంటే కాలి నడకనో, ఎడ్ల బండిలోనో వెళ్ళేవారు. ప్రయాణానికే ఎంతో సమయం పట్టేది. ఒక గ్రామం నుండి మరొక గ్రామానికి సమాచారం చేరడం చాలా కష్టంగా ఉండేది. ఇలా ఎన్ని సమస్యలు ఉన్నా ఆ కాలంలో ప్రజలు చాలా ఆనందంగా, తృప్తిగా జీవించేవారు.

వారు తాము ఏ స్థితిలో ఉన్నా తమ గుమ్మంలోకి వచ్చిన వారిని ఆదరించి, తమకు ఉన్నదానిలోనే వచ్చినవారికి ఎంతో కొంత పెట్టేవారు. నేడు సంపదలు, సౌకర్యాలు అన్నీ ఉన్నప్పటికీ, స్వార్థం పెరిగి, హృదయ ద్వారాలు మూసుకు పోతున్నాయి. బాధలలో, కష్టాలలో ఉన్న వారిని చూసి మనం స్పందించం. ఎందుకంటే మనకు అన్నీ ఉన్నా ఉన్నతమైన అభిప్రాయాలు లేవు. "విద్య ఎప్పుడూ ఉన్నతమైన అభిప్రాయాలనూ, విలువలనూ కలిగించేదిగా ఉండాలి" అనేవారు స్వామి వివేకానంద. ఇది ఎలా సాధ్యమంటే – విద్యకు ఆధ్యాత్మికత ఆధారమై ఉండాలి.

**అభివృద్ధికి అవరోధాలు :** ప్రతీ విద్యార్థికీ ఎన్నో సుందర స్వప్నాలుంటాయి. కలలు కనడానికీ, వాటిని సాఫల్యం చేసుకోవడానికీ విద్యార్థి జీవితమే తగినది. వారు తగినంత కృషి చేస్తే తమ జీవిత లక్ష్యాన్ని సాధించగలరు. అలా జీవిత లక్ష్యాన్ని సాధిస్తే వారు శ్రేష్ఠమైన దానిని సాధించినట్లే! మనిషికి అన్నీ సాధ్యమే అని చెప్పినట్లు, ఈ ప్రయత్నంలో ఒక్కొక్క మారు తమలోని దివ్యత్వాన్ని వెలికితీయడం జరుగుతుంది. అదే 'మానవ ప్రతిభ'. అయితే ఒక్కొక్కప్పుడు దీనికి మన జీవితకాలం సరిపోదు. లక్ష్యసాధనలో మనకు అడ్డు వచ్చేది మన వ్యక్తిత్వమే. మనలోని దుర్గుణాలే మన ప్రగతిని నిరోధిస్తాయి. వాటిలో మొదటిది ఈర్ష్య. ఉదాహరణకు ఉపాధ్యాయుడు పాఠం చెబుతున్నప్పుడు మీరు ఏకాగ్రతతో వింటూ ఉంటారు. మధ్యలో ఉపాధ్యాయుడు ప్రశ్న అడిగితే,

మీరు అంతగా ఇష్టపడని మీ తోటి విద్యార్థి లేచి జవాబు చెబుతాడు. వెంటనే ఆ పిల్లవాడి పట్ల మీకు ఈర్ష్య కలిగి, మీరు ఇక ఏకాగ్రతతో పాఠం వినలేరు. ఈర్ష్య మీ ఏకాగ్రతకు అడ్డం వస్తోంది. అంటే అది మీ జీవితంలో అడ్డంకి అవుతోంది. ఈర్ష్య ఒక్కటే కాదు స్వార్థం, అసూయ, ద్వేషం లాంటివన్నీ మన వ్యక్తిత్వానికి ఆటంకాలే. మనకు ఎవరి పట్ల అయినా ద్వేషం ఉంటే వారిపై పగ తీర్చుకోవాలని అనిపిస్తుంది. అప్పుడప్పుడు ఒకటి రెండు నెలల్లో తీర్చుకుంటాం కూడా! అయితే ఇక్కడ ఒక విషయం గుర్తించాలి. మనం పగ తీర్చుకొనే ముందు – ఈ రెండు నెలల కాలంలో మన మానసిక స్థితి ఎలా ఉంది, "ఈ వ్యక్తి నాకు హాని చేశాడే" అని ఎన్ని మార్లు బాధ పడ్డాం, ఆ బాధ వల్ల ఎంత హాని వాటిల్లింది, అల్పమైన ఈ ద్వేషం వల్ల ఎంత ఆనందాన్ని కోల్పోయాం లాంటివన్నీ పరిశీలిస్తే మనం అంత సమయాన్ని వృథా చేసుకున్న ఈ పగ మన వ్యక్తిత్వం మీద ఎంతటి వ్యతిరేక ప్రభావాన్ని కలుగజేస్తుందో అర్థమవుతుంది.

స్వార్థపూరితంగా ఉన్నప్పుడు అన్నీ మనకే కావాలనీ, అన్నీ మనం అనుభవిస్తే అదే ఆనందమనీ అనుకుంటాం. కానీ మన వద్ద ఉన్న దానిని ఇతరులతో పంచుకోవడంలోనూ, ఇతరులకు ఇవ్వడంలోనూ అసలైన ఆనందం ఉంటుందని ఆచరణలోనే అనుభవ పూర్వకంగా తెలుస్తుంది. ఈ విధమైన నిశ్చయాత్మక భావాలను మనం జాగ్రత్తగా పెంపొందించుకోవాలి. వాటంతటవే అవి అలవడవు; ఆచరించడం వల్ల అలవడతాయి. మన ప్రగతిని నిరోధించే వ్యతిరేక భావనల్ని ప్రేమ, స్వార్థరాహిత్యం, దైవభక్తి, అంకితభావం లాంటి నిశ్చయాత్మక భావనల సహాయంతో అధిగమించగలం.



**అవరోధాలను అధిగమించే శక్తి:** నేటి యువతరం పోటీతత్త్వం తీవ్రంగా ఉన్న ప్రస్తుత కాలంలో మంచి లక్షణాలు ఉంటే ముందుకు సాగలేం అనుకుంటుంది. తీవ్రంగా ఉన్న ఈ పోటీ ప్రపంచంలో విజయం సాధించిన వారిని వారికి విజయం కావాలా, శాంతి కావాలా, సుఖం కావాలా లేక ఆనందం కావాలా అని అడిగినప్పుడు వచ్చే జవాబు ఏమిటో తెలుసా? వారికే కాదు, ఎవరికైనా కావాల్సింది 'శాంతి' మాత్రమే! తమ అంతరంగంలో అందరు వాంఛించేదీ శాంతినే! అయితే దాన్ని ఎలా పొందాలో అందరం విస్మరిస్తున్నాం. తప్పు మార్గాలను అవలంబిస్తున్నాం! పోటీ వల్లనే ఉద్యోగం వస్తుందనీ, ధనం, పలుకుబడి సంపాదిస్తేనే శాంతి లభిస్తుందనీ అనుకుంటున్నాం. కానీ అలా అనుకోవడం తప్పు. ఇతరులను అవమానపరచి మనం మనశ్శాంతి పొందుదామనుకుంటే అది ఎన్నటికీ కుదరదు. ఇది అందరూ బాగా తెలుసుకోవాలి.

మనిషి సంఘజీవి. మనం ఒక్కరం శాంతిగా జీవించాలనుకోకూడదు. మనకు ప్రతిభ లభించాలంటే ఇతరులకు నష్టం కలిగించాలనుకోకూడదు; వారిని కూడా కలుపుకొని, అందరం ప్రతిభావంతులం అవ్వాలనుకోవాలి.

"నా మటుకు నేను నన్నే ప్రేమించుకుంటూ, స్వార్థంతో ఉంటాను. ఇతరుల పట్ల జాలి, దయ, కనికరం లాంటివి ఎందుకు ఉండాలి?" అనుకోవచ్చు. అందరిలో ఉన్న జీవాత్మ ఒకటే కనుక మనల్ని మనం ప్రేమించినట్లే అందర్నీ ప్రేమించాలి; అందరూ సంతోషంగా ఉంటేనే మనం శాంతిగా ఉండగలం. ఉన్నతమైన అభిప్రాయాలకు అదే మూలం. దీని ఆధారంతో మనం ఉన్నతమైన అభిప్రాయాలను ఆచరణలో పెట్టి, అవే యోచిస్తూ, ధ్యానం చేస్తే మనం ఇతరుల గురించి స్పందించి తద్వారా ఉన్నతులమవుతాం.

అయితే ఇది ఎలా కలుగుతుంది అంటే... స్వామి వివేకానంద "కష్టాలలో ఉన్న వారికి సహాయపడినప్పుడే అది సాధ్యం" అన్నారు. మనకు వీలైనంత, మనం చెయ్యగలిగినంత సహాయం చెయ్యాలి పరులకు! అలా పరులకు సహాయపడడం వల్ల మనకు మనమే సహాయం చేసుకుంటున్నాం. స్వామి వివేకానంద అదే చెప్పారు: "ఇతరులకు తోడ్పడడం వల్ల వాళ్ళకేదో సేవ చేస్తున్నట్లు కాదు, మనకు మనమే సహాయపడినట్లు!"

సాధారణంగా చెడ్డ ఆలోచనలకు మూలం ద్వేషం, పగ, ఈర్ష్యల్లాంటివి. వీటికి దూరమైతే మనస్సుకి ఏకాగ్రత లభిస్తుంది. మనస్సు ఏకాగ్రమైనప్పుడు మనలోని భౌతిక, మానసిక, ఆధ్యాత్మిక శక్తులన్నిటినీ లక్ష్యసాధన వైపు నిర్దేశించడం వల్ల ప్రతిభావంతులమవగలం. మన విద్యాసంస్థలు ఇలాంటి ఉన్నతమైన భావనలను కలిగించే, ఉన్నత విలువలతో కూడిన విద్యను అందజేయాలి. అప్పుడే విద్యార్థులందరికీ విజయం లభిస్తుంది. ప్రతి ఒక్కరూ కోరుకునే మానసిక శాంతి లభిస్తుంది.

# యువవాణి

**- స్వామి పరిజ్ఞేయానంద**

**కె. అనిల్ కుమార్, హైదరాబాద్**

**ప్రశ్న :** నేను మితంగా మాట్లాడడం, యోగధ్యానాలు చేయడం, మంచి పుస్తకాలను చదవడం అభ్యసిస్తున్నాను. అది నా తల్లితండ్రులకూ, మిత్రులకూ ఏమాత్రం ఇష్టం లేదు. సన్మార్గంలో పయనించే ప్రయత్నంలో ఎదురవుతున్న ఈ వ్యతిరేక పరిస్థితుల్ని ఎదుర్కోవడం ఎలా?

**జవాబు :** మనం మంచి మార్గంలో నడుస్తున్నాం, మనం చేస్తున్న పని మంచిదే అన్న సంపూర్ణ విశ్వాసం, సమగ్ర అవగాహన మనకుంటే ఎలాంటి ప్రతికూల పరిస్థితుల్ని అయినా అధిగమించవచ్చు.

సన్మార్గంలో నడవాలనే దృఢ సంకల్పం ఉంటే, వ్యతిరేక పరిస్థితులు మరింత శక్తినీ, పట్టుదలనూ పెంచుతాయి.

Opposition inflames the enthusiast; never converts him.

*- Friedrech Schiller.*

'ఎవరైనా జీవితంలో ఉన్నతిని సాధించాలంటే మంచితనానికి ఉన్న శక్తిపై అఖండ విశ్వాసం కలిగి ఉండాలి' అని స్వామి వివేకానంద అంటారు.

మన ప్రవర్తన ఇతరులకు కష్టం కలిగించనంతవరకూ, మనం నిజాయతీగా జీవిస్తున్నామని మన అంతరాత్మ చెబుతున్నంతవరకూ మనం ఎలాంటి నిందలకూ, విమర్శలకూ భయపడకూడదు. ఆదర్శ జీవితాన్ని గడపాలని అనుకునేవారెవరైనా సరే తీవ్ర వ్యతిరేకతల్ని ఎదుర్కోక తప్పదు.

Let people praise you or blame you, let fortune smile or frown upon you... you do not deviate from the path of Truth. The greater a man has become, the fiercer ordeal he has had to pass through.

*- Swami Vivekananda*

కాబట్టి స్వామి వివేకానంద ఇచ్చిన సూత్రాన్ని మీ జీవితంలో అవలంభిస్తే మీకు ఎదురయ్యే ప్రతికూల పరిస్థితులు అనుకూలంగా మారుతాయి అనడంలో సందేహం లేదు.

**కె. మురళీధరస్వామి, జగిత్యాల**

**ప్రశ్న :** శ్రీరాముడు చేసింది, శ్రీకృష్ణుడు చెప్పింది ఆచరించాలని అంటారు. వీటి గురించి వివరించండి.

**జవాబు :** శ్రీరామునిది 'ధర్మావతారం'. శ్రీకృష్ణునిది 'లీలావతారం'. సమాజంలో ఏ వ్యక్తి అయినా ఆదర్శ జీవనం గడపాలంటే శ్రీరాముడు ఆచరించి చూపించిన ఆదర్శాన్ని అవలంబించవచ్చు. కానీ శ్రీకృష్ణుడు చేసిన లీలల్ని ప్రదర్శించడం సాధారణ మనిషికి సాధ్యం కాదు. మనిషి ఆదర్శవంతంగా జీవించాలంటే శ్రీరాముడు అనుసరించిన మార్గాన్నీ, శ్రీకృష్ణుడు బోధించిన సత్యాన్నీ ఆచరించాలి.

ఉదాహరణకు శ్రీరాముడు తండ్రి మాటను నిలబెట్టడానికి తనకు కష్టమైనా ఆనందంగా అరణ్యాలకు వెళ్ళాడు. తన తండ్రి అసత్యవాది అనే ముద్ర పడకుండా కుమారుడిగా తన కర్తవ్యాన్ని నిర్వర్తించాడు శ్రీరాముడు. ఆయన చూపిన ఈ ఆదర్శాన్ని ఆచరించడం సాధ్యమైనప్పటికీ నేటి సమాజంలో ఎంత మంది తమ తల్లితండ్రుల అభిప్రాయాలకూ, అభిరుచులకూ అనుగుణంగా ప్రవర్తిస్తున్నారు?

శ్రీకృష్ణావతారం గురించి ఆలోచిస్తే, శ్రీకృష్ణుడు చిటికెన వ్రేలితో గోవర్ధన గిరిని ఎత్తి ఎంతో మందికి ఆశ్రయం కల్పించాడు. కాళీయుని మర్దించి, మరెంతో మంది ప్రాణాలను కాపాడాడు. శ్రీకృష్ణుడు ప్రదర్శించిన అద్భుతలీలల్ని మనం చేయలేం. కానీ ఆయన ఇచ్చిన గీతా సందేశాన్ని ఆచరించగలిగితే కురుక్షేత్ర మరుభూమిలోని అర్జునుడిలాంటి మనందరికీ అది ఒయాసిస్‌లా పునర్జీవనాన్నిస్తుంది. కాబట్టి 'శ్రీరాముడు చేసింది, శ్రీకృష్ణుడు చెప్పింది ఆచరించాలి' అని అంటారు.

మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా:
**యువవాణి**
శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,
దోమల్‌గూడ, హైదరాబాద్ - 500 029

యువవాహిని

# మనసు - మర్మం

- స్వామి బుధానంద

## మనసు గతిని మార్చే స్థితి !

మనస్సును స్వాధీనం చేసుకోవడమంటే దానికి సరియైన ప్రవర్తనను అలవరచడమే! అది ఒక అడవి గుర్రాన్ని పట్టుకొని, దాన్ని అదుపులోకి తెచ్చి, విన్యాసాలు నేర్పించడం లాంటిది. మరి, దాన్ని ఆ విధంగా చేయడం ఎలా?

స్వామి వివేకానంద ఇలా బోధించారు: "మనస్సును స్వాధీనం చేసుకోబోయే ముందు మనం తప్పనిసరిగా దాన్ని అధ్యయనం చెయ్యాలి".

ఈ చంచలమైన మనస్సును దొరకబుచ్చుకొని, అది చేసే షికారుల నుంచి దాన్ని లాగి తీసుకొని వచ్చి, ఒకే ఒక ఆలోచన మీద లగ్నం చేయాలి. ఇది మళ్ళీ మళ్ళీ చేయాలి. మన సంకల్ప శక్తితో మనస్సు మీద పట్టు సాధించాలి.

మనస్సు పైన పట్టు సాధించడానికి అతి సులభమైన పద్ధతి ఏమిటంటే - ఒకచోట ప్రశాంతంగా కూర్చొని కొంతసేపు దాన్ని ఎటుపోతే అటు పోనివ్వడమే! ఆ సమయంలో, 'నేను ఈ మనస్సును కాను. ఎటుపడితే అటు కొట్టుకుపోతున్న ఈ మనస్సును గమనిస్తున్న సాక్షిని మాత్రమే' - అనే ఆలోచనను స్థిరంగా కలిగి ఉండాలి. అప్పుడు దానిని మీతో ఎలాంటి సంబంధం లేనిదాని లాగ, దానంతట అదే ఆలోచిస్తున్నట్లుగా గమనించండి. మిమ్మల్ని మీరు శరీరంగా కానీ, మనస్సుగా కానీ భావించకుండా భగవంతునిగా భావించండి.

మనస్సును మీ ముందు కనిపిస్తున్న ఒక నిశ్చలమైన సరస్సుగానూ, ఆలోచనలను ఆ సరస్సులో నుంచి పైకి లేచి నీటి మీద పగిలిపోతున్న నీటి బుడగలుగానూ ఊహించుకోండి. ఆ ఆలోచనలను నియంత్రించడానికి ఎలాంటి ప్రయత్నమూ చేయవద్దు. కానీ అవి తేలియాడుతూ పోవడాన్ని గమనించండి. ఇలా చేస్తే నీటి బుడగలు పగిలి ఏర్పడుతున్న గుండ్రని అలలు క్రమక్రమంగా తగ్గిపోతాయి. మనస్సు అలాంటి పెద్ద పెద్ద వలయాల లాంటి ఆలోచనలతో ఉంటుంది. మనం సరస్సులోకి ఒక రాయిని విసిరితే ఏ విధంగా అలలు వలయాలుగా ఏర్పడతాయో అదే విధంగా ఈ ఆలోచనల అలలు అంతకంతకూ పెద్ద వలయాలుగా పెరిగిపోతూ ఉంటాయి. మనం ఈ క్రమాన్ని ఎదురు తిప్పాలి. పెద్ద వలయాలతో మొదలుపెట్టి, వాటిని క్రమంగా చిన్నవి చేస్తూ, చివరకు వాటిని ఒక బిందువుగా చేసి, మనస్సును దానిపై పెట్టి అది అక్కడే నిలచి ఉండేలా చేయాలి. 'నేను మనస్సును కాను. నేను ఆలోచించడాన్ని నేనే చూస్తున్నాను. నా మనస్సు పనిచేయడాన్ని నేను గమనిస్తున్నాను' అనే భావనను స్థిరపరచుకోండి. రోజులు గడుస్తున్న కొద్దీ మిమ్మల్ని మీరు, మీ మనస్సు నుంచి పూర్తిగా వేరు చేసుకొని, మీరు వేరు, మీ మనస్సు వేరని నిజంగా తెలుసుకుంటారు.

ఈ పని సాధించినప్పుడు మనస్సు మీ స్వాధీనంలో ఉండే ఒక సేవకునిలా మారిపోతుంది. యోగి కావడానికి మొదటి దశ ఇంద్రియాలను అధిగ మించడమే. ఈ విధంగా ఎప్పుడైతే మనస్సును జయిస్తామో, అప్పుడు సర్వోత్కృష్ట స్థితికి చేరినట్లే! ఈ సాధనను ప్రారంభించి నప్పుడు మన మనస్సులోకి ఎలాంటి దుర్మార్గపు ఆలోచనలు వస్తాయో చూసి నివ్వెరపోతాం. సాధన కొనసాగుతున్నప్పుడు కొంతకాలం మనస్సులో అశాంతి పెరగవచ్చు. అయితే మన మనస్సు నుండి మనల్ని ఎంతగా వేరు పరచుకోగలుగుతామో, దాని విపరీత చేష్టలు అంతగా తగ్గిపోతాయి. గమనిస్తున్న తీక్ష్ణమైన చూపుల వల్ల మనస్సు యొక్క అనిశ్చితి క్రమక్రమంగా శాంతిస్తుంది. చివరకు మనస్సు మచ్చిక చేసిన సర్కస్ గుర్రంలా శక్తిమంతంగానూ, క్రమశిక్షణ కలిగినదిగానూ తయారవుతుంది. a



# ఎలా చదవాలి? ఎలా చదివించాలి?

– స్వామి రంగనాథానంద

**"చదువులో 99 శాతం మార్కులు...**
**పోటీ పరీక్షల్లో మంచి ప్రతిభ...**
**కోరుకున్న ఉద్యోగం...**
**చేతి నిండా సంపాదన!**

**ఇదేనా మన విద్యకు ఉండవలసిన లక్షణం? ఇంతకు మించి మన విద్యకు వేరే కర్తవ్యాలు లేవా అని ఎవరికి వారు ప్రశ్నించుకోవలసిన తరుణం ఇది."**

నేను తరచూ మన ఉపాధ్యాయులకు "బోధించడానికి తరగతి గదికి వెళ్ళినప్పుడు మీరు తరగతి గది ముందు నిలబడి, మీ ముందున్న పిల్లల ముఖాల్లోకి చూడండి. మీ ఊహాత్మక సానుభూతితో వాళ్ళ మనస్సులు, హృదయాల్లోకి తొంగి చూడండి. పై ప్రశ్న మనస్సులో వేసుకోండి. అప్పుడు మీకు చక్కని జవాబు లభిస్తుంది" అని చెబుతుంటాను.

తరతమ భేదం లేకుండా అన్ని వర్గాలకూ చెందిన పిల్లలు మీ ముందు ఉన్నారు. మన స్వతంత్ర భారతదేశం వాగ్దానం చేసిన వరాల అన్వేషణలో వాళ్ళు పాఠశాలకు వచ్చారు. వారికి కావలసింది విద్యతో పాటు తగినంత ప్రేరణ. ఉత్తమ లక్షణాలున్న భారత పౌరులుగా తీర్చిదిద్దే సామాజికతత్త్వాన్ని అలవరచాలి. విశాల దృక్పథం, వినయ విధేయతలు, మన సంస్కృతీ సంప్రదాయాలను గౌరవించే భక్తిభావాలను పెంపొందించాలి. ఇలాంటి ప్రేరణ మానవుని అంతరగం నుండే లభిస్తుంది. నేటి విద్యా విధానంలో ఆ 'ప్రేరణను' వెలికితీసే ప్రయత్నం జరగడం లేదు. పోటీతత్త్వం పెరిగి సంకుచిత స్వభావం, స్వలాభాపేక్ష పెరుగుతున్నాయి.

**భక్తి తత్త్వాన్ని బోధించండి:**

భక్తి అంటే దైవభక్తి అని మాత్రమే కాదు. తన మీద తనకు భక్తి, చదువు మీద భక్తి, తల్లితండ్రులు, గురువుల మీద భక్తి, తోటి సమాజం మీద, దేశం మీద ప్రేమాభిమానాలు కలిగిఉండడం – ఈ మొత్తం కలిస్తేనే దైవభక్తి అవుతుంది. భక్తి తత్త్వం, సృజనాత్మకత ప్రతి ఒక్కరిలోనూ ఉంటాయి. వాటిని వెలికితీసే ప్రయత్నం మన విద్యా విధానంలో లోపిస్తోంది. ఈ స్థితినే మన రాజ్యాంగంలో హక్కులు – బాధ్యతలుగా వివరించారు. మనకి హక్కుల కోసం పోరాడడం తెలిసినంతగా బాధ్యతల గురించి తెలియడం లేదు.

"మన పౌరసత్త్వాన్నీ, రాజకీయాన్నీ, పరిపాలననూ క్రియాశీలమైనవిగా, ప్రతిభావంతమైనవిగా మలచాలంటే ఈ పరిస్థితిని సరిదిద్దాలి. లేకపోతే మనమిప్పుడు చూస్తున్న విషాదకర పరిస్థితి మరింత గహనం అవుతుంది. కేవలం వ్యక్తిగతమైన కాంక్ష తప్ప, ఎలాంటి మానవతాభావనా లేని వట్టి విజ్ఞానభరితమైన విద్య క్రియాశీలత్వాన్ని కలిగి ఉండదు.

ఉత్కృష్టత, దేశభక్తి, అంకితభావం, సామాజిక చైతన్యం, సమానత్వం తదితర ఆదర్శభావాలను ప్రేరేపించే విద్య కావాలి. ఆ పైన, స్వామి వివేకానంద అన్నట్లు "దేశాన్ని నిర్మించే నిశ్చయంతో సాగే మనిషిని నిర్మించే విద్య రూపొందాలి."

జ్ఞానార్జన క్రమంలో మానవ హృదయంలోకి దేశభక్తి ప్రేరణల్ని జొనిపినప్పుడే విద్య ఫలవంతం అవుతుంది. మానవతా భావన, ప్రేరణ మాత్రమే మన విద్యార్జనా క్రమాన్ని జాజ్జ్వల్యమానం చేస్తాయి. క్రియాశీలత్వం, శిక్షణ కలిగిన విద్యార్థులను దేశానికి అందిస్తాయి. ముఖ్యంగా పాఠశాల స్థాయి విద్యార్థులకు పాఠాలతోపాటు భారతీయతపై భక్తిభావం కలిగే స్ఫూర్తిదాయక బోధనలు చాలా అవసరం. పాశ్చాత్య సంస్కృతిపై మోజు పెంచుకొని మన విలువలకు తిలోదకాలిచ్చే పరిస్థితి మంచిది కాదు. మూలాల్ని మరచిపోతే జాతి ప్రమాదంలో పడుతుంది. ప్రపంచంలో అత్యున్నత స్థితిలో నిలిచిన మన ఆధ్యాత్మిక భావ సంపద, సంస్కృతీ సంప్రదాయాల పట్ల భక్తిభావం కలిగి ఉండడం సర్వమత సమానత్వం పెంపొందించుకోవడం ప్రతి భారతీయుని ముఖ్య కర్తవ్యం.

మంచీ చెడుల సమ్మేళనమైన సమాజంలో క్రమశిక్షణ, ఇంద్రియ నిగ్రహం ఉన్న యువతరాన్ని తీర్చిదిద్దే బాధ్యతను ఉపాధ్యాయులు వహించాలి. ఇందుకు ఆధ్యాత్మిక అవగాహన ఎంతగానో ఉపకరిస్తుంది.

**సేకరణ: ఆర్. కృష్ణ**

యువవాహిని

మహనీయుల జీవితాల్లో

## మధురఘట్టాలు

- జి. సతీష్

## రైల్వేలకు బీజం వేసిన స్టీఫెన్‌సన్

అమోఘమైన రైల్వే వ్యవస్థకు పునాదివేసి, రూపకల్పన చేసిన మహామనిషి స్టీఫెన్‌సన్. ఈనాడు జనజీవితంలో అంతర్భాగమైన రైల్వేలను పట్టాలెక్కించడానికి ఆ మహానుభావుడు చేసిన కృషి అమోఘమైనది. వ్యవస్థకు రూపకల్పన చేయడం ఒక ఎత్తైతే దానిని ప్రజల విశ్వాసంలోకి తీసుకురావడం మరో ఎత్తు. నేడు రైల్వే లేని ప్రయాణ వ్యవస్థను ఊహించనైనా ఊహించలేం. రైలుబండిని పట్టాల మీద పరుగు పెట్టించడానికి ఎన్నో అవాంతరాలను అధిగమించాల్సి వచ్చింది స్టీఫెన్‌సన్‌కి.



బండి పరుగు పెడుతుంటే స్త్రీలకు గర్భస్రావాలవుతాయనీ, ఆవులు పాలివ్వటం మానేస్తాయనీ, గుప్పున లేచే పొగ మూలంగా వాతావరణ కాలుష్యం ఏర్పడుతుందనీ... ఇలా ఎన్నో ప్రతిఘటనల్ని స్టీఫెన్‌సన్ ఎదుర్కోవలసి వచ్చింది. ఓ వైపు ప్రజల విశ్వాసాన్ని పెంపొందించుకుంటూ, యంత్రనిర్మాణం కొనసాగించే పనిలో నిమగ్నమయ్యారు స్టీఫెన్‌సన్.

స్టీఫెన్‌సన్ పుట్టింది కడుబీద కుటుంబంలో. అందువల్ల చిన్నతనం నుంచే గనిలో పనికి వెళ్లేవాడు అతడు. స్టీఫెన్‌సన్ నీళ్లతోడే యంత్రాన్ని గమనిస్తున్నప్పుడు ఇదే యంత్రం రోడ్డుమీద పరుగుతీసే విధంగా మలచడానికి ప్రయత్నించాలనే తపన అతడి మదిలో మెదిలింది.

వజ్రసంకల్పానికి స్వానుభవం, చదువు తోడయ్యాయి. గనుల్లోంచి బొగ్గును ఓడరేవులకు తరలించడం చాలా కష్టంగా ఉండేది. దీనికోసం ఆవిరియంత్రాన్ని తయారుచేస్తానని గని యజమానికి చెప్పి ఒప్పించాడు. 1814లో మొట్టమొదట బ్లూకర్ అనే ఆవిరియంత్రాన్ని తయారుచేసారు. మొట్టమొదట 450 మంది ప్రయాణికులు ఆ బండిలో ప్రయాణించారు. పూర్తిస్థాయి ప్రయాణీకుల బండి 1830 సెప్టెంబరు 15న మాంచెస్టర్ - లివర్‌పూల్ మధ్య సురక్షితంగా తిరిగింది.

ఇప్పుడు రైల్వేలు లేని ప్రపంచాన్ని ఊహించనన్నా ఊహించలేం కదా!

## త్యాగశీలి టంగుటూరి

ఆరు పైసలకు కిలో బియ్యం వచ్చిన రోజుల్లో ఒక కేసు గెల్చినందుకు గాను ప్రకాశం పంతులుకు ముట్టిన ఫీజు 70 వేల రూపాయలు. ఇంతటి గొప్ప తెలివి తేటలున్న న్యాయవాదిగా ఒక వెలుగు వెలిగిన ప్రకాశం పంతులు స్వాతంత్ర్య సమరం లోకి దూకి, తన యావదాస్తీ- సుమారు 13 లక్షల రూపాయలు ప్రజల కోసం ఖర్చు చేశారు.



న్యాయవాద వృత్తిలో అత్యంత ప్రతిభా పాటవాలు చూపిన ప్రకాశం పంతులు బాల్యం కడు పేదరికంలో గడిచింది. ప్రకాశానికి పన్నెండేళ్ళప్పుడు తండ్రి మరణించారు. తల్లి సుబ్బమ్మ ఒంగోలు మున్సిఫ్ కోర్టుకు ఎదురుగా చిన్న ఇల్లు అద్దెకు తీసుకొని, పూటకూళ్ళ ఇల్లు ప్రారంభించింది. వచ్చే ఆదాయంతో పిల్లల్ని పోషించలేక, ప్రకాశాన్ని వారాలకు కుదిర్చింది.

చిన్నతనం నుంచీ కోర్టు ఎదురుగా ఉంటూ అక్కడ న్యాయవాదులను చూస్తూ, వారిని అనుసరిస్తూ ఎప్పటికైనా పెద్ద వకీలును కావాలన్న తపన ప్రకాశంలో అకుంఠిత దీక్షను పెంచింది. పేదరికాన్ని ఎదుర్కొంటూ, దీక్ష పట్టుదలలతో విద్యాభ్యాసం పూర్తి చేసి, రాజమండ్రిలో ప్రాక్టీసు పెట్టి కొద్ది రోజుల్లోనే గొప్ప న్యాయవాదిగా పేరు ప్రఖ్యాతులు పొందాడు.

గాంధీజీ పిలుపుతో ప్రకాశం 1921లో స్వాతంత్ర్య ఉద్యమంలోకి ప్రవేశించారు. సూటు, బూటు వదిలి, ఖద్దరు బట్టలు ధరించారు. ప్రకాశం తెలుగు వారికి ప్రత్యేక రాష్ట్రం కోసం, తెలుగు జాతి సర్వతోముఖాభివృద్ధి కోసం తీవ్రంగా కృషి చేశారు. ఆంధ్ర రాష్ట్రానికి తొలి ముఖ్యమంత్రిగా పనిచేసిన ప్రకాశం పంతులు త్యాగానికీ, సాహసానికీ మారుపేరు.



# ... ఆ సన్నిధిలోనే వ్యక్తి వికాసం

- బి. సైదులు

ప్రపంచజ్ఞానాన్నంతా పిడికిట పట్టి తేగల ఎన్ని సాంకేతిక సౌలభ్యాలున్నా, నాటికీ నేటికీ ఎప్పటికీ 'గురువు'స్థానం గురువుదే! 'ముఖే ముఖే సరస్వతీ' అన్నట్లు ఆచార్యుల ముఖతా ప్రసాదించే జ్ఞానమే నిజమైన జ్ఞానం. కానీ దురదృష్టవశత్తూ ఈతరానికి ఆచార్యున్ని ఆటపట్టించడం నాగరక లక్షణంగా పరిణమించింది. ఇంటర్‌నెట్ ఉందిగా ఇక ఈ టీచర్‌తో పనేముందన్న నిర్లక్ష్యం నేటి విద్యార్థుల్లో నానాటికీ పెరిగిపోతోంది. ఈ కుసంస్కారం యువతరాన్ని పతనావస్థకు చేరుస్తోంది. సాక్షాత్తూ ఆ భగవంతుడే ఈ భువిపై అవతరించి, గురువు పాదస్పర్శతోనే విద్యాభ్యాసం ఆరంభించాడు. వశిష్ఠ మహర్షి వద్ద శ్రీరామ చంద్రుడు, సాందీపుని వద్ద శ్రీకృష్ణ భగవానుడు వినయంగా విద్యనభ్యసించారు. సంపూర్ణ సమర్పణ భావంతో గురువును మించిన శిష్యులయ్యారు. ఎంతటి మేధస్సు అయినా ఆ గురువు సన్నిధిలోనే వికసించటం ఆరంభిస్తుంది. మరోవైపు 'వినాశకాలే... విపరీత బుద్ధి' అన్నట్లు కొందరు ఆచార్యులు కూడా ఆ గురుస్థానాన్ని దిగజారుస్తున్న ఉదంతాలూ చోటుచేసుకోవడం దురదృష్టకరం.

### వినయంతోనే విద్య....

'విద్యాదదాతి వినయం' అంటోంది మన సనాతన ధర్మం. నేటి విద్యార్థుల్లో ప్రధానంగా ఈ వినయం అన్న భావనే కొరవడింది. వినయంతో శ్రద్ధ, శ్రద్ధతో ఏకాగ్రత, ఏకాగ్రతతో జ్ఞానం సాధ్యమవుతాయి. స్వామి వివేకానంద సర్వజ్ఞాన సంపన్నుడు; అయినా లౌకిక దృష్టిలో అక్షరం ముక్క రాని శ్రీరామకృష్ణుల పాదాల వద్ద వాలిపోయారు. అదీ సమర్పణ భావమంటే! విద్య నేర్చుకునే స్థాయిలోనే మనిషి సంస్కారం బయటపడుతుంది. జ్ఞానం అమృతం లాంటిది; ఎంత వినయంగా వెళ్తే మన పాత్ర అంత విశాలమవుతుంది. హనుమంతుడు అంత వినయంగా మెలిగాడు కనుకనే, శ్రీరాముడు బంటుగా ఉన్న ఆయనను భగవంతుణ్ణి చేశాడు.

### ఆచార్యుడే అపర సరస్వతి....

ఈ రోజుల్లో విద్యార్థులు తరగతి సంస్కారాన్నే మరచిపోతున్నారు. ఆచార్యుణ్ణి ఎదిరించడానికి కూడా వెనుకాడటం లేదు. వెకిలిచేష్టల్నీ, విపరీత ప్రవర్తనల్నీ ఆధునిక అభ్యాసన సంప్రదాయంగా భ్రమిస్తున్నారు. నిజానికి పాఠం చెప్పే గురువుని అవమానపరిస్తే, సాక్షాత్తూ ఆ సరస్వతీ దేవిని అవమానపరిచినట్లే! అందుకే ఎన్ని వ్యక్తిత్వ వికాస తరగతులకు హాజరైనా కించిత్తు కూడా వ్యక్తిత్వం ఎదగడం లేదు. గౌతమ బుద్ధుడు ప్రవచించినట్లు "ముందు అర్థించే పాత్ర పవిత్రంగా, పరిశుభ్రంగా ఉంటే వేసే ఏ పదార్థమైనా రుచిగా ఉంటుంది. పాత్రలో అశుద్ధం నింపుకొని అమృతం పోసినా నిష్ఫలమే అవుతుంది". కనుక ముందు సంస్కారంతో మెలగడం అలవాటు చేసుకోవాలి.

### అసలే కోతి యవ్వనం.....

మనసు స్వభావమే చంచలం; యవ్వనంలో అది మరీ చంచలం. అందుకే శ్రీరాముడు "అచిరేణ సదుర్బుద్ధిః పశ్చాత్తాపేన యుజ్యతే" యవ్వనంలో నిర్లక్ష్యంగా దుర్బుద్ధితో ప్రవర్తిస్తే జీవితాంతమూ పశ్చాత్తాపపడాల్సి వస్తుంది" అని అంటాడు. బాల్యం, వృద్ధాప్యం ఈ రెండు అవస్థల్లో మనిషి ఎవరిపైనో ఆధారపడాల్సిన నిస్సహాయ స్థితి. కాని ఒక్క యవ్వనంలోనే మనం స్వతంత్రులం; అప్పుడే మనకు నచ్చిన రీతిలో మనను మనం తీర్చిదిద్దుకునే అవకాశం ఉంటుంది. ఇలాంటి దశలో అహంకారంతో, అలక్ష్యంతో వ్యవహరిస్తే మన జీవితాన్ని మనమే పతనావస్థకు చేర్చుకున్నవారమవుతాము. అందుకే మార్గదర్శకులుగా నిలిచే ఆచార్యులను ఆలంబనగా చేసుకొని నడకను నేర్చుకోవాలి.

### ఆసక్తే అర్హత...

When the student is ready, the teacher will appear... ముందు ఏదైనా నేర్చుకోవాలన్న తపన ఉండాలి. అప్పుడు ఏదో రూపంలో మనకు గురువు ప్రత్యక్షమవుతాడు. స్వామి వివేకానంద భగవంతుని ఉనికి కోసం తపించిపోయారు.

మహోన్నతమైన గురువుల సమక్షంలో
అత్యంత నీచులు, పతనమైన వారు కూడా
ఒక్క క్షణంలో ఋషులుగా మారిపోతారు.
- స్వామి వివేకానంద

తీవ్రకాంక్షతో ఎందరినో కలిశారు; చివరికి సాక్షాత్తూ అవతార వరిష్ఠులైన శ్రీరామకృష్ణులే గురువుగా లభించారు. కానీ ఈ రోజుల్లో మనకు అలాంటి దీక్ష, పట్టుదలలే కొరవడుతున్నాయి. అలా మనకు గమ్యం, గమనం అన్నీ అస్పష్టమే! ఇంజనీరింగ్ చదవాలని కాసేపు, ఇంగ్లీషులో పీజీ చేయాలని కాసేపు అనిపిస్తుంది. ఫలితంగా జీవితం చుక్కాని లేని నావలా గాలివాటంగా సాగిపోయి చివరకి ఏ తీరానికో చేరుతుంది.

**గురువుల తీరూ మారాలి...**

ప్రస్తుత సమాజంలో కొందరు ఆచార్యులు కూడా విద్యార్థులకు ఆదర్శనీయమైన, అనుసరణీయమైన స్థాయిలో ఎదగలేకపోతున్నారు. What the teacher is, is more important than what he teaches అంటారు కార్ల్ మెనిన్‌గర్ అనే మేధావి. శిష్యులకు ఆరాధ్యనీయంగా ఉండే వ్యక్తిత్వాన్ని నిర్మించుకోవడంలో కొందరు గురువులు విఫలమవుతున్నారు. కేవలం విషయాన్ని సరఫరా చేసే సాంకేతిక పరికరాలుగా మారిపోతున్నారు. ఫలితంగా విద్యార్థులకు పూజ్యనీయ భావం కలగడం లేదు.

**'సహనావవతు సహనౌభునక్తు సహవీర్యం కరవావహై తేజస్వినావధీతమస్తు మా విద్విషావహై...'** అంటూ గురు శిష్యులిద్దరూ విద్యాసంబంధంగా బలవంతులై, తేజోవంతులై వర్ధిల్లాలని నినదించే ఈ పవిత్రభూమిలో గురుశిష్య పరంపరే కలుషితమవుతోంది.

**అంతఃశక్తిని మేల్కొలిపేవారే ఆచార్యులు...**

The teacher who is indeed wise does not bid you to enter the house of his wisdom but rather leads you to the threshold of your mind. అంటారు ఖలీల్ జిబ్రాన్. వారికి తెలిసింది మనకు చెప్పటం కాకుండా, మనలో నిక్షిప్తమైన జ్ఞాననిధిని వెలికి తీసేవారే ఆచార్యులు. నిగూఢంగా మనలో నిక్షిప్తమైన జ్ఞానాన్ని ఆవిష్కరింపజేసి మనల్నే ఆశ్చర్యచకితుల్ని చేసే ఆచార్యుల పాత్ర సమాజంలో ప్రశస్తమైంది. దేశానికి దిశానిర్దేశం చేసే 'తరాలను' ప్రసాదించే గురువు పైనే సమాజనిర్మాణం ఆధారపడి ఉంది. "సహి విద్యాతస్తం జనయతి, తచ్ఛ్రేష్ఠం జన్మ, శరీరమేవ మాతాపితరౌ జనయతః".... కేవలం




డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్‌తో
స్వామి రంగనాథానంద

## ఆచార్యుని బాధ్యత అనన్యమైనది

**- స్వామి రంగనాథానంద**

**కేవలం బోధించడమే కాదు విద్యార్థికి స్ఫూర్తిమంతంగా నిలవాల్సిన బాధ్యత కూడా అధ్యాపకులపైనే ఉంది. ఆత్మవిశ్వాసంతో, ఆత్మాభిమానంతో మెలుగుతూ సమాజంలోని రుగ్మతలను రూపుమాపే దిశలో విద్యార్థులను పయనింపజేయాల్సింది గురువులే. స్వార్థరహితంగా సామాజిక కార్యకర్తగా విద్యార్థి తన పాత్రను విజయవంతంగా నిర్వహించేలా, ఈ దేశ ఔన్నత్యానికి పాటుపడేలా ఎదగాలంటే ముందు మార్గనిర్దేశం చేయాల్సింది ఉపాధ్యాయుడే! ముఖ్యంగా విద్యార్థులకు దేశభక్తిని, సామాజిక స్పృహను వారసత్వంగా అందజేయడంలో మనం విఫలమవుతున్నాం. విద్యార్థులను వికసిత వ్యక్తులుగా, ఆదర్శ దేశపౌరులుగా సమున్నతంగా తీర్చిదిద్దడంలో ఉపాధ్యాయుడిని మించిన బృహత్తర శక్తి ఏదీ లేదు.**

a a a

ఈ భౌతికమైన శరీరాన్ని ప్రసాదించిన తల్లితండ్రుల కన్నా, సద్విద్యను బోధించే గురువు జన్మే శ్రేష్ఠమైనదంటున్నాయి మన పురాణాలు. a

**(సెప్టెంబర్ 5న డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ జయంతి, ఉపాధ్యాయ దినోత్సవం)**



# జీవిత లక్ష్యం

- స్వామి సేవ్యానంద

**"ప్రతి జీవిలోనూ దివ్యత్వం గర్భితంగా ఉంది. అంతర్గతంగా ఉన్న ఆ దివ్యత్వాన్ని వ్యక్తం చేయడమే జీవిత పరమావధి"** అని స్వామి వివేకానంద చెప్పారు.

ప్రతి జీవిలోనూ దివ్యత్వం అంతర్గతంగా ఉంది. అయితే తన నిజ స్వరూపమైన దివ్యత్వాన్నీ, ఆత్మనూ సాక్షాత్కరించుకునే సామర్థ్యం ఈ సృష్టిలో మానవునికి మాత్రమే ఉంది. అందుకే మానవ జన్మ అన్ని జన్మల కన్నా శ్రేష్ఠమైనది. ఈ శ్రేష్ఠమైన మానవ జన్మను మనం సద్వినియోగపరచుకొని, మన లక్ష్యాన్ని చేరే ప్రయత్నం చేయాలి.

శ్రీరామకృష్ణులు దీనికి ఒక ఉపమానం చెప్పారు. ఒక దొంగకు తన ప్రక్క గదిలో ఒక ఖజానా ఉందని తెలిసినప్పుడు ఆ దొంగ మనఃస్థితి ఎలా ఉంటుంది? అతడి మనసు పూర్తిగా ఆ ఖజానా మీదే లగ్నమై ఉంటుంది. ఎలాగైనా ఆ విలువైన సంపత్తిని చేజిక్కించుకోవాలని ఆరాటపడతాడు. అదేవిధంగా మన మనస్సును దివ్యత్వం మీదే లగ్నం చేసి, నిరంతరం ఆ శక్తిని వ్యక్తం చేసే ప్రయత్నం చేయాలి. అయితే మనం ఈ విషయానికి ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వడం లేదు. మనం మొదటి నుంచీ ఆదర్శపూర్ణులం, ఆచరణ శూన్యులం అవుతున్నాం. మనకు ఉన్నతమైన ఆదర్శాలున్నా ఎప్పుడూ ఆచరణలో పెట్టం. ఇదే మన బలహీనత! మనం దివ్యత్వాన్ని వ్యక్తం చేసే ప్రయత్నం చేయకపోవడం వల్లనే మన నిజస్వరూపాన్ని మరచి, అన్ని అనర్థాలకూ, అరాచకాలకూ కారకులమవుతున్నాం

**బలహీనతలకు కారణం:** మనం సంసారపు సుడిగుండంలో పడి, మన నిజస్వరూపమైన దివ్యత్వాన్ని మరచిపోతున్నాం. స్వామి వివేకానంద చెప్పిన 'గొఱ్ఱె – సింహం' కథలాగ మనం సింహస్వరూపులం అయినప్పటికీ, గొఱ్ఱెల్లా బలహీనులమై, భయపడుతూ జీవిస్తున్నాం. అందుకే నేటి ఆధునిక ప్రపంచంలో శాస్త్రీయ విజ్ఞానంతో పాటు మానసిక వ్యాధులు, ఆత్మహత్యలు, హత్యాకాండలు, అధర్మం, అవినీతి పెరుగుతున్నాయి. ('ఇండియా టుడే' వారపత్రిక, 2008 ఏప్రిల్ 28వ తేదీ సంచికలో ఇచ్చిన సమాచారం ప్రకారం ప్రపంచం మొత్తంలో యువతరంలో ఆత్మహత్యల సంఖ్యను చూస్తే భారతదేశానిదే అగ్రస్థానం! ఈ సంఖ్య దక్షిణ భారత దేశంలో మరీ ఎక్కువగా ఉంది.) విషయసుఖాలనే లక్ష్యంగా పెట్టుకొని జీవించే పాశ్చాత్యులను అనుకరించడం వల్ల మనం ఎన్ని రంగాలలో అభివృద్ధి చెందినా అంతా 'బూడిదలో పోసిన పన్నీరే' అవుతోంది.

విద్య, వైజ్ఞానిక, ఆర్థిక రంగాలలో పురోగతి చెందుతున్న మన మాతృభూమిలో, స్వామి వివేకానంద ఎన్నో ఆశలు పెట్టుకున్న మన యువతరానికి ఈ పరిస్థితి ఎందుకు వచ్చింది? మన మాతృభూమికి మూలాధారం, ఆయువుపట్టు అయిన ఆధ్యాత్మికతను ఉపేక్షిస్తున్నాం; అదే మన బలహీనతకు కారణం.

**దివ్యత్వాన్ని ఎలా వ్యక్తం చేయగలం?:** మనకు మన లక్ష్యంపై శ్రద్ధావిశ్వాసాలు ఉన్నప్పటికీ మార్గం తెలియనట్లయితే ఆ లక్ష్యాన్ని చేరుకోవడం అసంభవం. మనం సాధారణంగా లక్ష్యం మీదే మన దృష్టిని కేంద్రీకరించి, మార్గానికి అంతగా ప్రాధాన్యం ఇవ్వం. అందుకే లక్ష్యాన్ని చేరుకోవడం మనకు కష్టతరమవుతుంది. 'తిరుపతి పుణ్యక్షేత్రం' గురించి మనం చాలా విన్నాం. అయితే తిరుపతికి ఎలా వెళ్ళాలో తెలియకుండా అక్కడకు చేరలేం కదా! అందుకే లక్ష్యానికి ఎంత ప్రాధాన్యం ఇస్తామో, మార్గానికి కూడా అంతే ప్రాధాన్యం ఇవ్వాలి. స్వామి వివేకానంద మన ముందు నాలుగు యోగాలను ఉంచారు. అవి భక్తియోగం, కర్మయోగం, జ్ఞాన యోగం, రాజయోగం. మన స్వభావాన్ని బట్టి వీటిలో ఏదైనా ఒక యోగం, లేదా కొన్ని యోగాలు, లేదా అన్ని యోగాలనూ సమ్మేళనం చేసి, లక్ష్యాన్ని చేరుకోవచ్చు.

ప్రతి ఒక్కరూ ఏ మతానికి చెందినా, ఏ కులానికి చెందినా, ఏ జాతికి చెందినా, ఆస్తికులైనా నాస్తికులైనా 'దివ్యత్వాన్ని' కొంచెమైనా వ్యక్తం చేసినట్లైతే వారందరూ శక్తిమంతులవుతారు. ఈ ప్రపంచంలో ఘోరమైన విపత్తుల నుంచి తప్పించుకొని, నెమ్మదిగా లక్ష్యం చేరుకుంటారు. మనం దివ్యత్వాన్ని వ్యక్తం చేసే ప్రయత్నం, దివ్యానందాన్ని అనుభవించే ప్రయత్నం, జీవిత లక్ష్యాన్ని చేరే ప్రయత్నం ఈ క్షణం నుంచే ఆరంభిద్దాం!

# పుత్తడికి కూడా ఒత్తిడి అవసరమే!

- రామ్ జలదుర్గం



మనలో చాలామంది చిన్న చిన్న విషయాల గురించి అతిగా ఆలోచించి, ఆందోళన పడుతుంటారు. అయితే ఎక్కువ కాలం గడవకుండానే, 'అరే! అంత చిన్న విషయం గురించి అనవసరంగా దిగులుపడ్డానే! అలా ఆలోచించి ఉండాల్సింది కాదేమో!' అని తమలో తామే పశ్చాత్తాప పడుతుంటారు. నిజానికి ఏ కొందరికో ఉన్న అలవాటు కాదిది. నూటికి తొంభై అయిదు శాతం మందికి అంటే దాదాపు మానవుని సహజగుణం అన్న మాట.

**మనోభారాన్ని పెంచే ఒత్తిడి:** చిన్న విషయాలంటే తమకు అంతగా సంబంధం లేని విషయాల గురించి కూడా ఈ ఆందోళన, ఉద్రేకంతో కూడిన ఆలోచనలు ఉంటాయి. ఉదాహరణకు వాహనాల రద్దీలో మిమ్మల్ని దాటుకొని, మీ కన్నా వేగంగా వాహనం నడుపుకొంటూ వెళ్ళే కుర్రాడి గురించి, క్యూలో చాలాసేపు నిలబడడం గురించి, ఇతరుల విమర్శల గురించి, తమకు ఇవ్వాల్సిన గౌరవం ఎవరో ఇవ్వకపోవడం గురించి, మీ అభిప్రాయంతో కుటుంబ సభ్యుల అభిప్రాయం విభేదించడం గురించి, మీరనుకున్నట్లు మీతోటి ఉద్యోగులు ప్రవర్తించకపోవడం గురించి, మీ సొంతం అనుకున్న మనిషి మీరు ఆశించినదాని కన్నా భిన్నంగా ఆలోచించడం గురించి - ఇలా మరెన్నో విషయాలు ఆందోళన, దిగులు, ఒత్తిడి, అశాంతులకి గురి చేస్తాయి.

ఇలాంటి పరిస్థితుల్లోనే ఈ ప్రపంచాన్ని బాగు చేయడం ఎవరి వల్లా కాదనీ, రోజులు బాగా లేవనీ ఇతరుల వల్లే తాను మనశ్శాంతిని కోల్పోతున్నాననీ, ఇతరులే తమ పతనానికి కారణమనీ, ప్రపంచాన్ని తాను అర్థం చేసుకోవాలి తప్ప, తనను అర్థం చేసుకునే వాళ్ళేలేరనీ - ఇలా ఒక విధమైన నిరాశావాదంతో తమ భావాల్నీ, అభిప్రాయాల్నీ ప్రచారం చేయడం మనకు కనిపిస్తుంది. ఆలోచనలు ఒక భారమైతే, ఇతరులతో మాట్లాడి మరీ తల భారాన్ని పెంచుకోవడం తరచుగా మనం చేస్తున్న అభ్యాసమే. అనవసరమైన దిగులుకు గురి చేసే ఆలోచనలను దూరంగా ఉంచడం చాలా ముఖ్యం. అది ఎంత ప్రయోజనకరమో ఇలా ఆలోచించేవారికి తమ మానసిక, శారీరక శక్తిని కోల్పోయినప్పుడు గానీ తెలియదు. ఇలాంటి అతి చిన్న విషయాలపై ఆలోచనల్ని కేంద్రీకరించడం వల్ల జీవితంలోని మాధుర్యాన్నీ, సుఖసంతోషాల్నీ కోల్పోతున్నామన్న సత్యం వీరికి ఏ పదవీ విరమణ చేసిన తరువాతో, దగ్గరి వారు దూరమైన తరువాతో, ఉన్నవి కోల్పోయిన తరువాతో గానీ తెలిసిరాదు.

**శక్తిని పెంచే ఒత్తిడి :** ఒత్తిడి చాలా హానికరమైందన్న భావనే మనిషిని మానసికంగా దెబ్బ తీస్తుంది. ఒత్తిడి లేనిదే శక్తి ఎక్కడి నుంచి వస్తుందో ఆలోచించండి. ఒత్తిడికి గురైన ప్రతిసారీ జీవితంలో పట్టు కోల్పోతున్నామన్న భావన సరైనది కాదు. ఒత్తిడిపై సరైన అవగాహన లేనప్పుడే, ఒత్తిడిని అవసరంగా కాకుండా సమస్యగా భావిస్తాం.

గాలి ఒత్తిడి సరైన మోతాదులో ఉన్న బెలూన్ నిండుగా ఉండి, హాయిగా గాలిలో తేలుతుంది. అవసరానికి మించిన గాలిని నింపితే, ముందుగా బలహీనంగా ఉన్న భాగంతో మొదలై, మొత్తానికి అది ఠాప్‌మని పేలిపోతుంది. అసలే గాలి లేకపోతే బెలూన్ తుస్సుమని నేల రాలుతుంది. అలాగే మనిషి జీవితంలో కూడా ముందుకు కదలాలన్నా, అనుకున్నది అందుకోవాలన్నా, విజయం వరించాలన్నా, అభివృద్ధి సాధించాలన్నా ఒత్తిడి తప్పదు. అయితే అసలు సమస్య అవసరానికి మించిన మానసిక ఒత్తిడి వల్లనే! ఈ ఒత్తిడే ఆలోచనలకూ, మానసికంగా కుంగిపోయే స్థాయికీ దిగజారుస్తుంది. ఏ పని జరగాలన్నా ఒత్తిడి అవసరమని దాన్ని శక్తిగా గుర్తించాలనీ, లేదా ఒత్తిడిని శక్తిగా మార్చుకోవాలన్న సకారాత్మక ఆలోచనలు, ఒత్తిడిని అపార్థం చేసుకోకుండా, మనిషిని అభివృద్ధి వైపు ప్రేరేపిస్తాయి.



# శ్రీ రామకృష్ణ శారదాశ్రమ, పొన్నంపేట

కొడగు జిల్లా, కర్ణాటక - 571 216
ఫోన్: 08274 - 249040/ 249555
Email : srkseva@gmail.com Website: www.rkmponnampet.org



## విన్నపం

**కా**ఫీ తోటలకూ, పరాక్రమానికీ, విలువైన సాంస్కృతిక వారసత్వానికీ ప్రసిద్ధిగాంచి, ప్రశాంత వాతావరణంలో, సస్యశ్యామలమైన పరిసరాలలో ఉన్న కొడగు జిల్లాలోని పొన్నంపేట 'శ్రీరామకృష్ణ శారదాశ్రమ' 1927లో ప్రారంభమైంది. బేలూరులోని రామకృష్ణ మఠానికి శాఖ అయిన ఈ ఆశ్రమం అప్పటి నుంచీ కొడగులోనూ, దాని చుట్టుపక్కల ప్రాంతాలలోనూ నివసించే వారికి అనేక విధాలుగా సహాయ పడుతోంది. సంఘంలోని వెనుకబడిన జాతుల వారికి సేవలు అందిస్తూ, అవసరమైన పరికరాలన్నీ ఉన్న చిన్న వైద్యశాలను నిర్వహించడంతో పాటు అర్హులైన పేదవిద్యార్థులకు ఉపకార వేతనాలు ఇవ్వడం, అవసరమైనప్పుడు అక్కరలో ఉన్న వారికి సహాయ సామగ్రి ఇవ్వడం వంటివి కూడా ఈ ఆశ్రమం చేస్తుంది. బాలురకు 'వివేకానంద బాలక సంఘ' పేరున ఒక సాంస్కృతిక కేంద్రాన్నీ, ఒక సార్వజనీన గ్రంథాలయాన్నీ నిర్వహిస్తోంది ఈ ఆశ్రమం. ఆలయంలో నిత్యపూజ, ప్రార్థనలు, మూర్తిత్రయం జయంతి ఉత్సవాలు, జాతీయ యువదినోత్సవం - ఇంకా ఇతర ముఖ్యమైన పండుగలు నిర్వహించడం వంటివి ఆశ్రమం చేపట్టే ఇతర కార్యక్రమాలు. ప్రశాంతంగా పవిత్ర వాతావరణంలో ఉన్న ఈ ఆశ్రమం అనేకమంది సందర్శకులని ఆకర్షిస్తుంది. కావేరీ నది జన్మించిన స్థలం పొన్నంపేట దగ్గరలోనే ఉంది.

పొన్నంపేట ఆశ్రమంలోని శ్రీరామకృష్ణుల ఆలయ భవనం 1927లో నిర్మితమైంది. గడచిన కాలంలో ఎదురైన ప్రకృతి వైపరీత్యాల వల్ల ఈ పురాతన భవనం మరమ్మత్తు చేయడానికి కూడా వీలు కానంత శిథిలావస్థకు చేరుకుంది. కొడగు జిల్లాలో వానలు ఎక్కువ కనుక ఆలయ కార్యక్రమాలు కొనసాగించడం కష్టమవుతోంది. భక్తుల సదుపాయం కోసం, నిపుణుల సలహా ప్రకారం పాత భవనం స్థానంలో కొత్త ఆలయం నిర్మించాలని నిశ్చయించాం. 2008 ఫిబ్రవరి 24న ఆలయ నిర్మాణానికి శంకుస్థాపన జరిగింది. నిర్మాణ కార్యక్రమం జరుగుతోంది.

ఆశ్రమంలోని కార్యకలాపాలను విస్తృతం చెయ్యడానికి ఈ ఆశ్రమాన్ని ఆనుకొని ఉన్న భూభాగాన్ని కొనాలని నిశ్చయించాం.

**మొత్తం ప్రణాళిక అంతటికీ కలిపి రూ॥ 175 లక్షలు ఖర్చవుతుందని నిపుణుల అంచనా.**

భక్తులనూ, శ్రేయోభిలాషులనూ, ప్రజాహిత సంస్థలనూ



**నూతన శ్రీరామకృష్ణ మందిర నమూనా**

ఈ ఉన్నత కార్యానికి ఉదారంగా విరాళాలిచ్చి తోడ్పడాల్సిందిగా కోరుతున్నాం. విరాళాలను ఎకౌంట్ పేయీ చెక్కు రూపంలో కానీ, డి.డి. రూపంలో కానీ **Sri Ramakrishna Sharadashrama, Ponnampet** పేరున తీసి, **Sri Ramakrishna Sharadashrama, Ponnampet, District Kodagu, Karnataka - 571 216** అనే చిరునామాకు పంపవలసిందిగా మనవి.

మీరు పంపే విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 80(జి) కింద పన్ను మినహాయింపు లభిస్తుంది.

శుభాకాంక్షలతో

భగవత్సేవలో

**స్వామి జగదాత్మానంద**

అధ్యక్షులు

## గణపతి ఆవిర్భావ విశేషాలు



గణపతి ఆవిర్భావానికి సంబంధించిన కథలన్నింటికీ సంక్షిప్తంగానైనా చేర్చి చూస్తే ఎంతో ఆసక్తికరంగా ఉంటుంది.

1. దేవతలు తమ కార్యకలాపాలకు వాటిల్లే విఘ్నాలను తొలగించి వాటిని విజయవంతం చేసిపెట్టే ఒక దేవత తమకు కావాలని పరమశివుణ్ణి అర్థించినప్పుడు, ఆయనే స్వయంగా పార్వతీదేవి గర్భాన గజాననుడిగా జన్మించాడు.

2. ఒకసారి పార్వతీదేవి తాను వంటికి రాసుకున్న లేపనంతో ఏనుగు తలగల ఒక బాలుడి బొమ్మను తయారుచేసి దానిని గంగానదిలో విసిరివేసిందట. మరుక్షణమే అది సజీవమయింది. ఆ బాలుడి రక్షకురాలైన గంగాదేవి, పార్వతి – వీరిద్దరూ ఆ బాలుణ్ణి తమ బిడ్డగా సంబోధించారు. ఇందువల్ల ఆ బాలుడికి 'ద్వైమాతురుదు' అంటే ఇద్దరు తల్లులు గలవాడు అనే పేరు వచ్చింది.

3. పార్వతీదేవి తన దేహం మీది నలుగుపిండితో ఒక బాలుడి బొమ్మ తయారుచేసి, దానికి ప్రాణం పోసి, తన గృహానికి కాపలా కాయమని ఆజ్ఞాపించిందట. శివుడు ఇంట్లోకి రాబోతుండగా ఆ బాలుడు ఆయనను లోనికి పోకుండా అడ్డగించాడు. అప్పుడు శివుడు 'రుద్రుడై' అతడి తలను నరికాడు. తన కుమారుడికి వాటిల్లిన దుస్థితికి పార్వతీదేవి దుఃఖంలో మునిగి పోయింది. అప్పుడు శివుడు ఒక ఏనుగు తలను ఆ దేహానికి అతికించి ఆ బాలుడికి ప్రాణం పోశాడు. తన పొరపాటును సవరించుకోవడం కోసం శివుడు ఆ బాలుణ్ణి తన గణాలన్నింటి కీ నాయకుడిగా నియమించాడు.

అతడే 'గణపతి' అయ్యాడు.

4. అతడు ఆకాశ తత్వానికి ప్రాతినిధ్యం వహించే శివుని ముఖకవళికల నుంచి ఉద్భవించాడు. మోహింపచేసే అతడి శోభ పట్ల పార్వతీదేవి క్రోధం వహించి శపించడంతో అతడికి ఈ వికారరూపం ఏర్పడింది.

5. గణేశుడు ఆదిలో మానవరూపంలోని కృష్ణుడే, ఒకప్పుడు అపకార బుద్ధిగల శనిగ్రహం అతణ్ణి తేరిపార చూసేసరికి, అతడి తల తెగి కృష్ణుడిలోకమైన గోలోకంలో పడింది. తదనంతరం ఏనుగుతలను ఆ బాలునికి అతికించారు.

సేకరణ: 'ఎన్‌సైక్లోపీడియా ఆఫ్ హిందూయిజమ్' –స్వామి హర్షానంద

## కొలువుతీరిన కార్యసిద్ధి వినాయకుడు !



విశాఖ జిల్లా, చోడవరం పట్టణంలో స్వయంభువుగా వెలసిన శ్రీ విఘ్నేశ్వరస్వామి వారు సుమారు 200 సంవత్సరాలకి పైగా నిత్య ధూప, దీప నైవేద్యాలతో విరాజిల్లుతూ భక్తులందరకీ ఎటువంటి విఘ్నాలూ లేకుండా చల్లగా కాపాడుతున్నారు. ఆంధ్ర రాష్ట్రంలో స్వయంభువుగా వెలసిన క్షేత్రాలు రెండు అని పెద్దలు చెప్తారు. అవి:

1. చిత్తూరు జిల్లా కాణిపాకం, 2. విశాఖ జిల్లా చోడవరం. చోడవరంలో ఈ స్వామిని పూర్వకాలంలో అతి పురాతన శివాలయంలో ప్రతిష్ఠించాలని తలచి త్రవ్వి‌చూడగా ఎంత దూరం త్రవ్వినా స్వామి వారి తొండం చివర కనిపించలేదనీ, తొండం చివరకై త్రవ్విన ప్రాంతాన్ని పూర్వీకులు "ఏనుగుబోదె" అనేవారనీ ఆ బోదె ప్రస్తుతం పాత చెరువుగా పిలవబడుతోందనీ అంటారు. స్వామి వారి తొండం భూమిలో ఉందని భక్తుల నమ్మకం. అత్యంత మహిమాన్వితుడైన ఈ స్వామిని దర్శించి వెళ్ళిన భక్తుల ప్రతీ ప్రయత్నం విజయవంతమవుతుందని భక్తుల సంపూర్ణ నమ్మకం.

గణపతి నవరాత్రులు, ఇతర పర్వదినాలలో ఉత్సవాలు నిర్వహిస్తూ, భక్తుల సౌకర్యార్థం మరిన్ని శాశ్వత నిర్మాణ కార్యక్రమాలు చేపట్టడం జరుగుతోంది.

భక్తులు ఏ కార్యమైనా తలపెట్టి విఘ్నేశ్వరస్వామిని దర్శించినట్లైతే ఆ ప్రయత్నం తప్పక నెరవేరుతుంది. అందుకే ఈ స్వామిని కార్యసిద్ధి వినాయకునిగా కూడా పిలుస్తారు.

# శ్రీరామకృష్ణ ప్రభ గ్రంథాలయ నిధి పథకం

'శ్రీరామకృష్ణ ప్రభ గ్రంథాలయ నిధి పథకం'లో చేరి, మీ పేరు మీద పది మంది మంచి విషయాలు చదివే వీలు కల్పించండి. ఈ పథకం కింద రూ॥750/- చందా కట్టినట్లయితే, 10 ఏళ్ళ పాటు ఒక గ్రంథాలయానికి (ఉన్నత పాఠశాలలకు/ కళాశాలలకు/ సంస్థలకు/ దేవాలయాలకు) ప్రతి నెలా మీ పేరిట 'శ్రీరామకృష్ణ ప్రభ' పంపిస్తాం. దాతల పేర్లనూ, వారి పేరిట పత్రికను పంపే గ్రంథాలయాల వివరాలనూ 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికలో ప్రచురిస్తాం.

| సంఖ్య | దాత పేరు | గ్రహీత సంస్థ |
|---|---|---|
| 1359 | సింధూరి సర్జికల్స్, పంజాగుట్ట, హైదరాబాద్ - 500 082 | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, తిమ్మమ్మమర్రిమాను,అనంతపురం జిల్లా |
| 1360 | " " " | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, కాతరుపల్లి, అనంతపురం జిల్లా |
| 1361 | " " " | ప్రభుత్వ జూనియర్ కళాశాల, కుకట్‌పల్లి, హైదరాబాద్ - 500 072 |
| 1362 | " " " | ప్రభుత్వ జూనియర్ కళాశాల, తనకల్లి, అనంతపురం జిల్లా-515 571 |
| 1363 | " " " | ప్రభుత్వ ఆర్ట్స్ కళాశాల, అనంతపురం, అనంతపురం జిల్లా - 515 001 |
| 1364 | " " " | ఎస్.టి.ఎస్.ఎన్. డిగ్రీ కళాశాల, కదిరి, అనంతపురం జిల్లా |
| 1365 | " " " | ప్రభుత్వ బాలికల ఉన్నత పాఠశాల, కదిరి, అనంతపురం జిల్లా -515591 |
| 1366 | " " " | ప్రభుత్వ జూనియర్ కళాశాల, కదిరి, అనంతపురం జిల్లా - 515 591 |
| 1367 | డా॥ శ్రీ మదూరి శ్రీనివాస్, సాయినగర్, కరీంనగర్ | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, ధూళికట్ట, కరీంనగర్ జిల్లా-505 525 |
| 1368 | శ్రీ పి.వి. కృష్ణారెడ్డి, కృష్ణా ఇండస్ట్రీస్, సెట్టిపల్లి, తిరుపతి | శ్రీ సరస్వతీ శిశుమందిర్, వివేకానంద నగర్, రైల్వే కాలనీ, తిరుపతి |
| 1369 | శ్రీమతి ఎం. అరుణ కుమారి, సిలపార్క్, కొండాపూర్, హైదరాబాద్ | ప్రభుత్వ గ్రంథాలయం, మదనపల్లి, చిత్తూరు జిల్లా - 517 345 |
| 1370 | శ్రీ జి. వేంకటేశ్వర్లు, శాంతి నగర్, ఆదిలాబాద్ | ప్రభుత్వ జూనియర్ కళాశాల, ఇంద్రవెల్లి, ఆదిలాబాద్ జిల్లా |
| 1371 | శ్రీ రాయప్రోలు రామలింగేశ్వర శాస్త్రి, సికింద్రాబాద్ | శ్రీ చెన్నకేశవ ఆలయం, కరుమూరు, గుంటూరు జిల్లా -522 265 |
| 1372 | శ్రీ ఎన్.ఎస్. ప్రకాశరావు, కాప్రా, హైదరాబాద్ | ఎస్.కె.ఆర్.ఎస్. ఓరియంటల్ డిగ్రీ కళాశాల, పాలకొల్లు, ప.గో.జిల్లా |
| 1373 | శ్రీ జి. మోహన్‌రావు, పొందూరు, శ్రీకాకుళం జిల్లా- 532 168 | నవతా గ్రంథాలయం, పొందూరు, శ్రీకాకుళం జిల్లా - 532 168 |
| 1374 | శ్రీమతి బి. సుజాత, మియాపూర్, హైదరాబాద్ | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, పిప్పలబద్ర,విజయనగరం జిల్లా-535 526 |
| 1375 | " " " | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, బొమ్మిక జగన్నాథపురం, విజయనగరం జిల్లా |
| 1376 | అపెక్స్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇంగ్లీష్, విశాఖపట్నం-530 016 | విశాఖపట్నం పబ్లిక్ లైబ్రరీ, ఎస్.ఆర్. నగర్, విశాఖపట్నం |
| 1377 | " " " | జిల్లా గ్రంథాలయం, మహారాణిపేట, దండు బజార్, విశాఖపట్నం |
| 1378 | శ్రీ కుమారస్వామి, మామిడికుదురు, తూర్పు గోదావరి జిల్లా | బ్రాంచ్ లైబ్రరీ, మామిడికుదురు, తూర్పు గోదావరి జిల్లా- 533 247 |
| 1379 | శ్రీ ఎ. అనిల్ కుమార్, కల్యాణ్‌నగర్, హైదరాబాద్ - 500 018 | ప్రాథమిక పాఠశాల, కిడిమి గ్రామం, దంత మండలం, శ్రీకాకుళం జిల్లా |
| 1380 | శ్రీమతి జి. లక్ష్మి, హబ్సీగూడా, హైదరాబాద్ - 500 007 | బాలాజీ మందిర్, పిప్లానీ, భోపాల్ - 462 021 |
| 1381 | శ్రీ కె. నారాయణ రాజు, కె.పి.హెచ్.బి. కాలనీ, హైదరాబాద్ | శ్రీ విద్యారణ్యవారి విద్యాలయం, కేశవపురం గ్రామం, కరీంనగర్ జిల్లా |
| 1382 | శ్రీమతి కె. మాధవి, కె.పి.హెచ్.బి. కాలనీ, హైదరాబాద్ | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, మల్లికుదుర్ల, వరంగల్ జిల్లా - 506 002 |
| 1383 | శ్రీ దేవేష్ వర్మ, కె.పి.హెచ్.బి. కాలనీ, హైదరాబాద్ | రైల్వే ఇన్‌స్టిట్యూట్, రైల్వే కాలనీ, బెల్లంపల్లి, ఆదిలాబాద్ జిల్లా - 504 251 |
| 1384 | శ్రీ సిహెచ్. కృష్ణప్రసాద్, గాంధీనగర్, హైదరాబాద్ | ఎమ్.పి.పి. ప్రాథమిక పాఠశాల, కడుము, శ్రీకాకుళం జిల్లా- 532 457 |
| 1385 | శ్రీమతి జి. ప్రతిభ, జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా-509 301 | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, రుద్రారమ్, మహబూబ్ నగర్ జిల్లా-509 339 |
| 1386 | శ్రీ నారాయణ శాస్త్రి, మాచవరం డౌన్, విజయవాడ-4 | అమ్మ వృద్ధాశ్రమం, గన్నవరం మండలం, కేసరపల్లి- 521 102 |
| 1387 | శ్రీ సర్వదేవభట్ల విశ్వనాథం, ఖమ్మం | ప్రభుత్వ జూనియర్ కళాశాల, తిరుమలాయ పాలెం, ఖమ్మం జిల్లా- 507 183 |

ఈ పథకం ద్వారా శ్రీరామకృష్ణ ప్రభను మరింతమందికి చేరువ చేస్తున్న దాతలకు కృతజ్ఞతలు.

# 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

| దాత పేరు | విద్యాసంస్థ |
|---|---|
| శ్రీ శంకర రెడ్డి, గుడిమల్కాపూర్, హైదరాబాద్ - 500 028 | పర్ణిక జూనియర్ కళాశాల, నారాయణ్‌పేట్, మహబూబ్‌నగర్ జిల్లా |
| " " " | శ్రీసాయి కో-ఆపరేటివ్ జూనియర్ కళాశాల, నారాయణ్‌పేట్ -509 210 |
| " " " | ప్రతిభ జూనియర్ కళాశాల, నారాయణ్‌పేట్, మహబూబ్‌నగర్ జిల్లా |
| " " " | స్ఫూర్తి డిగ్రీ కళాశాల, నారాయణ్‌పేట్, మహబూబ్‌నగర్ జిల్లా-509 210 |
| " " " | ప్రభుత్వ జూనియర్ కళాశాల, నారాయణ్‌పేట్, మహబూబ్‌నగర్ జిల్లా |
| " " " | శాఖా గ్రంథాలయం, నారాయణ్‌పేట్, మహబూబ్‌నగర్ జిల్లా- 509 210 |
| " " " | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, దామెరగిద్ద, మహబూబ్‌నగర్ జిల్లా |
| " " " | ఆదర్శ్ కాలేజ్ ఆఫ్ టీచర్స్ ఎడ్యుకేషన్, వెంకటేశ్వర కాలనీ, మహబూబ్‌నగర్ |
| శ్రీ చిలుకూరి వెంకట రామిరెడ్డి, గాంధీ నగర్, హైదరాబాద్ | ప్రభుత్వ ఉన్నత పాఠశాల, మొత్తపల్లి, మొగుల్లపల్లి మండలం, వరంగల్ జిల్లా |
| " " " | ఐ.ఓ.ఎ.ఎస్.ఇ., శ్రీ వేంకటేశ్వరా యూనివర్సిటీ, తిరుపతి |
| " " " | రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠం, తిరుపతి, చిత్తూరు జిల్లా - 517 507 |
| శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి & శ్రీ రామకృష్ణ చెవుటూరి, చెన్నై | శ్రీ పద్మావతి మహిళా విశ్వావిద్యాలయం, శ్రీ వేంకటేశ్వర యూనివర్సిటీ,తిరుపతి |
| " " " | విశ్వం కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్, తట్టివరపల్లి, మదనపల్లి, చిత్తూరు జిల్లా |
| " " " | డి.ఐ.ఇ.టి, కార్వేటి నగరం, చిత్తూరు జిల్లా - 517 582 |
| " " " | బి.వి.ఆర్. కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్, బద్వేల్, కడప జిల్లా - 516 227 |
| " " " | శ్రీమలయాళస్వామి తెలుగు పండిట్ ట్రైనింగ్ కళాశాల, ప్రొద్దుటూరు |
| " " " | మిరియన్ కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్, అమలాపురం. |
| " " " | సెయింట్ మేరీస్ కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్, సర్పవరం, కాకినాడ. |
| " " " | జి.బి.ఆర్. కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్, అనపర్తి, తూర్పు గోదావరి జిల్లా |
| " " " | గాంధీ సెంటినరీ కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్, కాకినాడ, తూర్పు గోదావరి జిల్లా |
| " " " | విద్యావన్ ఉమెన్స్ కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్, కాకినాడ- 533 005 |

ఈ పథకం ద్వారా శ్రీరామకృష్ణ ప్రభను మరింతమందికి చేరువ చేస్తున్న దాతలకు కృతజ్ఞతలు.

...17వ పేజీ తరువాయి.


వినాయకుడి తపస్సుకు ఎవరూ భంగం కలిగించకుండా,
నాగులన్నీ బయటకు వచ్చి కాపలా కాయసాగాయి.


దేవేంద్రుడు, మూషికాసురుడి
అనుచరులను రెచ్చగొట్టసాగాడు.
వినాయకుడు మీ నాయకుణ్ణి వాహనంగా చేసుకున్నాడు.
మిమ్మల్ని అందరినీ నిర్మూలించాలని తపస్సు చేస్తున్నాడు.
వెళ్ళి పగ తీర్చుకోండి!


అవును.
అతణ్ణి
అంతం
చేయాలి!
అమ్మో! కాలసర్పాలు...
అబ్బా... పారిపోండి... పారిపోండి...


ప్రాణాలకు తెగించి తన తపస్సు భంగం
కాకుండా నివారించిన సర్పాలంటే
వినాయకుడికి ముచ్చటేసింది.
వాటిని ముద్దాడుతూ,
మిమ్మల్ని నేటి నుండీ అలంకారాలుగా
ధరిస్తాను. నాకు ఆభరణాలై శోభించండి!


విఘ్నేశ్వరుడు కైలాసానికి తిరిగి వెళ్ళాడు.
కొద్ది రోజుల తరువాత...
నాయనా!
పెళ్ళి సంగతి
ఏంచేశావు?
అందంలో నీకు సరితూగే
అమ్మాయినే
పెళ్ళిచేసుకోవాలని ఉందమ్మా!

అయితే వీధిలో కూర్చొని, వచ్చే పోయే వాళ్ళను గమనించు!

అలాగేనమ్మా!

వీధిలో కూర్చుని వినాయకుడు దిక్కులు చూడసాగాడు. కొంతసేపటి తరువాత పార్వతి అక్కడకు వచ్చింది.

ఇంతసేపూ ఏం చూస్తున్నావు నాయనా?

అందరిలోనూ నువ్వే కనిపిస్తున్నావమ్మా! ఇక ఎవరిని వివాహమాడేది?

నాయనా! దేవతలందరూ తూర్పు ముఖంగానే ఉండి పూజలందుకోవాలనే నియమం ఉంది. కానీ నువ్వు ఏ దిక్కులో కూర్చున్నా పూజనీయుడవు అవుతావు!

వినాయకుడి జవాబుతో పార్వతీదేవి సంతోషించింది.

అలా వేయివిఘ్నాలు కల్పించుకొని, విఘ్నేశ్వరుడు చివరికి ఆజన్మ బ్రహ్మచారిగానే ఉండిపోయాడు.

# గ్రంథ స్వీకారం



## శ్రీకృష్ణ శతకము

**సరళ తాత్పర్య సహితము**

పండిత పరిష్కృతము
పేజీలు: 40, వెల: 15/-
ప్రతులకు: భరణి పబ్లికేషన్స్,
ఇ.నెం. 28-20-17/4, జానీ వీధి,
అరండల్‌పేట, విజయవాడ- 520002



స్వామి శివానందులవారి

## ఆధ్యాత్మిక కథాస్రవంతి

ఆంధ్రానువాదం: యు.నారాయణరావు
పేజీలు: 60, వెల: 20/-
ప్రతులకు: దివ్యజీవన సంఘము
శివానంద నగర్ - 249 192
టెహ్రీగఢ్‌వాల్ జిల్లా - (ఉత్తరాంచల్)

## శ్రీశ్రీశ్రీ దుర్గమ్మ

రచయిత : శ్రీవెలిచర్ల సత్యనారాయణ వరప్రసాద్
పేజీలు:51, వెల: తెలుపలేదు
ప్రతులకు: శ్రీమతి వెలిచర్ల ఉమామహేశ్వరి,ఐక్య అపార్ట్‌మెంట్, మెయిన్‌రోడ్డు, తణుకు, ప.గో.జిల్లా



అరసవల్లి

## శ్రీ సూర్యక్షేత్ర మహాత్మ్యము

గ్రంథకర్త: శ్రీ శ్రియానందనాథుడు ఈశ్వరసత్యనారాయణశర్మ
పేజీలు:90, వెల: 50/-
ప్రతులకు: సాధన గ్రంథమండలి,
తెనాలి - 522 201





## భారత భారతి

**లఘుకావ్యము**

రచన : మేడిచర్ల ప్రభాకర రావు
పేజీలు:104, వెల: 40/-
ప్రతులకు: గీతా భవనము,
స్టేషన్ రోడ్, నిజామాబాద్



## ఆది శాసనకర్త మహర్షి మనువు

సంపాదకులు : డా॥ సంధ్యావందనం లక్ష్మీదేవి,
పేజీలు:96, వెల: 25/-
ప్రతులకు: సాహిత్య నికేతన్,
కేశవనిలయం,బర్కత్‌పుర,
హైదరాబాద్- 27

## పెంపుడు చిలుక

రచయిత: డా॥ కడిమిళ్ళ వరప్రసాద్
పేజీలు: 128, వెల: 80/-
ప్రతులకు: కడిమిళ్ళ శ్రీవిరించి,
'హంసవాహన', డోర్ నెం. 3-6-50,
ఎర్రమిల్లి వారి వీధి,
నర్సాపూర్ - 534 275, ప.గో. జిల్లా



## దుర్గాభర్గ శతకములు

రచయిత: కపిలవాయి లింగమూర్తి
పేజీలు: 80, వెల : 80 /-,
ప్రతులకు: కె. కిశోర్ బాబు
'వాణీ సదనం', 17-110, విద్యానగర్ కాలనీ, నాగర్‌కర్నూలు,
మహబూబ్‌నగర్ జిల్లా





## యథార్థ మానవత్వము

గ్రంథకర్త: స్వామి కృష్ణ యతీంద్ర రామానుజ జీయరు,
పేజీలు: 110, వెల: 30/-,
ప్రతులకు: శ్రీ గీతా ఆశ్రమము,
ఇం.నెం. 8-6-372, అలకాపురి కాలనీ, కరీంనగర్ - 505 001



## భగవాన్ బోధ

సంకలనం: సాయికృష్ణ
పేజీలు: 84, వెల: 20/-
ప్రతులకు: ఎస్.వి. సాయి కృష్ణారావు,
ఫ్లాట్ నెం. 301, 3వ ఫ్లోర్, పావనీ విల్లా అపార్ట్‌మెంట్స్, వేదాయపాలెం,
నెల్లూరు - 524 004

## శ్రీరామకృష్ణ సేవాసమితి రజతోత్సవం



**పశ్చిమ గోదావరి జిల్లా మారుటేరు శ్రీరామకృష్ణ సేవా సమితి** ప్రారంభించి 25 సంవత్సరాలు పూర్తయిన సందర్భంగా 2008 జూలై 5 నుంచి 12వ తేదీ వరకు రజతోత్సవాలను జరుపుకుంది. జూలై 5వ తేదీన శ్రీ జి. సుబ్రహ్మణ్యం, శ్రీమతి అన్నపూర్ణ వారి బృందం-'అన్నమయ్య రసవాహిని' వారి సంకీర్తనతో ప్రారంభమైన ఈ ఉత్సవాల్లో ప్రఖ్యాత పండితులచే ఆధ్యాత్మిక ప్రసంగాలు ఏర్పాటు చేయడం జరిగింది.

11వ తేదీన నిర్వహించిన 'సాధన కార్యక్రమం'లో గుంటూరు శారదా మఠం అధ్యక్షులు ప్రవ్రాజిక భవానీప్రాణ మాతాజీ, ప్రవ్రాజిక బోధమయప్రాణ మాతాజీ ప్రసంగించారు.

12వ తేదీన రామకృష్ణ మఠ స్వామీజీలు ఆధ్వర్యంలో పూజ, హోమం, భజనలు జరిగాయి. సాయంత్రం జరిగిన రజతోత్సవాల ముగింపు సభలో స్వామి ఆత్మవిదానందజీ, స్వామి శశికాంతానందజీ, స్వామి అక్షరాత్మానందజీ, డా॥ పన్నాల శ్యామసుందరమూర్తి పాల్గొని మూర్తిత్రయ జీవిత సందేశాలపై ప్రసంగించారు. పూజ్య స్వామీజీలు సమితి నిర్వహించిన వివిధ



పోటీల్లో విజేతలైన వారికి బహుమతులు; పేద విద్యార్థులకు యూనిఫాం, పుస్తకాలు, స్కూలు ఫీజులు; వయో వృద్ధులకు, పేదలకు పింఛన్లు, వస్త్రాలు పంపిణీ చేశారు.

**నివేదిక : చిర్ల సూర్యనారాయణ రెడ్డి, కార్యదర్శి.**

## శారదా విద్యాలయ రజతోత్సవం

**మదురై శ్రీరామకృష్ణ మఠం** నిర్వహిస్తున్న 'శారదా విద్యాలయం' 2008 జూలై 12న రజతోత్సవం జరుపుకుంది. ఈ కార్యక్రమంలో ఆ రోజు ఉదయం భగవాన్ శ్రీరామకృష్ణ



మందిరంలో పూజ, హోమం, భజనలు నిర్వహించారు. మఠ ప్రాంగణంలో స్వామి వివేకానంద విగ్రహాన్ని చెన్నై ప్రఖ్యాత వ్యాపారవేత్త శ్రీ నల్లి కుప్పుస్వామి ఆవిష్కరించారు. అనంతరం జరిగిన సభలో కొలంబో రామకృష్ణ మిషన్ కార్యదర్శి స్వామి సర్వరూపానందజీ, శ్రీ నల్లి కుప్పుస్వామి, శ్రీ ఎస్.ఎమ్. ఆరుముగం పాల్గొని మదురై రామకృష్ణ మఠం చేస్తున్న సేవా కార్యక్రమాల్ని కొనియాడారు. మదురై రామకృష్ణ మఠం అధ్యక్షులు స్వామి కమలాత్మానందజీ మఠ సేవా కార్యక్రమాలకు సహాయాన్ని అందిస్తున్నవారందరికీ కృతజ్ఞతలు తెలిపారు. శారదా విద్యాలయ విద్యార్థులచే 'మీనాక్షీ కళ్యాణం' నాటకం ప్రదర్శించబడింది. ఈ కార్యక్రమంలో 3500 మంది భక్తులు, శ్రేయోభిలాషులు పాల్గొన్నారు. **నివేదిక: స్వామి యతాత్మానంద**



# సుబోధ

"భగవంతుడి మీద ప్రేమ ఉంటే దేనినైనా సాధించవచ్చు. భగవంతుడి మీద ప్రేమ కలిగిన వారికి కొదవ అనేదే ఉండదు".

"వినాయకుని విషయం చెబుతాను విను! ఒకసారి పార్వతీదేవికి ఇరుప్రక్కలా వినాయకుడు, కుమారస్వామి కూర్చొని ఉన్నారు. పార్వతీదేవి మెడలో అప్పుడు ధగధగ మెరుస్తున్న ఒక రత్నాలహారం ఉంది. కుమారులిద్దరి చూపు దాని మీద పడింది. అప్పుడు భగవతి, "అబ్బాయిలూ! మీలో ఎవరు ముందుగా ఈ ప్రపంచాన్ని చుట్టివస్తారో వాళ్ళకు ఈ హారాన్ని ఇస్తాను" అని చెప్పింది. తల్లి నోటి నుండి ఈ మాట వెలువడిందో లేదో, కుమారస్వామి తన నెమలి వాహనమెక్కి విశ్వాన్ని చుట్టి రావడానికి బయలుదేరాడు. నెమలి అతి వేగంగా ఎగరగలదనీ, తాను ముందుగా తిరిగి రాగలననీ అతడి నమ్మకం".

"ఇక గణపతి శాంతంగా కూర్చున్నాడు. తన తల్లి అయిన జగన్మాత గర్భంలో బ్రహ్మాండాలన్నీ ఇమిడి ఉన్నాయని అతడికి తెలుసు. అందువల్ల నెమ్మదిగా లేచి, భక్తిశ్రద్ధలతో తల్లితండ్రులకు ప్రదక్షిణం చేసి పాదాలకు సాష్టాంగ నమస్కారం చేసి కూర్చున్నాడు. దేవి సంప్రీతురాలై తన రత్నాలహారం తీసి వినాయకునికి ఇచ్చింది. నెమలి వాహనం మీద బయలుదేరిన కుమారస్వామి విశ్వమంతా చుట్టి, ఎంతోసేపటికి తిరిగి వచ్చాడు. తానే ముందు వచ్చాననుకుంటూ తల్లి దగ్గరకు వచ్చాడు. వచ్చి చూసేసరికి వినాయకుడు మెడలో రత్నహారం ఉంది".

భక్తి వల్ల దేనినైనా సాధించవచ్చు అని శ్రీరామకృష్ణులు మహేంద్రనాథ గుప్తకు చెప్పారు.

('శ్రీరామకృష్ణ బోధామృతం' నుంచి)

**శ్రీరామకృష్ణ ప్రభ**
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్ - 500 029
ఫోన్: 040-2766 7799, 2763 3936
E-mail : sriramakrishnaprabha@gmail.com



నిర్వాహక సంపాదకులు: **స్వామి జ్ఞానదానంద**
సంపాదకులు: **స్వామి పరిజ్ఞేయానంద**






భక్తురాలు : అమ్మా! పిల్లలందరూ మీకు సమానమే కదా! కానీ గార్హస్థ్య జీవితం ఆశించేవారిని గృహస్థ జీవితానికి అనుమతిస్తున్నారు. సన్న్యాస జీవితం కోరుకొనే వారికి సన్న్యాస జీవిత ఔన్నత్యాన్ని శ్లాఘిస్తూ దారి చూపుతున్నారు. ఏ మార్గం సర్వులకూ శ్రేష్ఠమో ఆ మార్గంలోనే అందరినీ తీసుకువెళ్ళరాదా?

మాతృదేవి: భోగలాలస తీవ్రంగా ఉన్నవారితో, 'వీటిని త్యజించండి' అంటే నా మాట వింటారా? కానీ 'అంతా మాయా ప్రభావం. భగవంతుడు మాత్రమే నిత్యం' అనే సత్యాన్ని తమ పూర్వజన్మ సుకృతం వల్ల అవగతం చేసుకొన్నవారికి నేను ఒకింత సాయపడకూడదా? ఈ లోకంలోని దుఃఖాలకు అంతు ఉందా?

ఒకరోజు భక్తురాళ్ళతో మాతృదేవి 'ఏదీ మిమ్మల్నందరినీ ఒక ప్రశ్న అడుగుతాను, సరియైన జవాబు చెబుతారో లేదో చూస్తాను. భగవంతుణ్ణి ఏం కావాలని ప్రార్థిస్తారు?'

ఓ భక్తురాలు: జ్ఞానం, భక్తి లాంటివీ; దేనివల్ల సంతోషంగా జీవించగలమో అది – వాటి కోసం మాత్రమే ప్రార్థించాలి.

మాతృదేవి: ఒక్క మాటలో చెప్పాలంటే నిర్వాసన (కోర్కె లేమి) కోసమే మనం ప్రార్థించాలి. కోరికే అన్ని దుఃఖాలకూ మూల కారణం. జనన మరణ చక్రంలో చిక్కుకుని, పదేపదే తిరగడానికి కారణం ఈ కోరికే! అంతే కాదు, ముక్తి పథానికి అడ్డంకిగా ఉండేదీ కోరికే!!

(స్వామి ఈశానంద స్మృతుల నుంచి)

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

అక్టోబరు 2008
వెల : రూ. 10



నవతరానికి స్ఫూర్తినిచ్చే
**'యువవాహిని'**
శీర్షికలు ప్రత్యేకం

యా దేవీ సర్వభూతేషు శక్తిరూపేణ సంస్థితా ।

# శ్రీ పరమాచార్య చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ వేదాధ్యయనానుసన్ధాన ప్రతిష్ఠానమ్

## ప్రవేశ / ఉద్యోగ ప్రకటన

**1. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది కోర్సులకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) 'వేదచూడామణి' : ఋగ్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క అధ్యయనము

యోగ్యతలు : మాతృభాషలో చదువగలిగి, వ్రాయగలిగి ఉండాలి.

వయస్సు : 8 నుంచి 10 సంవత్సరాల మధ్య

స్టైఫండ్ : నెలకు రూ. 1,000/-

(ఆ) 'వేదార్థచూడామణి' : ఋగ్వేదము/ యజుర్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క భాష్యాధ్యయనము

యోగ్యతలు : సంస్కృత పరిజ్ఞానముతో బాటు ఏదో ఒక వేదాన్ని పూర్తిగా అధ్యయనం చేసి ఉండాలి.

వయస్సు : 15 సం॥, ఆ పైన

స్టైఫండ్ : నెలకు రూ. 3,000/-

**2. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది ఉద్యోగాలకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) వేదాధ్యాపకుడు : (సామవేదము/ అథర్వవేదము - వేదానికి ఒక్కొక్కరు చొప్పున రెండు ఖాళీలు)

కావలిసిన అర్హతలు : క్రమాంతము లేక పదాంతము

అదనపు అర్హతలు : ఏదైన మఱియొక వేదము/ వేదభాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము

అనుభవము : 2 సంవత్సరములు

సంభావన : నెలకు రూ॥ 8,000/- మొత్తము, సౌకర్యములతో

(ఆ) వేదభాష్యాచార్యుడు : (ఒక్కొక్క వేదానికి ఒక్కొక్కరు చొప్పున 4 ఖాళీలు)

విద్యార్హత : ఏదైనా వేద భాష్యంలో ఉత్తీర్ణత

అదనపు అర్హత : మరొక వేద భాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము

అనుభవార్హత : 5 సం॥

సంభావన : నెలకు రూ. 10,000/- మొత్తము, సౌకర్యములతో

ముద్రించిన దరఖాస్తు ఫారములను **శ్రీ పి. వేంకటేశ్వర్లు గారు, మేనేజింగ్ డైరెక్టర్, కాకతీయ సిమెంట్, సుగర్ & ఇండస్ట్రీస్ లిమిటెడ్, 'గురుకృప' (ఆంధ్రా బ్యాంకు ఎదురుగా), 1 - 10 - 140/1, అశోక్‌నగర్, హైదరాబాద్ - 500 020** (ఫోను: 040 - 27637717) నుంచి ప్రత్యక్షముగా గాని, పోస్టు ద్వారా గాని పొందవచ్చు. పూర్తి చేయబడిన ఆ ముద్రిత దరఖాస్తులను ఈ పై అడ్రసుకు పంపవలెను. అవసరాన్ని బట్టి ఖాళీలను పూరించుట లోనూ, అర్హతల సవరణ లోనూ మేనేజ్‌మెంటుకు అధికారము కలదు.

సం/-

హైదరాబాద్ కులప్రశాసకుడు





Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 65 సంచిక: 10 అక్టోబరు 2008

ఇన్ద్రియాణామధిష్ఠాత్రీ భూతానాం చాఖిలేషు యా ।
భూతేషు సతతం తస్యై వ్యాప్తిదేవ్యై నమో నమః ॥
చితిరూపేణ యా కృత్స్న మేతద్వ్యాప్య స్థితా జగత్ ।
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః ॥

సర్వభూతముల ఇంద్రియాలను వశం చేసుకొని, అందరిపై ఆధిక్యం పొంది సర్వవ్యాపకురాలైన దేవికి నమస్కారములు. జగత్తు అంతా వ్యాపించి చిత్ స్వరూపిణి అయిన దేవికి అనేక నమస్కారములు. *('దేవీ మాహాత్మ్యం' నుంచి)*





## లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు**...... రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**రాజ పోషకులు**............ రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**పోషకులు**................. రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| | దాత పేరు / చిరునామా | రూ. |
|---|---|---|
| మహారాజ పోషకులు | సి. రామకృష్ణ, జూబ్లీహిల్స్, హైదరాబాద్ - 500 033. | 10,000 |
| పోషకులు | తాలూరి జయదేవ్, శాంతీనగర్, మక్లూర్, నిజామాబాద్. | 1,500 |
| " " | కలకొండ రామలక్ష్మయ్య గుప్త, బ్రాహ్మణవాడి, మహబూబ్‌నగర్. | 1,000 |

## 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

ప్రియ భక్తులారా!

యువతరంలో ఆత్మవిశ్వాసాన్ని నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకూ, కళాశాలలకూ అందించాలని సంకల్పించాం.

శ్రీరామకృష్ణుల, స్వామి వివేకానందుల సందేశాల ఆవశ్యకతను గురించి సుభాష్ చంద్రబోస్ ఒక సందర్భంలో చెబుతూ, "శీలనిర్మాణానికి రామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం వేరొకటి లేదు" అని అన్నారు.

యువతరానికి 'శ్రీరామకృష్ణ ప్రభ'ను మరింత చేరువ చేయడానికి మీ ఆర్థిక సహాయాన్ని కోరుతున్నాం. ఈ పథకం కింద రూ. 1500 మొత్తాన్ని జీవిత చందా (20 సంవత్సరాలకు) కట్టినట్లయితే మీరు సూచించిన, లేదా మేము ఎంపిక చేసిన ఒక పాఠశాల/కళాశాలకు 20 ఏళ్ళ పాటు పత్రికను మీ పేరున పంపుతాం. చందాదారుని పేరు, విద్యాసంస్థ పేరు పత్రికలో ప్రచురిస్తాం.

మీ చందాను ఎమ్.ఓ./ డి.డి./ చెక్కు రూపంలో Ramakrishna Math, Hyderabad పేరున తీసుకొని, Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029 చిరునామాకు పంపవలెను.

స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతరాన్ని తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి మీ వంతు సహాయం అందించగలరని ఆశిస్తున్నాం.

భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ప్రార్థిస్తూ...

భగవత్సేవలో
స్వామి జ్ఞానదానంద
అధ్యక్షులు



## దసరా, దీపావళి శుభాకాంక్షలు

'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు, రచయితలకు, రచయిత్రులకు, ఏజెంట్లకు, ప్రకటనకర్తలకు మా హృదయపూర్వక శుభాభినందనలు. - *సంపాదకులు*

**ADVERTISEMENT TARIFF**

| | MULTI COLOUR | B & W |
|---|---|---|
| Fourth Cover | Rs.25,000 | - |
| Second Cover | Rs.20,000 | - |
| Third Cover | Rs.20,000 | - |
| Inside Full Page | Rs.15,000 | 10,000 |
| Inside Half Page | Rs.10,000 | 5,000 |

| చందా వివరాలు | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|
| విడి ప్రతి : | రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా : | రూ. 100 | $ 20 |
| మూడు సంవత్సరాలకు : | రూ. 280 | $ 50 |
| ఐదు సంవత్సరాలకు : | రూ. 450 | $ 80 |
| ఇరవై సంవత్సరాలకు : | రూ. 1500 | $ 360 |



గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి. పంపవలసిన చిరునామా : Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.

## లోపలి పేజీల్లో...





## శ్రీరామకృష్ణ ప్రభ వార్షిక చందాదారులకు విన్నపం

***ప్రియ పాఠకులారా! దిగువ పేర్కొన్న నెంబర్ల నడుమ ఉన్న సంవత్సర చందాదారుల చందా గడువు తీరిపోనుంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకొని, 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.***

110001 - 115922 మధ్యనున్న వారిలో **సంవత్సర** చందాదారుల చందా గడువు **2008 అక్టోబరుతో** తీరిపోనుంది!

120005 - 126940 మధ్యనున్న వారిలో **సంవత్సర** చందాదారుల చందా గడువు **2008 నవంబర్‌తో** తీరిపోనుంది!

***శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ.... - సర్క్యులేషన్ మేనేజర్***

_ మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు. ❖ మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి. ✸ మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.

**'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకి కుడి భాగంలో మీ చందా గడువు నెల పొందుపరచబడి ఉంది.**





**SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH**
Domalguda, Hyderabad - 500 029. Andhra Pradesh
Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com






# మనశ్శాంతి మన చేతుల్లోనే!

ఈ ప్రపంచంలో అతి అరుదైనదీ, అమూల్యమైనదీ, అందరికీ అత్యంత ఆవశ్యకమైనదీ - 'మనశ్శాంతి'. అయితే మనశ్శాంతిని ఎలా పొందగలం? 'సా'ధనమున పనులు సమకూరు ధరలోన - అన్న వేమన యోగి హితబోధను తప్పుగా అర్థం చేసుకొని, ధనంతో ఈ ధరణిలో దేనినైనా సాధించవచ్చునని అనుకుంటే పొరపాటే! అవసరమైనవన్నీ అమరినప్పుడూ, కోరిన కోర్కెలన్నీ తీరినప్పుడూ మనం ప్రశాంతంగా ఉండవచ్చునని అనుకోవడం సహజం. కానీ, 'మనకు కావలసినవన్నీ పొందడం కన్నా అవసరం లేని వాటిని వదలడం వల్ల మనశ్శాంతి కలుగుతుంది' అని పెద్దల ఉవాచ. మనం ఉన్న పరిసరాలకూ, పరిస్థితులకూ అనుగుణంగా మన మానసిక దృక్పథాన్ని మార్చుకుంటే మనశ్శాంతి మన చేతుల్లో ఉన్నట్లే!

**'తృష్ణ' అంతరిస్తేనే 'తృప్తి'! :** జీవితంలో ఎంత సంపాదించినా, ఎన్ని సుఖాలు అనుభవిస్తున్నా మనిషిలో 'తృష్ణ' అంతరించకపోతే 'తృప్తి' అంకురించడం అసంభవం. మనలో తృష్ణ తీరకపోతే సాక్షాత్తూ ఆ భగవంతుడు ప్రత్యక్షమై మనకు కావసింది కోరుకోమని అడిగినా 'ధనం కావాలని అడుగుతామే కానీ మనశ్శాంతిని మాత్రం అడగం'. ఒకసారి ఓ భక్తుడు భగవంతుణ్ణి ప్రార్థించాడు. భక్తుని ప్రార్థన విన్న భగవంతుడు ప్రత్యక్షమయ్యాడు.

భక్తుడు : స్వామీ! మానవుని కోటి సంవత్సరాలు మీకు ఎన్ని రోజులతో సమానం?

భగవంతుడు : ఒక్క రోజుతో.

భక్తుడు : స్వామీ! మానవుని కోటి రూపాయలు మీకు ఎన్ని రూపాయలతో సమానం?

భగవంతుడు : ఒక్క రూపాయితో.

భక్తుడు : అయితే స్వామీ! నాకు ఆ ఒక్క రూపాయి ప్రసాదించండి.

భగవంతుడు : సరే! నువ్వు (దేవతల లెక్కలో) ఒక్క రోజు ఆగు.

ఇలాంటి తమాషా కథల మాట ఎలా ఉన్నా, 'తృష్ణ' ఎలాంటి వారినైనా పరాజయం పాలు చేసి అశాంతి చిత్తుల్ని చేస్తుందని శ్రీరాముడు అంటాడు.

**అపి మేరు సమం ప్రాజ్ఞమపి శూరమపి స్థిరమ్ ।**
**తృణీ కరోతి తృష్ణైకా నిమేషేణ నరోత్తమమ్ ॥** *(యోగవాసిష్ఠం)*

'మేరువుతో సమానమైనవాడైనా, మహాప్రాజ్ఞుడైనా, నరోత్తముడైనా-తృష్ణ చేత క్షణంలో జయింపబడుతున్నాడు'. కాబట్టి తృష్ణను జయించి, తృప్తితో జీవించడం నేర్చుకోవాలి. అందుకే 'తృప్తికి మించిన సంపద లేదు' అని శ్రీశారదాదేవి చెప్పేవారు.

**ద్వేషం వదిలి ధ్యేయం వైపు...** ఎవరి మనస్సులో ఈర్ష్యా, ద్వేషాలు ఉంటాయో వారికి మనశ్శాంతి దుర్లభం. ఎదుటివారి ఆనందాన్నీ, అభివృద్ధినీ చూసి ఓర్వలేని వారికి శాంతి ఎలా లభిస్తుంది? ఓ విద్యార్థి తోటి విద్యార్థికి తన కన్నా ఎక్కువ మార్కులు వచ్చినా, ఓ ఉద్యోగి సహోద్యోగికి తన కన్నా ముందు పదోన్నతి వచ్చినా, ఓ గృహిణి తన పక్కింటి ఆమె మంచి ఆభరణాలను ధరించినా భరించలేక, ద్వేషంతో రగిలిపోయి అశాంతికి గురయ్యే సంఘటనలు మనం నిత్యం చూస్తూనే ఉంటాం.

ఇతరుల సుఖసంతోషాలకు ఆటంకం కలుగజేస్తూ, ఎదుటివారికి హాని తలపెట్టాలనే స్వభావం మనల్ని వీడనంత వరకూ మనశ్శాంతి మన దరిదాపుల్లోకి రాదన్నది అక్షర సత్యం. దుర్యోధనుని ద్వేషభావం వల్లనే పాండవులు అరణ్యాల పాలై అష్టకష్టాలను అనుభవించాల్సి వచ్చింది. అయితే దుర్యోధనుడు అంతఃపురంలో ఉన్నా ఆనందాన్ని అనుభవించగలిగాడా! లేదు.

అరణ్యవాస కాలంలో ఒకరోజు ద్రౌపది ధర్మరాజుని 'స్వామీ! ఆ దుర్యోధనుడు మనకు ఎన్నో విధాల కష్టాలు కలిగించాడు. అయినా అతడు మాత్రం సుఖంగా జీవిస్తున్నాడు. మనం ఎవరికీ ఏనాడూ కలలోనైనా హాని తలపెట్టలేదు. అయినప్పటికీ మనకే ఈ కష్టాలెందుకు?' అని విలపిస్తూ అడిగింది.

అందుకు ధర్మరాజు, 'ద్రౌపదీ! దుర్యోధనుడు పాండవులకు ఎలా హాని తలపెట్టాలా అని నిరంతరం ఆలోచిస్తూనే ఉంటాడు.

కాబట్టి అతడు అంతఃపురంలో సకల భోగభాగ్యాలు అనుభవిస్తున్నప్పటికీ అతని మనస్సు మాత్రం అశాంతితో దహించుకుపోతుంటుంది. మనం అరణ్యాల్లో ఉన్నా మన మనస్సుల్లో ఎవరికీ హాని తలపెట్టాలనే తలంపు లేదు. కాబట్టి మానసికంగా ఆనందంగా ఉన్నాం' అని శాంతంగా ద్రౌపదిని ఓదార్చాడు.

మనం ద్వేషం వదిలి, మన ధ్యేయాన్ని సాధించడంలో పట్టుదలను ప్రదర్శించాలి. కానీ వేరొకరి అభివృద్ధికి ఆటంకాలను కల్పించడం వల్ల ఏమీ సాధించలేం. అందువల్ల ఎదుటివారి అభివృద్ధిని చూసి ఆనందిస్తూ, అభినందిస్తూ మనం కూడా మన ధ్యేయాన్ని మరువకుండా ముందుకు పయనించేందుకు ప్రయత్నించాలి. అప్పుడే నిజమైన మనశ్శాంతిని పొందగలం.



**అవరోధాలుగా మారే అవసరాలు!:** చాలామంది ఎన్ని ఆర్థిక ఇబ్బందులు ఉన్నా అవసరాలను పెంచుకుంటూ అప్పులపాలై అశాంతిని ఆహ్వానిస్తుంటారు. ఇతరులతో పోల్చుకొనే స్వభావమే ఇందుకు కారణం. నిజానికి మనకు అవసరం లేని వాటిని పొందాలనే తాపత్రయంలో మన మనశ్శాంతికి మనమే అవరోధాల్ని కల్పించుకొంటున్నాం.



సోక్రటీస్ ప్రతిరోజూ సాయంత్రం బజారంతా తిరిగి, ఏమీ కొనకుండానే ఇంటికి వచ్చేవాడు. ఒకరోజు ఆయన శిష్యుడు 'గురువుగారూ! మీరు రోజూ సాయంత్రం బజారుకి వెళుతున్నారు. కానీ ఏమీ కొనకుండానే తిరిగి వస్తున్నారు. అలాంటప్పుడు మీరు రోజూ బజారుకి ఎందుకు వెళుతున్నట్లు' అని అడిగాడు. 'ఈ ప్రపంచంలో మనకు అవసరం లేని వస్తువులు ఎన్ని ఉన్నాయో తెలుసుకొందామని బజారుకి వెళ్ళి వస్తున్నాను' అని సోక్రటీస్ శిష్యునికి సమాధానం ఇచ్చాడు.

ప్రపంచంలో ఉన్నవన్నీ మన సొంతం కావాలని ఆశించకుండా సోక్రటీస్ సూచనను నిత్య జీవితంలో ఆచరిస్తే, అవసరాల్ని తగ్గించుకొని ఆనందంగా జీవించగలం.

**చిరునవ్వుల వెలుగులతో చిరశాంతి :** నిరంతరం మన కోసం మనం ఆలోచించుకోవడం వల్ల కలిగే ఆనందం కన్నా ఇతరుల కోసం కొంచెమైనా ఆలోచించడం వల్ల కలిగే ఆనందం మిన్న. ఒక చిరు దీపంతో ఇంకో దీపాన్ని వెలిగించినప్పుడు ఆ వెలుగు ద్విగుణీకృతం అవుతుంది. అలాగే మనకు ఉన్న దాంట్లో ఇతరులకు వీలైనంత సహాయం చేసినప్పుడు పొందే ఆనందం వర్ణనాతీతం.

స్వార్థాన్ని వీడి ఇతరులకు సేవ చేయగలిగే స్వభావాన్ని అలవరుచుకోవడమే మనశ్శాంతికి మార్గం అని స్వామి వివేకానంద అంటారు. Arrange to distribute medicines to those who are sick... supply food to him who is starving... if you begin to serve your brethren, I tell you my child, you will surely get peace. - ***Swami Vivekananda***

స్వామీజీ సందేశాన్ని అక్షరాలా ఆచరించి నిస్వార్థ సేవలో తరించిన ధన్యజీవి మదర్ థెరెసా. ఒకరోజు శరణాలయం జీపు టైరు పంక్చర్ అయింది. ఓ షాపుకు వెళ్ళి పంచరైన టైరును బాగు చేయించమని ఇచ్చింది. ఆ షాపు యజమాని, మదర్ థెరెసాతో 'అమ్మా! మేము ఈ టైరు బాగుచేసి అనాథ శరణాలయానికి పంపిస్తాం. మీరు వెళ్ళిరండి' అని అన్నాడు. మదర్ థెరెసా, అతనితో 'మీరు ఈ టైరు ఎవరి చేత పంపిస్తారు?' అని అడిగింది. అందుకు ఆ షాపు యజమాని 'రిక్షాలో పంపిస్తాం' అని అన్నాడు. 'ఆ రిక్షాకు కిరాయి ఎంత ఇవ్వాలి?' అని మదర్ థెరెసా అడిగింది. 'రిక్షా కిరాయి 10 రూపాయలు' అని చెప్పాడు షాపు యజమాని.

వెంటనే ఆమె 'ఆ టైరు బాగు చేసేంతవరకూ ఉండి నేనే స్వయంగా తీసుకుపోతాను. దయచేసి ఆ పదిరూపాయలు నాకు ఇవ్వండి. దానితో నేను పదిమంది అనాథల ఆకలి తీరుస్తాను' అంది. ఈ మాటలు విన్న షాపు యజమాని హృదయం ద్రవించింది. తన సహోద్యోగులతో కలిసి అనాథ శరణాలయానికి 50 రూపాయలు చందా ఇచ్చాడు.

అనాథల చిరునవ్వులే తన చిరశాంతికి ఆధారమని నిరూపించిన మదర్ థెరెసా జీవితం మనకు స్ఫూర్తిదాయకం.

తృష్ణను వదిలి తృప్తిని అలవరచుకోవడం, ద్వేషాన్నే ద్వేషించడం, అవసరాలు అధికం కాకుండా జాగ్రత్తపడడం, వీలైనంతలో ఇతరులకు సేవ చేయడం - ఈ లక్షణాలను అలవరుచుకుంటే **'మనశ్శాంతి మన చేతుల్లోనే!'** అందుకు మనమంతా ప్రయత్నిద్దాం.



# కాళీ స్వరూపులు శ్రీరామకృష్ణులు

- స్వామి జ్ఞానదానంద

నరేంద్రుడు (స్వామి వివేకానంద) భగవంతుణ్ణి సాకారునిగా నమ్మేవాడు కాదు; అందువల్ల మొదట్లో కాళీమాతను నమ్మలేదు. ఈ విషయంలో అతను తన గురువైన శ్రీరామకృష్ణులతో చాలా సంవత్సరాలు వాదించాడు. అయితే గురుదేవులు "నువ్వు జగన్మాత సేవకుడవు అవుతావు" అనేవారు. చివరకు ఆయన నరేంద్రుణ్ణి కాళీమాత వద్దకు వెళ్ళేలా చేశారు.

చాలా సంవత్సరాల తరువాత ఒకరోజు స్వామి వివేకానంద సోదరి నివేదితతో ఈ విషయం గురించి చర్చించారు. "మున్ముందు చాలా మంది శ్రీరామకృష్ణులను కాళీ అవతారం అనే అవకాశం ఉందా?" అని సోదరి నివేదిత అడిగారు. అందుకు స్వామీజీ "అవును. అమ్మ తన కార్యనిర్వహణ కోసం శ్రీరామకృష్ణుల దేహాన్ని సిద్ధం చేసింది (ప్రభావితం చేసింది) అని నిస్సందేహంగా చెప్పవచ్చు" అన్నారు.

**గోలాప్‌మా అనుభవం :** ఒకమారు గురుదేవులు అర్ధరాత్రి సమయంలో భక్తి పారవశ్యస్థితిలో అటూ ఇటూ నడుస్తున్నారు. గోలాప్ మా అది చూసింది. ఆమెకు శ్రీరామకృష్ణుల బదులు కాళీమాత నడుస్తున్నట్లు కనిపించింది. అది చూసిన గోలాప్‌మా రోమాంచితురాలైంది.

**బాలిక రూపంలో కాళిక :** మరో సందర్భంలో స్వామి బ్రహ్మానంద ఈ క్రింది సంఘటనను తెలియజేశారు: "నేను కలకత్తా వారణాశీ ఘోష్ వీధిలో నివసించే రోజులలో తరచుగా గురుదేవుల దగ్గరకు వెళ్ళేవాణ్ణి. ఒకమారు నేను అపరాహ్ణం వేళ దక్షిణేశ్వర్ వెళ్ళాను. కాళికాలయం మూసి ఉంది. గురుదేవులు భోజనం చేసి విశ్రాంతి తీసుకుంటున్నారు. నేను వారి గదిలో అడుగు పెట్టగానే వారు నన్ను తమ పక్కన మంచం మీదే కూర్చోమన్నారు. కాస్సేపు మాట్లాడాక, గురుదేవులు నన్ను తమ పాదాలు ఒత్తమన్నారు. నేను "అయ్యా! నేనది చెయ్యలేను. నన్ను క్షమించండి. మీరు అద్భుతమైన కథలు చెబుతుంటారు కదా! దయచేసి అవి చెప్పండి" అన్నాను.

వారు నామాటను లెక్కచేయకుండా "చూడు! ఒక్కమారు నా పాదాలు పట్టిచూడు. ఒక సాధుపురుషుడి సేవ వల్ల నువ్వు ఎంతో లబ్ధి పొందుతావు" అన్నారు.

అలా వారు మరొక రెండు, మూడుసార్లు చెప్పాక, ఆఖరికి వారి పాదాల మీద చెయ్యి వేశాను. ఇంతలో హఠాత్తుగా ఓ అద్భుత సంఘటన జరిగింది. అది నన్ను నిశ్చేష్టుణ్ణి చేసింది. జగన్మాత కాళికాదేవి ఏడెనిమిదేళ్ళ బాలిక రూపంలో ఆ గదిలోకి వచ్చింది. పాదాలకు ఉన్న అందెలు ఘల్లుఘల్లుమంటుండగా గురుదేవుల మంచం చుట్టూ ఆమె తిరిగింది. తరువాత ఆ బాలిక గురుదేవుల శరీరంలో కలిసిపోయింది. ఇదంతా నేను కళ్ళారా చూశాను.

ఆ తరువాత గురుదేవులు మందహాసంతో, "చూశావా! ఒక సాధు పురుషుడికి చేసిన సేవకు తగిన ఫలితం వెంటనే లభించింది" అన్నారు.

**గురుదేవుల పూజే కాళీపూజ! :** శ్రీరామకృష్ణులు 1885 సెప్టెంబర్ నెలలో క్యాన్సర్ వ్యాధి చికిత్స కోసం కలకత్తాలోని శ్యాంపుకూర్ వెళ్ళారు. కాళీపూజ రేపు అనగా శ్రీరామకృష్ణులు

కొంతమంది భక్తులతో "పూజకు కావాల్సినవి అన్నీ కొంచెం తీసుకొని రండి. రేపు కాళీ పూజ చేద్దాం" అన్నారు.

ఆ సంఘటన గురించి స్వామి శారదానంద ఇలా వ్రాశారు:

"సూర్యాస్తమయంతోనే చిరుచీకట్లు అలముకోసాగాయి. సాయంత్రం ఏడు గంటలైనా, గురుదేవులు రోజూలాగే తమ మంచం మీద మౌనంగా కూర్చుని ఉండడం చూశారు భక్తులు. పూజ గురించి వారు మరేమీ చెప్పలేదు. ఆయన కుడివైపున ఖాళీ చేసి పూజ సామగ్రిని ఉంచారు భక్తులు. దక్షిణేశ్వర్‌లో అప్పుడప్పుడు గురుదేవులు చందనం, పుష్పాలు మొదలైన వాటితో తమను తామే స్వయంగా పూజించుకోవడం చూశారు భక్తులు. ఈ రోజు కూడా విశ్వజనీన చైతన్యానికి సంకేతంగా, దివ్యశక్తి యొక్క ప్రతిరూపంగా తమను తామే అర్చిస్తారని భావించారు. లేదంటే శాస్త్రాలలో చెప్పినట్లు జగజ్జననితో తాదాత్మ్యం చెందడానికి గుర్తుగా తమను తాము అర్చిస్తారని అనుకున్నారు. అందువల్లనే వారు పూజసామగ్రిని గురుదేవుల మంచం పక్కనే ఉంచారు. భక్తులు అవన్నీ అక్కడ ఉంచడం చూసినా, గురుదేవులు ఏమీ అనలేదు.

ఆయన గదిలో అన్నీ అమర్చాక ఎవరో దీపాలు, అగరొత్తులు వెలిగించారు. దాని వల్ల గదిలోని చీకట్లు తొలగిపోయాయి. గది అంతా పరిమళం వ్యాపించింది. ఇంకా గురుదేవులు నిశ్చలంగా కూర్చుని ఉండడం చూసి భక్తులు వారి దగ్గర కూర్చున్నారు. గురుదేవులు ఏమైనా చెబుతారేమోనని కొంతమంది వారివైపు చూడసాగారు. మరికొంతమంది జగన్మాతను ధ్యానించ సాగారు. సమయం గడుస్తోంది. అయినా ఆయన మౌనంగా ఉండిపోయారు. స్వయంగా వారు పూజ చెయ్యనూ లేదు, మాలో ఎవరినీ చెయ్యమనా లేదు. అక్కడ మహేంద్ర, రామ్, దేవేంద్ర, గిరీశ్ వంటి చాలామంది భక్తులతో పాటు యువ భక్తులూ ఉన్నారు.

గురుదేవులు తన భక్తులలో "గిరీశ్‌కు నూటపాతిక శాతం భక్తి ఉంది" అనేవారు. చాలా మంది భక్తులకు పూజ విషయంలో గురుదేవుల మౌనం అర్థం కావడం లేదు. అయితే గిరీశ్‌కు గల అపారమైన భక్తి వల్ల అతనికి ఇలా అనిపించింది – "గురుదేవులకు జగజ్జననిని తమ కోసం పూజించాల్సిన అవసరం లేదు. వారి పవిత్రప్రేమ పూజ చెయ్యాలనే ప్రేరణ కలిగించినట్లయితే ఆయన ఏమీ చెయ్యకుండా మౌనంగా కూర్చుంటారా? ఇది నిజం కాదు. గురుదేవుల రూపంలో జగజ్జననిని ప్రత్యక్షంగా పూజించి, ఆ తల్లి అనుగ్రహం పొందడం కోసమే ఈ ఏర్పాట్లన్నీ జరిగాయనుకోవాలా? అది నిజమేనేమో!..."

ఇలాంటి ఆలోచన వచ్చిన వెంటనే గిరీశ్ ఆనంద భరితుడై "జగజ్జననికీ జై" అని అంటూ కొన్ని పుష్పాలు, చందనం తీసుకొని గురుదేవుల పాదాల వద్ద అర్పించాడు. గురుదేవుల దేహం గగుర్పాటుకు లోనై, వారు వెంటనే గాఢ సమాధి స్థితికి చేరుకున్నారు. వారి ముఖమంతా దీప్తిమంతమైంది. వారి ముఖంలో అపూర్వమైన చిరు నగవు వ్యాపించింది. ఆ విధంగా వారిలో జగన్మాత ప్రత్యక్షమైందా అన్నట్లు వారి చేతులు అభయ, వరద ముద్రలను చూపసాగాయి.

ఈ సంఘటనలు ఒకదాని వెంట ఒకటి ఎంత త్వరత్వరగా జరిగాయంటే చుట్టూ ఉన్న భక్తులు గురుదేవులు సమాధి స్థితికి లోనయ్యాకనే గిరీశ్ పుష్పాలను సమర్పించాడని భావించారు. కాస్త దూరంగా ఉన్న భక్తులకు తేజోవంతమైన దేవి గురుదేవుల రూపంలో ప్రత్యక్షమైందా అనిపించింది.

**గొంతు నొప్పి గురుదేవులకా? జగన్మాతకా?** : కాశీపూర్ ఉద్యానంలో శ్రీరామకృష్ణులు క్యాన్సర్ వ్యాధితో తీవ్రంగా బాధపడుతున్నప్పుడు శారదాదేవి చాలా విచారంగా ఉండేవారు. ఒకరోజు నల్లని దేహం, పొడవాటి కురులు ఉన్న ఒక బాలిక వచ్చి, తమ పక్కన కూర్చున్నట్లు శారదాదేవి ఒక దృశ్యం గాంచారు. ఆమెను జగన్మాత (కాళి)గా గుర్తించిన దివ్యజనని "ఓహో! నువ్వు వచ్చావా?" అన్నారు. కాళీమాత "ఆ ... నేను దక్షిణేశ్వరం నుండి వచ్చాను" అంది.

కాసేపు వాళ్ళిద్దరూ మాట్లాడుకున్నాక ఆ బాలిక తన మెడ కాస్త పక్కకు వంచడం చూసి శ్రీశారదాదేవి "నీ కంఠానికి ఏమైంది" అన్నారు. అప్పుడు కాళీమాత "నాకు గొంతు నొప్పిగా ఉంది" అంది.

''బాగుంది! గురుదేవులకీ గొంతునొప్పి, నీకూ గొంతునొప్పా?" అని శారదాదేవి ఆశ్చర్యపోయారు.

కాళీమాత "అవును. నువ్వన్నది నిజం" అంది. ఆ విధంగా జగజ్జనని, శ్రీరామకృష్ణులు ఒకటే అని శారదామాతకు అర్థమైంది.

శ్రీరామకృష్ణులు మహాసమాధి చెందాక, "ఓ కాళీమాతా! మా అందర్నీ విడిచిపెట్టి, నువ్వెక్కడకు వెళ్ళావు తల్లీ?" అంటూ శారదాదేవి విలపించిన సంఘటన వలన శ్రీరామకృష్ణులు, కాళీమాత వేరుకాదని తెలుస్తుంది. `

# దుర్గాదేవీమ్ శరణం ప్రపద్యే!

- శ్రీమతి గరిమెళ్ళ లక్ష్మి

సృష్టిలోని చరాచరాలన్నిటికీ ఆధారం శక్తే. ఆ శక్తి కరుణ, సహకారం లేకుంటే ఈ సృష్టిలో చిన్న ఆకు అయినా కదలదు. ఆ శక్తి ఆదిపరాశక్తి. ఆ విశ్వమంతా ఆ పరాశక్తి విన్యాసమే. వేదకాలం నాటి ఋషులు తమ తపశ్శక్తి వల్ల ఆ శక్తిని దర్శించి, ఆ శక్తితత్త్వం గురించి మన లాంటి సామాన్యులకు అర్థమయ్యే రీతిలో తెలియజేశారు.

బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు కూడా జగన్మాత ఆదిపరాశక్తి వల్లనే శక్తి మంతులయ్యారని దేవీభాగవతం చెబుతోంది.



**అహంకారం పోగొట్టిన అమ్మ:**

ఒకసారి బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు తమ వల్లనే సృష్టి స్థితి లయలు జరుగుతున్నాయనీ, తమను మించిన శక్తిమంతులెవరూ ఉండరనే భావం కలిగింది. అహంకారం వచ్చింది. అది తెలిసి జగన్మాత అయిన ఆదిపరాశక్తి వారి గర్వాన్ని పోగొట్టదలచింది. దాంతో, హఠాత్తుగా త్రిమూర్తుల లోకాలు కంపించసాగాయి. 'ఇదేమిటా' అని ఆలోచిస్తుండగానే త్రిమూర్తులు మూడు వేరు వేరు విమానాల్లో వారి ప్రమేయం లేకుండానే ఊర్ధ్వలోకాలకు పయనిస్తున్నారు. పైకి వెళుతున్న కొద్దీ ప్రతి లోకంలోనూ అచ్చు తమలాగే ఉన్న త్రిమూర్తులు కనిపిస్తున్నారు. వారి వారి లోకాలు కూడా తమ లోకానికి ప్రతిబింబాల లాగ ఉన్నాయి. వారు విభ్రాంతితో అన్నీ పరిశీలిస్తుండగానే విమానాలు సుధా సముద్రంలో నిలిచాయి.

సుధా సముద్రంలో కల్పవృక్షాల నడుమ నవావరణల మధ్య చింతామణి ద్వీపం ఉంది. కోట్లకొద్దీ యోగినీ గణాలు, శక్తి గణాలు, సప్త మాతృకలు, అష్టలక్ష్ములు, సర్వాలంకార భూషితులైనవారు చాలామంది ఆ ఆవరణలలో తిరుగుతున్నారు. అక్కడకు వెళ్ళగానే త్రిమూర్తులు కూడా స్త్రీలుగా మారిపోయారు. వెంటనే వారికి ఆశ్చర్యమూ, భయమూ కలిగాయి. చింతామణి ద్వీపంలోని అమ్మవారి సమక్షానికి చేరారు ముగ్గురూ!

కోటి సూర్యుల కాంతితో ఆ జగదంబిక విరాట్ రూపం ఏ కొలతలకూ, ఏ పరిధులకూ, ఏ ఉపమానాలకూ అందనంత మహాద్భుతంగా ఉంది. వీరు ముగ్గురూ ఆ తల్లికి ప్రణమిల్లారు. తమ పరిస్థితికి కారణం తెలుసుకోగోరారు. జగన్మాత చిరునవ్వు నవ్వింది. కోటి చంద్రుల వెన్నెల కాంతి కురిసినట్లుంది ఆ చిరునవ్వు! "నాయనలారా! మీరు నేను సృష్టించిన దేవతలు. సర్వ సృష్టి మీ చేతులలోనే ఉన్నట్లు అహంకరించడం తగునా? చూశారు కదా! మీ లాంటి వారు, మీ లోకాల లాంటి లోకాలు ఎన్నో ఉన్నాయి ఈ సృష్టిలో! ఇక అహంకారం వదిలిపెట్టండి. నా అంశలను (సరస్వతి, లక్ష్మి, పార్వతి) మీకు భార్యలుగా అనుగ్రహిస్తున్నాను. వారితో కలసి శక్తియుక్తులై, వారి సహకార ప్రోత్సాహాలతో మీ మీ కర్తవ్యాలను నిర్వర్తించండి" అని మృదుమధురంగా పలికింది ఆ తల్లి.

జగన్మాత శక్తి మహిమతో పాటు, తల్లి పాదాలకు అంటిన ధూళికణం కూడా తమపై ప్రసరించడం వల్లే తాము శక్తిమంతులం అయ్యామని గ్రహించారు త్రిమూర్తులు. తమ శక్తులైన సరస్వతి, లక్ష్మి, పార్వతులతో తమ విమానాల వద్దకు వచ్చారు వారు. ఆదిపరాశక్తి అనుగ్రహం వల్ల వారికి తమ పురుష రూపాలు లభించాయి. అహంకారం పూర్తిగా నశించగా, వారు వినమ్రంగా దేవిని స్తుతించారు. తమ

దివ్యవిమానాలలో మేరు పర్వతం వద్దకు చేరారు.

'సౌందర్యలహరి'లో "ఆ తల్లి చరణ కమలాలకు అంటిన ధూళికణాన్ని గ్రహించి బ్రహ్మ ఏ లోపాలూ లేకుండా సృష్టి చేస్తున్నాడు. ఆ ధూళి కణాన్ని శిరస్సున ధరించి, ఆ బలంతో విష్ణుమూర్తి ఆదిశేషువుగా వేయిపడగలతో భూభారాన్నంతటినీ మోస్తున్నాడు. ఆ ధూళికణాన్నే తన శరీరానికి విభూతిగా పూసుకొని పరమశివుడు లయ కార్యాన్ని నిర్వర్తిస్తున్నాడు" అని శంకర భగవత్పాదులు అంటారు.



**దేవీ నవరాత్రులు :** శరదృతువులో... (అంటే ఆశ్వయుజ, కార్తీకమాసాలు) ఆశ్వయుజ శుక్ల పాడ్యమి నుంచి దశమి వరకూ దేవీ పూజలు విశేషంగా చేస్తారు. దేవికి తొమ్మిది రోజులు భక్తి శ్రద్ధలతో పూజలు చేస్తారు కనుక వాటిని 'దేవీ నవరాత్రులు' అనీ, శరదృతువులో చేస్తారు కనుక 'శరన్నవరాత్రులు' అనీ అంటారు. తొమ్మిది రోజులూ రోజుకొక రకంగా అమ్మవారిని అలంకరించి అర్చిస్తారు.

తొమ్మిది రోజులు చేయలేనివాళ్ళు మూలా నక్షత్రం నాటి నుంచి మూడు రోజులు లక్ష్మి, సరస్వతి, దుర్గాపూజలు చేస్తారు. ఉత్తరాదిన ప్రతి వీధిలోనూ పందిళ్ళు వేసి, దుర్గ, లక్ష్మి, సరస్వతి, వినాయకుడు, సుబ్రహ్మణ్యస్వాముల ప్రతిమలు పెట్టి, షష్ఠి నుంచి రోజూ రెండు సంధ్యలలోనూ విశేషంగా పూజలు చేస్తారు. రామాయణం కానీ, దేవీభాగవతం కానీ చదువుతారు. కొన్ని చోట్ల దేవీ సప్తశతి (చండీ) పారాయణ చేస్తారు.

భాద్రపద అమావాస్య నుంచి ఆశ్వయుజ శుక్ల దశమి వరకూ దేవీ సప్తశతి పారాయణ చేసిన వారికి అమ్మ కృప తప్పకుండా లభిస్తుంది. విజయదశమి నాడు సాయంత్రం ఈ ప్రతిమలను నిమజ్జనం చేస్తారు.

నవమి నాడు ఆయుధపూజ చేస్తారు. విద్యార్థులు పుస్తకాల పూజ చేస్తారు. ఉత్తరాదిన తొమ్మిది రోజులూ 'రామలీలలు' ప్రదర్శించి, దశమి నాడు రావణసంహారం చేస్తారు.

**ఎవరు ఎప్పుడు పూజించారు?** : శ్రీరాముడు రావణ సంహారం చేసే ముందు వేయి కమలాలతో దుర్గాదేవిని పూజించాడు. ఎన్ని పువ్వులు తెచ్చినా ఒక పువ్వు తగ్గింది. చివరకు శ్రీరాముడు కమలాల లాంటి తన కన్నులలో ఒక కన్ను తీసి పూజ చేద్దామనుకొన్నాడు. కన్ను తియ్యబోతుండగా అమ్మ వారు ప్రత్యక్షమై, రాముడి భక్తికి చాలా సంతోషించానని చెప్పారు. "నువ్వు తప్పక రావణుణ్ణి సంహరిస్తావు" అని ఆశీర్వదించిందట.

అజ్ఞాతవాసానికి వెళ్ళే ముందు ధర్మరాజు, కురుక్షేత్ర సంగ్రామానికి ముందు అర్జునుడు దుర్గామాతను అర్చించారు.

కృతయుగంలో ఆదిపరాశక్తి ఎంతో మంది రాక్షసుల సంహారం చేసి, దుర్గా, చండీ, కాళీ మొదలైన పేర్లతో పూజలు అందుకుంది. త్రేతాయుగంలో ఈ తల్లి జనకమహారాజు ఇంట పెరిగి, సీతామాతగా పూజలందుకొంది. ద్వాపరయుగంలో రుక్మిణీదేవిగా అవతరించింది. కలియుగంలో శారదామాతగా అవతరించి, దివ్యజననిగా ఆరాధనలు అందుకుంటోంది. `



## యా దేవీ సర్వభూతేషు మాతృరూపేణ సంస్థితా ।

తల్లీబిడ్డల సంబంధంలో ఉన్న పవిత్రతను చక్కగా పోషించి, శాక్తేయ సిద్ధాంతానికి పుష్టిని కలిగించిన మహనీయుడు శ్రీరామకృష్ణ పరమహంస. కాళీమాతను ఆరాధించి, ఆమె నుంచి సర్వానుభవ సంపదను పుణికిపుచ్చుకున్నారు. ఆయన భక్తుల్లో భక్తుడై, జ్ఞానుల్లో జ్ఞానియై, వేదాంతులలో వేదాంతియై ఎన్ని సాధనలు చేసినా, ఎంతమంది దేవతలను దర్శించినా, తన ఆరాధ్య దైవమైన జగన్మాతను మాత్రం వదలలేదు.

సామాన్యంగా భక్తుల జీవితంలో భగవంతునితో వియోగం కలిగి, వారు అప్పుడప్పుడు దుఃఖాన్ని అనుభవిస్తారు. కానీ పసితత్త్వంతో కాళీమాతను బంధించిన రామకృష్ణులకు వియోగమే లేదు. అంతా ఆనందమే! ఇది శ్రీరామకృష్ణుల మాతృ ఉపాసనలోని ప్రత్యేకత!

కాళీమాత ఆరాధనతో, భైరవీ బ్రాహ్మణి చే ఉపదేశింపబడిన తంత్ర సాధనతో, కన్నతల్లి యందలి గౌరవ భావంతో, ధర్మపత్ని శ్రీ శారదాదేవిని అలౌకిక దృష్టితో వీక్షించి ఆమెను జగజ్జననిగా అర్చించారు. సమస్త స్త్రీలలో జగన్మాతను దర్శించిన శ్రీరామకృష్ణులు సాధకులకు సర్వదా సంస్మరణీయులు. `



# పరమేశ్వరుని పరిరక్షణలో ...

## స్వామి జపానంద స్వీయ అనుభవాలు -16

(గత సంచిక తరువాయి...)

# మానవత్వం గోచరించిన క్షణాలలో...



**ఒ**కసారి సన్న్యాసి హిమాలయ ప్రాంతాలలో పర్యటిస్తూ తెహరీ గఢ్‌వాల్ వెళుతున్నారు. కొండల్లోని అడవుల్లో తిరుగుతూ ఆయన దోవ తప్పిపోయారు. ఆ అడవిలో ఒక కుగ్రామమైనా కనిపించలేదు. మానవ మాత్రుడెవరూ ఎదురవలేదు. ఆ అడవుల్లో తిరుగుతూ జోళ్ళు చిరిగిపోయిన కారణంగా వాటిని పారవేశారు. కాలిబాట మీద, రాళ్ళ మీద జోళ్ళు లేకుండా నడవడంతో కాళ్ళు చెక్కుకుపోయాయి. పాదాల కింద చర్మం మంట పెడుతోంది. అంతకు పూర్వం ఆయన ఎప్పుడూ చెప్పులు, జోళ్ళు లేకుండా నడవలేదు. అందుకని నడక చాలా కష్టంగా ఉంది. సాయంకాలమయ్యేసరికి రెండు కాళ్ళూ బొబ్బలెక్కి వాచిపోయాయి. ఏమిటి చెయ్యడం అని ఆలోచించి తన భుజం మీద ఉన్న అంగవస్త్రం చింపి, నీటిలో తడిపి రెండు కాళ్ళకూ కట్టులా కట్టి కష్టపడి నడవసాగారు.

అడవిలోనే వనవిభాగం వాళ్ళు సగం కట్టిన గది ఒకటి కనబడింది. అక్కడే రాత్రి గడుపుదామని నిశ్చయించారు. దట్టమైన అడవిలో ఉన్న ఆ గది పక్కనే ఒక కొండవాగు ప్రవహిస్తోంది. వాతావరణం ప్రశాంతంగా ఉన్నా, భోజనం లేక ఆకలితో నీరసం కమ్ముకుంది. పైగా కాళ్ళలో మంట. అక్కడే అడవిలో ఎండు పుల్లలతో నిప్పు చేసుకొని కాళ్ళు కాచుకున్నారు. అలా కాచుకుంటే వాపు తగ్గుతుంది అనుకున్నా, ఏమీ లాభం లేక పోయింది. మంచి నీటితోనే కడుపు నింపుకున్నారు. కడుపు నొప్పి కూడా వచ్చింది. అలాగే రాత్రంతా గడిపారు.



ఉదయం లేచి తడిగుడ్డ కట్టుతోనే నదీ తీరం వెంబడి కుంటుతూ కష్టపడి నడక ప్రారంభించారు. మధ్యాహ్నం అవుతూ ఉండగా దూరంగా ఒక గుడిసె కనిపించింది. అక్కడ ముగ్గురు నలుగురు స్త్రీ పురుషులు తొమ్మిదో పదో సంవత్సరాల వయస్సున్న ఒక బాలుడు ఉన్నారు. వాళ్ళు ఎడ్ల సాయంతో ధాన్యం నూరుస్తున్నారు. సన్న్యాసిని చూసి వాళ్ళు భక్తిపూర్వకంగా నమస్కారం చేశారు. "ఈ మార్గంలో ఎవరూ వెళ్ళరు. మీరు ఎక్కడ నుంచి వచ్చారు? రాత్రి ఎక్కడ గడిపారు? ఈ అడవిలోకి ఎలా వచ్చారు? నిన్నంతా ఎక్కడ ఉన్నారు?" అంటూ ప్రశ్నల వర్షం కురిపించారు.

జరిగినదంతా సన్న్యాసి ద్వారా తెలుసుకొని, వాళ్ళు చాలా బాధపడ్డారు. "మీరు ఇక్కడే ఉండి, మాతో కలిసి భోజనం చేసి వెళ్ళండి. మా గ్రామం ఇక్కడకు దగ్గరలోనే ఉంది" అన్నారు. "గ్రామం ఎంత దూరం?" అని సన్న్యాసి అడిగితే "సుమారు ఒకటిన్నర క్రోసు దూరం ఉంటుంది" అన్నారు. 'తెహరీ వెళ్ళే మార్గంలోనా' అని అడిగితే, 'కాదు ఇంకా దూరంగా ఉంది' అన్నారు.

తరువాత ఆ బాలుడితో "నువ్వు త్వరగా ఇంటికి వెళ్ళి గోధుమ పిండి తీసుకుని రా!'' అని పురమాయించారు. ఆ బాలుడు అంత దూరం కొండ ఎక్కి గ్రామానికి వెళ్ళి పిండి తీసుకొని వచ్చాక వాళ్ళు వంట చేసి భోజనం పెడతారు. అప్పటికే మధ్యాహ్నం అయింది. గోధుమ పిండి తీసుకుని ఆ బాలుడు ఇక్కడికి వచ్చేసరికే సాయంత్రం అవుతుంది. అంత వరకూ ఇక్కడ ఆగడం ఎందుకు అనిపించి వాళ్ళకు ధన్యవాదాలు చెప్పి, వాళ్ళను ఆశీర్వదించి సెలవు తీసుకుని తెహరీ మార్గంలో సన్న్యాసి ప్రయాణం సాగించారు.

వాళ్ళు సన్న్యాసికి పక్క గ్రామానికి దోవ చెబుతూ, "నది పక్క నుంచి నడిచి వెళ్ళండి. తరువాత కొండ పైకి కొంత నడవండి. పైకి వెళ్ళే ముందు కమండలం నిండా నీరు నింపుకోవడం మర్చిపోవద్దు. ఆ తరువాత నీరు దొరకదు" అని చెప్పారు. ❑

(మిగతా వచ్చే సంచికలో...)

అనువాదం : శ్రీమతి జి.ఎస్. లక్ష్మి

# అత్యాశకు పోతే అశాంతే! - భాస్కర పంతులు

గోవిందయ్య పరమ లోభి. అయినా, లాభం వస్తుందంటే మాత్రం ఎంత పెట్టుబడైనా పెట్టగలడు. ఎంత ఖర్చు అయినా వెనుకాడడు.

ఒక రోజు ఆ ఊరి పొలిమేరలో ఉన్న దేవాలయంలోకి ఒక సాధువు వచ్చాడు. ఎప్పుడూ దేవుడికి కనీసం దండం కూడా పెట్టని గోవిందయ్య, భార్యతో సహా సాధువు దగ్గరకు బయలుదేరాడు. ఆశ్చర్యంతో భార్య ఆ విషయమే అడిగింది.

"ఓసి పిచ్చిమొగమా! ఆ గుడిలో బస చేసిన సాధువుకు బోలెడన్ని మహిమలున్నాయట. ఆయన చెప్పినట్లు చేస్తే చాలు, మనల్ని మెచ్చి, కోరిన వరాలు ఇస్తాడట. ఎంత ఖర్చైనాసరే మనం ఆ సాధువును మెప్పించి వరాలు దండుకోవాలి" అన్నాడు గోవిందయ్య.



గుడిలో సాధువు 'ధర్మాచరణ' గురించి చెబుతూ ఉంటే, ఆయన దృష్టి తన మీద పడేలా ముందు వరుసలో చక్కగా కూర్చొని, శ్రద్ధగా వింటున్నాడు గోవిందయ్య. సాధువు చెప్పడం ముగించాక, ఆయన కాళ్ళపై పడ్డాడు గోవిందయ్య. సాధువు అతణ్ణి ప్రేమగా లేవనెత్తుతూ, "నీ బోటి ధనవంతుల వల్లనే ఊరికి ఉపకారం జరగాలి" అన్నాడు.

ఆ మాటకు గోవిందయ్య మనసు పులకించిపోయింది. "సెలవివ్వండి స్వామీ! మీరు ఏమి చెప్పినా నేను చేస్తాను" అన్నాడు. "మంచిది నాయనా! ఈ ఊరి వాళ్ళు త్రాగునీటికి చాలా ఇబ్బంది పడుతున్నారు. కాబట్టి నేను చెప్పినచోట బావి త్రవ్వి, నీటి కొరతను తీర్చాలి" అన్నాడు.

గోవిందయ్య సరేనన్నాడు. పిల్లలు చదువుకునేందుకు ఓ పాఠశాల, వసతిగృహం నిర్మించాలన్నాడు సాధువు. దానికి కూడా గోవిందయ్య సరేనన్నాడు.

సాధువు చెప్పిన పనులన్నీ కొన్ని మాసాలలోనే గోవిందయ్య పూర్తిచేశాడు. ఇక సాధువు వెళ్ళిపోతాడనగా సాధువు పాదాలపై పడి, "స్వామీ! మీ మహిమల గురించి విన్నాను. నాకు రెండు వరాలు దయ చేయండి" అని గోవిందయ్య వేడుకున్నాడు.

"నీకు ఒక మంత్రం చెబుతాను. దాన్ని మూడుసార్లు మనస్సులో మననం చేసుకొని, నువ్వు ఏం కోరుకుంటావో కోరుకో! అవి ఫలిస్తాయి" అని గోవిందయ్య చెవిలో మంత్రం చెప్పి సాధువు గ్రామం వదలి వెళ్ళిపోయాడు.

ఇంటికి తిరిగివచ్చిన గోవిందయ్య ఎంతో ఉబలాటంతో సాధువు చెప్పిన మంత్రాన్ని మనస్సులో జపించి, "నా ఇల్లంతా బంగారమైపోవాలి" అనుకున్నాడు. వెంటనే గోవిందయ్య ఇల్లు, వాకిలి, కిటికీలు అన్నీ బంగారమైపోయాయి. హఠాత్తుగా గోవిందయ్య ఇల్లంతా ధగధగ మెరిసిపోవడం చూసి ఊరు ఊరంతా పరుగు పరుగున వచ్చి ఇంట్లోకి దూరసాగారు. కొంతమంది గోకి చూసి, "అరే అరే! బంగారం...!" అని ఆశ్చర్యపోతూ ఎక్కడబడితే అక్కడ గోకడం మొదలుబెట్టారు.

ఈ తతంగమంతా చూసిన గోవిందయ్య భార్య "ఇలాంటి పనా చేసేది? ఊరి జనమంతా ఇల్లు పీకి, దొరికిన బంగారమంతా పట్టుకు పోతారు. మనకు ఇల్లు కూడా దక్కకుండా పోతుంది. తొందరగా ఏదో ఒకటి చెయ్యండి'' అని గగ్గోలు పెట్టింది.

వెంటనే గోవిందయ్యకు ఏమీ పాలుపోక, 'మా కుటుంబానికి తప్ప మరెవరికీ ఈ బంగారం కనబడకూడదు' అని మనసులో తలచుకొని, రెండోసారి మంత్రం చదివాడు. అంతే ఊరి జనమంతా ఎక్కడివాళ్ళక్కడకు వెళ్ళిపోయారు. గోవిందయ్యకు, ఆయన భార్యకు ఎటు చూసినా ఇంట్లో అంతా బంగారమే. ఆ రోజు దంపతులిద్దరూ మహదానందంగా బంగారు కుర్చీలలో కూర్చొని బంగారు పళ్ళాలలో భోజనం చేసి, బంగారు చెంబులతో నీళ్ళు త్రాగారు. బంగారు మంచం మీద పడుకుని ఆనందంలో మునిగిపోయారు.

మరునాడు గోవిందయ్య ఇంటి పెరటి గోడ నుండి ఒక ఇటుకను తీసుకొని, సంచిలో పెట్టుకుని బజారుకెళ్ళి షరాబు దగ్గర అమ్మజూపాడు. షరాబు దాన్ని చూసి, "గోవిందయ్యా! నీకేమైనా పిచ్చి పట్టిందా? ఇటుక రాయిని తెచ్చి బంగారు ఇటుక అంటావా!" అని నవ్వుతూ నలుగురికీ చెప్పాడు.

అందరూ గోవిందయ్యను చూచి పగలబడి నవ్వారు. తరువాత తెలిసింది గోవిందయ్యకు తాను చేసిన తప్పేమిటో!

అదృష్టం వరించినా అత్యాశకు పోతే మిగిలేది అశాంతే!




- స్వామి సుకృతానంద

– జి.ఎస్.బాబా, ప్రొద్దుటూరు

**? : మన సంప్రదాయంలో మ్రొక్కుట, పూజించుట, అర్చించుట, ఆరాధించుట అనే పదాలకు నిర్దిష్ట అర్థాలేమిటి?**

✍: భక్తులు భగవంతుణ్ణి సాక్షాత్కారించుకోవడానికి చేసే విధానాలివి. 'పూజ'కు పర్యాయ పదాలు. భక్తి శాస్త్రాలైన నారద భక్తి సూత్రాలు, శాండిల్య మహర్షి భక్తి సూత్రాలు, ఇంకా భక్తులు, సాధకులు



వ్రాసిన ఎన్నో గ్రంథాల్లో పై పదాల వర్ణన విపులంగా ఉంది. నామ సంకీర్తనం; పూజ; నవవిధ భక్తి మార్గాలైన శ్రవణం, కీర్తనం మొదలైనవి; శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మధురాది భావాలలో ఏదో ఒక భావంతో భగవంతుణ్ణి (శ్రీహరిని) ఆశ్రయించడం – అంతా భగవత్ ఆరాధన కిందకు వస్తుంది. భక్తి రస్య భజనం, 'ఏతదిహా ముత్రోపాధినైరాశ్యే నాముష్మిన్ మనఃకల్పమ్ (గోపాల పూర్వతాపన్యుపనిషత్తు) భగవత్సేవే పూజ = భక్తి.

భావం: ఇహలోక పరలోక సుఖాదులనేవి కోరకుండా భగవంతునిపై మనస్సు లీనం చేసేలా ఉండాలి– అదే ఆరాధన, పూజ, మ్రొక్కడం, అర్చించడం.

– వై. అప్పారావు, అనకాపల్లి

**? : మనం వ్యవహారాల్లో చెప్పుకొనే దానం, ధర్మం అనే పదాలకు భేదం ఉందా? వివరించ మనవి.**

✍: యజ్ఞయాగాదుల్లో, బృహత్ పూజల్లో, ఉత్సవాల్లో అన్నదానం, గోదానం, భూదానం – ఇలా సంపదను పేదవాళ్ళకు ఇవ్వడం ఆచారం. ధర్మరాజు రాజసూయ యాగంలో తన సంపదనంతా దానం చేశాడు. కర్ణుడు దానకర్ణుడిగా ఖ్యాతి పొందాడు. ద్రవ్య త్యాగాన్ని 'దానం' అంటారు. 'మహానారాయణోపనిషత్తు'లో దానం, ధర్మాల్ని విడివిడిగా వివరించారు. దానం అనే పదం కన్నా ధర్మం అనే పదానికి విస్తృతమైన అర్థం ఉంది. ధర్మం అంటే సత్యం కూడా! ధర్మపరుడే సత్యవంతుడు కాగలడు. యాచకుడు వచ్చి, 'ధర్మం చెయ్యండి బాబూ!' అంటే సామాన్య అర్థంలో దానానికి పర్యాయ పదంగా వాడుతున్నట్లు లెక్క.

పోతపోసిన ధర్మమే రాముడు అని "రామో విగ్రహవాన్ ధర్మః" అని రామాయణంలో వాల్మీకి అన్నాడు. మహావిష్ణువును 'ధర్మః', 'ధర్మకృత్' అని విష్ణు సహస్రనామాలు చెబుతున్నాయి. వర్ణాశ్రమ ధర్మాలు అనేకం. సామాన్య ధర్మాలు అందరూ పాటించాలి. ధర్మం ద్వారానే మోక్షం లభిస్తుంది. యుద్ధ ధర్మం, వ్యాపార ధర్మం అని వ్యవహరించడం చూస్తున్నాం. కర్తవ్యాలను ధర్మాలంటారు. వేదాలు, ఇతిహాసాలు, పురాణాల్లో వివరించిన పుణ్య కార్యాలు: చెరువులు, బావులు తవ్వించడం, రహదారి పక్కన చెట్లు నాటడం, యాత్రికులకు సత్రాలు కట్టించడం, ఆసుపత్రులు కట్టడం, విద్యాబుద్ధులు చెప్పడం



అన్నీ ధర్మకార్యాలే. ధర్మకార్యాలు చేసే వాడిని సమాజం ఆశ్రయిస్తుంది. ప్రాయశ్చిత్తంగా చేస్తే పాపాలు నశిస్తాయి. నిష్కామకర్మతో చేస్తే మోక్షం లభిస్తుంది.

"ధర్మం భజస్వ సతతం త్యజలోకధర్మాన్" అని పద్మ పురాణం వివరిస్తోంది. లోకాచారాలను వదిలిపెట్టి, ఎల్లప్పుడూ ధర్మాన్నే సేవించు అని దాని అర్థం. నిష్కపటంగా ఉండడం ధర్మం. "ఆర్జవం ధర్మమిత్యాహుః" అని ఇతిహాసాలు చెబుతున్నాయి. "నాస్తి సత్యాత్పరో ధర్మః ... శ్రుతిర్హి సత్యం ధర్మస్య..." సత్యవాక్పరిపాలనను మించిన ధర్మం లేదు. సత్యంపైనే ధర్మం ఆధారపడి ఉంది. దీనికి వేదాలే ప్రమాణమని మహాభారతంలోని శాంతిపర్వంలో భీష్మ ఉవాచ. ధర్మమైనదే ఋతం అని శ్రుతుల మాట. ప్రపంచం సర్వం ధర్మంపైనే ఆధారపడి ఉంది!

-స్వామి వివేకానంద

# భ్రమలకు మూలం!



మనిషి నీతిమంతుడిగా, పవిత్రుడిగా ఎందుకు ఉండాలి? ఎందుకంటే అది అతడి ఇచ్ఛాశక్తిని బలపరుస్తుంది కాబట్టి. సహజ ప్రకృతిని బహిర్గతం చేస్తూ, ఇచ్ఛాశక్తిని బలవత్తరం చేసే ప్రతి పనీ నైతికమైనదే. తద్విరుద్ధమైనదంతా అవినీతి. అయినా నైతికత, దాని ప్రమాణం దేశానుగుణంగా, వ్యక్తులను బట్టి మారుతుంది. మానవుడు నియమాల, మాటల బానిసత్వం నుండి ముక్తుడు కావాలి. మన కిప్పుడు 'ఇచ్ఛా' స్వాతంత్ర్యం లేదు. కానీ మనం స్వతంత్రులమైనప్పుడు మనకు అది కలుగుతుంది. ఇంద్రియలోలత వల్లనే క్రోధం, దుఃఖం కలుగుతున్నాయి. విషయవాసనల వల్ల ఉద్రిక్తుడయ్యే మానవుడు పశువుతో సమానం. కాబట్టి మీరు త్యాగభావంతో పూర్ణులవండి.

"ఒకప్పుడు నాకు దేహమున్నది. నేను పుట్టాను. సంసార సాగరంలో కొట్టుకొని మరణించాను" – ఇలాంటి ఆలోచనలు ఎంత భయంకరమైన (మతి) భ్రమలు! మోక్షం కోసం విలపిస్తూ శరీరబద్ధుణ్ణై ఉన్నానని తలంచడం, ఎలాంటి ఊహ!

కానీ త్యాగం చెయ్యాలంటే అంతా సన్న్యాసులు కావాలా? అలా అయితే ఇతరులకు సహాయం చేసేది ఎవరు? త్యాగం సన్న్యాసం కాదు. దారిద్ర్యం పవిత్రతకు పర్యాయపదం కాదు, త్యాగం మానసికం. అదెలా కలుగుతుంది?

ఒకసారి ఎడారిలో నాకు దాహం కలిగినప్పుడు ఒక తటాకాన్ని చూశాను. అది అందమైన ప్రకృతి దృశ్యాల మధ్య ఉంది. దాని చుట్టూ వృక్షాలున్నాయి. వాటి నీడలు తలక్రిందులుగా ఆ నీటిలో కనబడుతున్నాయి. కానీ అదంతా ఎండమావుల దృశ్యమే! ఒక నెల రోజుల పాటు ప్రతిరోజూ నేను ఎండమావుల్ని చూసినప్పుడు అవి తటాకము కాదనే నిజాన్ని తెలుసుకోగలిగాను. కాబట్టి మనం భగవంతుణ్ణి తెలుసుకున్నప్పుడు ఎండమావుల్లాంటి ఈ విశ్వం, దేహం మొదలైనవి భ్రమలనీ భగవంతుడు మాత్రమే సత్యమనీ మనకు తెలుస్తుంది.



# దేవీ వైభవం

ప్రవచనం: శ్రీ సామవేదం షణ్ముఖశర్మ విలేఖనం: శ్రీమతి ఎన్. శేషు

(గత సంచిక తరువాయి)

అమ్మ మనల్ని అనుగ్రహించడానికి రూపం ధరించింది. ఆ రూపం పేరు సుందరి. ఒక్కచోట మాత్రమే పరిమితమైన సుందరి కాదు ఆమె. త్రిపురముల యందూ వ్యాపించిన సుందరి. త్రిపురాలకూ అతీతంగా ఉన్న సుందరి. ఆమెను మించిన లావణ్యం, లాలిత్యం లేదు కనుక లలితా త్రిపురసుందరీ స్వరూపమే ఈ కామాక్షీదేవి స్వరూపం. ఆమెను కీర్తిస్తూ మహాకవి కాళిదాసు 'శ్యామలా దండకం'లో మనల్ని మణిద్వీపం వైపు తీసుకొని వెళతాడు. అక్కడ శ్యామలాంబికను దర్శింపజేస్తారు. అమ్మ గురించి 'త్రిపుర భారతీ స్తవము' అని రచించారొకరు. అది ఎవరు రచించారో తెలియదు. ఎందుకంటే మన దేశంలోని సాహిత్యాలను ఇచ్చిన వారు ఋషులు. వాళ్ళు నామ రూప అహంకారాదులు విడిచి పెట్టిన వారు. ఈ నామ రూపాలకు అతీతమైన పరతత్త్వంతో తన్మయమై రచించారు. కనుక భారతీయుడైన ప్రతి కవీ ఒక ఋషే. ఈ 'త్రిపుర భారతీస్తవం' కాళిదాసు రచించాడంటారు. దీనికే 'సిద్ధసారస్వత స్తోత్రం' అని పేరు. ఇందులో ఒక్క శ్లోకం చదివినా చాలు, దాని మహిమ అంతా ఇంతా కాదు. దీని నిండా అమ్మవారి వైభవాన్ని విస్తారంగా చెప్పారు. అలాగే 'చర్చా స్తవం' అని మరొకటి ఉంది. వీటన్నిటినీ కలిపి 'శ్రీదేవీ పంచస్తవి' అంటారు. ఇలాగ మనకు అనేక స్తోత్ర వాఙ్మయాలు అమ్మవారి గురించి చెబుతూ ఉన్నాయి. దుర్వాసుడు 'లలితా హృదయం' అని మరొక గొప్ప స్తోత్రం రచించాడు. శంకర భగవత్పాదులు అందించిన అమ్మ వారి స్తోత్రాలు అసంఖ్యాకం. ఎన్ని రూపాల్లో అమ్మ వారిని కీర్తించారో! ఒక్క 'సౌందర్య లహరే' కాదు. ఎన్నో అష్టకాలున్నాయి. 'ఆనంద లహరి' ఉంది. అనేక రకాలైన స్తోత్రాల్లో శక్తి తత్త్వాన్ని ఆయన బహువిధాలుగా భాసింపజేశారు.

'సిద్ధ సారస్వత స్తోత్రం' కాళిదాసు రచించాడంటారు. అందులో ఆయన త్రిపుర అనే మాటకు అర్థం చెప్పారు.

*'దేవానాం త్రితయం త్రయీం హుతభుజాం శక్తి త్రయం*
*త్రిస్వరాస్త్రైలోక్యం త్రిపదీ త్రిపుష్కర మథః త్రిబ్రహ్మ వర్ణాస్త్రయః*
*యత్కించిత్ జగతిత్ త్రిధా నియమితం వస్తు త్రివర్గాత్మకం*
*తత్ సర్వం త్రిపురేతి నామ భగవత్యన్వేతి తే తత్త్వతః'*

దేవానాం త్రితయం = ముగ్గురు దేముళ్ళు - బ్రహ్మ విష్ణు రుద్రులు, వాళ్ళు చేసేవి మూడు పనులు సృష్టి స్థితి లయలు; వాళ్ళు నియమించేవి మూడు గుణాలు - సత్త్వ రజ స్తమో గుణాలు;

త్రయీం అంటే వేదం అని అర్థం - నాలుగు వేదాలూ కూడా త్రయీ అనే శబ్దంతో చెప్పబడుతుంటాయి. ఎందుకలా అంటే వేద మంత్రానికీ మూడు అర్థాలుంటాయి. అవి - ఆధి భౌతికార్థం, ఆధి దైవికార్థం, ఆధ్యాత్మికార్థం. నాలుగు వేదాలలోని మంత్రాలన్నీ ఈ మూడు రకాల అర్థాలూ చెబుతాయి కనుక నాలుగు వేదాలకీ కలిపి 'త్రయీ' అని పేరు. అందుకే 'త్రయీం' అంటే వేద విద్య.

'హుత భుజాం' (అంటే అగ్నులు) ఆహుతులను భుజించే అగ్ని అని అర్థం. మండే ప్రతీ మంటా అగ్ని హోత్రం కాదు. ఏ అగ్ని ద్వారా మనం దేవతలను ఆరాధిస్తామో ఆ అగ్ని పేరు అగ్నిహోత్రం. గృహస్థుడైనవాడు అగ్నిని - ఆహవనీయాగ్ని, గార్హపత్యాగ్ని, దక్షిణాగ్ని - అనే అగ్ని త్రయంతో ఆరాధిస్తాడు.

తరువాత శక్తి త్రయం. అమ్మవారు ఈ విశ్వాన్ని మూడు శక్తులతో నడుపుతున్నారట. అవి - ఇచ్ఛ, జ్ఞాన, క్రియ. ఏ పనికైనా ముందు చెయ్యాలన్న ఇచ్ఛ ఉండాలి, ఎలా

చెయ్యాలన్న ఎరుక (జ్ఞానం) ఉండాలి. ఆ తరువాత క్రియ – చెయ్యడమనేది ఉండాలి. అప్పుడు పని పూర్తవుతుంది. అలా ఆ జగత్ వ్యాపక చైతన్యం ఇచ్ఛా జ్ఞాన క్రియాత్మకంగా పనిచేస్తుంది. పరమేశ్వరునికి ఇచ్ఛా జ్ఞాన క్రియలుంటేనే జగత్తు వస్తుంది. అలాగే చిన్న చీమకు కూడా ఇచ్ఛా జ్ఞాన క్రియ ఉండాలి. అమ్మ ఎలా విశ్వమంతా వ్యాపించి ఉన్నదో దీనిని బట్టి అర్థమవుతుంది. శివుడిలోనూ ఇచ్ఛా జ్ఞాన క్రియలు అమ్మే! చీమలోనూ ఇచ్ఛా జ్ఞాన క్రియలు అమ్మే! "పిపీలికాది బ్రహ్మ పర్యంతం" అంటే ఇదే! మొత్తం వ్యాపించి ఉన్నది ఆ తల్లే. ఆయన స్థితిలో పని వేరు– అది సర్వజ్ఞత; చీమ స్థితిలో పని వేరు–ఇది కించిజ్ఞత. శక్తి ఒక లాగే వ్యాపించి ఉంది స్థితి తేడా కానీ! ఆ చైతన్యమే ఇచ్ఛా జ్ఞాన క్రియాత్మకంగా వ్యాపించి ఉంది కనుక శక్తి త్రయం. తరువాతిది–త్రిస్వరాః =మూడు స్వరములు. వేద మంత్రాలకు ఉదాత్త, అనుదాత్త, స్వరితాలనే మూడు స్వరాలున్నాయి.

తరువాత త్రైలోక్యం – భూ భువః సువర్లోకాలనే మూడు లోకాలు. తరువాత చెప్పిన త్రిపదీ అనే మాటకి అనేక మంది వ్యాఖ్యాతలు అనేక విధాలుగా వ్యాఖ్యానించారు. త్రిపది అంటే స్వర్గ మర్త్య పాతాళ లోకాలు అని నిర్వచనం ఇచ్చారు. మరొక అర్థం ఏమిటంటే మన శరీరంలో ఓఢ్యాణపీఠం, జాలంధర పీఠం, కామగిరి పీఠం అని మూడు ముఖ్య పీఠాలున్నాయి. ఆ మూడు పీఠాల యందు ఉన్న తల్లి కనుక త్రిపదీ అంటాం.

త్రిపుష్కరః – పుష్కరం అనే మాటకి కూడా రెండు అర్థాలున్నాయి. పుష్కరం అంటే నదీ ప్రవాహం, సరస్సు మొదలైన అర్థాలున్నాయి. పవిత్ర తీర్థానికి పుష్కరం అని అర్థం. త్రిపుష్కరములంటే గంగ, యమున, సరస్వతి అని చెప్పబడేవి. అయితే యోగపరంగా నిర్వచనం చెబుతూ, పుష్కరం అంటే మనలో ఉండే ఇడా, పింగళా, సుషుమ్న నాడులూ, మన శరీరంలో ఉండే చైతన్య ప్రవాహనాడులు. పుష్కరం అంటే పద్మం అని అర్థం. మనం ప్రధానంగా ధ్యానం చెయ్యవలసిన మూడు చక్ర స్థానాలు ఇందులో చెప్పబడుతున్నాయి – అనాహత, విశుద్ధ, ఆజ్ఞా చక్రాలు. అథః త్రిబ్రహ్మః వర్ణాస్త్రయః– అకార ఉకార మకారాత్మకమైన ప్రణవం ఇక్కడ చెప్పబడుతోంది. ఇలా చూస్తూ ఉంటే ఈ సృష్టిలో ఏది తీసుకుంటున్నా మూడు విధాలుగా నియమింపబడి ఉంది. అలాగే మనం ఏ వస్తువును చూసినా అది మూడు వర్గాలతో కూడుకొని ఉంది. త్రివర్గాత్మకం అన్నారు. ధర్మ, అర్థ, కామాలు త్రివర్గాలు. ఈ మూడింటికీ అతీతం తురీయం మోక్షం. మోక్షం నాలుగో పురుషార్థం అంటే తురీయావస్థకు చెందినది. కానీ ఇంతవరకూ చెప్పిన "త్రి" కి చెందినవి ధర్మ అర్థ కామాలు. అమ్మవారు ఈ విధంగా మూడింటిలో ఉన్నారు. ఈ మూడూ కానిది జగత్తులో ఏదైనా ఉందా?

త్రిపురసుందరి అనే జగదంబిక "అయ్యా! ఈ త్రిపురాలతో నువ్వు బ్రతుకుతున్నావు" అని చెప్పింది. త్రిపురసుందరి మనలోనే ఉంది. ఆ త్రిపురాలలో సౌందర్యం ఆ తల్లి అని తెలుసుకోక అదంతా నా నిర్వాకమే అనుకుంటున్నామే... అది అహంకారం. అహంకారం ఉంటే ఆసురీభావం వస్తుంది. దేవతలందరూ అహంకరించినప్పుడు పరమేశ్వరుడు వీళ్ళను ఇలా వదిలేస్తే వీళ్ళూ అసురలయిపోతారని అన్నాడు. అందుకు అహంకారాన్ని మనం పెంచి పోషిస్తే అది రాక్షసుడై కూర్చుంటుంది. త్రిపురాలలో అహంకారం అనే అసురత్వం పెరిగి త్రిపురాసురుడవుతాడు. ఈ త్రిపురాసురభావం వల్ల మనం త్రిపురసుందరిని తెలుసుకోలేక పోతున్నాం. ధ్యాన మార్గాన్ని అవలంబించి ఈ చైతన్యమంతా ఏ పరాశక్తిదో ఆ పరాశక్తికి నమస్కారం అనగానే ఆ పరాశక్తి ఎవరిదో ఆ పరమేశ్వరుడు గురు స్వరూపంగా మనల్ని అనుగ్రహించి మన త్రిపురాలలో ఉన్న అహంకారాన్నీ పోగొడతాడు. అందుకే దేవతలు అహంకారంతో కొట్టుకుంటూ ఉంటే ఆయన వచ్చారు. ఆయన పేరే త్రిపురాసుర సంహారుడు. ఆయన వస్తే సుందరి వస్తుంది. ఆ సుందరి వస్తే ఆయన ఎవరో చెబుతుంది. అంతా ఆ కథలోనే ఉంది. ఆ కథను ఆలోచిస్తే చాలు మన జీవితమంతా మనకు అందులోనే కనిపిస్తుంది.

అహంకారం పోగొట్టడానికే పరమేశ్వరుడు యక్షుని రూపంలో వచ్చాడు. మనం శివపంచాక్షరీ స్తోత్రం చదువుతూ "యక్ష స్వరూపాయ జటాధరాయ, పినాక హస్తాయ సనాతనాయ, దివ్యాయ దేవాయ దిగంబరాయ, తస్మై యకారాయ నమః శివాయ" అన్నప్పుడు యక్షస్వరూపాయ అంటే కేనోపనిషత్‌లో వర్ణించిన శివుని యక్ష స్వరూపమే. ఆ యక్షుడు అజ్ఞానం పోగొట్టడానికి వచ్చాడు. తరువాత తానే అమ్మ రూపంలో కనిపించి ఆయన శక్తిని నేను అని చెప్పారట. అందుకు అమ్మ విషయంలో పరమేశ్వరుడు గురువయ్యాడు; అయ్య విషయంలో అమ్మ గురువయ్యింది. వారిద్దరూ ఒకరికొకరు గురువులు. ఇది తెలిశాక మన అహకారం పోగొట్టు కోవడానికి "శివాయ గురవేనమః" అని ఆశ్రయిస్తే ఆ గురువు వచ్చి ఈ త్రిపురాసురత్వాన్ని (త్రిపుర అసురత్వాన్ని) సంహరిస్తాడు. త్రిపురాసుర సంహారకుడు శివుడు, త్రిపుర సుందరి ఆమె, త్రిపురాసురులం మనం. (సశేషం)

# ఆ వెయ్యవ భక్తుడెవరు?

కథ: రేవతి    చిత్రాలు : శంకర్    తెలుగుసేత : స్వామి జ్ఞానదానంద

1




2 ఒక భవనంలో నిత్యం వేయి మంది శివభక్తులకు విందు భోజనాలకు ఏర్పాట్లు జరిగాయి. మొదటి రోజున...




3



4

నా ఆహ్వానాన్ని మన్నించి విచ్చేసిన మీకందరికీ నా ధన్యవాదాలు. ఇది నా భాగ్యం. శివభక్తులారా! మీరందరూ నన్ను ఆశీర్వదించండి!

మహారాజా! మీ శివభక్తి మిమ్మల్నీ, మీ వంశాన్నీ రక్షించుగాక! పరమేశ్వరునికి జయమగుగాక!

సర్వేశ్వరునికి జయమగుగాక!

5

మహామంత్రీ! ఏం జరిగింది?.

మహారాజా! ఇది ఎలా జరిగిందో తెలియడం లేదు! విందులో 999 శివభక్తులు కూర్చొని ఉన్నారని మీకు చెప్పాను కదా! కానీ ఇప్పుడు వేయిమంది భోజనం చేస్తున్నారు. సరిగ్గా లెక్కపెట్టిన తరువాతే వారిని లోపలకు అనుమతించాను!

అయితే మనం అనుకున్నట్లు వెయ్యి మంది భక్తులు భోజనం చేశారు! ఇది కూడా ఆ పరమశివుని కృపాకటాక్షమే!

6

మరుసటి రోజు...

మంత్రీ! ఈ రోజు ఎందరు శివభక్తులు వచ్చారు?

999 మంది భక్తులు మాత్రమే! నేనే లెక్కించి వారిని లోపలకు పంపాను. లెక్క తప్పకూడదని ఇవిగో! వెయ్యి తాంబూలాలు కూడా తయారుగా ఉంచాను. శివభక్తులు తిరిగి వెళ్ళేటప్పుడు నేనే వారికి ఇస్తూ లెక్కపెడతాను!

ఇప్పుడు లోపలకు వెళ్ళి ఒక అరటి ఆకు ఖాళీగా ఉందేమో నేనే చూసి వస్తాను! నువ్వు కూడా నాతో రా!

7

ఆశ్చర్యం! వెయ్యి ఆకులలో వెయ్యి మందీ కూర్చొని భోజనం చేస్తున్నారే!

ఇది అద్భుతంగా ఉందే! నేనే స్వయంగా లెక్కపెట్టి వారిని లోనికి పంపాను. నా స్నేహితుడు కూడా మరొకసారి లెక్క సరిచూశాడు. లెక్క తప్పడమన్నది అసంభవం.

8

సరే! భోజనాలయ్యాక భక్తులందరికీ నేనే తాంబూలాలు ఇస్తాను.

సరిగ్గా వెయ్యి తాంబూలాలు లెక్కపెట్టి ఉంచాను మహారాజా!

భోజనాలయ్యాక ద్వారం వద్ద మహారాజు భక్తులందరికీ తాంబూలాలు ఇస్తూ ఉంటే ఆయన్ని భక్తులు ఆశీర్వదించి వెళ్ళారు.

మిగతా 36వ పేజీలో...

# పుష్పార్చన

- రెంటాల జయదేవ

పూజ, అభిషేకం, వ్రతం - ఇలా ఏది చేసినా పుష్పాలతో దేవుణ్ణి అర్చించడం అందులో భాగం. అది మనం నిత్యం చూసేదే, చేసేదే! ఇలా ఆధ్యాత్మికమైన ప్రతి పూజలో పుష్పాలకు ప్రముఖ స్థానం ఉంది. పుష్పాలతో అర్చించడంలో ప్రాధాన్యం ఏమిటో తెలుసుకుందాం.

'శ్రీమద్భగవద్గీత'లో శ్రీకృష్ణ భగవానుడు ఇలా చెప్పాడు:

**పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి।**
**తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః ॥ (9-26)**

'భక్తిపూర్వకంగా, పరిశుద్ధమైన మనస్సుతో ఎవరైతే నాకు (భగవంతుడికి) ఒక పత్రాన్ని కానీ, ఒక పుష్పాన్ని కానీ, ఒక ఫలాన్ని కానీ, కొద్దిపాటి జలాన్ని కానీ సమర్పిస్తారో అలాంటి వారు సమర్పించిన ఆ భక్తి నైవేద్యాన్ని తృప్తిగా ఆరగిస్తాను.'

దీన్ని బట్టి భగవంతుడికి భక్తితో ఒక్క పుష్పాన్ని సమర్పించినా, ఆయన అనుగ్రహం పొందవచ్చని అర్థమవుతోంది.

### పువ్వులు ఎలా కోయాలి?

అయితే, భగవంతుడికి ఎలాంటి పుష్పాలను నివేదించాలి, ఏ పూలు పూజకు పనికొస్తాయన్నది ప్రశ్న. అశౌచులైన వారు పుష్పాలను తాకకూడదు. అలాంటి వ్యక్తులు తాకిన పూలు పూజకు పనికి రావు. అలాగే, నేలపై పడిపోయిన పూలు, వాసన చూసిన పూలు, కడిగిన పుష్పాలను పూజకు ఉపయోగించకూడదు. అదేవిధంగా, ఎడమ చేతితో కోసిన పత్రాలనూ, పుష్పాలనూ పూజా కార్యక్రమాలకు ఉపయోగించరాదు.

చెట్టు నుంచి పువ్వులు కోసుకొస్తున్నప్పుడు పూల సజ్జ లాంటి వాటిని వేటినైనా వినియోగించాలి. అంతేకానీ, ఒంటి మీద ధరించిన వస్త్రంలో వేసుకొని రాకూడదు. అలా వేసుకొని వచ్చిన పుష్పాలను పూజా కార్యక్రమాలకు ఉపయోగించ కూడదు. స్నానం చేసి, శుచి అయిన తరువాత కోసిన పత్ర పుష్పాలనే దైవ పూజా కార్యక్రమాలకు ఉపయోగించాలి. వాడిపోయినవి, కళా విహీనమైనవి, దుర్గంధమైనవీ అయిన పుష్పాలను పూజకు వాడకూడదు. అలాగే, ముళ్ళున్న పుష్పాలు, అపరిశుద్ధమైన స్థలాల్లోని మొక్కలకు పూసిన పూలు పూజలకు అనర్హం.

### పువ్వులు ఎలా తేవాలి?

**పుష్పం వస్త్రేన బధ్నీయాత్**
**శిరసా న వహేద్బుధః ।**
**నయేత్పత్ర పుటేనైవ**
**పాణినా - లంబ్య వాగ్యతః ॥**

(పుష్పసార సుధా నిధౌ)

'పువ్వులను వస్త్రంతో మూట కట్టకూడదు. పండితుడైనవాడు వాటిని శిరస్సున పెట్టుకోకూడదు. ఆకు దొన్నెలో ఉంచుకొని, చేతితో పట్టుకొని మౌనంగా తీసుకురావాలి.'

### వాసన లేకున్నా వాడదగ్గ పూలు

**నిర్గంధ పుష్ప జాతీషు పలాశ కుసుమై రపి ।**
**జపా బంధూక పుష్పైశ్చ మందారై రపి పూజయేత్ ॥**

(స్వచ్ఛంద సారే)

'వాసన లేనివి అయినప్పటికీ మోదుగు పూలు, దాసాని పువ్వులు (దాసెన), మంకెన పువ్వులు, మందారాలను పూజకు ఉపయోగించవచ్చు.'

### పూజకు పనికిరాని పూలు

పూజకు పనికిరాని పువ్వుల గురించి మన శాస్త్రాలు ఇలా చెప్పాయి:

**మలినం తను సంస్పృష్ట మాఘ్రాత మవికాసితమ్ ।**
**అశుద్ధ భాజనానీతం క్రయానీతం చ యాచితమ్ ॥**
**శుష్కం పర్యుషితం కృష్ణం భూమిగం నార్చయేత్సుధీః ।**
**అపక్వాని చ పుష్పాణి శివాయ న నివేదయేత్ ॥**
**వస్త్రానీతం కరానీతం ఏరండేంద్ర సముద్భవం ।**
**స్వయం వాయ్వాది గళితం పత్రం పుష్పం పరిత్యజేత్ ॥**

(రుద్రకామ్యార్చన విధౌ, స్మృత్యంతరే)

'మలినములైవీ, ఒంటితో తాకినవీ, వాసన చూసినవీ, వికసించనివీ, అపవిత్ర పాత్రలో ఉంచినవీ, కొని తీసుకువచ్చినవీ, యాచించి తెచ్చినవీ, ఎండినవీ, కుళ్ళినవీ, నేల మీద పడినవీ అయిన పత్ర పుష్పాలతో శివుణ్ణి పూజించ కూడదు. అంతేకాకుండా, మొగ్గలు శివపూజకు బొత్తిగా అనర్హం. వస్త్రంలో పోసి తెచ్చినవీ, చేతితో తెచ్చినవీ, గాలి వల్ల కిందపడినవీ అయిన పత్ర పుష్పాలను సర్వదా వర్జించాలి.' (అయితే, పారిజాత పుష్పాలు, పొగడ పూలు మాత్రం గాలికి కిందపడినా పూజార్హమైనవే!)

*(పూజా పుష్పాలను శుద్ధి చేసేదెలా?.... వచ్చే సంచికలో)*



# శమముతోనే సర్వోన్నత ఆనందం

ఇంద్రియ నిగ్రహ రూపమైన శాంత స్థితియే 'శమము'. "మనస్సు ఆసక్తులనూ, ప్రాప్తాప్రాప్తాలనూ త్యజించి సర్వదా ప్రశాంతంగా, తృష్ణా రహితంగా ఉండడాన్నే 'శమము' అని అంటున్నాం. సర్వవేళలా శాంతి, ఆనందాలతో ఉండడమే 'శమము'.

"నేను సుఖంగా ఉండాలి" అనేదే 'సుఖాశ' కదా! ఆ 'సుఖదాహం' అనే దోషం తోనే ఈ సంసార పంజరం నిర్మితమైంది. విస్తారమైన ఈ సంసారపుటెడారిలో 'శమము' అనేది ఒయాసిస్సు లాంటిది. సూర్యుడు అస్తమించగా, పూర్ణ చంద్రుడు ఉదయించడం వల్ల ఆ చంద్రుని కిరణాలు ఇసుక తిన్నెలను ప్రశాంతపరుస్తాయి. అలాగే శమము ఉన్నచోట ప్రశాంతత ఉంటుంది.

'శమము' వలన శ్రేయస్సు లభిస్తోంది. అది ముక్తి ప్రదాత, శుభకరం, భ్రాంతి నివారకం. శమలంకృతులై, తృప్తులై, నిర్మలులైన వారికి శత్రువులు కూడా మిత్రులు అవుతారు. అతడు విష్ణువులా శోభిల్లుతాడు. ఎవరి ముఖంలో శమము సర్వదా శోభిల్లుతుందో, అలాంటి వారి ముందు పూర్ణచంద్రుడు ఎందుకు పనికివస్తాడు! దానివల్ల కలిగే ఆనందం ముల్లోకాలలోని సంపదలు లభిస్తే మాత్రం ప్రాప్తిస్తుందా!

సూర్యుడు ఉదయిస్తే ఎలా చీకటి ఉండదో, అదే విధంగా శాంతచిత్తుని మనస్సులో కూడా దుఃఖాలకూ, తృష్ణలకూ, దుర్భరమైన మనోవ్యాధులకూ చోటు ఉండదు. శాంత చిత్తునిలో లభించే మనోవికాస స్థితికీ, ఈ విషయానందాలకూ హస్తి – మశకాంతరమైన (ఏనుగుకూ, దోమకూ ఉన్నంత) భేదం ఉంటుంది.

శమయుతుడై, సర్వజీవుల పట్ల స్నేహబుద్ధి గల సజ్జనునిలో పరతత్త్వం తనంతట తానే స్ఫురిస్తోంది. శమసమన్వితుడైన వ్యక్తిని మహా కఠినమైన హృదయం కలవారు కూడా తమ తల్లిని సేవించినట్లు సేవిస్తారు, విశ్వసిస్తారు. ఓ రామచంద్రా! ఇంద్రపదవి వల్ల గానీ, విష్ణుపదవి వల్ల గానీ, "శమము" వల్ల లభించేటంత సుఖం లభించదని ప్రకటిస్తున్నాను.

ఈ జీవుడు 'తృష్ణ' అనే పాశంతో బంధితుడై, అనేక శారీరక, మానసిక రుగ్మతలతో కలత చెందుతున్నాడు. అయితే ఈ మనస్సు 'శాంతి' అనే అమృతం సేవిస్తే, తృష్ణా పాశాలన్నీ వాటంతట అవి విడిపోతాయి. సర్వవేళలలోనూ శాంతిని సేవించడమే 'శమము'. వత్సా! శమము వల్ల కలిగిన బుద్ధితో ఏది ఆచరిస్తామో, ఏది గ్రహిస్తామో అది మాత్రమే మధురంగా ఉంటుంది. శాంతితో కూడుకొని ప్రాప్తించిన 'ఆనందం'లో ఒక ప్రత్యేకత ఉంది. అది ఎప్పుడైనా ఆ యా సంఘటనల కారణంగా విచ్ఛిత్తి పొందినా, కొద్ది సమయంలో అతని మనోబుద్ధులు తిరిగి శాంతిని సంతరించుకోగలవు. అది ఇంద్రియానందం కాదు.

శమము ఉన్న వ్యక్తిని పిశాచాలు గానీ, రాక్షసులు గానీ, విరోధులు గానీ, పాములు గానీ బాధించవు, ద్వేషించవు. బాణం ఒక వజ్రాన్ని ఛేదించగలదా? శాంతిసుధ అనే కవచాన్ని ధరించినవాణ్ణి ఈ సాంసారిక దుఃఖాలు ఏమీ చేయలేవు. శమము కలవాడు శోభించినట్లు మహారాజు కూడా శోభించలేడు. నాయనా! నేను ప్రాణసమానుడైన ఒక స్నేహితుని చూసినప్పటి కన్నా శాంతి – ఆనందంతో కూడిన శమయుతుణ్ణి చూసినప్పుడు ఎక్కువ ఆనందం పొందుతాను.

ఎవడైతే శమము కలిగి సాధుభావంతో, లోక శుభదాయకమైన ప్రవర్తన కలిగిఉంటాడో, అతని జీవితమే ధన్యం. సంకట సమయాలలో శాంతియే గొప్ప బలప్రదర్శనగా చెప్పబడుతోంది. అట్టి 'శాంతి' అనే బల పరాక్రమాలు కలవాడు ఎక్కడుంటే అక్కడి పరిసరాలు పవిత్రమవుతాయి.

*('శ్రీవసిష్ఠ రామ సంవాదం' ముముక్ష–వ్యవహార ప్రకరణం నుంచి)*

**అనువాదం : వై. హెచ్. రామకృష్ణ**





ఆది కాలం నుంచీ అందరి చికిత్సా విజ్ఞానం

# ఆయుర్వేదం

ఆయుర్వేద విజ్ఞానం మొదట బ్రహ్మ నుంచి ప్రజాపతికీ, ప్రజాపతి నుంచి అశ్వనీ కుమారులకూ, అశ్వినీ కుమారుల నుంచి ఇంద్రునికీ, ఇంద్రుని నుంచి భరద్వాజ మహర్షికీ, అతని నుంచి ఆత్రేయ పునర్వసునికీ, అతని శిష్యులు అగ్నివేశుడు, కేలుడు, హరితుడు మొదలైన వారికి వచ్చింది. ఈ పరంపర ఇలా కొనసాగింది. కాలక్రమంలో ఇది రెండు పరంపరలుగా విడివడి, 1. ఆత్రేయ పరంపర, 2. ధన్వంతరీ పరంపరగా వాసికెక్కింది.

'ఆత్రేయ పరంపర'లో కాయచికిత్స ప్రధానమైనది. ఈ విధానంలో ప్రసిద్ధుడు చరకుడు. ఇతని గ్రంథం 'చరక సంహిత'.

'ధన్వంతరీ పరంపర'లో శల్యచికిత్స ప్రధానమైనది. ఈ పరంపరలో ప్రముఖుడు సుశ్రుతుడు. ఇతను రచించిన గ్రంథం 'సుశ్రుత సంహిత'. ఇవి కాకుండా దక్షిణ దేశంలో అగస్త్య మహాముని ప్రసాదిత 'సిద్ధ వైద్యం' కూడా ఎంతో ప్రాచుర్యం పొందింది.

యోగవాసిష్ఠం - రోగం మొదట మానసిక స్థాయిలో ఉద్భవిస్తుందనీ, తద్వారా నెమ్మదిగా ప్రాణ వ్యవస్థను దెబ్బ తీస్తుందనీ, ఆ తరువాత నాడీమండలం దోషమయం అవుతుందనీ, దీనివల్ల మొత్తం శరీరం రోగమయం అవుతుందని వివరించింది. భారతీయ ఆరోగ్య విజ్ఞానం మనిషి ఆరోగ్యానికీ, మనిషి ఆలోచనలకూ గల సంబంధాన్ని గుర్తించి, ఆనాడే ఈ చికిత్స విధానాన్ని రూపొందించింది. నేటి ఆధునిక వైద్యశాస్త్రం కూడా 'సైకో సోమాటిక్ ప్రాబ్లమ్స్' రోగాలకు మూలమని తెలుసుకుంటోంది. కనుక భారతీయ యోగ, ఆయుర్వేద, ప్రకృతి చికిత్సలకు నేడు ప్రపంచ వ్యాప్తంగా విపరీతమైన గిరాకీ ఏర్పడింది. మనం ఇంతటి ఘనత సాధించడం మన ప్రాచీన ఋషివరుల కృషి ఫలితమే.

ఆరోగ్యకరమైన వ్యక్తి గురించి 'చరక సంహిత'లో

సమదోషః సమాగ్నిశ్చ సమధాతు మలక్రియః ।
ప్రసన్నాత్మేంద్రియ మనాః స్వస్థ ఇత్యభిధీయతే ॥

"ప్రతి వారిలోనూ వాత, పిత్త, కఫమనే త్రిదోషాలు, సప్తధాతువులు, మలవిసర్జన వ్యవస్థ సమతుల్యంగా ఉండి ఆత్మ, ఇంద్రియనిగ్రహం, మనస్సు ప్రశాంతస్థితిలో ఉంటే అలాంటి వారు ఆరోగ్యంగా ఉంటారు" అని చెప్పారు.

వేదకాలంనాడే అష్టాంగ ఆయుర్వేదం శాఖలుగా అభివృద్ధి చెందింది. అవి.

1. కాయచికిత్స - సాధారణ చికిత్స
2. కౌమార భృత్యమ్ - బాలరోగ చికిత్స
3. శల్యతంత్రం - శస్త్ర చికిత్స
4. శాలాక్య తంత్రం - కన్ను, ముక్కు, గొంతు చికిత్స
5. భూత విద్య - మనోరోగ చికిత్స
6. విషతంత్ర - విష చికిత్స
7. రసాయన - రసాయన చికిత్స
8. వాజీకరణ - పురుషత్వ వృద్ధి

**ఓషధులు**

'రోగ చికిత్సకు అవసరమైన ఓషధులను ప్రకృతి ప్రసాదించింది' అని అంటాడు చరకుడు. ఇతని 'చరక సంహిత'లో 582 రకాల ఓషధులను పేర్కొన్నారు. 'సుశ్రుత సంహిత'లో 496 రకాల ఓషధులను ప్రస్తావించారు. వీటితో చూర్ణం, రసం, కషాయం లాంటివి తయారుచేసేవారు.

ప్రాచీన భారతీయులు మనకు అందించిన సుప్రసిద్ధ ఆయుర్వేద గ్రంథాలు:

- చరక సంహిత (క్రీ.పూ. 600)
- సుశ్రుత సంహిత (క్రీ.పూ. 500)
- అష్టాంగ హృదయ (వాగ్భటుడు) (క్రీ.శ. 600)
- శారంజ్ఞధర సంహిత (క్రీ.శ. 1200)
- భావ ప్రకాశిక (క్రీ.శ. 1600)
- మాధవ నిధానం (క్రీ.శ 700)

*('భారతీయ ప్రతిభా విశేషాలు' నుంచి)*




## నిస్పృహ పోగొట్టిన స్వామీజీ సందేశం

నేను చిన్నప్పటి నుండి అల్లారుముద్దుగా పెరిగాను. కష్టం అనేది తెలియదు. ఎమ్.సి.ఎ. చదువు పూర్తయిన తరువాత నా జీవితంలో నేను ఊహించని సంఘటనలు జరిగాయి. పనిచేసిన సంస్థవారు చేసిన అన్యాయానికి అనారోగ్యం తోడై మా నాన్నగారు కాలం చేశారు. మాది ఉమ్మడి కుటుంబం కావడంతో కుటుంబ బాధ్యతను చిన్నవాడిని అయినా అందరి ఆమోదంతో నేనే స్వీకరించాను. వెన్నంటి ఉండి నాకు ఆత్మస్థైర్యాన్ని అందించిన అమ్మమ్మ కూడా ఆ తరువాత కాలం చేశారు. కుటుంబ బాధ్యతలు చూస్తూ నేను నా కెరీర్‌కి ఫుల్‌స్టాప్ పెట్టాను.


మండపాక కల్యాణ్ చక్రవర్తి

అలా అయిదేళ్ళు గడిచాక కూడా నాలో నిరాశ, నిస్పృహలు వెంటాడుతూనే ఉన్నాయి. ఆ సమయంలో స్వామీజీ సందేశాన్ని ఓ పుస్తకంలో చదివాను...

**"మహా శక్తిమంతమైన యంత్రం లాగ మిమ్మల్ని మీరు తయారు చేసుకోండి. విశ్వశ్రేయస్సు కోసం మొదట ప్రయత్నం చేయండి. ఇతరుల క్షేమాన్ని కాంక్షించండి. మీరు పవిత్రులై, బలవంతులైతే మీరొక్కరే ప్రపంచమంతటికీ సమానులు కాగలరు."** – స్వామి వివేకానంద

ఆయన మాటలు నా జీవితాన్నే పూర్తిగా మార్చేశాయి. నాలో ఉన్న అసంతృప్తి, అసహనం–అన్నీ మరిచిపోయి ముందుకు సాగాను. ఆయన చెప్పినట్లు నన్ను నేను పూర్తిగా మార్చుకున్నాను. ప్రత్యక్షంగా, పరోక్షంగా ఎందరికో సహాయం చేశాను.

విశ్వ శ్రేయస్సు కోసం మొదటి ప్రయత్నం చేశాను. హైదరాబాద్ అమీర్‌పేట్‌లో నిత్యం కరపత్రాల ద్వారా అనేక కంప్యూటర్ సంస్థలవారు ప్రకటనలు ఇస్తూ ఉంటారు. కానీ, ఆ కరపత్రాలు నేల పైనే ఎక్కువ పడుతూ, చెత్తలాగ పేరుకుపోతున్నాయి, అపరిశుభ్రతకు దారి తీస్తున్నాయి. ఆ సంగతి గమనించి అందరి ప్రకటనలనూ ఒకే పుస్తకంగా తయారుచేసి 'బొమ్మరిల్లు' అనే పేరు మీద ఉచితంగా పంచాను. ఇది అందరికీ ఆదర్శంగా నిలిచింది. ఇప్పుడు ఇంతక్రితం ఉన్న అసౌకర్యం దాదాపుగా కనుమరుగవుతోంది. అపరిశుభ్రతపై ఉద్యమంలా మారి, ఉత్తమ ఫలితాలు వస్తున్నాయి.

ఇలాంటి మార్పులు నా జీవితంలో ఎన్నో జరిగాయి. స్వామి వివేకానంద జీవితం, ఆయన మాటలు నాలాంటి యువకులకు ఎందరికో ఆదర్శప్రాయం అనడంలో సందేహం లేదు.

**– మండపాక కల్యాణ్ చక్రవర్తి, ఎమ్.సి.ఎ., హైదరాబాద్**



## ఎదురొడ్డి నిలవడమే జీవితం!

నేను ప్రస్తుతం కరీంనగర్ జిల్లాలోని సిరిసిల్లలో ఉన్న ప్రాంతీయ వైద్యశాలలో సూపరింటెండెంట్‌గా పనిచేస్తున్నాను.


డా॥ మండవ వెంకటేశ్వర్లు

నేను వైద్యవిద్యలో పట్టభద్రుడినై, 20 ఏళ్ళు అవుతోంది. మొదటి 15 ఏళ్ళు సరైన ప్రాక్టీసు లేక నేను, నా కుటుంబం ఎన్నో ఆర్థిక ఇబ్బందులను ఎదుర్కోవాల్సి వచ్చింది. సుమారు ఎనిమిది సంవత్సరాల క్రితం 'శ్రీరామకృష్ణ ప్రభ' ద్వారా శ్రీరామకృష్ణులు, శ్రీశారదామాత, స్వామి వివేకానందుల గురించి తెలుసుకొన్నాను. వారి జీవిత చరిత్రలు చదివాను.

నా జీవితంలో రెండు వేర్వేరు సంఘటనలు జరిగాయి. వాటివల్ల నేను తీవ్ర మనస్తాపానికి గురయ్యాను. తొమ్మిది నెలల క్రిందట మూడు లక్షల రూపాయల విలువైన నా కారు ఆంజనేయ స్వామి గుడి దగ్గర ఆపి ఉండగా అగ్నిప్రమాదంలో కాలిపోయింది. మరోసారి నా శ్రేయోభిలాషి నా పై ఓ కేసు పెట్టాడు. ఈ రెండు సంఘటనల వల్ల మనోవేదనకు గురైన నాకు మనోధైర్యాన్ని కలిగించిన స్వామీజీ సందేశం ఇది: **"అణగ త్రొక్కబడిన పరిస్థితులలో కూడా ఎదురొడ్డి నిలదొక్కుకోవడమే జీవితం."** స్వామి వివేకానందుని ఈ వాక్యం చదివిన వెంటనే దిగులు పోయి, నాలో ఆత్మవిశ్వాసం పెరిగింది. ఇప్పుడు జీవితంలో ఎలాంటి క్లిష్ట పరిస్థితులనైనా ధైర్యంగా ఎదుర్కోగలననే నమ్మకం నాలో కలిగింది.

**– డా॥ మండవ వెంకటేశ్వర్లు,** సిరిసిల్లా, కరీంనగర్ జిల్లా



# అమ్మా నాన్నలు నేర్పాల్సిన అసలైన పాఠాలు

– మల్లాది పున్నయ్యశాస్త్రి

రామాయణ భారతాలు ఇతిహాసాలు. భాగవతం పురాణ కావ్యం. వ్యక్తిగతమైన, సామాజికమైన శీల నిర్మాణంలో తల్లితండ్రులు, గురువులు, పెద్దల పాత్ర వీటిలో స్పష్టంగా కనబడుతుంది.

రామాయణం మొదట్లోనే వాల్మీకి పరిప్రశ్నకు సమాధానంగా నారదమహర్షి శ్రీరాముని పదహారు సద్గుణాలు వర్ణించి, అతని చరిత్ర తెలిపి, వాల్మీకిని శ్రీరామ భక్తునిగా తీర్చిదిద్ది, రామాయణ రచనకు ప్రోత్సహించాడు. వాల్మీకి తన ఆశ్రమంలో పెరిగిన కుశలవులకు తాను రచించిన రామాయణాన్ని గానంగా నేర్పి, జనుల నడుమ, రాజసభలలో, చివరకు రామసభలో కూడా గానం చేయించి, ఆనాటి సమాజంలో శీలసంపద నెలకొనడానికి కృషి చేశాడు.

**సహన సంపదను పెంచే రామాయణ పాత్రలు :**

దశరథుని పెంపకంలో రామాదులు వేదాధ్యయన నిరతులై, పితృ శుశ్రూషణరతులయ్యారు. దశరథుడు సత్యధర్మ పాలకుడై, కుమారులను కూడా ఆ పద్ధతిలోనే పెంచాడు. వసిష్ఠుడు దశరథుని గూర్చి "సాక్షాత్ ధర్మ ఇవా పరః" అని ప్రశంసించాడు. పితృ శిక్షణలో పెరిగిన రాముడు ధర్మవిగ్రహుడై ప్రకాశించడంలో వింత ఏముంది? రామునికి అస్త్రవిద్యలు, శీల సంపద నేర్పిన విశ్వామిత్రుడు కూడా ధర్మ విగ్రహుడని ప్రస్తుతింపబడ్డాడు. కనుక దశరథుడు ఆ ఋషి ఆజ్ఞయే తన ఆజ్ఞగా పాటించాల్సిందిగా రాముణ్ణి ఆదేశించాడు. రాముడు ఆ ప్రకారంగానే గురువు ఆజ్ఞయే పిత్రాజ్ఞ అనుకొని తాటకాది దుష్టులను శిక్షించాడు. అహల్యను అనుగ్రహించాడు.

అరణ్యవాస సందర్భంగా అనసూయాదేవి, రాముణ్ణి "నీకు సీత అంటే ఎందుకంత ప్రేమ" అని అడిగింది. రాముడు "నా తండ్రిగారు ఎంపిక చేసినది కాబట్టి" అన్నాడు. మరి శివధనువును విరిచినది గుర్వాజ్ఞను పాటించడం కోసం మాత్రమే. సీతను వివాహ మాడడంలో నిర్ణయాన్ని రాముడు తండ్రికే విడిచిపెట్టాడు. పరశురాముడు శ్రీరాముని శీలాన్ని మెచ్చి, దానికి కారణమైన దశరథుని పెంపకాన్ని కూడా మెచ్చుకొన్నాడు.

కోసల రాజ్య ప్రజలు సభలో దశరథునితో రాముని గురించి మాట్లాడుతూ "తన సద్గుణాలతో మాకు ప్రియుడై, మిమ్మల్ని మించిపోయాడు" అని కీర్తించారు. లక్ష్మణుడు కూడా తల్లి ఆదేశంతో అడవినే అయోధ్యగా, సీతారాములనే తల్లితండ్రులుగా భావించి, సేవించి, ధన్యుడై, తండ్రి ప్రశంసలను కూడా అందుకొన్నాడు.

ఇక తల్లి అయిన కౌసల్య, రాముణ్ణి వనవాసానికి పంపుతూ విష్ణుమూర్తిని ప్రార్థించి, రాముడికి దైవభక్తిని సంక్రమింప జేసింది. సుమిత్ర సంగతి సరే సరి! తన తమ్ముళ్ళు కైకను నిందించకుండా వారిని మలచాడు రాముడు. భరతుడు, గుహునితో "పెద్దన్న తండ్రితో సమానుడు" అన్నాడు. రాముడు అహల్యను ఎలా గౌరవించాడో, లక్ష్మణుడు తారనూ, హనుమంతుడు మండోదరినీ అలాగే గౌరవించారు. శత్రుఘ్నుడు, మంథరను సంహరించాలనుకున్నప్పుడు – స్త్రీలను గౌరవించని వారు రాముడికి ప్రీతి పాత్రులుకారని భరతుడు మందలించాడు. లక్ష్మణుడు సీతమ్మ భుజకీర్తులూ, కుండలాలూ తెలియవు కానీ, అందెలు మాత్రమే నిత్యపాద వందనం వల్ల తెలుసు అన్నాడు. ఇది తల్లి ఇచ్చిన శిక్షణ.

ఇక భరద్వాజ మహర్షి మాతృనింద దోషమని భరతుణ్ణి హెచ్చరించాడు. అది మానడం వల్లనే, భరతుడికి రామ పాదుకలు లభించాయి. ఆంజనేయుడు సుగ్రీవుడి మంత్రి, గురువు. సుగ్రీవుణ్ణి అతడు రెండు సందర్భాలలో సున్నితంగా హెచ్చరించాడు. వినయం, సత్యపాలన అతనికి నేర్పాడు. సీతమ్మను బాధించిన రాక్షస స్త్రీలను వధించడానికి హనుమంతుడు అనుమతి కోరగా, సీతమ్మ వారి పట్ల కరుణ చూపడమే కర్తవ్యమనీ, తప్పు చేయనివారెవరూ ఉండరనీ తెలియజేసింది.

రావణ సంహారం తరువాత అన్నగారికి అంతిమ సంస్కారం విభీషణుడు చేయకుంటే తాను చేస్తానని శ్రీరాముడు అన్నాడు.

రాముని ఔదార్యానికి విభీషణుడు ప్రభావితుడయ్యాడు. హనుమంతుడు సీతమ్మను దర్శించి తాను రావణుణ్ణి వధించి, సీతాదేవిని శ్రీరాముని వద్దకు చేరుస్తానని అన్నప్పుడు సీతారాముల సంకల్పం ప్రకారం తాము నడుచుకోవాలని జాంబవంతుడు సరిదిద్దాడు.

**భక్తి ప్రపత్తులను పెంచే భాగవతోత్తముల గాథలు:**

చిన్నప్పుడే కుంతి, పాండు రాజుల పెంపకం వలన, ఋషుల శిక్షణ వలన పాండవులు ధర్మాశ్రయులై, శ్రీకృష్ణ భక్తులయ్యారు. పాపపు ఆలోచనలు తమకు కలుగకుండా కాపాడమని ధర్మరాజు, కృష్ణుణ్ణి వేడుకున్నాడు. "నా కుమారులనే ఇంద్రియాలకు, నీవు ప్రాణం" అని కృష్ణుణ్ణి కుంతి కీర్తించింది. గాంధారీ ధృతరాష్ట్రుల పెంపకంలో కౌరవులు దురాశ, అసూయలకు లోనయ్యారు. అసూయతో గాంధారి తన గర్భాన్ని మోదుకోవడం వల్ల అసూయాగ్రస్థులే జన్మించారు. ధృతరాష్ట్రుడు వారికి స్వార్థాన్ని నేర్పాడు. వారి దుష్ప్రవర్తనను చిన్నప్పుడే నియంత్రించి ఉంటే, మహా భారత యుద్ధం జరిగేదే కాదు.

పవిత్ర భాగీరథీ నదీమాత పుత్రుడైన భీష్ముడు ఆమె పెంపకంలో ఆమె వంటి పవిత్రుడే అయ్యాడు. ద్రోణుడు తనను అవమానించిన ద్రుపదునిపై పగ తీర్చుకున్నాడు. అదే లక్షణం ద్రోణుని కుమారుడైన అశ్వత్థామలో కనపడుతుంది. ధర్మరాజు శిక్షణలో పరీక్షిత్తు సత్త్వగుణ సంపన్నుడై, ధర్మపాలకుడై, శ్రీకృష్ణ భక్తుడై భాగవతం విని తరించాడు. తనను శపించిన శృంగికి ప్రతి శాపం ఇవ్వని క్షమ అతనికి ధర్మజుని నుంచి సంక్రమించింది.

ఉత్తర గర్భవతిగా ఉన్నప్పుడే శ్రీకృష్ణుని శరణు వేడింది. అదే గుణం ఆమె కుమారుడికి వచ్చి, జన్మించిన వెంటనే వాసుదేవుణ్ణి పరీక్షించి, పరీక్షితుడని ప్రసిద్ధుడయ్యాడు. భీష్మ, వ్యాస, విదురుల శిక్షణలో పాండవులు ధర్మ నిరతులయ్యారు. నారదుడు రాజసూయ యాగం అయ్యాక ధర్మరాజుకు ప్రహ్లాదుడి కథ చెప్పాడు. అందువల్లనే ప్రహ్లాదుని లాగ ధర్మరాజు కౌరవులలో కూడా దేవుణ్ణే దర్శించాడు. వనవాస కాలంలో కష్టాలు గుర్తుకురాకుండా, సుఖదుఃఖాలకు అతీత స్థితి కలిగేలా మార్కండేయుడు మొదలైన మహర్షులు వచ్చి పాండవులకు సత్కథలు వినిపించారు.

నారదుడు గురువై వ్యాసుణ్ణి, ప్రహ్లాదుణ్ణి, ధర్మజుణ్ణి ప్రాచీనబర్హిని, ధ్రువుణ్ణి విష్ణుభక్తులుగా మలచినట్లు విన్నాం. ముని శాపం వలన మరణించబోయే పరీక్షిత్తు, శుకదేవుని భాగవత బోధ విని పరమాత్మను చేరుకున్నాడు. తనను సభ నుండి వెడలగొట్టిన ధృతరాష్ట్రుడి పట్ల కలిగిన కోపం ఎన్ని తీర్థయాత్రలు చేసినా విదురునికి తగ్గలేదు. ఉద్ధవుని లాంటి మహాభక్తుని దర్శనంతో అది తగ్గింది. గురుదర్శన ప్రభావం అంతటిది!

తల్లితండ్రుల శిక్షణ ప్రభావానికి కొన్ని ఉదాహరణలను పరిశీలిద్దాం : పరాశరుని శిక్షణలో వ్యాసుడు, వ్యాసుని శిక్షణలో శుకుడు బ్రహ్మజ్ఞానులయ్యారు, వైరాగ్య సంపన్నులయ్యారు. సునీతి, సురుచిని నిరసించ లేదు; కుమారునికి శ్రీమహా విష్ణువే శరణ్యం అంటూ సురుచి తనకు హితమే చేసిందని చెప్పింది. ఋషభుడు కుమారుడైన భరతునికి ప్రజలందరిలో ఆత్మ దర్శనాన్నీ, రాజు అయినా భోగాలకు వశం కాని వైరాగ్యాన్నీ బోధించాడు. తండ్రి శిక్షణలో, చివరకు భరతుడు అవధూత అయ్యాడు.

ధ్రువుడు తన తమ్ముణ్ణి చంపిన యక్షుని పట్ల పగతో యక్షులందర్నీ సంహరించాలనుకొన్నప్పుడు తాతగారైన మనువు శాంతినీ, క్షమనూ బోధించి, అతనిని సన్మార్గంలోకి మళ్ళించాడు. జగద్గురువు అయిన శ్రీకృష్ణుడు కూడా ఆదర్శ శిష్యుడై సాందీపని మహర్షికి శుశ్రూష చేశాడు. ఇలా తల్లితండ్రులు, గురువుల శిక్షణలో ఎందరో శీల సంపన్నులు, ధార్మికులు, భాగవతోత్తములు అయ్యారు.

తల్లితండ్రులు తమ పిల్లల్ని సద్వర్తనులుగా తీర్చిదిద్దాలంటే రామాయణ, భారత, భాగవతాల్లోని మహాత్ముల జీవిత గాథల్ని వారికి బోధించాలి. అప్పుడే పిల్లల్లో వినయం, త్యాగం, సేవ, ప్రేమ మొదలైన సద్గుణాలు అలవడతాయి.

# యువవాణి

**– స్వామి పరిజ్ఞేయానంద**



**డి. గంగాధరరావు, పామర్రు**

**ప్రశ్న :** నేను బి.ఎస్‌సి. కంప్యూటర్ సైన్స్ చదువుతున్నాను. కాలేజీ నుంచి ఇంటికి రాగానే శ్రద్ధగా చదవాలని అనుకుంటాను. కానీ చదువు మీద మనస్సు పెట్టలేక పోతున్నాను. నాకు అన్నా హజారే లాగా సమాజసేవ చేయాలని ఉంది. నా కలలు నిజం కావాలంటే ఏం చేయాలి?

**జవాబు :** ప్రతి ఒక్కరికీ ఆశలు ఉంటాయి, కానీ ఆశయాలు ఉండేవి కొందరికే. ఆశకీ, ఆశయానికీ తేడా తెలియక చాలా మంది జీవితాన్ని దుఃఖమయం చేసుకుంటారు.

ఓ విద్యార్థిగా ప్రస్తుతం మీ ముందున్న కర్తవ్యం బాగా చదువుకోవడం. కర్తవ్య నిర్వహణలో మీ మనస్సును మీరు నిమగ్నం చేయలేక పోతున్నారు. మరి ఈ చిన్న లక్ష్యాన్ని సాధించడంలోనే మీరు విఫలులైతే ఘనకార్యాలను ఎలా సాధించగలరు? సమాజ సేవ లాంటి మహత్కార్యాలను గురించి ఇప్పుడు ఆలోచించడం కన్నా ముందు విద్యార్థిగా మీ కర్తవ్యాన్ని నెరవేర్చడంలో కృతకృత్యులవడానికి పట్టుదలతో ప్రయత్నించండి. అంతేకానీ చదువు మీద మనస్సు లగ్నం కావడం లేదని విచారిస్తూ సమయాన్ని వృథా చేయడం వల్ల ప్రయోజనం లేదు.




Small deeds done are better than great deeds planned. *- **Peter Marshall***

కాబట్టి 'చదువు' అనే లక్ష్యాన్ని సాధించడంలో మీ పట్టుదల, విశ్వాసాలను ప్రదర్శించండి. దృఢసంకల్పంతో మనస్సును మీ అధీనంలోకి తీసుకువచ్చి, విద్యార్థిగా విజయాన్ని సాధించగలిగితే ఆ తరువాత అన్నా హజారే అంతటి మహాత్మునిగా ఎదిగే శక్తి మీలో వస్తుంది.

మీలో సంకల్ప శక్తి, ఆత్మవిశ్వాసం పెరగాలంటే స్వామి వివేకానందుడు మనకిచ్చిన ఈ మహామంత్రాన్ని రోజూ పఠించండి.

To succeed, you must have tremendous perseverance, tremendous will. ' I will drink the ocean', says the persevering soul, 'at my will, mountains will crumble up.' Have that sort of energy, that sort of will; work hard, and you will reach the goal.

**కె. మానస, బనవాసి, కర్నూలు జిల్లా**

**ప్రశ్న :** మా పాఠశాలలో ఎప్పుడూ నాదే మొదటి ర్యాంక్. నేను స్కూల్ లీడర్ అయినప్పటి నుంచీ మొదటి ర్యాంక్ రావడం లేదు. 'స్కూల్ లీడర్ అవడం వల్ల నీలో గర్వం పెరిగింది. అందుకే సరిగ్గా చదవడం లేదు' అని మా ఉపాధ్యాయులు నన్ను విమర్శిస్తున్నారు. కానీ నాలో అలాంటి భావం లేదు. నేను మళ్ళీ మొదటి ర్యాంక్ సంపాదించాలంటే ఏం చేయాలి?

**జవాబు :** మీరు స్కూల్ లీడర్ అయిన తరువాత చదువులో వెనకబడడానికి కారణం – నిజంగా చదువుకోవడానికి సమయం దొరకక పోవడం వల్లనా? లేక చదువు మీద మనస్సును ఏకాగ్రం చేయలేకపోవడం వల్లనా? మీరే ఆలోచించండి.

స్కూల్ లీడర్‌గా ఏ పని చేసినా కేవలం పాఠశాల పనివేళల్లోనే కదా! ఆ తరువాతి సమయమంతా మీదే! స్కూల్ లీడర్‌గా ఉండడం వల్లనే చదువులో వెనకబడుతున్నానని మీరు భావిస్తే ప్రిన్సిపాల్ గారికి మీ సమస్యను చెప్పి పరిష్కరించుకోండి.

ఇకపోతే, స్కూల్ లీడర్ అయిన తరువాత గర్వం పెరిగి సరిగ్గా చదవడం లేదనే మీ ఉపాధ్యాయుల విమర్శల్ని మనస్సులో మననం చేసుకుంటూ మథనపడేంత సమయం మీకెక్కడిది? మనం ఏ పనిలోనైనా విజయం సాధించాలంటే పక్కవారి విమర్శల్ని పట్టించుకోకూడదు. వాటిని తలచుకుంటూ మన సమయాన్నీ, శక్తినీ వృథా చేసుకోకూడదు అంటారు అనుభవజ్ఞులు.

I cannot mind what so-and-so thinks of me, for I have not the nervous energy to spare. *- **Annie Payson Call***

మీకు గర్వం పెరిగిందన్న మీ ఉపాధ్యాయులందరూ గర్వించే విధంగా పట్టుదలతో ప్రయత్నించి మళ్ళీ మొదటి ర్యాంక్ సాధించండి.

**మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా:**
**యువవాణి**
**శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,**
**దోమల్‌గూడ, హైదరాబాద్ – 500 029**

యువవాహిని

# మనసు - మర్మం

- స్వామి బుధానంద

## చపల చిత్తానికి సంకెళ్ళు వేద్దాం!



మనస్సు చాలా చంచలమైనది. అలాంటి మనసు గురించి స్వామి వివేకానంద ఇలా వర్ణించారు:

"మనస్సును స్వాధీనం చేసుకోవడం ఎంత కష్టం! నిజానికి, దాన్ని ఒక పిచ్చిపట్టిన కోతితో పోల్చారు. ఒక కోతి ఉంది. అది స్వభావరీత్యా అన్ని కోతులలాగే చాలా చపలత్వం కలిగి ఉంది. అది చాలదన్నట్లు ఎవరో దానికి బాగా సారాయి త్రాగించారు. దాంతో అది మరింత గోల చేయసాగింది. అప్పుడు దాన్ని ఒక తేలు కుట్టింది. తేలు కుడితే మనిషి రోజంతా నొప్పితో గంతులు వేస్తాడు కదా! ఇంక ఆ కోతి పరిస్థితి ఘోరంగా ఉంది. ఇంకా ఇది చాలదన్నట్లుగా దానికి ఒక దయ్యం పట్టింది. ఇక ఆ కోతి గోలనూ, ఆపలేని దాని అశాంతినీ ఏ భాషలో వర్ణించగలం!



మనస్సుని అలాంటి కోతితో పోల్చవచ్చు. స్వభావసిద్ధంగా అది చాలా చపల స్వభావం కలిగి ఉంటుంది. ఆ పైన కోరిక అనే మధువును బాగా త్రాగింది. కోరిక ఆవహించిన తరువాత ప్రక్కవారు బాగుపడితే చూడలేని అసూయ అనే తేలు కుట్టింది. చివరిగా అహంకారం అనే దయ్యం పట్టింది. దానితో అందరికన్నా నేనే అధికుణ్ణి అనే ఆలోచనలతో మనస్సు నిండిపోయింది. అలాంటి మనస్సుని స్వాధీనం చేసుకోవడం ఎంత కష్టం!"

మనస్సును స్వాధీనం చేసుకోవడానికి ఏ విధమైన చిట్కాలూ, అడ్డదోవలూ లేవు. ఈ విషయాన్ని స్పష్టంగా అర్థం చేసుకోవాలి, ఒప్పుకోవాలి. మనస్సు చాలా సున్నితమైన పనిముట్టు. అతి తెలివితో, కుయుక్తులతో, తొందరపాటుతో దాన్ని సాధించడానికి ప్రయత్నించవద్దని హెచ్చరిక! మనస్సును చాలా జాగ్రత్తగా సంబాళించాలి. ఈ పనిని పూర్తిగా మనకు మనమే చేసుకోవాలి. డబ్బు పుచ్చుకొని వేరే ఎవరూ మనకు ఈ పనిని చేసిపెట్టలేరు. ఇది మన సొంత పని. తప్పనిసరిగా దీన్ని మనకు మనమే చేసుకోవాలి. వీటికి తోడు ఈ పని చెయ్యడానికి మనకు గొప్ప ఓరిమి కావాలి. స్వామి వివేకానంద ఇలా బోధించారు:

"మనస్సుని క్రమంగా, ఒక పద్ధతిలో స్వాధీనంలోకి తెచ్చుకోవాలి. నెమ్మదిగా, పట్టుదలతో, ఎడతెగని పరిశ్రమతో మన సంకల్పశక్తిని బలపరచుకోవాలి. ఈ రోజు ప్రయత్నించి రేపు వదలివేస్తే ఇది సాధ్యం కాదు.

నిర్మాణాత్మకమైన ఆలోచనా పద్ధతిలో మనసుని మన ఆధీనం చేసుకోవాలి. అందుకు ఒక దైనందిన ప్రణాళిక అవసరం. నైతిక విలువలకు కట్టుబడి, ప్రణాళికా బద్ధంగా జీవితాన్ని సాగిస్తే మనసుని స్వాధీనపరచుకోవడం సులభం.

# నిజమైన నాయకుడు ఎలా ఉండాలి?

– డాక్టర్ ఎ.పి.జె. అబ్దుల్ కలామ్

నిజమైన నాయకుడు ఎలా ఉండాలి? ఈ ప్రశ్నకు భారత మాజీ రాష్ట్రపతి ఎ.పి.జె. అబ్దుల్ కలామ్ తన స్వీయ అనుభవంతో ఇలా జవాబిచ్చారు:

"నా (కలామ్) స్వీయ అనుభవం ఒకటి చెబుతాను. ఎస్.ఎల్.వి-3 (భారత శాటిలైట్ లాంచింగ్ వెహికల్ ప్రోగ్రామ్)కి 1973లో నేను ప్రాజెక్ట్ డైరెక్టర్‌ని అయ్యాను. 1980 లోపల 'రోహిణి' అనే ఉపగ్రహాన్ని కక్ష్యలో ప్రవేశపెట్టడం మా లక్ష్యం. నాకు సమృద్ధిగా ధనం, మానవ వనరులు ఇచ్చారు. అయితే 1980 లోగా ఉపగ్రహాన్ని రోదసిలో ప్రవేశపెట్టాలి అని స్పష్టంగా చెప్పారు. శాస్త్ర, సాంకేతిక రంగాలలోని వేల మంది నిపుణులు కలసి పరిశ్రమించారు.

ఆగష్టు 1979 కల్లా మేము తయారుగా ఉన్నామనుకున్నాం. ప్రాజెక్ట్ డైరెక్టర్‌గా ప్రయోగానికి కంట్రోల్ సెంటర్‌కి వెళ్ళాను. ఉపగ్రహ ప్రయోగానికి 4 నిమిషాల ముందు కంప్యూటర్ అత్యవసర సామగ్రిని జాబితా ప్రకారం సరిచూడడం ప్రారంభించింది. ఒక నిముషం తరువాత గమన దశ మొదలైన వాటిని నిర్దేశించే యంత్రభాగాలు కొన్ని సరిగ్గా లేవనీ, ప్రయోగాన్ని నిలిపివేయమనీ సందేశం వచ్చింది. నా వెంట ఉన్న నలుగురైదుగురు నిపుణులు మరేం భయపడనవసరం లేదనీ, తమ లెక్క ప్రకారం అంతా సరిగ్గానే ఉందనీ, తగినంత ఇంధనం కూడా ఉందనీ అన్నారు. అందువల్ల నేను కంప్యూటర్ సందేశాన్ని పట్టించుకోకుండా, ఉపగ్రహం ఉన్న రాకెట్‌ను ప్రయోగించాను. మొదటి దశలో అంతా బాగానే ఉంది. రెండో దశలో చిన్న సమస్య మొదలైంది. ఉపగ్రహం కక్ష్యలోకి ప్రవేశించడానికి బదులు, రాకెట్ మొత్తం బంగాళాఖాతంలో మునిగిపోయింది. ఆ విధంగా ఓటమి ఎదురైంది.



ఆచార్య సతీష్ ధవన్

అదే రోజున భారత అంతరిక్ష పరిశోధనా సంస్థ (ఇస్రో) అధ్యక్షుడు ఆచార్య సతీష్ ధవన్ పాత్రికేయులతో శ్రీహరికోటలో సమావేశం జరిపారు. సంస్థ అధ్యక్షులు ఆచార్య ధవన్ స్వయంగా ఈ సమావేశాన్ని నిర్వహించారు. ఎదురైన అపజయానికి పూర్తి బాధ్యతను తానే వహించారు. 'తమ బృందం ఎంతో పరిశ్రమించిందనీ, అయితే సాంకేతికపరమైన సహకారం ఇంకా అధికంగా అవసరమనీ అంటూ, మరొక ఏడాది లోపే తమ బృందం విజయాన్ని సాధిస్తుందని పూర్తి విశ్వాసంతో చెప్పారు'. నిజానికి, ఇక్కడ ప్రాజెక్ట్ డైరెక్టర్‌ని నేను. ఆ ఓటమి నాది! అయినప్పటికీ సంస్థ అధ్యక్షునిగా అపజయానికి తానే బాధ్యుణ్ణి అని ఆచార్య సతీష్ ధవన్ అన్నారు.

తరువాతి సంవత్సరం, అంటే 1980 జూలైలో ఉపగ్రహాన్ని ప్రయోగించే ప్రయత్నం చేశాం. ఈ ప్రయత్నం సఫలమైంది. దేశం మొత్తం హర్షించింది. అప్పుడు కూడా పాత్రికేయుల సమావేశం జరిగింది. ఆచార్య ధవన్ నన్ను పక్కకు పిలిచి, "ఇవాళ సమావేశాన్ని నువ్వు నిర్వహించు" అన్నారు. ఈ విజయం తనది కాదనీ, తమ బృందానిది అనీ ప్రకటించారు.

ఆ రోజు ఒక ముఖ్యమైన విషయం తెలిసింది నాకు. **అపజయం ఎదురైనప్పుడు సంస్థ నాయకుడు ఆ అపజయానికి బాధ్యుణ్ణి తాను అన్నారు! విజయం లభించినప్పుడు ఆయన దానికి కారణం బృందానిది అన్నారు.**

కార్యనిర్వహణకు కావాల్సిన అతి ముఖ్యమైన పాఠం అది. దీన్ని నేను ఏ పుస్తకమూ చదివి నేర్చుకోలేదు, అనుభవం వల్ల నేర్చుకున్నాను."

మహనీయుల జీవితాల్లో
# మధురఘట్టాలు
- జి. సతీష్

యువవాహిని

# భవరోగములకు మందు!

'రఘుపతి రాఘవ రాజారాం' భజన సంకీర్తన గాంధీజీ జీవితంతో పెనవేసుకుపోయిన సంగతి జగత్ ప్రసిద్ధం. రామనామం గాంధీజీ పాలిట దివ్యౌషధం.

గాంధీ చిన్నతనంలో కుటుంబంతో కలిసి దేవాలయానికి వెళ్ళేవాడు. కానీ దేవాలయాలలో జరిగే విషయాలు కొన్నిటిని అవినీతికరంగా భావించిన గాంధీ దేవాలయాల పట్ల ఉదాసీనత కనబరచేవాడు. 'గుడిని అపవిత్రం చేయకుంటే గుగ్గిలం వేసినంత పుణ్యం కదా!'

దేవాలయంలో అలవడని దైవభక్తి ఇంట్లో పనిమనిషి రంభ వల్ల గాంధీకి అలవడింది. గాంధీకి చిన్నతనంలో దొంగలన్నా, దెయ్యాలన్నా అమిత భయం. రాత్రి వేళ గడప దాటేవాడు కాదు. ఇలాంటి మనస్తత్వం ఉన్న గాంధీకి వారి కుటుంబదాసి అయిన రంభ ఓ మంచి మాట చెప్పింది. భూత, ప్రేతాదుల భయానికి 'రామనామ స్మరణం' మంచి మందు అని బోధించింది. రంభ చెప్పిన దానిపై నమ్మకం కలిగినవాడై భూత, ప్రేతాదుల భయం పోయేందుకై గాంధీ రామనామ జపం మొదలు పెట్టాడు.

గాంధీ పినతండ్రి కుమారుడు కూడా రామభక్తుడు. అతడు గాంధీకి రామరక్షా స్తోత్రం నేర్పే ఏర్పాటు చేశాడు. ఇక గాంధీ ప్రతిరోజూ ప్రాతఃకాలంలో స్నానానంతరం రామనామ స్తోత్రం జపించేవాడు. గాంధీ పోరుబందరులో ఉన్నప్పుడు అక్కడి రామాలయంలో రోజూ రాత్రి పూట రామాయణ పారాయణం జరిగేది. భీలేశ్వరుకు చెందిన పరమభక్తుడైన లాఘా మహరాజ్ రామాయణం వినిపిస్తూ ఉండేవారు.

ఆ మహానుభావుడు రామాయణాన్ని ఎంతో భక్తి పారవశ్యంతో చెప్పేవారు. శ్రోతలు తన్మయత్వంతో వింటూ ఉండేవారు. ఈ రామాయణ పారాయణానికి గాంధీ ప్రతి నిత్యం వెళ్ళి ఆనందంతో వినేవాడు. అప్పటికి గాంధీ వయస్సు 13 ఏళ్ళు.

"లవణమాత్ర సాధు సంగే సర్వసిద్ధి హోయ్'' (సాధు సాంగత్యం కొద్దిగా లభించినా చాలు సర్వసిద్ధులూ కలుగుతాయి) అంటారు శ్రీ చైతన్య మహాప్రభువు. రామాయణ పారాయణ విన్న గాంధీకి రామనామం పట్ల అత్యంత అభిరుచి ఏర్పడింది.

పనిమనిషి రంభ ప్రేరణతో హృదయంలో నాటుకున్న రామనామ బీజం వల్లనే తన జీవితాంతం రామనామాన్ని జపించాడు. ఈ విధంగా రామనామం గాంధీ పాలిట దివ్యౌషధం అయింది.

**(అక్టోబరు 2న గాంధీ జయంతి)**

## పండుగలు - పర్వదినాలు

### అక్టోబరు- 2008

| | | | |
|---|---|---|---|
| 07 | మంగళవారం | : | మహా అష్టమి |
| 09 | గురువారం | : | విజయదశమి |
| 10, 24 | శుక్రవారం | : | ఏకాదశి |
| 14 | మంగళవారం | : | లక్ష్మీపూజ |
| 27 | సోమవారం | : | దీపావళి |
| 28 | మంగళవారం | : | కాళీ పూజ |

### నవంబర్- 2008

| | | | |
|---|---|---|---|
| 09 | ఆదివారం | : | ఏకాదశి |
| 10 | సోమవారం | : | స్వామి సుబోధానంద జయంతి |
| 12 | బుధవారం | : | స్వామి విజ్ఞానానంద జయంతి |
| 23 | ఆదివారం | : | ఏకాదశి |

# మేలు మరువని గుణమే ఆభరణం

- బి. సైదులు



మహేష్, సతీష్ మంచి మిత్రులు. ఒకసారి వారు ఎడారి గుండా సాగిపోతున్నారు. సరదాగా ప్రారంభమైన వారి సంభాషణ వివాదానికి దారితీసింది. దీంతో ఆగ్రహం చెందిన సతీష్ మహేష్ చెంప చెళ్లుమనిపించాడు. అయినా మహేష్ మారుమాట్లాడకుండా అతని వెంట నడుస్తూనే ఉన్నాడు. కొంత దూరం వెళ్లాక సతీష్ తనపై చేయి చేసుకున్నాడని చేతితో ఇసుకపై రాసి ముందుకు కదిలాడు మహేష్. ఇద్దరూ మౌనంగా నడుస్తూనే ఉన్నారు. ఇంతలో హఠాత్తుగా ఎడారిలో తుఫాను రేగడం; మహేష్ ఇసుకలో కూరుకుపోతుండడం గమనించాడు సతీష్. వెంటనే బలంగా పైకి లాగి మిత్రుడ్ని కాపాడాడు. ఇద్దరూ ప్రమాదం నుంచి బయటపడ్డారు. అలా కొంతదూరం వెళ్లాక మహేష్‌కి ఒక రాయి కనిపించింది. వెంటనే మహేష్ ఆ రాయి వద్ద నిలబడి, సతీష్ తనను ఎంతో సాహసంతో రక్షించాడని ఆ రాయిపై అక్షరాల్ని చెక్కాడు. అప్పుడు సతీష్ ఆశ్చర్యంగా 'అదేంటి! నేను నిన్ను కొట్టినప్పుడేమో ఆ విషయాన్ని ఇసుకపై రాశావు; నేను రక్షించినప్పుడేమో రాతిపై చెక్కావు' అని అడిగాడు. 'ఒకరు హాని చేసిన విషయాన్ని అప్పుడే మరచిపోవాలి, చేసిన సహాయాన్ని మాత్రం కలకాలం గుర్తుంచుకోవాలి; అందుకే అలా చేశాను' అన్నాడు మహేష్. జీవితంలో మనమందరం అలవరచుకోవాల్సిన ఆదర్శం ఈ 'కృతజ్ఞతా భావం'. పిడికెడు అటుకులు పెట్టినందుకే మిత్రుడికి పసిడిమేడలు ప్రదానం చేశాడు శ్రీకృష్ణపరమాత్ముడు. పట్టెడు ఇసుకమోసి తానుకట్టే వారధికి సాయపడినందుకు ఉడుతకు చిరకీర్తిని ప్రసాదించాడు శ్రీరామచంద్రుడు. ఎంతటి కృతజ్ఞతా భావమో చూడండి! అందుకే వారు పురుషోత్తములయ్యారు. కానీ నేడు మనం కొండంత సాయాన్ని కూడా క్షణాల్లోనే మరచిపోతున్నాం; కొద్దిపాటి కలతలకి కూడా కత్తులు నూరుతున్నాం.

### అపకారికీ ఉపకారం...

చంపదగినట్టి శత్రువు చేత చిక్కినా, కీడు చేయకపోగా మేలు చేసి పంపమన్న ధర్మభూమి మనది. కాని నేటి విపరీత పరిస్థితుల్లో అన్నం పెట్టిన చేతుల్ని కూడా అంతం చేసేందుకు వెనుకాడడం లేదు. పగలు, ప్రతీకారాలు పౌరుషానికి చిహ్నాలుగా భ్రమిస్తున్నాం; కానీ అవి అసుర లక్షణాలు. కృతజ్ఞతాభావం, క్షమాగుణం ధీరుల సుగుణాలు. "మనం ప్రతీకారానికి పూనుకోవాలని ప్రకృతి ప్రోత్సహిస్తుంది; దెబ్బకు దెబ్బ తీయమని తొందరపెడుతుంది. మోసానికి మోసంతో, మాటకు మాటతో సమాధానం చెప్పమని ప్రేరేపిస్తుంది. కానీ ఈ ప్రతీకార వాంఛను అదుపు చేసి, నిగ్రహాన్ని కనబరచడానికి దివ్యమైన శక్తి కావాలి" అనేవారు స్వామి వివేకానంద. ఆ దివ్యశక్తే మనల్ని ఆదర్శంగా నిలబెడుతుంది. అందుకే అపకారికీ ఉపకారం చేయగల ఉదారహృదయులే నిజమైన వీరులు.

### 'మేలు'కొలుపు...

Gratitude is not only the greatest of virtues; but the parent of all the others అంటాడు సిసిరో. కృతజ్ఞత మనని ఉత్కృష్ట స్థితికి చేరుస్తుంది. చేసిన మేలు మరవకూడదన్న భావన మన హృదయాన్ని విశాలం చేస్తుంది; స్వార్థాన్నీ, సంకుచితత్వాన్నీ దాటుకొని ఉన్నతంగా ఎదిగే మార్గం చూపెడుతుంది. కాస్తంత నీళ్లు చిలకరించినందుకే మొక్క, మోడులా కూలిపోయి కూడా సాయపడుతూ తన కృతజ్ఞతను ప్రకటిస్తుందే! మరి ఊపిరినిచ్చి, ఊతనిచ్చి మనల్ని ఈ ప్రపంచానికి పరిచయం చేసిన ఈ విధాతకు ఎంత కృతజ్ఞులమై ఉండాలి! కానీ ఆయన మననుంచి ఏమీ ఆశించడు! కేవలం తన దైవీగుణాలను పుణికి పుచ్చుకోవడమే తనకు చూపే కృతజ్ఞతగా భావిస్తాడు. స్వార్థభావాల నుంచి మనకు 'మేలు'కొలుపు పాడతాడు. సర్వజీవ సంరక్షకుడైన

ఆయన సృజించిన ప్రతి జీవినీ నిస్వార్థంగా ప్రేమించడం, సేవచేయడమే ఆయనకు మనం ఘటించే కృతజ్ఞతాంజలి.

**'ప్రతినాయకుడూ' దర్శకుడి పాత్రే...**

నిజానికి మనకు అపకారం చేసిన వ్యక్తిపట్ల, ప్రతికూలంగా ప్రవర్తిస్తున్న వ్యక్తిపట్ల వ్యతిరేకత పెంచు కోవలసిన అవసరం లేదు. ఉదాహరణకు చలనచిత్రాల్లో విలన్ పాత్రధారులపై ద్వేషం పెంచుకోం; కారణం దర్శకుడు చెప్పినట్లు ఆయా పాత్రల్ని వారు పోషిస్తున్నారని తెలిసి సాధారణంగానే తీసుకుంటాం. నిజజీవితంలో కూడా మనకు ప్రతికూలంగా ప్రవర్తిసున్న వారి విషయంలో అదే విధంగా స్పందించాలి. అది వారి తప్పు కాదనీ, ఆ మహాదర్శకుడు ఇచ్చిన పాత్రను వారు పోషిస్తున్నారని మనసుకు సర్దిచెప్పుకొని, ప్రసన్నంగా ఉండాలి; నిజానికి ప్రతినాయకులు ఉన్నప్పుడే నాయకుల గొప్పతనం తెలిసేది.

**కోరకూడనిది కృతజ్ఞత...**

Gratitude is the memory of the heart.... అంటారు ఓ అజ్ఞాత ఆంగ్లకవి. మనసు మాత్రమే మననం చేసుకోగల అందమైన జ్ఞాపకం కృతజ్ఞత. ఎదుటివారు చేసిన చిన్న సహాయాన్నైనా గుర్తు పెట్టుకొని కృతజ్ఞతను ప్రకటించడం ఓ అందమైన భావన. కాని మనం చేసే ఎంతటి సహాయానికైనా కృతజ్ఞతను ఆశించడం పొరపాటు. పరులకు తోడ్పాటు నందించడాన్ని మనం ఒక బాధ్యతగా భావించాలి; అలా సేవచేస్తూనే ఆనందపడాలి. కృతజ్ఞతపై, ప్రతిఫలంపై దృష్టిపెట్టకూడదు. తమకు సహాయ, సహకారాలందించేందుకు అవకాశం కల్పిస్తున్నందుకు నిజానికి వారికే మనం ఋణపడి ఉన్నాం. భగద్గీతలో భగవానుడు "న మాం కర్మాణి లింపంతి న మే కర్మఫలే స్పృహా... నేను ఆచరించే కర్మ నన్ను స్పృశించలేదు; ఆ ఫలాలపై నాకూ స్పృహే ఉండదు" అని స్పష్టంగా చెబుతున్నాడు. మనమూ ఆ లక్షణాన్ని అలవాటు చేసుకోవాలి. సేవనూ, త్యాగాన్నీ మన కర్తవ్యాలుగా భావించి ఆచరించి ఆనందించాలే కాని ఫలాలకోసం, ఎదుటివారి కృతజ్ఞతల కోసం నిరీక్షించకూడదు.

**...ఆ నలుగురి కోసం**

ఎంతటి సంపన్నుడికైనా పరుల సాయం అవసరమవుతూనే ఉంటుంది. అది గుర్తించి బ్రతికినన్నాళ్ళూ కృతజ్ఞతగా మసలుకోవాలి. అంతిమంగా అచేతనమైన ఆ శరీరాన్ని మోసుకెళ్ళే 'ఆ నలుగురి' రుణం ఈ జన్మలో ఏలాగూ తీర్చుకోలేం. అందుకే అందరితో ముందుగానే కృతజ్ఞతతో జీవిస్తే, అందులోంచి ఏ నలుగురో మనను, మన మంచితనాన్ని మోయడానికి ముందుకు వస్తారు. అహంభావాన్నీ, అధికారాన్నీ పక్కన పెట్టి వినమ్రంగా, కృతజ్ఞతగా నడచుకుంటే అదే మన జీవితానికి 'మేలు'కొలుపు.

## కృతజ్ఞత అంటే కృష్ణపరమాత్మునిదే....



శ్రీకృష్ణపరమాత్మ ద్వారకలోని తన నందనవనంలో ఆత్మీయులతో విహరిస్తున్నాడు. అర్ధాంగి రుక్మిణి ఓ వైపు, అనుంగు సోదరి ద్రౌపది మరోవైపు... వెంట పరిచారికలు... ఆహ్లాదంగా వెళుతూ గులాబీ తోటవైపు సాగిపోతున్నారు. ముచ్చటగా, ముగ్ధగా ఉన్న గులాబీలను సోదరికి, అర్ధాంగికి బహూకరించాలని స్వయంగా కోయడానికి ప్రయత్నించాడు వాసుదేవుడు. హడావిడిగా గులాబీమొక్కపై చేయి పెట్టిన శ్రీకృష్ణుడి చేతికి ముళ్ళు గుచ్చుకోవడంతో చేయంతా రక్తంతో తడిసిపోయింది. రుక్మిణీదేవి, పరిచారికలు కట్టుకట్టేందుకు వస్త్రం కోసం అంతఃపురంవైపు పరుగులు పెట్టారు. పక్కనే ఉన్న సోదరి ద్రౌపది మాత్రం తన పట్టుకొంగును చింపి అన్న చేతికి కట్టింది. రుక్మిణీదేవి, పరిచారికలు ఆ చెల్లెలి ఆత్మీయతకు కరిగిపోయారు. శ్రీకృష్ణపరమాత్ముడు చెల్లెలి కరుణాంతరంగానికి కదిలిపోయాడు... ఆ సోదరికి మరచిపోలేని ప్రతిఫలాన్ని ఇవ్వాలనుకున్నాడు. అలా, అలా కాలం గడిచిపోయింది. కౌరవసభలో దుశ్శాసనుడు ద్రౌపదిని వివస్త్రగా చేస్తున్న సందర్భమది. అన్నా! అన్న ఆ చెల్లి పిలుపు వినిపించింది ఆ ఆర్తజనబాంధవుడికి; ఆ చెల్లి గాయానికి కట్టిన పట్టుపీలిక గుర్తొచ్చింది. ఆ చెల్లి అనురాగానికి ప్రతిఫలంగా అనంతమైన వస్త్రాన్ని ప్రసాదించి, ఆమె మానాన్ని కాపాడాడు. తన కృతజ్ఞతను చాటుకున్నాడు.



# ప్రతి ఒకరూ సైనికుడే! భరతమాత సేవకుడే!!

– స్వామి రంగనాథానంద

**న్యాయశాస్త్రం చదివి చట్టవిరుద్ధంగా ప్రవర్తించడం... పౌరనీతి చదివి సామాజిక బాధ్యతలు ఎరగకపోవడం... వైద్యవిద్య చదివి వైజ్ఞానిక దృక్పథాన్ని కలిగి ఉండకపోవడం... ఇదంతా చదువును నవ్వులపాలు చేయడమే!**

విద్య లక్ష్యం ఏమిటి? విద్యా సముపార్జనకు మనకు తోడ్పడే అంశాలు ఏమిటి? విద్యార్జన కోసం తల్లితండ్రులు పడే తపన ఒక ఎత్తయితే, దేశ జాతీయాదాయం నుంచి విద్య కోసం ఎంత ఖర్చు అవుతుంది? విద్యార్జన తరువాత తల్లితండ్రులకీ, సమాజానికీ నేనేం చేయగలను? ఇలాంటి ప్రశ్నలు ప్రతి విద్యార్థిలోనూ కలగాలి. విద్య సరైన తీరులో అర్థం కావాలంటే దాని వెనుక ఎంతమంది తపన ఉన్నదో తెలియాలి. తెలిసి చదువుకుంటే దానికి విలువ ఎక్కువ. తరగతిలో ఉత్తీర్ణత పొందడం ఒక ఎత్తయితే, సామాజిక చైతన్యం, దేశాభిమానం, మన సంస్కృతీ సంప్రదాయాల పట్ల ఆరాధనాభావం, ప్రీతి, ప్రేమ ప్రతి విద్యార్థికీ రావడం పరిపూర్ణ విద్య లక్ష్యం.

ఒకసారి నేను హర్యానాలోని సోనేపట్ కళాశాలలో ప్రసంగించడానికి వెళ్ళాను. న్యాయశాస్త్రంలో పట్టభద్రులైన విద్యార్థుల ఎదుట ప్రసంగించాను. వారిలో చాలామంది ఢిల్లీ నుంచి ఈ కళాశాలకు వస్తారనీ, వారిలో ఎవరూ రైల్వే టికెట్టు కొనరనీ, వారంతా టిక్కెట్టు లేకుండానే ప్రయాణిస్తారనీ ఆ కళాశాల ప్రిన్సిపాల్ నాకు తెలిపారు.





నేను ప్రసంగిస్తూ ఆ విద్యార్థుల ప్రవర్తనను ఉద్దేశించి వారిని "యువకులైన మీరు రేపు ఉద్యోగబాధ్యతల్లో రాజ్యాంగాన్ని అమలుపరచాల్సిన వారు. న్యాయాన్ని చెప్పాల్సిన మీరు ఈ విధంగా చేయడం ఏమన్నా బాగుందా? మీరు ప్రజాస్వామ్య భారతదేశ పౌరులు కారా? మీరు రైలుబండిలో టిక్కెట్ తీసుకోకుండా ప్రయాణం చేస్తున్నారు. ఇదేనా మీ సంస్కృతి? మీ దేశం పట్ల మీకు ఏ విధమైన బాధ్యతా లేదా? ఈ విధంగా బాధ్యతారహితంగా ప్రవర్తించ డానికి మీకు సిగ్గుగా లేదా?" అంటూ మందలించాను.

ఆ రోజు నుంచి వారు బాధ్యతగా రైల్వే పాస్‌లు తీసుకొని రావడం మొదలుపెట్టారు. కాలేజీలో క్రమశిక్షణతో, గౌరవభావంతో మెలగడం వారికి అలవాటయిందనీ, తరువాతి తరం విద్యార్థులు కూడా ఇదే క్రమాన్ని అనుసరించేలా తీర్చిదిద్దామనీ ప్రిన్సిపాల్ చెప్పారు. విలువలతో కూడిన విద్య పిల్లలకు అందాలి.

ఆచరణ రూపం దాల్చని జ్ఞానం నిష్ఫలం. "కొండంత జ్ఞానం కన్నా ఇసుమంత ఆచరణ ముఖ్యం" అని స్వామి వివేకానంద చెప్పేవారు. దురదృష్టవశాత్తూ, వాస్తవంగా ఇప్పుడు యువతరంలో సామాజిక స్పృహ ఉండడం లేదు. బాధ్యత లేని స్వేచ్ఛ ప్రమాదకరం.

భారత పౌరునిగా పని చేయండి. భరతమాత సేవకుడిగా మెలగండి. బాధ్యతగల అందరిలోనూ సామాజిక స్పృహ అలవడితే దేశంలో విప్లవాత్మకమైన మార్పులను తీసుకురావచ్చు. కాబట్టి భరతమాత సేవలో ప్రతి ఒక్కరం సైనికులుగా మారుదాం. దేశాభివృద్ధికి తోడ్పడదాం.

*('మారుతున్న సమాజానికి శాశ్వత విలువలు' నుంచి)*

– సేకరణ: ఆర్. కృష్ణ

యువవాహిని

# ముందుకు సాగిపో! - అమిరపు నటరాజన్

**పి**ల్లవాడు 'చాక్లెట్ కావాలి! చాక్లెట్ కావాలి!!' అని గొడవ చేస్తున్నాడు. తల్లి ఒక చాక్లెట్ తీసి వాడి చేతిలో పెట్టింది. దాన్ని కొద్దిగా కొరికి ఆ పిల్లవాడు ఆనందంగా నాట్యం చేస్తున్నాడు. ఈ ప్రపంచంలో ఆ చాక్లెట్‌ను మించిన ఆనందకరమైన విషయం మరొకటి లేదు. ఆ చాక్లెట్‌ను మించిన సత్యం మరొకటి లేదు.

స్వామి వివేకానంద తన చిన్నతనంలో మిఠాయి గంపల్ని పక్కన పెట్టుకుని తింటూ ఉంటే చాలు అంతకన్నా గొప్ప ఆనందం లేదనుకున్నారట. కొంత ఎదిగిన తర్వాత ఒక గుర్రపు బండికి మంచి గుర్రాలు కట్టి, దాన్ని నడుపుతూ ఉంటే చాలు, అంతకు మించిన ఆనందం లేదనుకున్నారట. ఇంకొంత వయస్సు వచ్చిన తరువాత ఇంకొన్నిటి గురించి అలాగే అనుకున్నారట. తరువాత అవన్నీ చెబుతూ, 'ఈ రోజున ఆ ఆలోచనలన్నింటినీ చిన్న పిల్లల కలలు అనుకుంటున్నాను!' అని కొట్టిపారేశారు. అయితే వాటిలో ఆనందం లేదా అంటే - ఉంది. అయితే అది చిన్న పిల్లవాడి స్థాయిలోనూ, యువకుడి స్థాయిలోనూ మాత్రమే. తర్వాత నిస్వార్థమైన జీవనం ద్వారా, భగవత్సాక్షాత్కారం ద్వారా పొందే ఆనందం మాటలతో వివరించలేనంత గొప్పదనీ, అదే పరమ సత్యమనీ ఆయన చెప్పారు.

**"జీవితంలో నీ ఆదర్శం ఎంత గొప్పదైతే, నీ జీవితం అంత కష్టంతో కూడుకొని ఉంటుంది. ఎందుకంటే ఆ పరమ సత్యాన్ని తెలుసుకోవడం, దాని ద్వారా ఆనందాన్ని పొందడం సాధ్యమే కానీ, అది సులభం కాదు"** అని స్వామి వివేకానంద అన్నారు.

మనకు ప్రస్తుతం ఆనందాన్ని ఇచ్చే విషయం సత్యమే కదా! ఆ స్థాయిలోనే ఉండి మనం హాయిగా జీవితాన్ని గడపవచ్చు కదా! ఒక్క క్షణం ఆలోచించండి. అలా ఎల్లకాలం ఉండడం సాధ్యమేనా? చిన్నతనంలో ఆటలాడే వయస్సులో ఎన్ని మిఠాయిలు తిన్నా ఫరవాలేదు. కానీ అదే ఆనందాన్ని ఎక్కువ కాలం కొనసాగిస్తే మనం పొందిన దాని కన్నా మనకు వైద్యం చేయడానికి వచ్చే డాక్టర్లకు మన వల్ల ఎక్కువ ఆనందం కలుగుతుంది! జీవితంలోని భౌతికమైన ఆనందాలన్నిటికీ ఇదే చివరి నెలవు.

చిన్నతనంలో కబుర్లు, కాలక్షేపాలు, సినిమాలు, షికార్లు నచ్చుతాయి. కానీ "జీవితం అనేది కబుర్లతో, విందు వినోదాలతో వృథా చేసేంత చవకైనది కాదు!" అని స్వామి వివేకానంద చెప్పారు. వాటిలో ఆనందం ఎంతవరకూ ఉందో త్వరగా తెలుసుకొని, తృప్తి పెంచుకొని, మరింత గొప్ప ఆనందాన్ని ఇచ్చే ఉన్నత సత్యాల వైపు సాగవలసిందిగా స్వామీజీ ఉద్బోధ.

నేటి వినిమయ ప్రపంచంలో వస్తువులే మనకు ఆనందాన్ని ఇస్తాయనీ, అంతకన్నా గొప్ప మరొకటి లేదనీ ప్రచార మాధ్యమాలు నిద్ర ఎరుగని కోయిల్లా రాత్రింబవళ్ళూ కూస్తున్నాయి. సప్తవర్ణాలతో మెరిసే సబ్బునీటి బుడగలా ఆ ఆనందం ఏ క్షణమైనా పేలిపోవచ్చు. ఈ వినియోగ సంస్కృతి ప్రపంచాన్నే నాశనం చేస్తుందని శాస్త్రజ్ఞులు చెప్పడం లేదా! 'వేస్ట్ నాట్! వాంట్ నాట్!' అని ప్రపంచం మళ్ళీ సనాతన సత్యాలను కొత్త రాగంలో ఆలపిస్తోంది. కాలగర్భంలో కలిసిపోయిన మాయన్ నాగరకత మొదలు రోమన్ నాగరకత వరకూ అనేక ఉదాహరణలను చరిత్ర ఎత్తి చూపుతోంది. కోరికలు తీర్చుకోవడమే పరమసత్యమని ఆ యా నాగరకతలు నమ్మాయి. వాటికన్నా ఉన్నతమైన భావాలను పెంపొందించుకోలేకపోయాయి. అందువల్ల ఆ నాగరకతలు నాశనమయ్యాయి.

శ్రీరామకృష్ణ పరమహంస చెప్పిన 'ముందుకు సాగు' అనే కథ దీనికి మంచి పరిష్కారం చూపుతుంది:

"కట్టెలు కొట్టి జీవించేవాడొకడు ఉన్నాడు. వాడు ఒకసారి అడవిలో కట్టెలు కొడుతున్నాడు. అప్పుడు అతడికి ఒక సాధువు కనిపించి, 'నాయనా! మరికొంత ముందుకుపో!' అని సలహా ఇచ్చి తన దారిన తాను వెళ్ళిపోయాడు. పని ముగించుకొని కట్టెలు కొట్టేవాడు ఇల్లు చేరాడు. కానీ, సాధువు చెప్పిన మాట వాడి మనస్సులో ఇంకా మెదులుతూనే ఉంది. 'ఆ సాధువు నన్నెందుకు ముందుకు వెళ్ళమన్నాడు?' అని ఆలోచించాడు.

ఇలా కొన్ని రోజులు గడిచిపోయాయి. ఒకరోజు వాడికి ఆ సాధువు చెప్పినమాట మళ్ళీ జ్ఞప్తికి వచ్చి, 'ఈ రోజు అడవిలో ముందుకు పోవాలి' అని నిశ్చయించుకున్నాడు. ఆ ప్రకారం వాడు అడవిలో ఇంకా దూరం వెళ్ళేసరికి లెక్కలేనన్ని మంచిగంధపు చెట్లు కనిపించాయి. తన అదృష్టానికి వాడు సంతోషపడి బండ్లతో మంచి గంధపు చెక్క తెచ్చి, బజారులో అమ్మి చాలా భాగ్యవంతుడయ్యాడు.

కాలం గడుస్తూనే ఉంది. మళ్ళీ కొన్ని రోజులకు వాడికి సాధువు తనను 'మరింత ముందుకు పొమ్మన్న' సంగతి జ్ఞాపకానికి వచ్చింది. ఈసారి వాడు అడవిలో మరింత దూరం వెళ్ళాడు. అతడికి అక్కడ ఒక నది, దాని దగ్గర ఒక వెండి గని కనిపించాయి. వాడు ఇలా జరుగుతుందని కలలో కూడా ఊహించలేదు. తన అదృష్టాన్ని మెచ్చుకుంటూ గనిలో నుండి వెండిని బయటకు తీసి, బజారులో విక్రయించాడు. దాని వల్ల తన దగ్గర ఎంత సంపద ఉన్నదో కూడా గుర్తించలేనంత ధనవంతుడయ్యాడు.

'ఇలా మరికొంతకాలం గడిచింది. ఒకరోజు మళ్ళీ వాడు ఇలా ఆలోచించాడు: 'ఆ సాధువు నాకు, 'అక్కడ వెండి గని ఉంది, పో!' అని చెప్పలేదు గదా! ముందుకు సాగిపొమ్మని మాత్రమే చెప్పాడు. ఈసారి ఇంకా ముందుకుపోయి చూస్తాను.' ఇలా అనుకొని ఈమారు వాడు నదిని దాటి ఆవలి గట్టుకు చేరుకున్నాడు. అక్కడ వాడికి ఒక బంగారుగని కనిపించింది. 'అరే! చూశావా! ఇందుకోసమే ఆయన నన్ను ముందుకు పొమ్మని సలహా ఇచ్చాడు' అని సంతోషపడ్డాడు.

మళ్ళీ కొంతకాలం గడిచిపోయింది. వాడు ఇంకా, ఇంకా అడవిలో ముందుకు వెళ్ళాడు. అక్కడ వాడు రత్నాలు, వజ్రాలు, వైఢూర్యాలు రాసులు పోసి ఉండడం గమనించాడు. అవి కూడా తీసుకొని కుబేరుడంతటి వాడైపోయాడు."

ఇక్కడ మనకు కావలసింది వజ్ర వైఢూర్యాలు కాదు. తెలిసినదే సత్యం కాదనీ, మనకు అర్థమవుతున్న దాని కన్నా ప్రపంచంలో ఉన్నతమైన విషయాలు ఉన్నాయనీ తెలుసుకోవడం అన్నిటి కన్నా ముఖ్యమైన విషయం. భౌతిక సుఖాల్లోని ఆనందంకన్నా ఉన్నతమైన ఆనందం ఉందనే సత్యాన్ని మరువరాదు. ఆ సత్యాన్వేషణలో ముందుకు సాగితే మనం మరింత ఆనందంగా జీవించగలుగుతాం.



## జీవన మాధురీ జావళి
# దీపావళి

- ఏ.ఎస్. మూర్తి

దీపం ఆనందానికీ, ప్రగతికీ చిహ్నం. అది సృష్టికీ, సృష్టిలోని చైతన్యానికీ ప్రతీక. అది అవాఙ్మానసగోచరుడైన పరమాత్ముని ప్రతిరూపం. 'దీపం జ్యోతి పరబ్రహ్మం' అని భారతీయ సంస్కృతి మన పూజావిధానంలో దీపారాధనకు పవిత్ర ప్రాధాన్యతనిస్తుంది. మన పండుగలలో అత్యంత ప్రాధాన్యమైన దీపావళి పండుగ దీపాల పండుగగా ప్రసిద్ధిచెంది అటు వేదాంత పరమైన ఆధ్యాత్మిక తత్త్వానికీ ఇటు లౌకిక పరమైన జీవన విధానానికీ సంయమనంగా నిలిచి ప్రతి యేటా మనకు ఆనందోత్సాహాలను అందిస్తుంది.

ప్రతి సంవత్సరం ఆశ్వయుజ బహుళ అమావాస్యనాడు జరుపుకునే దీపావళి పండుగ అనేక రకాలుగా ప్రశస్తమైనదిగా నిర్వహించబడుతోంది. కొత్త సంవత్సరం, కొత్త ఋతువు తెచ్చే పండుగ ఉగాది ఆ తర్వాత శ్రీరామనవమి. శ్రావణ మాసంలో కృష్ణాష్టమి, భాద్రపద మాసంలో వినాయకచవితి, ఆశ్వయుజంలో దసరా ఉత్సవాలు జరుపుకున్న తర్వాత ప్రజావళి రాబోయే శీతాకాలపు చలికి, చీకటి రాత్రులకు భయపడమని చెబుతూ దీపాల కాంతులతో, టపాసుల చిటపట పేలుళ్ళతో, పూజలతో, విందులతో వినోదాలతో ఆనందంగా, ఉల్లాసంగా జరుపుకునే సంబరాల సందడి 'దీపావళి' పండుగ.

మనం జరుపుకునే అన్నీ పండుగలలాగే దీపావళికి కూడా ఎంతో విశిష్టమైన చరిత్ర ఉంది. సృష్టి, స్థితి, లయకారుడైన పరమాత్మ తాను మహావిష్ణువుగా అవతారం దాల్చినప్పుడు క్షీరసాగర తనయ లక్ష్మీదేవిని వివాహం చేసుకున్న పుణ్యదినం దీపావళి అనీ, శ్రీమహా విష్ణువు వటువుగా బలిచక్రవర్తి నిర్వహిస్తున్న విశ్వజిత్ యాగానికి వచ్చి ఆ బలి నుండి మూడడుగులు వరంగా పొంది బలిని పాతాళానికి అణచివేసి ఆతని సత్య సంధతకీ, భక్తికీ, వదాన్యతకీ ప్రీతి చెంది అతనిని పాతాళానికి ప్రభువుచేసిన వామనమూర్తి త్రివిక్రమావతారం దాల్చిన మహాపుణ్యదినం దీపావళి అనీ, ఆ మహావిషువు రామావతారంలో రావణుని సంహరించి సీతాదేవితో అయోధ్యకు తిరిగివచ్చి చక్రవర్తిగా పట్టాభిషిక్తుడైన శుభదినమే దీపావళి అనీ, శ్రీకృష్ణుడు సత్యభామా సమేతుడై నరకాసురుని వధించి అతని చెర నుండి వేలాది మందిని విడిపించడమేకాక అతని కంటక బాధల నుండి ప్రజావళిని విముక్తి చేసి ఆనందం కలుగజేసిన కళ్యాణ దినమనీ పలురకాలుగా, ప్రసిద్ధ అవతారల ఆరాధనా పుణ్యపండుగ దినంగా దీపావళి భారతీయులందరి చేత నిర్వహించబడుతోంది.

ఆశ్వయుజ బహుళ అమావాస్యనాడు దీపావళి. ఈ పండుగను ప్రజలు సాధారణంగా నాలుగు రోజులు జరుపుకుంటారు. అమావాస్య ముందురోజు నరకచతుర్దశి నరకాసురునిపై శ్రీకృష్ణ సత్యభామల విజయోత్సవ దినం. అమావాస్య దీపావళి పండుగనాడు దీపాల ఉత్సవం, లక్ష్మీ పూజ జరుపుకుంటారు. ఆ మరునాడు కార్తీక శుద్ధపాడ్యమి బలి పాతాళం నుండి భూలోకానికి వచ్చి భూమిని పాలించే అధికారాన్ని పొందిన రోజుగా బలి ఆరాధనా దినం. ఆ మరునాడు కార్తీక శుద్ధ విదియ అక్క చెల్లెళ్ళు అన్నదమ్ములను ఆహ్వానించి షడ్రసోపేతంగా విందునిచ్చే సోదర సన్మానదినంగా నిర్వహించబడుతుంది.

భారతీయ పండుగలలో దీపావళి ఆధ్యాత్మికంగానూ, లౌకికంగానూ ప్రాధాన్యతగల పండుగ. ఇతరుల జీవితాలలో వెలుగులు పంచాలనీ; విజ్ఞానానికీ, వికాసానికీ ప్రతీకలైన దీపాల వలె మనం మన జీవితాలలో విద్య, ప్రగతి సాధించాలనీ దీపావళి మనకు జీవిత పరమార్థాన్ని బోధిస్తుంది.



# రామకృష్ణ మిషన్, కడప

పుట్లంపల్లి, రిమ్స్ ఆసుపత్రి దగ్గర, కడప - 516 002.

ఫోన్ : 08562 - 200120, 200633 Email : kadapamath@yahoo.com

## విన్నపం

రామకృష్ణ సంఘ రెండవ సర్వాధ్యక్షులైన స్వామి శివానందజీ మహరాజ్, ఖాన్ బహదూర్ మంజుమియా అనే ముస్లిం భక్తుని ఆహ్వానంపై రాయలసీమ ప్రాంతంలో కడప పట్టణాన్ని సందర్శించారు. పూజ్య స్వామీజీ సందర్శన భాగ్యమే నేటి రామకృష్ణ మిషన్ శాఖ ఆవిర్భవానికి నాంది. కడపలో సుమారు తొమ్మిది దశాబ్దాలుగా 'రామకృష్ణ సమాజం' పేరిట నిర్వహించబడుతున్న ఈ సంస్థ 2005లో రామకృష్ణ మిషన్ శాఖగా గుర్తింపు పొందింది. 2007లో ఈ శాఖ కడపలోని పుట్లంపల్లి గ్రామంలో 10 ఎకరాల నూతన ప్రాంగణానికి మార్చబడింది.

గత మూడు సంవత్సరాల్లో కడప రామకృష్ణ మిషన్ నూతన ప్రాంగణంలో సభాగృహం, సాధునివాసం, రామకృష్ణ బాలకాశ్రమం నిర్మించి ఎన్నో సేవా కార్యక్రమాలకు శ్రీకారం చుట్టింది.

1. రాయలసీమ ప్రాంతంలోని పాఠశాల, కళాశాలల్లో విలువలతో కూడిన విద్యను ప్రచారం చేసే దిశలో కార్యక్రమాలు చేపట్టడం జరిగింది. ఈ కార్యక్రమాలన్నీ కూడా అనుభవజ్ఞులైన సిబ్బంది సహాయంతో, దృశ్య, శ్రవణమాధ్యమాల సహకారంతో వైవిధ్యమైన రీతిలో నిర్వహిస్తున్నాం.

2. ఆర్థికంగా వెనుకబడిన గ్రామీణ విద్యార్థులకు సముచిత విద్య గరపడానికి 'శ్రీరామకృష్ణ బాలకాశ్రమము' ప్రారంభించాం. ఆర్థికంగా వెనుక బడిన బాలురకు ఆశ్రయం కల్పించడమే మా లక్ష్యం. ఈ నేపథ్యంలో ప్రస్తుతం పదిమంది విద్యార్థులకు భోజన, వసతి సౌకర్యాలతో పాటు దుస్తులు, పుస్తకాల ఖర్చులు, రవాణా సౌకర్యాలు కల్పిస్తున్నాం. ఈ విద్యా సంవత్సరం నుండి ముప్ఫై మంది బాలురకు ఆశ్రయం కల్పించాలన్నది లక్ష్యంగా నిర్ణయించుకున్నాం.

3. నిరుద్యోగ గ్రామీణయువతకు ఉద్యానవన, తత్సంబంధిత విభాగాల్లో ఉచితంగా వసతి సౌకర్యంతో శిక్షణా కార్యక్రమాల్ని నిర్వహిస్తున్నాం. వారం నుంచి పదిరోజుల పాటు రెండు దఫాలుగా ఈ శిక్షణకార్యక్రమాల్ని ఏర్పాటు చేయడం జరిగింది.

కడప ట్రంకురోడ్డులో ఉన్న సిటీ సెంటర్‌లో యువతకు "ఆంగ్లసంభాషణా తరగతులు" (Spoken English Courses) ప్రారంభిస్తున్నాం.

అదేవిధంగా విలువలతో కూడిన విద్యను అందించాలన్న ఆశయంతో 'వివేకానంద విద్యా నికేతనం' పాఠశాలను ప్రారంభించి, తొలిదశలో ప్రీ ప్రైమరీ నుండి ఏడవ తరగతి వరకూ పాఠశాలను నిర్వహించాలని సంకల్పించాం.



'వివేకానంద విద్యానికేతన్' భవన నమూనా

ఈ క్రింద తెలుపబడిన సేవా కార్యక్రమాలకు ఉదారులైన దాతల నుండి ఆర్థిక సహాయ సహకారాల్ని కోరుతున్నాం.

1. 'శ్రీ రామకృష్ణ బాలకాశ్రమం' విద్యార్థులలో ఒకరి లేదా కొందరి నిర్వహణ బాధ్యతను స్వీకరించవచ్చు. ఒక బాలుడికి సంవత్సరానికి అయ్యే ఖర్చు 15 వేల రూపాయలు.
2. బాలకాశ్రమ నిర్వహణకు గాను 60 లక్షల రూపాయలతో శాశ్వత నిధి ఏర్పాటుకై మీ విరాళాన్ని అందించవచ్చు.
3. 69 లక్షల రూపాయలతో నిర్మించనున్న 'వివేకానంద విద్యా నికేతనం' పాఠశాల భవనానికి దాతలు విరాళాలు అందజేయవచ్చు.

విరాళాలను 'Ramakrishna Mission, Kadapa పేరున డిడి/చెక్కుల రూపంలో Ramakrishna Mission, Putlampalli, Kadapa - 516 002 కు పంపవలసిందిగా మనవి. విరాళాలకు సెక్షన్ 80 –జి కింద ఆదాయపు పన్ను మినహాయింపు కలదు.

కడప రామకృష్ణ మిషన్ సేవా కార్యక్రమాలకు ఆర్థికంగా, హార్దికంగా చేయూతనిచ్చి భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ఆశిస్తూ...

**భగవత్సేవలో**
**స్వామి ఆత్మవిదానంద**
కార్యదర్శి

ADVT.

# 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

| దాత పేరు | విద్యాసంస్థ |
|---|---|
| శ్రీ పి. విశ్వేశ్వరరావు, ముషీరాబాద్, హైదరాబాద్-20 | పిఠాపురం మహారాజా కళాశాల, కాకినాడ - 1 |
| శ్రీ వి.వి. శ్రీహరీష్, మయూర్ విహార్, ఫేజ్ -1, ఢిల్లీ | రెహానా ఇంగ్లీష్ మీడియం పాఠశాల, బండమోతె, అనంతపురం |
| " " " | క్రిస్టియన్ కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్, రేపల్లె, గుంటూరు జిల్లా |
| " " " | ఎ.ఎమ్.జి. కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్, చిలకలూరిపేట, గుంటూరు జిల్లా |
| శ్రీ కె. ముని కృష్ణారెడ్డి, శ్రీకృష్ణదేవరాయ నగర్, తిరుపతి | డిస్ట్రిక్ట్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఎడ్యుకేషన్ అండ్ ట్రైనింగ్, ధవళేశ్వరం |
| " " " | ఎలిమ్ కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్, అమలాపురం-533 201 |
| శ్రీ జి. నిర్మల, ఎస్.ఆర్.సి. నాయక్‌నగర్, జీడిమెట్ల, హైదరాబాద్ | ఎస్.జి.ఎస్. ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ అడ్వాన్స్‌డ్ స్టడీ ఇన్ ఎడ్యుకేషన్, రాజమండ్రి |
| " " " | శ్రీమతి అద్దేపల్లి మహాలక్ష్మీదేవి ఎయిడెడ్ కాలేజ్, దానవాయిపేట, రాజమండ్రి |
| " " " | కృష్ణ ముక్తేశ్వర కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్, ముక్తేశ్వరం, తూర్పుగోదావరి జిల్లా |
| శ్రీ వి.ఎస్. మణిశర్మ, సర్దార్‌బాగ్, మెహదీపట్నం, హైదరాబాద్ | ఎ.ఎమ్.జి. కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్, చిలకలూరిపేట, గుంటూరు జిల్లా |
| శ్రీ హిమాద్రిజ మండల్, బేగంపేట, హైదరాబాద్ - 500 016 | ఆచార్య ఎన్.జి.రంగా కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్, చిలుమూరు, గుంటూరు జిల్లా |
| " " " | డి.ఇ.ఇ.టి., వంకాయలపాడు, బోయపాలెం, గుంటూరు జిల్లా - 522 233 |
| " " " | వెంకటేశ్వర హెచ్.పి.టి. కాలేజ్, నల్లపాడు, తెనాలి, గుంటూరు జిల్లా |
| శ్రీ ఎ. రామచంద్రారెడ్డి, పంజాగుట్ట, హైదరాబాద్ | రాయపాటి వెంకట రంగారావ్ కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్, పట్టాభిపురం,గుంటూరు |
| " " " | రేపల్లె క్రిస్టియన్ కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్, రేపల్లె, గుంటూరు జిల్లా - 522 265 |
| " " " | సెయింట్ జోసెఫ్ కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్, సాంబశివపేట, గుంటూరు |
| కీ॥శే॥ ఎమ్. బుచ్చిరెడ్డి జ్ఞాపకార్థం, ఎమ్. సత్యనారాయణరెడ్డి, హైదరాబాద్ | శ్రీ సరస్వతీ శిశుమందిర్, ముల్కాలపల్లి, ఖమ్మం - 507 115 |
| యాతం సుబ్రహ్మణ్యం, చైతన్యపురి, హైదరాబాద్ - 500 060 | మహాత్మా గాంధీ జూనియర్ కాలేజ్, ఆత్రేయపురం, తూర్పుగోదావరి జిల్లా |
| బి.హెచ్.ఎల్. ప్రసాద్, జామై ఉస్మానియా, హైదరాబాద్ | డివైన్ లైఫ్ సొసైటీ, హిమాలయాస్, తెహ్రీ గర్వాల్ జిల్లా -249 192 |
| " " " | హాజీ మహమ్మద్ ఖాసిమ్ & మహమ్మద్ గులాబ్ సాహెబ్ కాలేజ్, కంగల,గుంటూరు |
| " " " | వినుకొండ బి.ఇ.డి కళాశాల, నరసారావుపేట, గుంటూరు జిల్లా |
| శ్రీ ఎ. ప్రతాప్ కుమార్, నూజివీడు, కృష్ణా జిల్లా - 521 201 | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, ముసునూరు, కృష్ణా జిల్లా- 521 207 |
| " " " | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, రామనక్క పేట, ముసునూరు, కృష్ణా జిల్లా |
| " " " | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, చెక్కపల్లి, ముసునూరు మండలం, కృష్ణా జిల్లా |
| " " " | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, వేపుచర్ల, ముసునూరు మండలం, కృష్ణాజిల్లా-521 207 |
| " " " | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, గోపవరం, ముసునూరు మండలం, కృష్ణా జిల్లా |
| " " " | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, గుడిపాడు, ముసునూరు మండలం, కృష్ణా జిల్లా |
| శ్రీమతి డి. కమలమ్మ, జూబ్లీ హిల్స్, హైదరాబాద్ - 500 033 | ప్రాథమికోన్నత పాఠశాల, పొట్లంపాడు, ముతుకూరు, నెల్లూరు జిల్లా- 524 346 |
| సీనియర్ సిటిజన్స్ కౌన్సిల్, రాజీవ్‌నగర్, హైదరాబాద్- 500 045 | ప్రభుత్వ మహబూబియా ఉన్నత పాఠశాల, జె.పి.ఎన్. రోడ్, వరంగల్ జిల్లా |
| " " " | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, ముచకూర్, భీమ్‌గల్, నిజామాబాద్ జిల్లా |
| " " " | రత్నాలయం దేవాలయం, షామీర్‌పేట్, రంగారెడ్డి జిల్లా - 501 001 |
| శ్రీ కె.జి. కృష్ణమూర్తి, న్యూ మలక్‌పేట, హైదరాబాద్ - 500 036 | జె.ఎన్.ఎస్. జెడ్.పి.హెచ్ పాఠశాల, యలమంచలి, పశ్చిమ గోదావరి జిల్లా |
| " " " | లైబ్రరీ, మహావీర్ మెమోరియల్ జూనియర్ కాలేజ్, ఇందిరాగాంధీనగర్, గుంటూరు |
| " " " | కేరళ ఇంగ్లీష్ మీడియమ్ స్కూల్, హుస్నాబాద్, కరీంనగర్ జిల్లా - 505 467 |
| శ్రీ కె. గణపతి, మధురానగర్, హైదరాబాద్ - 500 038 | బ్రహ్మమ్ టాలెంట్ హైస్కూల్, మధురానగర్, హైదరాబాద్ - 500 038 |
| శ్రీమతి శ్యామలీ శ్యామ్, సైనిక్‌పురి, సికింద్రాబాద్ - 500 094 | భవాన్స్ శ్రీరామకృష్ణ విద్యాలయ, సైనిక్‌పురి, సికింద్రాబాద్ - 500 094 |
| శ్రీ మూర్తి హెచ్.ఎన్, వారాసిగూడ, సికింద్రాబాద్ - 500 061 | నెహ్రూ ఉన్నత పాఠశాల, నామాలగుండు, సీతాఫల్ మండి, సికింద్రాబాద్ |
| శ్రీ వేణుగోపాల్ రెడ్డి, ఇనుమల పల్లి, పుట్టపర్తి, అనంతపురం జిల్లా | ట్రినిటీ కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్, పెద్దపల్లి, కరీంనగర్ జిల్లా |
| " " " | డి.ఇ.ఇ.టి., ఎల్. ఎమ్.డి. కోల్, తిమ్మాపూర్, కరీంనగర్ జిల్లా - 505 527 |
| " " " | క్రెసెంట్ కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్, ముబ్రమ్‌పూర్, కరీంనగర్ జిల్లా - 505 001 |

ఈ పథకం ద్వారా శ్రీరామకృష్ణ ప్రభను మరింతమందికి చేరువ చేస్తున్న దాతలకు కృతజ్ఞతలు.

...17వ పేజీ తరువాయి.


9
ఒక్క తాంబూలం మాత్రం మిగిలిపోయింది. ఇంకా ఎవరయినా లోపల ఉన్నారేమో చూడండి!
మండపంలో ఎవరూ లేరు మహారాజా! ఆ ప్రాంతమంతా శుభ్రం చేస్తూ, కడుగుతున్నారు!
ఆశ్చర్యం! వచ్చింది 999 మంది భక్తులు. భోజనం చేసింది వెయ్యిమంది భక్తులు. ఆ వెయ్యో భక్తునిగా భోజనం చేసింది ఎవరు?


10
ఈ అద్భుతం ఇలా చాలా రోజులు జరిగింది. కానీ ఆ వెయ్యవ శివభక్తుడు ఎవరన్నది ఎవరూ కనిపెట్టలేక పోయారు. మహారాజు ఆ ఆలోచనతోనే ఉన్నాడు.


11
ఒకరోజు మహరాజుకు స్వప్నంలో పరమేశ్వరుడు కనిపించి...
12
అలా చాలాకాలం శివభక్తులకు భోజనాలు పెట్టి, మహారాజు పరమానందం పొందాడు. కానీ ఆ వెయ్యవ భక్తుణ్ణి గుర్తు పట్టలేకపోయాడు. మహారాజు వృద్ధుడయ్యాడు.


రాజా! నా భక్తులకు భోజనం పెట్టి నన్ను ఆనందింపజేశావు! ఆ వెయ్యవ భక్తుడిని నేనే!
పరమేశ్వరా! ప్రాణులన్నిటికీ ఆహారమిస్తున్న మీరు మా ఇంట జరుగుతున్న విందు భోజనానికి వేంచేశారు! ఏమి నా మహద్భాగ్యం!

13 మహారాజా! ప్రతిరోజూ నేను నీ ఇంటికి విందు భోజనానికి వస్తున్నాను కదా! ఇంకా నువ్వు నన్ను గుర్తు పట్టలేదా?

మీ కృపాకటాక్షం లేనిదే మిమ్మల్ని గుర్తుపట్టగలమా? ఇంత కాలమూ తమతో కలసి విందు భోజనం చేశామని భక్తులకు తెలిస్తే వారు ఎంతగా ఆనందిస్తారు! ఈ మారు కూర్చున్న చోట ఏదైన ఒక గుర్తును వదలి వెళితే దానిని మేము ఆరాధించి ధన్యులమయ్యే అదృష్టం మా అందరికీ లభిస్తుంది కదా!

మహారాజా! రేపు ఏం జరుగుతుందో చూడండి.

14 విందు భోజనాలు ముగిసిన మండపంలో భోజనం చేసిన ఆకులు మాత్రమే కనిపిస్తున్నాయి. మహారాజు పరిశీలిస్తూ ముందుకు వెళుతున్నాడు. ఒకచోట పరమేశ్వరుని విగ్రహం, ప్రక్కనే చేతికర్ర ఒకటి కనబడ్డాయి!

ఆహా! సాక్షాత్తు పరమేశ్వరుడే శిలారూపం దాల్చి, అందుకు గుర్తుగా తన చేతిదండాన్ని కూడా ఉంచాడు కదా! పరమేశ్వరుడు ఎంతటి కరుణామయుడు!

15 ఆక్కూరులో 'వెయ్యిలో ఒకరు' అనే పేరుతో పరమేశ్వరుడు స్వయంభువుగా నెలకొని ఉన్నాడు. తాను ఒక భక్తునిగా వచ్చిన గుర్తుగా రెండు చిలుకలున్న చేతి కఱ్ఱను దాల్చి, రెండు చేతులలో జింక, గొడ్డలిని ధరించి యౌవనం ఉట్టిపడే తేజోమూర్తిగా పరమేశ్వరుడు విరాజిల్లుతూ ఉండడం నేటికీ కన్నుల పండుగగా దర్శించవచ్చు.

**తీవ్రమైన వ్యాకులత ఉంటే భగవంతుణ్ణి నిశ్చయంగా దర్శించవచ్చు. తల్లిని చూడాలని బిడ్డ ఎలా ఆరాటపడతాడో అలాంటి ఆరాటం, విశ్వాసం భక్తునికి ఉండాలి.**

**- శ్రీరామకృష్ణ పరమహంస**



# స్వామి రంగనాథానందజీ మహరాజ్ శత జయంతి ఉత్సవాలు

## (2008 డిసెంబర్ 11 నుండి 15 వరకు)

15.12.1908 - 15.12.2008



రామకృష్ణ మఠం, మిషన్‌ల 13వ సర్వాధ్యక్షులైన స్వామి రంగనాథానందజీ మహరాజ్ వారి శత జయంతి మహోత్సవాలను 2008 డిసెంబర్ 11 నుంచి 15 వరకు హైదరాబాద్ రామకృష్ణ మఠంలో ఘనంగా జరపాలని *'స్వామి రంగనాథానందజీ మహరాజ్ శత జయంతి ఉత్సవాల పౌర సంఘం'* నిర్ణయించింది.

20వ శతాబ్దంలో భారతీయ సనాతన ధర్మాన్నీ, శ్రీరామకృష్ణ - వివేకానందుల సందేశాన్నీ దేశవిదేశాల్లో వ్యాప్తి చేసిన ఘనత స్వామి రంగనాథానందజీ మహరాజ్‌దే. మహరాజ్ వారు అహర్నిశలూ కృషి చేసి హైదరాబాద్ రామకృష్ణ మఠ ఆవిర్భావానికీ, పురోభివృద్ధికి తోడ్పడ్డారు. ఆంధ్రప్రదేశ్ ప్రజలలో రామకృష్ణ సంప్రదాయం పట్ల అవగాహనను విస్తృతం చేయడంలో ఆయన కీలక పాత్ర వహించారు.

ఆ మహత్తర సాధుపుంగవుని జ్ఞప్తి చేసుకొంటూ ఆయన శతజయంతి మహోత్సవాల్ని ఘనంగా జరుపుకోవడం ముదావహం. ఈ శతజయంతి వేడుకల్లో - యువతీయువకుల సదస్సులు, మహిళా సదస్సులు, ఉపాధ్యాయుల సదస్సులు, కార్యనిర్వహణ బృందాల సమావేశాలు, సుప్రసిద్ధ వక్తల ప్రసంగాలు, భజనలు, సాంస్కృతి కార్యక్రమాలు నిర్వహించబడతాయి. పూజ్య మహరాజ్‌వారి రచనల్లో కొన్ని ఎంపిక చేసి ఒక స్మారక సంచిక ఈ సందర్భంగా విడుదలవుతుంది. భక్తులు, అభిమానులు అధిక సంఖ్యలో పాల్గొని ఈ మహోత్సవాలను విజయవంతం చేయాలని ప్రార్థిస్తున్నాం.

***స్వామి రంగనాథానందజీ మహరాజ్***
***శతజయంతి ఉత్సవాల పౌర సంఘం***

*కన్వీనర్:* జి.ఎన్. ఫణికుమార్, I.A.S., Commissioner APARD
**వివరాలకు :** ప్రేమ్‌కుమార్ సింగ్, ఆర్గనైజింగ్ సెక్రటరీ, రామకృష్ణ మఠం, దోమలగూడ, హైదరాబాద్-500 029
సెల్.నెం. 98499 85842

H ***ఈ ఉత్సవాల్లో పాల్గొనే భక్తులకు వసతి సౌకర్యం కల్పించడం సాధ్యం కాదని మనవి.***

---

## విన్నపం



## రామకృష్ణ మిషన్,

**బేలూరు మఠం, హౌరా - 711 202**

బీహార్, ఉత్తర్ ప్రదేశ్ రాష్ట్రాల్లో ఆగష్టు నెలలో సంభవించిన భారీ వరదల కారణంగా అనేక ప్రాంతాలు జలమయమయ్యాయి. ఈ ప్రాంతాల్లో నిరాశ్రయులైన వేలాది మంది వరద బాధితులకు రామకృష్ణ మిషన్ తక్షణ సహాయక చర్యలను చేపట్టింది.

రామకృష్ణ మిషన్ కేంద్రాలు బీహార్ రాష్ట్రంలో కటిహార్ జిల్లాలోని కుర్సెలా, సహర్స జిల్లాలోని బాధితులకు ఆహారపు పొట్లాలు, పంచదార, అటుకులు, మందులు, ఇతర నిత్యావసర సామగ్రిని అందించాయి; ఉత్తరప్రదేశ్‌లో లక్నో జిల్లాలోని భక్షి-కా-తలాబ్ తహసిల్ ప్రాంతంలో నిరాశ్రయులైన 3000 మందికి తాత్కాలిక పునరావాస శిబిరాల్ని ఏర్పాటు చేసి వారికి ఆహారం, మందులు సరఫరా చేశాయి.

వరద బాధితులకు సహాయక చర్యలు ఇంకా కొనసాగుతున్నాయి. ఈ సేవా కార్యక్రమాల నిమిత్తం దాతల నుంచి విరాళాలను కోరుతున్నాం. విరాళాల్ని 'Ramakrishna Mission,Kolkata' పేరున చెక్కు, డి.డి. లేక నగదు రూపంలో ఈ క్రింది చిరునామాకు పంపగలరు.

**The General Secretary**
**Ramakrishna Mission**
**P.O. Belur Math, Howrah**
**West Bengal - 711 202**

**Ph: 033 - 2654 9581/9681, Fax : 2654 9885**
**E-mail : rkmrelief@gmail.com**
**Website: www.belurmath.org/relief**

విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలో 80(జి) సెక్షన్ క్రింద పన్ను మినహాయింపు కలదు.

## వ్యక్తిత్వవికాస శిక్షణా శిబిరాలు





**ప్రకాశం జిల్లా కనిగిరి శ్రీరామకృష్ణ సేవా సమితి** ఆగష్టు 21, 22, 23 తేదీలలో కనిగిరి మండలంలోని 15 పాఠశాల, కళాశాలల్లో వ్యక్తిత్వ వికాస శిక్షణా శిబిరాల్ని నిర్వహించింది. ఈ కార్యక్రమాల్లో శ్రీరామకృష్ణ ప్రభ సంపాదకులు స్వామి పరిజ్ఞేయానంద మహరాజ్, గుంటూరు 'Step forward' వ్యక్తిత్వ వికాస శిక్షణా సంస్థ అధినేత శ్రీ ఎస్. గమనం పాల్గొని విద్యార్థినీ విద్యార్థులకు 'నైతిక విలువలు, ఏకాగ్రతా రహస్యం' మొదలైన అంశాలను బోధించారు.

**నివేదిక: ఎమ్.బాలకృష్ణా రెడ్డి,శ్రీరామకృష్ణ సేవాసమితి, కార్యదర్శి**

## విద్యార్థులకు స్ఫూర్తిదాయిని 'వివేక వాహిని'

**విజయవాడ రామకృష్ణ మిషన్** భావ ప్రచార రథం 'వివేక వాహిని' 2008 జూలై, ఆగష్టు నెలల్లో మచిలీపట్నం, కాకినాడ, ఖమ్మం జిల్లా, విజయనగరం జిల్లా, విశాఖపట్నం జిల్లాల్లోని 44 విద్యా సంస్థల్లో వ్యక్తిత్వ వికాస సదస్సులను, 15 ప్రాంతాల్లో సత్సంగాలను నిర్వహించింది. 20,000 మంది విద్యార్థులు ఈ సదస్సుల్లో పాల్గొని 1,20,000 రూపాయల విలువ చేసే వివేకానంద సాహిత్య గ్రంథాలను కొన్నారు.



**జూలై 7-10 మచిలీపట్నం:** పెనుమల్లి, ముంజులూరు, కొంకేపూడి, పెడన, చెన్నూరు- జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాలలు; బాలాజీ విద్యాలయం, మచిలీపట్నం.

**జూలై 21-24 కాకినాద :** రామకృష్ణ పబ్లిక్ స్కూల్, ఎ.ఎస్.డి ప్రభుత్వ మహిళా కళాశాల, జూనియర్ కళాశాల, పి.ఆర్. ప్రభుత్వ డిగ్రీ, జూనియర్ కళాశాలలు, ఎ.పి.ఎస్.పి బాలికల రెసిడెన్సియల్ ఉన్నత పాఠశాల& జూనియర్ కళాశాల, ఐడియల్ కళాశాల, ఆదిత్య జూనియర్, డిగ్రీ కళాశాలలు.

**ఆగష్టు 4 గుంటూరు జిల్లా:** చినకాకాని-NRI వైద్యకళాశాల;

**ఆగష్టు 5-9 విజయనగరం జిల్లా:** విజయనగరం- మహారాజా పి.జీ.సెంటర్; చింతలవలస-ఎమ్.వి.జి.ఆర్ ఇంజనీరింగ్ కళాశాల; రామతీర్థం, సారిపల్లి-జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాలలు; నెల్లిమర్ల-ప్రభుత్వ జూనియర్ కళాశాల, చక్ర జూనియర్ కళాశాల, ఎ.పి. సాంఘిక బాలికల రెసిడెన్సియల్ ఉన్నత పాఠశాల&జూనియర్ కళాశాల; విజయనగరం- MIMS మెడికల్ కాలేజీ, గురజాడ ఇంగ్లీష్ మీడియమ్ స్కూల్.

**ఆగష్టు11 -14 విశాఖపట్నం జిల్లా:** దాకమర్రి - రఘు జూనియర్ కళాశాల&హైస్కూలు; భీమిలి - ప్రభుత్వ జూనియర్ కళాశాల, DIET టీచింగ్ ట్రైనింగ్ కళాశాల, జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల; చిట్టివలస- అంబేద్కర్ హైస్కూల్, శారదా పబ్లిక్ స్కూలు, జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, శ్రీరామకృష్ణ విద్యాలయం; గుడిలోవ - విజ్ఞాన విహార విద్యా సంస్థలు; మధురవాడ- గాయత్రి ఇంజినీరింగ్ కళాశాల.

**ఆగష్టు25-28 ఖమ్మం జిల్లా:** నేలకొండపల్లి- ప్రభుత్వ జూనియర్ కళాశాల&పాఠశాల; కూసుమంచి- శ్రీవేంకటేశ్వర స్వామి జూనియర్ కళాశాల & జలగం వెంగళరావు జూనియర్ కళాశాల; పాలేరు- జవహర్ నవోదయ విద్యాలయం; పిండిప్రోలు- ప్రభుత్వ జూనియర్ కళాశాల & జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల; ఖమ్మం- S.R. & BGNR ప్రభుత్వ డిగ్రీ కళాశాల,CMC ట్రైనింగ్ సెంటర్.

*సంయుక్త నివేదిక:*

**పి.వి.దుర్గారావు, మచిలీపట్నం; ఎమ్.బి.బయ్యపురెడ్డి, ఖమ్మం; పి.జగన్నాథరాజు, నెల్లిమర్ల; డా॥ కె.రామారావు, తగరపువలస; శ్రీ రామకృష్ణ సేవాసమితి, కాకినాడ.**



# సుబోధ

వైశాఖమాసంలో ఒక చిన్న మేకపిల్ల తన తల్లి వద్ద ఆడుకొంటోంది. ఉల్లాసంగా కుప్పిగంతులు వేస్తూ, తల్లితో ఇలా అంది: "అమ్మా! అమ్మా! అదిగో, తంగేడు చెట్టు. దాని పువ్వులను నేను కడుపారా ఆరగిస్తాను."

అందుకు తల్లి మేక ఇలా అంది: "బిడ్డా! ఆ పువ్వులు ఆరగించడం అంత సులభం కాదు. తంగేడు పువ్వులు నీ చేజిక్కటానికి ముందు అనేక గండాలు ఉన్నాయి. రాబోయే భాద్రపద, ఆశ్వయుజ మాసాలు అంతగా శుభప్రదమైనవి కావు! ఎవరైనా నిన్ను ఎత్తుకొనిపోయి దుర్గాదేవికి బలి ఇవ్వవచ్చు. అది తప్పితే, భయానకమైన కాళీ పూజ వస్తోంది. అదృష్టవశాత్తు ఆ గండం కూడా తప్పితే, ఇంకా జగద్ధాత్రీ పూజ ఉంది. ఆ సమయంలో దాదాపుగా మన జాతిలో మిగిలివున్న మగ సంతతిని జాతరలో కడతేరుస్తారు. మహా అదృష్టవశాత్తు నువ్వీ గండాలన్నిటినీ దాటితే దీపావళి నాటికి తంగేడు పువ్వుల విందును ఆరగిద్దువుగానిలే! అప్పుడు మంచి తంగేడు పువ్వులు దొరుకుతాయి".

ఈ కథలోని మేకపిల్ల మాదిరి మన నవ యౌవనోత్సాహం కల్పించే మనోరథాలన్నిటికీ తల ఊపకూడదు. వాటిని తీర్చుకొందామనే అత్యుత్సాహం కూడదు. జీవనయాత్రలో సంభవించే గండాలు అనేకాలు అన్న సంగతిని మనస్సులో ఉంచుకొని, సాధ్యమైనంత వరకూ గొంతెమ్మ కోరికలను విడవడమే ఉత్తమం.

('శ్రీరామకృష్ణ బోధామృతం' నుంచి)

**శ్రీరామకృష్ణ ప్రభ**

రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్ - 500 029
ఫోన్: 040-2766 7799, 2763 3936
E-mail : sriramakrishnaprabha@gmail.com



నిర్వాహక సంపాదకులు: **స్వామి జ్ఞానదానంద**
సంపాదకులు: **స్వామి పరిజ్ఞేయానంద**



# సురభి

మహాష్టమి రోజున ఒక భక్తుడు బుట్ట నిండా తామర పువ్వులు తెచ్చాడు. నన్ను (స్వామి ఈశానంద) చూడగానే ఆ బుట్టతో సహా చేతులు పైకెత్తి నమస్కరించాడు. కాస్త దూరం నుంచి మాతృదేవి ఇది గమనించారు. ఆ తరువాత నాతో, "ఈ పువ్వులతో మనం గురుదేవులను అర్చించలేం. వీటిని పారెయ్యి" అని మాతృదేవి చెప్పారు.

మాలో ఇద్దరు అంచు లేని ధోవతి ధరించారు. అది చూసి మాతృదేవి ఇలా వాఖ్యానించారు: "మీరెందుకు అంచు లేని ధోవతులు ధరించారు? మీరు యువకులు! చక్కని అంచుగల ధోవతులు ధరించాలి. లేకపోతే మనస్సు ముసలిదై పోతుంది. మనస్సును ఎప్పుడూ ఉత్సాహంగా, ఆరోగ్యంగా ఉంచుకోవాలి."

ఇలా అంటూ మాతృదేవి పెట్టె తెరచి కొత్త ధోవతులు తీసి మా ఇద్దరికీ ఇచ్చారు.

ఆ రోజు సాయంత్రం, మాతృదేవి పాదాల వద్ద తామరపువ్వులు అర్పించి అనేకులు ప్రణమిల్లారు. "ఇంకా చాలా పువ్వులు తీసుకురా! నాకు తెలిసిన, తెలియని నా బిడ్డలందరి తరఫునా పువ్వులు సమర్పించు" అన్నారు మాతృదేవి.

నేను అలాగే చేశాను. మాతృదేవి చేతులు జోడించి చాలాసేపు గురుదేవుల చిత్రపటాన్ని తదేకంగా చూస్తూ కూర్చుండిపోయారు. ఆ తరువాత "అందరికీ ఇహపరాలలో శ్రేయస్సు కలుగుగాక!" అని ఆశీర్వదించారు.

(స్వామి ఈశానంద స్మృతుల నుంచి)

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

నవంబరు 2008

వెల : రూ. 10



వందే పన్నగభూషణం మృగధరం
వందే పశూనాం పతిమ్‌।

నవతరానికి స్ఫూర్తినిచ్చే
'యువవాహిని'
శీర్షికలు ప్రత్యేకం



# స్వామి రంగనాథానందజీ మహరాజ్ శత జయంతి ఉత్సవాలు

(2008 డిసెంబర్ 11 నుండి 15 వరకు)

15.12.1908 - 15.12.2008

రామకృష్ణ మఠం, మిషన్‌ల 13వ సర్వాధ్యక్షులైన స్వామి రంగనాథానందజీ మహరాజ్ వారి శత జయంతి మహోత్సవాలను 2008 డిసెంబర్ 11 నుంచి 15 వరకు హైదరాబాద్ రామకృష్ణ మఠంలో ఘనంగా జరపాలని 'స్వామి రంగనాథానందజీ మహరాజ్ శత జయంతి ఉత్సవాల పౌర సంఘం' నిర్ణయించింది.

20వ శతాబ్దంలో భారతీయ సనాతన ధర్మాన్నీ, శ్రీరామకృష్ణ - వివేకానందుల సందేశాన్నీ దేశవిదేశాల్లో వ్యాప్తి చేసిన ఘనత స్వామి రంగనాథానందజీ మహరాజ్‌దే. మహరాజ్ వారు అహర్నిశలూ కృషి చేసి హైదరాబాద్ రామకృష్ణ మఠ ఆవిర్భావానికీ, పురోభివృద్ధికీ తోడ్పడ్డారు. ఆంధ్రప్రదేశ్ ప్రజలలో రామకృష్ణ సంప్రదాయం పట్ల అవగాహనను విస్తృతం చేయడంలో ఆయన కీలక పాత్ర వహించారు.

ఆ మహత్తర సాధుపుంగవుని జ్ఞప్తి చేసుకొంటూ ఆయన శతజయంతి మహోత్సవాల్ని ఘనంగా జరుపుకోవడం ముదావహం. ఈ శతజయంతి వేడుకల్లో - యువతీయువకుల సదస్సులు, మహిళా సదస్సులు, ఉపాధ్యాయుల సదస్సులు, కార్యనిర్వహణ బృందాల సమావేశాలు, సుప్రసిద్ధ వక్తల ప్రసంగాలు, భజనలు, సాంస్కృతి కార్యక్రమాలు నిర్వహించబడతాయి. పూజ్య మహరాజ్‌వారి రచనల్లో కొన్ని ఎంపిక చేసిన స్మారక సంచిక ఒకటి ఈ సందర్భంగా విడుదలవుతుంది. భక్తులు, అభిమానులు అధిక సంఖ్యలో పాల్గొని ఈ మహోత్సవాలను విజయవంతం చేయాలని ప్రార్థిస్తున్నాం.

*స్వామి రంగనాథానందజీ మహరాజ్*
*శతజయంతి ఉత్సవాల పౌర సంఘం*

కన్వీనర్ : జి.ఎన్. ఫణికుమార్,
I.A.S., Commissioner APARD

**వివరాలకు :**

**ప్రేమ్‌కుమార్ సింగ్,** ఆర్గనైజింగ్ సెక్రటరీ,
రామకృష్ణ మఠం, దోమలగూడ,
హైదరాబాద్-500 029
సెల్.నెం. 98499 85842

H *ఈ ఉత్సవాల్లో పాల్గొనే భక్తులకు వసతి సౌకర్యం కల్పించడం సాధ్యం కాదని మనవి.*



Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 65 సంచిక: 11 నవంబరు 2008



పూర్వోత్తరే ప్రజ్వలికానిధానే సదావసన్తం గిరిజాసమేతమ్ ।
సురాసురారాధిత పాదపద్మం శ్రీ వైద్యనాథం తమహం నమామి ॥
ప్రాణప్రయాణపాథేయం సంసారవ్యాధి భేషజమ్ ।
దుఃఖక్లేశ పరిత్రాణం హరిరిత్యక్షరద్వయమ్ ॥



గిరిజా సమేతుడై ప్రజ్వలికా క్షేత్రంలో సదా నివసిస్తూ, దేవతలచే పూజింపబడే పాదపద్మాలు కలిగిన శ్రీ వైద్యనాథునికి నమస్కరిస్తున్నాను. ప్రాణ సంచార సమయంలో ఆధారమై, సంసార రోగానికి ఔషధమై దుఃఖాల నుండి కాపాడే దివ్యమంత్రం 'హరి' అనే రెండక్షరాలు.




## లోపలి పేజీల్లో...












# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి




ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు**...... రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**రాజ పోషకులు**............ రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**పోషకులు**................. రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| | దాతపేరు చిరునామా | రూ. |
|---|---|---|
| మహారాజ పోషకులు | : డాక్టర్ సిహెచ్. సీతారామమ్మ, తెన్నూర్, తిరుచ్చి - 620 001 | 10,000 |
| పోషకులు | : శ్రీ కె. గోపి, శ్రీసాయినగర్ కాలనీ, నాగోల్, హైదరాబాద్ - 500 068 | 2,000 |
| " " | : శ్రీమతి ఎస్. లీలావతి, పి.ఎమ్. పాలెం, విశాఖపట్నం - 530 041 | 1,000 |
| " " | : శ్రీమతి టి. లలిత, బాలాజీనగర్, కుకట్‌పల్లి, హైదరాబాద్ - 500 072 | 1,000 |

## 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

ప్రియ భక్తులారా!

యువతరంలో ఆత్మవిశ్వాసాన్ని నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకూ, కళాశాలలకూ అందించాలని సంకల్పించాం.

శ్రీరామకృష్ణుల, స్వామి వివేకానందుల సందేశాల ఆవశ్యకతను గురించి సుభాష్ చంద్రబోస్ ఒక సందర్భంలో చెబుతూ, "శీలనిర్మాణానికి రామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం వేరొకటి లేదు" అని అన్నారు.

యువతరానికి 'శ్రీరామకృష్ణ ప్రభ'ను మరింత చేరువ చేయడానికి మీ ఆర్థిక సహాయాన్ని కోరుతున్నాం. ఈ పథకం కింద రూ. 1500 మొత్తాన్ని జీవిత చందా (20 సంవత్సరాలకు) కట్టినట్లయితే మీరు సూచించిన, లేదా మేము ఎంపిక చేసిన ఒక పాఠశాల/కళాశాలకు 20 ఏళ్ళ పాటు పత్రికను మీ పేరున పంపుతాం. చందాదారుని పేరు, విద్యాసంస్థ పేరు పత్రికలో ప్రచురిస్తాం.

మీ చందాను ఎమ్.ఓ. / డి.డి./ చెక్కు రూపంలో Ramakrishna Math, Hyderabad పేరున తీసుకొని, Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029 చిరునామాకు పంపవలెను.

స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతరాన్ని తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి మీ వంతు సహాయం అందించగలరని ఆశిస్తున్నాం.

భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ప్రార్థిస్తూ...

భగవత్సేవలో

స్వామి జ్ఞానదానంద

అధ్యక్షులు

ప్రియ త్రిగుణాతీతానంద,

శ్రీరామకృష్ణుల సందేశం ప్రతి ఇంటికీ చేరేందుకు పత్రికను ప్రారంభించు. సంసార తాపాగ్నిలో చిక్కుకున్నవారికి ఆయన సందేశమే శరణ్యం. ప్రజలను బలవంతంగానైనా ఒప్పించి పత్రికను చదివేలా చేయు... – స్వామి వివేకానంద



### చందా వివరాలు

| | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|
| విడి ప్రతి | : రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా | : రూ. 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు | : రూ. 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు | : రూ. 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు | : రూ. 1500 | $ 365 |



గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి. పంపవలసిన చిరునామా : Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.

## లోపలి పేజీల్లో...





### శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా!*

- **'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకి కుడి భాగంలో మీ చందా గడువు నెల పొందుపరచబడి ఉంది. *సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకొని, 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.***
- **మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.**
- **మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.**
- **పత్రిక ప్రతీ నెల 26వ తేదీన పోస్ట్ చేయబడుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.**

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

*- సర్క్యులేషన్ మేనేజర్*

ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకుడు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు.

- సంపాదకులు



**SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH**
Domalguda, Hyderabad - 500 029. Andhra Pradesh
Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com

సంపాదకీయం

# భక్తునికి భగవంతుడిచ్చే బహుమతి

జీవితంలో అందరూ ఆశించేది సుఖాన్ని మాత్రమే! దుఃఖాన్ని దూరంగా ఉంచాలనేదే మానవ ప్రయత్నమంతా. అయితే జీవితాంతం ఏ కష్టాలూ లేకుండా ఎప్పుడూ సుఖంగా ఉండగలమా? అది సాధ్యం కాదని మనకు తెలిసినప్పటికీ సుఖాన్ని కోరుకుంటామే కానీ దుఃఖాన్ని మాత్రం కోరం.

సుఖాన్ని అంగీకరించినట్లు దుఃఖాన్ని ఆమోదించలేం. నిజానికి మన దుఃఖాలకు అసలు కారణం-ఎల్లప్పుడూ సుఖంగా ఉండాలని మనం అనుకోవడమే! జనన మరణాలు, చీకటి వెలుగులు, మంచి చెడులు-ఈ ద్వంద్వాలు ఎంత సహజమో, సుఖదుఃఖాలు కూడా అంతే సహజమని మనం అంగీకరించి, ఆమోదించినప్పుడు జీవితం సుఖవంతం అవుతుంది.

**సుఖదుఃఖాలు జీవిత నాణానికి బొమ్మా బొరుసులు:** చీకటి లేకపోతే వెలుగు విలువ తెలియనట్లు జీవితంలో దుఃఖాన్ని అనుభవించకపోతే సుఖాన్ని ఆస్వాదించలేం. జీవన యాత్రలో కష్టాలూ, కలతలూ సహజం. వంతెన క్రింద నీరులా అవి వస్తూ, పోతూ ఉంటాయని మనస్సుకు పదే పదే గుర్తుచేస్తూ ఉంటే, కష్టాలు వచ్చినప్పుడు కలత చెందకుండా ఉండగలం.

'భగవంతుడు ఈ ప్రపంచాన్ని దుఃఖ భూయిష్ఠంగా ఎందుకు సృష్టించాడు' అని శ్రీశారదాదేవిని ఒక భక్తుడు ప్రశ్నించాడు. 'దుఃఖమనేది లేకపోతే సుఖాన్ని ఎలా అర్థం చేసుకోగలం! సుఖదుఃఖాల మిశ్రమమే ఈ ప్రపంచం' అని శ్రీశారదాదేవి బదులిచ్చారు.

జీవిత నాణానికి సుఖదుఃఖాలు బొమ్మాబొరుసుల లాంటివని తెలుసుకొన్ననాడు జీవిత నాటక రంగంలో మన పాత్రల్ని సమర్థంగా పోషించగలం.

**మంచివారికే కష్టాలెందుకు?:** నేటి సమాజంలో న్యాయబద్ధంగా జీవించే వారికి కష్టాలు తప్పవు. నీతిగా బ్రతికేవారికి గడ్డు రోజులివి. ఒక కార్యాలయంలో పదిమంది లంచగాళ్ళ మధ్య, ఒకడు నీతికి కట్టుబడి తన నిజాయతీని ప్రదర్శించడమనేది నిజంగానే అగ్నిపరీక్ష. ఎంతోమంది అసత్యవాదుల మధ్య ఒక్కడు సత్యవ్రతాన్ని పాటించడానికి ప్రయత్నించడం సాహసంతో కూడుకొన్న పనే. అయితే నిజాయతీకి ఇవి రోజులు కావని, నలుగురితో నారాయణా అంటూ వారిలో ఒకరిగా మారితే మన కష్టాలన్నీ తీరిపోతాయా? ఆదర్శవంతమైన జీవితం గడపాలనుకునే వారు కష్టాలనూ, ప్రలోభాలనూ ఎదుర్కోక తప్పదు. కష్టాల కడలిని ఈదకుండా, ప్రతిఘటనల్ని ఎదుర్కోకుండా, ఎలాంటి బాధలనూ అనుభవించకుండా జీవితంలో ఉన్నత స్థాయికి చేరుకునేవారు ఎవరైనా ఉన్నారా? చరిత్ర మొత్తం తిరగవేసి చూసినా అలాంటి వారు ఒక్కరు కూడా మనకు కనబడరు. హరిశ్చంద్రుడు ఆడిన మాటకు కట్టుబడకపోయి ఉంటే ఆయన కష్టాలన్నీ ఒక్క క్షణంలో తీరిపోయి ఉండేవి. రాజ్యాధిపతి స్థాయి నుంచి కాటికాపరి స్థితికి చేరేవాడు కాదు. శ్రీరామకృష్ణుల తండ్రి క్షుదీరాముడు గ్రామ జమీందారు తరఫున ఒక్క తప్పుడు సాక్ష్యం చెప్పి ఉంటే భార్యాబిడ్డలతో ఊరు వదిలి వెళ్ళిపోవలసి వచ్చేది కాదు. 'ఎలాంటి క్లిష్ట పరిస్థితుల్లోనైనా సత్యానికి కట్టుబడి ఉండు' అన్న తల్లి భువనేశ్వరీదేవి మాటల్ని నరేంద్రుడు విస్మరించి ఉంటే మనం ఓ వివేకానందుణ్ణి కోల్పోయి ఉండేవాళ్ళం.

ఆదర్శానికి కట్టుబడి జీవించే వారికి కష్టాలు తప్పవనడానికి ఎంతో మంది మహాత్ముల జీవితాలే నిదర్శనం. కాబట్టి మంచివారికి కష్టాలు తప్పవని గ్రహించి ముందుకు సాగిపోదాం. ఆదర్శవంతమైన జీవితాన్ని గడపడానికి ప్రయత్నిద్దాం.

**బాధే సౌఖ్యమనే భావన...** ఒక్కసారి మన జీవితాల్లోకి తొంగిచూస్తే అన్నీ సక్రమంగా సాగిపోతున్నప్పుడు భగవంతుణ్ణి మనం ఎంతసేపు స్మరించుకోగలుగుతున్నాం? ఆయన ఉనికిని విశ్వసించి ఆయనపై ఎంతవరకు ఆధారపడగలుగుతున్నాం? అని పరిశీలించాలి. అన్నీ సవ్యంగా జరిగితే ఎవరినీ ఖాతరు చేయని తత్త్వం మనది. 'సంకట కాలంలో వేంకట రమణ' అంటూ ఆపద కాలంలో ఆపద మొక్కులవాడిని గుర్తు చేసుకుంటాం. కోరిన కోర్కెలు నెరవేరితే ఏడుకొండలూ ఎక్కి వస్తామని మొక్కుకుంటాం. అంతేకానీ బాధల్ని భరించే శక్తిని ఇవ్వవలసిందిగా మాత్రం భగవంతుణ్ణి ప్రార్థించం.

ఆధ్యాత్మిక జీవితాన్ని ఆలంబనగా చేసుకొన్న భక్తుల జీవితాలు పరిశీలిస్తే ఎవరి జీవితమూ సుఖంగా సాగినట్లు మనకు కనపడదు. తుకారామ్, రామదాసు, త్యాగయ్య, పోతన - ఇలా ఎంతోమంది భక్తులు సంపూర్ణంగా భగవంతుణ్ణి నమ్ముకొన్నా, భగవంతుడు వారికి బహుమతిగా ఇచ్చింది బాధలే అని మనకు తెలుసు. భగవంతుని మీదే భారం వేసి జీవితాన్ని సాగించిన మహాభక్తులు కటిక దారిద్ర్యంతో



శ్రీకృష్ణుని వింత ప్రవర్తన చూసి అర్జునుడు కోపోద్రిక్తుడయ్యాడు. అర్జునుణ్ణి శాంతపరుస్తూ, "అర్జునా! మొదట నీవు భిక్ష అడిగిన వ్యక్తి ధనగర్వంతో అహంకార పూరితుడయ్యాడు. పూరిగుడిసెలో ఉన్న ఆ పేదవాడు నిరంతరం నన్నే స్మరిస్తూ అణకువతో జీవిస్తున్నాడు. ఐశ్వర్యం కలిగితే ఇతడు కూడా ఆ ధనవంతుని లాగే అహంకారపూరితుడు అవుతాడని అలా దీవించాను'' అని శ్రీకృష్ణుడు తన వింత ప్రవర్తనలోని అంతరార్థాన్ని వివరించాడు.

భగవంతుని కృపా కటాక్షాలు భక్తునిపై ఉన్నాయనడానికి ఏమిటి నిదర్శనం అని బ్రహ్మ ఒకసారి విష్ణువును అడిగాడు. అందుకు, విష్ణువు ఇలా సమాధానమిచ్చాడు.

**బ్రహ్మన్ యమనుగృహ్ణామి తద్విశో విధునోమ్యహమ్।**
**యన్మదః పురుషః స్తబ్ధో లోకం మాం చావమన్యతే ॥**

*(భాగవతం 8-22.24)*

'ఓ బ్రహ్మా! మనిషి ధనం వల్ల మదం కలిగి మూడులోకాల్నీ, చివరకు జగత్పతి అయిన నన్ను కూడా తిరస్కరించడానికి వెనుకాడడు. నా అనుగ్రహం ఎవరిపై ఉంటుందో మొదట వారికి సిరిసంపదలు లేకుండా చేస్తాను'.

తనను నమ్మిన వారికి కష్టాలనిచ్చే దేవుణ్ణి దయార్ద్ర హృదయుడని ఎందుకు స్తుతించడం అనే భావన సాధారణ భక్తుల్లో రాక మానదు. ఓ భక్తుడు అడిగిన ఈ సందేహానికి శ్రీశారదాదేవి ఇలా సమాధానం ఇచ్చారు: "భక్తునికి భగవంతుడు కల్పించే కష్టాలు ఆయన ప్రేమకు నిదర్శనం. ఒకసారి బృంద,శ్రీకృష్ణునితో 'నిన్ను దయామయుడు అని ఎవరన్నారు? త్రేతాయుగంలో రాముడివై సీతనూ, ద్వాపర యుగంలో కృష్ణుడివై రాధనూ ఎనలేని కష్టాలపాలు చేశావు. అయినప్పటికీ నేను నీ నామస్మరణ ఎందుకు చేస్తున్నానంటే నీవు నాకు శాశ్వతానందాన్ని ఇస్తావని అంది".

కాబట్టి జీవితంలో ఎదురైన కష్టాలన్నీ **'భక్తునికి భగవంతుడిచ్చే బహుమతి'**గా స్వీకరించాలి. అప్పుడు బాధే సౌఖ్యమనే భావన కలుగుతుంది. అలాంటి భక్తి భావన మనల్ని భగవంతుని పదసన్నిధికి చేరుస్తుంది. a

ఎందుకు బాధపడాల్సి వచ్చింది? ఇలాంటి సందేహమే ఒకప్పుడు అర్జునుని మదిలో కూడా మెదిలింది.

ఒకసారి కృష్ణార్జునులు వాహ్యాళికి వెళుతున్నప్పుడు అర్జునుడు 'నిన్ను నమ్ముకున్న వారికే ఎక్కువ కష్టాలు ఎందుకు? వారిని కరుణించి వారి కష్టాలను తీర్చవచ్చు కదా' అని శ్రీకృష్ణుణ్ణి అడిగాడు. అప్పుడు శ్రీకృష్ణుడు "అర్జునా! చూడు, ఆ భవనంలో ఉన్న ధనవంతుని ఇంటికి వెళ్ళి భిక్ష అడిగి తీసుకు రా" అని అర్జునుణ్ణి పంపించాడు.

శ్రీకృష్ణుని ఆజ్ఞానుసారం అర్జునుడు ఆ ధనికుని ఇంటి ముందు నిలబడి భిక్ష కోసం అర్థించాడు. వెంటనే ఆ ధనికుడు బయటకు వచ్చి, మారువేషంలో ఉన్న అర్జునుణ్ణి చూసి "కాయకష్టం చేసుకొని బ్రతకరాదూ?" అని కోపగించుకున్నాడు. ఇదంతా గమనించిన శ్రీకృష్ణుడు "నువ్వు అష్టైశ్వర్యాలతో వర్ధిల్లు" అని ఆ ధనవంతుణ్ణి ఆశీర్వదించాడు.

ఈసారి శ్రీకృష్ణుడు అర్జునుడికి ఒక పూరిగుడిసెను చూపించి అక్కడకు వెళ్ళి భిక్ష తీసుకురమ్మని పంపించాడు. అర్జునుడు పూరిగుడిసె దగ్గరకు వెళ్ళి, భిక్ష ఇమ్మని అడిగిన వెంటనే గుడిసెలో నుంచి ఒక వృద్ధుడు బయటకు వచ్చి అర్జునుడికి భిక్ష ఇచ్చాడు. ఆ భిక్షను తీసుకుని ఆనందంగా అర్జునుడు శ్రీకృష్ణుని వద్దకు వచ్చాడు. అప్పుడు శ్రీకృష్ణుడు వృద్ధుణ్ణి ఉద్దేశించి, "నీవు దారిద్ర్యంతోనే జీవించు" అని దీవించాడు.

# అసలైన విద్య

- స్వామి రంగనాథానంద





అవిద్య అంటే అజ్ఞానం, విద్య అంటే ఆత్మప్రకాశం ద్వారా కలిగే జ్ఞానం. విద్య అంటే పాండిత్యం మాత్రం కాదు. చదువు మానవునిలో ఆధ్యాత్మిక వికాసాన్ని పెంపొందించ లేకపోతే, మనిషిని విషయలోలత్వం నుంచి విడుదల చేయలేకపోతే, అది విద్య కానేరదు, అది అవిద్యయే! ఇంద్రియ వశత్వం నుంచి విడుదల చేసేదే విద్య.

ఎంతటి మేధావి అయినా సరే విషయలోలుడై, ఇంద్రియ భోగాలే చాలు అనే తత్త్వం కలిగి ఉంటే, అతడు ఆత్మచైతన్యం పొందే ప్రయత్నం చేయడు. అతడు తన జీవితంలోనూ, పనుల్లోనూ ఎంత శక్తి, చలనం చూపినా అతని బ్రతుకు మందకొడిగానే సాగుతుంది. తనలో ఉన్న దివ్యత్వాన్ని ఎరుగక, మూఢుడై, విషయ ప్రపంచపు పరిధుల్లోనే అంధునిలా తిరుగుతూ ఉంటాడు - 'దంద్రమ్యమాణాః పరియంతి మూఢాః...' అని కఠోపనిషత్తు చెబుతోంది. ఆ మనిషి చీకటి గొందుల్లో పడి ఉండి, సూర్యరశ్మితో నిండిన బయటి ప్రదేశంలోకి రావడానికి భయపడతాడు. ఇలా ముందుకు సాగకుండా తన విద్యను అవిద్యగా మార్చుకొంటాడు. చైతన్యానికీ, సార్థక్యానికీ తీసుకువెళ్ళే రాచబాటను వదలి, ఒక గమ్యమంటూ లేని సందుగొందులు ఎన్నుకొంటాడు. కొన్ని జాతుల పురుగులు జీవక్రమ పరిణామపథంలో ముందుకు సాగలేక అదే స్థితిలో ఉండిపోతాయని జీవ శాస్త్రజ్ఞులు చెబుతారు. ఈ మనుష్యులు కూడా ఆ పురుగుల లాంటి వారే!

భోగలాలసత, అహంకృతి పోషణ మానవ జీవితపు ప్రథమ దశ. ఆ పైన ఈ తుచ్ఛ జీవితాన్ని అధిగమించి, స్పష్టమైన దృక్పథం, ఔదార్యం, సానుభూతి కలిగి వికాసపథంపై స్థిరంగా నిలబడి ఆధ్యాత్మిక జీవిగా పరిణతి పొందాలి. గ్రుడ్డును పెకలించుకుని, బయటపడే కోడిపిల్ల లాగ, గూటి నుంచి వెలుతురులోకి వచ్చిన సీతాకోకచిలుక లాగ, మనిషి కూడా విషయ ప్రపంచపు అడ్డును తొలగించి ఇంద్రియాతీత ప్రపంచపు అనంత ప్రదేశంలో జన్మసాఫల్యానికై ముందడుగు వెయ్యాలి. మూడవ కన్ను తెరవడమంటే ఇదే; ఇదే ద్వితీయ జన్మ. అలాంటివాడే ద్విజుడు.

ఆధ్యాత్మిక విద్య కోసం భారతీయులు రూపొందించిన శాస్త్రీయ విధానాల గురించి చికాగో సర్వమత సమ్మేళనంలో ఇచ్చిన తమ జగద్విఖ్యాతమైన ఉపన్యాసంలో స్వామి వివేకానంద "మాటలనూ, సిద్ధాంతాలనూ పట్టుకొని ప్రాకులాడాలని హిందువు కోరడు. అతీంద్రియ తత్త్వమేదైనా కలదంటే, దాన్ని తాను ముఖాముఖి చూడాలని కోరుతాడు. జడం కన్నా భిన్నమైన ఆత్మ తనలో ఉంటే, దయామయుడైన పరమేశ్వరుడుంటే, తాను దాన్ని ప్రత్యక్షంగా దర్శించాలను కొంటాడు. హిందూమతం ఏ వాదాన్నో, సిద్ధాంతాన్నో నమ్మాలనే ప్రబల ప్రయత్నంతో కూడుకున్నది కాదు. సాక్షాత్కారమే హిందూమత తత్త్వం" అని చెప్పారు.

కాబట్టి, విద్య అంటే ఉదర పోషణార్థం నేర్చుకొనే చదువు మాత్రమే కాదు, దాన్ని మించినది. అది జ్ఞానదీపిక. పాండిత్యం, సమాచార సేకరణ, బాహ్య ప్రపంచంపై ఆధిపత్యం మాత్రమే విద్య కాదు. మనిషిని ఆధ్యాత్మిక ప్రగతిపథంపై నడిపించి, విషయలోలునికి క్రమశిక్షణ, ఆత్మసంయమనాలు నేర్పి, సాక్షాత్కారసిద్ధి కలిగించేదిగా ఉండేదే 'అసలైన విద్య'. a

# అన్నిటా ఆయనే! అందరిలోనూ ఆయనే!!

- స్వామి జ్ఞానదానంద

మనందరం పూజ గదిలో కూర్చొని పూజ చేస్తాం, జపం చేస్తాం, దేవాలయానికి వెళ్ళి దైవదర్శనం చేసుకుంటాం, భజనలు చేస్తాం. అందరం కలసి ధార్మిక కార్యక్రమాలు చేపడతాం. సామూహికంగా పూజలు, భజనలు చేస్తూ మనం భక్తులమని అనుకుంటాం. ఇవన్నీ భక్తికి వివిధ రూపాలు మాత్రమే. నిజానికి అసలైన భక్తి అంటే భగవంతుణ్ణి పూజ గదిలో, దేవాలయాల్లో, ధార్మిక కార్యక్రమాల్లోనే కాకుండా బయట ప్రపంచంలో కూడా దర్శించడం! ఈ జగత్తు అంతా భగవంతుడి సృష్టే అయినప్పుడు, ప్రపంచంలో అన్నింటిలో, అందరిలో ఆ భగవంతుడే ఉన్నాడు. మనం చేసే ప్రతీ పనీ భగవంతుడి పూజ లాంటిదే. భగవద్గీత 18వ అధ్యాయంలో శ్రీకృష్ణపరమాత్మ ఇలా అన్నారు:

**స్వే స్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః।**
**స్వకర్మ నిరతః సిద్ధిం యథా విందతి తచ్ఛృణు ॥**

'తమ కర్మలు చేసుకుంటూనే మనుష్యులు పరమ సిద్ధి పొందుతారు. తమ కర్మలు చేసుకుంటూ ఏ విధంగా సిద్ధి పొందాలో ఆ ఉపాయం నా దగ్గర విను'.

మనిషికి ప్రతి కర్మ (పని) ఒక పూజ అయినప్పుడు అతని దృష్టిలో దేవాలయానికీ, కార్యాలయానికీ మధ్య భేదం ఉండదు. స్వామీజీ దృష్టిలో ఒక కర్మాగారం, కార్యాలయం, విద్యాలయం, క్రీడా స్థలం – అన్నీ దేవాలయాలే, భగవత్ప్రాప్తికి అనువైన స్థలాలే. నిజమైన భక్తులకు మానవ సేవ – మాధవుని పూజల మధ్య తేడా ఉండదు.

స్వామి వివేకానంద విదేశయాత్ర ముగించుకుని తిరిగి భారతదేశం వచ్చాక రామేశ్వరంలో ఒక ప్రసంగంలో భక్తి గురించి ఈ విధంగా చెప్పారు: "ఎవరైతే ఈశ్వరుణ్ణి నిర్ధనుడిలోనూ, నిర్బలుడిలోనూ లేక రోగులలోనూ దర్శిస్తారో అతడే అసలైన భక్తుడు. ఈశ్వరుణ్ణి ఒక ప్రతిమ రూపంలో, లేక లింగాకారంలో భావించేవాడి ఉపాసన ఇంకా ప్రారంభ దశలో ఉన్నట్లే! కుల మత భేదాలు చూడకుండా పెద్ద–చిన్న అనే తేడా చూపకుండా అందరిలోనూ సాక్షాత్తూ పరమేశ్వరుడున్నాడనే భావంతో సేవలందించేవాడు ఈశ్వరుడికి



అసలైన ప్రీతిపాత్రుడు". దేవాలయాల్లో మాత్రమే భగవంతుణ్ణి దర్శించే వాడి కన్నా తోటివారికి సేవ చేసే వాళ్ళను చూసి భగవంతుడు ఎక్కువ ప్రసన్నుడు అవుతాడు.

ఎవరి నుంచి ఈ జగత్తు ఉద్భవించిందో, ఎవరు ఈ జగత్తంతా వ్యాపించి ఉన్నారో ఆ భగవంతుణ్ణి అన్నిటా, అందరిలోనూ దర్శించి పూజించగలిగే వారే నిజమైన భక్తులు. అదే అసలైన భక్తి. a



ఎవడైతే పేదవాడిలో, బలహీనుడిలో, రోగిలో శివుణ్ణి చూడగలుగుతాడో అతడే నిజంగా శివుణ్ణి అర్చించినట్లు. ఎవడైతే విగ్రహంలో మాత్రమే శివుణ్ణి చూస్తాడో, అతడి ఆరాధన ఇంకా ప్రాథమికమైనదే.

ఎంతో తపస్సు చేసిన తర్వాత నేను దీన్ని నిజమైన సత్యంగా తెలుసుకున్నాను - ప్రతిజీవిలోనూ దేవుడున్నాడు. ఇంతకన్నా వేరే దైవం లేడు. "ఎవడు జీవారాధకుడో, వాడే దైవారాధకుడు!"

– స్వామి వివేకానంద

# బహు పుణ్యప్రదం కార్తీకమాసం

– చెవుటూరి కుసుమకుమారి



***గంగా గంగేతి యో బ్రూయాత్ యోజనానాం శతైరపి,***
***ముచ్యతే సర్వ పాపేభ్యో విష్ణులోకం స గచ్ఛతి.***

కార్తీకమాసంలో నిత్యం గంగను స్తుతించినా, స్పృశించినా అశ్వమేధ యాగఫలం లభిస్తుంది. ఆ విధంగా చేయలేకపోయినా దూరం నుంచే 'గంగా! గంగా!' అని స్మరిస్తే చాలు, పాప విముక్తులై వైకుంఠవాసులవుతారు. ఇది గంగాదేవికి శ్రీకృష్ణ పరమాత్మ ఇచ్చిన వరం.

సృష్టికి ముందు కార్తీక పౌర్ణమి నాడు గోలోకంలో శక్తి స్వరూపిణి రాధాదేవి మహోత్సవం గోపగోపీ సమూహంతో అతి కోలాహలంగా జరుగుతోంది. బ్రహ్మాది దేవతలంతా విచ్చేసిన ఆ సభలో సరస్వతీ దేవి కృష్ణస్తుతి చేసింది. శివుణ్ణి కూడా గానం చేయాల్సిందిగా బ్రహ్మ కోరాడు. మహేశ్వరుడు గానం చేయగా, శ్రీమహావిష్ణువు శరీరం పులకించి, ద్రవించి జలమైంది. కోటి యోజనాల వెడల్పు, కోటి మీద లక్ష యోజనాల పొడవు కలిగిన గంగ ఆవిర్భవించింది. విష్ణుపాదోద్భవ అయిన గంగ భూమిని పునీతం చేసింది. అందువల్లే కార్తీకమాసంలో స్నానం ప్రధానం. కార్తీక దామోదరుడని శ్రీమహావిష్ణువును ఆరాధించడం; సర్వశుభాలూ పొందడం అనూచానంగా వస్తున్నదని దేవీ భాగవతాది పురాణ ప్రమాణం.

కార్తీక మాసంలో సూర్యుడు తులారాశిలో ఉంటాడు. అప్పుడు లోకపావని గంగ జలరూపంలో విశ్వమంతటా ఉంటుంది. శ్రీమహావిష్ణువు చెరువులు, బావులు, గోవు పాదం మునిగేటంత చిన్ని నీటి గుంటల్లో కూడా వ్యాపించి ఉంటాడు. ఆ సమయంలో చేసిన స్నానం, దానం, దీపారాధన, దేవతార్చన, పితృతర్పణాలు అనంత పుణ్యప్రదాలు.

ముఖ్యంగా ఈ మాసంలో సోమవార వ్రతం చేసిన వాడు కైలాసవాసి అవుతాడు. ఉపవాసం, ఏకభుక్తం (ఒంటి పూట భుజించడం), అయాచిత వ్రతం (తానుగా ఇది కావాలి అని కోరకుండా ఇతరులు పెట్టిందే తిని తృప్తి చెందడం), నక్తం (రాత్రిపూట మాత్రమే తినడం) శక్త్యానుసారం చెయ్యాలి. అలాంటి శక్తి లేనివారు శివార్పణగా భావించి ఒక బ్రాహ్మణుడికి భోజనం పెట్టి, మధ్యాహ్నం భుజించవచ్చు.

ఈ మాసంలో ఉదయమంతా ఉపవసించి, రుద్రాభిషేకం చేసి, రాత్రి నక్షత్రాలను చూసి భోజనం చేసేవారు పాపాలు నశించి, శివ సాయుజ్యం పొందుతారు. ఈ మాసంలో సాయం సంధ్యలో శివాలయ గోపుర ద్వారం వద్ద, శిఖరం మీద, శివలింగం ముందు ఆవు నేతితో కానీ, నువ్వుల నూనె, ఇప్పనూనెలతో కానీ దీపం వెలిగించాలి.

కార్తీకమాసపు చివరిరోజున ఒక వెండి ప్రమిదలో బంగారు వత్తిని ఉంచి, బియ్యపు పిండి మధ్యలో దీపాన్ని వెలిగించి వేదవిదుడైన పండితోత్తమునకు దానమివ్వాలి. ఆ దానం విద్యను, దీర్ఘ ఆయుర్ధాయాన్నీ, అక్షయ పుణ్యాన్నీ ఇస్తుంది. వరిపిండి లేక గోధుమపిండితో ప్రమిదను చేసి వత్తిని ఆవునేతితో తడిపి దీపం వెలిగించి వెలుగుతున్న ఆ దీపాన్ని ఈ మంత్రం ఉచ్చరిస్తూ

**సర్వ జ్ఞానప్రదం దీపం సర్వ సంపత్సుభావహమ్ ।**
**దీపదానం ప్రదాస్యామి శాంతిరస్తు సదామమ ॥**

దానం చేస్తే ఆత్మ విద్య ప్రదీప్తం అవుతుందని జ్ఞానుల ఉవాచ. కార్తీకమాసంలో పరమేశ్వరుడి వ్రత నియమాలను కాలానుసారం పాటించి జ్ఞాన సిద్ధులం అవుదాం.

# దయామయి ఆ జగన్మయి!



- స్వామి సుబోధానంద

పరివ్రాజక జీవితంలో స్వామి సుబోధానంద ఒక్కోసారి చెట్ల క్రిందా, కొన్నిసార్లు రహదార్ల ప్రక్కనా నిద్రించేవారు. ఆయనకు కటిక నేలయే శయ్య; చేతులే తలదిండ్లు. ఒకమారు బీహార్‌లోనో, ఉత్తర ప్రదేశ్‌లోనో ప్రయాణిస్తుండగా ఒక రాత్రి తనకు కలిగిన అనుభవాన్ని ఆయన ఈ విధంగా వర్ణించారు:

"ఒక రాత్రి త్రోవ ప్రక్కన నేనొక మర్రిచెట్టు క్రింద నిద్రిస్తున్నాను. కొంత సేపటికి నాకు ఒక కల వచ్చింది. ఆ కలలో ఒక వృద్ధ స్త్రీ 'లే!... నీ వల్ల ఆ పాములు వాటి కలుగులలో నుండి బయటకు రాలేకపోతున్నాయి. కొంతదూరం ముందుకు వెళితే అక్కడ నీకొక పోలీసు స్టేషను కనిపిస్తుంది. నువ్వు ఈ రాత్రి అక్కడే గడపవచ్చు' అంది. నేను ఆమెను, 'వారు నన్ను ఉండనిస్తారా'? అని అడిగాను. ఆమె 'వారు నిన్ను అక్కడ నిద్రపోనిస్తారు. నువ్వు తలుపు తట్టినప్పుడు వారు నిన్ను 'ఎవరు నువ్వు' అని అడుగుతారు. వారితో 'నేనొక పరివ్రాజకుణ్ణి' అని చెప్పు అంది. నేను నిద్రలేచి ఆ వృద్ధ స్త్రీ సూచనల ప్రకారం వెళ్ళి, ఆ పోలీసు స్టేషన్ వరండాలో తల దాచుకున్నాను. మరునాడు ఉదయం నేను ఆ మర్రిచెట్టు వద్దకు తిరిగి వెళ్ళి అక్కడ నేలను పరిశీలించాను. అక్కడ చాలా కలుగులు కనిపించాయి. ఆ ప్రదేశం త్రాచుపాములతో నిండి ఉంది'.

ఈ సంఘటన విన్న ఒక భక్తుడు స్వామి సుబోధానందను 'ఆ స్త్రీ ఎవరండీ?' అని ప్రశ్నించారు. 'ఆ వృద్ధ స్త్రీ సాక్షాత్తూ జగన్మాతయే!' అని బదులిచ్చారు స్వామి సుబోధానంద.

**(నవంబరు 10న శ్రీ రామకృష్ణ పరమహంస సన్న్యాస శిష్యులైన స్వామి సుబోధానంద జయంతి)**

# మహాత్ముని స్పర్శతో మరువరాని అనుభూతి

శ్రీరామకృష్ణుల సాన్నిధ్యంలో జరిగిన ఒక సంఘటనను స్వామి విజ్ఞానానంద ఇలా వివరించారు:



- స్వామి విజ్ఞానానంద

"శ్రీరామకృష్ణుల గది మనోహరమైన ప్రశాంత వాతావరణంతో విలసిల్లుతున్నట్లు, ఆయన పెదవుల నుండి జాలువారే వాక్కులను అక్కడవున్న భక్తులు ఆనందపారవశ్యంతో వింటున్నట్లు నాకు తోచింది. ఆయన మాటలు గుర్తులేకపోయినా, నాకు గొప్ప ఆనందానుభూతి కలిగింది. నా దృష్టి అంతా శ్రీరామకృష్ణుల మీదనే ఉంది. ఇంతలో భక్తులంతా క్రమంగా సెలవు తీసుకోసాగారు. నేను కూడా సెలవు తీసుకుందామని వారికి సాష్టాంగ నమస్కారం చేసి, వెళ్ళడానికి సిద్ధమయ్యాను. వెంటనే గురుదేవులు నాతో 'నీకు కుస్తీ పట్టటం వచ్చా? రా, నాతో ఎలా కుస్తీ పడతావో చూస్తాను' అంటూ లేచి నిలబడి కుస్తీ పట్టటానికి సిద్ధమయ్యారు. ఆ సవాలుకు ఆశ్చర్యపడి 'అవును, నేను కుస్తీ పట్టగలను' అని జవాబిచ్చాను.

గురుదేవులు చిరునవ్వు నవ్వుతూ నన్ను సమీపించారు. నా చేతులు పట్టుకొని త్రోయనారంభించారు. కానీ కండలు తిరిగిన బలిష్ఠ యువకుడినైన నేను ఆయనను గోడవైపుకు నెట్టివేశాను. ఆయన ఇంకా నవ్వుతూనే బిగిపట్టుతో నన్ను పట్టుకున్నారు. వారి చేతులనుండి ఒక విధమైన విద్యుత్ప్రవాహం నాలోకి ప్రసరిస్తున్నట్లు నాకు అనుభూతి కలిగింది. ఆ స్పర్శ నన్ను ఆనందపారవశ్య స్థితికి కొనిపోయింది. నన్ను వదలివేస్తూ గురుదేవులు చిరునవ్వుతో 'బాగుంది, నువ్వే గెలిచావు' అంటూ మంచం మీద కూర్చున్నారు. ఆనందం అలలు అలలుగా ఎగసి నన్ను ఆసాంతం ముంచెత్తి వేసింది. గురుదేవులు భౌతికంగా గెలవకపోయినా, ఆయన తమ ఆధ్యాత్మిక శక్తితో నన్ను పూర్తిగా లోబరచుకున్నారు. ఆ ఆనందానుభూతి కొన్ని రోజుల పాటు నాలో నిలిచిపోయింది. ఆయన నాలో ఆధ్యాత్మికశక్తిని ప్రసరింప జేశారని అనుభవపూర్వకంగా గ్రహించాను".

శ్రీరామకృష్ణులు కాలాంతరంలో "శ్రీకృష్ణునితో కుస్తీపట్టిన జాంబవంతుని అవతారమే విజ్ఞానానంద"అని చెప్పారు.

**(నవంబరు 12న శ్రీ రామకృష్ణ పరమహంస సన్న్యాస శిష్యులైన స్వామి విజ్ఞానానంద జయంతి)**



- స్వామి సుకృతానంద

– యస్. రామనంద, పి.కె. పల్లె

**? : ఒకే ఆత్మ అందరిలో ఉన్నప్పుడు ఒకరికి జ్వరం వస్తే అందరికీ జ్వరం రావాలి కదా! అలా ఎందుకు జరగడం లేదు?**

✍: ఆత్మ చైతన్య వస్తువు. సర్వాంతర్యామి, సాక్షి మాత్రుడు. ఒకే సూర్యుడు గంగా జలంలోనూ, మద్యంలోనూ ప్రతి ఫలించినప్పుడు ఆయా వస్తువుల గుణ దోషాలు సూర్యునికి కానీ, దాని ప్రతిబింబానికి కానీ అంటవు. మన్నుతో చేయ బడిన కుండ, దాక, మూత, కూజా మొదలైన వాటిలో ఒకటి బీట వారినా, పగిలినా మిగతావి పగలడం లేదు. అదే విధంగా ఒక శరీరానికి జ్వరం వస్తే ఇతర శరీరాలకు రానవసరం లేదు. ఆత్మ అంటే పదార్థాల కలయిక కాదు. ఆత్మ స్వరూపం. ఆత్మ స్వయం ప్రకాశం, ఇతర వస్తువులు ప్రకాశించక పోయినా వాటిని కూడా ప్రకాశింపజేస్తుంది. స్వ ఇతర అప్రకాశత్వేసతి స్వ ఇతర సర్వ ప్రకాశకత్వం. ఆత్మపరంగా చైతన్యంగా సర్వులలోనూ ఒకే ఆత్మ ఉన్నా, దేహాలు వేరు వేరు కదా!

యస్. సీతారాములు, భువనగిరి

**? : హైందవ ధర్మం ప్రకారం దానధర్మాలు, క్రతువులు భార్యాభర్తలు కలిసిచేయాలి. సత్యభామ భర్తనే దానంగా ఇవ్వవచ్చా?**

✍: కల్పవృక్షమూ, తన భర్త శ్రీకృష్ణుడూ శాశ్వతంగా తన వద్దే ఉండాలని కోరుకున్న సత్యభామ నారదుని సలహా ప్రకారం మధుసూదనుణ్ణీ, కల్పవృక్షాన్నీ కలిపి ఒక సిబ్బిలో ఉంచి, తన వద్ద నున్న సంపదనంతా రెండవ సిబ్బిలో సరితూచి నారద మహర్షికే దానం చేసిందని పద్మపురాణం చెబుతుంది. భర్త శాశ్వతంగా తన వద్దే ఉండాలని ఏ పతివ్రత కోరుకోదు? ఆ విధంగా సత్యభామ తులాభారం వెయ్యడాన్ని తప్పు పట్టనవసరం లేదు. ఈ కథలన్నీ ఏదో ఒక ఉపాయంతో భగవంతుడు తన వద్ద ఉండాలని భక్తులందరూ ప్రయత్నించాల్సిందిగా శాస్త్రాలు బోధిస్తున్నాయి. సత్యభామ ఆర్తి, అనురాగాలను గుర్తించాలి. భగవంతుడు కావాలని కోరుకోవడం కోరికల్లోకి రాదు. భగవంతుడు సర్వాంతర్యామి అందరికీ చెందినవాడు. ఎవరు ఆయనే కావాలని కోరుకుంటారో వారికి లభ్యమవుతాడు. ఈ విషయాన్నే ప్రధానంగా గ్రహించాలి.

వి. నాగేశ్వరరావు, కల్లూరు.

**? : శ్రీమద్రామాయణంలో అంజనాసుతుడు శ్రీరామ లక్ష్మణులను ఋష్యమూకంలో కలిసి తరువాత రామబంటు అయ్యాడు. అంతకు ముందు శ్రీరామ ప్రభువుకూ, ఆయనకూ ఏదైనా అనుబంధం ఉందా?**

✍: అనుబంధం లేకుండా శ్రీరాముని పై ఆంజనేయ స్వామికి అంత గాఢ భక్తి కలగదు. దశరథుడికి పుత్ర కామేష్టిలో యజ్ఞ పురుషుడు పాయసం ఇస్తాడు. అందులో నుంచి కొంచెం పాయసాన్ని ఒక గ్రద్ద తీసుకుపోగా, ఆ పాయస అవశేషం అంజనా దేవికి లభించిందని ఆనంద రామాయణ ఉవాచ. జీవ పరమాత్మ భావ సంబంధం గానే కాక భక్తుడు దాస్యభావంతో దామోదరుణ్ణి ఎలా చేరుకోవాలో ఆంజనేయస్వామి ద్వారా తెలుస్తుంది. ఆయనలో శివాంశ ఉంది. ఈ వివరాలన్నీ మన పురాణాల్లో ఉన్నాయి. అత్యంత శక్తిమంతమైన రామబాణం కూడా ఆంజనేయ స్వామి భక్తి ముందు తన శక్తిని కోల్పోయింది. ✍



ఒకరోజు నారాయణ అనే బాలుడు వీధిలో పరుగుపెడుతూ తమ గ్రామ పొలిమేరల్లో ఉన్న హనుమంతుని మందిరానికి వెళ్ళి దాక్కున్నాడు. ఇంటివాళ్ళు తనకు ఇష్టంలేని వివాహ ప్రసక్తి తీసుకురావడమే దీనికి కారణం. అయితే భగవంతుని సంకల్పం మరొకటయింది. అతని మనస్సు నెమ్మదిగా హనుమంతునిపై లగ్నమయింది. శ్రీరాముని సేవకుడు, పరమ భక్తుడు అయిన హనుమంతుని జీవితంలో బ్రహ్మచర్య దీక్ష, కార్యదక్షత, శక్తి సామర్థ్యాలు అతణ్ణి బాగా ఆకర్షించాయి. అప్పటి వరకూ అల్లరివాడిగా, బాధ్యతలేని వాడిగా పెరిగిన నారాయణలో ఊహించని మార్పు వచ్చింది. శ్రీరామనవమి రోజున జన్మించిన నారాయణ హనుమంతుని దర్శనంతో ఆ రోజు తన జీవిత లక్ష్యాన్ని గుర్తించాడు. శ్రీరాముని దాసానుదాసునిగా మారి భవిష్యత్తులో సమర్థ రామదాసుగా ప్రసిద్ధిచెందాడు.



### దేశభక్తి - దైవభక్తి సంగమం

# సమర్థుని జీవితం!

- స్వామి సేవ్యానంద

మహారాష్ట్రలోని ఔరంగాబాద్ జిల్లాలో గోదావరి నదీ తీరంలో ఉన్న 'జంబ్' అనే గ్రామంలో సూర్యజీపంత్ ఠోసార్, రేణుకాబాయి పుణ్య దంపతులకు రెండవ సంతానంగా నారాయణ క్రీ.శ. 1608లో జన్మించాడు. తన 13వ ఏట వైరాగ్యంతో గోదావరీ తీరంలో ఉన్న 'పంచవటి'కి వెళ్ళాడు. గోదావరికి దగ్గరలో ఒక కొండ మీద 'టాకళి' అనే గుహను తన సాధనలకు అనుకూలమైన స్థలంగా ఎన్నుకొన్నాడు. అక్కడ 12 సంవత్సరాలు శ్రీరఘునాథుని ధ్యానిస్తూ కఠోరమైన సాధనలు చేశాడు. ఈ సమయంలో శ్రీరామచంద్రుడు అతనికి దర్శనం ఇచ్చి మంత్రదీక్షను ప్రసాదించాడు. అప్పటి నుంచి నారాయణ 'రామదాసు' అనే నామాన్ని స్వీకరించాడు.

రామదాసు తన తపస్సు తరువాత పరివ్రాజకునిగా భారతదేశమంతా పర్యటించాడు. విదేశీయుల పాలనలో ఉన్న నాటి ప్రజల దుఃస్థితిని చూసి చలించిపోయాడు. మతోన్మాదుల దాడికి గురైన తీర్థస్థలాలు; మత ఛాందసులు ప్రజలను బలవంతంగా ఇతర మతాలకు మార్చివేయడం; ఆధ్యాత్మికంగా, నైతికంగా బలహీనమైన సమాజంలోని భయాందోళనలు... ఒక్కమాటలో 'హిందూధర్మం' పూర్తిగా అవసానదశలో ఉందని రామదాసు గ్రహించాడు. ప్రజలను ఈ దుఃఖం నుంచి విముక్తుల్ని చేసి వారికి శాంతిని ప్రసాదించవలసిందిగా భగవంతుణ్ణి ప్రార్థించాడు. "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి – కన్న తల్లీ, జన్మ భూమీ, స్వర్గం కంటే ఉత్కృష్టమైనవి" అన్న శ్రీరామచంద్రుని ఉపదేశం రామదాసు మనసులో దృఢంగా నాటుకుంది. తన పరివ్రాజక దశలో చాలా మంది మహాపురుషులను కలిశాడు. వారిలో సంత్ తుకారం ఒకరు. తన పర్యటనలో భాగంగా వివిధ ప్రాంతాలలో ప్రజలను ఉద్దేశిస్తూ ప్రసంగించాడు. స్త్రీల కన్నీటిని తుడిచి, దీనుల దుఃఖాలను దూరం చేసి, ధర్మాన్ని స్థాపించడమే ఈ భారతదేశంలోని ప్రతి వ్యక్తి ప్రథమ కర్తవ్యం కావాలనీ, శక్తి సామర్థ్యాలు, కార్యదక్షత, బుద్ధికుశలత గల హనుమంతుడే ఈ దేశానికి ఆదర్శం కావాలనీ నొక్కి చెప్పాడు. తమలో ఉన్న శారీరక, మానసిక బలహీనతలను వదిలిపెట్టి ధైర్యంగా, ఆత్మ విశ్వాసంతో శత్రువులతో పోరాడి సమాజంలో ధర్మాన్నీ, శాంతి సౌఖ్యాల్నీ పునఃప్రతిష్ఠించవలసిందిగా హితవునిచ్చాడు. ప్రసంగాలతో పాటు ఆయన రచించిన గేయాలు కూడా ప్రజలను బాగా ప్రభావితం చేశాయి. ఈ సమయంలో అతను కొన్ని ప్రదేశాలలో శ్రీరామచంద్రుని, శ్రీహనుమంతుని మందిరాలను స్థాపించాడు. జీర్ణదశలో ఉన్న మందిరాల ఉద్ధరణ కోసం పాటుపడ్డాడు. వితల సంప్రదాయంలోని ముందు తరాల మహాపురుషులు సమాజంలో ధర్మాన్ని స్థాపించడానికి మాత్రమే ప్రాముఖ్యం

ఇచ్చారు. కానీ రామదాసు నాటి సమాజంలోని విదేశీ పాలనను వ్యతిరేకించాడు. విదేశీయులను వెళ్ళగొట్టి, మాతృభూమికి స్వాతంత్ర్యాన్ని తెచ్చిన తరువాతే ఇక్కడ ధర్మమనే జ్యోతిని నిరాటంకంగా వెలిగించాల్సిందని ప్రజలను ప్రోత్సహించాడు.

రామదాసు భారత పరిక్రమ పూర్తిచేసుకొని మహారాష్ట్ర తిరిగి వచ్చిన తరువాత 'ఛత్రపతి శివాజీ' ఆయన్ని కలిశాడు. శివాజీ రామదాసుకి ప్రణామం చేసి, తనను శిష్యునిగా స్వీకరించి ముక్తి మార్గాన్ని ప్రసాదించవలసిందిగా వ్యాకులతతో ప్రార్థించాడు.

"శివాజీ, నేను భారత పరిక్రమ తరువాత ఈ దేశం ఎంత పతనావస్థలో ఉందో స్పష్టంగా తెలుసుకున్నాను. ఈ దేశానికి స్వాతంత్ర్యం తీసుకువచ్చి ఉన్నతమైన భారత సంస్కృతిని పునర్నిర్మించడమే నీ ప్రథమ కర్తవ్యం! నీవు ముక్తిని గురించి ఎందుకు ఆలోచిస్తున్నావు? మానవ సేవయే మాధవ సేవ! ఈ కార్యంలో భగవంతుని సహాయం సర్వవేళలా ఉంటుంది. భగవంతునిపై విశ్వాసముంచి నీ కర్తవ్యాన్ని సాధించడానికి ముందుకు వెళ్ళు!" అని రామదాసు శివాజీకి తన కర్తవ్యాన్ని బోధించాడు.

ఉత్తేజకరమైన గురువు ఉపదేశాలను ఏకాగ్ర మనస్సుతో, భక్తితో స్వీకరించి, పాదాభివందనం చేసి, శివాజీ సెలవు తీసుకున్నాడు. రోజురోజుకీ శక్తి సామర్థ్యాలను పెంచుకొని తమ కార్యసాధనలో ముమ్ముందుకు సాగుతున్న శివాజీనీ, తన ఇతర శిష్యులనూ చూసి రామదాసు ఆనందించాడు. శివాజీ 1674వ సంవత్సరంలో 'రాజగఢ్' సింహాసనాన్ని అధిష్ఠించిన తరువాత అక్కడ తన గురువు రామదాసు కోసం ప్రత్యేకంగా ఒక గదిని నిర్మించాడు. ఆ గదిని నేడు కూడా మనం చూడవచ్చు. శివాజీ కోరికపైన రామదాసు, ప్రకృతి సౌందర్యంతో కూడి సాధనలకు అనుకూలమైన 'సజ్జన్‌గఢ్'కు తన నివాసాన్ని మార్చుకున్నాడు. ఇక్కడే అతను 'దాస బోధ' పుస్తకాన్ని వ్రాయడం పూర్తిచేశాడు. 'సజ్జన్‌గఢ్'లో శ్రీరామచంద్రుని సుందరమైన విగ్రహాన్ని ప్రతిష్ఠించి, తన చివరి కోరిక తీరడంతో రామదాసు సంతృప్తి చెందాడు.

"భగవంతుడు భక్తుల మనసు, వాక్కు, కర్మలను పరిశీలిస్తూ వారి హృదయాలలో వసిస్తాడు. అతను అందరినీ శుభ సంపదలతో, ఆయురారోగ్యాలతో అనుగ్రహిస్తాడు. శ్రీరామచంద్రుడు అతని భక్తులను సర్వదా సంరక్షిస్తాడు..." అనే కీర్తన పాడుతూ రామదాసు క్రీ.శ. 1682 వ సంవత్సరంలో తన స్థూల శరీరాన్ని విడిచి శ్రీరామచంద్ర భగవానునిలో ఐక్యమయ్యాడు. దేశభక్తీ, దైవ భక్తీ సంగమ తీర్థమే రామదాసు జీవితం. ఆయన ఉపదేశాలు భారతదేశానికి నాటికీ, నేటికీ, ఎన్నటికీ స్ఫూర్తిదాయకం.




- స్వామి వివేకానంద



# ప్రపంచం ఓ వ్యాయామశాల!

మీరు చేసే పని అంతా మీ కోసమే, మీ ప్రయోజనం కోసమే. వైద్యశాలను గానీ మరి దేనినైనా కానీ ఆయన కోసం నెలకొల్ప నక్కరలేదు. ఈ వ్యాయామశాలలో మన కండరాలను దృఢతరం చేసుకోవడానికి పనిచేయాలి. లోకానికి మన అవసరం ఏమీ లేదు. ప్రపంచం సాగిపోతూనే ఉంటుంది. మనం సముద్రంలోని బిందువులం మాత్రమే. ఆయన లేక ఆకు కదలదు. గాలి వీచదు. మనం భగవంతుని సేవ చేయడానికి అవకాశం లభించినందుకు ధన్యులం. 'సహాయపడడం' అనే మాటను మీ మనస్సులలో నుంచి తొలగించండి. మీరు సహాయపడలేరు. సహాయపడు అనే మాట దైవదూషణ. ఆయన కృప వల్లనే మీరు ఇక్కడ ఉన్నారు. మీరు ఆయనకు సహాయపడగలమనుకొంటున్నారా? మీరు కుక్కకు పట్టెడన్నం పెడితే, మీరు కుక్కను దైవంగా ఉపాసిస్తున్నారు. దేవుడు ఆ శునకంలో ఉన్నాడు, ఆయనే శునకమైనాడు. ఆయన అన్నింటి యందూ తానే అయి ఉన్నాడు. ఆయనను ఉపాసించడానికి మనం అనుమతించబడ్డాం. అలాంటి పూజ్యభావాన్ని అలవరచుకుంటే మనలో సంపూర్ణమైన నిస్సంగత్వం కలుగుతుంది. ఇదే మన విధి. కర్మ విషయంలో మనం అవలంబించదగ్గ సమ్యక్ దృక్పథమిదే. ఈ ప్రపంచమనే వ్యాయామశాలలో మనల్ని మనం ఉద్ధరించుకోవడానికి నిస్సంగత్వంతో కర్మలు చేయాలి. కర్మయోగ రహస్యమిదే. a

**మనల్ని మనం దృఢంగా తీర్చిదిద్దుకునేందుకు సందర్శించే వ్యాయామశాలే ఈ ప్రపంచం.** - స్వామి వివేకానంద




ప్రవచనం: **శ్రీ సామవేదం షణ్ముఖశర్మ** విలేఖనం: **శ్రీమతి ఎన్. శేషు**

**(గత సంచిక తరువాయి)**

త్రిపురసుందరీ విద్యకు శివుడు గురువు. ఎవరా గురువు? – దక్షిణామూర్తి. శ్రీవిద్యకు గురువు దక్షిణామూర్తి. దీనిని బట్టి ఆత్మ విద్యే శ్రీవిద్య అని అర్థమవుతుంది. ఎందుకంటే దక్షిణామూర్తి బ్రహ్మవిద్యకి గురువు. అందుకే శంకర భగవత్పాదుల వారు దక్షిణామూర్తిని స్తోత్రం చేస్తూ ఆయనని బ్రహ్మవిద్యా స్వరూపునిగా చూపిస్తున్నారు:

**"మౌన వ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మ తత్త్వం యువానం**
**వర్షిష్ఠాంతే వస దృషిగణై రావృతం బ్రహ్మ నిష్ఠైః**
**ఆచార్యేంద్రం కరకలిత చిన్ముద్ర మానంద రూపం**
**స్వాత్మారామం ముదిత వదనం శ్రీదక్షిణామూర్తి మీడే"**

ఆ దక్షిణామూర్తి ఇచ్చిన విద్యే శ్రీవిద్య. పరమ మౌనమూర్తి అయిన దక్షిణామూర్తి ఇచ్చిన శ్రీవిద్య అంటే ఇది ఆత్మవిద్య అని స్పష్టమవుతోంది. ఆ పరమ శివుడే శ్రీవిద్యాజ్ఞానాన్ని ఇచ్చాడు; త్రిపురాసుర సంహారం చేశాడు. ముజ్జగాలలో వ్యాపించిన జగజ్జననిని చూడాలి అంటే దక్షిణామూర్తి అనుగ్రహంతో శ్రీవిద్యను ఉపాసించాలి.

శ్రీమత్ త్రిపురసుందరీ అన్నది లలితా సహస్రనామాల్లో చివరి నామం. ఈ శ్రీమత్ త్రిపురసుందరీ అనే ఆ తల్లి పరమేశ్వరుని శక్తే. ఆ రెండూ అవిభాజ్యాలని వివరించు కున్నాం. అందుకు శివాశివశక్త్యైక్యరూపిణీ లలితాంబికా అని పూర్తి చేస్తాం. చిట్టచివరిది లలిత అనే పేరు. ఈ పేరు మొత్తం వెయ్యి నామాల్లో ఎక్కడా రాదు. ఇంతవరకూ చెప్పిన 999 పేర్లూ ఆవిడవే అని చెబుతున్నారు వశిన్యాది వాగ్దేవతలు. చిట్టచివరన 'లలితా' అని ఊరకోకుండా 'అంబికా' అన్నారు.

ఇప్పుడు లలితా సహస్రం చదువుతూ – "శ్రీశివా శక్త్యైక్య రూపిణీ లలితాంబికా" అని చదువుతారు. కానీ బాగా పరిశీలిస్తే పూర్వ పాఠాలలో "శివాశక్త్యైక్య రూపిణీ శ్రీలలితాంబికా" అని కనిపిస్తుంది. ఇది మనం ప్రమాణంగా తీసుకుని ఈ 'లలిత' అనేది అమ్మ వారి ప్రత్యేక నామం కాదు, మొత్తం వెయ్యి నామాలూ ఆవిడవి అనుకుంటే 'శ్రీ అంబిక' అనే రెండు నామాలు మిగిలాయి. అంబిక అంటే అమ్మ అని అర్థం. చిట్టచివరి పేరు – శ్రీ అంబిక; మొట్టమొదటి పేరు – 'శ్రీమాతా'. రెండూ ఒకటే అర్థం. అందుకు లలితా సహస్రం మొదలు ఏది చెప్పిందో చివర అదే చెప్పింది. అంటే అన్నిటికీ ముందు ఏదో, అన్నింటికీ చివరా అదే. మధ్యలోవి మనల్ని అనుగ్రహించడానికి ధరించిన పలు రూపాలు. శ్రీమాతతో మొదలై శ్రీమాతతో అంతమవుతోంది ఒక మాల లాగ! మాలకు అంతం ఉండదు. ఎక్కడ మొదలు పెడతామో చివరికి పూర్తి చేసేది అక్కడే! అలా మొత్తం లలితా సహస్రం అంత అందంగా కూర్చబడింది. శ్రీమాతతో మొదలై శ్రీమాతతో అంతమవుతుంది. మధ్యలో అమ్మ వారి పూర్ణతత్త్వం చెప్పబడింది. ఇలా సమకూర్చిన ఆ సహస్రనామాలను మనం ఆధారం చేసుకుంటే శివశక్త్యైక్యరూపిణి అనే విషయమే మనం చెప్పుకున్న అమ్మ కథలో గోచరించింది. శంకర భగవత్పాదుల వారు శివా అని దీర్ఘం పెడితే అమ్మ, శివః అంటే అయ్య అంటారు. వాళ్ళిద్దరూ ఒకటే!

ఏ దేవత పేరు తీసుకున్నా దానికి స్త్రీ లింగం పెడితే అమ్మ పేరు అయిపోతుంది – నారాయణ – నారాయణి; ఇంద్ర – ఐంద్రీ; కుమార – కౌమారి. సర్వ దేవతల్లో వ్యాపించిన శక్తియే జగదంబిక అని స్పష్టమవుతుంది. ప్రధానంగా పరబ్రహ్మ యొక్క శక్తి అన్నప్పుడు శివా శివః. శివా అని అమ్మ పేరు చెప్పి శివశక్త్యైక్యరూపిణీ అని ప్రస్తావించి – అంతర్బహిశ్చ ఊర్ధ్వమధశ్చ మధ్యే పురశ్చ పశ్చాచ్చ విదిక్షు దిక్షు, సర్వంగతాయై చ సకలం గతాయ నమశ్శివాయై చ నమశ్శివాయ – అన్నారు శంకర భగవత్పాదుల వారు 'అర్ధనారీశ్వర స్తోత్రం' చేస్తూ! అందులో మొదటి శ్లోకాలన్నీ చక్కగా సగుణాన్ని వర్ణిస్తాయి. "చాంపేయ గౌరార్ధ శరీరకాయై కర్పూర గౌరార్ధ శరీరకాయ ధమ్మిల్లకాయై చ జటాధరాయ నమశ్శివాయై చ నమశ్శివాయ". అమ్మ – అయ్య ఇద్దరూ కలసి ఒకే శరీరం. అందులో ఎడమ వైపు సంపెంగ పువ్వు లాంటి బంగారు రంగు కాంతి, కుడి వైపు తెల్లటి కర్పూరపు కాంతి. ఎడమ వైపు తుమ్మెద రెక్కల లాగ నిగనిగ లాడుతూ

చక్కని జడ వేసుకుని ఉన్న జుట్టు, కుడి వైపు సంస్కార రహితంగా వదలివేసిన జడల గుంపు – అలా కనిపిస్తున్నారు వీరిద్దరూ! నమశ్శివాయై చ నమశ్శివాయ అంటూ మొత్తం రూపం అంతా వర్ణిస్తూ వస్తున్నారు.

ఝణత్ క్వణత్ కంకణ నూపురా యై పాదాబ్జ రాజ ధ్వని నూపురాయ, దివ్యాంబరాయై చ దిగంబరాయ నమశ్శివాయై చ నమశ్శివాయ...

ఇలా ఇలా రూపాన్ని చెప్పి చెప్పి చివరికి ఏం చెబుతున్నారంటే – "అంతర్బహిశ్చోర్ధ్వమధశ్చ మధ్యే ..." అది శంకరుడంటే! మనం "శంకరులు నిర్గుణ తత్త్వాన్నే చెప్పారు సగుణాన్ని కాదన్నారు" అనుకుంటాం. ఆయన అది చెయ్యలేదు. సగుణంలో ఉపాసనలో ఉంటూ అదే నిర్గుణమని తెలుసుకో అన్నారు. ఆయన చేసినది సగుణ నిర్గుణ సమన్వయమే తప్ప సగుణ నిరసనము కాదు. శంకరులు ఏ సంప్రదాయాన్నీ నిరసించలేదు. అన్ని సంప్రదాయాలకూ ఆత్మవిద్యతో సమన్వయం చేశారు. ఆత్మవిద్యే అమ్మవిద్యగా గోచరించింది ఆయనకు! అదే ఇక్కడ స్పష్టం చేస్తూ –

అంతర్ బహిశ్చోర్ధ్వమధశ్చ మధ్యే పురశ్చ పశ్చాత్ చ విదిక్షు దిక్షుః; అంతః = లోపల; బహిః = బయట, ఊర్ధ్వ అధఃమధ్యే – అంతటా నువ్వే. పురశ్చ పశ్చాచ్చ = ముందు, వెనుక; విదిక్షు దిక్షు = సర్వ దిక్కుల యందు మూలల యందు కూడా; సర్వంగతాయై సకలం గతాయ – అంతటా ఉన్న ఆమెకు నమస్కారం, అంతటా ఉన్న ఆయనకు నమస్కారం – అంటే శివశక్త్యాత్మకం ఈ జగత్తంతా అని ప్రస్తావించారు. శివశక్త్యాత్మకమైన విశ్వచక్రమే శ్రీచక్రం. శివశక్త్యాత్మకమైన శ్రీచక్రమే శరీరచక్రం. అప్పుడు మనకు తెలుస్తున్నదేమిటంటే శివశక్తే విశ్వమంతా ప్రవహిస్తున్న సౌందర్య లహరి. ఆ శివశక్తే నాలోనూ ప్రవహిస్తున్న సౌందర్య లహరి. నా శరీరమే శ్రీ చక్రం, ఈ విశ్వమే శ్రీచక్రం.

"అమ్మా! బ్రహ్మ విద్యాస్వరూపిణి అయిన జగదంబికా! నువ్వే ఆత్మవని తెలుసుకుని ముక్తికాములు, ధీరులైనటువంటి వారు హర్షశోకాల నుంచి బయటపడుతున్నారమ్మా! అంటూ ద్వంద్వాతీత స్థితి ఎవరికి వస్తుందంటే "అమ్మయే ఆత్మ అని తెలుసుకుని ఎవరు ఉపాసిస్తారో వారు మాత్రమే మోహశోకాల నుంచి బయటపడుతున్నారు" అని శంకరాచార్యులు ప్రతిపాదించారు. "అహమిత్యేవ విభావయే భవానీం అనడంలో అహం అని స్ఫురించే ఆత్మ చైతన్యమే భవానీ" అని ఉపాశించమని ఆ ధ్యాన శ్లోకమే మనకి చెబుతున్నది.



ఆ స్వరూపమే ఇక్కడ కనిపిస్తున్నది. ఏ స్వరూపమంటే "అరుణాం..." అంటూ ముందు అమ్మవారి రంగు చూపిస్తున్నారు. అమ్మవారు అపూర్వమైన పద్మాసనం వేసుకుని కూర్చున్నారు, అది అపూర్వమైన యోగాసనం. ఆ యోగాసనంలో నాలుగు చేతులతో ప్రకాశిస్తూ అమ్మ దివ్యమంగళ విగ్రహం ఉంది. ముందు వెలుగు కనపడుతుంది. అది ఎలాంటి వెలుగంటే మనకు రూపం కూడా స్పష్టంగా గోచరించదు. ముందు ఆ వెలుగు బాగా వచ్చి మనం జాగ్రత్తగా చూస్తే రూపం కనిపిస్తుంది.

వశిన్యాది వాగ్దేవతలు ఆ వర్ణన చేశారు. ఉద్యద్భాను సహస్రాభా – ముందు గుంపులుగా ఆ కాంతిపుంజం కనపడిందట. వేల కొద్దీ బాలసూర్యులు ఒక్కసారి ఉదయిస్తే ఎలా ఉంటుందో అలాంటి ఎర్రటి కాంతులతో ఉందట. తరువాత చూడగా చూడగా నాలుగు చేతులతో అమ్మ కనపడిందట. అందుకు ముందు కనపించినదేమిటంటే అరుణాం; తరువాత ఇంతింత కళ్ళు కనిపించాయట; కరుణా తరంగి తాక్షీం= (ఆకళ్ళలోంచి) కరుణ తరంగితంగా వస్తోందిట. తరంగితం అంటే నిరంతరాయమైన ప్రవాహం... ఆ దయా ప్రవాహం నిరంతరం ప్రసరిస్తోంది. a

కథ: టి.ఎం.ఎస్
చిత్రాలు: శంకర్

# శివసాయుజ్యం పొందిన శ్రీధరయ్య

తెలుగుసేత: స్వామి జ్ఞానదానంద

1 ఒకప్పుడు చోళదేశం అనావృష్టికి గురయ్యింది. మహారాజు దేవాలయాలలో విశేషపూజ ఏర్పాట్లు చేశారు. ఒక సాయంత్రం కర్కటేశ్వరస్వామి ఆలయానికి శివాచార్యుడు వెళుతున్నాడు. దారిలో ఎదురైన శ్రీధరయ్య...




శివాచార్యుడు ఆ వృత్తాంతం వివరించాడు.

2 ఈ దేవాలయం ఇంద్రుడు నిర్మించాడు. ఒకప్పుడు ఇంద్రుడు వేయి తామర పుష్పాలతో శివుణ్ణి రోజూ అర్చించేవాడు. కానీ పూజా సమయంలో రోజూ ఒక పుష్పం తక్కువగా వుండేది. ఒక ఎండ్రకాయ ఓ పుష్పాన్ని లాగుకుంటూ వెళ్ళడాన్ని ఇంద్రుడు చూశాడు. దాన్ని పట్టుకోవడానికి ప్రయత్నించాడు.



3 కానీ ఆ ఎండ్రకాయ శివలింగం మీదికి ప్రాకి ఆ పుష్పాన్ని అక్కడ ఉంచింది. ఇంద్రుడు దానిని పట్టుకోవడానికి ప్రయత్నించినప్పుడు శివుడు దానిని తనలోనికి లాగేసుకున్నాడు. తర్వాత శివుడు ప్రత్యక్షమై, ఎండ్రకాయకూ, ఇంద్రునికీ దర్శనమిచ్చి కటాక్షించాడు.



4 శివాచార్యుడు చెప్పిన వృత్తాంతాన్ని విన్న శ్రీధరయ్య...

అయ్యా! కర్కటరాశిలో చంద్రుడు ప్రవేశించే ఈ వేళలో వర్షం పడాలి కదా! పరమేశ్వరా! కర్కటేశా! ఎంద్రకాయ పట్ల చూపిన అనుగ్రహాన్ని, వర్షం లేక పరితపించే మా మీద ప్రసరింపజేసి, వర్షం కురిసేలా అనుగ్రహించండి!



5 భగవంతుడు కర్కటేశ్వరునిగా మారిన వృత్తాంతాన్ని శ్లాఘిస్తూ శ్రీధరయ్య 'కుళిరేశాష్టకం' పాడితే, వెంటనే ధారాపాతంగా వర్షం పడింది.

6 ఆరోజు శ్రీధరయ్య ఇంట్లో శ్రాద్ధం. తిథిని జరిపించడానికి ముగ్గురు బ్రాహ్మణులు వచ్చారు. వారు కావేరీ నదిలో స్నానం చేయడానికి వెళ్ళగా శ్రీధరయ్య ఇంటి గుమ్మంలో కూర్చున్నాడు.




ఒరేయ్! సాంబా! నువ్వా! రా! లోపలికి వచ్చి అన్నం తిను!

సాంబును చూసి సాక్షాత్తూ పార్వతీ పరమేశ్వరులే తన ముందు నిలబడి ఉన్నారన్న భావనతో శ్రీధరయ్య అతనికి భోజనం పెట్టాడు.

7 కావేరీనదిలో స్నానంచేసి తిరిగి వస్తున్న పురోహితులు సాంబుడు భోజనం చేసి వెళ్ళడం చూశారు.

8 సాంబుడు భోజనం చేసిన చోటును శుద్ధి చేసి, వంట మళ్ళీ చెయ్యమ్మా!




అయ్యా! అన్నీ మళ్ళీ వండుతాం. ఇందులో ఆచార నియమాలకు ఎలాంటి భంగమూ కలుగలేదు. బియ్యం, కాయగూరలు, పాలు, కట్టెలు – ఇవన్నీ బీదల శ్రమ ఫలితమే కదా!

9 లేదు లేదు! మాకు ఆచార నియమాలే ముఖ్యం! మీరు ఏం చెప్పినా సరే, మీరు చేసింది న్యాయసమ్మతం కాదు.




భార్యాభర్తలిరువురూ గంగానదిలో స్నానం చేసివస్తే దోషపరిహారమవుతుంది.

వెంటనే శ్రీధరయ్య సర్వేశ్వరుణ్ణి ప్రార్థించాడు.

మిగతా 36వ పేజీలో...



# పరమేశ్వరుని పరిరక్షణలో ...

## స్వామి జపానంద స్వీయ అనుభవాలు -17

(గత సంచిక తరువాయి...)

## ఆత్మీయత నిండిన ఆతిథ్యం!

స్వామి జపానంద ముందు రోజూ భోజనం లేక మంచినీటితోనే కడుపు నింపుకోవడం వల్ల చాలా నీరసంగా ఉంది. ఎండలో కొండల్లో నడక చాలా కష్టంగా ఉంది. వేరే ఉపాయం ఏదీ లేదు. తెచ్చుకున్న నీళ్ళు త్వరగానే అయిపోయాయి. దాహంతో నోరు ఎండి పోతోంది. కాళ్ళ బాధ ఎలాగూ ఉంది. ఎక్కడైనా నీరు దొరికితే బాగుండును కానీ దరిదాపుల్లో ఎక్కడా నీళ్ళు కనిపించలేదు. అలా కష్టపడి కొండ ఎక్కాక ఒక చిన్న పల్లె కనిపించింది. అక్కడ ఎవరూ కనపడకపోయే సరికి ఓ మర్రిచెట్టు కింద కంబళి పరుచుకొని పడుకున్నారు. అంతిమ క్షణాలు లెక్క పెడుతూ పరమేశ్వరుడి నిర్ణయం ఇదే కాబోలు అనుకుని దైవస్మరణ చేసుకుంటున్నారు.

ఆ సమయంలోనే అక్కడకు కొన్ని గజాల దూరంలో ఉన్న లోయలో నుంచి ఎవరో మాట్లాడుతున్నట్లు వినిపించింది.



మనుష్యుల మాటలు వినగానే లేచి నిల్చొని చూసే ఓపిక లేక నేలమీద బోర్లా పడుకొని క్రిందికి చూస్తే అక్కడ సుమారు ఏడెనిమిది వందల గజాల దూరంలో ఒక ఇల్లు కనిపించింది. అక్కడ కొంతమంది రొట్టెలు చేస్తున్నారు.

నోటి నుంచి మాట రావడం లేదు. అందుకని ఒక బట్ట గాలిలో ఊపుతూ అక్కడ ఉన్న కొంత మంది పిల్లల దృష్టిని ఆకర్షించే ప్రయత్నం చేశారు. సన్న్యాసి కమండలం చూపించి నీళ్ళు కావాలని సైగ చేశారు. వాళ్ళు నీటి కుండ చూపించి నీళ్ళు ఉన్నాయి రమ్మని తెలియజేశారు. కానీ సన్న్యాసికి తనకి నడచి కిందికి వెళ్ళే శక్తి లేదని వారికి ఎలా తెలియజెయ్యడం అన్నది అర్థం కాలేదు. ఇంతలో ఒక స్త్రీ బయటకు వచ్చి అక్కడే ఉన్న ఒక వ్యక్తిని సన్న్యాసి దగ్గరకు వెళ్ళమని చెప్పింది. అతను పైకి వచ్చి వాళ్ళ ఇంటికి రమ్మని ఆహ్వానించాడు.

సన్న్యాసి మొహమాట పడుతూనే నడవలేని తన అసమర్థత గురించి చెప్పారు. అంతా విని ఆ వ్యక్తి "నేను నా భుజాల మీద కూర్చోపెట్టుకుని తీసుకెళతాను. మీకు ఏ ఇబ్బందీ కలగదు," అని పదే పదే చెప్పడంతో సన్న్యాసి తన అంగీకారం తెలిపాడు. అతని సహాయంతో నెమ్మదిగా ఇంటికి చేరుకున్నారు. ఆ ఇంటి యజమానురాలు సన్న్యాసి కాళ్ళకు కట్టుకున్న కట్టు చూసి "ఇదేమిటి కట్టు ఇలా కట్టారు?" అంటూ విప్పి చూసింది. రెండు పాదాలూ కింది భాగంలో బొబ్బలు చూసి, "నేను వేడి నీళ్ళతో కాళ్ళు కడిగి వెచ్చటి నూనె రాస్తాను" అని చెప్పి ఇంట్లోకి వెళ్ళి, వేడి నీళ్ళు వెచ్చటి నూనె తీసుకుని వచ్చింది. మెల్లగా వేడి నీటితో కాళ్ళు కడిగి వెచ్చ వెచ్చని నూనెతో మర్ధనం చెయ్యడం మొదలుపెట్టింది. ఈ లోపున ఆమె భర్త సన్న్యాసికి చల్లటి నీళ్ళు తాగడానికి ఇచ్చాడు. చల్లటి నీరు తాగే సరికి వంట్లో కొద్దిగా శక్తి వచ్చింది. ఇంత ప్రేమ నిండిన ఆతిథ్యం దొరికే సరికి సన్న్యాసికి కళ్ళు చెమర్చాయి. తరాల నుంచి నిరక్షరాస్యులైన వీరు ఆధునిక సభ్య సమాజానికి దూరంగా ఉంటూ కూడా మన ఋషులు, మునులు చెప్పిన సదాచారాన్ని మర్చిపోలేదు.

చెమర్చిన సన్న్యాసి కన్నులు చూసి, ఆ స్త్రీ కాళ్ళ బాధ ఎక్కువగా ఉందనుకుని "వెచ్చటి నూనె రాశాను కదా, ఇంక బాగుంటుంది. భగవంతుడికి నివేదన అయిపోగానే మీరు భోజనం చేసి విశ్రాంతి తీసుకోండి. ఈశ్వరుడు దయామయుడు. మా ఇంటికి ఒక సాధువుని ఆహ్వానించాలని ఎప్పటినించో అనుకుంటున్నాం. భగవంతుడు మా మొర విని మిమ్మల్ని ఇటు వచ్చేలా చేశాడు" అన్నది.

స్వామి జపానంద మౌనంగా అంతా విని "మీ ప్రార్థనలు, దైవ నిర్ణయం కారణంగా నేను దారి తప్పిపోయినా సరైన సమయానికి నేను ఇక్కడికి చేరుకున్నాను. ఇవాళ ఇక నా జీవితం అంతమైపోతోంది అనుకున్నప్పుడు మీరు నన్ను ఆదరించి ఆత్మీయతతో ఆతిథ్యాన్ని ఇచ్చారు. ఇదంతా ఆ భగవంతుని కృపాకటాక్షమే!" అని అభినందనలు తెలియజేశారు.

(మిగతా వచ్చే సంచికలో...)

అనువాదం : శ్రీమతి జి.ఎస్. లక్ష్మి

# ఏది సంతోషం?

**సంతోషోహి పరంశ్రేయః సంతోషః సుఖముచ్యతే**
**సంతుష్టః పరమభ్యేతి విశ్రామమరిసూదన ॥**

ఓ శత్రుమర్దనా! రామచంద్రా! "సంతోషం" అనేదాన్ని శ్రేయస్సు, సుఖం, విశ్రాంతి, మోక్షం అని కూడా అంటారు. అలాంటి 'సంతోషం' అనే దాన్ని సొంతం చేసుకొన్నవారికి సంపదలు, రాజ్యాధికారాలు, వందిమాగధ జనం లాంటివి కూడా ఎండుగడ్డి పరకలలాగ అతి తుచ్ఛమైనవే అవుతాయి.

సంతోషంతో కూడిన బుద్ధి కలవారు ఈ సంసారిక దుఃఖాలు ఎదురైనపుడు తల్లడిల్లకుండా ఉంటారు. సుఖాలు పొందినప్పుడు తబ్బిబ్బు కాకుండా ఉంటారు. ఆ మహనీయులు స్వయంగా సంతోషమనే అమృతం త్రాగి తృప్తులై, శాంతియుతులై ఈ భూమి మీద సంచరిస్తారు. వారికి ఈ భోగసంపదల యొక్క అర్థమేమిటో తెలియదు. (వీటిలో వారికి క్రొత్తగా ప్రాప్తించవలసినదేదీ కనిపించదు) మధురమైన సంతోషం అనే గుణం ఆశ, దైన్యం మొదలైన దుర్భరమైన అల్పగుణాలను నశింపజేస్తుంది. అంతటా ఆనందం వెల్లివిరియ జేస్తుంది.



**సంతోషం అంటే ఏమిటి?**

**అప్రాప్త వాంఛామృత్సృజ్య**
**సంప్రాప్తే సమతాంగతః ।**
**అదృష్ట ఖేదా - ఖేదోయః ససంతుష్ట**
**ఇమోచ్యతే ॥**

ప్రాప్తించినవాటి గురించి వేదన చెందక, పొందినవాటి గురించి తబ్బిబ్బు కాక, సుఖదుఃఖాల వల్ల చంచలుడు కాక, భేదాభేదాలకు అతీతుడై ఉండేవాడే సంతుష్టుడు. సర్వదా స్వస్వరూపం వల్ల ఆనందం పొందుతూ, సర్వులనూ, సర్వాన్నీ ప్రశాంతంగా దర్శించేవాడే సంతుష్టుడు. అట్టివాని మనస్సు తన యందు తానే మౌనస్వరూపమైన తృప్తి, ఆనందాలను పొంది ఉంటుంది.

వాస్తవానికి ఈ జీవుడు స్వతహాగా ఆనందస్వరూపుడే కదా! అయితే మనస్సు వివిధ విషయాలను కోరుకోవడం ప్రారంభించడం వల్ల ఆ వాంఛల నుండే మనోరుగ్మతలు వస్తున్నాయి. సంతోషం వల్ల శీతలమైన చిత్తంలో విశుద్ధమైన విజ్ఞానం వికసిస్తోంది. సంతోష సూర్యుడు ప్రకాశించే చోట "దిగుళ్ళు, అసూయలు, దోషదృష్టులు" మొదలైనవాటి రూపమైన అజ్ఞానపు చీకటి తొలగిపోతుంది.

'ఆశ' అనే దానికి వివశమై సంతోషం కోల్పోతున్న చిత్తం ధూళి వల్ల కప్పబడిన 'దర్పణం' లాంటిది. అందులో జ్ఞానవాక్యాలు ఎలా ప్రతిబింబిస్తాయి చెప్పు? "మాకీ లోటుపాట్లన్నీ ఉన్నాయి కదా! మేము జ్ఞాన విషయాలు ఎలా వింటాం? మేము పొందాలనుకొన్నవి పొందనివ్వండి, అప్పుడు చూద్దాం" అని జీవుడు ఆశల వెంటే నడుస్తున్నాడు. దుఃఖించడం, ద్వేషించడం – ఇవే అలవాటు అయి ఉంటున్నాయి. "సంతోషంగా ఉండడం" అనేది ఎందుకు అలవాటు చేసుకోకూడదు. సంతోష మనస్సునికి శారీరక, మానసిక వ్యాధులు దూరంగా ఉంటాయి. ఒకడు నిరుపేద అయినా, అతడు తన మనస్సులో 'సంతోషాన్ని' నింపుకోవడం జరిగితే అతని ముందు మహారాజులు కూడా సరితూగరు.

**నాభివాంఛత్య సంప్రాప్తం ప్రాప్తం**
**భుంక్తే యథాక్రమమ్ ।**
**యః సుసౌమ్య సమాచారః సంతుష్ట ఇతి కథ్యతే ॥**

అప్రాప్తమైన విషయాల గురించి బాధ పడకుండా, ప్రాప్తమైన వాటిని చక్కని అవగాహనతో అనుభవిస్తూ, సౌమ్యమైన ఆచరణ కలిగి ఉండేవారికి సంతోషం సహజంగా ఉంటుంది. అలాంటి సంతోషంతో ఉన్న మహాత్ముని ముఖాన్ని చూసినవారు అనిర్వచనీయమైన సంతోషానుభవం పొందుతారు. `

*('శ్రీవసిష్ఠ రామ సంవాదం' ముముక్ష–వ్యవహార ప్రకరణం నుంచి)*

**అనువాదం : వై. హెచ్. రామకృష్ణ**



# బాల్యం... బంగారుకలల బృందావనం

– బి. సైదులు

ప్రతి మనిషి జీవితానికీ బాల్యం తొలిపొద్దు లాంటిది. లేలేత 'పసి'డి కిరణాల ప్రాయం ప్రసన్నత, ప్రశాంతతల పరిమళభరితం. బుడిబుడి అడుగుల ఆ పసితనాన మనసున పడే ముద్రలే భవితకు బాటలు వేస్తాయి. తెల్లకాగితాల్లాంటి ఆ కోమల హృదయాలు మల్లెలై విరిసినా, మంటలై ఎగసినా కారణం ఆలించి, పాలించే పెద్దలే. అందుకే మహామహుల జీవితాలన్నీ పసిప్రాయం నుంచే ప్రభవించడం ఆరంభించాయి. మహాత్మాగాంధీజీ "బాల్యంలో నేను చూసిన సత్యహరిశ్చంద్ర, శ్రవణకుమారుడు– నాటకాలు నా మనసులో బలమైన ముద్రలు వేశాయి; అన్నమాట కోసం ఒకరు, అమ్మానాన్నల కోసం మరొకరు తమ జీవితాల్ని సమిధల్లా అర్పించడం నన్ను నిరంతరం ప్రభావితం చేస్తూనే ఉన్నాయి" అన్నారు. కపటత్వపు ఛాయలు లేని నిర్మలమైన ఆ బాల్యం భగవంతుడికి ప్రీతిపాత్రమైన అద్భుతదశ. అలా మన్నుతిన్న నోటిలోనే ముల్లోకాలూ చూపి, పాలు తాగే నెపంతో పూతనను పరిహరించి పసిప్రాయాన్నే పరమాత్ముడనని రుజువు చేశాడు బాలకృష్ణుడు. అలా ఈ సమాజానికి శక్తిమంతమైన ఒక తరాన్ని పరిచయం చేయడమే తల్లితండ్రుల గురుతర బాధ్యత. మానులుగా, మాన్యులుగా పిల్లలు ఎదగాలంటే మొక్కలోనే వారిని కుదురుగా వంచాలి... కర్తవ్యంతో పెంచాలి. పెద్దల మాలిమిలో ఎదుగుతూ, విలువలు పుణికిపుచ్చుకునే బాల్యం నిజంగా బృందావనమే!

**బాల్యదశ భగవదంశ....** : తడబడే అడుగులతో, తనివి తీరని ఆటలతో సాగిపోయే బాల్యం భగవంతుని స్వరూపమే. Children are heritage of the Lord అంటుంది బైబిల్; కాపట్యానికి తావులేని ఆ భగవంతుడికి వారసులైన పిల్లలు ఆత్మీయమైన, ఆహ్లాదమైన వాతావరణాన్ని ఆశిస్తారు. భయానికి తావులేని భద్రతతో కూడిన అయినవారి ఆలింగనంలో బాల్యం తీగసాగడం ఆరంభిస్తే ఆత్మవిశ్వాసం నిండిన రేపటి పౌరులు రూపుదిద్దుకుంటారు. ఎంతటి అసహన పరిస్థితుల్లో కూడా దుర్భాషలతో, దూషణలతో చిన్నారుల మనసును గాయపరచడం తగదు. వారిని ఆత్మన్యూనతలో పడవేసే కఠిన పదజాలంతో బాధించ కూడదు. అల్లరి, ఆకతాయితనం పిల్లల సహజస్థితి; అంతమాత్రం చేత క్రమశిక్షణ పేరుతో వారికి బంధనాలు బిగించడం అనుచితం. శిక్షలు, శిక్షణల మధ్య పిల్లల్ని బందీలుగా చేస్తే వాళ్ళు గొంగళిపురుగుల్లాగే మిగిలిపోతారు; వారి సృజనత్వానికి, సహజత్వానికి పెద్దలు కాస్త సహకరిస్తే సీతాకోక చిలుకల్లా ఎదుగుతారు; ఎగురుతారు.

**మళ్ళీరాని మధుమాసం...:** Children will not remember you for the material things you provided but cherish your feeling for them అంటారు రిచర్డ్ ఏవన్స్. సుఖాలు, సౌకర్యాలు కల్పించినంత మాత్రాన పిల్లలు బాల్యాన్ని మధురంగా భావిస్తారనుకోవడం పొరపాటు. మరలా రాని మధుమాసం లాంటి పసితనంలో వారికి మధురమైన జ్ఞాపకాల్ని పోగుచేసి పెట్టాలి; ఉన్నదాన్ని నలుగురితో పంచుకోవడాన్ని, ఉన్నంతలోనే హుందాగా జీవించడాన్ని నేర్పాలి. స్వామి వివేకానంద హృదయం చిన్ననాటి నుంచే పరులకోసం తపించేది; ఎవరు దీనంగా ఇంటి ముందుకు వచ్చినా వంటిపైన వస్త్రాల్ని కూడా విడిచి ఇచ్చేసేవారట; అంతమాత్రాన తల్లితండ్రులు ఏరోజూ ఆయనను నిందించలేదు; దండించలేదు. పైగా తనయుడి దయార్ద్రహృదయానికి గర్వించేవారు; ప్రోత్సహించేవారు. అందుకే ఒక మహాపురుషుణ్ణి ఈ లోకానికి అందించగలిగారు.

## పిల్లలంటే పరీక్షలు.... ఫలితాలు కాదు...

**చతుర్వర్షావధి సుతాన్ లాలయేత్ పాలయేత్ సదా**
**తతఃషోడశపర్యన్తం గుణాన్ విద్యాంచ శిక్షయేత్....**

అంటోంది మహానిర్వాణ తంత్రం. నాలుగేళ్ళ వరకూ పిల్లల్ని ఆలనగా, పాలనగా చూసుకోవాలి; అనంతరం పదహారేళ్ళ వయసులో పిల్లలకు ఉన్నతమైన పౌరులుగా ఎదిగే విద్యను నేర్పాలి. ఆధునిక మానసిక వైద్యనిపుణులు కూడా అయిదేళ్ళ వరకూ బాల్యావస్థ చాలా ప్రముఖమైందని చెబుతున్నారు. వారిలో మానసికంగా, శారీరకంగా ఆ వయసులో రూపుదిద్దుకునే కొన్ని లక్షణాలు జీవితాంతం వారిని వెన్నంటే ఉంటాయని స్పష్టం చేస్తున్నారు. అందుకే 'పిల్లలే కదా!' అన్న తేలికభావంతో వారి ముందు అనుచితంగా, అసందర్భంగా ప్రవర్తించకూడదు. అదేవిధంగా చిన్నారుల వ్యక్తిత్వాలకు పరీక్షలు వాటి ఫలితాలే ప్రతీకలు కాదు. జీతానికే తప్ప జీవితానికి పనికిరాని చదువుల కోసం పిల్లల్ని పీల్చిపిప్పి చేయకుండా, ముందు వారి అభిరుచులను గుర్తించి మార్గదర్శనం చేయాలి.

### పిల్లలే పెట్టుబడి...



Children are the most valuble resourses in the world, and they are the best hope for the future అంటారు జాన్ కెన్నడీ. నిజమే ప్రపంచానికి మనమిచ్చే పెద్ద బహుమతి, పెట్టే ఘనమైన పెట్టుబడి విలువలతో కూడిన పిల్లలే. మన ప్రతినిధులుగా ఈ సమాజంలో వారు చూపే ప్రభావాన్ని బట్టే మన చరిత్ర ఆధారపడి ఉంటుంది. కాని దురదృష్టవశాత్తూ చాలా మంది తల్లితండ్రులు తమ బిడ్డల్ని ఉన్నతమైన పౌరులుగా తీర్చిదిద్దడంలో విఫలమవుతున్నారు. నేడు ప్రపంచంలో చాలా మంది యువతీయువకులు దంపతులవ్వడానికి అర్హులే తప్పా; తల్లితండ్రుల పాత్రలకు అర్హులు కారు. భార్యాభర్తలుగా తమతమ బాధ్యతల్ని నిర్వహించగలుగుతున్నారే కాని,

> **మంచి పౌరులే మన సంపద**
>
> –స్వామి రంగనాథానంద
>
> సర్వత్ర జయం ఇచ్ఛేత్, పుత్రాత్ ఇచ్ఛేత్ పరాజయం అంటోంది మన సనాతన ధర్మం. ప్రతి చోటా జయాన్నే కోరుకుంటాం; కానీ బిడ్డల చేతిలో పరాజయాన్ని ఆశిస్తాం. ఇంత విశాలంగా పిల్లల్ని పెంచితే, భవిష్యత్తులో వారు బాధ్యతాయుతమైన పౌరులుగా ఎదుగుతారు. మన ఘనమైన వారసత్వాన్ని నిరంతరం చిన్నారులకు గుర్తు చేస్తూ ఉండాలి. భౌతికమైన తాపత్రయాల నుంచి పిల్లల్ని జ్ఞానతృష్ణ వైపు పరుగులు తీయించాలి. అగ్గిపుల్లలో ప్రజ్వలన దాగి ఉన్నట్లు, మీలో అనంతమైన శక్తి నిగూఢంగా ఉందని వారికి స్పష్టం చేయండి.

అమ్మానాన్నలుగా మాత్రం ఆదర్శంగా ఉండలేకపోతున్నారు. ఫలితంగా ముందు తరాలకు కరదీపికలుగా నిలిచే యుగపురుషులు తయారుకావడం లేదు.

**సహజత్వమే సృజనాత్మకత...:** వారే మన పిపాసిత పెదవులు, ఉపాసిత సూర్యలోకాల్నించి సముద్రాలు తెచ్చి అందిస్తారని అంటారు సాహితీవేత్త గుంటూరు శేషేంద్రశర్మ. నిర్మలంగా, సహజంగా, సృజనాత్మకంగా మెలిగే చిన్నారుల్ని పెద్దలే కలుషితం చేస్తుంటారు. మనిషి ఎదిగాక మనసును కల్మషము, కాపట్యము ఆవరిస్తాయి; కనీసం బాల్యాన్నైనా సహజంగా,సుందరంగా ఉండేట్లు జాగ్రత్త పడాలి. నిరంతరం చిన్నారులు సాంకేతిక వస్తుసముదాయం మధ్య తిరుగాడకుండా చూసుకోవాలి. ఇష్టంగా దానం చేయడాన్ని, గర్వం లేని జ్ఞానాన్ని, క్షమతో కూడిన శౌర్యాన్ని, త్యాగంతో కూడిన ధనాన్ని సంపాదించేలా ప్రోత్సహించాలి.





# ఆశావాహ దృక్పథానికి ఆచరణాత్మక సూత్రాలు !

- స్వామి అక్షరాత్మానంద





మనిషికి ఉండవలసిన దృక్పథం గురించి హార్వర్డ్, స్టాన్‌ఫోర్డ్ విశ్వవిద్యాలయాల వారు ప్రచురించిన నివేదిక వివరాలు చూడండి. ఒక వ్యక్తి ఉద్యోగం సంపాదించుకోవడానికీ, దాన్ని విజయవంతంగా కొనసాగించడానికీ అతడి మానసిక దృక్పథం 85 శాతం కారణమవుతోంది. అతడి సాంకేతిక విద్య, ఇతర నైపుణ్యాలు 15 శాతం మాత్రమే కారణమవుతున్నాయి. ఇది చాలా ఆసక్తికరమైన విషయం కదూ! విద్యార్జన కోసం మనం ఎంతో డబ్బునూ, సమయాన్నీ ఖర్చు పెడుతున్నాం. కానీ మన దృక్పథం మార్చుకోవడం కోసం ఒక్క నిమిషం కూడా వెచ్చించం. ఇది కొంచెం బాధాకరమైన విషయమే!

చూడండి! ఇది ఒక ఆసక్తికరమైన ఆలోచన – మనకు సరైన దృక్పథం ఉంటే ఆ తర్వాత కావలసిన నైపుణ్యాలను ఇట్టే సాధించవచ్చు. కాబట్టి మనం దేని గురించి శ్రద్ధ వహించాలి; మన మానసిక దృక్పథం మీదా, నైపుణ్యాల మీదా? నిజానికి మనలో చాలామందికి జీవితంలో ఏది అవసరమో స్పష్టంగా తెలిపే ఒక దృక్పథం అనేదే ఉండదు.

నైపుణ్యాల కన్నా ముందు ఆశావహ దృక్పథాన్ని అలవరుచుకోవాలి. ఇలా చేయడం వల్ల ఎంత మేలు జరుగుతుందో తెలిస్తే మరింత మంది దాని కోసం ఎక్కువ సమయం కేటాయిస్తారు. తమ జీవితాలను సుఖసంతోషాలతో, మనశ్శాంతితో గడపగలుగుతారు.

అయితే నిరాశతో నిండిన ఈ ప్రపంచంలో ఆశావహ దృక్పథాన్ని ఏర్పరుచుకునే మార్గం ఉందా? ఉంది! దానికి కొన్ని సూచనలు:

**1.** అపజయం అనేది కేవలం ఒక సంఘటనే. అది ఒక వ్యక్తి యొక్క లక్షణం కాదని మనం అర్థం చేసుకోవాలి. నిన్న అనే రోజు క్రితం రాత్రితో గడిచిపోయింది! ఇవాళ ఒక సరికొత్త రోజు. అంతేకాక, ఇది మీ సొంతం! 'జయించడానికే మీరు జన్మించారు!' కాకపోతే జయించడానికి ఒక పథకం ప్రకారం పని చేస్తూ మనల్ని మనం సమాయత్తం చేసుకోవాలి. అప్పుడు జయం గురించి ఆశతో ఎదురుచూడవచ్చు.

**2.** జీవితాంతం విద్యార్థిగా ఉండండి. రోజూ ఒక కొత్త మాట నేర్చుకోండి. ఐదేళ్ళలో ఏ విషయం గురించైనా, ఎవరితోనైనా సంభాషించగలుగుతారు. జార్జిటౌన్ మెడికల్ స్కూల్ వారు చెప్పినదాని ప్రకారం, మీ పదసంపద పెరుగుతూ ఉంటే దానితో పాటు మీ తెలివి తేటలు కూడా వంద శాతం చొప్పున పెరుగుతాయి.

దక్షిణ క్యాలిఫోర్నియా విశ్వవిద్యాలయం వారు మరొక ఆసక్తికరమైన విషయాన్ని వెల్లడించారు. అదేమిటంటే ప్రయాణసమయాల్లో (ఏదో ఒక ప్లేయర్‌తో) విద్యకు సంబంధించిన పాఠాలను వినడం ద్వారా మూడేళ్ళ పాటు కళాశాలలో నేర్చుకునే విద్యను రెండేళ్ళలోనే నేర్చుకోవచ్చు.

**3.** రోజూ నిద్ర లేచే సమయంలోనూ, నిద్రకు ఉపక్రమించే ముందూ ఆశావహమైన ఆలోచనలతో గడపండి. ప్రేరణను అందించే సందేశాలు మెదడును డోపమైన్, ఎపినెఫ్రిన్ అనే రసాయనాలతో నింపుతాయి. ఈ రసాయనాలు నాడీసంకేతాలకు వాహకాలుగా పని చేస్తాయి. ఇవి శక్తిమంతంగా పనిచేసినప్పుడు మెదడు మరింత బాగా పనిచేస్తుంది. ఇదే విధంగా విడుదలయ్యే ఎండార్ఫిన్‌లు మనిషి ఎక్కువసేపు అలసిపోకుండా పని చేసేందుకు కావలసిన శక్తినిస్తాయి. సెరటోనిన్ అనే హార్మోను "అంతా బాగుంది!" అనే భావాన్ని పెంచుతుంది. దాని వల్ల ఆరోగ్యం ఎంతో మెరుగవుతుంది. అడ్రినలిన్ కూడా సరైన మోతాదులో విడుదలై, గుండె, ఊపిరితిత్తులు చక్కగా పనిచేస్తాయి. కాబట్టి ఆశావహమైన భావాలతో రోజును ప్రారంభించండి!

గుర్తుంచుకోండి! విజయం అనేది ఎప్పుడో ఒకసారి వచ్చిపడే సంఘటన కాదు. అదొక జీవనశైలి.

**అనువాదం: అమిరపు నటరాజన్**



# సమానత్వం-సౌభ్రాతృత్వం

- స్వామి రంగనాథానంద

**ప్రకృతి ప్రసాదించిన ఆలోచనాశక్తి జీవకోటిలో మనిషిని ఉన్నతుణ్ణిగా నిలిపితే, అదే ఆలోచనాశక్తి వికృతరూపం దాల్చినచోట మానవాళి వినాశనానికి దారి తీస్తుంది.**

శాస్త్ర సాంకేతిక విజ్ఞానపరంగా మానవ మేధ సాధించిన ఫలితాలు అనితర సాధ్యాలు. అసాధ్యాలను సైతం సుసాధ్యం చేసిన గొప్ప తెలివితేటలు నేటి తరం సొంతం. సమాచార విప్లవం, అభివృద్ధి చెందిన రవాణా వ్యవస్థలతో దూరాలు తరిగిపోయాయి. విశ్వమే ఒక కుగ్రామంగా మారింది. మానవ జాతికి భౌతికంగా అనేక సౌకర్యాలు, సుఖాలు ఏర్పడ్డాయి. కానీ మానవీయ కోణంలో అంతరాలు పెరుగుతున్నాయి. నేను, నాది అనే సంకుచిత స్వభావం పెరుగుతోంది. ఫలితంగా ఘర్షణ వైఖరి, ఈర్ష్యా ద్వేషాలు ప్రజ్వరిల్లు తున్నాయి. సమాజంలో భయం, అభద్రతాభావం చోటు చేసుకుంటున్నాయి. ఆధ్యాత్మిక జ్ఞానం కొరవడడం వల్ల ప్రకృతి ధర్మాలకు విరుద్ధంగా ఎదురేగి, కష్టాల కొలిమిలో చిక్కు కుంటున్నాం. ఎన్ని సాధించినా దానికి మూలం మనలో ఉన్న ఆలోచనాశక్తి. అది ప్రకృతి ప్రసాదించిన వరం.



**సమానత్వం:** సమగ్రమైనదీ, సంపూర్ణమైనదీ, విడదీయడానికి వీలులేనిదీ అయిన ఒకే ఆత్మ అన్ని జీవుల్లోనూ ప్రకాశిస్తోందన్న 'వేదాంత బోధ' నుంచి మానవ సమానత్వాన్ని గ్రహించాం. **"భగవంతుడు అందరిలోనూ నివసిస్తున్నాడు కాబట్టి మనుష్యుల మధ్య కుల మత వర్గ భేదాలు లేవు"** అన్నది శ్రీరామకృష్ణుల సందేశం. అందరిలో ఉన్న ఆత్మ ఒక్కటే అన్న సత్యాన్ని బట్టి మానవ సమానత్వాన్ని ఆధ్యాత్మికత బోధిస్తే, మన ప్రజాస్వామ్యంలో ఉమ్మడి పౌరసత్వం అందరికీ సమాన హక్కులు కల్పించింది. మొదట మనమంతా భారతదేశ పౌరులం. సమాజంలో మనం నిర్వహించే అన్ని హోదాలకూ మూలం పౌరసత్వ హోదా. మన ప్రజాస్వామ్యం కల్పించిన పౌరసత్వంలో అందరమూ సమానమే. ఈ ఒక్క భావన ఎంతటి ప్రేరణనిస్తుంది!

స్వాతంత్ర్యానికి పూర్వం ప్రతీ భారతీయుడికీ ఒక్కటే కోరిక. "మాకు స్వతంత్రం కావాలి... స్వరాజ్యం మా జన్మ హక్కు..." జాతి మత భేదాలు లేకుండా అంతా ఒక్కటిగా గర్జిస్తే మనకు స్వాతంత్ర్యం సిద్ధించింది. ఆ తరువాత సమానత్వం స్థానంలో స్వార్థచింతన, సంకుచిత రాజకీయ భావాలు మనల్ని వేరు చేస్తున్నాయి. ఈ స్థితి మారాలి.

**సౌభ్రాతృత్వం:** స్వతంత్ర భారతం అందరినీ సోదరభావంతో మెలగమంటుంది. దేశ మానవ వనరులను ఏకత్వభావనతో సృజనాత్మకంగా మలచాలి. మనం ప్రకృతి శక్తులను ఉపయోగించుకుంటున్నంతగా యువశక్తిని ఉపయోగించు కోలేకపోతున్నాం. భూమిలో నుంచి తీసిన ముడి చమురును వివిధ రసాయన ప్రక్రియలు చేసి, డీజల్, పెట్రోల్‌లను ఏ విధంగా తయారు చేసుకుంటున్నామో... యువశక్తిని కూడా నిర్మాణాత్మకంగానూ, క్రమశిక్షణాయుతంగానూ మానవాళి సేవ కోసం సరైన తీరులో మలచకపోతే అపరిపక్వంగానే ఉండిపోతుంది. క్రమశిక్షణ అంటే బెత్తాలు, లాఠీలు కాదు. పోలీసు ఉంటేనే మనం జాగ్రత్తగా ఉంటాం. ఈ ధోరణి పోవాలి. స్వయం క్రమశిక్షణ రావాలి. ఉపనిషత్తుల్లో చెప్పిన ఆధ్యాత్మిక విద్య, ధార్మిక విజ్ఞానమూ ఇందుకు ఉపకరిస్తాయి.

ఆధ్యాత్మిక అవగాహన ఉంటే మంచి గుణాలు పెంపొందుతాయి. మానసిక శక్తి బుద్ధిలో విలీనమైనప్పుడు ప్రేమ, కరుణ, సేవాతత్పరతలు మేల్కొంటాయి. వివేకవంతమైన శక్తి సామర్థ్యాలతో పనిచేయగలుగుతారు.

**స్వామి వివేకానంద భారతదేశ అభివృద్ధికి రెండు మార్గాలను సూచించారు. ఒకటి: సహజ శక్తులను భౌతిక శాస్త్రాలపరంగా మానవాళి శ్రేయస్సు కోసం ఉపయోగించాలి. రెండోది: అపరిపక్వ యువశక్తికి శిక్షణనిచ్చి గొప్ప శక్తిజనక కేంద్రాలుగా తయారుచెయ్యాలి".**

మన వేదాలు, ఉపనిషత్తుల సందేశాన్ని స్వీకరించగలిగితే ప్రపంచంలో సమానత్వం – సౌభ్రాతృత్వం వెల్లివిరుస్తాయి.

*('మారుతున్న సమాజానికి శాశ్వత విలువలు' నుంచి)*

**– సేకరణ: ఆర్. కృష్ణ**




- స్వామి పరిజ్ఞేయానంద

**ఫణి కృష్ణ, నందిగామ, కృష్ణా జిల్లా**

**ప్రశ్న : బ్రహ్మచర్యం పాటించడం ప్రమాదకరమని మానసిక నిపుణులు చెబుతున్నారు. వీరి మాటలు యువతరాన్ని పెడదోవ వైపు ప్రేరేపిస్తున్నాయి. బ్రహ్మచర్య పాలన వల్ల నిజంగానే ప్రమాదముందా? వివరించండి.**

**జవాబు :** జీవితంలో దేన్ని సాధించాలన్నా మనిషికి శారీరక, మానసిక, ఆధ్యాత్మిక శక్తులు అవసరం. ప్రపంచ చరిత్రలో ఎంతో మంది మహాత్ములు బ్రహ్మచర్యాన్ని ఆచరించి చూపించారు. ఆంజనేయుడు, భీష్ముడు, వివేకానందుడు లాంటి మహాత్ములు ఆజన్మాంతం బ్రహ్మచర్యాన్ని పాటించి అందరికీ ఆదర్శ ప్రాయులుగా నిలిచారు.

అయితే ఆజన్మాంతం బ్రహ్మచర్యం పాటించడం సామాన్యులకు సాధ్యం కాకపోవచ్చు. కానీ మన శాస్త్రాలు బోధించిన ప్రకారం గృహస్థాశ్రమం స్వీకరించే వరకైనా బ్రహ్మచర్యం పాటించాలి. పూర్వం విద్యార్థులు యుక్త వయస్సు వచ్చేవరకూ ఆకర్షణలకు దూరంగా గురుకులంలో ఉంటూ విద్యాభ్యాసం చేసేవారు. అందువల్ల వారు ఎలాంటి మనో వికారాలకూ లోనుకాకుండా శారీరకంగానూ, మానసికంగానూ, నైతికంగానూ, ఆధ్యాత్మికంగానూ అభివృద్ధి చెందేవారు. కానీ నేటి యువతరం ఆధునిక సంస్కృతి మోజులో పడి వినోదాలూ, విలాసాలంటూ విచ్చలవిడిగా తిరుగుతూ, మనోనిగ్రహాన్ని కోల్పోతోంది. శారీరక, మానసిక రోగాలను కొనితెచ్చు కుంటున్నారు. యువతరానికి బ్రహ్మచర్యం ప్రాముఖ్యం గురించి సరైన అవగాహన లేకపోవడమే దీనికి కారణం.

మనస్సులో చెడు ఆలోచనలు వచ్చినప్పుడు బలవంతంగా వాటిని అణచుకోవడం మానసిక సమస్యలకు దారితీయవచ్చు. అలాంటి పరిస్థితుల్లో మనస్సును సద్భావాలతో నింపి ఉన్నత స్థితికి తీసుకువెళ్ళడానికి ప్రయత్నించాలి.

పాశ్చాత్య నాగరకతను గుడ్డిగా అనుకరిస్తే నైతిక, ఆధ్యాత్మిక విలువలు అడుగంటిపోతాయి. నైతిక విలువలు లేని జీవన విధానం వల్ల మన జాతి అంతరించిపోయే ప్రమాదం ఉందని స్వామి వివేకానంద హెచ్చరించారు.

'గుర్తుంచుకోండి! పాశ్చాత్య నాగరకత మోజులో పడి ఆధ్యాత్మికతను విస్మరిస్తే, భారతజాతి మూడు తరాలలో అంతరించిపోతుంది. ఏ పునాది మీద మీ జాతీయ సౌధం నిర్మితమైందో అదే క్రుంగిపోతే వినాశనం తప్పదు'.

బ్రహ్మచర్యం పాటించకపోతే మనం కోల్పోయేవి ఏమిటో మన శాస్త్రాలు ఇలా చెబుతున్నాయి:

**ఆయుస్తేజో బలం వీర్యం ప్రజ్ఞా శ్రీశ్చ మహద్ యశః ।**
**పుణ్యం చ ప్రీతిమత్త్వం చ హన్యతే - బ్రహ్మచర్యయా ॥**

'బ్రహ్మచర్యాన్ని పాటించకపోతే ఆయువు, తేజస్సు, బలం, వీర్యం, బుద్ధి, లక్ష్మి, కీర్తి, యశస్సు, పుణ్యం, ప్రీతి - ఇవన్నీ నశించిపోతాయి'.

ఏ మనిషి అయినా, ఏ దేశమైనా అన్ని రంగాలలో అభివృద్ధి సాధించాలంటే బ్రహ్మచర్య పాలన అవసరం. మన దేశం వినాశనానికి చేరువలో ఉండడానికి కారణం బ్రహ్మచర్యం పాటించకపోవడమే అంటారు స్వామి వివేకానంద.

It is owing to this want of Brahmacharya (continence) that everything is on the brink of ruin in our country. ***- Swami Vivekananda***

యువతరం తమ జీవన సౌధానికి యౌవనమే పునాది అని గుర్తించి మనోనిగ్రహాన్ని అవలంబిస్తే జీవిత ధ్యేయాన్ని సునాయాసంగా సాధించగల శక్తి కలుగుతుంది. కాబట్టి మహాత్ముల అడుగుజాడలను అనుసరించి యౌవనమనే సారవంతమైన నేలలో మంచి ఆలోచనలనే విత్తనాలు వేస్తే మంచి ఫలితాలను పొందవచ్చు.



యువవాహిని

# మనసు - మర్మం

- స్వామి బుధానంద

## ఆలోచనల నియంత్రణే అసలు రహస్యం!

ఆలోచనలను నియంత్రించగలిగితే మనస్సును స్వాధీనం చేసుకోవడం సాధ్యపడుతుంది. ఆలోచనల నియంత్రణ అంటే మనస్సులో ఎలాంటి ఆలోచనలూ ఉండకూడదని అర్థం కాదు. ఆలోచనలే లేని స్థితి మందబుద్ధులకు మాత్రమే ఉంటుంది. ఆలోచనలను నియంత్రించడం అంటే మనసులోనికి మంచి ఆలోచనల్ని ఆహ్వానించడం, చెడు ఆలోచనల్ని రానివ్వకుండా కట్టడి చేసుకోవడం.

ఆలోచనలను నియంత్రించడాన్ని గురించి బుద్ధ భగవానుడు ఈ విధంగా చెప్పారు:

'ఎప్పటికప్పుడు మనస్సు యొక్క పరిస్థితిని గమనిస్తూ, దాని గురించి పునరాలోచన చేస్తూ, అన్ని చెడ్డ ఆలోచనలనూ సమూలంగా పెకిలించి, అన్ని మంచి ఆలోచనలనూ పెంచి పోషించాలి. మనస్సును నియంత్రించడానికి ఇదొక్కటే మార్గమని జ్ఞాపకముంచుకోండి'.

స్వామి వివేకానంద ఇలా బోధించారు:

''మన ఆలోచనలు ఎలా ఉంటే అలా మనం తయారవుతాం; కాబట్టి మీరు దేన్ని గురించి ఆలోచిస్తున్నారన్న విషయం గురించి జాగ్రత్తపడండి. మాటలు కాదు ముఖ్యం. ఆలోచనలు! ఆలోచనలు జీవిస్తాయి. అవి ఎంత దూరమైనా పోతాయి. ప్రతి ఆలోచనా మన వ్యక్తిత్వపు రంగును పులుముకుని బయటకు వెలువడుతుంది. అందుచేతనే పవిత్రులు, మహాత్ములు ఎగతాళి చేసినా, తిట్టినా అది వారి ప్రేమనూ, పవిత్రతనూ రంగరించుకొని ఉండడం వల్ల, ఎల్లప్పుడూ మంచే జరుగుతుంది''.

ఈ ''ఆలోచనల జాగ్రత్త'' అనేది ఎంత ముఖ్యమైనదంటే, దానిని ఎలా సాధించాలో ప్రత్యేకంగా నేర్చుకోవాలి. మరో మాటలో చెప్పాలంటే మంచి ఆలోచనలను ఎలా తయారు చెయ్యాలో నేర్చుకోవాలి. మంచి ఆలోచనలను తయారు చెయ్య దలచుకుంటే మనం తీసుకునే ఆహారం (నోటి ద్వారానే



కాక మిగిలిన ఇంద్రియాల ద్వారా కూడా) పట్ల జాగ్రత్త వహించాలి. ఆహారం పవిత్రమైనదైతే ఆలోచన పవిత్రం అవుతుంది. ఆహారం అపవిత్రమైతే ఆలోచన కూడా అపవిత్రం అవుతుంది. ఆలోచనల్ని అణగద్రొక్కడానికి కష్టపడడం వల్ల ఎలాంటి ప్రయోజనం లేదు. నిజానికి ఆలోచనలను నియంత్రించడమంటే వాటిని అణగద్రొక్కమని అర్థం కాదు. వాటి మీద అధికారాన్ని సాధించడమే!

యువవాహిని

# స్పందించిన పసి హృదయం

– స్వామి విమోక్షానంద

మంజు ఆశ్రమానికి రావడం మొదలుపెట్టినప్పటికి ఎనిమిది సంవత్సరాల బాలిక. ఆమె నివసించే గ్రామం – డుంగ్రీ, రాంచీ రామకృష్ణ మిషన్ టి.బి. శానిటోరియంకి మరీ దూరం కాదు. గ్రామంలోని ఇతర బాలబాలికలతో పాటు ఆ బాలిక ఆశ్రమంలో జరిగే అనేక ఉత్సవాలలో పాల్గొనేది. స్వామి వివేకానందను చాలా అభిమానించేది, ఆమె పెరుగుతున్న కొద్దీ క్రమంగా ఈ అభిమానం భక్తిగా మారింది.

శీతాకాలంలో ఒకరోజు కొన్ని సంక్షేమ కార్యక్రమాలలో భాగంగా నేను (స్వామి విమోక్షానంద) ఆ బాలిక నివసించే గ్రామానికి వెళ్ళాను. బురద నిండిన బాట మీదుగా నడిచి వెళుతూ, చిన్నారి మంజు తన ఇంటి ముందు నిలబడి ఉండడం చూశాను. ఆ బాలిక నన్ను తమ ఇంట్లోకి రమ్మని ఆహ్వానించింది. తిరుగు ప్రయాణంలో వస్తానని చెప్పాను.



నేను వాళ్ళింటికి వెళ్ళేసరికి ఆ గ్రామంలోని వయోవృద్ధులు కొందరు నా చుట్టూ చేరారు. ముందుగా మంజు నన్ను ఒక గదిలోకి తీసుకెళ్ళింది; అక్కడ ఒక కిటికీ పక్కన గూట్లో శ్రీరామకృష్ణులు, శ్రీశారదామాత, స్వామి వివేకానందుల ఛాయాచిత్రాలు ఉన్నాయి. మూర్తిత్రయానికి ప్రణమిల్లాక నా దగ్గర ఉన్న మూడు వంద రూపాయల నోట్లను నివేదించి, వాళ్ళిచ్చిన టీ త్రాగి, ఆశ్రమానికి తిరిగి వచ్చాను.

ఒక వారం అయ్యాక మంజు మా కార్యాలయానికి వచ్చింది. ఆమె కుటుంబం చాలా పేదది అని తెలుసు కనుక నేను ఆమెను "వందనోట్లు మూడూ జాగ్రత్తగా దాచావా" అని అడిగాను. ఆమె బదులు చెప్పడానికి సంశయిస్తున్నట్లు అనిపించింది. నేను "సరే మంజూ, నువ్వు నాకేమీ చెప్పకు, సరేనా" అంటూ బుజ్జగించాను.

మంజు సంశయిస్తూనే "అది కాదు మహరాజ్! మీకు ఎలా చెప్పాలో నాకు తెలియడం లేదు" అంది.

"నేను గూటి పక్కన ఉన్న కిటికీ తెరిచి ఉండడం చూశాను. గాలికి కాని ఆ నోట్లు ఎగిరిపోయాయా?" అని మంజుని అడిగాను. "లేదు లేదు! ఆ పైకాన్ని నేను ఖర్చు చేశాను మహరాజ్" అని ఆ అమ్మాయి బదులిచ్చింది. "ఓహో, మంచి పనే చేశావు. పైకం అనేది ఖర్చు చెయ్యడానికే కదా! దాని గురించి అంత కలవరమెందుకు? దేని గురించి ఖర్చు పెట్టావు?" అని అడిగేసరికి ఆమె కొంత సేపు మౌనంగా ఉండిపోయింది.

"నువ్వు నీ కోసం బట్టలు కొనుక్కున్నావా లేక ఇంట్లోకి సరుకులు తేవడానికి ఖర్చు చేశావా?" అని అడిగాను.

"లేదు మహరాజ్, నా కోసం ఖర్చు పెట్టుకోలేదు." మంజు ఆ పైకం దేని కోసం ఖర్చు పెట్టిందో విన్న తరువాత నాకు నోట మాట రాలేదు.

"మహరాజ్! మా పొరుగింటి వారు ఎంత పేదవారో మీకు తెలుసా! వాళ్ళ పిల్లలు ముగ్గురూ చాలా చిన్న వాళ్ళు, వాళ్ళు చలికి తట్టుకోలేకపోతున్నారు. వాళ్ళు పడుతున్న బాధ నేను చూడలేకపోయాను. అందువల్ల నేను బజారుకు వెళ్ళి, నూరు రూపాయలకు ఒకటి చొప్పున ఆ పిల్లలు ముగ్గురికీ మూడు స్వెట్టర్లు కొన్నాను. ఆ స్వెట్టర్లు వాళ్ళకు ఇవ్వగానే వాళ్ళెంత సరదా పడ్డారో!" అంది.

పరుల కష్టాలను చూసి స్పందించిన ఆ పసిహృదయంలో మానవత్వం వెల్లివిరిసినందుకు నాకు ఆనందం కలిగింది. "పరుల సేవకై జీవితాన్ని సమర్పించేవారే సజీవులు. మిగిలిన వారంతా జీవన్మృతులు" అన్న స్వామి వివేకానంద సందేశాన్ని ఆచరణలో చూపిన మంజు ఎంతో మందికి ఆదర్శనీయురాలు.

- జి. సతీశ్


## అన్యాయాన్ని ఎదిరించిన

# ఆదర్శవాది

ప్రొఫెసర్ జగదీశ్‌చంద్ర బోస్ లండన్ విశ్వవిద్యాలయంలో విజ్ఞానశాస్త్రంలో పట్టా పుచ్చుకొని భారతదేశానికి తిరిగి వచ్చారు. రాగానే కలకత్తాలోని ప్రెసిడెన్సీ కళాశాలలో భౌతిక శాస్త్ర ఆచార్యునిగా నియమింపబడ్డారు. ఆ రోజుల్లో కళాశాలల్లోని ఆచార్యులు ఎక్కువ మంది ఆంగ్లేయులే. బెంగాల్‌లో విద్యాశాఖాధికారి కూడా ఆంగ్లేయుడే. అందువల్ల భేదభావంతో వ్యవహరిస్తూ ఉండేవారు.

ఆంగ్లేయ ఆచార్యుల కన్నా భారతీయ ఆచార్యులకు జీతం తక్కువ ఇచ్చేవారు. అందువల్ల ప్రొఫెసర్ బోసు జీతం తీసుకొనేందుకు నిరాకరించారు. ఈ అన్యాయాన్ని వ్యతిరేకిస్తూ ఆయన "జీతం తీసుకుంటే నేను పూర్తిగా తీసుకుంటాను. లేకపోతే జీతమే తీసుకోను" అన్నారు.

ఇలా మూడు సంవత్సరాల పాటు ఆయన జీతం తీసుకోలేదు. జీతం తీసుకోని కారణంగా ఆర్థికంగా ఇబ్బందికి లోనయ్యారు. కలకత్తాలోని పెద్ద ఇల్లు వదిలిపెట్టి నగరానికి దూరంగా తక్కువ అద్దెకు తీసుకున్నారు. కలకత్తా నుండి రానూపోనూ ఆయన నావలో హుగ్లీ నదిని దాటుతుండేవారు. భార్యాభర్తలు ఇరువురూ నావను తీసుకొని అవతలి ఒడ్డుకు చేరేవారు. ఆయన భార్య నావను వెనుకకు తీసుకొని వచ్చేది. ఇన్ని కష్టాల నడుమ కూడా ఆయన ధైర్యం విడనాడలేదు.

చివరకు విరోధులు తల వంచవలసి వచ్చింది. ఆయనకు ఆంగ్లేయులతో సమానంగా జీతం ఇవ్వడానికి అధికారులు అంగీకరించారు. ఈ కొత్త జీతం ప్రకారం లెక్క కట్టి మూడేళ్ళ జీతం పూర్తిగా ఒక్కసారే ఆయనకు చెల్లించారు. అంతటి ఆదర్శవాది ప్రొఫెసర్ బోస్. `



# ప్రలోభాలకు దూరంగా...

శ్రీ చిమన్‌లాల్ శీతల్‌వాడ్ బొంబాయి విశ్వవిద్యాలయానికి ఉపకులపతిగా నియుక్తులవడానికి ముందు ఉన్నత న్యాయస్థానంలో ఒక న్యాయమూర్తిగా ఉండేవారు. ఒక అభియోగం నుంచి తప్పించుకుంటూ ఒక వ్యక్తి వారి వద్దకు వచ్చి, లక్ష రూపాయలు లంచంగా ఇవ్వజూపాడు. కానీ సర్ శీతల్‌వాడ్ దానిని తిరస్కరించారు. అప్పుడా వ్యక్తి "ఆలోచించండి! మీకు ఒక లక్ష రూపాయలు ఇచ్చేవాళ్ళు మరొకరు దొరకరు" అన్నాడు. సర్ శీతల్‌వాడ్ చిరునవ్వు నవ్వి, ఇలా చెప్పారు: "అయ్యా! ఇచ్చేవాళ్ళు చాలా మంది దొరుకుతారు. కానీ ఇంత పెద్ద మొత్తాన్ని నిరాకరించే వ్యక్తి మాత్రం మీకు లభించడు".

మనిషి మంచి దారిలో నడవాలి. తన వారికి మార్గదర్శనం చేయాలి. ఇలా చేసిన వ్యక్తికి మాత్రమే గౌరవం లభిస్తుంది. కష్టాల నడుమ, ప్రలోభాల నడుమ అణుమాత్రమైనా దారి తప్పకుండా ఉండాలి. ధైర్యానికీ, నిర్భయత్వానికీ ఇదే గుర్తు. ఆదర్శాలను త్యజించిన వ్యక్తి దగ్గర ఇక మిగిలేది ఏముంటుంది? ఆ వ్యక్తి ధనికుడు కావచ్చు. అధికారంలో ఉండవచ్చు. విద్వాంసుడే కావచ్చు. అవి అన్నీ పనికిరానివే అవుతాయని గ్రహించాలి. `






# స్వామీజీ స్ఫూర్తితో ముందడుగు

– రాకేష్ ఏనుగుల



స్వామి వివేకానందుని జీవిత చరిత్ర, ఆయన జీవితంలోని వివిధ సంఘటనలు, వివిధ రాజకీయ, సామాజిక, ఆధ్యాత్మిక, ఆర్థిక విషయాలపై ఆయన విశ్లేషణలు ఈ సమాజానికి, ముఖ్యంగా యువకులకు నిరాటంకమైన స్ఫూర్తినిస్తాయి. అలాంటి స్ఫూర్తి ఎంతో మంది యువకులను ఆదర్శ వంతులుగా, సమాజ సేవకులుగా తీర్చిదిద్దుతుంది. అలాంటి స్ఫూర్తే నన్ను ముందడుగు వేయిస్తోంది.

ప్రస్తుతం నేను బెంగుళూరులోని సిటీ బ్యాంకులో అసిస్టెంట్ మేనేజర్‌గా పనిచేస్తున్నాను. నా వయస్సు 23 ఏళ్ళు. హనుమకొండ పట్టణానికి దగ్గరలో నున్న ఒక గ్రామంలో ఒక రైతు కుటుంబంలో జన్మించాను. మా గ్రామంలో పేదరికమనే విషయం తొంభై శాతం ప్రజలకు చాలా సహజం. అదొక సమస్యగానే అనిపించదు వారికి. ఎందుకంటే ఆ పేదరికానికి వారు కొన్ని తరాల నుంచి అలవాటు పడ్డారు. అలాంటి వాతావరణంలో పెరిగిన నాకు ఒక బాధ్యత కలిగిన పౌరునిగా ఎదిగి, మా గ్రామం లాంటి గ్రామాలకు సేవ చేయాలని చిన్నప్పటి నుంచీ నా ఆశయం. అలాంటి దృఢ నిశ్చయం కలిగిన నేను ఎన్నో ఆర్థిక ఇబ్బందులను ఎదుర్కొని, ఇంటర్‌లో స్టేట్ ర్యాంక్ సంపాదించి బిట్స్ పిలానీలో ప్రవేశం పొందాను.

**ఒకరోజు నా స్నేహితుడు ఒకడు నాతో 'ఆశయం సాధించాలంటే ఒక నిరంతర స్ఫూర్తి కావాలి. నీ గమ్యాన్ని చేర్చే, విలువలు నేర్పే ఒక గొప్ప అధ్యాపకుడు కావాలి. అలాంటి స్ఫూర్తిదాత స్వామి వివేకానందుని సాహిత్యం అధ్యయనం చేయాల్సిందే' అన్నాడు.** వెంటనే నేను నా మిత్రుణ్ణి 'ఆ సాహిత్యం ఎక్కడ లభ్యమవుతుంది' అని అడిగితే, నన్ను రామకృష్ణ మఠం, హైదరాబాద్‌కు తీసుకువెళ్ళాడు. అది నా జీవితంలో ఒక మరపురాని రోజు. ఎందుకంటే ఆ రోజు నుండే లక్ష్య సాధనలో నేను ముందడుగు వేస్తున్నాను.

స్వామీజీ సాహిత్యం, రామకృష్ణ మఠంలోని సామీజీల ఉపన్యాసాలు, గీతా బోధనలు నాకు ఎంతో స్ఫూర్తినిచ్చాయి. ఆ స్ఫూర్తితోనే నేను, నా ఐదుగురి మిత్రులు కలసి పిలానీ దగ్గరున్న గ్రామాలను చుట్టి, అక్కడి సమస్యలను అధ్యయనం చేసి కొన్ని ప్రాజెక్టులు చేపట్టాం. ఆనాడు అలా మొదలుపెట్టిన పని ఈ రోజు ఐదు రాష్ట్రాల్లోని ఎనిమిది ప్రదేశాలకు విస్తరించి, "నిర్మాణ్" అనే పేరుతో ఏర్పడిన సేవా సంస్థగా వేల మంది పేదవారికి విద్యా, ఉపాధి అవకాశాలను కల్పిస్తోంది. వీటిలో భాగంగానే గ్రామాల్లో గ్రంథాలయాలు, కంప్యూటర్ సెంటర్లు, స్వయం సేవక బృందాలు, పేద విద్యార్థులకు స్కాలర్‌షిప్‌లు, ప్రభుత్వ పాఠశాలలకు వసతులు కల్పించడం లాంటి కార్యక్రమాలు విజయవంతంగా జరుగుతున్నాయి. ఈ కార్యక్రమాల వల్ల నాకూ, సంస్థకూ ఎన్నో అవార్డులు, అభినందనలు, ఆశీస్సులు లభించాయి. వీటన్నింటికీ స్వామి వివేకానందుని స్ఫూర్తే కారణం. మన దేశ సంస్కృతి, సంప్రదాయాలు, వేద సంపద పైన స్వామీజీ విశ్లేషణల ప్రభావమే ఇది.

స్వామీజీ సాహిత్యం సాధ్యమైనంత మంది యువకులకు చేరవేయడాన్ని నా జీవిత లక్ష్యాల్లో ఒకటిగా ఎంచుకున్నాను. దానిలో భాగంగానే ఇప్పటికి "Vivekananda - His call to the nation" తెలుగులో "భారత జాతికి నా హితవు" అనే పుస్తకాన్ని 4500 ప్రతులను యువకులకు ఉచితంగా అందించాను.

ఈ పుస్తక వితరణ కార్యక్రమాన్ని ఒక మహా ఉద్యమంగా మార్చి, యువకులందరికీ స్వామీజీ సాహిత్యం అందజేసి స్ఫూర్తి నివ్వాలని నా కోరిక. దాని కోసం ఎట్టి పరిస్థితులనైనా ఎదుర్కొని శ్రమిస్తాను. కాబట్టి యువకులారా స్వామీజీ సాహిత్యం చదవండి, చదివించండి, లక్ష్యాలను సాధించండి! భారతజాతి ముద్దుబిడ్డలుగా, ఆదర్శవంతులుగా జీవించండి.

యువవాహిని

# ఆదరించండి! ఆప్యాయతను పంచండి!!

- గంపా నాగేశ్వర్‌రావు

ఎనభై సంవత్సరాలు నిండిన ఒక వ్యక్తి, విద్యాధికుడైన అతని 45 సంవత్సరాల కుమారుడు తమ ఇంట్లో ఒక సోఫాలో కూర్చుని ఉన్నారు. ఇంతలో ఒక కాకి వచ్చి ఆ గది కిటికీ మీద వాలింది.

తండ్రి తన తనయుణ్ణి "అదేమిటి?" అని అడిగాడు. తనయుడు "అది కాకి" అని సమాధానమిచ్చాడు. కాస్సేపు అయ్యాక తండ్రి తన కుమారుణ్ణి రెండవమారు "అదేమిటి?" అని ప్రశ్నించాడు. కుమారుడు "నాన్నా! ఇప్పుడే కదా చెప్పాను, అది కాకి" అని అన్నాడు.

ఇంకాస్సేపటి తర్వాత తండ్రి మళ్ళీ ప్రశ్నించాడు మూడో మారు " అదేమిటి" అని. ఈసారి కొడుకు తన తండ్రితో తృణీకార భావం, విసుగు ధ్వనిస్తున్న కంఠంతో "అది కాకి, కా...కి" అన్నాడు.

మరి కాస్సేపయ్యాక నాలుగోసారి ఆ తండ్రి తన పుత్రుణ్ణి అడిగాడు "అదేమిటి?" అని. ఈ మారు పుత్రుడు "అన్నిమార్లు జవాబిచ్చినా మళ్ళీ మళ్ళీ అదే ప్రశ్న వేస్తారెందుకని? **"అది కాకి.** ఇది మీ బుర్రకి ఎక్కడం లేదా?" అని అరిచాడు.

కాస్సేపయ్యాక తండ్రి తన గదిలోకి వెళ్ళి తన కుమారుడు పుట్టిన దగ్గర నుంచీ తాను వ్రాస్తున్న ఓ డైరీ తీసుకుని వచ్చాడు. ఒక పుట తెరచి, తన కుమారుడికిచ్చి అది చదవమన్నాడు. ఆ పుటలో ఇలా ఉంది: "ఈ రోజు మా చిన్నారి బాబు నాతో పాటు సోఫాలో కూర్చుని ఉండగా, కిటికీలో ఒక కాకి వాలింది. నా కుమారుడు నన్ను అదేమిటి అని ఇరవైమూడు మార్లు అడిగాడు, నేను ఇరవై మూడు మార్లూ 'అది కాకి' అని జవాబిచ్చాను. అడిగిన ప్రతిసారీ వాడికి అత్యంత అనురాగంతో సమాధానం చెప్పాను. అలా అదే ప్రశ్న ఇరవై మూడు సార్లు వేశాడు. నాకు అస్సలు విసుగు రాలేదు సరి కదా! వాడి అమాయకత్వానికి వాడి మీద మరింత అభిమానం పెరిగింది."

పసిపిల్లవాడు తనని ఇరవైమూడు మార్లు "ఇదేమిటి" అని అడిగినా, అన్నిమార్లూ అదే ప్రశ్నకు జవాబివ్వడానికి తండ్రికి విసుగురాలేదు. కానీ ఇప్పుడు తండ్రి, అదే తనయుణ్ణి నాలుగుసార్లు ఒకే ప్రశ్న వేసినందుకు ఆ కుమారుడికి మాత్రం విసుగు, చిరాకు కలిగాయి.



మీ తల్లితండ్రులను వృద్ధాప్యంలో దూరం చెయ్యడం కానీ, వారిని ఒక భారంగా భావించడం కానీ చెయ్యకుండా వారితో సాదరంగా మాట్లాడండి. వారి పట్ల అణుకువతో, విధేయతతో, ప్రశాంతతో ప్రవర్తించండి. వారి కష్టసుఖాలను ఆలోచించండి. ఈరోజు నుండీ "నా తల్లిదండ్రులు ఎప్పటికీ ఆనందంగా ఉండాలని కోరుతాను. నేను పసిబిడ్డగా ఉన్నప్పటి నుంచీ కంటికి రెప్పలా నన్ను కాపాడుతూ వచ్చారు. నా మీద తమ నిస్వార్థ ప్రేమను వర్షింపజేశారు. ఈ రోజున నేను సమాజంలో గౌరవనీయమైన స్థానంలో ఉండడం కోసం వారు అవిశ్రాంతంగా కష్టపడ్డారు" అని మనస్సులో అనుకోండి.

"వృద్ధులైన నా తల్లితండ్రులకు సేవ చేస్తాను. వాళ్ళు ఎలా ప్రవర్తించినా నేను వారియందు గౌరవభావం కలిగి ప్రవర్తిస్తాను. ఆప్యాయతతో ఆదరిస్తాను" అని భగవంతుణ్ణి ప్రార్థించండి.

**ప్రియ దివాన్జీ సాహెబ్,**

**మీరు మా అమ్మను, సోదరులను చూసి వచ్చినందుకు చాలా సంతోషిస్తున్నాను. మీరు నా హృదయంలో ఉన్న అతి సున్నితమైన తీగను మీటారు. దివాన్జీ! నాది పాషాణ హృదయం కాదు. ఈ ప్రపంచంలో నేను ప్రేమించే వారెవరైనా ఉంటే, ఆమె నా తల్లి.**

- స్వామి వివేకానంద



# మానవ సంబంధాలలో ఆధ్యాత్మికత

**– స్వామి ప్రబుద్ధానంద**

### మానవ సంబంధాల ప్రాముఖ్యత:

మానవుల మధ్య సత్సంబంధాలు చాలా ముఖ్యమైనవి. అందుకు కారణం సుస్పష్టం. మన జీవితాలలోని ప్రతి అంశం వాటితోనే ముడిపడి ఉంటుంది. పోతే, మన స్వభావాలు, ఆసక్తులు, సామర్థ్యాలు వేర్వేరుగా ఉంటాయి. కాబట్టి ఈ సంబంధాలలో తరతమ భేదాలుండడం సహజమే. పరిస్థితులు ఇంత జటిలంగా లేని కాలంలో, ఈ సంబంధాలు అతి సహజంగా సాగిపోయేవి. పారిశ్రామికీకరణ, శాస్త్ర సాంకేతిక రంగాలలో పురోభివృద్ధి కారణంగా నేడు జీవితంలో వేగం చాలా హెచ్చింది. దాని కారణంగా, మన జీవితాలలోని అత్యంత ముఖ్యమైన ఈ అంశంపై దృష్టి నిలిపే సమయం కానీ, శక్తి కానీ మనకు లేవు. కనుక సత్సంబంధాలను చిరస్థాయిగా నిలబెట్టుకోవాల్సిన ఆవశ్యకత ఎంతైనా ఉంది.

సత్సంబంధాలు నెలకొల్పుకోవడంలో అత్యంత ముఖ్యమైన సాధనం – శీల నిర్మాణం. స్టీఫెన్ కోవీ అనే రచయిత 'శీలమే అన్నిటి కన్నా మిన్నగా భావాలను వ్యక్తం చేయగలదు. ఇతరులతో సత్సంబంధాలకు పునాది ఆత్మనిగ్రహం. ఉదాహరణకు, యౌవనంలో ఉన్న పిల్లలు మనతో మరింత బాగా సహకరించాలన్నా, మరింత ఉల్లాసంగా గడపాలన్నా, తల్లితండ్రులు మరింత ఎక్కువగా, వారిపట్ల అవగాహన, సానుభూతి, కలిగి ఉండాలి. వారు మిమ్మల్ని విశ్వసించాలంటే మీరు విశ్వసనీయులై ఉండాలి' అని సూచించారు.



### వ్యక్తి స్వభావం యొక్క ప్రధాన పాత్ర:

ఇతరులతో వ్యవహరించడం ఒక కళ. ఇతరుల గురించి అంచనా వేసేటప్పుడు మన పూర్వకల్పిత ఊహలే చాలా మటుకు ప్రభావం చూపుతాయి. వారి చేష్టలనూ, హావభావాలనూ, నడవడికనూ తప్పుగా అర్థం చేసుకొంటాం. అవతలి వ్యక్తి చెబుతున్నది విని, విశ్లేషించే సమయం కానీ, ఓపిక కానీ మనకు ఉండవు. వెంటనే ఒక నిశ్చితాభిప్రాయం ఏర్పరచుకొంటాం. ఈ కారణంగానే వ్యక్తుల మధ్య సంబంధ వ్యవహారాలు జటిలం అవుతాయి. ఈ మనః ప్రవృత్తి అపార్థ బీజాలు నాటడానికి కారణమవుతుంది. సత్సంబంధాలు నెలకొల్పుకొనడానికీ, అవతలి వ్యక్తి దృష్టికోణాన్ని అర్థం చేసుకోవడానికీ చిత్తశుద్ధితో ప్రయత్నించాలి.

ఆ పైన, గట్టినమ్మకంతో సహకారభావాన్ని అలవరచుకొనాలి. "గెలుపు, గెలుపు" అనే భావాన్ని అలవరచుకోమంటారు కోవీ. "గెలుపు అంటే ఒప్పందాలు, పరిష్కారాలు ఇరువైపులకూ శ్రేయస్కరంగా, సంతృప్తికరంగా ఉండాలి. అంటే జీవితాన్ని ఒక సహకారక్షేత్రంగా చూడాలి కానీ పోటీ రంగంగా కాదు. నా పద్ధతి అనీ నీ పద్ధతి అనీ కానీ అనకుండా, ఇద్దరికీ మరింత మెరుగైన, ఉన్నతమైన మార్గాన్ని ఎన్నుకోవాలి" అంటారు ఆయన.

### జీవితం లోతులను తరచాలి:

జీవితం పట్ల మన అవగాహన లోతైన కొలదీ, మనం ఎవరితో సంబంధంలేని ఒంటరులం కాదనీ పరస్పరం ఆధారపడే వాళ్ళమేననీ తెలుసుకొంటాం. మౌలికంగా మనందరికీ ఒకరితో ఒకరికి సంబంధం ఉంది. భౌతిక, సామాజిక, మానసిక స్థాయిలలోనే గాక, ప్రధానంగా ఆధ్యాత్మిక స్థాయిలో మనందరినీ కలిపి చేర్చే సూత్రం (త్రాడు) ఒకటి ఉంది. అదే సమస్త జీవరాశినీ కలిపే 'అంతర్యామి' అని బృహదారణ్యక ఉపనిషత్తు చెబుతుంది.



మనల్ని మనం ఎలా భావిస్తామో ఇతరుల గురించి అలాగే భావిస్తాం. కాబట్టి మన బాంధవ్యాలను విశ్లేషించుకొనేటప్పుడు, అవి వ్యక్తిగతంగా ప్రారంభం కావాలి. మరింత వివరంగా చెప్పాలంటే, మనం మన శరీరాన్ని గురించి ఎక్కువ ఆలోచిస్తూ భౌతికమైన పరిధిలో ఉంటే, శారీరక

సంబంధాలు ప్రధానమవుతాయి. అలాగే భావోద్వేగాలు కూడా! మనలో ఆధ్యాత్మిక తత్త్వం ప్రధానంగా కనపడితే, ఇతరులను కూడా ఆధ్యాత్మికులుగా చూడగలుగుతాం.

**ఆధ్యాత్మిక దృష్టికోణం:**

ఇతరులతో మన పరిచయాలను, సంపర్కాలను ఆధ్యాత్మికం చేయడమంటే, వారితో మన మౌలిక ఆధ్యాత్మిక ఏకత్వాన్ని అనుభవించడం. అంటే మనమందరం ఆ నిత్య శుద్ధ నిత్య ముక్త అద్వయ బ్రహ్మమేనని తెలుసుకోవడం. ఇది సహజంగా, సులువుగా జరగాలి. కానీ నిజ జీవితంలో అది ప్రయాసతో కూడిన పని. నిజానికి ఇది ఒక మానసిక ప్రక్రియ. ఆధ్యాత్మిక భావాన్ని ఆరోపించు కోవడం కాదు, మన మనస్సులో ఒక మార్పురావాలి. మన తప్పుడు అభిప్రాయాలను సరిదిద్దు కోవడానికి ఉపాయాలు ఉన్నాయి. మనలోని దివ్యత్వాన్ని తెలుసుకొనే ప్రయత్నం చేయాలి.



ఈ యాదృచ్ఛిక వ్యక్తిత్వం ముఖ్యంగా అహంకారంలో వేళ్ళూనుకొని ఉంటుంది. అహాన్ని ఆధ్యాత్మికంగా ఉదాత్తం చేయాలి. అదెట్లా? అందరినీ మనతో కలుపుకొనే హృదయవైశాల్యాన్ని పెంచుకోమంటారు పెద్దలు. యథాతథంగా చెప్పాలంటే 'ఈ ప్రపంచాన్ని మొత్తం నీదిగా చేసుకో' అన్నారు దివ్యజనని శ్రీశారదాదేవి. శ్రీరామకృష్ణులు నుడివినట్లు ఈ దుష్టుణ్ణి (అహంకారాన్ని) భగవంతుని దాసునిగా ఉండమనాలి. నేను భగవంతునికి చెందినట్లయితే, అందరూ భగవంతునికి చేందినవారే. నేను భగవంతుని సంతానాన్ని. అందరూ ఆయన సంతానమే. మనకు గల ఇతర ఉపాధులన్నీ అప్రస్తుతం, అప్రధానం.

ఈ విధంగా క్రమేణా అహంకారం పరిణతి చెంది, ఆధ్యాత్మికంగా ఉదాత్తం చేయబడిన 'నేను', 'నాకు సంబంధించిన ఏ బాంధవ్యమైనా ఆధ్యాత్మిక మవుతుంది.

అత్యంత ముఖ్యమైన విషయమేమిటంటే, మన చైతన్యాన్ని ఉన్నత స్థితికి లేపాలి. ఆ విధంగా అన్యులతో వ్యవహారాలు మరింత ఆధ్యాత్మికమవుతాయి. ఒకసారి ఒక రామకృష్ణ మఠ కేంద్రంలో ఏవో మనస్పర్థలు తలెత్తాయి. శ్రీరామకృష్ణుల మానసపుత్రులు స్వామి బ్రహ్మానందజీ అక్కడకు వెళ్ళారు. మఠవాసులందరినీ తమ సమక్షంలో రోజూ ధ్యానం చేయమనేవారు. వారి మనస్పర్థల ఊసే ఎత్తలేదు. తమ ఉనికి ద్వారా వారందరినీ ఆయన ఉన్నతం చేశారు. సమస్యలన్నీ అప్రయత్నంగానే సమసిపోయాయి.

**ఆధ్యాత్మిక జీవనానికి యోగ:**

మనలోని కల్మషాన్ని తొలగించుకోవడానికి వివిధ యోగమార్గాలలో వివిధ ఉపాయాలు చెప్పారు.

ఈ జీవనలీలలో మన పాత్రను బాగా నిర్వహించడం నేర్పుతుంది కర్మయోగం. అయితే ఆ క్రమంలో మనం బాధపడకుండా, అన్యులను బాధ పెట్టకుండా జాగరూకత వహించమని హెచ్చరిస్తుంది. మన స్వేచ్ఛకు కానీ, అన్యుల స్వేచ్ఛకు కానీ భంగం వాటిల్లకుండా చూసుకోవాలి. దైవం ప్రతి హృదయంలోనూ నిక్షిప్తమై ఉంది అంటుంది భక్తి యోగం. ఆయన లీలానాటక సూత్రధారి. ఆయన ఇచ్ఛానుసారం మనం పలు విధాలుగా వర్తిస్తాం. ఇది అవగతం చేసుకొని, ఆయననే మన భావోద్వేగాలకు కేంద్రంగా చేసుకోవాలే తప్ప వ్యక్తులను కాదు. నేను తప్పమరొకరు లేరు అంటుంది జ్ఞానయోగం. అవతలి వ్యక్తి కూడా నీవే. నాతో నేను పోట్లాడుకొనటమేమిటి? పైన చెప్పిన యోగమార్గాలను అనుష్ఠించి సామాన్య మానవతావాదాన్ని దివ్యమానవతావాదంగా మార్చవచ్చు. అప్పుడు అన్యులతో మన వ్యవహారాలలో మానవ, దివ్యాంశాలు రెండింటినీ గుర్తుపెట్టుకోగలం. అంత మాత్రాన సామాజిక సంప్రదాయాలు, మర్యాదలు వదలనవసరం లేదు. అవతలి వారు ఎవరైనా సరే వారిని ఆదరించి, గౌరవించాలి. వారి నైజానికీ, అవసరాలకూ, భావాలకూ తగ్గట్లు ఓర్పుతో వ్యవహరించాలి.

**అనువాదం : డాక్టర్ కమలా జయరావు**



# బ్రహ్మమొక్కటే! పరబ్రహ్మమొక్కటే!

– కస్తూరి మురళీకృష్ణ

నిజానికి మనకు దేవతలు చాలామంది ఉన్నా, తరచిచూస్తే, దేవతలంతా ఒకే శక్తి యొక్క భిన్న స్వరూపాలని అర్థమవుతుంది. అంటే, ఎలాగయితే, పాలన వ్యవస్థ సక్రమంగా నడచేందుకు రాజ్యాన్ని భిన్న ప్రాంతాలుగా విభజించి, ప్రతి ప్రాంతానికీ అధికారులుంటారో, అలా మానవ జీవనంలోని విభిన్నాంశాలకు విభిన్న దేవతలు ఉంటారన్నమాట. ఈ దేవతలంతా, వేర్వేరు శక్తులను పాలిస్తుంటారు. కానీ, పైకి వేర్వేరు శక్తులుగా కనిపిస్తున్నా, ఈ దేవతలంతా ఒకే శక్తి యొక్క భిన్న స్వరూపాలు.

ఇది సరిగ్గా అర్థమవాలంటే, మనం శక్తి నిత్యత్వ సూత్రాన్ని స్మరించాల్సి ఉంటుంది. ఈ సూత్రం ప్రకారం, ప్రపంచంలోని శక్తిలో మార్పు ఉండదు. కానీ, శక్తి ఒక స్వరూపం నుంచి మరో స్వరూపానికి మారుతుంది. ఒక వస్తువు పైన ఉన్నప్పుడు దానిలో శక్తి ఉంటుంది. అది క్రింద పడ్డప్పుడు ఆ శక్తి 'శబ్దం'గా మారుతుంది. అంటే శక్తిలో మార్పు రాలేదు. కానీ వస్తువులో స్థానం వల్ల ఉన్నశక్తి, శబ్దశక్తిగా మార్పు చెందిందన్నమాట. దీన్నే, ఉపనిషత్తులో ఓ మహత్తరమైన మంత్రం అత్యంత వైజ్ఞానికంగా వివరిస్తుంది.

**ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే!**
**పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే ॥**

అనంతమైన అర్థాలనిచ్చే పరమాద్భుతమైన మంత్రం ఇది. ఇది ఈశావాస్యోపనిషత్తులో ఆరంభ మంత్రం. ఈ ఒక్క మంత్రాన్ని సంపూర్ణంగా అర్థం చేసుకుంటే, ప్రపంచ జ్ఞానాన్ని సంపాదించినట్టే. అయితే, ప్రస్తుతం మన పరిధిని అనుసరించి ఈ మంత్రాన్ని ఒకే దైవం పలు రూపాల్లో కనిపించడానికి పరిమితం చేసి విశ్లేషిద్దాం.

"ఆ కనిపించనిది అనంతం. ఈ కనిపించే విశ్వం కూడా అనంతం. ఆ అనంతం నుండి ఈ అనంత విశ్వం బహిర్గతమైంది. ఈ అనంత విశ్వం దాని నుండి వెలువడినా అనంతం మాత్రం అనంతంగానే ఉన్నది".

ప్రపంచ మంతా బ్రహ్మమయమే, ఆ బ్రహ్మ నుంచి ఉద్భవించిన జీవులు మళ్ళీ బ్రహ్మంలో లయం చెందుతాయనీ, లయం చెందినా పరబ్రహ్మలో ఎలాంటి తేడా ఉండదనే తత్త్వజ్ఞానం నుంచి శూన్యానికి శూన్యం కలిపినా, తీసేసినా అంతా శూన్యమే అనే గణిత శాస్త్ర సిద్ధాంతం వరకూ; ఏమీ లేని దానికి 'అంతానేనే' అనే భ్రమ కల్పించే సృష్టి కారణం నుంచి, 'ఇదేదీ నేను కాదు' – 'ఇదీ అదీ ఒకటే' అనే అంతిమ సత్యావిష్కరణ వరకూ ప్రతి విషయాన్నీ నిస్సందేహంగా, నిర్ద్వంద్వంగా వివరించగలిగే మంత్రం ఇది.

**ఇప్పుడీ మంత్రం ఆధారంగా మనకున్న దేవతలను విశ్లేషిద్దాం.**

సృష్టికి కారణమైన అనంత శక్తిని మనం నమ్ముతాం. అయితే పాలన కోసం మనం ఎలా రకరకాల మంత్రులను, మంత్రిత్వ శాఖలను సృజించుకున్నామో, అలాగే దైవ శక్తి కూడా పలురూపాలు ధరించింది. సృష్టికి బ్రహ్మ, రక్షించేందుకు విష్ణువు, లయమొందించేందుకు శివుడు – ఇలా త్రిమూర్తుల రూపం ధరించిందా శక్తి. కానీ గమనిస్తే ఈ మూడు శక్తులూ ఒకటే. ఈ మూడు భిన్న శక్తులు ఏర్పడడం వల్ల అనంత శక్తిలో ఎలాంటి మార్పూ లేదు. అంటే వ్యక్తి ఆ అనంత శక్తిని ధ్యానించవచ్చు. లేక ఆ అనంతశక్తి స్వరూపాలైన ఈ మూడు భిన్న శక్తులను ధ్యానించవచ్చు. ఏ రూపాన్ని ధ్యానించినా అసలు అనంత శక్తిని ధ్యానించినట్టే! ఈ మూడు శక్తుల ఆధారంగా మరిన్ని రకాల శక్తులు సృజించబడ్డాయి. లక్ష్మి, పార్వతి, సరస్వతి, కాళీమాత, గణపతి, కుమారస్వామి, రాముడు, కృష్ణుడు, హనుమంతుడు, నరసింహస్వామి – ఇలా ఒక్కో స్వరూపాన్ని ఒక్కో ప్రత్యేక శక్తిగా గుర్తించవచ్చు. లేకపోతే సర్వశక్తులు మిళితమైన అనంతశక్తిని పూజించవచ్చు. ఇది భారతీయ ధర్మంలోని పలు దేవతల స్వరూపాల పరమార్థం.

ప్రతి వ్యక్తికీ అతని మనస్తత్వాన్ని అనుసరించి ఒక్కో శక్తిపై మనస్సు కుదురుతుంది. కొందరికి వినాయకుడు మనస్సుకు నచ్చితే, మరికొందరికి ఆంజనేయుడు నచ్చవచ్చు. కొందరికి లలితాదేవిపై భక్తి కుదిరితే, మరికొందరికి మనస్సు కాళీమాతపై స్థిరపడవచ్చు. కానీ ఎవరు ఏ రూపంలో ధ్యానించినా అంతా ధ్యానించేది సర్వ సృష్టి స్థితి లయ కారణమైన ఆ పరబ్రహ్మన్నే!



# అమర భారత ప్రతిభ

## సప్తవర్ణం- భానుకిరణం





సూర్యుని నుంచి వెలువడే కాంతి కిరణాలలో ఏడు రంగులు ఉన్నాయి అనే విషయాన్ని ప్రపంచానికి తెలియచెప్పింది 16వ శతాబ్ది వాడైన న్యూటన్ మహాశయుడేనని నేడు పాశ్చాత్యులు (మనం కూడా) అంటున్నారు.

నిజానికి, ఈ విషయంలో భారతీయులు ఎంతో ముందున్నారు. ప్రపంచంలో అతి పురాతనమైన వేదవిజ్ఞానంలోనే సూర్యకిరణాలలో ఏడు రంగులున్నాయని వివరించారు.

**దుం॥ "సప్త త్వా హరితో రథే వహన్తి దేవ సూర్య!**
**శోచిష్కేశం విచక్షణ** (ఋగ్వేదం. 1-50-9)

**దుం॥ "అవ దివ స్తారయన్తి సప్త సూర్యస్య రశ్మయః॥**
(అథర్వవేదం 7-107-01)

సూర్యుని ఏడు కిరణాలు దినాన్ని ఉత్పన్నం చేస్తున్నాయి అని దీని అర్థం.

సూర్యునికి కచ్చితంగా 7 కిరణాలే ఉంటాయా?! కాదు, సహస్ర కిరణాలలో ప్రతి కిరణంలోనూ తిరిగి ఏడు వర్ణాలుంటాయని దీని భావం. 'సప్తాశ్వరూఢుడు'అంటే... అర్థమిదే. అలాగే సూర్యుణ్ణి ఒక్క గుర్రమే తీసుకువెళుతున్నది అని కూడా మన వేదాలలో ఉంది. అంటే సప్తవర్ణ సమ్మిళితమైన తెల్లని కాంతి కిరణం అని అర్థం.

'అశ్వ' అంటే కిరణం అనే అర్థం కూడా ఉంది. 'తైత్తరీయ అరణ్యకం'లో **'ఏకో అశ్వోవాహతి సప్త నామ'** (ఋ -164-2) అని వివరించారు. సూర్యుని కిరణాలలో పలురంగులు దాగి ఉన్నాయని అందరి కన్నా ముందుగా మనకు తెలుసుననడానికి ఇక వేరే ఋజువులు కావాలా!

ఇంకో అద్భుత విషయం ఏమంటే సూర్యకిరణంలో మూడు రంగులు ఉన్నాయని ఛాందోగ్య ఉపనిషత్తు(8-6-1) చెబుతోంది. అవి 1. నీలం, 2. పసుపు, 3 ఎరుపు అని వివరించారు. ఇది కూడా నిజమే. ఎందుకంటే నిజానికి ఈ మూడు రంగుల కలయికతోనే మరిన్ని రంగులు (ఏడు) ఉద్భవిస్తాయి.

('భారతీయ ప్రతిభా విశేషాలు' నుంచి)

## పండుగలు - పర్వదినాలు

### నవంబరు- 2008

| | | | |
|---|---|---|---|
| 09 | ఆదివారం | : | ఏకాదశి |
| 10 | సోమవారం | : | స్వామి సుబోధానంద జయంతి |
| 12 | బుధవారం | : | స్వామి విజ్ఞానానంద జయంతి |
| 23 | ఆదివారం | : | ఏకాదశి |

### డిసెంబరు- 2008

| | | | |
|---|---|---|---|
| 07 | ఆదివారం | : | స్వామి ప్రేమానంద జయంతి |
| 09 | మంగళవారం | : | ఏకాదశి |
| 18 | గురువారం | : | దివ్యజనని శ్రీ శారదా దేవి జయంతి |
| 23 | మంగళవారం | : | ఏకాదశి, స్వామి శివానంద జయంతి |
| 24 | బుధవారం | : | క్రిస్మస్‌ఈవ్ (సాయంత్రం ఆరతి తర్వాత) |



# 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

| దాత పేరు | విద్యాసంస్థ |
|---|---|
| శ్రీ శంకర్ రెడ్డి, గుడిమల్కాపూర్, హైదరాబాద్-28 | రామకృష్ణ సేవాసమితి, నర్సాపూర్, దామెరగిద్ద, మహబూబ్‌నగర్ జిల్లా |
| " " " | రామకృష్ణ సేవాసమితి, నాగిరెడ్డిపల్లి, మద్దూర్, మహబూబ్‌నగర్ జిల్లా |
| " " " | రామకృష్ణ సేవాసమితి, పెద్దూరుపాడ్, మహబూబ్‌నగర్ జిల్లా |
| శ్రీమతి సరిత, గగన్‌మహల్, దోమల్‌గూడ, హైదరాబాద్ | అరవింద విద్యాలయం, రెడ్డి బజార్, మహబూబ్‌నగర్ జిల్లా |
| " " " | ప్రాథమికోన్నత పాఠశాల, గోకినెపల్లి, కరీంనగర్ జిల్లా |
| " " " | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, కోహెడ, కరీంనగర్ జిల్లా |
| శ్రీ ఏకాంబరం, పద్మారావునగర్, సికింద్రాబాద్ - 500 061 | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, చెన్నూరు, ఖమ్మం జిల్లా - 507 207 |
| " " " | ఎమ్.పి.పి.హెచ్. పాఠశాల, వెంకమ్మపేట, ఉణుకూరు, శ్రీకాకుళం జిల్లా |
| " " " | సరస్వతీ విద్యామందిర్ పాఠశాల, కదిరి, అనంతపురం - 515 594 |
| శ్రీ ఎస్.ఎన్. సింగ్, సప్తగిరి కాలనీ, సైనిక్‌పురి, సికింద్రాబాద్ - 94 | వివేకానంద ఉన్నత పాఠశాల, ఉషోదయ కాలనీ, గుడిమల్కాపురం, హైదరాబాద్ |
| " " " | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, హుస్నాబాద్, కరీంనగర్ జిల్లా - 505 467 |
| " " " | శ్రీ సరస్వతీ శిశుమందిర్ ప్రాథమికోన్నత పాఠశాల, ఆకివీడు, ప.గో.జిల్లా |
| శ్రీ కేశవ్ రక్షిత్, ఉప్పర్ పల్లి క్రాస్ రోడ్, హైదరాబాద్ - 500 048 | వివేకవాహిని ఉన్నత పాఠశాల, శివరామ్‌నగర్ కాలనీ, వికారాబాద్ - 501 101 |
| " " " | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, నరబాలు పోస్ట్, చిత్తూరు జిల్లా - 517 194 |
| " " " | ఎమ్.పి.వి.పి. పాఠశాల, కొత్తపేట, శ్రీకాకుళం జిల్లా - 532 211 |
| శ్రీ డి.వి. జోగారావ్, విజయనగర్ కాలనీ, హైదరాబాద్ - 057 | సుమేధా ఇంగ్లీష్ మీడియమ్ స్కూల్, గుంతకల్, అనంతపురం జిల్లా - 515801 |
| " " " | శ్రీ సరస్వతీ శిశుమందిర్, భద్రాచలం, ఖమ్మం జిల్లా - 507 111 |
| " " " | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, మర్రిపాడు, శ్రీకాకుళం జిల్లా - 532 211 |
| శ్రీ కె. చంద్రారెడ్డి, ధర్మారెడ్డిగూడెం, బొమ్మలరామారం, నల్లగొండ జిల్లా | ధ్యానమందిరం, బొమ్మలరామారం, నల్లగొండ జిల్లా - 508 126 |
| శ్రీ బిషన్ బాసు, జి.కె- 2, న్యూ ఢిల్లీ | శ్రీ సరస్వతీ శిశుమందిర్, సి.సి.సి. పోస్ట్, గోదావరి కాలనీ, మంచిర్యాల్ |
| " " " | శ్రీ సరస్వతీ శిశుమందిర్, ఎల్.ఎమ్.డి.కాలనీ, తిమ్మాపూర్, కరీంనగర్ జిల్లా |
| శ్రీమతి వై. నీలవేణి, ఎర్రమంజిల్, హైదరాబాద్ - 082 | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, ఎల్లూరుపాడు, పశ్చిమగోదావరి జిల్లా |
| శ్రీ జి.ఎన్.బి. ఆంజనేయులు, రామంతాపూర్, హైదరాబాద్ | బాలభారతి ఉన్నత పాఠశాల, రామంతాపూర్, హైదరాబాద్ - 500 013 |
| శ్రీ రమేష్ రెడ్డి, దోమల్‌గూడ, హైదరాబాద్ 500 029 | సరస్వతీ శిశుమందిర్, కోల్‌చారం, మెదక్ జిల్లా - 502 381 |
| " " " | సరస్వతీ శిశుమందిర్, చింతలగుట్ట, మెదక్ జిల్లా - 502 321 |
| " " " | శ్రీ సరస్వతీ శిశుమందిర్, కోహిర్, మెదక్ జిల్లా - 502 210 |
| శ్రీమతి వి. రుక్మిణమ్మ, వారణాసి వీధి, సోదమ్ పోస్ట్, చిత్తూరు జిల్లా | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, సోదమ్ పోస్ట్, చిత్తూరు జిల్లా - 517 123 |
| శ్రీ జి. గోపాల కృష్ణంరాజు, బులుసుముడి, భీమవరం, పశ్చిమ గోదావరి జిల్లా | ఎస్. సి. హెచ్.బి.ఆర్.ఎమ్. ఉన్నత పాఠశాల, భీమవరం, పశ్చిమగోదావరి జిల్లా |
| శ్రీమతి శ్రీకుమారిదేవి, బంజారాహిల్స్, హైదరాబాద్ - 500 034 | శ్రీ సరస్వతీ శిశుమందిర్, జోగిపేట, మెదక్ జిల్లా - 502 270 |
| " " " | శ్రీ సరస్వతీ శిశుమందిర్, దిగ్వాల్, మెదక్‌జిల్లా - 502 321 |
| " " " | శ్రీ సరస్వతీ శిశుమందిర్, నర్సాపూర్, మెదక్ జిల్లా - 502 313 |
| డా॥ వై కమలాకర్ రెడ్డి, గగన్‌మహల్, దోమల్‌గూడ, హైదరాబాద్ | రామకృష్ణ డిగ్రీ కళాశాల, అల్లూరు, నెల్లూరు జిల్లా - 524 315 |
| డా॥ వై పరబ్రహ్మారెడ్డి, గగన్‌మహల్, హైదరాబాద్ - 500 029 | రామకృష్ణ ఉన్నత పాఠశాల, అల్లూరు, నెల్లూరు జిల్లా - 524 315 |
| శ్రీ కె. గోపి, శ్రీసాయినగర్ కాలనీ, నాగోలు, హైదరాబాద్ - 500 068 | శ్రీ సరస్వతీ శిశుమందిర్‌ఉన్నత పాఠశాల,శ్రీనగర్‌కాలనీ, కేశవనగర్, హైదరాబాద్ |
| " " " | శ్రీ సరస్వతీ శిశుమందిర్ ఉన్నత పాఠశాల, కార్వాన్, హైదరాబాద్ |
| " " " | శ్రీ సరస్వతీ శిశుమందిర్ ఉన్నత పాఠశాల, కుషాయ్‌గూడ, హైదరాబాద్ |
| శ్రీ కె. రామచంద్రయ్య, తిలక్‌నగర్, హైదరాబాద్ - 500 044 | శ్రీ సరస్వతీ శిశుమందిర్ ఉన్నత పాఠశాల, బస్వాపూర్, నిజామాబాద్ |
| " " " | శ్రీ సరస్వతీ శిశుమందిర్ ఉన్నత పాఠశాల, బిచ్‌కుంద, నిజామాబాద్ జిల్లా |
| " " " | శ్రీ సరస్వతీ శిశుమందిర్, బిక్నూర్, నిజామాబాద్ జిల్లా - 503 101 |

ఈ పథకం ద్వారా శ్రీరామకృష్ణ ప్రభను మరింతమందికి చేరువ చేస్తున్న దాతలకు కృతజ్ఞతలు.

- రెంటాల జయదేవ

# పూజా పుష్పాలను శుద్ధి చేసేదెలా?



పూజ కోసం కోసిన పువ్వులను దేవునికి అర్పించాలంటే శుద్ధి చేయాలి కదా! అది ఎలాగంటే –

**పుష్పం తు ప్రోక్షణాచ్ఛుద్ధం । జలం ప్రక్షేపణాత్తథా ।**

**మన్త్రమాచమనాచ్ఛుద్ధం । పూజా శుద్ధిర్భవిష్యతి ॥**

(స్మృత్యంతరే)

'పుష్పాలపై నీళ్ళు చల్లితే చాలు. అవి శుద్ధి అవుతాయి. నీళ్ళను వడపోస్తే శుద్ధి అవుతాయి. లేదంటే కొద్దిపాటి జలాన్ని ముందుగా భూమిపై పోసినా చాలు. ఆ నీళ్ళు శుద్ధి అవుతాయి. వేద మంత్రం ఆచమనం చేసి పఠిస్తే, శుద్ధి అవుతుంది.'

**కోసిన తరువాత ఎంతసేపు పనికొస్తాయి?**

పూజ కోసం కోసిన పూలను ఓ నిర్ణీతకాలం లోపల దేవతార్చనకు వినియోగించాల్సి ఉంటుంది. ఆ నిర్ణీత వ్యవధి దాటితే అవి దేవతార్చనకు పనికిరావు. ఆ నిర్ణీత కాలవ్యవధి గురించి మన ప్రాచీన గ్రంథాల్లో ఇలా తెలిపారు:

**పంకజం పంచ రాత్రేషు । సప్త రాత్రేషు బిల్వకం ।**

**తులసీ దశ రాత్రేషు । పూజితః పరమేశ్వరః ॥**

(రుద్ర కామ్యార్చన విధౌ)

'కోసిన తరువాత అయిదు రాత్రుల వరకూ పద్మం, ఏడు రాత్రుల వరకూ మారేడు దళాలు, 10 రాత్రుల వరకూ తులసి శివపూజకు పనికివస్తాయి.'

**తులస్యాం బిల్వపత్రే చ । జలజేషు చ సర్వశః ।**

**న పర్యుషిత దోషో –స్తి । మాలాకార గృహేషు చ ॥**

(విష్ణు ధర్మోత్తరే)

'తులసికీ, బిల్వపత్రానికీ, కమలములకూ, అలాగే పూల దండలు కట్టేవాడి ఇంట్లో నిలవ ఉన్న పత్ర, పుష్పాలకు చాలా కాలం నిలవ ఉన్నాయనే (పర్యుషిత) దోషం లేదు' అని మరో సిద్ధాంతం.

**సువర్ణం తులసీ బిల్వం । తథైవ కమలాని చ ।**

**ఏతే నిర్మాల్యతాం యాంతి । పునః ప్రక్షాళయేజ్జలైః ॥**

**పూజాం కరోతి చేన్నూనం । తస్య దోషో న విద్యతే ॥**

(స్మృత్యంతరే)

'బంగారంతో చేసిన పువ్వులు, తులసీ దళాలు, బిల్వ పత్రాలు, పద్మాలు – ఇవి ఒకసారి దేవుని పూజకు ఉపయోగించినవైనప్పటికీ, నీటిని ప్రోక్షించి, వాటితోనే మళ్ళీ దేవుణ్ణి పూజించవచ్చు. దోషం లేదు.' అయితే, ఇది వేరే మార్గం లేనప్పుడు, ఆపద్ధర్మంగా అనుసరించాల్సిన పద్ధతి అన్న సంగతిని గుర్తించాలి.

**బిల్వపత్రం చ మాఘ్యం చ । తమాలా మలకీ దళే ।**

**కల్హారం తులసీ చైవ । పద్మం చ ముని పుష్పకం ॥**

**ఏషాం పర్యుషితం న స్యా । త్ముకశ్చ కలికా స్తథా ॥**

(స్మృత్యంతరే)

'మారేడు పత్రి, మొల్ల, తాపింఛ పుష్పాలు, పెద్ద ఉసిరి పత్రి, ఎఱ్ఱ కలువలు, తులసీ దళాలు, పద్మాలు, తుమ్మిపూలు, రెల్లు పూలు, సమస్తమైన మొగ్గలు – వీటికి చాలాకాలం నిలవ ఉన్నాయనే (పర్యుషిత) దోషం లేదు' అని కొన్ని గ్రంథాలు పేర్కొన్నాయి.

**దేవుడికి పత్ర, పుష్పాలను సమర్పించడమెలా?**

పూజ చేస్తున్నప్పుడు దేవుడికి పుష్పాలను సమర్పించడానికి కూడా ఓ పద్ధతి ఉంది. నడిమి, ఉంగరపు వేళ్ళతో పుష్పాలను తీసుకొని దైవాన్ని పూజించడం శ్రేయస్కరమైన పద్ధతి. పుష్పముద్రతోనైనా పువ్వులను తీసుకొని, దేవుణ్ణి పూజించవచ్చు. పుష్పాలతో విడిగా పూజించడం కన్నా మాలగా కూర్చి, దైవ విగ్రహానికి కానీ, పటానికి కానీ వేయడం శ్రేయస్కరం.

**(మిగతా వచ్చే సంచికలో...)**

...17వ పేజీ తరువాయి.




శ్రీధరయ్య తన్మయత్వంతో లింగాష్టకం గానం చేశాడు. వెంటనే బావి నుండి గంగానది ఉప్పొంగి ప్రవహించింది. ఆ నీటితో మంగళద్రవ్యాలు, మొసళ్ళు, తాబేళ్ళు, చేపలు మొదలైనవన్నీ వచ్చాయి.










భగీరథ మనోష్టకం అనే శ్లోకాన్ని శ్రీధరయ్య తన్మయత్వంతో గానం చేశాడు. అప్పుడు గంగామాత శాంతించింది.

శ్రీధరయ్య ఇంటికి త్రిమూర్తులు అశరీరులుగా వచ్చి, మంత్రాలు పఠించి, తిథిని జరిపించారు. దీనిని విశ్వసించనివారు శ్రీధరయ్యను గంగాస్నానం చేయమని చెప్పారు. అప్పుడు గంగామాత పెల్లుబికి వచ్చిందని చెబుతారు.

13

ఆ రోజు గోకులాష్టమి. శ్రీకృష్ణుని రథం శ్రీధరయ్య ఇంటి ముంగిట ఆగింది. శ్రీధరయ్య శివభక్తుడు కాబట్టి నివేదన చేయడానికి రాలేదని భావించిన భక్తులు అతణ్ణి నిందించారు. హఠాత్తుగా రథంలోని శ్రీకృష్ణుని పటం నుండి ఆయన రూపం మాయమైపోయింది. భక్తులు హడలిపోయారు.

14

అప్పుడు శ్రీధరయ్య ఇంటి నుండి ఘంటానాదం వినిపించింది. భక్తులందరూ లోనికి వెళ్ళి చూస్తే... లోపల పూజలో శ్రీధరయ్య ఆసీనుడై ఉండగా, అతని సమక్షంలో సాలగ్రామం పైన శ్రీకృష్ణుడు దర్శనమిచ్చాడు. అది చూసిన భక్తులు...




తర్వాత శ్రీధరయ్య నైవేద్యాన్ని వీధిలోకి తీసుకువచ్చినప్పుడు చిన్ని కృష్ణుడు మళ్ళీ రథంలో ప్రత్యక్షమయ్యాడు. భక్తులందరూ ఆనంద పరవశులై కృష్ణా! కృష్ణా! అంటూ సంకీర్తన చేశారు.

15

భక్తి గీతాలు పాడుకుంటూ, భగవంతుని సేవించుకుంటూ శ్రీధరయ్య అత్యంత ఉన్నతమైన ఆధ్యాత్మిక స్థితిలోనే జీవితమంతా గడిపాడు. సంపూర్ణంగా భగవంతుణ్ణి ఆశ్రయించి జీవించాడు. వృద్ధాప్యంలో కూడా తనను నందిదేవుడే ఆదుకుంటున్నట్లు చెప్పేవాడు.

16

శ్రీధరయ్య ఆరోజు అత్యంత తన్మయత్వంతో మహాలింగస్వామిని దర్శించాడు. భక్తులతో పాటు శివుణ్ణి స్తుతించాడు. అందరూ చూస్తూ ఉండగానే...



హా! శ్రీధరయ్య మహాలింగస్వామి జ్యోతిలో కలిసిపోయారే! శ్రీధరయ్యా సద్గురుదేవా! 'తం వందే నరరూప మందకరిపుం శ్రీవేంకటేశ గురుం" (మానవ రూపంలో వచ్చిన పరమేశ్వరునికీ, శ్రీవేంకటేశ గురువుకీ నమస్కరిస్తున్నాను.)

**ఋషులంటే ఎవరు? ఉపనిషత్తులు 'ఋషి' అని పేర్కొనే వ్యక్తి సామాన్య మానవుడు కాదు. అతడు మంత్రద్రష్ట. అతనికి ఆధ్యాత్మికత అనేది కేవలం గ్రంథపఠనం, ఊహలు, వాదాలూ కాదు, ఇంద్రియాతీతమైన సత్యాలను ప్రత్యక్షంగా దర్శించడం. ఋషిత్వమంటే నిజమైన అనుభూతియే!**

– స్వామి వివేకానంద

# శ్రీ రామకృష్ణ - వివేకానంద భావ ప్రచార పరిషత్



## 18వ వార్షిక భక్త సమ్మేళనం - 2009 జనవరి 9,10,11 తేదీలు, కర్నూలు

*సమ్మేళన వేదిక: మాంటిస్సోరి హైస్కూలు, ఎ-కాంప్, కలక్టర్ ఆఫీసు వెనుక, కర్నూలు - 518 001*

### ఆహ్వానం

కర్నూలు జిల్లాలోని శ్రీరామకృష్ణ సేవాసమితుల ఆధ్వర్యవంలో **కర్నూలులో 2009 జనవరి 9,10,11 తేదీలలో** జరిగే 18వ వార్షిక భక్తసమ్మేళనానికి ఇదే మా ఆహ్వానం.

- ఈ సమ్మేళనంలో పాల్గొనే సంస్థలు, తమ సభ్యులు ఒక్కొక్కరి నుంచి రూ.100/- సభ్యత్వ రుసుముగా వసూలుచేసి, జత చేసిన సభ్యత్వ పత్రములో వివరాలు తెలపాలి. రుసుము ఎమ్.ఓ/ డి.డి ద్వారా 10-12-08 తేదీ లోగా **డాక్టర్ కె.జి. శరత్‌చంద్ర, 21/8, గాండ్లవీధి, పూల బజార్, కర్నూలు - 518 001** చిరునామాకు పంపవలెను. **10-12-08 తర్వాత నమోదు చేసుకొనే వారు రూ.150/-చొప్పున చెల్లించాలి.** సంబంధిత పత్రాలు 09-01-09 తేదీన సమావేశ ప్రాంగణంలో పొందవచ్చు.
- డిమాండ్‌డ్రాఫ్టులు పంపదలచినవారు "APRVBPP - 18th Annual Devotees' Convention" పేరున ఇండియన్ బ్యాంక్, కర్నూలులో చెల్లుబాటు అయ్యేలా పంపవలెను. (S.B.A/C No. 779974240), (RTGS No. IDIB - 000K061 - ఆన్‌లైన్ ద్వారాగూడా పైకం పంపవచ్చును.) **చెక్కులు అంగీకరింపబడవు.**
- ప్రతినిధులకు ఉచిత భోజన, నివాస వసతి సౌకర్యం 09-1-09 (శుక్రవారం) ఉదయం నుండి 11-1-09 (ఆదివారం) రాత్రి వరకు ఏర్పాటు చేయబడును.
- “భక్తుల సేవ భగవంతుని సేవ” కనుక ఈ బృహత్తర కార్యక్రమానికి అయ్యే వ్యయాన్ని భరించడానికి ధన వస్తు, సేవ రూపేణా తమవంతు సహాయ, సహకారాల్ని అందించి, భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ఆశిస్తున్నాం.
- ఈ సమ్మేళనం సందర్భంగా ఒక స్మారక సంచికను విడుదల చేయనున్నాం. ఆ సంచికలో ప్రకటనల నిచ్చి ప్రోత్సహించగలరు. ప్రకటనల ట్యారిఫ్ వివరాలు:

| | పూర్తి పేజీ | అర పేజీ | పావు పేజీ |
|---|---|---|---|
| కలర్ : | 4,000 | 2,500 | 1,200 |
| బ్లాక్ & వైట్ : | 2,000 | 1,200 | 600 |
| 2,3 కవరు పేజీలు | 10,000 | - | - |
| 4వ కవరు పేజీ | 15,000 | - | - |

### సంప్రతించవలసిన చిరునామా

**డాక్టర్ కె.జి. శరత్‌చంద్ర, కార్యనిర్వాహక అధ్యక్షులు,**
**21/8, గాండ్లవీధి, పూల బజార్, కర్నూలు - 518 001**
**సెల్ నెం. 99487 75901, 98853 67321**
**ఫోన్ : 08518 - 230337**

### భక్తులకు సూచనలు

- 08-01-09 (గురువారం) రాత్రి నుండి ‘కర్నూలు టౌన్’ రైలుస్టేషన్‌లో, ఆర్.టి.సి. బస్టాండ్‌లో రిసెప్షన్ కౌంటర్ ఏర్పాటు చేయబడును.
- ప్రతినిధులకు సాధారణ వసతి సౌకర్యములు మాత్రమే చేయబడినవి.
- ప్రత్యేక సదుపాయములు (లాడ్జిలలో గదులు) కావలసినవారు హోటల్ గదులు రిజర్వు చేసుకొనగలరు.
- వివిధ సమితుల నుండి వచ్చే సభ్యులు వారిలో ఒకరిని నాయకునిగా ఎంపిక చేసుకొనవలెను. ఆ నాయకుడు ఆ బృందమునకు అవసరమైన సదుపాయాల్ని సమకూర్చుటకు సమన్వయకర్తగా బాధ్యత వహించవలెను.

## గ్రంథపరిచయం

### శ్రీ భాగవతము - ఉపాఖ్యానములు

**గ్రంథకర్త: పి.వి.నాగలక్ష్మి, పేజీలు: 256, వెల:రూ.80/- ప్రతులకు : పి.వి.నాగలక్ష్మి; డోర్ నెం. 1-12-5, వెల్లంకివారి వీధి, నాజరుపేట, తెనాలి- 522 201**

శ్రీ మహావిష్ణువు యొక్క అవతారలీలల్ని అత్యద్భుతంగా వివరించే గ్రంథం శ్రీ మహాభాగవతం. బమ్మెర పోతన మొదలుకొని ఎందరెందరో భాగవతాన్ని తెనుగించి వచనరూపంలో ఆంధ్ర పాఠకులకి అందించారు. భక్తి, జ్ఞాన, వైరాగ్యాది లక్షణాలు గల ఉన్నత గ్రంథం భాగవతం. మన సనాతన ధర్మం, సంస్కృతి, సంప్రదాయాల ఔన్నత్యాన్ని నేటితరం సులభంగా అర్థం చేసుకోవడానికి వీలుగా భాగవతంలోని ఉపాఖ్యానాలను భక్తిరస పూరితంగా రచయిత్రి మనకి అందించారు. భాగవత మహిమ, భాగవత పఠనావశ్యకత- ఆశయములతో ప్రారంభమైన ఆ గ్రంథంలో శ్రీకృష్ణావతారం ప్రారంభం నుండి అవతార సమాప్తి వరకు ఉన్న కథ, ఇంకా ఎన్నో అంశాలున్న ఈ గ్రంథం చిన్నా,పెద్దా అందరూ తప్పక చదవ తగ్గది అని నిస్సందేహంగా చెప్పవచ్చు. a **- శ్రీమతి ఎన్. శేషు**



### గానకళాబోధిని

**గ్రంథకర్తలు: ఎన్.సి.పార్థసారథి, శ్రీమతి ద్వారకా పార్థసారథి, పేజీలు: 706, వెల: 500/-, ప్రతులకు: టాగూర్ పబ్లిషింగ్ హౌస్, షాప్ నెం. 20, వైశ్యా హాస్టల్ బిల్డింగ్, కాచిగూడా చౌరస్తా, హైదరాబాదు- 500 027.**

ఇది 1951లో ప్రథమ ముద్రణ పొందిన కర్ణాటక సంగీత శాస్త్రానికి సంబంధించిన ఒక అద్భుత అసమాన గ్రంథం. ఇందులో సరళీ స్వరాలు మొదలుకొని అలంకారాలు, స్వరజతులు, గీతాలు, వర్ణాలు, కృతులతో పాటు రాగాలాపన, స్వర కల్పనల్ని పొందుపరచారు. ఇందులో ఎన్నో కీర్తనలు, పదాలు, జావళీలు, రాగమాలికలు స్వరతాళ సహితంగా ఉన్నాయి. ఈ గ్రంథంలో దివ్యనామ కీర్తనలతో పాటు త్యాగరాజు, ముత్తుస్వామి, శ్యామశాస్త్రి, పురందరదాసు, జయదేవుడు, నారాయణతీర్థులు మొదలైనవారి సంగ్రహ జీవిత చరిత్రలు, కర్ణాటక సంగీత శాస్త్రంలోని అనేక విషయాలను వివరణాత్మకంగా ఇచ్చారు. ఒక నిఘంటువులా ఉంటూ, ఎందరో ప్రముఖుల ప్రశంసలందుకున్న అనుపమాన గ్రంథం ఇది. a **- పోపూరి విశ్వనాథ్**






## వార్తావాహిని

### శ్రీరామకృష్ణ సేవాసమితి రజతోత్సవం

**పశ్చిమ గోదావరి జిల్లా యండగండి శ్రీరామకృష్ణ సేవాసమితి** స్థాపించి 25 వసంతాలు పూర్తిచేసుకున్న సందర్భంగా 2008 సెప్టెంబరు 20,21 తేదీలలో రజతోత్సవాలను జరుపుకుంది. రెండు రోజుల పాటు జరిగిన ఈ కార్యక్రమాల్లో రాజమండ్రి రామకృష్ణ మఠం అధ్యక్షులు స్వామి అక్షరాత్మానందజీ, గుంటూరు శారదా మఠం అధ్యక్షులు ప్రవ్రాజిక భవానీప్రాణ మాతాజీ, ప్రవ్రాజిక బోధమయప్రాణ మాతాజీ, డాక్టర్ పన్నాల శ్యామసుందరమూర్తి, భీమవరం శ్రీ మంతెన రామచంద్రరాజు పాల్గొని మూర్తిత్రయ జీవిత సందేశాలపై ప్రసంగించారు. మాతాజీల ఆధ్వర్యంలో విశేషపూజ, హోమం జరిగాయి. పూజ్య స్వామీజీ సమితి నిర్వహించిన వివిధ పోటీల్లో విజేతలైన విద్యార్థులకు బహుమతులు అందజేశారు. `




**నివేదిక : కె.ఆర్. ప్రభాకరరావు, కార్యదర్శి**

# సుబోధ

ఒకరోజు కేశవచంద్రసేన్ శ్రీరామకృష్ణులను ఇలా అడిగాడు: "పండితులు బళ్ళకొద్దీ గ్రంథాలను చదివినా పారమార్థిక విషయాలకి వచ్చేసరికి పరమపామరులుగా ఉండటానికి కారణం ఏమిటి?" అందుకు గురుదేవులు "గద్దలూ, రాబందులూ ఆకాశంలో ఎంతో ఎత్తులో ఎగురుతాయి కదా? కానీ వాటి కళ్ళు మాత్రం కుళ్ళిన కళేబరాల కోసం వెతుకుతూ మురికి గుంటల మీదే ఉంటాయి. ఆ విధంగానే ఎన్ని శాస్త్రాలు చదివినా, ఎంత పాండిత్యం గడించినా పండితుల మనస్సు కామినీ కాంచనాలనే ఐహిక విషయాల్లోనే లగ్నమై ఉంటుంది. అందుచేత వారికి బ్రహ్మజ్ఞానం అలవడదు.

కేవలం పుస్తక పాండిత్యం వల్ల ప్రయోజనం ఏమిటి? పండితులు కొన్ని వందల శ్లోకాలను వల్లించవచ్చును. కాని వాటిని వల్లించినంత మాత్రాన లాభంలేదు. శాస్త్రాల్లోని తత్త్వాలు నిజజీవితంలో ఆచరణలోకి రావాలి. కామినీ కాంచన మోహితుడై, సంసారబద్ధుడై ఉన్నంత వరకూ కేవలం శాస్త్ర పఠనంతో జ్ఞానంగానీ, ముక్తిగానీ లభించజాలదు.

భగవద్భక్తి పుస్తక పఠనంతో అలవడుతుందా! పంచాంగంలో ఫలానా రోజున ఇరవై దుక్కుల వాన కురుస్తుందని ఉంటుంది. కానీ ఆ పంచాంగాన్ని మెలిపెట్టి పిండినా ఒక్క నీటి చుక్క అయినా వస్తుందా? అదేవిధంగా శాస్త్రాల్లో ఉన్న సద్వాక్యాలను పఠించినంత మాత్రాన ఎవడూ పారమార్థికుడు కాలేడు. భగవద్భక్తి కలగాలంటే, ఆ శాస్త్రాల్లో చెప్పబడ్డ ధర్మాలను అనుష్ఠించాలి" అని బదులిచ్చారు.

('శ్రీరామకృష్ణ బోధామృతం' నుంచి)



**శ్రీరామకృష్ణ ప్రభ**

రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్ – 500 029
ఫోన్: 040–2766 7799, 2763 3936
E-mail : sriramakrishnaprabha@gmail.com



నిర్వాహక సంపాదకులు: **స్వామి జ్ఞానదానంద**
సంపాదకులు: **స్వామి పరిజ్ఞేయానంద**



# సురభి

నేను (సుహాసినీ దేవి) 1915వ సంవత్సరంలో మొట్టమొదటి సారిగా శ్రీశారదా మాతను దర్శించడానికి వెళ్ళాను. అప్పుడు మాతృదేవి పూజ చేస్తున్నారు. ఆమె ముఖంలో దివ్యతేజస్సు భాసిల్లుతోంది.

కాసేపటి తరువాత మాతృదేవి పూజ ముగించి వసారాలోకి వచ్చారు. అప్పుడు నేను ఆమెకు ప్రణమిల్లాను. "ఈమె ఎవరు?" అని మాతృదేవి సరళను అడిగారు. నా తల్లితండ్రుల గురించి చెప్పి, "ఈ మధ్యనే ఈమెకు కవల ఆడపిల్లలు చనిపోయారు. ఎంతో దుఃఖంతో ఉంది"అని చెప్పింది సరళ. కారుణ్యపూరిత స్వరంతో "ఓ నా తల్లీ!" అంటూ మాతృదేవి నా తలను స్పృశించి, ఆశీర్వదించారు. "వీలు దొరికినప్పుడల్లా ఇక్కడకు వస్తూవుండు" అన్నారు. గోలాప్‌మాను పిలిచి ప్రసాదం ఇవ్వమన్నారు. చేతులు కడుక్కొని చరణామృతం పుచ్చుకోమన్నారు. కాసేపయ్యాక మేం బయలుదేరాం. "మళ్ళీ రా అమ్మాయీ! గురుదేవులు నీకు మనశ్శాంతి చేకూరుస్తారు. సదా గురుదేవుల ఉపదేశాలు జ్ఞాపకం ఉంచుకో. మనస్సు దానంతట అదే ప్రశాంతతను పొందడం చూస్తావు" అని చెప్పారు. మాతృదేవి చేసిన ఈ ఉపదేశాన్ని నేను సదా జ్ఞాపకం ఉంచుకొని ఆచరించడం వల్ల నాకు ప్రశాంతత చేకూరింది.

(సుహాసినీ దేవి స్మృతుల నుంచి)

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

డిసెంబరు 2008

వెల : రూ. 10



నవతరానికి స్ఫూర్తినిచ్చే 'యువవాహిని' శీర్షికలు ప్రత్యేకం

ఆధ్యాత్మిక అమృతవాహిని
# శ్రీ రామకృష్ణ ప్రభ



సంపుటం: 65 సంచిక: 12 డిసెంబరు 2008

సంసార సాగరం ఘోరం తర్తుమిచ్ఛతి యో నరః ।
గీతానావం సమాసాద్య పారం యాతి సుఖేన సః ॥

ఘోర సంసార సముద్రాన్ని దాటదలచిన మానవుడు భగవద్గీత అనే నౌక సహాయంతో సులభంగా ఆవలి ఒడ్డును చేరగలడు. ( గీతా మహిమ- వైష్ణవీయతంత్రసారం నుంచి)





## లోపలి పేజీల్లో...































# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు**...... రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**రాజ పోషకులు**............ రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**పోషకులు**................. రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| | దాతపేరు చిరునామా | రూ. |
|---|---|---|
| మహారాజ పోషకులు | : శ్రీమతి పి. ఉషాదేవి (కీ॥శే॥ పి. రామచంద్రరావు జ్ఞాపకార్థం) మలక్‌పేట్, హైదరాబాద్ | 10,000 |
| " " | : శ్రీ జి.ఎన్.బి. వీరాంజనేయులు (కీ॥శే॥ జి.ఎన్.బి. కుసుమకుమారి జ్ఞాపకార్థం) రామంతాపూర్, హైదరాబాద్ | 10,000 |
| రాజ పోషకులు | : శ్రీమతి పి.ఆర్. సరోజ, పద్మారావునగర్, సికింద్రాబాద్ - 500 028 | 5,000 |
| పోషకులు | : శ్రీ ఎమ్. అప్పల స్వామి, రాజాం, శ్రీకాకుళం జిల్లా - 532 127 | 1,000 |

## 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

ప్రియ భక్తులారా!

యువతరంలో ఆత్మవిశ్వాసాన్ని నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకూ, కళాశాలలకూ అందించాలని సంకల్పించాం.

శ్రీరామకృష్ణుల, స్వామి వివేకానందుల సందేశాల ఆవశ్యకతను గురించి సుభాష్ చంద్రబోస్ ఒక సందర్భంలో చెబుతూ, "శీలనిర్మాణానికి రామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం వేరొకటి లేదు" అని అన్నారు.

యువతరానికి 'శ్రీరామకృష్ణ ప్రభ'ను మరింత చేరువ చేయడానికి మీ ఆర్థిక సహాయాన్ని కోరుతున్నాం. ఈ పథకం కింద రూ. 1500 మొత్తాన్ని జీవిత చందా (20 సంవత్సరాలకు) కట్టినట్లయితే మీరు సూచించిన, లేదా మేము ఎంపిక చేసిన ఒక పాఠశాల/కళాశాలకు 20 ఏళ్ళ పాటు పత్రికను మీ పేరున పంపుతాం. చందాదారుని పేరు, విద్యాసంస్థ పేరు పత్రికలో ప్రచురిస్తాం.

మీ చందాను ఎమ్.ఓ. / డి.డి./ చెక్కు రూపంలో Ramakrishna Math, Hyderabad పేరున తీసుకొని, Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029 చిరునామాకు పంపవలెను.

స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతరాన్ని తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి చేయూత అందించగలరని ఆశిస్తున్నాం.

భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ప్రార్థిస్తూ...

భగవత్సేవలో

స్వామి జ్ఞానదానంద

అధ్యక్షులు

ముఖచిత్రం : శ్రీ శారదాదేవి కలకత్తా దక్షిణేశ్వరంలోని నహబత్‌లో నివసిస్తున్నప్పుడు ఓ పున్నమి రాత్రి చంద్రుణ్ణి చూస్తూ, 'భగవంతుడా! చంద్రునిలా నా మనస్సు ఎప్పుడూ నిర్మలంగా ఉండేలా చేయి. చంద్రునిలోనైనా మచ్చలు ఉన్నాయి, నా మనసులో అవి కూడా లేకుండా చేయి' అని ప్రార్థించారు. ఆ సన్నివేశాన్ని చిత్రీకరించిన కళాకారుడు మణియన్ సెల్వమ్, చెన్నై. *(చెన్నై, శ్రీరామకృష్ణ మఠం సౌజన్యంతో)*



| చందా వివరాలు | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా | : | రూ. 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు | : | రూ. 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు | : | రూ. 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు | : | రూ. 1500 | $ 365 |



గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో **Ramakrishna Math, Hyderabad** అని వ్రాయాలి. పంపవలసిన చిరునామా : **Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.**

## లోపలి పేజీల్లో...



### శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా!*

✿ 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకి కుడి భాగంలో మీ చందా గడువు నెల పొందుపరచబడి ఉంది. సకాలంలో సొమ్ము *చెల్లించి, చందా పొడిగించుకొని, 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.*

✿ మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.

✿ మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.

✿ పత్రిక ప్రతీ నెల 26వ తేదీన పోస్ట్ చేయబడుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

*- సర్క్యులేషన్ మేనేజర్*

ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకుడు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు.

– సంపాదకులు




**SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH**

Domalguda, Hyderabad - 500 029. Andhra Pradesh

Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com

# తప్పులెన్నువారు తండోప తండంబు...



మన తగాదాలకూ, వివాదాలకూ, మనఃస్పర్థలకూ అసలు కారణం ఇతరులలోని తప్పులను వెదకే మనస్తత్త్వమే! సాధారణంగా మనం ఇతరుల లోపాలను వెదకుతామే కానీ, మనలోని లోటుపాట్లను తెలుసుకోవడానికి ఎన్నడూ ప్రయత్నించం. అందుకే ఈ లోకం తీరుతెన్నులను యోగి వేమన ఇలా వివరించారు:

**తప్పులెన్నువారు తండోప తండంబు, లుర్వి జనులకెల్ల నుండు తప్పు తప్పులెన్నువారు తమ తప్పులెరుగరు, విశ్వదాభిరామ వినుర వేమ !**

మనిషిగా పుట్టిన ప్రతి ఒక్కరిలోనూ ఏదో ఒక లోపం, బలహీనత ఉండక తప్పదు. అందరి తప్పుల గురించీ ఆలోచించడం వల్ల వారంటే అయిష్టం, అసహనం పెరిగి మనస్సు అశాంతికి గురి అవుతుంది.

Do not judge rashly the sayings or doings of others, neither busy yourself with things not committed to your care, thus it will happen that you will be disturbed. - *Imitation of Christ*

మనకు సంబంధం లేని ఎదుటి వారి విషయాలలో కలుగజేసుకోవడం, ఇతరుల మాటలనూ, వారి పనులనూ తొందరపాటుతో విమర్శించడం వల్ల అనవసరంగా మన జీవితంలోకి శత్రువుల్ని ఆహ్వానించినవాళ్ళం అవుతాం.

మనశ్శాంతిని కాపాడుకోవాలంటే ముందు మనలోని లోపాలను సవరించుకోవడంలో మన మనస్సును నిమగ్నం చేయాలి. అప్పుడు ఇతరుల ప్రవర్తన గురించి పట్టించుకునేంత సమయం మనకు ఉండదు. దానివల్ల మన వ్యక్తిత్వం ఉన్నతంగా మారుతుంది. మన జీవితం ప్రశాంతంగా కొనసాగుతుంది. మనం ఎవరితోనూ మనఃస్పర్థలు లేకుండా, అందరితోనూ సత్సంబంధాలు కలిగి ఆత్మీయతానందాలతో శాంతిగా జీవించాలంటే '**పరుల దోషాలను ఎంచకు, ముందు నీ తప్పులను తెలుసుకో...**' అన్న శ్రీశారదాదేవి శాంతి సందేశమే మనకు శరణ్యం.

**పరుల దోషాలను ఎంచకు :** సమాజంలో అందరితో కలసిమెలసి జీవిస్తున్నప్పుడు ఇతరుల తప్పులనూ, లోపాలనూ పట్టించుకోకుండా ఉండగలమా? మన కళ్ళ ముందే ఎవరైనా తప్పు చేస్తున్నప్పుడు వారిని వారించకుండా ఉండడం ఎంతవరకు సమంజసం? తప్పులను ఎంచితే మనశ్శాంతి కోల్పోతామని చూస్తూ ఊరకోవలసిందేనా? ఇలాంటి ఎన్నో సందేహాలు మనలో కలుగుతాయి. అయితే 'పరుల దోషాలను ఎంచకు' అన్న శ్రీశారదాదేవి మనకిచ్చిన శాంతి సూత్రాన్ని మన నిత్యజీవితంలో ఎలా ఆచరించగలం?

**అభివృద్ధిని ఆకాంక్షించే దోషాన్వేషణ :** శ్రీరామకృష్ణులు తన వద్దకు వచ్చిన భక్తుల, శిష్యులలోని లోపాలను సవరించి ఉండకపోతే స్వామి వివేకానంద, స్వామి బ్రహ్మానంద, బలరామ్ బోస్, గిరీశ్ చంద్రఘోష్, రామచంద్ర దత్తా, మహేంద్రనాథ్ గుప్తా లాంటి ఎంతోమంది శిష్యరత్నాలు ఆదర్శవంతులుగా గుర్తింపు పొందేవారు కాదు. శ్రీరామకృష్ణులు ఇతరుల లోపాలను చూసినప్పటికీ ఆయన మనశ్శాంతికి ఎలాంటి భంగమూ కలుగలేదు. ఎప్పుడూ ప్రశాంతంగా నిశ్చల స్థితిలోనే ఉండేవారు. మరి మనం ఇతరుల తప్పులను చూస్తే మనశ్శాంతిని ఎందుకు కోల్పోతాం? శ్రీరామకృష్ణులు నిస్వార్థ ప్రేమతో తన శిష్యుల శ్రేయస్సునూ, అభివృద్ధినీ ఆకాంక్షించి, వారి లోపాలను సరిచేశారు. కాబట్టి అలాంటి దోషాన్వేషణ ఆయన మనస్సుపై ఎలాంటి ప్రభావమూ చూపలేదు.

కాబట్టి, స్వప్రయోజనం ఇసుమంతైనా లేని దోషాన్వేషణ మనశ్శాంతికి ఎన్నటికీ ఆటంకం కాదు.

**ద్వేషరహిత దోషాన్వేషణ:** ఇతరుల అభివృద్ధిని చూసి ఓర్వలేక అసూయతో ఎప్పుడూ వారిలో తప్పులనే ఎంచే గుణం వినాశ హేతువు. ఎన్ని మంచి గుణాలున్నా, ఎన్ని మంచి పనులు చేసినా అసూయ అనే అసురుడు మనలో ఉన్నంత వరకూ ఎదుటివారిలో లోపాలే కనిపిస్తాయి. అంతేకానీ మంచిని మాత్రం చూడలేం. ప్రపంచమంతా పాండవుల మంచితనాన్ని కొనియాడుతున్నా, దుర్యోధనుడు మాత్రం పాండవుల పట్ల అసూయ కలిగి ఉండడం వల్ల వారిలోని సుగుణాల్ని దర్శించలేకపోయాడు.

**న తథేచ్ఛంతి కల్యాణాన్పరేషాం వేదితుం గుణాన్ ।**
**యథైషాం జ్ఞాతు మిచ్ఛన్తి నైర్గుణ్యం పాప చేతసః ॥**

'దురాత్ములు ఇతరుల దోషాలనే చూస్తారు కానీ మంచితనాన్ని గుర్తించరు. తన తప్పులను తెలుసుకోవడం, ఎదుటి వారిలో మంచి గుణాలను గుర్తించడం ఉత్తముని లక్షణం'.

మనకు ఇష్టమైన వాళ్ళు చేసిన తప్పులు కొండంతవైనా అవి మనకు గోరంతలుగా కనిపిస్తాయి. అదే మనకు నచ్చనివాళ్ళు గోరంత తప్పు చేసినా అది కొండంతగా చూస్తాం. అందువల్ల దోషాన్వేషణ ఎప్పుడూ మమతానురాగాలకూ, అసూయా ద్వేషాలకూ అతీతంగా ఉండాలి.

**నీ తప్పులను తెలుసుకో! :** 'నీ తప్పులను తెలుసుకో' అన్న శారదామాత సందేశం సామాజిక జీవితానికీ, ఆధ్యాత్మిక జీవితానికీ చాలా ఉపయుక్తమైనది. సమాజంలో మనం అందరితో కలసి జీవిస్తున్నప్పుడు మనం ఇతరుల నడవడికను పరిశీలిస్తున్నట్లే, మన ప్రవర్తనను కూడా ఇతరులు పరిశీలిస్తున్నారన్న విషయాన్ని విస్మరించరాదు. As you observe others, so you are also observed by others.

మనం ఇతరులను సరిదిద్దడానికి ప్రయత్నించినప్పుడు ముందు మనలోని లోపాలు ఏమిటో తెలుసుకొని, వాటిని సరిదిద్దుకోవాలి. మనం ధర్మబద్ధంగా జీవించినప్పుడే మన మాటలకు విలువ, సూచనలకు ప్రాధాన్యం ఉంటాయి. కాబట్టి మనం ఇతరులకు చెప్పే ముందు దాన్ని జీవితంలో ఆచరించి చూపించడం చాలా ముఖ్యం.

మనలోని తప్పులను గుర్తించి వాటిని సరిదిద్దుకోవడమే ఒక ఆధ్యాత్మిక సాధన. We blame little things in others and overlook great things in ourselves. మన కంటిలో పెద్ద దూలం ఉంచుకొని, ఎదుటివారి కంటిలో చిన్న నలుసును చూసే స్వభావం నుంచి బయటపడాలి. అందుకు ఆత్మపరిశీలన, ఆత్మవిచారం చాలా అవసరం. మనలోని లోపాలను తెలుసుకొని వాటిని సరిదిద్దుకున్నప్పుడే మన ఆధ్యాత్మిక ప్రగతి సాధ్యం. ఒక వస్తువు ప్రతిబింబం అద్దంలో స్పష్టంగా కనిపించాలంటే ఆ అద్దం పరిశుభ్రంగా ఉండాలి. అలాగే మన మనస్సు అనే అద్దం మలినంతో నిండివుంటే ఎదుటివారు ఎంత ఉత్తములైనా వారి గొప్పతనాన్ని అర్థం చేసుకోలేం. కాబట్టి ముందు మన మనస్సును పరిశుభ్రంగా ఉంచుకోవడానికి ప్రయత్నించాలి.

ఒకసారి శ్రీశారదాదేవి బృందావనంలో రాధారమణుని ఆలయంలో ఇలా ప్రార్థించారు: 'ఓ ప్రభూ! నా మనస్సులోని మాలిన్యాన్ని తొలగించు. నేను ఎన్నడూ పరుల దోషాలను చూడకుండా ఉండేలా అనుగ్రహించు'.

మరోసారి దక్షిణేశ్వరంలో ఓ పున్నమి వెన్నెల రాత్రి చంద్రుణ్ణి చూస్తూ, 'భగవంతుడా! చంద్రునిలా నా మనస్సు ఎప్పుడూ పరిశుద్ధంగా ఉండేలా చేయి. చంద్రునిలోనైనా కొన్ని నల్లని మచ్చలు ఉన్నాయి. కానీ నా మనస్సులో అవి కూడా లేకుండా చేయి' అని భగవంతుణ్ణి ప్రార్థించారు.

మనలో నెలకొని ఉన్న ఆ పరమాత్ముణ్ణి ప్రత్యక్షం చేసుకోవాలంటే మన మనస్సు పరిశుద్ధంగా ఉండాలి. మనస్సును పరిశుద్ధం చేసుకోవడమే ఆధ్యాత్మిక మార్గంలో నిజమైన తపస్సు. అలాంటి తపస్సులో పరమోత్కృష్ట స్థాయికి చేరిన శ్రీశారదాదేవికి ఎప్పుడూ, ఎవరిలోనూ దోషాలు కనిపించేవి కావు. అందుకు నిదర్శనంగా ఆమె జీవితంలో జరిగిన సంఘటనల్లో ఒకటి తెలుసుకుందాం :

ఒకరోజు పనిమనిషి ఏదో తప్పు చేస్తే అందుకు గోలాప్ మా ఆమెను గట్టిగా మందలించింది. పనిమనిషిని కోపగించుకోవడానికి కారణం ఏమిటో గోలాప్ మాను శారదాదేవి అడిగారు. గోలాప్ మా చీకాకుపడుతూ 'మీకు ఇదంతా చెప్పి ఏం ప్రయోజనం? ఇతరులలోని తప్పులు మీకు కనపడవు కదా!' అని శారదాదేవితో అంది.

మనం సామాజిక జీవితంలో అందరితో ఆనందంగా సహజీవనం సాగిస్తూ, ఆధ్యాత్మిక అభివృద్ధి సాధించాలంటే ఇతరుల లోపాలను సరిదిద్దడానికి ప్రయత్నించే ముందు మనలోని దోషాలను నిర్మూలించుకోవాలి. శ్రీశారదాదేవి మనకిచ్చిన ఈ శాంతి సందేశాన్ని ఆచరణాత్మకం చేయడానికి ప్రయత్నిద్దాం. జీవన శాంతి సౌధాలను నిర్మిద్దాం. ❀

# దారిచూపిన దార్శనికుడు

– ఆర్. కృష్ణ

**భా**రతీయ ఆధ్యాత్మిక పరిమళాల్ని ప్రపంచమంతా పరివ్యాపింప చేసిన వారు స్వామి రంగనాథానందజీ మహరాజ్. వారి ప్రవర్తన, ప్రవచనం యావత్తూ అనుష్ఠాన వేదాంత ప్రాతిపదికగానే సాగిపోయింది. ఆధ్యాత్మికత అంటే నిత్యజీవితం నుంచి పలాయనం చిత్తగించడం కాదని, సమాజంలో విలువల పాదుగా ఎదుగుతూ గృహస్థుగానూ సన్న్యాసధర్మాన్ని పాటించాలనీ బోధించారు. శ్రీరామకృష్ణుల ఆశ్రమాన్ని మించిన విశ్వవిద్యాలయం లేదని, ఆ సంఘంలో చేరితే సమస్తజ్ఞానమూ కరతలామలకమేనని నిరూపించిన జ్ఞానవరిష్ఠులు. అందుకే వారు సర్వసంగ పరిత్యాగే కాదు; సర్వరంగ పరిజ్ఞాని కూడా!

**కర్మమర్మం ఎరిగిన కర్మయోగి....**

ఈ ప్రపంచానికి తాను ఎందుకు వచ్చానో స్పష్టంగా తెలుసుకొని జీవితాన్ని భారతీయ ఆధ్మాత్మికతకు అంకితం చేసిన కర్మయోగి స్వామి రంగనాథానందజీ. యుక్తవయసులో శ్రీరామకృష్ణుల సారస్వతం చదవడం దగ్గర నుంచీ, సంఘంలో చేరడం వరకూ స్వామీజీకి ఎలాంటి అస్పష్టతా లేదు; పూర్తి అవగాహనతో, అంకితంభావంతో సన్న్యాస జీవనానికి అంకితమయ్యారు. తన జీవితానికి సంబంధించిన కార్యకారణాలు తెలిసి, తీర్చిదిద్దుకున్న దార్శనికులు స్వామి రంగనాథానందజీ. అందుకే 'నేను ఏ రోజూ జపతపాదుల కోసం తపించలేదు; శ్రీరామకృష్ణుల సంఘంలో చేరిన తొలిక్షణం నుంచీ నేను జపతపాలు ఆచరిస్తున్నట్లే; ఇక్కడి కార్యకలాపాలు, బాధ్యతలు అన్నీ జపతపాదులతో సమానమే' అనేవారు ఆయన.

**విశ్వగురువరేణ్యులు....**

స్వామి రంగనాథానంద భావ ప్రచార పరంపర ఒక్క భారతదేశానికే పరిమితం కాలేదు; దాదాపు యాభై దేశాల ప్రజలు ప్రత్యక్షంగా ఆయన ప్రసంగాలు ఆలకించి ప్రభావితులయ్యారు. పరోక్షంగా ప్రపంచ దేశ వాసులంతా వారి జ్ఞానసాగరంలో ఓలలాడారంటే అతిశయోక్తి కాదు. వారి దృష్టిలో పాలకుల నుంచి పామరుల వరకు అందరూ సమానమే! ఆ కారణంతోనే ఉద్దండ రాజకీయనాయకుల నుంచి ఉన్నతోన్నత అధికార వర్గం వరకూ వారిని గురువుగా భావించి, వారి మార్గాన్ని అనుసరించాలని ఆకాంక్షిస్తున్నారు.

**అఫ్గనిస్థాన్‌లో ఆ మార్గదర్శి....**

హైందవులు తక్కువగా ఉండే అఫ్గనిస్థాన్‌లోనూ స్వామి రంగనాథానందజీ అరుదైన ముద్రను వేశారు. ఒకమారు వారు అక్కడ పర్యటించిన సమయంలో, వారిపై గౌరవంతో అక్కడి సంపన్నులు కొందరు కొంతపైకం నివేదించారు. భారతదేశంలో ఏదైనా సేవాకార్యక్రమాలకు ఉపయోగించమని కోరారు. స్వామీజీ సున్నితంగా తిరస్కరిస్తూ "మీరు ఈ దేశంలో నివశిస్తున్నారు. ఇక్కడ ప్రజల సహకారంతో ఎంతో సంపాదిస్తున్నారు. అది ఈ దేశ ప్రజల కోసం ఉపయోగించడం సముచితం. మనదేశం పరాయిదేశం అనే భేదభావన లేకుండా ఇక్కడ పేద ప్రజలకు ఉచిత వైద్యసహాయం అందించండి. వారిని ఆదుకోవాల్సిన బాధ్యత మీపై కూడా ఉంది. మీరు నాకు ఇచ్చిన ఈ పైకాన్ని మొదటి విరాళంగా భావించి ఒక ఆసుపత్రిని నిర్మించండి" అని వారికి బోధించారట. ఆ స్ఫూర్తితో అక్కడ పెద్ద ఆసుపత్రి ప్రారంభమై, ఎంతోమంది పేద ప్రజలకు వైద్యసహాయం అందిస్తోంది. ఈ సేవాకార్యక్రమాలతో అఫ్గనిస్థాన్ ప్రజలు భారతీయులను విదేశీయులు అనే భేద భావం లేకుండా ప్రేమాభిమానాలతో చూస్తున్నారు. భారతీయులంతా అక్కడి ప్రజలతో మమేకమై స్వేచ్ఛగా జీవిస్తున్నారు. భారతీయులకు తర తమ భేదాలు లేకుండా విశ్వమంతా ఒకటే అనే సమభావనతో మెలగమని స్వామి రంగనాథానందజీ బోధించేవారు. వారి ఆశయాల్ని ఆచరణలో పెట్టడమే వారికి మనం ఇచ్చే ఘన నివాళి. ❁

**(2008 డిసెంబరు 15వ తేదీన స్వామి రంగనాథానందజీ మహరాజ్ శతజయంతి)**

# జయరాంబాటిలో జగత్తారిణి అవతరణం

- స్వామి జ్ఞానదానంద

**శ్యామసుందరీదేవి ఒకరోజు సాయంత్రం బిల్వవృక్షం క్రింద కూర్చొని ఉంది. అప్పుడు జగజ్జనని చిన్న బాలిక రూపంలో ఆ చెట్టు పై నుంచి క్రిందకి దిగివచ్చి తన రెండు చిట్టిచేతులతో ఆమె మెడను చుట్టి 'అమ్మా! మీ ఇంటికి నేను వస్తున్నాను' అని చెప్పి అదృశ్య మైంది. శ్యామసుందరీదేవి జగజ్జనని దివ్యదర్శనం గాంచిన పవిత్ర స్థలంలో నేటికీ ఆ బిల్వవృక్షం పశ్చిమ బెంగాల్, బాంకురా జిల్లాలోని జయరాంబాటి సమీపంలో ఉన్న సిహోర్ గ్రామంలో ఉంది.**

**సిహోర్ శారదా మఠం ఆ పుణ్య స్థలంలో శారదా మండపం నిర్మించి, ఆ బిల్వ వృక్ష సంరక్షణా బాధ్యతలను చేపట్టింది.**

భర్త రామచంద్ర కలకత్తాకు వెళ్ళిన తరువాత శ్యామసుందరీదేవి సిహోర్‌లో తన తండ్రితో పుట్టింట నివసించసాగింది. ఒకనాటి సాయంత్రం బిల్వవృక్షం కింద ఆమె కూర్చుని ఉంది. హఠాత్తుగా కింకిణీ (చిరుగజ్జెల) నాదం వినవచ్చింది. ఎక్కడ నుంచి ఆ నాదం వస్తున్నదోనని చుట్టూ కలయజూసిందామె. అప్పుడు చెట్టుకొమ్మల మధ్య నుండి కిందకు దిగివచ్చింది ఒక అద్భుతమైన బాలిక. ఆ బాలిక సౌందర్యం వర్ణనాతీతం. ఎర్రరంగు పరికిణీ ధరించింది. ఈమె ఎవరై ఉంటుందోనని శ్యామసుందరీదేవి ఆలోచిస్తున్నంతలోనే ఆ బాలిక మెరుపు వేగంతో వచ్చి ఆమె మెడను తన చేతులతో చుట్టివేసి మధుర స్వరంలో, "నేను నీ ఇంటికి వస్తున్నానమ్మా" అని చెప్పింది. శ్యామసుందరీదేవి ఆ మాటలు విని మూర్ఛపోయింది. అక్కడ ఆ స్థితిలో ఎంతసేపు ఉండిపోయిందో తెలియదు. వెతుక్కుంటూ వచ్చిన బంధువులు ఆమెను ఇంటికి తీసుకువెళ్ళారు. కాసేపటికి ఆమె కళ్ళు తెరిచింది. ఆ పాప తన గర్భంలోకి ప్రవేశించిన అనుభూతి ఆమెకు కలిగింది.

రామచంద్ర తిరగి రాగానే శ్యామసుందరి తాను గాంచిన దివ్యదృశ్యం గురించి ఆయనకు చెప్పింది. తాను కన్న కలను ఈ దివ్యదృశ్యంతో రామచంద్ర పోల్చిచూశాడు. జగజ్జనని అనుగ్రహం వలన తమ పూరి గుడిసెలో ఒక దివ్య శిశువు జన్మించబోతున్నది; ఆ దేవి పాదపద్మాలు జయరాంబాటిలో నడయాడబోతున్నాయి అనే విషయం వారికి స్పష్టమయింది. ఆ దివ్య శిశువు రాకకై ఆ దంపతులు నిరీక్షిస్తూ రోజులు గడపసాగారు.

యోగులు హృదయకుహరంలో నెలకొల్పుకొన్న దేవిని తన గర్భమనే గుహలో ధరించిన శ్యామసుందరి అనుభూతి వర్ణించతరమా!



**శ్రీ శారదా మండపం, బిల్వవృక్షం** *(ఫోటో : స్వామి అనుపమానంద)*

'మాసాలలో నేను మార్గశిరం' అని శ్రీకృష్ణుడే శ్లాఘించిన మార్గశిర మాసం వచ్చింది. అందరికీ ఆనందాన్ని పంచి ఇచ్చే కాలమది. కోతలు పూర్తయి కోతల కాలాన జరుపుకొనే ఉత్సవాలు మొదలయ్యాయి. మన పురాణాల ప్రకారం ఆరు నెలలు నిద్రించే దేవతలు మేల్కొనే కాలమది. దినకరుడు తన దక్షిణాయనాన్ని పూర్తిచేసి ఉత్తరాయణంలోకి ప్రవేశించే కాలం అది. కృష్ణపక్ష సప్తమి నాటి శీతాకాలపు సాయంత్రం. అప్పుడప్పుడే చీకట్లు క్రమ్ముకొంటున్నాయి. ఉత్తర నక్షత్రం ఉచ్చ స్థితిలో వున్న ఆ సమయంలో చీకటిని, చలిని చీల్చుకొంటూ రామచంద్ర ఇంట్లో నుండి శంఖానాదం వినవచ్చింది. అదే 1853 డిసెంబరు 22వ తేదీ గురువారం జయరాంబాటిలో జగత్తారిణి శారద వెలసిన శుభదినం. ❁



# శ్రీశారదాదేవీ ధ్యానమ్

– స్వామి అభేదానంద

ధ్యాయేద్హృత్కమల మధ్యే హేమవర్ణాం సుఖాసనామ్ ।
ఆలులాయిత కేశార్ధ వక్షస్థలాభిమండితామ్ ॥ 1

బంగారు శరీర ఛాయ కలిగి, విడివడిన కేశములు ఆమె వక్షస్థలంపై జీరాడుతూ ప్రకాశిస్తుండగా సుఖాసనాశీనురాలైన శారదామాతను హృదయ కమలంలో ధ్యానించాలి.

శ్వేత వస్త్రావృతార్ధాంగాం హేమాలంకార భూషితామ్ ।
స్వక్రోడన్యస్తహస్తాం చ ద్విభుజాం స్థిరలోచనామ్ ॥ 2

తెల్లని చీర ధరించి, బంగారు ఆభరణాలతో అలంకృతయై, రెండు భుజాలు, (పద్మాకారంలో) ఒడిలో ఉన్న అరచేతులు, స్థిరమైన దృష్టితో (ఉన్న శారదామాతను హృదయ కమలంలో ధ్యానించాలి).

ప్రసన్నవదనాం జీవదుఃఖగలిత చేతసామ్ ।
శుభ్ర జ్యోతిర్మయీం దేవీం వరదాం సర్వ మంగళామ్ ॥ 3

ప్రసన్నమైన ముఖంతో, జీవుల బాధలకు చలించిన హృదయంతో, శుభ్రమైన కాంతితో ప్రకాశిస్తూ, వరాలనిచ్చే, సర్వ శుభకరమైన (శారదామాతను హృదయ కమలంలో ధ్యానించాలి).

రామకృష్ణ గతప్రాణాం తన్నామ శ్రవణ ప్రియామ్ ।
తద్భావ రంజితాకారాం విశ్వమాతృ స్వరూపిణీమ్ ॥ 4

శ్రీరామకృష్ణార్పిత అంతరంగంతో, ఆయన నామ శ్రవణాన్ని సదా కాంక్షిస్తూ, ఆయన భావాలకు సాకార రూపమా అన్నట్లున్న జగన్మాత స్వరూపిణియైన (శారదామాతను హృదయ కమలంలో ధ్యానించాలి).

స్నేహమయీం శివాం శాంతాం భక్తి ముక్తి ప్రదాయినీమ్ ।
సర్వ జీవత్రాణ కర్త్రీం శారదాం జ్ఞానదాయినీమ్ ॥ 5

స్నేహమూర్తి, మంగళదాయి, శాంతమూర్తి, భక్తి ముక్తి ప్రదాయిని, సకలజీవ రక్షకురాలు, జ్ఞాన ప్రదాయిని అయిన శారదామాతను (సాధకుడు సదా తన హృదయ కమలంలో ధ్యానించాలి). ❁

అనువాదం : డి. పార్థసారథి ప్రసాద్



# ఇందరు దేవతలెందుకు?

– కస్తూరి మురళీకృష్ణ

ఛాందోగ్యోపనిషత్తులోని కథ ఇది.

ఒకమారు ప్రాచీనశాల, సత్యయజ్ఞ, ఇంద్రద్యుమ్నుడు, బుదిల, జానలనే అయిదుగురు వేద పండితుల నడుమ చర్చ జరిగింది. 'ఆత్మ అంటే ఏమిటి?', 'బ్రహ్మ అంటే ఏమిటి?' అన్న విషయంలో వాదోపవాదాలు జరిగాయి. చివరికి వారు తమ సమస్యను అరుణమహర్షి సుతుడు ఉద్దాలకుడి ముందు ఉంచారు. వీరి సమస్యను పరిష్కరించడం తన వల్ల కాదని గ్రహించిన ఉద్దాలకుడు, కేకయ సుతుడు అశ్వపతి వీరి సమస్యను పరిష్కరించగలడని సూచించాడు. వీరంతా అశ్వపతి దగ్గరకు పయనమయ్యారు.

వారి సమస్యను విన్నాడు అశ్వపతి. కొన్ని ప్రశ్నలను అడిగాడు. 'మీరు ఏ ఆత్మను ధ్యానిస్తారు?' అని వారిని అడిగాడు. దానికి సమాధానంగా, 'దివి'ని ఆత్మగా భావిస్తానని శాల అన్నాడు. 'సూర్యుడి'ని ఆత్మగా ధ్యానిస్తానని సత్యయజ్ఞుడన్నాడు. 'వాయువు'నే ఆత్మలా ధ్యానిస్తానని ఇంద్రద్యుమ్నుడన్నాడు. 'ఆకాశమే నా ఆత్మ' అని జానమహర్షి అన్నాడు. 'జలం నా ఆత్మ' అని బుదిల మహర్షి సమాధానమిచ్చాడు. 'భూమి నా ఆత్మ' అని ఉద్దాలకుడన్నాడు. వీరందరూ పరబ్రహ్మను సంపూర్ణంగా ధ్యానించడం లేదని వివరించాడు అశ్వపతి. ఈ అన్నింటినీ కలిపి ధ్యానించడం వల్లనే పరమాత్మ స్వరూపం గోచరమవుతుందని వివరించాడు.

భారతీయ ధర్మంలోని గొప్పతనం ఇక్కడే స్పష్టమవుతుంది. దివి, సూర్యుడు, వాయువు, ఆకాశం, జలం, భూమి వంటివన్నీ దేనికవే ప్రత్యేక శక్తులు. కానీ అన్నీ ఒకదానిపై ఒకటి ఆధారపడి ఉన్నాయి. వీటన్నిటినీ సృజించిన శక్తి మరొకటి ఉంది. వీటిని ధ్యానించడం ద్వారా వ్యక్తి అనంతశక్తిని అర్థం చేసుకోవచ్చు. చేరుకోవచ్చు.

అయితే, ఇక్కడ మనకో సందేహం వస్తుంది. మరి ఇవన్నీ ఒకే అనంత శక్తి స్వరూపాలయితే ఏ శక్తిని ధ్యానించినా, అనంతశక్తిని ధ్యానించినట్లే కదా! మరి మన దేవీ దేవతలకు ఇన్ని రూపాలెందుకు? అన్న ప్రశ్న జనిస్తుంది. దీనికి కూడా సమాధానం ఉపనిషత్తులలో లభిస్తుంది.

బృహదారణ్యకోపనిషత్తులో ప్రపంచ స్వరూపాన్ని వివరిస్తూ యాజ్ఞవల్క్యుడు, ఈ ప్రపంచంలో ఏ విషయాన్నయినా గుర్తించాలంటే దానికి పేరుండాలి, రూపం ఉండాలి, గుణం ఉండాలి అంటాడు. అంటే ఈ మూడు లక్షణాలు లేని దాన్ని మానవ మేధ గ్రహించలేదన్నమాట.

'వినాయకుడు' అనగానే కళ్ళ ముందు గణపతి రూపం మెదులుతుంది. విఘ్నాలను తొలగిస్తాడన్న భావన కలుగుతుంది. వెంటనే మనస్సు ఆ నామరూపాలపై కేంద్రీకృతమవుతుంది. అలాగే 'సరస్వతీదేవి' అనగానే కళ్ళ ముందు శ్వేత వస్త్రం ధరించి, వీణానాదంలో సర్వం మరచిన సరస్వతీదేవి దివ్యరూపం కదులుతుంది. ఆమె వాగ్దేవి అనీ, చదువుల తల్లి అనీ మనకు తెలుసు. అలా ఆ నామంతో ఆ రూపాన్ని, ఆ లక్షణాల కోసం ధ్యానించడం సులభమవుతుంది. ఇదీ భారతీయ ధర్మంలో దేవతలు, దేవతలకు రూపాలు, గుణాలు ఉండడం వెనుక పరమార్థం.

అయితే మనం ఏ రూపాన్ని ధ్యానించినా, ఏ గుణాన్ని ధ్యానించినా, మనం అనంత శక్తికి ప్రతీక అయిన నిరాకార, నిర్గుణ, పరబ్రహ్మను ధ్యానిస్తున్నట్లే! కానీ నిరాకార, నిర్గుణం అవడం తోటే 'అది' మన మేధస్సుకు అందదు. అందుకని సకారాత్మకమైన, సగుణ దైవోపాసన జరపాలి. ఈ సకార, సగుణ దైవోపాసన ఒక స్థాయికి చేరే సరికి నిరాకార నిర్గుణ పరబ్రహ్మ ధ్యానంగా ఎదుగుతుంది. అందుకే ఎలా నదిలోని నీరు చివరికి సముద్రంలో కలుస్తుందో, అలాగే మనం ఏ దైవాన్ని పూజించినా, చివరకు అన్నీ పరబ్రహ్మకే చెందుతాయి అంటుంది ధర్మం. కాబట్టి విగ్రహారాధనలోనూ, బహు దేవతారాధనలోనూ ఎలాంటి దోషమూ లేదు. దానికి మనం సిగ్గు పడాల్సిన పని లేదు. ఇతరుల హేళనలను పట్టించు కోవాల్సిన అవసరం అసలే లేదు. ❀



# పరమేశ్వరుని పరిరక్షణలో ...

## స్వామి జపానంద స్వీయ అనుభవాలు -18

(గత సంచిక తరువాయి...)

## దైవం బాలుర రూపంలో...

"ఇదంతా అటవీ ప్రాంతం. ముళ్ళ పొదలతో నిండి ఉంది. మీ కాళ్ళకు జోళ్ళులేవు. మీరు ఇటు ఎందుకు వచ్చారు? మీరు ఎక్కడికి వెళ్ళాలి?" ఒక అపరిచిత సన్న్యాసి అటువైపునకు రావడం చూసి, అక్కడే గొర్రెలు, మేకలను కాస్తున్న ఇద్దరు బాలురు అడిగారు. వాళ్ళిద్దరూ అన్నదమ్ములు. మహారాష్ట్రలో పండరీపురం గొప్ప పుణ్యక్షేత్రం. జపానందజీ పండరీపురం నుంచి షోలాపూర్ వెళ్తున్నారు.

అది వర్షాకాలం. నదిలో నీరు పొంగి ఆ చుట్టుపక్కల ప్రాంతమంతా జలమయం అయిపోయింది. బాట కనిపించడం లేదు. వేరే దారేదీ లేక పొలాలలో నుంచి నడుస్తున్నారు. ఆయన అలా చాలా దూరం నడిచాక ఒక కాలువ వచ్చింది. అందులో నడుము లోతు నీళ్ళు ప్రవహిస్తున్నాయి. అది దాటి ఆ అటవీ ప్రాంతానికి చేరుకున్నారు. అడవిలో తోవ తెలియడం లేదు. ఎక్కడైనా కాలిబాట కనిపిస్తున్నా, అది అంతా ముళ్ళతో నిండి ఉంది. ఎక్కడ కాలు పెడదామన్నా ముళ్ళే!

ఎటు వెళ్ళడం, ఏమిటి చేయడం అని ఆలోచిస్తూ ఉంటే ఆ అన్నదమ్ముల మాటలు వినిపించాయి. వాళ్ళు ముసల్మాన్లు. కాళ్ళకు మందంగా ఉన్న జోళ్ళు వేసుకున్నారు. సాధువు వాళ్ళతో "నేను షోలాపూర్ వెళ్ళాలి. దగ్గరలో ఏదయినా గ్రామం ఉంటే చెప్పండి. అంతటా నీళ్ళు నిండి ఉండడం వల్ల దోవ తెలియక ఇటు వచ్చాను" అన్నారు.

"ఇక్కడ నుంచి ఒక మైలు దూరంలో ఒక గ్రామం ఉంది. కానీ మీరు జోళ్ళు వేసుకోలేదు. ఎలా వెళతారు?" అని అడిగారు. తరువాత వాళ్ళిద్దరూ అక్కడే ఉన్న ఖర్జూరం చెట్ల ఆకులు కోసి, చీపురులా కట్టి సాధువును పిలిచి, "రండి! ఇప్పుడు మీరు వెళ్ళగలరు" అన్నారు. ఒకరు ముళ్ళను పక్కకు తోస్తూ ఉంటే సాధువు అతని వెనకే నడిచి వచ్చారు. ఆ విధంగా అడవి దాటి ఒక పెద్ద మైదానం దగ్గరకు చేరుకున్నారు. అప్పుడు ఆ చీపురును సన్న్యాసికి ఇచ్చి "దీనితో ముళ్ళను పక్కకు నెడుతూ వెళ్ళండి. మైదానం దాటిన తరువాత దూరంగా ఉన్న ఆ కొండ దగ్గరలో గ్రామం ఉంది" అని చెప్పి వాళ్ళు వెనక్కి వెళ్ళి పోయారు. సాధువు వాళ్ళకి కృతజ్ఞతలు చెప్పబోయారు. కానీ, వాళ్ళు మాత్రం "ఇది మా ధర్మం. మేము ఏం చేసామనీ" అన్నారు. ఆ చిన్న మాటలోనే వారి ఔన్నత్యం తెలుస్తోంది.

సాధువు నెమ్మదిగా నడుస్తూ గ్రామం సమీపించారు. అక్కడ ఆయనకు పదమూడు పధ్నాలుగు సంవత్సరాల బాలుడు కనిపించాడు. అతను వారిని చూసి భక్తి పూర్వకంగా నమస్కరించి, "మీరు ఇలా ఎక్కడ నుంచి వస్తున్నారు? ఇదంతా ముళ్ళ చెట్లతో నిండి ఉన్న అడవి. షోలాపూర్ వెళ్ళే మార్గం గ్రామానికి అటువైపు ఉంది" అన్నాడు.

ఆ బాలుడికి సాధువు తన కథ అంతా చెప్పారు. అదంతా విని "అయితే ఈ రోజంతా మీరు ఏమీ తినకుండానే గడిపారన్న మాట" అన్నాడు. అలా అన్న ఆ బాలుడు, తన చేతిలో రూమాలుతో కప్పి ఉన్న పళ్ళెం చూపించి, "ఇందులో అన్నం, కూర ఉన్నాయి. ఇది ఖ్వాజా సాహెబ్ పీర్‌కి సమర్పించిన అన్నం మీరు హిందూ సన్న్యాసి కదా! మీరు ఇది తినరు. కానీ పళ్ళు, పాలు తీసుకుంటారు కదా!" అని అడిగాడు.

సాధువు తీసుకుంటానని అనడంతో, ఆ బాలుడు ఉత్సాహంగా "మీ కోసం అరటి పళ్ళు, మేక పాలూ తీసుకొస్తాను. ఇంతకీ మీ బస ఎక్కడ?" అన్నాడు.

"ఎక్కడ జాగా దొరికితే అక్కడ ఉండిపోతాను" అన్నారు సన్న్యాసి. "అలాగయితే మసీదులో ఉండండి. మా తాతగారు అందులో మౌలా. నేను ఆయనకు చెబుతాను. బాగుంటుంది. రాత్రి చక్కగా మనం కబుర్లు చెప్పుకోవచ్చు" అన్నాడు.

అలా మాట్లాడుకుంటూనే వాళ్ళిద్దరూ గ్రామంలోకి ప్రవేశించారు. మసీదు అరుగు మీద సాధువు కూర్చున్నారు. ఆ బాలుడు లోనికి వెళ్ళి, వాళ్ళ తాతగారైన మౌలా గారిని పిలుచుకుని వచ్చాడు. వృద్ధ మౌలా ఆదరంగా సన్న్యాసిని పలకరించారు. "మహారాజ్! ఈ గ్రామం మరాఠీ వాళ్ళది. మా ముసల్మాన్ కుటుంబాలు నాలుగయిదు మాత్రం ఉన్నాయి. మీరు ఒక సాధువు. మీ దృష్టిలో హిందూ ముస్లిమ్ అందరూ ఒక్కటే. కానీ హిందూ సన్న్యాసిని మసీదులో ఉంచుకున్నారని మరాఠీ వాళ్ళకు తెలిస్తే కోపం తెచ్చుకుంటారు. గొడవ కూడా చేస్తారు. అందుకని మీరు కాలే గారి హనుమాన్ మండపంలో ఉండండి. నా మనుమడు మిమ్మల్ని అక్కడికి తీసుకెళతాడు. అక్కడ ఏ ఏర్పాటూ జరగకపోతే మీ కోసం మసీదులో జాగా ఎలాగూ ఉంటుంది" అని ఆ మౌలా అన్నారు. ఇది ఆ గ్రామంలో ఉన్న రాజనీతి. ఇదే తెలివైన పని కూడా!

కాలేగారి హనుమాన్ మండపం అనబడే అతిథి గృహంలో శుభ్రత లేనే లేదు. అక్కడ మేకలు, గొర్రెలు, గాడిదలు హాయిగా విహరిస్తున్నాయి, అవి అక్కడే కాలకృత్యాలు తీర్చు కుంటున్నాయి. అదంతా ఆ బాలుడు ఊడ్చి, శుభ్రం చేశాడు. నీళ్ళు పోసి అంతా బాగా కడిగి, స్వామి జపానంద కోసం కంబళి పరిచాడు. ఎదురుగా ఉన్న బావి నుండి నీళ్ళు తోడుకొని, కాళ్ళు చేతులూ ముఖం కడుగుకొని వచ్చి కూర్చున్నారు స్వామి.

ఆ బాలుడు వెళ్ళి గ్రామాధికారి అయిన పటేల్‌ను పిలుచుకుని వచ్చాడు. పటేల్‌తో కలసి మరొక ఇద్దరు పెద్ద మనుషులు కూడా వచ్చారు. ఆ బాలుడే వాళ్ళు సాధువుతో మాట్లాడడానికి దుబాసీ పని కూడా చేశాడు. పటేల్ అడిగిన ప్రశ్నలకు స్వామి హిందీలో జవాబు చెబు తున్నారు. అదంతా అతను పటేల్‌కి మరాఠీలో చెప్పాడు. పటేల్ మరాఠీలో మాట్లాడిన మాటలను స్వామికి హిందీలో చెప్పాడు. ఆ విధంగా వాళ్ళు చాలా సేపు మాట్లాడుకున్నారు.

సాధువు భోజనం ఏర్పాట్లు చూడడానికి పటేల్ వెళ్ళాడు. రాత్రి అయ్యాక సన్యాసి ఆ బాలుణ్ణి ఇంటికి వెళ్ళి మళ్ళీ ఉదయం కనిపించమని చెప్పారు. కానీ ఆ బాలుడు "నేను భోజనం చేసి మళ్ళీ వస్తాను. మీరు అలసిపోయి ఉన్నారు. నేను వేడి నూనె తెచ్చి మీ కాళ్ళకు రాస్తాను. కాళ్ళకు ముళ్ళు గుచ్చుకుని నొప్పిగా ఉంటుంది. వేడి నూనె రాస్తే నొప్పి పోతుంది. నేను మా తాతగారికి చెప్పి వస్తాను. పటేల్ ఎప్పటికి పిలుస్తారో తెలియదు. మీరు అక్కడకు వెళ్ళినప్పుడు మీ కంబళి, కమండలం ఇక్కడ వదలవద్దు. ఎవరైనా ఎత్తుకుపోతే మీకు ఇబ్బంది కలుగుతుంది. మీరు తిరిగి వచ్చే దాకా నేను కాపలా ఉంటాను" అని చెప్పి ఆ బాలుడు ఇంటికి వెళ్ళాడు.

ఒక గంట సేపటికి వేడి వేడి నూనె తీసుకుని వచ్చాడు. అలసిపోయి ఉన్న సన్యాసికి చిన్న కునుకు పట్టింది. అతను నెమ్మదిగా వెచ్చటి నూనె కాళ్ళకు రాస్తూ ఉంటే మెలకువ వచ్చింది. అది చూసి అతను "మీరు పడుకోండి. నేను నూనె రాసి మర్దన చేస్తాను" అన్నాడు. సన్యాసికి మళ్ళీ నిద్ర పట్టింది.

సుమారు రాత్రి పది గంటలవుతూ ఉండగా సాధువును పిలవడానికి పటేల్ వచ్చాడు. సన్యాసి పటేల్ ఇంటి నుండి తిరిగి వచ్చేసరికి రాత్రి పదకొండు అయింది. అయినా ఆ బాలుడు మేలుకొనే ఉన్నాడు. అప్పుడే వాళ్ళ తాతగారు అతణ్ణి పిలవడానికి వచ్చారు. స్వామి ఆ బాలుడు చేసిన సేవను చాలా పొగిడారు. అతణ్ణి ఆశీర్వదించి, తాతగారితో ఇంటికి వెళ్ళమని చెప్పారు. వెళుతూ వెళుతూ ఆ బాలుడు "పొద్దుటే మీరు వెళ్ళిపోకండి. నేను పాలు, అరటి పళ్ళు తీసుకుని వస్తాను. అవి తిని వెళ్ళాలి" అని మరీ మరీ చెప్పి వెళ్ళాడు. ఉదయాన్నే సన్యాసి ఇంకా తయారవకుండానే బాలుడు పాలు, పళ్ళు తీసుకొని వచ్చాడు. సన్యాసి వెళ్ళిపోతూ ఉంటే చాలా దూరం వరకూ సాగనంపాడు. ❀

**(మిగతా వచ్చే సంచికలో...)**

**అనువాదం : శ్రీమతి జి.ఎస్. లక్ష్మి**

## పండుగలు - పర్వదినాలు

### డిసెంబరు- 2008

| | | | |
|---|---|---|---|
| 07 | ఆదివారం | : | స్వామి ప్రేమానంద జయంతి |
| 09 | మంగళవారం | : | ఏకాదశి |
| 18 | గురువారం | : | దివ్యజనని శ్రీ శారదా దేవి జయంతి |
| 23 | మంగళవారం | : | ఏకాదశి, స్వామి శివానంద జయంతి |
| 24 | బుధవారం | : | క్రిస్‌మస్ ఈవ్ (సాయంత్రం ఆరతి తర్వాత) |

### జనవరి- 2009

| | | | |
|---|---|---|---|
| 01 | గురువారం | : | కల్పతరు దినోత్సవము |
| 02 | శుక్రవారం | : | స్వామి శారదానంద జయంతి |
| 07 | బుధవారం | : | వైకుంఠ ఏకాదశి |
| 10 | శనివారం | : | స్వామి తురీయానంద జయంతి |
| 12 | సోమవారం | : | జాతీయ యువజన దినోత్సవం |
| 14 | బుధవారం | : | సంక్రాంతి |
| 17 | శనివారం | : | స్వామి వివేకానంద జయంతి |
| 28 | బుధవారం | : | స్వామి బ్రహ్మానంద జయంతి |
| 30 | శుక్రవారం | : | స్వామి త్రిగుణాతీతానంద జయంతి |

# పరిప్రశ్న

**- స్వామి సుకృతానంద**

యస్. రామారావు, హైదరాబాద్

**? : 1. మంత్ర పుష్పం, 'నారాయణ ప్రశ్నలో హిరణ్యాయనమః హిరణ్యలింగాయనమః సువర్ణాయనమః, సువర్ణలింగాయనమః ' అని ఉంది. హిరణ్యం అన్నా, సువర్ణ అన్నా బంగారమే కదా! పై వర్ణనలో భేదం వివరించండి.**

**2. వరాహ నారసింహావతారాల్ని కలిసి చెబుతుంటారు ఎందుకు?**

✍: 1. పరమేశ్వరుడైన శివుడు పరబ్రహ్మమే. ఆయనే పంచ భుతాల్లో, అష్ట దిక్కుల్లో, అష్టధాతువుల్లో అంతటా ఉన్నాడు. మొదట హిరణ్యాయ అంటే సర్వాత్మ స్వరూపుడు, హిరణ్య గర్భుడని; హిరణ్యలింగాయ అంటే బంగారు లింగరూపుడని. సువర్ణాయనమః అత్యంత కాంతి గలవాడు. సువర్ణలింగాయ అంటే వెండి లింగ రూపుడని. కైలాసపతి కైలాసంలో వెండి కొండ మీద ఉంటాడు. కైలాసగిరి ఉదయం సూర్యరశ్మి పడినప్పుడు కొన్ని సెకన్ల పాటు బంగారు రంగులో ఉంటుంది. పరమేశ్వరుని ప్రతీక అటువంటిది.

2. వారాహ, నారసింహులు హిరణ్యాక్ష హిరణ్య కశిపులను నిర్జించడానికి అవతరించిన విష్ణుమూర్తి సద్యోజాత మూర్తులు. భూదేవి ప్రార్థనతో మహా విష్ణువు అప్పటికప్పుడు వారాహ రూపం ధరించాడు. ప్రహ్లాదవరదునిగా శ్రీపతి నారసింహ రూపం ధరించడం వల్ల వరాహ నారసింహ అవతారాలని కలిపి చెబుతారు.

యం. కృష్ణ, చిత్తూరు.

**? : సనాతన ధర్మానికి సంబంధించిన దేవతల సంఘటనలన్నీ భారతదేశంలోనే జరిగినట్లు ఉంది. దైవం సకల లోక వ్యాపి కదా? ఇతర దేశాల్లో మన దేవతల చరిత్రలు లేవే. వివరించ ప్రార్థన?**

✍: పరబ్రహ్మ విశ్వ సృష్టికర్త. ఆయా దేశాల్లో అవసరాన్ని బట్టి ఆవిర్భవిస్తాడు. కృష్ణభగవానుడు గీతలో : 'యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి... ఎప్పుడైతే అధర్మం ప్రబలి ధర్మం క్షీణిస్తుందో అప్పుడు నేను ఆవిర్భవిస్తాను' అని తెలిపాడు. విశ్వ సాహిత్యంలో వేదాలు అత్యంత ప్రాచీనమని ఆధునిక పాశ్చాత్య తత్త్వ వేత్తలు అంగీకరించారు. మన దేవతల పేర్లు, సంఘటనలు ఇతర ఖండాల్లో లేకపోవచ్చు. అలాగే ఐరోపా ఇతర ఖండాల్లోని యూదులు, క్రైస్తవులు, మహ్మదీయ ప్రవక్తల పేర్లు ఇక్కడ తెలియకపోవచ్చు. అంత మాత్రాన, దేవీ దేవతల పేర్లు విశ్వజనీనం కాలేదనే శంక ఉండరాదు.

భగవంతుని అనుగ్రహం అపారం. అనేక జీవనదులూ, భాషలూ, ఆచార వ్యవహారాలూ ఉన్న భారతదేశం పుణ్యభూమి, కర్మభూమి, జ్ఞాన భూమి. ఈ దేశధూళి కూడా అత్యంత పవిత్రమైనదని స్వామి వివేకానందులు అనుభవంతో చెప్పారు. ప్రపంచంలో ఆధ్యాత్మిక సంపద అధిక శాతం భారత దేశంలోనే ఉంది. మహర్షుల సంతానమైన భారతీయులు వారి ఆధ్యాత్మిక సంపదకు వారసులయ్యారు. మన మేధస్సు ఉత్కృష్టమైనది. సరస్వతీ గంగా పరీవాహకం, హిమాలయాలు, దక్షిణాన గోదావరి, కృష్ణాది జీవనదులు, వింధ్య పర్వతాలు, నర్మదా తీరాలు తపో భూములు. ఎంతటి త్యాగానికైన వెరవని జాతి మనది. ఈ జాతిపై సర్వ దేవీ దేవతల కృప ఉంది.

జి. కాంతయ్య, హుజూర్‌నగర్

**? : పరా విద్య- అపరావిద్యల గురించి తెలుప మనవి?**

✍: విద్యల్ని రెండుగా విభజించారు. అపరావిద్య లౌకికం. పరావిద్య ఆత్మవిద్య. ఛాందోగ్యోపనిషత్తులో శ్రీ నారద మహర్షి అపరావిద్యలను అభ్యసించి మనశ్శాంతి పొందలేక పరావిద్య (ఉన్నత విద్య) కోసం సనత్కుమారుని వద్దకు వెళ్ళి తనకు ఆత్మజ్ఞానం ప్రసాదించే పరావిద్యను బోధించమని ప్రార్థించాడు. అనంత ఆనందాన్నిచ్చే మోక్ష విద్యను అభ్యసించి పరమశాంతిని పొందాడని ఛాందో గ్యోపనిషత్తు తెలుపుతుంది. అపరావిద్యలో భగవత్ సాక్షాత్కారానికి భిన్నమైన అన్ని విద్యలు వస్తాయి. మిగతా విద్యల వల్ల శాశ్వత శాంతి లభించదని అర్థం. ❀

# ప్రపంచానికి ఆధ్యాత్మిక మార్గదర్శి భారతదేశమే!

భారతీయులు కొన్ని యుగాలుగా శ్రమపడి సంరక్షించుకొన్న అమూల్య విలువలను ఈ పాశ్చాత్య ప్రవృత్తి అనే ప్రభంజనం మొత్తం రూపుమాపేయగల ప్రమాదం లేకపోలేదు. నిజంగానే పాశ్చాత్య నాగరకత ఒక సుడిగుండం లాంటిది. దానిలో చిక్కుకొని మన భారతదేశం భౌతిక సుఖాల వలయం నుంచి బయటపడలేక, తన నిజ సంస్కృతిని విడనాడే అవకాశం కూడా ఉంది. మనకు అసాధ్యమైన విదేశీయ జీవిత విధానాలను అనుకరించే యత్నంలో మన ప్రాచీన సత్సంప్రదాయాలనూ, ఆదర్శాలనూ పోగొట్టుకొని, మనకు అత్యంత ప్రీతికరమైన విషయాలను సైతం త్యాగం చేసే ప్రమాదం పొంచి ఉంది.

ఈ విపత్తుల నుంచి మనల్ని మనం రక్షించుకోవాలంటే మన విలువల్ని, మన సంప్రదాయ సంపదల్ని అంచనా వేసుకొని, సామాన్య ప్రజలతో సహా భారతీయులందరూ జాగరూకతతో మెలగాలి. ఒక ప్రక్కన మన ప్రాచీన సంపదను సంరక్షించుకుంటూ, విదేశీయమైన, క్రాంతి పరమైన విజ్ఞాన వీచికలను ఆహ్వానించాల్సి ఉంటుంది. ప్రపంచం నలుమూలల నుండీ ప్రసరించే కాంతి కిరణాల్ని మన శక్తియుక్తులతో స్వాగతించాలి. వాటిలో దుర్భరమైనవి, దోషపూరితమైనవి వాటంతట అవే నశిస్తాయి. పటిష్ఠమైనవి, ప్రయోజన కరమైనవి, నిత్యమైనవి మాత్రం సజీవంగా, శాశ్వతంగా నిలుస్తాయి.



నిగూఢమైన మన వేదాంత రహస్యాల్ని పశ్చిమ దేశాలకు బోధిస్తే ఆ జాతుల ఆదరాభిమానాల్ని మనం పొందవచ్చు. మన దేశీయులు ఆధ్యాత్మిక విషయాలను గురించి పాశ్చాత్యుల పాదాల వద్ద కూర్చొని నేర్చుకోవాల్సి వచ్చిననాడు మన జాతి పతనం చెందడం, మన జాతీయత శాశ్వతంగా విచ్ఛిన్నం కావడం తథ్యం. మన వేదాంత విషయ పరిజ్ఞానాన్నీ, మత ధర్మాల్నీ పాశ్చాత్య దేశాల్లో విస్తారంగా ప్రచారం చేయడం ద్వారా మన దేశం, ఆ దేశాలు కూడా అధికంగా లబ్ధి పొందుతాయి.

బాహ్య ప్రకృతిని లోబరచుకునే అంశంలో భారతదేశం ఐరోపా దేశాలను అనుసరించాలి. ఆంతరంగిక ప్రకృతిపై విజయం సాధించాలంటే ఐరోపా దేశస్థులు భారతీయులను అనుకరించాలి. ఆ స్థితిలో హిందువులనీ, యూరోపియన్లనీ విడి విడి జాతులు ఉండవు. బాహ్యప్రకృతినీ, ఆంతరంగిక ప్రకృతినీ జయించిన ఆదర్శవంతమైన మానవజాతి ఒక్కటే వరిఢవిల్లగలదు. మానవతలోని ఒక పార్శ్వాన్ని మనం వృద్ధి చేస్తే, రెండవ పార్శ్వాన్ని వారు పెంపొందించారు. ఈ రెండు పార్శ్వాల కలయికే మనం అభిలషించవలసిన గమ్యం. ❀



# దేవీ వైభవం

ప్రవచనం: శ్రీ సామవేదం షణ్ముఖశర్మ　　విలేఖనం: శ్రీమతి ఎన్. శేషు

(గత సంచిక తరువాయి)

**ధృత పాశాంకుశ పుష్పబాణ చాపాం అణిమాది ఘిరావృతాం మయూఖై ః....** అమ్మ నుండి వచ్చే కాంతి కిరణాల సమూహంలో ఒక్కొక్క కిరణంలో ఒక్కొక్క శక్తి ఉన్నదట. (అదే అణిమాది ఘిరావృతాం మయూఖైః) అవి అనంత కోటి శక్తులు. ఆ మయూఖాలతో ప్రపంచమంతా నింపింది అమ్మ. ఆ కిరణ శక్తులే ఈ జగమంతా నిండి ఉన్నాయి. అలా కిరణాలు వెదజల్లుతున్న స్వరూపంలో నాలుగు చేతులూ, చంద్రలేఖ ప్రకాశిస్తూ ఉన్నాయి. మనం నిత్యం చదువుతాం కానీ ఎప్పుడైనా ధ్యానం చేస్తామా? ఏమిటీ స్వరూపం అని ప్రశ్నిస్తున్నామా? అది జరిగితేనే సిద్ధి.

ఆర్తులమై భగవంతుణ్ణి ఆశ్రయించడం ఒక అవస్థ; అర్థార్థులమై ఆశ్రయించడం రెండో అవస్థ. జిజ్ఞాసులమై ఆశ్రయించడం మూడో అవస్థ. జ్ఞానులమై తరించడం నాలుగో అవస్థ. ఎక్కడా ఆగిపోకూడదు, ఒక్కొక్కటీ దాటి వెళ్ళాలి. ఆర్తులుగా అమ్మను ఆశ్రయించాలని బుద్ధి పుట్టడానికి కూడా పూర్వజన్మ పుణ్యం ఉండాలి. అందుకే కృష్ణ పరమాత్మ–

"చతుర్విధా భజన్తే మాం జనాః సుకృతినోఽ ర్జున
ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ" అన్నాడు.

ఆర్తి అందరికీ ఉంటుంది, ఆర్తి అంటే పీడ. ఆర్తిలో కూడా అమ్మ గుర్తుకు రావాలంటే అదృష్టం ఉండాలి. అందుకు "సుకృతినః" అన్నాడు కృష్ణ పరమాత్మ. పుణ్యం ఉంటే గానీ ఆర్తిలోనైనా మనం అమ్మను స్మరించం. ముందు అమ్మను స్మరించాలి. ఆర్తి తరువాత వచ్చింది అర్థార్థి. మనం శ్రద్ధగా చెయ్యగా చెయ్యగా అసలు దానిలో ఏముందో తెలుసు కోవాలని బుద్ధి పుడుతుంది. అదే జిజ్ఞాసు లక్షణం.

హిందువులు ఆరాధించే ప్రతి విగ్రహం ఒక తత్త్వానికి ఆధారం. ప్రతీ విగ్రహం ఒక తత్త్వాన్ని చెబుతుంది. అమ్మ వారి విగ్రహం ప్రతి వారినీ ఆకర్షిస్తుంది. "అమ్మ నిర్గుణ స్వరూపిణి, నీలో కూడా ఉంది" అంటే అర్థం కాదు. అమ్మ రూపం గురించి చెప్పుకుంటే ఉత్సాహం వస్తుంది. కానీ అమ్మ రూపం కూడా ఒక తత్త్వాన్నే చెబుతుంది. అందుకు దేవీవైభవం అన్నది నాలుగు అంశాల మీద వెళుతూ ఉంటుంది. దేవీరూప వైభవం, దేవీ నామవైభవం, దేవీ లీలావైభవం, దేవీ తత్త్వ వైభవం.

ఇప్పుడు లలితామహాత్రిపురసుందరీ రూపాన్ని చెప్పు కుందాం. ఈ రూపం అన్నిటి కన్నా గొప్పది. గొప్పదైన ఆత్మ విద్యను తెలియజేసే రూపం ఇది. శ్రీరామకృష్ణ పరమహంస కాళీ ఉపాసకులు. కాళీ అన్నా ఈ తల్లే. అమ్మ వారికి సంబంధించినవి పది విద్యలున్నాయి. కాళీ, తారా, త్రిపుర సుందరి, ఛిన్నమస్త, బగళాముఖి, ధూమావతి, మాతంగి, కమలాత్మిక, భువనేశ్వరి అనే దశమహావిద్యలు ఉన్నాయి. ఈ పది మహావిద్యలలో ఒక్కొక్కటి ఒక్కొక్క మహాగ్రంథం.

కాళీ ఉపాసన మహా విశేషం. మనం చూస్తున్న అనంత కాలం యొక్క శక్తే కాళి. కాళీదేవిని ఉపాసించి ఇహము, పరము కూడా పొందిన వాళ్ళున్నారు. దానికి ఉదాహరణ శ్రీరామకృష్ణ పరమహంస వారే! భారతదేశమంతా కూడా అమ్మ వారిని ఆరాధిస్తున్నది. వంగదేశమంతా కాళీరూపంలో ఆరాధిస్తోంది. అస్సామ్ మొదలైన ప్రాంతాలలో ఇతర దశమహా విద్యా స్వరూపాల ఉపాసకులు కనిపిస్తారు. మరికొన్ని చోట్ల బగళాముఖి, ధూమావతి మొదలైన ఉపాసనలు గోచరిస్తూ ఉంటాయి.

కానీ ప్రత్యేకించి ద్రవిడదేశమంతా కూడా (పంచ ద్రవిడములు అంటే కర్ణాటక, కేరళ, తమిళనాడు, ఆంధ్ర, మహారాష్ట్ర) శ్రీవిద్య బాగా ప్రసిద్ధి. దీనికి అనేక హేతువు లున్నాయి. అందులో ఒకటి శంకర భగవత్పాదులు. ఆయన కేరళ రాష్ట్రంలో ఉద్భవించి ఎన్ని స్థానాలలో శ్రీచక్ర ప్రతిష్ఠాపన చేశారో మనకు తెలుసు. వాటిలో (ఒకటైన) అమ్మ కాంచీ కామాక్షీ తల్లి జగజ్జనని శ్రీవిద్యాస్వరూపిణి, అఖండ కాంచీమండలంలో ఉంది. అందుకు ఇటువైపు శ్రీవిద్య బాగా

వ్యాప్తి చెందింది. మరి కొన్ని చోట్ల చండీ స్వరూప ఆరాధన ఉంది. శ్రీవిద్యోపాసకుడు కూడా చండీ ఉపాసన చెయ్యడం, చండీ పారాయణలు, చండీహోమాలూ ఉన్నాయి. కానీ మధ్య ప్రదేశ్, మహారాష్ట్ర.... అంతా కూడా చండీనే ప్రధానంగా ఉపాసిస్తూ, మహాలక్ష్మి, మహాకాళి, మహాసరస్వతి స్వరూపిణి చండీదేవత అని చెప్తారు. శ్రీవిద్యలో వీళ్ళంతా ఉన్నారు. కాళి, బగళాముఖి ఇత్యాది దేవతలందరూ శ్రీవిద్యలో కనిపిస్తారు.

శ్రీవిద్య అధిష్ఠాన దేవత - లలిత మహాత్రిపురసుందరి. ఇది మూడో విద్య. కాళీ, తారా తరువాతిది ఇది; ఈ విద్య పేరు త్రిపుర సుందరి. పదివిద్యల క్రమంలో కూడా మూడవదే. అందుకే ఈ విద్యత్రి. ఈ విద్య ఒక పూర్ణ విద్య. వీటికి మహావిద్యలని పేరు. మహావిద్య అంటేనే బ్రహ్మ విద్య. మహా అనే శబ్దం బ్రహ్మకు సంబంధించినది. ఈ పదివిద్యలూ కూడా తత్త్వం తెలిసి ఉపాసిస్తే బ్రహ్మము దగ్గరకు వెళతాయి. తత్త్వం తెలియకుండా ఉపాసించినా క్రమక్రమంగా అమ్మ ఆ తత్త్వానికి తీసుకొని వెళుతుంది. అమ్మవారిని ఆశ్రయించడం మొదలుపెడితే ఎప్పటికైనా తరించి తీరుతాం, అందులో సందేహం లేదు.



"నమ్మి చెడినవారు లేరు, నమ్మక చెడిపోతే పోతారు" అన్నాడు రామదాసు. అమ్మను ఆశ్రయించిన వారు ఏనాడూ చెడిపోరు.

శ్రీ రామకృష్ణ పరమహంస ఒక వృత్తాంతం చెబుతారు. అదేమిటంటే - ఒక సారి కాళీదేవి ఇద్దరు ఉపాసకులకు సాక్షాత్కరించిందట. కాళీ దేవి సాక్షాత్కరించగానే, ఆ మహా స్వరూపాన్ని చూడగానే ఒకడు మూర్ఛపోయాడు. ఒకడు మాత్రం తేరుకుని అలాగ ఉన్నాడు. పక్కవాడిని చూడగానే ఇతనికి అహంకారం వచ్చింది. అతడు అమ్మని "అమ్మా! నువ్వు ఇద్దరికీ కనపడ్డావు. ఆయన మూర్ఛపోయాడు. నేను నిలబడ్డాను. ఎందుకమ్మా?" అని అడిగాడట. "ఇలాంటి మూర్ఛలు నువ్వు గత జన్మలో ఎన్నో పోయావు. ఇప్పుడు నిలబడ గలిగే స్థితికి వచ్చావు" అన్నదట ఆ తల్లి. సాధన అక్కడ ఆగిపోయినా తరువాత జన్మలో కొనసాగేలా చేస్తుంది ఆ శక్తి.

కృష్ణపరమాత్మ భగవద్గీతలో 6వ అధ్యాయంలో అదే చెప్పాడు. అర్జునుడికి సందేహం వచ్చి "ఒక సాధన మొదలు పెడతాం. ఈ సాధన చేస్తున్న దశలో శరీరం సహకరించక ఆగిపోవచ్చు. లేదా సాధన పూర్తి కాకుండా శరీరం అంతమై పోవచ్చు. వారిని ఏం చేస్తావు" అని అడిగాడట.

దానికి కృష్ణపరమాత్మ, "*శుచీనాం శ్రీమతాం గేహే యోగ భ్రష్టోభిజాయతే*" అన్నాడు. అక్కడ పుట్టించి గత జన్మలలో మనం చేసిన సాధనల ఫలాన్ని క్రోడీకరించి, తరువాతి జన్మలలో అక్కడి నుండి కొనసాగింపజేస్తాడు. అందుకే మనకు కొందరు పుట్టుకతోనే మహాభక్తులలా కనిపిస్తారు. కొందరికి జీవితమంతా గడిచిపోయి చివర్లో కూడా దేముడి పేరు చెబితే నిద్ర వస్తుంది. ఎందు కంటే వీరికి ఇంకా మొదలు కాలేదు. వారికి మొదలై కొనసాగి, ఈ జన్మలో అక్కడి నుంచి కొనసాగుతుంది. ఈనాడు చూస్తున్న నిష్కామ భక్తులనే వాళ్ళందరూ గత జన్మలలో అమ్మ వారిని సకామ భక్తితో ఆశ్రయించి, అమ్మవారు ఇచ్చినవి పొందారు.

అమ్మవారిచ్చినవి ఎవరైతే అనుభవిస్తారో అవి శుద్ధతకూ, క్రమంగా తరువాతి జన్మలలో సిద్ధికీ హేతువులవుతాయి. అమ్మ వారిని ఎలాగో ఒకలా ఆశ్రయించి, క్రమంగా అమ్మ రూపం చూసి ఊరుకోకుండా ఆ రూపం ఏం చెబుతుందో అర్థం చేసుకోవడానికి ప్రయత్నించాలి. అందుకు అమ్మవారి స్వరూపం, స్వభావం.... ఇవి తెలియక మన మతాన్ని ఎవరైనా నిందిస్తుంటే "అవునండీ, నిజమే నేను మీ మతం స్వీకరిస్తాను" అని వెళుతున్నాం మనం. కానీ ఇలాంటి గొప్ప తత్త్వ దర్శనం ఇక ఏ సంస్కృతిలోనూ లేదు; ఏ మతంలోనూ లేదు. ఇలాంటి మతంలో ఇలాంటి సంస్కృతిలో పుట్టడం మనం చేసుకున్న అదృష్టం. ❀ **(సశేషం)**

# భోగాల్ని వీడి భక్తుడైన భూపాలుడు

చిత్రాలు : సిహెచ్. రమేష్ కథ : స్వామి జ్ఞానదానంద

యామనుడు రాచకార్యాల్లో మునిగి, మానవ జీవిత పరమార్థాన్ని మరిచాడు.




యామనుడి తాతగారైన 'నాథముని' చివరి ఘడియల్లో తన శిష్యుడైన రామమిశ్రుడితో...







రాజదర్శనం కోసం ఎన్నో సార్లు ప్రయత్నించి మిశ్ర విసిగిపోయాడు.



ఆ రోజు రాత్రి స్వప్నంలో...

మిశ్ర! ఇంకా ఓపికతో ప్రయత్నించు – దగ్గర్లో ముళ్ళముస్తి కూర పెరుగుతోంది కదా! శుభం!

అంతా మీ దయ స్వామీ!

ఆయన ముళ్ళ ముస్తి కూరను కోసి, తీసుకొని రాజభవనానికి వెళ్ళాడు. వంటశాలలో ప్రధాన వంటవాణ్ణి కలిశాడు.

ఆకుకూరలంటే రాజుగారికి ఇష్టమని తెలిసింది. ప్రతి రోజూ నేను ఈ కూర తెస్తాను. రాజు గారికి వండి వడ్డించగలరా!

సాధువులు, మీరు స్వయంగా ఇవ్వడం, నేను కాదనడమా! అలాగే చేస్తాను.

ఈ విధంగా రోజులూ, నెలలూ గడిచాయి. ఒక రోజు కావాలనే మిశ్ర రాజ భవనానికి వెళ్ళలేదు.

ఈ రోజు ఆకుకూర వండలేదేం!

రోజూ ఆకు కూరల్ని తెచ్చి ఇచ్చే సాధువు ఈ రోజు రాలేదు మహారాజా!

ఈ సారి వస్తే తప్పకుండా నా దగ్గరకు తీసుకొని రండి.

చిత్తం మహారాజా!

మరునాడు రోజూలాగే వచ్చిన మిశ్రతో...

రాజుగారు మిమ్మల్ని చూడాలంటున్నారు.

ఆహా, ఇన్నాళ్ళకు రంగనాథుడు కరుణించాడు. తప్పకుండా కలుస్తాను. వెళదాం పద!

మిశ్ర రాజుగారి దర్శనం చేసుకున్నాడు.

మహాత్మా! నా కోసం రోజూ ఆకు కూరలు తెస్తున్నారు. ఎంతో కృతజ్ఞుణ్ణి!

మహారాజా! నేను మీకొక ముఖ్య విషయం చెప్పాలనుకుంటున్నాను.

మిగతా 36వ పేజీలో...

ఆచార వ్యవహారాలు - అంతరార్థాలు- 34

- రెంటాల జయదేవ

# పూలతో ఎలా పూజించాలి?



పూజ చేస్తున్నప్పుడు దేవుడికి పుష్పాలను సమర్పించడానికి కూడా ఓ పద్ధతి ఉంది. ఈ విషయాల్లో కొన్నింటిని మన ప్రాచీన గ్రంథాల్లో ఇలా పేర్కొన్నారు:

1. ఎ) **మధ్యమానామికాంగుష్ఠైః । పుష్పం సంగృహ్య పూజయేత్ ।**

**పత్రం వా యది వా పుష్పం । ఫలం నేష్ట మధో ముఖమ్ ॥**
**పత్ర పుష్పార్పణే చైవ । యథోత్పన్నం తథార్పణమ్ ॥**

(శివాగమే, స్మృతిసార సంగ్రహే)

బి) **పత్రం పుష్పం ఫలం చైవ యథోత్పన్నం తథార్పయేత్ ।**

(ధర్మ సింధౌ)

సి) **వృన్త హీనం ద్రోణ పుష్పం । సర్వే వృన్త సమన్వితాః ।**
**కిఞ్జల్క హీన మర్కం చ । సర్వే కిఞ్జల్క సంయుతాః ॥**

(శివః)

**(బిల్వపత్రం తు స్వాభిముఖాగ్రం న్యుబ్జం అర్పయేత్)**

'నడిమి వేలు, ఉంగరం వేలు, బొటనవేలు కలిపి పుష్పాన్ని పట్టుకొని, దేవుణ్ణి పూజించాలి. దళమైనా, పుష్పమైనా, ఫలమైనా సరే అధోముఖంగా ఉంచి అర్పించకూడదు. అలా అర్పిస్తే, దేవుడికి ప్రీతికరం కాదు. కాబట్టి, ఏ ముఖంతో పుట్టాయో అలాగే దేవుడికి సమర్పించాలి. తలకిందులు చేసి సమర్పించరాదు.

తుమ్మి పువ్వు విషయంలో మాత్రం తొడిమ లేని పువ్వే పూజార్హమైనది. ఇక, మిగిలిన పూలు మాత్రం తొడిమతో కూడినవే పూజార్హాలు. ప్రత్యేకించి జిల్లేడు పుష్పం విషయానికి వస్తే - పుప్పొడి లేని జిల్లేడు పువ్వే పూజార్హమైనది. మిగిలినవి మాత్రం పుప్పొడి సహితంగానే పూజాయోగ్యాలు.

బిల్వ పత్రం విషయంలో మాత్రం దళాగ్రం తనకు అభిముఖంగా ఉండేలా బోర్లించి ఉంచాలని కొందరు చెబుతారు.'

ప్రత్యేకించి కొన్ని పూలు పూజకు ఎంతో పవిత్రమైనవి. నిత్యమల్లి, గరుడ వర్ధనం, ఎర్ర గన్నేరు, ముని గోరింట, మంకెన పూలు, పద్మాలు, పారిజాతాలు, మాలతి, కనకాంబరాలు, నీలాంబరాలు, మందారం, నంది వర్ధనం, చేమంతి, జాజులు, కలువ పూలు దేవుని పూజలకు పవిత్రమైనవి.

**ఏ దేవుడికి ఏ పుష్పం ప్రీతికరం?**

ఒక్కొక్క దేవతా స్వరూపానికి ప్రత్యేకంగా కొన్ని పుష్పాలు పూజకు ప్రీతికరమైనవి.

**విష్ణువుకు ఇష్టమైన పుష్పాలు:**

విష్ణుమూర్తికి ఏ పూవులు ప్రీతికరమో పెద్దలు ఇలా చెప్పారు:

1. **మాలతీ మల్లికా చైవ । యూధికా చాతి ముక్తకః ।**
2. **పాటలా కరవీరం చ - జపాసావంతి రేవ చ ।**
   **కురవక స్సర్జక శ్చైవ కర్ణికారః కురంటకః ॥**
3. **చంపకో వాతకః కుందో బాణోవర్బర మల్లికా ।**
   **అశోక స్తిలక శ్చంప స్తథా చైవాటరూషకః ॥**
4. **శమీపుష్ప ప్రకారాస్తు । శుభాః కేశవపూజనే ।**
   **తాని పుష్పాణి దేయాని । విష్ణవే ప్రభవిష్ణవే ॥**

(విష్ణు పురాణే)

'తెల్లని సన్నజాజి, మల్లె, అడవి మొల్ల, పూల గురివింద, కలిగొట్టు, గన్నేరు, దేవకాంచనం, తులసి, గులాబీ, గొజ్జగి, గ్రంధి తగరం, రేల, పచ్చ గోరింట, సంపెంగ, దింటెన, నల్ల గోరింట, గగ్గెర, మల్లె, అశోక, మొగిలి, ఎర్ర దేవకాంచనం, నాగకేసరం, అడ్డసరం, జమ్మి మొదలైన పుష్పాలు కేశవుణ్ణి అర్చించడానికి శుభప్రదమైనవి. కాబట్టి ఆ పువ్వులను సర్వేశ్వరుడైన ఆ విష్ణుమూర్తికి సమర్పించి, ఆయనను సంప్రీతుణ్ణి చేసుకోవాలి.' ❀ **(మిగతా వచ్చే సంచికలో...)**





స్వామి ప్రేమానంద

స్వామి ప్రేమానందకు శారదామాత అంటే అపార భక్తి. ఏ స్వామి అయినా ఉద్బోధన్‌లో వసిస్తున్న శారదాదేవిని చూడడానికి వెళుతుంటే స్వామి ప్రేమానంద పూలు, కూరగాయలు, పాలు ఆమె కోసం పంపి, ఆమెకు తన నమస్కారాలు తెలియజేయమనేవారు. తానెన్నడూ ఎవరికీ మంత్రదీక్ష ఇవ్వదలచుకోలేదు గనుక, తన వద్దకు వచ్చిన భక్తులను మంత్రదీక్ష నిమిత్తం స్వామి బ్రహ్మానంద వద్దకో, శారదామాత వద్దకో పంపేవారు.

శారదామాత గురించి మాట్లాడేటప్పుడు ఆయన ముఖం ఆనందంతో వెలిగిపోయేది. శారదామాతనూ, శ్రీరామకృష్ణులనూ వేర్వేరుగా భావించిన వారు ఆధ్యాత్మిక పురోగతి నెన్నడూ సాధించలేరని ఒకసారి ఆయన అన్నారు. అంతేకాక శారదామాత, గురుదేవులు ఒకే నాణానికి బొమ్మా, బొరుసూ లాంటి వారన్నారు.

బేలూరు మఠంలో ఆయనొకసారి భక్తులతో ఇలా చెప్పారు: "శ్రీ గురుదేవుల కన్నా శారదామాత ఎంతో గొప్పశక్తి కలిగి ఉండడం మేము కళ్ళారా చూశాం. శ్రీరామకృష్ణుల ఆధ్యాత్మిక శక్తి తరచూ ఆయనకు కలిగే భావపారవశ్య స్థితుల ద్వారా వ్యక్తీకృతమయ్యేది. అందరూ చూసేవారు. అమ్మ కూడా తరచూ సమాధి స్థితులు పొందేవారు కానీ ఇతరులకు అది తెలిసేదికాదు. అమ్మ ఆధ్యాత్మిక శక్తిని బయటకు వ్యక్తం చేయకుండా ఉండగలిగే శక్తి అత్యద్భుతం!" ❀

(డిసెంబరు 7న శ్రీరామకృష్ణ పరమహంస సన్న్యాస శిష్యులైన **స్వామి ప్రేమానంద జయంతి**)



స్వామి శివానంద

సమస్త నారీ జాతికీ శ్రీశారదాదేవి జీవితం ఆదర్శం. ఆమె జీవితం అద్భుతం. నరదేహం ధరించి సాధారణ గృహిణి లాగే ఉండేవారు. కానీ ఆమె సాక్షాత్తూ ఆద్యాశక్తి, జగజ్జననియే. శ్రీరామకృష్ణుని యుగధర్మాన్ని స్థాపించడానికీ, నరలీలను పూర్తి చేయడానికీ ఆమె అవతరించారు. సామాన్య మానవులు ఆమెను ఏం అర్థం చేసుకోగలరు? మేము కూడా ప్రప్రథమంలో ఆమెను ఏమీ అర్థం చేసుకోలేకపోయాం. ఆమె స్వయంగా తన స్వభావాన్ని గోప్యంగా ఉంచేవారు. అందువల్ల ఆమె గురించి ఏమీ తెలిసేది కాదు. ఆమె ఏమిటో నిజంగా శ్రీరామకృష్ణులు ఒక్కరికే తెలుసు. ఇంకా చెప్పాలంటే స్వామీజీకి కొంచెం తెలుసు.

ఈ జగత్తులోని సమస్త నారీ జాతిని జాగృతం చేయడానికే మహాశక్తి 'అమ్మ' రూపంలో నరదేహాన్ని ధరించి అవతరించింది. అమ్మ ఆగమనం తరువాత అన్ని దేశాలలో స్త్రీల మధ్య ఏ విధంగా నూతన జాగరణ ప్రారంభమైందో చూడడం లేదా! ఇప్పుడు వారు తమ జీవితాలను పరిపూర్ణం చేసుకోవడానికీ, సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దుకోవడానికీ దీక్ష బూనుతున్నారు. ఇది ఇంకా ప్రారంభం మాత్రమే!

వైదిక, పౌరాణిక యుగాలలో గార్గి, మైత్రేయి, సీత, సావిత్రి మొదలైన అద్భుత స్త్రీల చరిత్రలు ప్రసిద్ధి కెక్కాయి. ఈ యుగంలో వారి కన్నా ఎంతోమంది ఉత్తమ స్త్రీలు ప్రసిద్ధి కెక్కుతారు. స్త్రీలలో తత్త్వచింతన, రాజనీతి, విజ్ఞానం, శిల్పకళ, సాహిత్యం మొదలైన విషయాల పట్ల ఆశ్చర్య జనకమైన జాగరణ ప్రారంభమైంది, ఇంకా వస్తుంది. ఇదంతా శక్తి లీల. ❀

(డిసెంబరు 23న శ్రీరామకృష్ణ పరమహంస సన్న్యాస శిష్యులైన **స్వామి శివానంద జయంతి**)

# శారదమ్మ కృపతో 'శాంతి'

- స్వామి నిర్వికల్పానంద



శాంతీరామ్‌దాస్‌ది జయరాంబాటీ దగ్గర ఉన్న హల్ది అనే గ్రామం. అతను శ్రీశారదాదేవి అనుగ్రహంతోనే జన్మించాడు. అతని తండ్రి యోగేశ్ దాస్ శ్రీశారదాదేవి భక్తుడు. పల్లకీ బోయీగా శారదమ్మ సేవ చేసేవాడు. శ్రీశారదాదేవి కొత్త ఇంటి ప్రాంగణం ఊడ్చి శుభ్రం చేసేవాడు. అతనికి ఐదుగురు కుమార్తెలు. ఒక పుత్రుడు కావాలని తీవ్రమైన కోరిక ఉండేది.

ఒకరోజు అతను శ్రీశారదాదేవి దగ్గరకు వెళ్ళి "అమ్మా! నాకు ఐదుగురు కుమార్తెలున్నారు. అందరూ వాళ్ళ తల్లితో పనులు చేస్తారు. నాకు ఒక్క కుమారుడు ఉంటే, నేను వాడిని నాతో పాటు తీసుకొని వచ్చి మీ సేవ చెయ్యమని అనేవాణ్ణి. నాకు ఒక పుత్రుడు కలిగేలా దీవించండి. లేకుంటే నాకు మనశ్శాంతి ఉండదు" అని తన బాధ చెప్పుకున్నాడు.

శ్రీశారదాదేవి కాసేపు ఆలోచించి "సరే, నేను గురుదేవుల్ని ప్రార్థిస్తాను" అన్నారు. మరుసటి సంవత్సరం అతనికి పుత్ర సంతానం కలిగింది. యోగేశ్ ఆనందానికి అవధులు లేవు. అతను ఒక్క పరుగులో శారదమ్మ దగ్గరకు వచ్చి, "అమ్మా! మీ అనుగ్రహం వల్ల నాకు మగ సంతానం కలిగింది" అన్నాడు ఆనందంగా.

శ్రీశారదాదేవి చిరునవ్వు నవ్వుతూ, "అయితే, ఇక నీకు తృప్తిగా ఉందా?" అన్నారు. "అవును తల్లీ! నా హృదయం శాంతించింది" అన్నాడు అతను. "అయితే, పిల్లవాడికి 'శాంతి' అని నామకరణం చెయ్యండి" అన్నారు మాతృదేవి. పసిబాలుడి అన్నప్రాశన సమయంలో శ్రీశారదాదేవి బాలుడికి బంగారు పూత పూసిన జత మురుగులు ఇచ్చారు. వాటిని అతడు తన జీవితాంతం చాలా జాగ్రత్తగా పదిలపరిచాడు. వారి కుటుంబ సభ్యులు శారదామాతను లక్ష్మీదేవిగా భావించేవారు. శాంతికి అమ్మ ఆ మురుగులు ఇచ్చాక, వారి ఆర్థిక పరిస్థితి మెరుగైందని వారు భావించేవారు.

శాంతి కాస్త పెద్దవాడయ్యాక, తన తండ్రితో కలసి శారదామాత ఇంటికి వెళ్ళేవాడు. యోగేశ్ తన కుమారుణ్ణి ఒక భుజం మీదా, అంతకన్నా ఏణ్ణర్థం పెద్దదైన ఆఖరి కుమార్తెను ఒక భుజం మీదా కూర్చోబెట్టుకుని తీసుకు వెళ్ళేవాడు. శారదమ్మ వారిద్దరికీ తినడానికి ఏ పండో లేక మరేది ఉన్నా, సరిసమానంగా ముక్కలు చేసి, చెరో సగం ఇచ్చేవారు.

ఒకరోజు శాంతి తన తండ్రి ప్రాంగణమంతా చీపురుతో ఊడ్చి శుభ్రం చెయ్యడం చూసి, తాను కూడా ఒక చీపురు పట్టుకుని, కష్టపడి ఊడవనారంభించాడు. చిట్టి చేతులతో పెద్ద చీపురు పట్టుకోలేక కష్టపడుతున్న శాంతిని చూసి దివ్యజనని, చిన్న చీపురు ఒకటి తెప్పించి "ఈ చీపురు నీ కోసం, దీన్ని నువ్వు ఉపయోగించు"అని శాంతితో అన్నారు. అప్పటి నుండీ ప్రతిరోజూ అమ్మ ఇంటిని పరిశుభ్రం చేసేవాడు శాంతి. అలా శారదమ్మ ప్రేమాభిమానాలను శాంతి చూరగొన్నాడు.

తీవ్ర అనారోగ్యానికి గురవడం వల్ల శ్రీశారదాదేవిని కలకత్తాలోని ఇంటికి తరలించాలని నిశ్చయించారు. శారదమ్మ వెళ్ళేముందు "అమ్మా! ఇప్పుడు నేను ఎవరి దగ్గర పని చెయ్యాలి, ఎవరి సేవ చెయ్యాలి?"అని ఏడుస్తూ అడిగాడు శాంతి. అందుకు శారదమ్మ అత్యంత ప్రేమతో "నాయనా! నేనిక్కడే ఉన్నాననీ, నిన్ను అనుక్షణం గమనిస్తూనే ఉంటాననీ భావించి, నువ్వు నా సేవ ఇక్కడ ఇలాగే కొనసాగించు"అని శాంతిని ఓదార్చారు. నిష్కపట హృదయుడైన శాంతి, అమ్మ మాటల యందు సంపూర్ణ విశ్వాసం ఉంచి భక్తి, పట్టుదల, ఉత్సాహాలతో ఎప్పటిలాగే అమ్మ సేవ కొనసాగించాడు. శ్రీశారదాదేవి మహాసమాధి చెందిన తరువాత కూడా అమ్మ అక్కడే సజీవంగా ఉన్నారన్న విశ్వాసంతో సేవ చేసేవాడు.



శాంతికి శారదమ్మ ఇచ్చిన కానుక - జత మురుగులు



శాంతీరామ్ దాస్

దివ్యజనని శ్రీశారదాదేవి జన్మించిన స్థలంలో 1923లో 'మాతృమందిరం' స్థాపన జరిగింది. క్రమంగా జయరాంబాటీలోని పరిస్థితులలో మార్పు వచ్చింది. అయితే శాంతి వైఖరిలో, అతని శ్రద్ధలో ఎలాంటి మార్పూ రాలేదు. నిజం చెప్పాలంటే కాలం గడుస్తున్న కొద్దీ అతని భక్తి విశ్వాసాలు ఎక్కువ అయ్యాయి. చలికాలమైనా, వేసవి కాలమైనా, వర్షాకాలమైనా సరే అతను రోజూ ఉదయాన్నే చీపురు పట్టుకుని పరమానందంగా ప్రాంగణమంతా ఊడుస్తూ కనపడేవాడు. తాను చేసిన పనికి ఎవరైనా పైకం ఇవ్వబోతే 'అది తన తల్లికి చేస్తున్న సేవ' అని పైకాన్ని స్వీకరించేవాడు కాదు. ఉత్సవాల సమయంలో మాత్రం అందరితోపాటు తానూ ఒక ధోవతి, ఒక దుప్పటి తీసుకునేవాడు. అతనికి హల్ది గ్రామంలో కావలి ఉద్యోగం ఉండేది. ఖాళీ సమయాన్ని అతడు ఆశ్రమంలోనే గడిపేవాడు.

వృద్ధాప్యం వల్ల శారీరకంగా బలహీనుడవడంతో ఆశ్రమ అధికారులు శాంతిని ఎక్కువ శ్రమతో కూడిన పనులు చెయ్యవద్దని అన్నారు. కానీ ఎవరూ శారదమ్మ సేవను అతని చేత మాన్పించలేకపోయారు. ఎవరైనా అతనిని ఆ పని మానమంటే "నన్ను ఆపడానికి మీరెవరు? ఈ బాధ్యత ఆ అమ్మే నాకు ఇచ్చారు. నేను అమ్మ సేవకుణ్ణి. ఆమె నాకు శాస్త్రాలూ, సాధన, భజన - ఏదీ నేర్పలేదు. నాకొక చీపురు మాత్రం ఇచ్చారు. ఇదే నా సాధన. ఇదే నేను అమ్మను ఆరాధించే విధానం" అన్న జవాబు వెంటనే వచ్చేది. జీవితాంతం అతని సేవ అలాగే కొనసాగింది. శాంతి అనారోగ్య స్థితిలో ఉన్నా అతని వదనం పరమానందంతో ప్రకాశవంతంగా ఉండేది. చిరునవ్వుతో అమ్మ నామాన్ని స్మరిస్తూ శాంతీరాందాస్ తుదిశ్వాస వదిలాడు. భక్తిశ్రద్ధలతో శారదమ్మ ఇచ్చిన చీపురుతోనే చివరి వరకూ అమ్మను ఆరాధించిన 'శాంతి' ధన్యజీవి. అవధులులేని అమ్మ కృపకు అంతులేనన్ని ఉదాహరణలు ఇలాంటివి మరెన్నో!

శ్రీశారదాదేవి శాంతికి ఇచ్చిన మురుగుల్ని అతని కుటుంబీకులు జాగ్రత్తగా పదిలపరిచారు.

శారదమ్మ ఎప్పుడూ "నేను అందరికీ అమ్మనే" అని అనేవారు. శాంతి లాగ మనం కూడా అమ్మ మీద భక్తి విశ్వాసాలను పెంపొందించుకుంటే అమ్మ కృపకు పాత్రులం కాగలం. ❀ **అనువాదం: శ్రీమతి ఉమాదేవి**

(సేకరణ : రామకృష్ణ సంఘ ఆంగ్ల మాసపత్రిక **'ప్రబుద్ధ భారత'** 2008 జనవరి సంచిక నుంచి)



# ఇతరుల కోసం ఒక్క క్షణం!

– స్వామి సేవ్యానంద

"ఇతరులకోసం జీవించేవారే నిజంగా జీవిస్తున్నట్లు" అని స్వామి వివేకానంద చెప్పారు. ఇతరుల కోసం జీవించడం మనకు దూరమైన విషయమైతే, ఇతరుల మంచి కోసం మనం కొంచెమైనా ఆలోచిస్తున్నామా అన్నది సందేహాస్పదమే!

**సమాజంలో సంఘజీవిగా జీవించు :** మానవుడు సంఘజీవి. ఇతరులతో కలసి మెలసి జీవించడం, సహాయ సహకారాలను అందించడం మానవుని సహజ స్వభావం. అయితే మనలో ఈ స్వభావం తగ్గిపోయి ఎవరికి వారే యమునా తీరే అన్నట్లు జీవిస్తున్నాం. ఆధునిక ప్రపంచంలో శాస్త్రీయ విజ్ఞానం, సాంకేతిక నైపుణ్యంతో మనం ఈ ప్రపంచాన్ని ఒక్కటిగా కలపగలిగాం. అయితే మనుష్యుల మనస్సుల్ని కలపడంలో విఫలమయ్యాం.

ఎదుటివారితో ముచ్చటగా మూడు మాటలు చెప్పే ముందు మనలో అభిప్రాయభేదాలు, చీకాకులు, గొడవలు, ఇంకా ఎక్కువైతే మారణహోమాలు జరుగుతున్నాయి. మనం రోజు రోజుకీ స్వార్థపరులమై మన సొంత ఆనందాలకూ, శుభాలకే ప్రాధాన్యమిస్తున్నాం. మనకు ఎంతో ప్రియమైన బ్యాంకు బ్యాలెన్సులు, భోగవిలాసాలు పెరిగే కొద్దీ మనలో అశాంతి పెరుగుతుందే కానీ శాంతి కలగదు.

**మొక్కై వంగనిదే మానై వంగుతుందా?:** తమ పిల్లలకు ఎక్కడ కష్టమవుతుందో అని లక్షలు ఖర్చుపెట్టి ఎయిర్ కండీషన్డ్ (ఎ.సి) స్కూళ్ళలో చదివించే తల్లితండ్రులు వారి పిల్లల జీవితాలలో నైతిక విలువలకీ, మానసిక వికాసానికీ ఎంతవరకు ప్రాధాన్యమిస్తున్నారు? "సాధారణంగా జీవించడం, ఉన్నతంగా ఆలోచించడం (Simple living, High thinking)" అనే విషయాన్ని పెడచెవిన పెట్టి, దీనికి పూర్తి వ్యతిరేకంగా 'ఉన్నతమైన సౌకర్యాలతో జీవించడం, సాధారణంగా ఆలోచించడం (లేదా) ఆలోచనే లేకుండా ఉండడం" (High living, simple thinking (or) no thinking at all) అనే విషయానికి మనం అలవాటు పడుతున్నాం.

చిన్నతనం నుంచే సుఖాలకూ, విలాసాలకూ అలవాటు పడిన వారు పెద్దయ్యాక ఇతరుల కష్టాలను ఎలా అర్థం చేసుకోగలరు? టెలివిజన్, మొబైల్, కంప్యూటర్లతో కాలక్షేపం చేయడంలో నేటి తరానికి ఉన్న ఉత్సాహం ఇతరుల కష్టసుఖాలలో పాలుపంచుకోవడంలో లేదు. జీవితంలో కష్టాలనే ఊహించలేని వీరు తమకు ఎదురయ్యే చిన్న చిన్న ఇబ్బందుల్నీ, అపజయాల్నీ అంగీకరించలేక వివిధ మానసిక వ్యాధులకూ, అశాంతికీ గురవుతున్నారు.

**శాంతికి ఉపాయం :** ఇతరుల కోసం చేసిన చిన్న పని అయినా మన అంతరంగంలో నిక్షిప్తమై ఉన్న సింహసదృశమైన శక్తిని మేల్కొల్పుతుంది. పోటీ (కాంపిటీషన్) పెరగడమే అన్ని ఇబ్బందులకూ కారణమని ఫిర్యాదు చేసే ముందు నేటి యువతరం నలుగురితో సత్సంబంధాలు పెంచుకుని సహకార భావాన్నీ (Co operation), సేవాభావాన్నీ అలవాటు చేసుకుంటే జీవితంలో విజేతలుగా నిలుస్తారు.

ఒకసారి ఒక యువకుడు స్వామి వివేకానంద దగ్గరకు వచ్చి "స్వామీజీ! నేను రోజూ గది తలుపులు మూసి, కళ్ళు మూసుకుని ధ్యానం చేయడానికి ప్రయత్నిస్తున్నాను. అయినా శాంతి కలగడం లేదు. శాంతికి ఉపాయం ఏమిటి?" అని అడిగాడు. సమాధానంగా స్వామి వివేకానంద – "శాంతి కావాలంటే దీనికి పూర్తిగా వ్యతిరేకంగా చెయ్యాలి. తలుపులు తెరవాలి. కళ్ళు తెరిచి నీకు సాధ్యమైనంతలో ఇతరులకు సహాయ, సహకారాలను అందించు, సేవ చెయ్యి. వీటితో నీ మనస్సుకు శాంతి కలుగుతుంది" అన్నారు.

మనం ఆనందాన్నీ, శాంతినీ కోరుకునే ముందు ఇతరులకు ఎంత ఆనందాన్నీ, శాంతినీ ఇచ్చామని ప్రశ్నించుకోవాలి. ఇతరులకు ఆనందాన్ని ఇవ్వడమే మనం ఆనందంగా, శాంతిగా ఉండడానికి సులభమైన ఉపాయం. అందుకే 'నేను', 'నా వారు' అనే స్వార్థ స్వభావాన్ని వదలిపెట్టి, "అంతా మనవారే" అన్న విశాల హృదయంతో ఇతరుల కోసం జీవించాలి. అప్పుడే మన జీవితం ఆనందమయం, శాంతిమయం అవుతుంది. నిత్యం అందరి శుభానికై ప్రార్థిద్దాం. ❁

# ఆశలు నింపే యథార్థాలు

- స్వామి అక్షరాత్మానంద

**లాన్స్** ఆర్మ్‌స్ట్రాంగ్ అనే ఫ్రాన్స్ దేశపు ప్రఖ్యాతి పొందిన సైకిల్ క్రీడాకారుడికి క్యాన్సర్ వ్యాధి సోకింది. డాక్టర్లు అతడు బ్రతికే అవకాశం నలభై శాతం మాత్రమే ఉన్నట్లు తేల్చారు. అంతేకాదు, అతడు ఇక మీదట సైకిల్ తొక్కరాదని కూడా హెచ్చరించారు. అతడికి మిన్ను విరిగి మీద పడ్డట్లూ, తనకు మరణమే శరణ్యమన్నట్లూ అనిపించింది. కానీ కొంతకాలం తరువాత ఈ పరిస్థితిని అధిగమించి, తాను క్యాన్సర్ విజేతను కావాలనీ, క్యాన్సర్ వంచితుడను కాకూడదనీ నిశ్చయించుకున్నాడు.

తరువాత రోజుల్లో కొన్నిసార్లు రక్తం కక్కుకునేవాడు. అయినా కూడా, 'పోయింది చాలా తక్కువ రక్తమనీ, దిగులుపడవలసింది ఏమీ లేదనీ' తనకు తాను సర్ది చెప్పుకున్నాడు. కొన్ని సంవత్సరాలకు అతడి క్యాన్సర్ పూర్తిగా నయమైందని నిర్ధారణ చేశారు. అప్పుడు అతను ఫ్రాన్స్ దేశపు అత్యున్నతమైన సైకిల్ పోటీ 'టూర్-డి-ఫ్రాన్స్'లో మరొకసారి పాల్గొని, గెలుపొందాడు.

అతడి రోగం నయమవడాన్ని డాక్టర్లు నమ్మలేక పోయారు. కానీ ఆశావహ దృక్పథంతో పనిచేసే మనస్సు శరీరాన్నీ, దాని రుగ్మతలనూ జయించగలదని అతడు దృఢంగా విశ్వసించడమే అతని రోగం నయమవడానికి కారణం.

ఇదే విధంగా నిబ్బరంతో వ్యవహరించవలసిన సంఘటన ఒకటి ఐ.ఐ.టి, ముంబయిలో జరిగింది. హిమాద్రి పాల్ అనే విద్యార్థి రెండు అంతస్తుల భవనం మీద నుంచి క్రింద పడిపోయాడు. వెన్నెముకలో చాలా వెన్నుపూసలు విరిగిపోయాయి. రెండు కాళ్ళూ విరిగాయి. ఒక చేయి కూడా విరిగింది. అతడు మళ్ళీ లేచి నిలబడడం, నడవడం అనుమానమేనని డాక్టర్లు తేల్చారు. మానసికంగా చితికిపోయిన హిమాద్రిపాల్ ప్రేరణ కోసం భగవద్గీత చదవసాగాడు. బలహీనతను జయిస్తేనే అభివృద్ధిని సాధించగలమన్నదే భగవద్గీతా సందేశసారం.

హిమాద్రిపాల్ తరువాత రోజులలో తన అనుభూతులను ఇలా వివరించాడు: "నేను మళ్ళీ నడవలేనన్న ఆలోచన కేవలం నా బలహీనతే అని గ్రహించగలిగాను. ఒకటిన్నర సంవత్సరం తరువాత మొదటి అడుగు వేయగలిగాను. క్రమం తప్పకుండా సాధన చేసి ఐ.ఐ.టికి తిరిగి రాగలిగాను. ఆశావహ దృక్పథానికి కృతజ్ఞతలు. కానీ ఈ ఆశావహ దృక్పథం ఇన్ని మంచి పనులు సాధించగలదన్న సత్యానికి సశాస్త్రీయమైన నిరూపణ చాలా తక్కువగా ఉన్నట్టు తోస్తుంది!"

నిరాశలో మునిగిపోయిన వారిలో వ్యాధులతో యుద్ధం చేసే తెల్ల రక్తకణాలు తక్కువగా ఉంటాయని ప్రయోగ శాలల పరీక్షలు ఋజువు చేశాయి. మనం ఉన్న మానసిక స్థితి మన రోగనిరోధక వ్యవస్థపై పనిచేస్తుందని ముంబయి నగరానికి చెందిన మానసిక నిపుణుడు డాక్టర్ రాజేశ్ పారిఖ్ చెబుతారు. గాయాలు మానడం, టీకాలు వ్యాధి నిరోధకశక్తిని పెంపొందించడం - మొదలైన క్రియలను మానసిక ఒత్తిళ్ళు అడ్డుకుంటాయని వైద్యపరీక్షలు ఋజువు చేశాయి.

**ఆశావహంగా ఉండడం ఎలా?**

1) మీకు నచ్చే మనుష్యులు, ప్రదేశాలు, వస్తువులు మొదలైనవాటి జాబితాను తయారు చేయండి. ఒక వేసవి విడిది, ఒక ఐస్‌క్రీమ్, ఒక పెంపుడు జంతువు - ఇలా ఏదైనా కావచ్చు. మీరు నిరాశలో మునిగిపోయినప్పుడు వీటి మీదకు మీ దృష్టిని మరల్చండి.

2) అలాగే నిరాశ వీడనప్పుడు 'ఊహూ! ఇలా ఉంటే లాభం లేదు!' అని మీకు మీరే చెప్పుకోండి. మీ ఆలోచనలను వేరే వైపు మళ్ళించండి.

3) ఆ రోజు మీరు సాధించిన పనులను ఐదింటిని గుర్తుకు తెచ్చుకోండి. అవి చాలా చిన్నవే కావచ్చు. అయినా ఫరవా లేదు. ఎందుకంటే ఈ చిన్న చిన్న పనులే క్రమంగా పెద్ద పెద్ద కార్యాలవుతాయి.

4) ఇతరులు మిమ్మల్ని ఎప్పుడూ విమర్శిస్తున్నారని అనిపిస్తుంటే, వాటిని కాసేపు పక్కన పెట్టి, మీరు అభినందనలు పొందిన సంఘటనల్ని జ్ఞప్తికి తెచ్చుకోండి.

5) దేని గురించి అయినా సరే, "అది ఉంటే అన్నీ ఉన్నట్టే, అది లేకపోతే ఏమీ లేనట్టే!" అన్న ధోరణిలో ఆలోచించవద్దు. ❀

అనువాదం: అమిరపు నటరాజన్

# యువవాణి

– స్వామి పరిజ్ఞేయానంద

**బి. హరికృష్ణ, పానగల్లు, నల్లగొండ జిల్లా**

**ప్రశ్న : నాకు ఏ పని మీదా ఆసక్తి ఉండడం లేదు. నాకు సోమరితనం ఎక్కువ. సోమరితనం వదలి కార్యనిర్వహణలో ముందుకు సాగాలంటే ఏం చేయాలి?**

**జవాబు :** 'లక్ష్యం లేని జీవితం చుక్కాని లేని నావ లాంటిది'. మీకు సోమరితనం ఉందంటే దాని అర్థం జీవితానికి మీరు ఓ లక్ష్యాన్ని నిర్దేశించుకోలేదన్నమాట. సోమరితనం పోవాలంటే జీవితానికి ఓ ధ్యేయాన్ని ఏర్పరచుకోవడం అవసరం. అప్పుడే మీరు అనుకున్న లక్ష్యాన్ని సాధించాలనే దృఢసంకల్పం, విశ్వాసం, శ్రద్ధ అలవడతాయి. ప్రపంచ చరిత్రలో మహోన్నత శిఖరాల్ని అధిరోహించిన మహాత్ములంతా పట్టుదలతో ప్రయత్నించిన వారేనన్న విషయాన్ని మరువకండి. విశ్వాసంతో నిండిన కొంతమంది వ్యక్తుల చరిత్రే ఈ ప్రపంచ చరిత్ర. 'మన మీద మనకున్న విశ్వాసమే మన లక్ష్య సాధనకు అత్యంత శక్తినిచ్చేది. ఆ విశ్వాసమే లేకపోతే ఏ దేశమైనా, ఏ వ్యక్తి అయినా పురోగమించలేరు' అంటారు స్వామి వివేకానంద.

The history of the world is the history of a few men who had faith in themselves... As soon as a man or a nation loses faith, death comes.

*- Swami Vivekananda*

యౌవనమే జీవిత సౌధానికి పునాది. జీవితంలో అత్యంత విలువైన తరుణావస్థను సద్వినియోగం చేసుకోవాలి. ఇప్పుడు సమయాన్ని వృథా చేస్తే తరువాత జీవితంలో ఏమీ సాధించలేకపోయామనే బాధ, అసంతృప్తి మిగులుతాయి. Strike the iron when it is hot. Idleness won't do అన్న సూక్తిని గుర్తుంచుకొని ఇకనైనా సోమరితనం వదిలి, జీవితానికి ఒక ధ్యేయాన్ని ఏర్పరచుకుని దానిని సాధించడానికి ప్రయత్నించండి. లేకపోతే I wasted my time foolishly. Now time wastes me wisely అంటూ తరువాత విచారించాల్సి వస్తుంది.

స్వామి వివేకానంద మనకు ఇచ్చిన 'Arise, awake and stop not till the goal is reached' అనే మహామంత్రాన్ని నిత్యం స్మరించండి. మీలో సోమరితనం పోయి లక్ష్య సాధనకు ఏకాగ్రత, పట్టుదల పెరుగుతాయి.

**విజయ్, నిజామాబాద్**

**ప్రశ్న : నేను కంప్యూటర్ ఆపరేటర్‌గా పనిచేస్తున్నాను. పై అధికారులను చూస్తే నాకు భయం. అందువల్ల పని సరిగ్గా చేయలేకపోతున్నాను. నా వృత్తిలో బాగా రాణించాలంటే ఏం చేయాలి?**

**జవాబు :** పై అధికారులను చూస్తే మీరు భయపడడానికి కారణం వృత్తిలో మీ నైపుణ్యం మీద మీకు నమ్మకం లేకపోవడమే! 'నేను చేస్తున్న పని సవ్యంగా చేయగలుగుతున్నానో లేదో' అనే అనుమానమే మిమ్మల్ని అయోమయ స్థితిలో పడేస్తోంది. మన శక్తి సామర్థ్యాలను తక్కువగా అంచనా వేసుకొని, లేనిపోని ఊహలకు ప్రాధాన్యం ఇస్తే మనం చేస్తున్న పనిలో సరైన నైపుణ్యాన్ని ప్రదర్శించలేం.

We fill our minds with mental pictures of fear and worry. And then find it difficult to understand why we have suffered from a nervous breakdown.

*- Harold Sherman*

అనవసరమైన ఊహలతో మనల్ని మనమే నిందించుకొని, మనస్సును నిరాశతో నింపితే భయాందోళనలు తప్పవు. జీవితంలో ఏం సాధించాలన్నా ధైర్యంతో వ్యవహరించాలి.

You will never be anything in the world without courage. It is the greatest quality of the mind.

*- J.L.Allen*

కాబట్టి అనవసరమైన ఒత్తిడిని అణచిపెట్టి, ధైర్యంగా వ్యవహరించడం నేర్చుకోవాలి. అందుకు కొన్ని సూచనలు:

1. మీరు చేస్తున్న పని సమర్థంగా నిర్వహించడానికి నిజాయతీతో మీ శక్త్యానుసారం కృషి చేయండి.
2. మీరు చేస్తున్న పని మీద మీకు పూర్తి అవగాహన లేకపోతే, మొహమాటపడకుండా అధికారుల్ని అడిగి తెలుసుకోండి.
3. మీరు ఎలాంటి పరిస్థితుల్లోనూ మీ భయాన్ని బయటకు వ్యక్తం చేయకండి.
4. మహావీరుడు, ధీరుడు అయిన సుభాష్ చంద్ర బోస్ లాంటి వారికే అనంత ధైర్యాన్నీ, ఆత్మస్థైర్యాన్నీ ఇచ్చిన స్వామి వివేకానందుని బోధనలు చదవండి.
5. మీ వృత్తిలో మీ కన్నా మంచి నైపుణ్యం ఉన్నవారితోనూ, నమ్మకస్తులతోనూ సాంగత్యం ఏర్పరచుకోండి.

యువవాహిని

# మనసు - మర్మం

- గంపా నాగేశ్వర్‌రావు



# ఆశావాదమే సాఫల్యానికి రక్ష

ఆలోచనలనేవి మన మెదడులో నుంచి పుట్టుకొస్తాయని మనకందరికీ తెలుసు. నిజానికి ఆలోచనలు లేకుండా ఒక్క క్షణం కూడా మనం ఉండడం సాధ్యం కాదు. ఆలోచించడమనే మన మెదడు నిర్వహించే నిరంతర కార్యం వల్లనే మనలో ఆలోచనలనేవి వెల్లువలా వస్తుంటాయి. నిరంతరం సాగే ఈ ప్రక్రియలో వచ్చే ఆలోచనలలో కొన్ని సానుకూలమైనవి, మరికొన్ని ప్రతికూలమైనవి ఉంటాయి. సానుకూలమైన ఆలోచనలు నిన్ను సమస్యలను పరిష్కరించే దిశగా నడిపిస్తే, ప్రతికూల ఆలోచనలు సమస్యల నుంచి పారిపోయేలా చేస్తాయి. లేదా ఓటమి దిశగా నడిపిస్తాయి.

ఇలా సానుకూల ఆలోచనా దృక్పథం ఉన్నవారిని ఆశావాదులుగానూ, ప్రతికూల ఆలోచనాధోరణి కలవారిని నిరాశావాదులుగానూ వ్యవహరిస్తారు.

ఆశావాది (Optimist) పదానికి మనకు అద్భుతమైన ఉదాహరణ మహాత్మా గాంధీ. తాను పోరాడుతున్నది రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యానికి వ్యతిరేకంగా అని ఆయనకు తెలుసు. అక్షరజ్ఞానమైనా అంతగా లేని అసంఖ్యాక భారతీయుల్ని యోధులుగా, మడమ తిప్పని వీరులుగా మార్చి స్వాతంత్ర్య సంగ్రామానికి నడిపించడం అంత తేలిక కాదనీ ఆయనకు తెలుసు. పైగా ఆయుధం అన్నది లేకుండా అహింసా మార్గంలో కేవలం 'సత్యాగ్రహ'మే తన సాధనంగా ఆయన నిర్ణయించుకున్నారు. ఆయనలోని సానుకూల ఆలోచనల ప్రభావమే భారత ప్రజలను సత్యాగ్రహ పోరాటం వైపు నడిపించింది.

ఇదే విధంగా ప్రతికూల ఆలోచనల ప్రభావం ఎలా ఉంటుందో జర్మనీనీ, యావత్ ప్రపంచాన్నీ ఒక ఊపు ఊపిన హిట్లర్ జీవితం గమనిస్తే స్పష్టంగా అర్థమవుతుంది. హిట్లర్ అతి సామాన్య స్థాయి వ్యక్తి. మాటల గారడీతో ఆనాటి ప్రపంచ యుద్ధానికీ, దారుణ మారణహోమానికీ కారణమయ్యాడు.

ప్రతికూల ఆలోచనలు ప్రధానంగా స్వార్థపూరిత ప్రయోజనాలు, బలమైన వాంఛల కారణంగా తమ ప్రభావం చూపిస్తాయి. వీరిలో వాస్తవికత, హేతుబద్ధత, నైతిక విలువలు లాంటి వాటికి ప్రాధాన్యం ఉండదు. మంచి మార్గంలో అయినా, చెడు మార్గంలో అయినా సరే తమ ఆశయాలను సాధించడానికి ప్రయత్నిస్తారు. లేదా తమ వైఫల్యానికి కారణాలను వెతుక్కుంటూ అసంతృప్తితో పరాజితులుగా మిగిలిపోతారు. ఇలాంటివారి ఆలోచనలు కొన్ని సందర్భాలలో పగటి కలలుగా కనిపిస్తుంటాయి. వీరు నిర్ణయించుకునే లక్ష్యాలపై అనుమానాలు కానీ వాటిలోని వైరుద్ధ్యాలు, అవాస్తవికతల గురించి కానీ వారి ఆలోచనలలో చోటుండదు.

ఇందుకు భిన్నంగా వాస్తవికత ఆధారంగా సానుకూల ఆలోచనల ప్రభావంలో ఉన్న వ్యక్తులు తమ సమస్యలను పరిష్కరించుకోవడానికి విజయాన్ని సాధించే కార్యోన్ముఖులుగా రూపొందుతారు. ఈ విధమైన సానుకూల ఆలోచనాధోరణిని అలవరచుకుంటే లక్ష్యాలను నిర్ణయించుకోవడంలోనూ, వాటిని సాధించేందుకు అనుసరించే మార్గాలలోనూ ప్రశంసనీయమైన ప్రవర్తనకు అది కారణమవుతుంది. చిన్న చిన్న విజయాలతో సంతృప్తిపడకుండా పూర్తి విజేతలుగా వారు నిలబడగలుగుతారు.

ఎలాంటి సమస్యల మధ్య ఉన్నా సానుకూల ఆశావాద దృక్పథాన్ని అలవరచుకోవడం అన్ని విధాలా ప్రయోజనకరం. సహజంగా సానుకూల ధోరణులను పెంచుకోవడం మనం మన చుట్టూ ఉన్న ప్రపంచాన్ని చూసే తీరు, మన దృక్పథాన్ని బట్టే సాధ్యమవుతుంది. మన ఆలోచనలు సానుకూలంగా, ఆనందంగా ఉంటే మన చుట్టూ ఎటుచూసినా సానుకూల ధోరణి, ఆనందం కనిపిస్తాయి. అందుకు విరుద్ధంగా మనం నిరాశా నిస్పృహల మధ్య కొట్టుమిట్టాడుతుంటే ప్రపంచంలో అంతటా దుఃఖం, సమస్యలు, బాధలే కనిపిస్తాయి.

సహజంగా ప్రతి ఒక్కరిలో కొంతమేరకు సానుకూల ఆలోచనల ప్రభావం, మరికొంతవరకూ ప్రతికూల ఆలోచనల ప్రభావం ఉండడం సహజం. అయితే ప్రయత్నపూర్వకంగా ప్రతికూల ఆలోచనలను దూరంగా ఉంచి సానుకూల ఆలోచనా దృక్పథంతో ముందుకు పయనిస్తే కార్యసాఫల్యత తప్పక సిద్ధిస్తుంది. ❀



# పరిశ్రమిస్తే ప్రగతి సాధ్యం

– డాక్టర్ కరిమద్దెల నరసింహారెడ్డి

**"ఉలితో నిర్జీవమ్మగు**
**శిలలకు ప్రాణమ్ముపోయు శిల్పి విధమునన్**
**కలలకు నిజమగు రూపము**
**వెలయించును కార్యశీలి వీడని కృషితో"**

– డా॥ మల్లెమాల

మానవ జీవితానికి సార్థకత చేకూరాలంటే కలలు కనాలి. ఆ కలలకు సాకారమివ్వాలి. అమరశిల్పి ప్రాణం లేని శిలలకు ప్రాణం పోసిన విధంగా కార్యశీలి కలలకు రూపమిస్తాడు. శ్రమిస్తే విజయం కలుగుతుంది. విశ్రమిస్తే అపజయం లభిస్తుంది. అందువల్ల విజయాన్ని కోరేవారు గడియారాన్నీ, గుండె గడియారాన్నీ ఆదర్శంగా తీసుకోవాలి. ఈ రెండూ క్షణమైనా విశ్రాంతి తీసుకోకుండా శ్రమిస్తుంటాయి.

**అవయవమ్ము ప్రతిది అలసి నిద్దురపోవు**
**నిద్రపోని దొకటె నీదు గుండె**
**అట్టి గుండె నీకు ఆదర్శమగుగాక!**
**మాలకొండ నోట మంచి మాట**

– కవికిరీటి మాలకొండారెడ్డి

మన శరీరంలో అన్ని అవయాలూ అలసిపోతాయి. కాలు అలసిపోతుంది, కన్ను అలసిపోతుంది. మెదడు అలసిపోతుంది, కండ అలసిపోతుంది. గుండె మాత్రం పుట్టినప్పటి నుండి గిట్టేవరకూ పనిచేస్తూనే ఉంటుంది. అది ఒక్క దినం కాదు కదా, ఒక్క క్షణం కూడా విశ్రమించదు! ఆ గుండెను ఆదర్శంగా తీసుకొనే గుండె మనకుంటే విజయం మనదే! విరామ మెరుగక శ్రమించే గడియారం కార్యశీలతకు నిలువెత్తు నిదర్శనం.

మహాభారతంలోని ముద్గలుడు కార్యశీలతకు పచ్చని ప్రతీక. ముద్గలుడు శ్రమజీవి. వ్యవసాయం అతని బ్రతుకుతెరువు. కష్టపడి వ్యవసాయం చేసి పంటలు పండించి, అడిగినవారికి లేదనకుండా దానం చేసి, మిగిలిన ధాన్యంతో నిరాడంబరంగా జీవితం గడిపేవాడు. అతని సేవా తత్పరతకూ, సహృదయానికీ సంతసించిన దేవతలు అతణ్ణి బొందితో స్వర్గానికి తీసుకొనిపోవడానికి నిర్ణయించుకున్నారు.

దేవదూతలను ముద్గలుని వద్దకు పంపారు. వారు ముద్గలుణ్ణి స్వర్గానికి రమ్మని సాదరంగా ఆహ్వానించారు. ముద్గలుడు "స్వర్గంలో ఏముంటాయి?" అని అడిగాడు. వారు "సమస్త సుఖాలుంటాయి. అమృతం ఉంటుంది. అప్సరసలు ఉంటారు. దీనులు,హీనులు, పీడితులు, తాడితులు ఉండరు" అని చెప్పారు.

''అక్కడ నేను చేయడానికి పని ఏమయినా ఉంటుందా?" అని ముద్గలుడు ప్రశ్నించాడు. "నువ్వు చేయడానికి పని ఏమీ ఉండదు. వంట చేసుకోవాల్సిన పని కూడా ఉండదు. అమృతం తాగుతూ అప్సరసలతో ఆడుతూ పాడుతూ కల్పవృక్షపు నీడలో కాలక్షేపం చేయడమొక్కటే పని" అని దేవదూతలు చెప్పారు.

వారి మాటలు విని ముద్గలుడు, "పనిలేని స్వర్గంతో నాకు పని లేదు. సోమరుని లాగ, పామరుని లాగ స్వర్గంలో తింటూ, తిరుగుతూ ఉండడం కన్నా చేతి నిండా పని ఉన్న ఈ భూలోకంలోనే ఉంటాను. పనిలోనే పరమాత్మ దర్శనం చేసుకుంటాను" అని చెప్పాడు.

సెలవు క్షణమడుగరు నెల జీతమడుగరు
నిర్విరామకృషికి నెలవు వీరు
కార్యశీలురనగ సూర్యచంద్రులు గారె
విమల దివ్యహాస! వేంకటేశ!

క్షణకాలమైనా సెలవు అడుగకుండా, నెల జీతం తీసుకోకుండా, నిర్విరామంగా కృషి చేసే సూర్యచంద్రులు నిజమైన కార్యశీలురు.

యువతీ యువకులారా! విజయానికి మూలం విరామం ఎరుగని కృషి అని నమ్మండి. గడియారాన్నీ, గుండె గడియారాన్నీ, ముద్గలుణ్ణీ, సూర్యచంద్రులనూ ఆదర్శంగా తీసుకొని జీవితం సాగిస్తే, మీరు అన్ని రంగాలలోనూ విజయశిఖరాల్ని అందుకోగలుగుతారు. అంచెలంచెలుగా అంచనా వేయలేనంత, కంచి గాలిగోపురమంత ఎత్తుకు ఎదుగుతారు. ❀

- జి. సతీష్

# దృఢనిష్ఠ

అత్యున్నతమైన పదవులను అలంక రించిన మహాపురుషులలో కూడా ఉద్యోగ ధర్మానికి ప్రథమ స్థానం ఇచ్చిన వారున్నారు. అలాంటి ఉదాహరణలు ప్రపంచంలో అనేకం ఉన్నాయి. భారతదేశానికి ప్రథమ రాష్ట్రపతి అయిన డాక్టర్ రాజేంద్రప్రసాద్ జీవితంలోని సంఘటన ఒకటుంది. రాజేంద్ర ప్రసాద్‌తో పాటుగా రాష్ట్రపతి భవన్‌లో ఆయన సోదరి భగవతీ దేవి కూడా ఉండేది. ఆమె వ్యాధిగ్రస్థురాలు. దురదృష్ట వశాత్తూ గణతంత్ర దినానికి ముందురోజు రాత్రి (జనవరి 25వ తేదీ) ఆమె మరణించింది. రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్రప్రసాద్ తమ సోదరి దేహాన్ని ఒక గదిలో ఉంచారు.



26 జనవరి నాడు జరిగే ఉత్సవానికి ఎలాంటి ఆటంకమూ కలుగకూడదనే ఉద్దేశంతో సోదరి మరణవార్తను ఎవరికీ చెప్పలేదు. మర్నాడు ప్రాతఃకాలం గణతంత్ర దినోత్సవంలో రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ ప్రతి ఏడాదిలానే పాల్గొన్నారు. గణతంత్ర దినోత్సవ వేడుకలు సమాప్తమైన రెండు గంటల తరువాత రాష్ట్రపతి తన సోదరి మృతదేహంతో శ్మశానవాటికకు వెళ్ళి అంత్యక్రియలు జరిపించారు. వ్యక్తిగత సమస్యల్ని పక్కన పెట్టి దేశ సేవకే ప్రాధాన్యతనిచ్చిన దృఢనిష్ఠాపరుడు డాక్టర్ రాజేంద్రప్రసాద్. ❀

# ధర్మనిష్ఠ

నీలమాధవ బంద్యోపాధ్యాయ బెంగాల్‌లో న్యాయమూర్తి. ఆయన గొప్ప న్యాయప్రియునిగా ప్రసిద్ధికెక్కాడు. ఆయన మరణశయ్యపై ఉన్నాడు. తీవ్రవేదనను అనుభవిస్తున్నాడు. హఠాత్తుగా "బీమా సంస్థ ఉద్యోగిని పిలిపించండి" అని ఆయన అన్నాడు. బీమా సంస్థ ఏజెంటు వచ్చాడు. ఆయనతో బంద్యోపాధ్యాయ, "నా బీమాను రద్దు చేయండి. ఐదు సంవత్సరాలకు పూర్వం నేను 5000 రూపాయలకు బీమా చేయించాను. బీమా చేయించేటప్పుడు డాక్టరు పరీక్ష చేశారు. అప్పుడు నేను పూర్తి ఆరోగ్యంతో ఉన్నానని చెప్పాను. కానీ చాలా ఏళ్ళుగా నాకు మధుమేహ వ్యాధి ఉంది. ఈ సంగతి నాకు తెలుసు. ఆనాడు నేను అబద్ధం చెప్పాను. అది ఇప్పుడు నన్ను బాధిస్తోంది. చాలా కాలంగా న్యాయమూర్తిగా పని చేస్తున్నాను. సత్యనిష్ఠ కలవాడినని పేరు తెచ్చుకున్నాను. కానీ సొంత విషయంలో నేను అసత్యవాదిని అయ్యాను. ఇప్పుడు నేను సర్వోన్నత న్యాయమూర్తి కడకు చేరబోతున్నాను. నేను చేసిన ఆ పాపం నన్ను పట్టి పీడిస్తుంది. నా బీమాను రద్దు చేయండి. నా వారసులకు తప్పుడు పద్ధతిలో డబ్బు లభించకూడదు. ఆ డబ్బుపై వారికి ఎలాంటి అధికారమూ లేదు" అని చెప్పారు.

బీమా ఏజెంటు నిర్ఘాంతపోయి, "ఇది ఏమంత విషయం! సాధారణంగా ఇలాగే జరుగుతూ ఉంటుంది. మీరు కాదూ, కూడదని పట్టుబడితే బీమా రద్దు చేయిస్తాను" అన్నాడు.

దానికి, నీలమాధవ బాబు ఇలా చెప్పారు: "ఎవరైనా ఇతరులకు తీర్పు చెప్పడం గొప్ప కాదు. నిస్వార్థంగా తన పట్ల తాను సత్యంగా ప్రవర్తించడమే నిజమైన న్యాయానికి గీటురాయి. కాబట్టి, నా బీమాను రద్దు చేయించండి. ఈ అంతిమ క్షణాలలో నాకు నేను న్యాయం చేకూర్చుకోవాలన్న వివేకం కలిగింది. నేను న్యాయదేవత త్రాసును తిన్నగా నిలపడంలో విజయం పొందాను. ఇందుకు నాకు సంతోషంగా ఉంది. ఇప్పుడు నా జీవిత యాత్ర శాంతియుతంగా పూర్తి అవుతుంది". ❀

# విలువలతోనే విజయతీరాలు



– బి. సైదులు

లండన్ శివారు ప్రాంతమది; పొలం పనులు చేసుకుంటూ ఉన్న ఒక పేదరైతుకు దూరం నుంచి పదేళ్ళ కుర్రాడి అరుపులు వినిపించాయి; పరుగెత్తుకొని వెళ్ళి చూసేసరికి, ఆ కుర్రాడు ప్రమాదకరమైన ఊబిలోకి కూరుకుపోతున్నాడు. దూరంగా ఎక్కడా, ఆ బాలుడికి సంబంధించిన వారెవరూ కనిపించలేదు; వెంటనే ప్రాణాలు ఒడ్డి, ఎన్నో ప్రయాసలతో ఆ బాలుడిని రక్షించాడు. అనంతరం ఆ బాలుడికి సపర్యలు చేసి ఇంటికి పంపించాడు ఆ పేదరైతు. ఉదయమే మందీమార్బలంతో ఒక శ్రీమంతుడి కారు, ఆ పేద రైతు ఇంటిముందు ఆగుతుంది. ముందురోజు రైతు రక్షించిన కుర్రాడి తండ్రిని తానని, చేసిన సహాయానికి కోరిన ప్రతిఫలాన్ని ఇస్తానంటాడు ఆ శ్రీమంతుడు. అప్పుడు ఆ రైతు, ప్రతిఫలాన్ని ఆశించి ఆ సాయం చేయలేదని, మనిషిగా ఇది నా ధర్మమని సున్నితంగా తిరస్కరిస్తాడు. ఇంతలో ఆ శ్రీమంతుడి కళ్ళు తలుపు చాటున నిలుచున్న రైతు కుమారుడిపైన పడతాయి; ఆ కుర్రాడి వివరాలన్ని అడిగి, తనకేమీ అభ్యంతరం లేకపోతే ఆ బాలుణ్ణి తానే చదివిస్తాననీ; అతను కూడా ఉదారహృదయుడై ఎంతో మంది సహాయపడతాడనీ, ఇది తన ధర్మంగా భావిస్తాననీ బలవంతంగా ఆ రైతుని ఒప్పించాడు; కాలాంతరంలో ఆ బాలుడు లండన్‌లో మెడికల్ కళాశాలలో ఉన్నతశ్రేణిలో ఉత్తీర్ణుడయి, వైద్యచరిత్రలోనే సంచలనాన్ని సృష్టించిన 'పెన్సిలిన్' మందును కనుగొన్నాడు. అతడే అలెగ్జాండర్ ఫ్లెమింగ్. కొన్నాళ్ళకు ఆ ధనవంతుడి కుమారుడికి న్యుమోనియా సోకుతుంది, తిరిగి అతన్ని రక్షించే అవకాశం రైతు కుమారుడైన ఫ్లెమింగ్‌కే దక్కుతుంది; పెన్సిలిన్ ప్రభావంతో వ్యాధి నయమవుతంది. ఆ తండ్రీకొడుకుల ఔదార్యంతో రెండు సార్లు ప్రాణగండాలు తప్పించుకున్న ఆ వ్యక్తి కూడా వేరెవరో కాదు, ఆయనే విన్‌స్టంట్ చర్చిల్.... ఎవరి ధర్మమూ , ఎవరి సహృదయమూ వృథాకాలేదు. విలువల ఫలితం ఎంత మహత్తరమో చూడండి! ఏ కాలంలోనైనా మన జీవితాల్ని సుసంపన్నం చేసేది మాత్రం ఈ విలువలతో కలగలసిన మార్గమే! ఈ విలువల్ని మేలిమి ముత్యాలుగా ముందుతరాలకు అందించాల్సిన బాధ్యత మనందరిపైనా ఉంది.

## నిబద్ధత.... నైతికత

Do not fix a light on your bicycle, because the policeman is looking at it. Do it when you want to see the road well అంటారు మహాత్మాగాంధీ. క్రమశిక్షణ, సత్యవాక్కు, నీతినియమాలు తదితర విలువల్ని నిర్బంధంగా కాకుండా, సహజంగా పాటించాలి. మన అనుదిన కార్యక్రమాల్లో అవి ఒక భాగమైపోవాలి. వ్యక్తిగతంగా కానీ, వృత్తిపరంగా కానీ ఎక్కడైనా క్రమశిక్షణతో, నిబద్ధతతో నడుచుకునే వారికే ఎక్కువ గౌరవం లభిస్తుంది. అడ్డదారులు ముందు సుందరంగా, సౌకర్యంగా కనిపించినా అవి చివరకు చేర్చేవి అగాధాల్లోకే; కాని నీతి,నిజాయతీలతో కూడిన మార్గం తొలుత ఎగుడుదిగుళ్ళతో తడబడేలా చేసినా, అది చేర్చే గమ్యం మాత్రం నందనవనమే. ఎవరి కోసమైతే అవినీతికి పాల్పడుతున్నారో, ఆ భార్యాబిడ్డలే అసహ్యించుకోవడం కన్నా వైఫల్యం, విషతుల్యం మరొకటి ఉండదు కదా!

## ధర్మో రక్షతి రక్షితః....

*అహింసా సత్యమక్రోధో త్యాగః ఏతద్ చతుష్టయమ్; అజాత శత్రో! సేవస్య ధర్మ ఏషస్సనాతనః'* అని ధర్మరాజుతో సనాతన ధర్మాన్ని నిర్వచిస్తారు భీష్మాచార్యులు మహాభారతంలో. అహింసా, సత్యం, అక్రోధం, త్యాగం.... ఈ నాలుగే పరమ ధర్మాలంటారు మహాత్ములు. ఈ నాలుగు అంశాల్లో మనం పతనమవుతుండడం వల్లనే సమాజంలో నేడు అన్ని రంగాల్లో విలువలు పతనావస్థకు చేరుతూ హింస, అసత్యం, క్రోధం, స్వార్థం రాజ్యమేలుతున్నాయి. అయితే సూర్యచంద్రాదుల గమనం తప్పినా, ధర్మానికి అపజయం మాత్రం కలగదు. తాత్కాలికంగా అధర్మానిదే విజయంగా పైకి కనిపిస్తుంది; కానీ అది శాశ్వతం కాదు. లక్ష్మణుడు మూర్ఛబోవడం రావణుడి తాత్కాలిక విజయం, రావణుడి పది తలలు

తెగిపడడం రాముడి సంపూర్ణ విజయం. అధర్మానికీ, ధర్మానికీ భేదం ఇదే!

### నీకు నీవే జవాబుదారి...

One must take fire in order to get light... అంటారు సూఫీ సాధువు జలాలుద్దీన్ రూమీ. వెలుగు కోసం కొంత వేడిని భరించాల్సిందే! విలువలకు కట్టుబడి జీవించడంలో కూడా కొన్ని కష్టనష్టాలుంటాయి. కానీ వాటికి తట్టుకొని, ఒత్తిళ్ళకు లొంగకుండా బాధ్యతలు నిర్వహిస్తే, ఎలాంటి పశ్చాత్తాపానికి తావులేకుండా జీవిత చరమాంకం సమాప్తమవుతుంది. మనకు, మన జీవన విధానానికి మనమే జవాబుదారి. నిశ్చలంగా, నిర్భయంగా ఎలాంటి ఆందోళనలకు అవకాశమివ్వకుండా జీవితం సాగిపోవాలంటే విలువల ఆధారంగానే పయనించాలి. ముందు మన చుట్టూ ఉన్న సమాజం ప్రతిఘటిస్తుంది; పక్కదారినే నడవమంటుంది; కానీ నమ్మిన విలువల కోసం పట్టుదలగా ముందడుగు వేస్తే, ఆ సమాజమే తన నడక మార్చుకుంటుంది, మన వెంట నడవాలని తహతహలాడుతుంది.

### కపటత్వం కూడదు...

The mind is like a parachute. It functions only when it is open అంటారు 'విప్రో' ప్రేమ్‌జీ. సత్యానికి మరో రూపం నిష్కపటత్వం. ఈ రోజుల్లో ఆత్మీయతల దగ్గర నుంచీ ఆఫీసు వ్యవహారాల వరకూ సంబంధాల్ని బీటలు వారుస్తున్నది ఈ కపటత్వమే. పారదర్శకత లేకుండా అంతా లోపాయికారీగా జరపడం వ్యాపార, వ్యవహార దక్షత అని భ్రమపడుతున్నాం. ఇది చాలా ప్రమాదకరం. అంతర్గతంగా మనలో లోపం ఉన్నప్పుడే ఇలాంటి కపటత్వాన్ని ప్రదర్శిస్తాం; నిర్భీతిగా, నిశ్చలంగా వ్యవహరిస్తున్న సమయంలో పారదర్శకంగానే ప్రవర్తిస్తాం. మహాత్మాగాంధీ అంతటి మహోద్యమాన్ని కూడా చాలా సరళంగా, సహజంగా నడిపించారు. పసి పిల్లలతో ఎంత నిర్మలంగా ప్రసంగించేవారో, ప్రపంచ పాలకులతో కూడా అదే విధంగా మసలుకునేవారు. బ్రిటిష్ అధికారులు లోపాయికారీగా ఆయనతో ఒప్పందాలు కుదుర్చుకోవాలని ఎన్నిసార్లు ప్రయత్నించినా, ఆయన అలాంటి కపటనాటకాలకు తలవంచలేదు.

### మంచికే రోజులు....

మంచికి రోజులు చెల్లిపోయాయని చాలామంది నిరుత్సాహ పడుతూ, నీరుకారిపోతుంటారు. కానీ ఏ సమాజంలోనైనా సమకాలీన పరిస్థితులు, గతంతో



పోలిస్తే కాస్త దారి తప్పినట్లే కనిపిస్తాయి; అంతమాత్రం చేత పూర్తిగా మంచికి కాలం చెల్లిపోయిందనుకోవడం పొరపాటు. అందుకే భగవద్గీతలో కృష్ణభగవానుడు అంటాడు *'నహి కల్యాణకృత్కశ్చిత్ దుర్గతిం తాతః గచ్ఛతి'*; మంచిపనులు చేసిన మనిషి ఎప్పుడూ దుర్గతిని పొందదు. నీతినిజాయతీలు, సత్ప్రవర్తనలు కలిగిన వారిని 'అమాయకులు', 'బ్రతుకలేనివారు'గా భావించే కుసంస్కారాన్ని విడనాడాలి. ఈ రోజుల్లో చాలా సందర్భాల్లో సాధారణ వ్యక్తులు కూడా ఎంతో నిజాయతీగా, విలువలతో నడుచుకోవడం చూస్తూంటాము; కొందరు లక్షల్లో సంపాదిస్తూ, ఉన్నతోన్నత హోదాల్లో ఉండి కూడా చవకబారుగా ప్రవర్తిస్తుండటాన్ని గమనిస్తున్నాం. అందుకే స్థాయిని బట్టి కాకుండా, సంస్కారాన్ని బట్టి, విలువల ఆచరణను బట్టి మనిషికి ఆదరణ లభిస్తుంది. ❀

## గెలుపు సూత్రాలివీ...

–'విప్రో' ప్రేమ్‌జీ

**నా** జీవితానుభవంలో నేను నేర్చుకున్న పాఠాలన్నీ విలువల ఆధారమైనవే! నా పూర్తి విజయం విలువలతోనే ముడిపడి ఉందనడంలో సందేహం లేదు. ముఖ్యంగా జీవితంలోని అన్ని ఆటుపోట్ల నుంచీ 'విలువలే' మనల్ని కాపాడగలవు. మన నిజాయతీ, పట్టుదల, శ్రమజీవనం, ఆత్మవిశ్వాసం, వీటన్నింటితో కూడిన వినయం మనల్ని విజయతీరాలకు చేర్చుతాయి. పరోక్షంగా కూడా నీపై గౌరవాభిమానాలను కురిపించేలా చేసేవి ఈ 'విలువలే'! ఇది కేవలం వ్యాపార జీవనానికి సంబంధించినదే కాదు, వ్యక్తిగత ఎదుగుదలకు కూడా ఇదే సూత్రం వర్తిస్తుంది. ఈ ప్రపంచ చరిత్రలో ఏ సంస్థ విజయమైనా, ఏ వ్యక్తి శాశ్వత కీర్తిప్రతిష్ఠలైనా నిబద్ధతతో కూడిన సిద్ధాంతాల ప్రాతిపదికపైనే ఆధారపడి ఉంటాయి. నేను ఎప్పుడైనా చెప్పేది ఒక్కటే 'విలువ కోసం వేటినైనా పణంగా పెట్టండి; కాని ఎంతటి ఘనమైన ఫలితం కోసమైనా విలువల్ని మాత్రం పణంగా పెట్టకండి'. ❀



# యువతరానికి గీతా సందేశం

– పింగళి పాండురంగారావు

భగవద్గీత విశిష్ట వేదాంత బోధగా ఆనాటి నుంచి ఈనాటి వరకూ అసంఖ్యాక భాష్యాలకు నిలయమైంది. ప్రపంచంలోని ప్రధాన మతాల మూలసూత్రాలన్నీ గీతలో ఇమిడి ఉన్నాయి.

గీతా బోధ అర్జునునికి – అంటే నరుడికి. కానీ సమస్త లోకానికీ అది జ్ఞాన బోధగా భాసిల్లింది.

ఏ స్థాయి మనిషిని, ఆ స్థాయి నుంచి ఉద్ధరించాలనే సంకల్పంతో శ్రీకృష్ణుడు మహాయోగం నుంచి సామాన్య భక్తి స్థాయి వరకూ ఎన్నో విధాలుగా, ఎన్నో రకాలుగా వేదాంతాన్ని బోధించాడు. వారి వారి సామర్థ్యాన్ని బట్టి, వారికి అనుగుణ మైన రీతిలో సాధన చేసి తరించాల్సిందిగా ప్రబోధించాడు.

"నా మీద మనస్సు నిలిపి, నా భక్తుడవై పూజ చెయ్యి, నాకు నమస్కారం చెయ్యి. నన్నే పొందుతావు." ఎంత గొప్ప అభయమో ఈశ్వరునిది. పైగా "నన్ను ఎవరు ఏ విధంగా భజిస్తే, ఆ విధంగానే అనుగ్రహిస్తాను" అని నిర్మల భక్తికి పురస్కారాన్ని ప్రసాదిస్తూ, భక్తుణ్ణి ఆకర్షించుకుంటున్నాడు. భక్తుడు ఆయనకు ప్రియతముడు.

సృష్టినంతటినీ ఆవరించి అఖండజ్యోతిగా వెలుగుతున్నాడు ఈశ్వరుడు. మనిషి మనస్సుకు అర్థం కావడానికి సృష్టి విభజన అయినట్లే చెపుతాడు. కానీ జీవాత్మ, పరమాత్మ ఒకటే. జీవాత్మ ఆధ్యాత్మిక సాధనల ద్వారా మోక్షాన్ని పొందాలి. అదే మానవ జీవిత లక్ష్యంగా బోధిస్తాడు శ్రీకృష్ణుడు. అస్థిరమైన వాటి పట్ల మోహితుడై శాశ్వత సుఖానికి దూరమవుతున్నాడు మానవుడు. ఈశ్వరుడు మానవ దేహంలోనే ఉన్నాడు. కానీ మనిషి వెతకడం ప్రారంభించిన కొద్దీ దూరమైపోతాడు. ఆధ్యాత్మిక పరిపూర్ణ సాధనకు గీతా బోధకు మించినది ఏదీ లేదు.

భగవద్గీతలోని శ్లోకం సగం పఠించినా, విన్నా, మనిషి వెయ్యేళ్ళు చంద్రలోకంలో ఉంటాడు అని వరాహ పురాణం చెబుతోంది.

ఇక్కడ ప్రముఖంగా ప్రస్తావించాల్సిన అంశం స్వామి వివేకానందుని ఉద్బోధ. గీతా సందేశమంతా ఇమిడిన ఒక్క శ్లోకాన్ని ఆయన వివరిస్తూ ఉద్వేగభరితంగా జాతి జనులకు గొప్ప సందేశాన్నిచ్చారు. ఆ ఒక్క శ్లోకం పారాయణ చేస్తే చాలు, సమస్త గీతాపారాయణ ఫలం లభిస్తుందని నిర్ద్వంద్వంగా ప్రకటించారు. ఆ శ్లోక ఆదేశాన్ని గ్రహించి, ఆచరిస్తే దేశ ప్రగతి అత్యల్పకాలంలో సాధ్యమని ఘోషిస్తారు స్వామి వివేకానంద. ఆ శ్లోకం:

**క్లైబ్యం మాస్మగమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే**
**క్షుద్రం హృదయ దౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరన్తప ॥ (2.3)**

యుద్ధం చేయడానికి వచ్చిన మహావీరుడు స్వధర్మం వీడి మోహితుడై, 'నేను యుద్ధం చెయ్యను' అని మౌనంగా ఉండిపోతాడు. అప్పుడు భగవానుడు "ఓ అర్జునా! అధైర్యం పొందకు. ఇది నీకు తగదు. మనోదుర్బలత్వమును వీడి లే! యుద్ధం చెయ్యి" అని కర్తవ్యబోధ చేశాడు.

ఆనాటి భారతజాతి హృదయ దౌర్బల్యాన్ని చూసి, వ్యథితుడైన స్వామి వివేకానంద, ఆధ్యాత్మికంగా లోకాన్ని జయించాలన్నా, దేశంలోని పరాయిపాలనను తుద ముట్టించాలన్నా, భారత ప్రజలు హృదయ దౌర్బల్యాన్ని వీడి, రణరంగంలో సింహగర్జన చేయాలని ఘోషించారు. పోరాటం సాగించమనీ, విజయం సాధించమనీ యువతరానికి ప్రబోధించారు. స్వామీజీకి యువత మీదనే దృఢమైన నమ్మకం. దేశప్రగతి వారి మీదనే ఆధారపడి ఉందని వారి ప్రగాఢ విశ్వాసం.

దేశ భద్రత, సంపూర్ణ వికాసం ధీరులైన పౌరుల మీదనే ఆధారపడి ఉన్నాయి. అందుకు వారు 'పాపం లేని, దైన్యం లేని అసాధారణ శక్తులుగా' మేల్కొనాలి. యువతరమే దేశానికి వెన్నెముక. ఈ విశిష్ట గీతాసందేశాన్ని అందుకొని యువతరం కర్తవ్యోన్ముఖం కావాలి. దేశం సర్వతోముఖ వికాసాన్ని సాధించాలి. నిర్మల దేశభక్తితో దేశాన్ని ప్రగతి పథం వైపు నడిపించాలి. ❀

**(డిసెంబరు 9న గీతా జయంతి)**



# శీలమే జీవనం!

– నోరి రామకృష్ణయ్య

**లౌ**కిక విద్యలలో ఎంత నిష్ణాతుడైనా, ఎన్ని గొప్ప పదవులు – అధికారం ఉన్నా, ఎన్ని సంపదలు కలిగివున్నా నిష్కళంకమైన శీలం లేకపోతే సమస్త సంపదలూ క్షణకాలంలో అంతరించిపోతాయి.

సమున్నతమైన విలువలూ, గౌరవ ప్రదమైన లక్షణాలు, విశుద్ధమైన సంస్కృతి – ఇవి శీలానికి ఆధారం. శీలం లేని మనిషి వింత పశువు. శీలం మానవునికి విశిష్టమైన ఆభరణం. మానవుడు తన రూపం వల్ల బాహ్య ప్రపంచానికి చాలా అందగాడుగా కనిపించవచ్చు. కానీ భగవంతుని దృష్టిలో శీలమే నిజమైన శోభ, సంపద.

వినయం, విధేయత, నిగ్రహం లేకపోతే ఎంతటి విజ్ఞుడైనా అగాధంలో పడిపోతాడు. ఎంతో కష్టించి సముపార్జించుకొన్న ఫలితాలన్నీ శీలం లేకుంటే నిష్ప్రయోజనమవుతాయి. శీలం ఉన్న వ్యక్తికి ఏదీ అసాధ్యం కాదు. ఆధ్యాత్మిక రంగంలో కూడా తిరుగులేని విజయాన్ని పొందుతాడు. మానవుడు తాను పొందిన భౌతిక, మానసిక శక్తులతో తృప్తిపడక తన సౌశీల్యాన్ని అన్ని విధాలా పెంచుకొని ప్రకాశవంతంగా ఉండాలి.

ధార్మిక సాధనకు శీల సముపార్జనే ప్రధానమని మన శాస్త్రాలు బోధిస్తున్నాయి. వాస్తవంగా శీలానికి ప్రాధాన్యం ఇవ్వని ధర్మం, ధర్మమే కాదు. చిత్తశుద్ధి, నిష్కపటత్వం లేకుండా ఎన్ని శాస్త్రోక్త కర్మకాండలు, శారీరక శౌచాలు పాటించినా జ్ఞానం సిద్ధించదు. చేతిలోని ముద్దను నోటి చుట్టూ ఎన్ని సార్లు తిప్పినా కడుపు నిండదు కదా! అది నోటిలోకి వెళ్ళినప్పుడే ఆ ముద్ద ప్రయోజనం సిద్ధిస్తుంది. అలాగే అంతరంగంలో చేసే సదాలోచనలే సచ్ఛీలానికి దోహదం చేస్తాయి. అంతేకానీ ఆడంబరంగా చేసే పనులు కావు. కాబట్టి ప్రతి ఒక్కరూ ఈ విషయంలో జాగరూకులై ఉండాలి.

సచ్ఛీలతను మూడు మార్గాలలో పెంచుకోవచ్చు. అవి – శుచిత్వం, సహనం, దృఢ నిశ్చయం. ఈ మూడూ గమ్యానికి మూడు మెట్లు. కాబట్టి దీన్ని సాధన చేసినవారు తప్పక గమ్యాన్ని చేరుతారు.

ప్రతి విద్యార్థీ తన పాఠ్యాంశాలతో పాటు మంచి ఆలోచనలను ప్రబోధించే వైదిక శాస్త్ర విషయాలను కూడా తెలుసుకోవాలి. సహనం అలవరచుకోవాలి. సహనం వల్లనే ఎంతో క్లిష్టమైన సమస్యలను అధిగమించగలం. మార్గంలో ఎన్ని అడ్డంకులు వచ్చినా ఎదుర్కొని, పట్టుదలతో ముందుకు సాగాలి. అప్పుడే గమ్యాన్ని చేరుతారు.

శీలం రెండు విధాలు – వ్యక్తి శీలం. జాతి శీలం. ఈ రెండూ సమైక్యంగా ఉంటేనే వ్యక్తివికాసం, జాతివికాసం సమాహితంగా ఉంటాయి. వీటిలో ఏది లోపించినా, ఒక వైపు ముద్ర లేని నాణెం లాగ అనామకం, ఆక్షేపణీయం అవుతాయి. కాబట్టి సౌశీల్యవంతులే దేశానికి రక్ష. అలాంటి శీలవంతులులేని జాతి – దేశం శత్రువుల వశమవుతుంది. అన్ని ఆపదలకూ, అనర్థాలకూ కారణమవుతుంది. కాబట్టి మనం వ్యక్తి శీలానికీ, జాతి శీలానికీ ప్రాధాన్యం ఇవ్వాలి. శీలమే జీవంగా – జీవమే దైవంగా గ్రహించాలి.

సద్గుణ సంపత్తే దివ్యత్వానికి సాధనం. ప్రతి మానవుడూ దివ్యత్వానికి అర్హుడే! ❀

# శ్రీరామకృష్ణ ప్రభ గ్రంథాలయ నిధి పథకం

| దాత పేరు | గ్రహీత సంస్థ |
|---|---|
| శ్రీమతి దుర్గా ప్రసన్న, లలితానగర్, రామ్‌నగర్ దగ్గర, హైదరాబాద్ | ప్రభుత్వ ఉన్నత పాఠశాల, పలాసా, శ్రీకాకుళం జిల్లా - 532 221 |
| శ్రీ ఎమ్.పి. రమేశ్ బాబు, గద్వాల్, మహబూబ్‌నగర్ జిల్లా | రుక్మాజి శంకరరావు మెమోరియల్ లైబ్రరీ, గద్వాల్, మహబూబ్‌నగర్ జిల్లా |
| శ్రీ ఎ. లోక రామారావు, ఓర్వకల్లు, కర్నూలు జిల్లా - 518 010 | ప్రభుత్వ ఉన్నత పాఠశాల, ఓర్వకల్లు, కర్నూలు జిల్లా - 518 010 |
| శ్రీ జి. గోపాలకృష్ణ (కీ॥శే॥ జి. శ్రీనివాసరావు జ్ఞాపకార్థం) గాంధీనగర్, హైదరాబాద్ | వి.ఆర్. సిద్ధార్థ ఇంజనీరింగ్ కాలేజ్, కానూరు, విజయవాడ-520007 |
| శ్రీ జి. గోపాలకృష్ణ (కీ॥శే॥ జి. మన్మథరావు జ్ఞాపకార్థం) గాంధీనగర్, హైదరాబాద్ | బ్రాంచ్ లైబ్రరీ, ఎలమర్రు, కృష్ణాజిల్లా - 521 149 |
| శ్రీ డి. సీతారామయ్య, ఎర్రమంజిల్ కాలనీ, హైదరాబాద్ | శ్రీ సరస్వతీ శిశుమందిర్, కల్పగూరు, మంజీరా బ్యారేజ్, మెదక్ |
| శ్రీ పి. చెన్నారెడ్డి, బ్రహ్మంగారి మఠం, కడప జిల్లా-516 503 | శ్రీ సరస్వతీ శిశుమందిర్, కంది, మెదక్ జిల్లా - 502 285 |
| శ్రీమతి జి. అంజనాదేవి, చాటపర్రు, ఏలూరు, ప.గో.జిల్లా | సి.ఆర్.ఆర్ మహిళా కళాశాల, వట్లూరు, పశ్చిమ గోదావరి జిల్లా |
| శ్రీ మెందు శివకుమార్, న్యూ నాగోల్, కొత్తపేట, హైదరాబాద్ | నేతాజీ శిశుమందిర్ ఉన్నత పాఠశాల, హసన్పర్తి, వరంగల్-506 371 |
| శ్రీ గుండ శ్రీహరిరావు, కొండపి, ప్రకాశం జిల్లా - 523 270 | ప్రభుత్వ జూనియర్ పాఠశాల, కొండపి, ప్రకాశం జిల్లా - 523 270 |
| శ్రీ శ్రీహరిరావు, మెహదీపట్నం, హైదరాబాద్ | శ్రీ సరస్వతీ శిశుమందిర్, బాసర, ముధోల్,అదిలాబాద్‌జిల్లా-504101 |
| శ్రీ చెన్నారెడ్డి (కీ॥శే॥ కె. గంగి రెడ్డి జ్ఞాపకార్థం) బ్రహ్మంగారి మఠం, కడపజిల్లా | శ్రీ వీర బ్రహ్మేంద్ర గ్రామీణ గ్రంథాలయం, బ్రహ్మంగారి మఠం, కడపజిల్లా |

# 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

| దాత పేరు | విద్యాసంస్థ |
|---|---|
| శ్రీమతి సోంపల్లి అన్నపూర్ణ, దోగిరి, బళ్ళారి జిల్లా, కర్నాటక | శ్రీ సరస్వతీ ఉన్నత పాఠశాల, శ్రీరామ్‌సాగర్, నిజామాబాద్ జిల్లా |
| " " " | శ్రీ సరస్వతీ ఉన్నత పాఠశాల, ఇంద్రవెల్లి, అదిలాబాద్ జిల్లా |
| " " " | శ్రీ సరస్వతీ ఉన్నత పాఠశాల, కామోల్, భైన్సా మండలం, అదిలాబాద్ జిల్లా |
| " " " | శ్రీ సరస్వతీ ఉన్నత పాఠశాల, గుడి అత్తనూర్, అదిలాబాద్ జిల్లా - 504 346 |
| " " " | శ్రీ సరస్వతీ ఉన్నత పాఠశాల, కుభూర్, అదిలాబాద్ జిల్లా - 504 346 |
| " " " | శ్రీ సరస్వతీ ఉన్నత పాఠశాల, జైనత్, అదిలాబాద్ జిల్లా - 504 346 |
| శ్రీమతి వంగముడి శ్రీదేవి, బృందావన్ కాలనీ, లబ్బీపేట, విజయవాడ | శ్రీ సరస్వతీ శిశుమందిర్, జైనూర్, అదిలాబాద్ జిల్లా - 504 313 |
| " " " | శ్రీ సరస్వతీ శిశుమందిర్, జానూర్, అదిలాబాద్ జిల్లా - 504 103 |
| " " " | శ్రీ సరస్వతీ శిశుమందిర్, నర్సాపూర్, అదిలాబాద్ జిల్లా - 504 104 |
| " " " | శ్రీ సరస్వతీ శిశుమందిర్ ప్రాథమికోన్నత పాఠశాల, మప్కల్, నిజామాబాద్ జిల్లా |
| " " " | శ్రీ సరస్వతీ శిశుమందిర్, మోర్తాడ్, నిజామాబాద్ జిల్లా 503 225 |
| " " " | శ్రీ సరస్వతీ శిశుమందిర్ ప్రాథమికోన్నత పాఠశాల, లింగంపేట్, నిజామాబాద్‌జిల్లా |

ఈ పథకం ద్వారా శ్రీరామకృష్ణ ప్రభను మరింతమందికి చేరువ చేస్తున్న దాతలకు కృతజ్ఞతలు.




## స్వామీజీ పిలుపు నా జీవితానికి ఓ మలుపు!

**– శిష్ట్లా చంద్రశేఖర్**

స్వామి వివేకానంద సాహిత్యం నా జీవితం మీద అద్వితీయమైన ప్రభావం చూపింది. మాది విశాఖపట్నం. అది 1993వ సంవత్సరం, నవంబర్ నెల. నా స్నేహితులతో కలిసి సరదాగా రామకృష్ణా బీచ్‌కి వెళ్ళాను. ఆ రోజు అనుకోకుండా రామకృష్ణ మఠానికి వెళ్ళడం జరిగింది. అప్పటికే స్వామీజీ గురించి పుస్తకాలలో చదివినా, ఇంకా విపులంగా అక్కడ స్వామీజీల ద్వారా తెలిసింది. సరిగ్గా అప్పుడే స్వామీజీ అమెరికాకు వెళ్ళి వచ్చిన శతసంవత్సర వేడుకలు జరుగుతున్నాయి. మాకు ఉచితంగా పుస్తకాలు ఇవ్వడం జరిగింది. ఆ పుస్తకాల ద్వారా స్వామీజీ జీవితాన్నీ, ఆదర్శాలనూ తెలుసుకున్నాను. ఆ తరువాత అదే స్ఫూర్తితో స్వామీజీకి సంబంధించిన పుస్తకాలను ఉచితంగా పంపిణీ చేస్తున్నాను. సొంత ఖర్చుతో రామకృష్ణ ప్రభను నా మిత్రులకూ, శ్రేయోభిలాషులకూ అందేలా చేస్తున్నాను.



అది 1995వ సంవత్సరం. నేను ఇంటర్ మీడియట్ చదువుతున్నాను. విశాఖపట్నానికి స్వామి రంగనాథానందజీ మహరాజ్ వేంచేశారు. మాది రెసిడెన్షియల్ కళాశాల అవడం మూలంగా ఆదివారం కూడా సెలవు దొరికేది కాదు. అలాంటి పరిస్థితులలో స్వామీజీని ఒక్కసారి మనస్సులో ధ్యానించి స్వామి రంగనాథానందజీని కలిసే అవకాశం కల్పించమని ప్రార్థించాను.

ఆ మరుసటి రోజే విశాఖపట్నం రామకృష్ణ మఠం అధ్యక్షులు నా గురించి తెలుసుకొని, వాలంటీర్‌గా వారం రోజులు సేవ చెయ్యడానికి నన్ను అనుమతించాల్సిందిగా కోరుతూ మా ప్రిన్సిపాల్ గారికి లేఖ పంపారు. వెంటనే మా ప్రిన్సిపాల్ గారు నన్ను ప్రోత్సహించి, అక్కడకు పంపడం జరిగింది. అదే నా జీవితంలో మరువలేని సంఘటన. స్వామీజీ సందేశం మేరకు నా స్థోమత కొద్దీ సేవ చేయడం ఆరంభించాను. ఇప్పుడు పెద్దయ్యాక ఒక ప్రక్క బిల్డింగ్ కాంట్రాక్ట్ పనులు చేస్తూనే, వృత్తి ధర్మంగా జ్యోతిష- వాస్తు సలహాల ద్వారా ప్రజలకు సేవ చేస్తున్నాను.

స్వామీజీ కృప వల్ల ప్రతి గురువారం శక్తి మేరకు అన్నదానం చేస్తున్నాను. మా స్వగ్రామం యలమంచిలిలో ఆశ్రమ స్థాపనకు ప్రయత్నాలు జరుగుతున్నాయి. భారతదేశంలోనైనా, ప్రపంచంలో ఎక్కడైనా సరే మనిషికి మంచి వ్యక్తిత్వం, నడవడిక ఏర్పడిందంటే అందులో స్వామి వివేకానంద పాత్ర ఎంతో కొంత ఉంటుందని నా గట్టి నమ్మకం. ❀

---

## మనోవేదనకు మందు స్వామీజీ సందేశం!

**– వై. వేణుగోపాల్**

చిన్ననాటి నుండీ ఒడుదొడుకులతో కూడిన జీవితం నాది. ఊహించని ఎన్నో సమస్యలు నా మనసును తీవ్ర వేదనకు గురిచేశాయి.



"శంకర జయేంద్రస్వామి" జయంతి ఉత్సవాలు హైదరాబాద్‌లో (అల్కాపురిలోని పార్కులో 2008 మే నెల 6 నుండి 15వ తేదీ వరకూ) జరిగాయి. అక్కడ పుస్తక ప్రదర్శనశాలలో స్వామి వివేకానందుని 'జ్ఞానయోగం' పుస్తకం కొని చదివాను. ఇలాంటి అమూల్యమైన పుస్తకాన్ని ఇంత కాలం గ్రహించనందుకు బాధ కలిగింది. ఆ తరువాత 'లేవండి... మేల్కొండి' 9 సంపుటాల స్వామి వివేకానంద సాహిత్యాన్ని కూడా చదివాను.

స్వామి వివేకానందుని సాహిత్యం చదివిన తరువాత నాలోని మనోవేదన పోయి ఆత్మవిశ్వాసం పెరిగింది. స్వామి వివేకానంద సందేశాన్ని విద్యార్థులకు అందించాలనే సంకల్పంతో అప్పటి నుండీ నా శక్త్యానుసారం స్వామీజీ సాహిత్యాన్ని విద్యార్థులకు అందజేస్తున్నాను.

ఆ మహోన్నత వ్యక్తి అమృత వాక్కులు మృణ్మయుల్ని చిన్మయుల్ని చేస్తాయి అనడంలో సందేహం లేదు. 'యువతా! లేవండి! మేల్కోండి!' అని యువకుల్ని ఉత్తేజపరుస్తూ 'నా భారతం... అమర భారతం' అని ప్రపంచానికి చాటిన స్వామి వివేకానందుని బోధల్ని ఆదర్శంగా తీసుకొని అలుపెరగకుండా ప్రయత్నిస్తే... ఎన్నో విజయాలను సాధించగలం. అందులో సందేహం లేదు. ❀



# రామకృష్ణ మిషన్ సేవాశ్రమ

విజ్ఞానానంద మార్గ్, ముఠి గంజ్, అలహాబాద్–211 003
ఫోన్: (0532) 2413369, ఫ్యాక్స్ :(0532) 2415235, E-mail : rkmathald@dataone.in

## మాఘ మేళా సేవా శిబిరం - 2009
## (2009 జనవరి 9 నుంచి 9 ఫిబ్రవరి వరకు)

*ప్రియ మిత్రమా!*

పవిత్ర త్రివేణీ సంగమం వద్ద ఏటా మాఘమాసంలో నెల రోజుల పాటు మాఘమేళా జరుగుతుంది. ఆ నెల రోజులూ కల్పవాసానికీ, పవిత్ర స్నానాలు చెయ్యడానికీ లక్షల కొద్దీ యాత్రికులూ, సాధువులూ వస్తారు. సాధువులకూ, భక్తులకూ సేవ చెయ్యడానికీ, ధర్మ పరివ్యాప్తికీ మేము ప్రతీ సంవత్సరం మాఘ మేళాలో ఒక ధార్మిక – వైద్య శిబిరాన్ని నిర్వహిస్తాం. 2009లో జనవరి 9 నుంచి ఫిబ్రవరి 9 వరకూ ఈ శిబిరం నిర్వహిస్తున్నాం.

*శిబిరంలో నిర్వహించే ముఖ్య కార్యక్రమాలు :*

1. సాధువులు, యాత్రికుల ఉచిత వైద్య సదుపాయం కోసం ఆధునిక అల్లోపతీ మందులు, వైద్య సౌకర్యాలతో నిపుణులైన వైద్యులు, పారా మెడికల్ సిబ్బంది గల వైద్యశాల.
2. ధార్మిక ప్రసంగాలు, భజనల కోసం ఆధ్యాత్మిక వేదిక.
3. సత్సంగంలో పాల్గొనదలచిన భక్తుల వసతి, భోజన సౌకర్యాలను ఏర్పాట్లు చెయ్యడం.
4. హిందీ, ఆంగ్ల, బెంగాలీ భాషలలో వేదాంత సాహిత్యం, రామకృష్ణ – వివేకానందుల ఆదర్శాలు, భావాలను వ్యాప్తి చెయ్యడానికి పుస్తక విక్రయ కేంద్రం.
5. శ్రీరామకృష్ణులు, స్వామి వివేకానందుల జీవితం, బోధలతో కూడిన చిత్ర ప్రదర్శనశాల.

**ఈ కార్యక్రమాల నిర్వహణకై పెద్ద మొత్తం వెచ్చించాల్సిన అవసరం ఉంది. ఈ పవిత్ర కార్యానికి ఉదార హృదయంతో మీరు ఇచ్చే విరాళాలను కృతజ్ఞతతో స్వీకరిస్తాం.**

విరాళాలను "Ramakrishna Mission Sevashrama, Allahabad" పేరున చెక్కు లేదా డి.డి. తీసి క్రాస్ చేసి Ramakrishna Mission Sevashrama, Vijnanananda Marg, Mutthiganj, Allahabad- 211 003 అనే చిరునామాకు పంపాల్సిందిగా మనవి.

అందరి శ్రేయస్సుకై భగవంతుణ్ణి ప్రార్థిస్తూ...

భగవత్సేవలో

**స్వామి త్యాగాత్మానంద**
కార్యదర్శి

---

## భక్తులకు వసతి సౌకర్యం

ఈ సంవత్సరం మాఘమేళా శిబిరంలో ఉండాలనుకునే భక్తుల వసతికీ, భోజనానికీ ఏర్పాట్లు చేయబడును. ఈ సౌకర్యాలను వినియోగించుకోదలచిన భక్తులు కనీసం మూడు రోజులకు తక్కువ కాకుండా (రోజుకి రూ. 100/– చొప్పున) రూ. 300/–చెల్లించాలి. కల్పవాసం (జనవరి 9–ఫిబ్రవరి 9 వరకూ) నెలరోజుల పాటు ఉండాలనుకునే భక్తులు రూ. 2500/– చెల్లించాలి.

భక్తులు వసతి భోజన ఖర్చుల నిమిత్తం ముందుగానే (2008 డిసెంబర్ 15లోగా) “రామకృష్ణ సేవాశ్రమ, అలహాబాద్” పేరున క్రాస్ చేసిన చెక్కు / డి.డి లేదా ఎమ్.ఒ. పంపాలి.

ఇక్కడే ఉండదలచిన భక్తులు రెండు రోజులు ముందుగానే శిబిరానికి చేరాలి.

**ముఖ్య స్నాన దినాలు :**

పుష్యపూర్ణిమ – జనవరి 9; మకర సంక్రాంతి–జనవరి 14; మౌని అమావాస్య–జనవరి 26; వసంత పంచమి– జనవరి 31; మాఘ పూర్ణిమ – ఫిబ్రవరి 9

✸ మిగతా వివరాల కోసం రామకృష్ణ మిషన్ సేవాశ్రమ, అలహాబాద్‌ను సంప్రతించాల్సిందిగా మనవి.

✸ రామకృష్ణ మిషన్ సేవాశ్రమానికి ఇచ్చే విరాళాలకు 1961 నాటి ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 80(జి) కింద పన్ను మినహాయింపు కలదు.

...17వ పేజీ తరువాయి.




సాయంకాలం వారు విశ్రాంతి తీసుకుంటున్న సమయంలో భగవద్గీత పారాయణం చేయడం మొదలు పెట్టాడు మిశ్ర.




సాధు సాంగత్యం వల్ల యామనుడిలో నిద్రాణంగా ఉన్న వైరాగ్యం పెల్లుబికింది.




రోజూ గీతాసారం వింటున్న కొద్దీ యామనుడి అజ్ఞానం పటాపంచలవసాగింది. మబ్బులు వీడిన ఆకాశంలా అతడి మనసు నిర్మలమైంది.

















వకీలు కనిపించగానే వ్యాజ్యాలూ, న్యాయస్థానాలూ తలపుకు వస్తాయి.
అలాగే సద్భక్తులు కనిపించినప్పుడు భగవంతుడు తలపుకు వస్తాడు.

కమ్మరి తన కొలిమిలోని నిప్పును తిత్తులతో ఊది ప్రజ్వలింప చేస్తుంటాడు. ఆ రీతిలోనే
సాధుసంగం వల్ల మనస్సును నిర్మలంగానూ, పవిత్రంగానూ ఉంచాలి.

- శ్రీరామకృష్ణ పరమహంస

# శ్రీ రామకృష్ణ - వివేకానంద భావ ప్రచార పరిషత్



## 18వ వార్షిక భక్త సమ్మేళనం - 2009 జనవరి 9, 10, 11 తేదీలు, కర్నూలు

*సమ్మేళన వేదిక: మాంటిస్సోరి హైస్కూలు, ఎ-కాంప్, కలక్టర్ ఆఫీసు వెనుక, కర్నూలు - 518 001*

### ఆహ్వానం

కర్నూలు జిల్లాలోని శ్రీరామకృష్ణ సేవాసమితుల ఆధ్వర్యవంలో **కర్నూలులో 2009 జనవరి 9,10,11 తేదీలలో** జరిగే 18వ వార్షిక భక్తసమ్మేళనానికి ఇదే మా ఆహ్వానం.

- ఈ సమ్మేళనంలో పాల్గొనే సంస్థలు, తమ సభ్యులు ఒక్కొక్కరి నుంచి రూ.100/- సభ్యత్వ రుసుముగా వసూలుచేసి, జత చేసిన సభ్యత్వ పత్రములో వివరాలు తెలపాలి. రుసుము ఎమ్.ఓ/డి.డి ద్వారా 10-12-08 తేదీ లోగా **డాక్టర్ కె.జి. శరత్‌చంద్ర, 21/8, గాండ్లవీధి, పూల బజార్, కర్నూలు - 518 001** చిరునామాకు పంపవలెను. **10-12-08 తర్వాత నమోదు చేసుకొనే వారు రూ.150/-చొప్పున చెల్లించాలి.** సంబంధిత పత్రాలు 09-01-09 తేదీన సమావేశ ప్రాంగణంలో పొందవచ్చు.
- డిమాండ్‌డ్రాఫ్టులు పంపదలచినవారు "APRVBPP - 18th Annual Devotees' Convention" పేరున ఇండియన్ బ్యాంక్, కర్నూలులో చెల్లుబాటు అయ్యేలా పంపవలెను. (S.B.A/C No. 779974240), (RTGS No. IDIB - 000K061 - ఆన్‌లైన్ ద్వారాగూడా పైకం పంపవచ్చును.) **చెక్కులు అంగీకరింపబడవు.**
- ప్రతినిధులకు ఉచిత భోజన, నివాస వసతి సౌకర్యం 09-1-09 (శుక్రవారం) ఉదయం నుండి 11-1-09 (ఆదివారం) రాత్రి వరకు ఏర్పాటు చేయబడును.
- "భక్తుల సేవ భగవంతుని సేవ" కనుక ఈ బృహత్తర కార్యక్రమానికి అయ్యే వ్యయాన్ని భరించడానికి ధన వస్తు, సేవ రూపేణా తమవంతు సహాయ, సహకారాల్ని అందించి, భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ఆశిస్తున్నాం.
- ఈ సమ్మేళనం సందర్భంగా ఒక స్మారక సంచికను విడుదల చేయనున్నాం. ఆ సంచికలో ప్రకటనల నిచ్చి ప్రోత్సహించగలరు. ప్రకటనల ట్యారిఫ్ వివరాలు:

| | పూర్తి పేజీ | అర పేజీ | పావుపేజీ |
|---|---|---|---|
| కలర్ : | 4,000 | 2,500 | 1,200 |
| బ్లాక్ & వైట్ : | 2,000 | 1,200 | 600 |
| 2,3 కవరు పేజీలు | 10,000 | - | - |
| 4వ కవరు పేజీ | 15,000 | - | - |

### సంప్రతించవలసిన చిరునామా

**డాక్టర్ కె.జి. శరత్‌చంద్ర, కార్యనిర్వాహక అధ్యక్షులు,**
**21/8, గాండ్లవీధి, పూల బజార్, కర్నూలు - 518 001**
**సెల్ నెం. 99487 75901, 98853 67321**
**ఫోన్ : 08518 - 230337**

### భక్తులకు సూచనలు

- 08-01-09 (గురువారం) రాత్రి నుండి 'కర్నూలు టౌన్' రైలుస్టేషన్‌లో, ఆర్.టి.సి. బస్టాండ్‌లో రిసెప్షన్ కౌంటర్ ఏర్పాటు చేయబడును.
- ప్రతినిధులకు సాధారణ వసతి సౌకర్యములు మాత్రమే చేయబడినవి.
- ప్రత్యేక సదుపాయములు (లాడ్జిలలో గదులు) కావలసినవారు హోటల్ గదులు రిజర్వు చేసుకొనగలరు.
- వివిధ సమితుల నుండి వచ్చే సభ్యులు వారిలో ఒకరిని నాయకునిగా ఎంపిక చేసుకొనవలెను. ఆ నాయకుడు ఆ బృందమునకు అవసరమైన సదుపాయాల్ని సమకూర్చుటకు సమన్వయకర్తగా బాధ్యత వహించవలెను.

## సోదరి నివేదిత జయంతి వారోత్సవాలు

**వరంగల్ జిల్లా హనుమకొండ శ్రీరామకృష్ణ సేవా సమితి** ఆధ్వర్యంలో సోదరి నివేదిత జయంతి వారోత్సవాలు అక్టోబర్ 28 నుంచి నవంబర్ 4 వరకూ ఘనంగా జరిగాయి. ఈ




ఉత్సవాల్లో భాగంగా నవంబరు 4న నిర్వహించిన వ్యక్తిత్వ వికాస సదస్సులో హైదరాబాద్ రామకృష్ణ మఠం స్వామి అనుపమానందజీ, డా॥ పన్నాల శ్యామసుందరమూర్తి పాల్గొని విద్యార్థులను ఉద్దేశించి ప్రసంగించారు. ఆ రోజు సాయంత్రం సమితి ప్రాంగణంలో ముగింపు సమావేశం జరిగింది. ఈ సమావేశంలో 'స్వామి వివేకానందుని సందేశ స్ఫూర్తితో సోదరి నివేదిత తన జీవితాన్నే భారతదేశ సేవకై నివేదించిన త్యాగశీలి' అని స్వామీజీ కొనియాడారు. డాక్టర్ పన్నాల రామకృష్ణ మిషన్ సేవా కార్యక్రమాలను వివరించారు. వ్యాసరచన, వక్తృత్వ, చిత్రలేఖన, పాటల పోటీల్లో విజేతలైన విద్యార్థులకు బహుమతులు అందజేశారు. మునిసిపల్ కమీషనర్ శ్రీ శివకోటి ప్రసాద్, శ్రీ లక్ష్మణమూర్తి పాల్గొన్న ఈ కార్యక్రమానికి సుమారు 250 మంది భక్తులు విచ్చేశారు. ❀

నివేదిక: **జిల్లా ప్రభు,** కార్యదర్శి.

## ఉచిత వైద్య శిబిరాలు

**కదిరి శ్రీరామకృష్ణ సేవాసమితి** అనంతపురం జిల్లా గాండ్లపెంట మండలంలోని నరసప్పగారిపల్లె గ్రామంలో 2008 అక్టోబర్ 11న కదిరి కెమిస్ట్స్ & డ్రగిస్ట్స్ అసోసియేషన్ ఆధ్వర్యంలో ఉచిత వైద్యశిబిరం నిర్వహించింది. ఈ వైద్య శిబిరంలో డాక్టర్ యం. తిప్పేంద్రనాయక్, ఎమ్.డి. వైద్యసేవలు అందించారు. సుమారు 200 మంది ఈ శిబిరం ద్వారా లబ్ధిపొందారు. ❀ నివేదిక : **జె. గంగాధర్,** కార్యదర్శి.



**నల్లగొండ జిల్లా హుజూర్‌నగర్ శ్రీరామకృష్ణ సేవా సమితి** లింగగిరి గ్రామంలో 2008 సెప్టెంబర్ 29న లయన్స్ క్లబ్ ఆధ్వర్యంలో ఉచిత నేత్ర వైద్య శిబిరం నిర్వహించింది. ఈ శిబిరంలో కంటి పరీక్ష చేయించుకొన్న 120 మందిలో 15 మందికి ఉచితంగా శస్త్రచికిత్స చేయబడింది. ❀

నివేదిక : **డి. సుబ్రహ్మణ్యం,** కార్యదర్శి.




**యువజన సదస్సు** : **ఖమ్మం శ్రీరామకృష్ణ సేవా సమితి** 2008 అక్టోబర్ 31న యువజన సదస్సు నిర్వహించింది. ఈ సదస్సులో విజయవాడ రామకృష్ణ మిషన్ స్వామి సుప్రియానందజీ మహరాజ్, డా॥పన్నాల శ్యామసుందరమూర్తి, శ్రీ పరాశం ప్రసాద్, డా॥ ఎమ్.వి. రమణ పాల్గొని 'యువతకు వివేకానందుని సందేశం' అనే అంశంపై ప్రసంగించారు. ఈ సదస్సులో పాల్గొన్న 250 మంది విద్యార్థినీ విద్యార్థులకు ఎస్.బి. హెచ్ రీజనల్ మేనేజర్ శ్రీ రజనీకాంత్ నాయక్ మధ్యాహ్న భోజన ఏర్పాట్లు చేశారు. సమితి నిర్వహించిన వ్యాసరచన పోటీల్లో విజేతలైన విద్యార్థులకు స్వామీజీ బహుమతి ప్రదానం చేశారు. ❀ నివేదిక : **ఎమ్.బి. బయ్యపురెడ్డి,** కార్యదర్శి.



# స్వామి రంగనాథానందజీ శత జయంతి ఉత్సవాలు

## తేదీ : 15 డిసెంబరు 2008

## వేదిక : రవీంద్రభారతి

*ముఖ్య గమనిక :*

**శతజయంతి ఉత్సవాలు 2008 డిసెంబరు 11 నుంచి 15 వరకు నిర్వహించాలని గతంలో సంకల్పించాం. కానీ అనివార్యకారణాల వల్ల ఈ ఉత్సవాలను కేవలం 2008 డిసెంబరు15వ తేదీ (ఒక్క రోజు)కే పరిమితం చేయడం జరిగింది.**

రామకృష్ణ మఠం, మిషన్‌ల 13వ సర్వాధ్యక్షులైన స్వామి రంగనాథానందజీ మహరాజ్ వారి శత జయంతి (15.12.1908 – 15.12.2008) సందర్భంగా **2008 డిసెంబర్ 15వ తేదీన హైదరాబాద్ రవీంద్రభారతిలో** (ఉదయం 9 నుంచి రాత్రి 9 గంటల వరకు) శతజయంతి మహోత్సవాలు జరుపబడును.

20వ శతాబ్దంలో భారతీయ సనాతన ధర్మాన్నీ, శ్రీరామకృష్ణ – వివేకానందుల సందేశాన్నీ దేశవిదేశాల్లో వ్యాప్తి చేసిన ఘనత స్వామి రంగనాథానందజీ మహరాజ్‌దే. మహరాజ్ వారు అహర్నిశలూ కృషి చేసి హైదరాబాద్ రామకృష్ణ మఠ ఆవిర్భవానికీ, పురోభివృద్ధికీ తోడ్పడ్డారు. ఆ మహత్తర సాధుపుంగవుని జ్ఞప్తి చేసుకొంటూ ఆయన శతజయంతి మహోత్సవాల్ని జరుపుకోవడం ముదావహం.

ఈ వేడుకల్లో – రామకృష్ణ మఠ స్వామీజీలు, ఇతర ప్రముఖులు ప్రసంగిస్తారు. భజనలు, సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించబడతాయి. పూజ్య మహరాజ్‌వారి రచనలతో కూడిన స్మారక సంచిక విడుదలవుతుంది. భక్తులు, అభిమానులు అధిక సంఖ్యలో పాల్గొని ఈ మహోత్సవాలను విజయవంతం చేయాలని ప్రార్థిస్తున్నాం.

*స్వామి రంగనాథానందజీ మహరాజ్*
*శతజయంతి ఉత్సవాల పౌర సంఘం*

కన్వీనర్ : జి.ఎన్. ఫణికుమార్,
I.A.S., Commissioner APARD

☆ ఈ ఉత్సవాల్లో పాల్గొనదలచిన వారు తమ పేర్లను ముందుగా నమోదు చేయించుకోవలెను.

వివరాలకు సంప్రతించవలసిన చిరునామా :

**ప్రేమ్‌కుమార్ సింగ్,** ఆర్గనైజింగ్ సెక్రటరీ,
రామకృష్ణ మఠం, దోమలగూడ, హైదరాబాద్–29
సెల్.నెం. 98499 85842

**☆ ఈ ఉత్సవాల్లో పాల్గొనే భక్తులకు వసతి సౌకర్యం కల్పించడం సాధ్యం కాదని మనవి.**






Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

## నూతన సంవత్సర అపూర్వ కానుక!

**'శ్రీరామకృష్ణ కథామృతం,' 'పరమహంస' ఉద్గ్రంథాల ఒరవడిలో మరో బృహద్గ్రంథం...**

**2009 జనవరి 9,10,11** తేదీలలో కర్నూలులో జరుగనున్న భక్త సమ్మేళనంలో ఈ కానుకను అందిస్తున్నాం. ఆ కానుక - శ్రీరామకృష్ణుల జీవితంలో జరిగిన, తెలుగు పాఠకులకు అందుబాటులోకిరాని అనేక అద్భుత సంఘటనల, లీలల, ఆయన ప్రకటించిన వివిధ భావాల సమాహారంగా రూపుదిద్దుకుని విడుదలవుతున్న మహత్తర గ్రంథం...




# శ్రీరామకృష్ణ లీలామృతం

*ఆంగ్లమూలం :* స్వామి చేతనానంద

*అనుసృజన :* స్వామి జ్ఞానదానంద

*ఈ గ్రంథంలోని విశేషాలు:*

- అక్షరజ్ఞానం ఉంటే చాలు, అలవోకగా అర్థం చేసుకోగల సరళ సుందరమైన తెలుగుతనం ఉట్టిపడే భాషతో కూడిన రచనా శైలి.
- 750 పైచిలుకు పుటలు.
- సర్వాంగ సుందరమైన ముఖచిత్రం.
- కలకాలం పదిలపరచుకోవడానికి అనువుగా చక్కని క్యాలికో బైండు.

ఇన్ని హంగులూ, సొబగులూ సంతరించుకొని మీ ముందుకు రాబోతున్న **శ్రీరామకృష్ణ లీలామృతం** వెల

ఆశ్చర్యపోకండి! కారుచవుక **రూ.100/- మాత్రమే!**

ఈ గ్రంథం ఆమూలాగ్రం గృహస్థులపరమైనదే, గృహస్థుల ప్రయోజనం కోసమే! అందుకే *లీలామృతాన్ని* అవలీలగా కొనుగోలు చేసుకోవడానికి అతితక్కువ ధరకు అందిస్తున్నామని గమనించగలరు.

కాని కర్నూలు భక్త సమ్మేళనలో విడుదల చేయబోతున్న సందర్భాన్ని పురస్కరించుకొని ఈ గ్రంథరాజాన్ని, భక్త సమ్మేళనంలో పాల్గొనే శ్రీరామకృష్ణుల భక్తసందోహానికి, ఆ మూడు రోజులూ కేవలం **రూ.50/-** కి మాత్రమే అందిస్తున్నాం.



వివరాలకు:
**రామకృష్ణ మఠం,**
దోమల్‌గూడ,
హైదరాబాద్ - 500 029
ఫోన్.నెం. 040 - 2763 1149
E-mail : rktelugubook@gmail.com